ఔను! ఈ పరిశోధనకు నేనుపయోగించుకున్న పరికరాల్లో ఎంపిక చేయబడినవి మాత్రమే ఈ అధ్యాయంలో ఉదాహరింపబడుతున్న గ్రంథజాలం! శ్రీశ్రీ కవిత్వంమీద ఇంత భాష్యం రాయడానికి ఏ గ్రంథాలు, సర్వస్వాలు, నిఘంటువులు, శాస్త్రాలు, మీమాంసలు, సంహితలు, వ్యాసాలు, పత్రికలు, లేఖలు, గోష్ఠులు, ఉపన్యాసాలు వగైరావగైరా ఆధారాలుగా మార్గదర్శకాలుగా ప్రమాణాలుగా ఆకరాలుగా ముడిపదార్థాలుగా వెలుతురు చూపిస్తూ ఉపయోగపడ్డాయో నిరంతరం నేను వేటిని సంపాదించానో వాటిలో ముఖ్యమైనవే ఎంచుకుని, ఆయా గ్రంథకర్తలకు, రచయితలకు, సంపాదకులకు, ప్రచురణకర్తలకు నమస్కరిస్తూ ఇక్కడ పేర్కొంటున్నాను. నాకు ఈ గ్రంథాలను అందుబాటులోకి తెచ్చిన మిత్రులకూ, గ్రంథాలయాలకూ కృతజ్ఞతలు తెల్పుకుంటూ వీటిని భావిపరిశోధకుల, పరిశీలకుల, పాఠకుల సౌకర్యార్థం క్రింది విధంగా విశ్లేషిస్తున్నాను :

### (A) Companions, Dictionaries & Encyclopedias

1. Floren Elliott : A Dictionary of Politics 2. Foreman: Collins National Encyclopedia 3. Harvey & Hessel Tine : The Oxford Companion to French Literature 4. Hornstein Percy Brown : The Reader's Companion to World Literature (R. C. W. L.) 5. Joseph T. Shipley : Dictionary of World Literary Terms 6. Moore : A Dictionary of Geography 7. Palmer : A Dictionary of Modern History 8. Ronald Ridout & Clifford Nitting : The Facts of English 9. Rosenthal & Yudin : A Dictonary of Philosophy 10. The Columbia Encyclopedia 11. The Random House Dictionary of English.

### (B) Biography, History & Politics

12. Alexeyev, Kartsov & Troitskv : A Short History of the U. S. S. R. 13 Alice Magenis & John Conrad Appel : A History of the World 14. Appadorai : The Substance of Politics 15. Kapur : Principles of Political Science 16. Lenin : The State 17. Loon : The Story of Mankind 18. Manfred : A Story History of the World 19. Nathanial Platt : Our World through Ages 20 Susobhan Sarkar : A Marxian Glimpse of History 21. Wells : A Short History of the World.

### (C) Socio-political Philosophy, Materialism & Psychology

22. Brill : Basic Principles of Psychoanalysis 23. Engels : (a) The Part played by Labour in the transition from Ape to Man (b) Socialism : Utopian and Scientific 24. Ivochuk: Philosophical Traditions Today 25. Lenin : (a) On Socialist Ideology and Culture (b) Meterialism and Empirio Criticism 26. Lenina Ilitskaya : ABC of Dialectical and Historical Materialism 27. Marx & Engels : Manifesto of the Communist parry 28. Maurice Corn Forth : Dialectical Materialism

### (D) Literary Criticism, Art, Rhetoric, Aesthetics & History of Literature

29. Abercrombe : Principles of Literary Criticism 30 Anthony X. Soares : An Introduction to the Study of Literature 31. Arthur Pollard : Satire 32. Basil Worsfold : Judgement in Literature 33. Charles Chadwick : Symbolism 34. Charlton M. Lewis : The

Principles of English Verse 35. Christopher Caudwell . Illusion and Reality 36. Classen : Lectures on Style and Composition 37. Coombes : Literature and Criticism 38. Cunningham: The Problem of Style 39. Damian Grant : Realism 40 David Daiches : Poetry and the Modern World 41. Day Lewis : Poetry for you 42. Denis Saurat : Modern French Literature 43. Edward Thomas: A. C. Swinburne – A Critical Study. 44. Eliot : The Sacred Wood 45, Elizebeth Drew : Poetry : A modern guide to its understanding and enjoyment 46. Emile Legouis : A History of English Literature 47. George A. C. : Critics and Criticism 48. Wilkinson : How to read Literature 49. George Reavey : Soviet Literature To day (1946) 50 George Thomson : Marxism and Poetry 51. Herford : National and International ideals in the English poets 52. Howard Fast : Literature and Reality 53. Hudson : (a) An Introduction to the Study of Literature (b) An Outline History of English Literature 54. Jagdish Shivpuri : Six Modern English Poets 55. James Reaves : Understanding Poetry 56. John Berger : The Success and Failure of Picasso 57. John Heath–Stubbs : The Verse Satire 58. Kulikova & Zis : Marxist Leninist Aesthetics and Life 59. Laura Riding & Robert Graves : A Survey of Modernist Poetry 60. Laurence Binion : Tradition and Reaction in Modern Poetry. 61. Leavis : New Bearings in English Poetry 62. Lenin : On Literature and Art 63. Leonard Unger : Seven Modern American Poets 64. Lunacharsky : On Literature and Art. 65. Marguerite Wilkinson : New Voices 66. Maurice Nadeau : The History of Surrealism 67. Maxim Gorky : On Literature 68. Michael Millgate : Tennyson 69. Mullik (a) Theory of Literature (b) Modern Literature , 70. Nambudripad : Marxism and Literature 71. Omond : English Metrists 72. Plekhanov . Art and Social Life 73. Prasad : An Introduction to English Criticism 74. Rene Wellek & Austin Warren : Theory of Literature 75. Rees : An Introduction to English Literature 76. Richards : Principles of Literary Criticism 77. Srinivasa Iyengar: Introduction to the Study of English Literature 78. Strong : Common Sense about Poetry 79. Vladimir Shcherbina : Lenin and problems of Literature 80. William Allan Neilson: Essentials of Poetry 81. William K. Winsatt & Cleanth Brooks: Literary Criticism 82. Winchester : Some Principles of Literary Criticism

**(E) Anthologies & Compilations**

83. Edgar Allan Poe : Great Tales and Poems of Edgar Allan Poe 84. Kazi Nazrul Islam: The Rebel and other Poems 85. Maupassant : The Short Stories ot Guy de Maupassant 86. Mayakovsky : Vladimir Mayakovsky's Poems 87. Michael Roberts : The Faber Book of Modern Verse 88. Oliver Bernard : Rimbaud, Selected Verse 89. Oscar Williams : The pocket Book of Modern Verse 90. Palgrave : The Golden Treasury 91. Ramana Reddy : Sri Sri Miscellany 92. Sri Sri : Soudamini 93. William H. Marshall : The Major Victorian Poets.

**(F) చరిత్ర, రాజనీతి, జీవితచరిత్ర & మార్క్సిజం**

94. ఎంగెల్స్ ; (a) నరుని పరిణామం (అను.) అమరవాది కృష్ణమూర్తి (b) ప్రకృతి : గతి తర్కము (అను.) మహీధరజగన్మోహనరావు (c) వానరుడు : నరుడు – పరిణామక్రమంలో కర్మపాత్ర (అను.) మహీధర జగన్మోహనరావు (d) కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల

పుట్టుక (అను.) మహీధర రామమోహనరావు 95. ఎమిలీబరన్సు: మార్క్సిజం అంటే ఏమిటి? 96. కారల్ మార్క్స్ & ఫ్రెడరిక్ ఎంగెల్స్ : కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక (అను.) రాచమల్లు రామచంద్రారెడ్డి 97. క్లెమెన్స్‌దత్ : మార్క్సిస్టు లెనినిస్టు మూలసూత్రాలు – సోషలిజం, కమ్యూనిజం (అను.) కంభంపాటి సత్యనారాయణ & మోటూరి వేంకటేశ్వరరావు 98 చిన్మోహన్ సహనోబిస్ ; కమ్యూనిజం అంటే ఏమిటి (అను) వై. విజయకుమార్ 99. మార్క్స్ : కూలీ శ్రమా పెట్టుబడీ (అను.) రాచమల్లు రామచంద్రారెడ్డి 100. మావోసేటుంగ్: కళలూ సారస్వతం ఎవరికోసం ? (అను.) కొడవటిగంటి కుటుంబరావు 101. మొమ్‌జాన్ : సోషలిజం– వర్తమానము, భవిష్యత్తు (అను.) వుప్పల లక్ష్మణరావు 102. లెనిన్ (a) కారల్ మార్క్స్ ఉపదేశాలు (అను.) మహీధర జగన్మోహనరావు (b) సోషలిస్టుభావశాస్త్రము, సంస్కృతి (అను) వుప్పల లక్ష్మణరావు (c) విప్లవదుందుడుకు విధానం (అను.) తుమ్మల వెంకటార్రామయ్య 103. స్టెపనోవా: (a) ఫ్రెడరిక్ ఎంగెల్స్ సంక్షిప్తజీవితచరిత్ర (అను) నిడమర్తి ఉమారాజేశ్వరరావు (b) కారల్‌మార్క్స్ సంక్షిప్తజీవితచరిత్ర (అను.) తుమ్మల వెంకటార్రామయ్య 104. సోబాలెవ్; షిరిన్య; షీర్నోవ్ : కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సంక్షిప్తచరిత్ర (అను.) కొండేపూడి లక్ష్మీనారాయణ 105. తెలుగుభాషాసమితి : తెలుగు విజ్ఞానసర్వస్వము 1, 4, 6 & 7 సంపుటాలు.

## (G) ఛందోఽలంకారగ్రంథాలు, సారస్వతవ్యాస సంకలనాలు, సాహిత్యసమాలోచనలు & సిద్ధాంతగ్రంథాలు మొదలైనవి

106. అప్పకవి : అప్పకవీయము 107. కురుగంటి సీతారామయ్య : నవ్యాంధ్రసాహిత్యవీధులు 108. కుటుంబరావు : సాహిత్యప్రయోజనం 109. చింతాదీక్షితులు : ప్రజావాఙ్మయము 110. దువ్వూరి రామిరెడ్డి : వ్యాసములు 111. నారాయణరెడ్డి సి. : ఆధునికాంధ్రకవిత్వము 112. పురిపండా: సారస్వతవ్యాసములు (సంకలనం) 113. రామకృష్ణ & రామిరెడ్డి : సాహిత్య పదకోశము 114. రావూరి దొరసామిశర్మ ; తెలుగుభాషలో ఛందోరీతులు 115. లక్ష్మీకాంతం, పింగళి : సాహిత్యశిల్పసమీక్ష 116. లెనిన్ : సాహిత్యంమీద వ్యాసాలు (అను) రా. రా. 117. శంకరాచార్య : వివేక చూడామణి 118. శివశంకరస్వామి & సుబ్రహ్మణ్య శాస్త్రి : కావ్యస్వరూపమ్ 119. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి : కావ్యాలంకార సంగ్రహము 120. సంపత్కుమార: ఛందఃపదకోశము 121. సుబ్రహ్మణ్యం, జి. వి. : సారస్వత వ్యాసములు (సంకలనం)

## (H) కావ్యాలు, కవితాసంకలనాలు

122. అబ్బూరి రామకృష్ణారావు : ఊహాగానము, ఇతరకృతులు 123. గురజాడ ; ముత్యాల సరాలు, 124. దేవులపల్లి కృష్ణశాస్త్రి : కృతులు 125. బసవరాజు అప్పారావు : పాటలు 126. ముద్దుకృష్ణ; వైతాళికులు 127. విశ్వనాథ : భ్రష్టయోగి,కిన్నెరసానిపాటలు 128. వేంకట పార్వతీశ్వరకవులు: ఏకాంతసేవ 129. శిష్ట్లా : విష్ణుధనువు 130. శ్రీశ్రీ : (a) శ్రీశ్రీ సాహిత్యం (శ్రీశ్రీసా.) (b) మరోప్రస్థానం

## (I) ఆధునికసాహిత్యవ్యాసాలు చర్చలు & సమీక్షలు

131. ఆధునిక సాహిత్యం గురించి వెలువడిన అసంఖ్యాక సమాలోచనలు - వివిధపత్రికలలో వెలువడినవి : స్థలాభావం వల్ల పేర్కొనడంలేదు.

## (j) శ్రీశ్రీ సాహిత్యసమాలోచనా గ్రంథాలు

132. అమరేంద్ర : భావవీణ (ఒకవ్యాసం) 133. అద్దేపల్లి రామమోహనరావు: శ్రీశ్రీ కవితా ప్రస్థానం 134. నారాయణ రెడ్డి : ఆధునికాంధ్రకవిత్వము (ఒకభాగం) 135. రామకోటి శాస్త్రి & రంగారావు : విమర్శిని (కొన్ని వ్యాసాలు) 136. విజయలక్ష్మి సి. : శ్రీశ్రీ ఖడ్గసృష్టి కావ్యపరామర్శ 137. సుబ్రహ్మణ్యం జి. వి. : ప్రతిభాలహరి (ఒక వ్యాసం)

## (K) శ్రీశ్రీ సన్మాన ప్రత్యేక సంచికలు

138. తెలుగురాజ్యమ్, కాకినాడ 1970, 139. శ్రీశ్రీ షష్టిపూర్తిసన్మానసంచిక - విశాఖ 1970 140. సృజన (a) 1970 షష్టిపూర్తి ప్రత్యేకసంచిక (b) 1980 ప్రత్యేకసంచిక 141. కళాకేళి 1970 శ్రీశ్రీ షష్టిపూర్తి అభినందన సంచిక

## (L) పత్రికావ్యాసాలు, చర్చలు, ఇంటర్వ్యూలు, & లేఖలు

142. శ్రీశ్రీ గురించి వివిధపత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఇవి అనేకం. స్థలాభావం వల్ల పేర్కొనడం లేదు.

## (M) శ్రీశ్రీ సాహిత్యవ్యాసాలు

143 రమణారెడ్డి, కె. వి. (సంపా) : 'శ్రీశ్రీ సాహిత్యం' సంపుటాలలో కూర్చబడినవి.

[సంకేతాలు : అను. = అనువాదం; సంపా. = సంపాదకులు; కావ్య = కావ్యవిభాగం; వచన. = వచనవిభాగం; పే. = పేజీ; D. W. L. T. (Shipley) = Dictionary of World Literary Terms; చూ. = చూడండి; R. H. D. = The Random House Dictionary.]

□

# III/విశిష్టపదసూచిక

ఏ శిల్పం ? ఏ సాహిత్యం ? ఏ శాస్త్రం ? ఏ గాంధర్వం ?

శ్రీశ్రీ శుద్ధకవిగా కళ్లువిప్పి, వ్యవహారకవిగా కవుల కళ్లువిప్పించినవాడు కనుక-తన కవిత్వంలో అనిదంపూర్వమైన విషయాలను చొప్పించినవాడు కనుక-ఆయనకవిత్వంమీద రాసిన ఈ వ్యాఖ్యానపూర్వకవిమర్శలో శుద్ధకవిత్వపరిభాష లేగాక సాంప్రదాయికసాహిత్యవిమర్శ కతీతమైన అనేకపరిభాషలు, పదాలు వచ్చికూర్చున్నాయి. ఈ పదజాలం సాహిత్యవిమర్శ పరిధిని బాగా విస్తృతంచేస్తోంది. ఈగ్రంథంలో ఆరింట నాలుగువంతులు సంపూర్ణంగా మార్క్సిస్టు సాహిత్యవిమర్శపంథాలో సాగింది. సామాజికవ్యవస్థకూ సాహిత్యవ్యవస్థకూ గల ఓతప్రోతగుణం చర్చింపబడింది. అందువల్ల అపూర్వమైన పదజాలాన్ని తొలిసారిగా సాహిత్యవిమర్శలో వాడవలసివచ్చింది. గ్రంథానికి దిక్సూచిగా ఉండటంకోసం విశిష్టపదజాలాన్ని అకారాదిగా కూర్చి ఇవ్వడం జరుగుతున్నది. పదజాలాన్ని ఎంపికచేయడంలోనూ కూర్చడంలోనూ కొన్ని నియమాల ననుసరించక తప్పలేదు. దేశనామాలు, స్థలనామాలు వదిలివేయబడ్డాయి. పదబంధాలవిషయంలో ప్రాథమికపదాన్ని సూచించి అనుబంధాలను అక్కడికక్కడే చూపడం జరిగింది. పుటలసంఖ్య ఎక్కువైపోయినప్పుడు తొలి, తుది పుటలు మాత్రం సూచింపబడ్డాయి.

---

## ముఖ్యమైన సవరణలు

ఆయా పేజీలలో పడిన దుష్టరూపాలకు శిష్టరూపాలు ఈక్రింద ఇవ్వబడుతున్నాయి. బ్రాకెట్లలోనివి పేజీ నంబర్లు.

(24) డిసెంబరు 8; నం. 1; (57) దృష్టి; ప్రఫుల్ల; (75) ఫణివిషస్ఫీత; (79) అని భిన్నరూపకాలు; Shipley; (108) నేర్చు; (118 & 189) Allan Poe; (188) A match; కోకిలమ్మ; (210) నల్లురి; (220) అసలే; (246) హరీంద్ర; (250) కర్తవ్యం; (272) ముంతాజబేగమ్; (300) ఎవ్వరని యెంతురో; (319) చెప్పలేదు; (377) దుర్మతి; (420) Autumn; (431) Dialectical; (498) వైరుధ్యాలు (499) బూర్జువా (504) అర్థాల్లో (516) గరుత్పరిరంభం; (527) యైన; (569) సంప్రదాయాలను; వర్ణన; (576) ఆంధ్రదేశపు; (610)వార్తలను; (616) పరిష్కార; అస్రనైవేద్యం; (642) అందుకే. ఎంగిల్సు = ఎంగెల్సు అనీ అల్లెన్ పో = అల్లన్ పో అనీ దిద్దుకోవాలి. □

శ్రీ శ్రీ కవిత్వం

వస్తువు — సంవిధానం

1927 - 28

ప్రభవ

# భావకవితాయుగానికి భరతవాక్యం

'నేను ఏవో యతిప్రాసలు లేని పద్యాలు
వ్రాస్తూండడంచూచి మా నాన్నగారు
నాకు సులక్షణసారం కొనిపెట్టారు.
ఛందస్సు ప్రథమపాఠం చెప్పారు....
అప్పటికి నా వయస్సు ఏడెనిమిది
సంవత్సరాలకు మించి ఉండదు.
ఆ రోజు నుండి ఎన్నిపద్యాలు వ్రాశానో
చెప్పను. అన్నీ తప్పులే !
కాని ఒకసారి చేసిన తప్పు మళ్లీ చెయ్యలేదు.
అందరూ నా తప్పులు దిద్దేవారే !
కొన్ని తప్పులు నాకు తప్పుగా తోచలేదు.
అవి చెయ్యడానికి నాకేదో
హక్కు ఉందనిపించింది. అందువల్ల
నా వ్యక్తి చైతన్యం ప్రగాఢతరం
అవుతున్నట్లు నా రక్తం పరిశుభ్రమవుతున్నట్లు
నా బలం హెచ్చినట్లు
నాకు స్పష్టంగా తోచింది !'

—శ్రీ శ్రీ

1

# కవిగా శ్రీరంగం శ్రీనివాసరావు ప్రభవం

## శిశువు చిత్రనిద్రలో ప్రాచీన స్మృతులాచే చప్పుడు!

ఇరవయ్యో శతాబ్దం. 1910వ సంవత్సరం. స్థలం విశాఖపట్నం. తెలుగు కవితా సరస్వతికి పురుటినొప్పులు మొదలయ్యాయి. ఆ కొత్తసృష్టి జనవరి రెండవ తేదీని జరిగింది. ఆ శిశువు పేరు శ్రీనివాసరావు. అతని ఇంటిపేరు శ్రీరంగంవారు. రెండు శ్రీలు ధరించిన శిశువతడు- శ్రీరంగం శ్రీనివాసరావు.

అతని తల్లి పేరు అప్పన్నకొండ. అతని కన్నతండ్రి వెంకటరమణయ్య. 'యమాతా రాజభానసలగం' - అతని మొదటి కవితామంత్రం. దానికి ఉపదేష్ట అతని తండ్రిగారే! అంతకు ముందే అతడు కందపద్యం రచించడానికి ప్రయత్నించాడు.

ఈ కవికిశోరుడు చిన్నారిపొన్నారి చిరుత కూకటి నాడే రచించాడట 'వీరసింహవిజయ సింహులు' అనే ఒక నవలనీ! 'సావిత్రీ సత్యవంతము' అనే పద్యనాటకాన్నీ! అవి బాల్యక్రీడలు. కాగితం పడవలై కాలంలో కలిసిపోయాయి.

పదిహేనవ యేట 'పరిణయరహస్యం' అనే నవలను రచించగా విశాఖపట్టణంలో 'స్వసంఘం'వారు దాన్ని ముద్రించారు. కాని అది కూడా ఈనాడు ఆనవాలుకైనా లభించదు.

## పురిపండా దోహదం

ఆ పదిహేనవ ఏటనే ఒక ఖండిక తేటగీతుల్లో అతడు రచించి పురిపండా అప్పలస్వామి గారికి చూపించాడు. ఆయన దాన్ని మెచ్చుకుని తన సంపాదకత్వంలో నడుస్తున్న 'స్వశక్తి' పత్రికలో వేయించారు. ఆ ఖండిక పేరు 'విశ్వరూపసందర్శనము' అను 'దివ్యలోచనములు'. ఆ ఖండిక కూడా ఈనాడు పూర్తిగా లభించదు.

నిజానికి ఆ ఖండికయే శ్రీనివాసరావు తొలికవితగా పరిగణించదగింది. అందులోని వస్తువేమిటి? సంవిధాన మెలాంటిది?

'విశ్వరూపం ధరించిన కృష్ణపరమాత్మను ధృతరాష్ట్రుడు దృష్టిదానాన్ని అర్థించడం' ఆ ఖండికలోని వస్తువు 1. అందులో నుంచి మూడే మూడు పాదాలు లభిస్తున్నాయి.

'ఓ మహాత్మ! త్వదీయ మహోన్నత ప్ర
భావ మింతని తెలుప నెవ్వాని తరము ?
................................
దివ్యలోచనములఁ బ్రసాదింపుమయ్య !'

ఇందులోని సంవిధానం నాటకీయం. భావావేశం నిరర్గళం. శైలి ప్రసన్నమధురం.

ఈ ధృతరాష్ట్రుడి మాటల్లో కవి ఆర్తి కనిపిస్తోంది. ఈ దివ్యలోచనం కవికి కావలసిన భావయిత్రీప్రతిభయే ! ఏ ప్రతిభ లేనివాడికి దర్శనమే ఉండదో దాన్నే తన కిమ్మని కవి ప్రార్థిస్తున్నాడనిపిస్తుంది. పైగా అది విశ్వరూప దర్శన కుతూహలం.

పదిహేనవ యేట – స్కూల్ ఫైనల్ చదువుతూఉన్న శ్రీనివాసరావుకు ఈ విధమైన కవిని వేదన లభించడం ఒక చమత్కారం.

ఇక్కడే శ్రీనివాసరావు భవిష్యత్తంతా తొంగి చూస్తోంది. ఆనాడే శ్రీనివాసరావును ఆకర్షించింది–మహాభారతగాథ. సత్యసందర్శనం పట్ల అతనికున్న ఔత్సుక్యమూ ధర్మసంగ్రామం పట్ల అతనికున్న అభిమానమూ అతని సుదూరభవిష్యత్తులో ఎలా పరిణమిస్తాయో మనం చూడగలం.

## సమరాహ్వానం

మహాభారత గాథా ప్రీతి అతని చేత 1926 లోనే – 16వ ఏట – నూనూగు మీసాల నూత్నయౌవనంలో – 'సమరాహ్వానము'2 అనే ఖండికను రచియింపజేయించింది. ఈ ఖండిక 1926 నవంబరు నెల భారతిలో ముద్రితమయింది. శ్రీనివాసరావు తొలికవితగా ఈనాటికీ సంపూర్ణంగా కనిపిస్తున్నది ఇదే.

ధైర్యము త్యజించి ఘోరయుద్ధంబు సేయ
ననుచిత పలాయన పథంబు ననుసరించి
ఓ సుయోధన ! యెందేగి యుంటివిపుడు
రమ్ము క్షత్రియోచితసంగరం బొనర్ప !

---

1. కె. వి. రమణారెడ్డి; శ్రీశ్రీసా. ఒకటి.కావ్య. 8వ పే.

2. అదే. 120-121 పే.

అని ప్రారంభమవుతూన్న ఈ కవితలో నాటకీయశైలి, పదాల పొందిక, భాషావేగం, పద్య రచనాకౌశలం కనిపిస్తున్నాయి. తేటగీతిమాలికలు గ్రుచ్చి, సామెతలూ జాతీయాలూ తెచ్చి, నడిపించిన ఖండిక యిది. ఇందులో మహాభారతగాథ అంతా ప్రసక్తమవుతుంది. ధర్మమే జయ మనుమాటను సుయోధనుడు మరిచిపోయాడని వెక్కిరింపబడతాడు.

### కవితాసమితి

ఈవిధంగా వికసిస్తున్న శ్రీనివాసరావు కవితాప్రతిభకు మరింత దోహదం కలిగించిన సంస్థ 'కవితాసమితి'. ఇది 1926 లోనే విశాఖపట్టణంలో అవతరించింది. దీనికి సూత్రధారి పురిపండా అప్పలస్వామిగారే! శ్రీనివాసరావు, వడ్డాది సీతారామాంజనేయులు, కాళ్ళూరి నరసింగరావు, శ్రీరంగం నారాయణబాబు మొదలైన యువకులూ మారేపల్లి రామచంద్రశాస్త్రి, పూడిపెద్ది వెంకటరమణయ్య, ఆచంట వేంకటసాంఖ్యాయనశర్మ, సెట్టి లక్ష్మీనరసింహం మొదలైన పెద్దలూ అందులో సభ్యులు. ఈ కవితాసమితి 'అఖిలాంధ్రఖ్యాతి' సంపాదించుకుంది.[1]

ఇలా ఉండగా, 1927లో శ్రీనివాసరావు మొదటిసారిగా భావకవిగా దర్శనమిచ్చాడు. ఆ యేడు జూలై భారతిలో పడిన 'అభిసారిక'లో ఆ పోకడ లున్నాయి.

### ప్రభవ ప్రచురణ

1927 జూలై నుంచి 1928 ఏప్రిల్ వరకూ శ్రీనివాసరావు రచించిన ఖండికలను ఎప్పటి కప్పుడే విని ఆనందిస్తూ ఆ ఖండికలను పేర్చికూర్చి కవితాసమితి తొలిప్రచురణగా వెలువరించినది పురిపండా అప్పలస్వామిగారే! ఆ కవితాసంపుటి పేరే ప్రభవ!

ప్రభవలోనివి 17 ఖండికలు. ఆ ఖండికలలోని వస్తుసంవిధానాలను రచనా (లేక ముద్రణా) కాలానుక్రమాన్ని అనుసరించి పరిశీలిద్దాం!

## ప్రభవకు పురిపండా వ్రాసిన ఉపక్రమణిక నుంచి

"ఇవి కేవల స్వేచ్ఛాదివసములు. ఆంధ్రవాఙ్మయమున కిది స్వర్ణయుగము కాకున్నను ఆ యుగారంభమున కివి ప్రథమదివసములనుట తథ్యము. తిరుపతివేంకటేశ్వరకవులతో ఆంధ్రవాఙ్మయము పతనోన్ముఖమైనదనువారితో మాకుఁ బనిలేదు. ఈ స్వేచ్ఛాదివసములలో ప్రభవించిన దీప్రభవ; ప్రభవాబ్దమున కవిహృదయమునుండి వెలువడిన ఖండకావ్యములు 'ప్రభవ' యనుపేర సంపుటీకరణము గావింపబడినవి. గ్రంథకర్తయగు శ్రీ శ్రీనివాసరావుగారిందలి ప్రతిగీతమును తాము రచింపగనే నాకడకుఁ గొనివచ్చి శ్రవణానందము కలిగించుచుండెడివారు. కేవలము కడుపిన్నవయసుననే యిట్టి 'లలితభావకవితావియద్వాహిని' యలవడినది వీరికి........

శ్రీనివాసరావుగారి కవితయం 'దొక యనిర్వచనీయమహోన్నతమగు హాయి' యున్నది. 'ఇరులొరసిపారు గాంగనిర్ఝరిణియట్లు' వీరిగీతి (చెంగుచెంగున) తురంగలించును...............

మా కవితాసమితి గ్రంథావళిలో 'ప్రభవ' ప్రథమకుసుమముగ వికసించినది..........."

విశాఖపట్టణము
౨౪-౪-౨౮

పురిపండా అప్పలస్వామి,
కవితాసమితి కార్యదర్శి.

కవితాసమితి గ్రంథావళి—౧

# ప్రభవ



శ్రీ. శ్రీనివాసరావు,
కవితాసమితి

ప్రభవ ముఖపత్రం నమూనా (1/8 క్రౌన్)
(1928)

భావకవితాప్రవాహంలో పగడాల పడవలు

## 1927 కవితలు

అభిసారిక ప్రళయనర్తనము రజనీగానము

‘నిన్నటినుంచి ఇవాళ లాగ
నిన్నటికవుల నుంచి
నేటికవులు పుడతారు’

—శ్రీ శ్రీ

ఈ నిశీధిని ప్రబలఝంఝానిల ప్రసార
విదళిత వృక్ష సంచయము కలితమౌ !

తన ప్రియుణ్ణి కలుసుకోవడానికి అభిసారిక ఒక కాళరాత్రి గాలివానలో ఏకాంతంగా బయలుదేరుతుంది. ఆమె సంకేతస్థలం ఒక దుర్గమారణ్యం! ఈ ఇతివృత్తంతో సాగిన భావగీతిక అభిసారిక 1.

తుఫానురాత్రి

రాత్రివర్ణనతో తన కథను మొదలుపెడుతుంది అభిసారిక. ఆ రాత్రి 'ప్రబలఝంఝానిలం' ప్రసరించడంచేత వృక్షాలు విదళితమవుతున్నాయి. ఝంఝానిలాలకు ఏనుగులతో పోలిక ధ్వనిస్తుంది. తరువాత పెనుమబ్బులు కనిపిస్తాయి. అవి 'కులిశఘాత ప్రతారణ కుశల కుధరపంక్తి సన్నిభ ఘనపయోవాహాలు'. దేవేంద్రుడి వజ్రపుదెబ్బలనుకూడా ప్రతారించగల కొండలవంటి మబ్బులవి. ఇంద్రుణ్ణికూడా అవి లెక్కపెట్టవు. ఇంద్రుడు మేఘగతి నిర్ణయించేవాడే. కొండల రెక్కల్ని ఛేదించగలవాడే. అయినా ఆనాటి రాత్రి మేఘాలు అతణ్ణి తప్పించుకుంటాయి. ఇంద్రుడికి వేటగాడితోనూ మబ్బులికి అడవిజంతువులతోనూ పోలిక ధ్వనించేలాగుంటుంది ఈ పదచిత్రం. ఆ తరువాత పెంజీకటి కనిపిస్తుంది. అది 'భూనభోంతర విచ్ఛన్న' మైనది. ఇంత చీకటిలో అభిసారికకు దారీ తెన్నూ తెలియదు. ఈ పదచిత్రంలో చీకటికి వలతో పోలిక స్ఫురిస్తుంది. తరువాత కనిపిస్తాయి మెరుపులు. ఇవి 'ధ్వాంతసంకీర్ణ గగనహృదయవిదీర్ణ శక్తియుక్త క్షణప్రభలు'. ఈ మెరుపులు ఆకాశహృదయాన్ని చీలుస్తున్నాయి. ఆ హృదయం చీకటితో నిండినది. ఈవర్ణనలో మనకు నరసింహుడు హిరణ్యకశిపుని హృదయం చీలుస్తున్న దృశ్యం కనిపిస్తుంది. చీకటిలో దారిచూపించే మెరుపులుకూడా ఇలా భయంకరంగానే ఉన్నాయి. అంతలో ఉరుములు వినిపిస్తాయి. అవి 'చండహర్యక్ష భయదగర్జాసమానకంధరధ్వానాలు'. అంతే కాదు; ఆ ఉరుములచేత దిగ్గజాలు భయపడతాయి. చివరికి వాన మొదలవుతుంది. ఇది 'మహిత వేదండతుండప్రమాణసలిలసంతతైకధారాపాతం'గా ఉంటుంది. ఇందులో విశేషణవిశేష్యాల స్వారస్యం ఆకర్షిస్తుంది మనల్ని.

---

1 ముద్రణ — 1927 జూలై భారతి. ప్రభవ. చూ. శ్రీశ్రీపా. ఒకటి. కావ్య. 38 పే.

## దుర్గమారణ్యం

సమయ మిలాఉంటే ప్రదేశం దానికి తీసిపోతుందా ? ఆ అరణ్యం క్రూరమృగాకీర్ణం. కానీ ఈ విషయాన్ని చెప్పడంలో వక్రత నవలంబించాడు కవి.

ఈ ప్రదేశ మనూన భయప్రదాన
శరభ వేదండ భల్లూక హరిసమూహ
ఘోరఘోరాతిఘోర నిర్ఘోషపాటి
తాఖిలజన శ్రవణపుటమగుచుఁ దనరు
విజనమగు విభ్రమాస్పద విపినతలము !

శరభాలు, ఏనుగులు, భల్లూకాలు, సింహాలు మొదలైనవి ఉండటం కాదిక్కడ ముఖ్యం; వాటి నిర్ఘోషాలచేత జనుల చెవులు బద్దలవుతూ ఉండటం. ఈ వర్ణనలోనే కవి స్వవచోవ్యాఘాత దోషానికి పాల్పడ్డాడు. అది విజనం అని చెబుతూనే 'పాటితాఖిలజనశ్రవణ' అనడం ఏం బావుంది ?

## ప్రణయగీతమా ? ముక్తిగీతమా ?

ఈ స్థలకాలాలిలా ఉన్నా అభిసారిక సంకేతస్థలానికి వెళుతూనే ఉంది. అందు కొక్కటే కారణం. ఆమె ప్రణయపుగాఢకుతూహలం. ఆమె ప్రణయాధిదేవుడు 'ప్రణయరాజ్యరమా ప్రాణపతి'గా సూచింపబడటం గమనించదగింది.

అయిన నేమాయె ప్రేమ మెంతైనఁ జేయు
దుర్గమ భయంకరారణ్యదుర్గములును
ప్రళయకాల సమాన విభావరులును
ప్రణయరాజ్యరమాప్రాణపతి కొఱకయి
తరలియరిగెడు నా కవాంతరములగునె ?

ఇది అభిసారిక హృదయం. అసలు అలాంటి అరణ్యాంతర్భాగమే సంకేతమెందుకు కావాలి ? అనే ప్రశ్న కనక వేసుకుంటే ఒక విచిత్రమైన అర్థస్ఫూర్తి మనకు కలుగుతుంది.

## మధురభక్తి సంప్రదాయం

అసలు ఇది ప్రణయగీతం కానే కాదు. అభిసారిక భక్తుడి ఆవేశం నుంచి ఇందులో బయట పడటం లేదు. కేవలం విషయవాంఛల కోసం వెళ్లేది అభిసారిక. కాని ఇక్కడ ప్రణయరాజ్యం కైవల్యమే. ఆ వర్ణింపబడిన రాత్రి జీవితానికి ఒక సంకేతం. జీవితంలోని దుఃఖమే ఆ వర్షకాలం. ఈ జీవితాన్నీ ఈ ప్రపంచాన్నీ (అరణ్యావాతావరణం) విడిచి భక్తుడు పరమేశ్వరాభిముఖంగా సాగిపోవడమే అభిసరించడం.

సమాసశిల్పం

రాత్రివర్ణన రెండేసిపాదాలలో ఒక్కొక్క సమాసంగా సాగుతుంది. ఆ సమాసాలన్నీ సమతాగుణంతో ఉంటాయి. అంతేకాదు; అవి ఓజోగుణంతో లయవేగంతో పరుగెత్తుతాయి. పదాలు విరామంతో నడుస్తాయి. ప్రాసలు హొయలుతో గంతులు వేస్తాయి. మచ్చుకి—

చండహర్యక్షభయదగర్జా సమాన
కంధరధ్వాన చకిత దిగ్దంతిచయము!
ధ్వాంతసంకీర్ణ గగనహృదయవిదీర్ణ

బహువ్రీహిసమాసం వాడటం అలవోక.

అనూన భయప్రదాన శరభ వేదండ భల్లూక
హరిసమూహ ఘోర ఘోరాతిఘోర
నిర్ఘోషపాటితాఖిల జనశ్రవణపుటము (విపినము).

పర్యాయపదశిల్పం

ప్రబంధాలలోని శైలి పర్యాయపదాల కూర్పువల్ల రాణిస్తుంది. ఎక్కడ ఏ పదానికి ఏ పర్యాయపదం వాడితే మొత్తంసమాసం శ్రుతిపేయంగా ఉంటుందో ప్రబంధకవులు గ్రహించారు. కవితాశిల్పంలో ఇదొకభాగమైంది. సింహాన్ని హర్యక్షమంటే వైచిత్రి. ఈ భాషా శిల్పాన్ని కవి పుష్కలంగా గ్రహించాడు. మబ్బుని పయోవాహం అంటాడు. వజ్రాన్ని కులిశం అంటాడు. మెరుపుని క్షణప్రభ అంటాడు రాత్రిని విభావరి అంటాడు. శైలి ఈవిధంగా ప్రాబంధికత నందుకున్నది.

3

ప్రళయనర్తనము

## మాయామేయ జగద్వినాశనమతిన్ నర్తింపుమా!

ఈ లోకమంతటినీ మూడవకంటితో తగులబెట్టి శివుడు నర్తించాలట. ఇలా ప్రార్థిస్తూ రచించిన మూడు ఉద్ధతవృత్తాలు ప్రళయనర్తనము[1]. ఈ వృత్తాలలో మధ్యనున్నది మత్తేభం. మొదటిదీ మూడోదీ శార్దూలాలు. ఉద్ధతరసంతో కూడిన తాండవానికి ఉద్ధతిగల వృత్తాలు తోడ్పడుతున్నాయి. మూడు పద్యాలతో మూడులోకాల్ని సంకేతించాడు.

జగద్వినాశనం

శివుని లీలాతాండవాన్ని కాక ప్రళయతాండవాన్ని కోరుతున్నాడు కవి. కానీ 'శంకరా' అనే సంబోధన లోకానికి శుభాలనే కలిగించవలసిందనే ప్రార్థనను అభివ్యంజిస్తోంది.

సాయం ప్రస్ఫుటరాగరంజిత లసత్సంపూర్ణ సౌందర్యరా
శీయుక్తామల దివ్యమూర్తివయి, సాక్షీభూత నానామర[2]
స్తోమస్తోత్ర గభీరగానరస సంతుష్టాంతరంగంబునన్
మాయామేయజగద్వినాశనమతిన్ నర్తింపుమా! శంకరా!

తాండవంచేసే సమయంతోపాటు శంకరుడు కూడా అరుణరాగరంజితుడై సాక్షాత్కరించాలని కవి ఉత్కంఠ. స్తోత్రపరులయి, దేవతలందరూ నిలబడి చూస్తూఉండగా పరమానందంతో చేయవలసిన శివనర్తనానికి 'మాయామేయజగద్వినాశనం' పరమావధిగా కవి భావించడమే విచిత్రమైన విషయం.

---

1 ముద్రణ : భారతి 1927 సెప్టెంబరు. చూ. శ్రీశ్రీసా. ఒకటి, కావ్య, 41 పే.

2 'సాంధ్యకాలారుణ గభస్తి సముదయమున। ప్రస్ఫురించెడు నిజవపుర్వైభవమ్ము। సుచిత మానసికోత్సాహ ముజ్వలింప। అమరులనిమేషనయనులై అరయునపుడు। ఏ పరాత్పరమూర్తి సదాపవిత్ర। నాట్యలీలానుకూల విన్యాసములను। నెరపుచున్నాడొ ఆ హరు నిటలమందు। దాగియడగిన అగ్నిహోత్ర మును నేను' అన్నాడీ కవియే అగ్నిహోత్రము అను ఖండికలో (1928).

## ప్రళయగర్జనలు - జలప్రళయం

గంగాధరుడైన శివుడు[1] నర్తనం మొదలు పెట్టగానే లోకమంతా చీకట్లతో నిండిపోతుంది. సముద్రాలు పొంగి భూమిమీదపడతాయి. ప్రళయకాలమేఘాల ఉరుములు వినిపిస్తాయి. కాని వాటిలో శివుడి గంభీరాట్టహాసం కలిసిపోతుంది. ఆ ధ్వనికి దిగ్గజాలు కంపిస్తాయి. అప్పుడు శివుడు నర్తనంతో విజృంభించాలని కవి ప్రార్థన.

అలఘుధ్వాంతవితాన సంభరిత రోదోంతర్మహాగహ్వర
స్థలి యంభోనిధియయ్యె సంతతజలస్రావాతిరేకంబునన్
విలయాంభోధర ఘోషసమ్మిళితగంభీరాట్టహాసధ్వనిం
చలితప్రాకటదిగ్గజుండవగుచున్ సంప్రీతి నర్తింపుమా !

## ఫాలాగ్నితో బ్రహ్మాండాల దహనం

ప్రళయనర్తనంలో చరమలక్ష్యం బ్రహ్మాండాలను 'ఫాలాక్షజ్వలదగ్ని'తో దగ్ధంచేయడం. 'ధ్వాంతవితానసంభరితం'గా రోదోంతరాలను వర్ణించిన కవి బ్రహ్మాండాలను దహించే ఫాలాగ్నిని 'అర్కకోటిఘృణిసంకాశం'గా వర్ణించి చీకట్లలో వెలుగును చూపిస్తాడు.

కాలాంతప్రభవార్క కోటి ఘృణిసంకాశప్రతాపస్ఫుర
త్ఫాలాక్ష జ్వలదగ్నిదగ్ధ సకలబ్రహ్మాండభాండుండవై
జ్వాలాదీప్త మహాప్రభావగరిమన్ స్వచ్ఛందసంవర్తకే
ళీలోలాత్ముడవై సమస్తజగముల్ కీర్తింప నర్తింపుమా !

శివుడు చేసే ఈ సంహారాన్ని 'స్వచ్ఛందసంవర్తకేళి' గా పేర్కొన్నాడు కవి. శివుడా నర్తనాన్ని 'సమస్త జగముల్ కీర్తింప' గా చేయాలనడంలో మాత్రం కవి స్వవచోవ్యాఘాతానికి పాల్పడ్డాడు. అగ్నిదగ్ధసకల బ్రహ్మాండభాండుడైన తరువాత శివుడు చేసే నర్తనాన్ని చూడటానికి కెవరుంటారు? సమస్త జగములూ ఎక్కడుంటాయి కీర్తించడానికి ?

---

1 ఇతని అభిమాన కావ్యసామగ్రిలో శివుడు ఒకడు. 1. ఆ హరునిటలమందు దాగియుండగిన అగ్ని హోత్రమును నేను, 2. జగదీశ్వరాంఘ్రిమంజీర నటనమటులు. 3. హరజటాజూటగంగాంబు శీతలవృష్టి. 4. హరోంహరోం హర.........అని కదలండి. 5. ఖండపరశుగళకపాలగణముల. 6. రుద్రాలికనయనజ్వాలిక, 7. నటధూర్జటినిటాలాక్షి మొదలైనవి. కానీ కవికి భౌతికరాజకీయావగాహన హెచ్చయ్యాక ఈ సామగ్రి సన్యసింపబడింది.

## నూతనయుగావతరణసూచన

ఒక యుగం పూర్తి కాగానే ప్రళయం సంభవించి తదనంతరం తిరిగి సృష్టి జరుగుతుందనేది ఆర్షమతం. కథతో నిమిత్తం లేకుండా శివుని ప్రళయనర్తనాన్ని ఖండకావ్య పరిధిలో వర్ణించడమే కవి సంకల్పం. అసలిటువంటి వస్తువును తీసుకోవడంలోనే కవి దృక్పథం అర్థమవుతుంది.[1]

### రసోచితపదశిల్పం

'విలయాంభోధర ఘోష సమ్మిళిత గంభీరాట్టహాసధ్వనీ చలిత ప్రాకట దిగ్గజుడు', 'కాలాంత ప్రభవార్క కోటి ఘృణిసంకాశ ప్రతాప స్ఫురత్ ఫాలాక్షజ్వాలదగ్ధ సకలబ్రహ్మాండ భాండుడు' అనే బహువ్రీహిసమాసాలలో ఆరభటీవృత్తి[2] కనుగుణంగా గాఢరీతి[3]ని ఓజో గుణాన్ని[4] కలిపిన భాషను వాడటంలో ప్రబంధ సాంప్రదాయిక పదశిల్ప పరిజ్ఞానాన్ని ప్రదర్శింప చేశాడు.

సృష్టిసౌభాగ్యవిభవవైచిత్రిఁ గాంచి
పరవశతనొంది గొంతెత్తిపాడుకొంటి!

నిరంతరం స్వప్నసీమల్లో తేలియాడే భావకవి పాడుకున్న రాత్రిపాట రజనీగానము.[1]

పూలతోటలో వెన్నెలరాత్రి

వివిధసూనవితానశోభితకుజప్రశస్తసుప్రమదావన స్థలము సాంద్ర
చంద్రికాసముజ్జ్వలదివ్యశర్వరీప్రశాంతవేళ సముంచితసౌఖ్య మొసగ!

కవి చెప్పకపోయినా ఇది స్వప్నమని ఈ వర్ణన అంతా రుజువుచేస్తుంది.

మైమరచిపోతినంత సమస్తభువనసముదయమలర్చినపుడె విస్తారమధుర
గాన నిస్వనకల్లోలకలితలలితభావకవితావియద్వ్యాపిసి విధాన.[2]

అసలీ సృష్టియే భావకవిత్వంలా కనిపించిందంటే ఈ కవి సౌందర్యసీమావిహారానికి అది పరాకాష్ఠ. 'వినూతనోత్సాహదాయక మనోజ్ఞ సమయమది'. వయసూ అలాంటిదే. ఆ పూలతోటయే జీవితం. ఆ శరద్రాత్రియే యౌవనం. ఆ భావావేశమే కవిత్వం.

గగనసాగరంలో భావనౌక

ఈ సంభ్రమంలోనే అతనికి పాటలు పాడాలనిపించి పాడుకున్నాడు! ఈ గానకుతూహలానికి కారణం 'సృష్టిసౌభాగ్యవిభవవైచిత్రి'. ఈ 'గానస్రవంతికానవీన తరంగాలలో' స్నానమాడుతూ ఉండగా కనిపించిన చందమామను చూచి అతను సర్తనం కూడా చేశాడు. ఎవరీ చందమామ?

'ప్రవిమలామృతరసపరిప్లావితాభ్రధామ సందీప్త పూర్ణసుధానిధి' అతను. క్రింద తాను గానరసంలోనూ పైన చందమామ అమృతరసంలోనూ స్నానంచేస్తున్నారు. అతను పూర్ణసుధానిధి. అంతటివాడు తానూ కావాలని కుతూహలం కలవాడు కనుకనే —

---

1 ముద్రణ; భారతి 1927 డిసెంబరు. ప్రభవ. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 32 పే.

2 భావకవిత్వానికిది ఒక చక్కని లక్షణం.

కాల్పనిక భావచిత్రం

'ఈదుకొనిపోతి మామకహృదయకుహరజనితభావనౌకాధిరోహణమొనర్చి
కంధరతరంగనివహసంకలితమహితగగనసాగరగంభీరగర్భమందు'

అంటాడు. భావనౌకలో మేఘతరంగాలుగల ఆకాశసాగరంలో ప్రయాణం చేయడం అనే కాల్పనికమైన భావచిత్రరచన1 ఇతని ఊహావైభవానికే కాదు, రచనా శిల్పానికి కూడా పతాకనెత్తుతోంది.

పదశిల్పవైవిధ్యం

(1) విశేషణపరంపరాసంఘటననైపుణ్యం, (2) లలితపదవిన్యాసచాతుర్యం, (3) భావాభివ్యంజకపదగమనసంయోజననిపుణత అని మూడురకాలయిన పదశిల్పం ఈ ఖండికలో కనిపిస్తుంది. ఇందుకి రెండు ఉదాహరణలూ చాలు.

(1) విస్తారమధురగాననిస్వనకల్లోలకలితలలితభావకవితావియద్వాహిని
(2) కంధరతరంగనివహసంకలితమహితగగనసాగర

ముత్యాలసరం నడకలు

ఈ తేటగీతి పాదాలలో ముత్యాలసరపునడకలు కనిపిస్తాయి.

(1) వివిధసూన వితాన శోభిత (కుజపరిశస్తి) (2) ప్రవిమలామృతరసపరిప్లా (వితాభ్ర)

# 1928 కవితలు(1)

మొట్టమొదటిసారి

నాకు పద్యం వ్రాయాలని బుద్ధిపుట్టినప్పుడు

ఏదో క్రొత్తది కనిపెట్టినట్లే భావించాను!

నేను వెతుకుతున్న గులేబకావళి దొరికిందనుకున్నాను.

అతఃపూర్వసాహిత్యానికి అది అనుకరణం కాదు!

తర్వాత తర్వాత సాహిత్యదృష్టి హెచ్చి

నాలాగే ప్రమాదప్రయాణాలు చేసి

అనుభవాలు సంపాదించి

విశేషాలు కనుక్కొని

మజాగా చెప్పినవారి పరిచయం

పూర్వులదీ, నవ్యులదీ కలిగినపిమ్మట

వాటికి తగినంత చేరువగా

అనుకరణచేస్తూ పోవాలని బుద్ధిపుట్టింది!

—శ్రీశ్రీ

కదలించిన హృదయారవిందసుమము
భక్తిపూర్వకముగ సమర్పణమొనర్తు!

అది ఒక ప్రభాతం. పరమేశ్వరుడి సన్నిధికి వెడతాడు భక్తుడు. తన హృదయపుష్పం సమర్పిస్తాడు. భావగీతాలు పాడతాడు. భగవంతుడిలో లీనమైపోతున్న అనుభూతి కలుగుతుందతనికి. ఈ కథను దేవుడితోనే చెప్పుకుంటాడు.1

దేవాలయం

అస్మదీయప్రఫుల హృదంతరాళసంస్థితపవిత్రతరభావసముదయప్ర
దర్శనోత్సుకమతినొచుఁ దమకమెసగ దేవ! నీ సన్నిధికి నేగుదెంచినాడ!

తన పవిత్రతరభావాలను ప్రదర్శించడానికే తాను వచ్చానని చెప్పుకుంటాడు దేవుడితో. హృదంతరాళం ప్రఫుల్లమయిందనీ పవిత్రభావా లందులోనే ఉన్నాయనీ చెప్పడం భావచిత్రంగా భాసించి ఆ భావాలకు పరిమళసాదృశ్యం కలిగిస్తోంది. అతడు దేవాలయానికి వెళ్లిన తరువాత సూర్యోదయమయింది.

ప్రతిపదసార్థక్యం

అత్యుదగ్ర తమిస్రదుర్వ్యాప్తి ప్రభిన్నమానైకశక్తి
సంపన్న నిశితభానుకిరణ ప్రశస్తమై ప్రాచి దోచె!'

ఇది ప్రతిపదసార్థకమైన వర్ణన. తమిస్రం అజ్ఞానానికి ప్రతీకగా భాసించి దాని అత్యుదగ్రత్వం, దాని దుర్వ్యాపారత్వం సూచింపబడ్డాయి. చీకట్లదుర్వర్తనంలో అజ్ఞానపు విచ్చలవిడితనం స్ఫురిస్తోంది. దాన్ని భేదించేశక్తి వాడియైనసూర్యకిరణానికే ఉంది. ఆ సూర్యకిరణాలతో ప్రశస్తంగా తూర్పు కనిపించిందనడంలో కవి ఊహాబలం గోచరిస్తుంది.

దైవదర్శనం

జ్ఞానస్వరూపుడైన భగవంతుడ్ని పూజించడానికనువైన సమయం ఉదయకాలమే మరి. భక్తుని దృక్పథంలో భగవంతు డెలాంటివాడు? అతని సంస్కారమేమిటి భగవంతుడ్నిగురించి?

---

1 ముద్రణ: 1928 ప్రభవ. చూ. శ్రీశ్రీ సా. ఒకటి. కావ్య. 37 పే.

ఏయనంత ప్రభావ దుర్జ్ఞేయమాన
మానితాచ్ఛపరంజ్యోతివో! నితాంత నిస్తుల గుణాబ్ధివో!

ఇట్టి పరాత్పరుడ్ని దర్శించాలని ఉవ్విళ్లూరుతాడు భక్తుడు. ఆయన కనిపిస్తే భక్తుడు చేసేదేమిటి?

### హృదయార్పణం

కందళించిన హృదయారవిందసుమము
భక్తిపూర్వకముగ సమర్పణమొనర్తు.

అని సంకల్పం చెప్పుకుంటాడు. అసలు భగవంతుడ్ని చూడలేకపోయినా, ఆలయంలోని ప్రతి కృతిని చూసి ఉప్పొంగిపోతాడు. దర్శనైకమాత్రంచేత కలిగిన ఆనందం కాదిది. ఆ దర్శనంవల్ల తన కల్మషాలన్నీ క్షాళితమైనట్లు భావించే ఆనందం. ఈవిషయాన్ని ఒక మనోహర భావ చిత్రంతో వ్యక్తీకరించాడు–

మహిత భవదీయరూపసంపద్విలాసనిర్మలాంచితమందాకినీతరంగ
సమవగాహనోపార్జితవిమలపుణ్యమహిమకారణగళితకల్మషుండనైతి.

భగవంతుని రూపమందాకినీతరంగాలలో తాను స్నానమాడాడు. అందువల్ల కలిగిన పుణ్యం, తన పాపాలను హరించిందని తృప్తిపడ్డాడు.2 ఈ భక్తుని అర్చనవిధానంలో వివిధావస్థలున్నాయి. ఈ ఖండికలో మొదట అర్చనకుతూహలం, తరవాత దర్శనం, తరవాత ధ్యానం, ఆ తరవాత సంకీర్తనం. కవియైన భక్తుడికి సంకీర్తనమే పరమధ్యేయం.

### పరమేశ్వరైక్యం

దీర్ఘహర్ష ప్రదాయకదివ్యభావగీతికానవ్యరాగసంకీర్తనమున
నైక్యమయ్యెదఁద్వన్మనోహరదిగంత విశ్రుతశ్లోకపరిశుభ్రవీచికలను

అంటాడు. భావగీతికలకు భక్తికూడా ఒక దినుసు. వాటికి 'రాగం' ప్రాణదాయిని. ఈ భక్తి చైతన్యంతో భగవంతుడ్ని కీర్తిస్తూ ఆయన కీర్తివీచికలలో తాను లీనమైపోతాననడం భక్తికి పరాకాష్ఠ.

---

2 ఈ కవియే ఉత్తరకాలంలో 'ఏది పాపం ఏది పుణ్యం' అని ప్రశ్నిస్తాడు. భగవంతుడ్ని గూర్చి విచికిత్సలో పడతాడు. (చూ. సందేహసంశయం).

## మేఘశకలము

**ఓ వలాహకశకలమా ! నీవు కూడ**
**నావలెఁ బరిభ్రమించుచున్నావదేల?**

ఆకాశంలో తనలాగే తిరుగుతున్న మబ్బుతునకను చూస్తాడు కవి. దానితో తనకేమి పోలిక ? చిత్తచాంచల్యం ఒక్కటే ! దానికున్న శక్తులెన్నో తనకు లేవు.1

మేఘశక్తి

ఈ ప్రకృతి రహస్యం గాఢమైనది. దాన్ని తెలుసుకోవాలని 'విశ్వపథముల నడయాడి' వేసరిల్లుతున్నాడు కవి. కాని ప్రకృతినే అనుశాసించగల మేఘశకలం కూడా తనవలెనే పరిభ్రమించడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. 'ఓ వలాహకశకలమా ! నీవు కూడ నావలెఁ బరిభ్రమించుచున్నావదేల ?'2 అని అచేతనమైన మబ్బును పలకరించడం ఆశ్చర్యావహం. అయితే ఆ మబ్బు రహస్యం తనకు తెలుసు. ఇది అతడు కనుగొన్న ప్రకృతిరహస్యమే. వలాహకశకలానికున్న శక్తులను పేర్కొంటూ దాన్ని స్తుతిస్తాడు కవి. అందులో మొదటిది సూర్యుణ్ణికూడా మరుగుపరచగలగడం.

> నీవెకా నిస్తులోన్నిద్ర నియతకాంతి
> రాశివై, భువనత్రయారాధ్యుఁడైన
> భానునంతటి భాస్వత్ప్రభావయుతుని
> మఱుగుపఱతు వనాయాసకరనిరూఢి !

ఈ శక్తి తనకున్నట్లు మబ్బుకు తెలియదట. అదే కవికాశ్చర్యకరం. రెండవది ఎడతెగని వానలు కురిపించగలగడం.

> తీక్ష్ణశక్తులతో సముద్రక్తవిలయకాల ఝుంఝూమరుద్వీచికలు సెలంగ
> భీషణశతఘ్నికావినిర్ఘోషసదృశసింహనాదమొనర్చుచు స్థిరనిరంత
> వారిధారలఁ గురియించు వైభవంబు నీ ప్రభావము కాదె !

---

1 ముద్రణ : ప్రభవ (1928) చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 28–29 పే.

2 ఓయి సంధ్యాసమీరణా ! అనే కృష్ణశాస్త్రిగారి సంబోధన గుర్తుకువస్తుంది.

డాక్టర్ మిరియాల రామకృష్ణ

విమర్శాత్మకంగా వ్యాఖ్యానించిన

# శ్రీశ్రీ కవిత్వం

## వస్తువు - సంవిధానం

*1926-47*





**1980** మహాకవి శ్రీశ్రీ సప్తతిపూర్తి మహోత్సవ సమర్పణ

This Book was first written as a Doctoral Dissertation and was submitted to the Andhra University in 1977 Dec. The Author got his Ph. D. in 1978 and the Best Thesis Medal, thereafter. Subsequently the original Thesis was modified, revised and adapted as a Literary Criticism with Marxist Outlook in 1979-80 and is published in 1980 in connection with SRISRI'S 70th Birthday celebrations

| | |
|---|---|
| Title of the Book in Telugu | SRISRIKAVITWAM : VASTUVU - SAMVIDHANAM 1926 - 47 |
| English meaning of the Title | A Critical Study of SRISRI'S Poetry with special reference to Content & Technique |
| Short name of the Author | MIRIYALA RAMAKRISHNA |
| Full name, & designation | Dr. Miriyala Ramakrishna Rao, M.A. Ph.D.<br>Lecturer in Telugu,<br>P. R. Govt. College, Kakinada |
| Address | 10-4-23 Kakinada - 4 |
| Copyright | □ Dr. M. R. Rao |

□ Text Printing : Sri Durga Press, Kakinada □ Cover Design : Sri BAPU
□ Back Cover Photo : Sri N. Sivannarayana □ Inner Cover Design : Sri ESWAR
□ Blocks : Sri Lakshmi Enterprises □ Cover Printing : Swatantra Art Printers
□ Publisher : M. Lakshmi Devi □ First impression 1000 Copies - 642 Pages
□ Year of Publication : 1980.

PRICE : @ Rs. 60-00

For Copies : Smt. M. LAKSHMI DEVI
10-4-23 KAKINADA-4

## ఆముఖం

డాక్టర్ మిరియాల రామకృష్ణగారు తమ Ph. D. థీసిస్ నిమిత్తం నన్నూ, నా సాహిత్యాన్నీ ఎన్నుకొని, సుమారు అయిదు సంవత్సరాల పాటు అకుంఠితదీక్షతో అవిరళకృషి చేసి, ఆ యజనంలో తమ ఆరోగ్యాన్ని కూడా కోల్పోయి, ఆఖరికి కృతకృత్యు లయారు. అందుకు సంతోషం. ఇప్పుడు అనారోగ్యం నుంచి బాగా కోలుకున్నందుకు మరీసంతోషం.

నా గురించి రాసిన ఈ బృహద్గ్రంథంలో నేనేది రాసినా అనుచితంగానే ఉంటుందని నే ననుకుంటున్నాను. అయినా 1980 లో జరిగిన నా సప్తతిపూర్తి సభలో (అప్పటి కింకా అముద్రితంగా ఉన్న) ఈ గ్రంథాన్ని నేను ఆవిష్కరించడం జరిగింది. ఆ ఒక్క విషయమే ఈ ఆముఖం వ్రాయడానికి ప్రధాన ప్రేరేపణ. అందుతో పాటు ఈ గ్రంథానికి ప్రియమిత్రులు శ్రీ విశ్వేశ్వరరావుగారు కృతి భర్త కావడం ఇంకో added incentive.

ఇకపోతే, కవిగాగాక. ఒకసాహిత్య విమర్శకుడిగా ఈ గ్రంథరచనగురించిగాని, ఇందలి గుణదోషాలను గురించిగాని, ఇప్పుడేమీ రాయదలచుకోవడం లేదు. త్వరలోనే ఇది ముద్రితప్రతిగా వెలువడి విశాలాంధ్రవిశ్వం లోని సహృదయులందరి చేతులనూ అలంకరించబోతోంది.

తుదితీర్పు వారిదే!

—శ్రీశ్రీ

## Impressions

SriSri is the herald of an epoch, protagonist of a school of thought, a torch-bearer of a movement and in short is the Poet of the Age in the Modern Telugu Literary World. It is rather a stupendous task to explore, interpret and assess him in the right perspective. It requires a particular type of mental training, taste and talent on the part of his Critic and Commentator. Curiously enough, Dr. Miriyala Ramakrishna Rao, an adept in the juvenile poetry set himself to the task at my instance and accomplished it quite laudably just as a burning bulb bears testimony to the life of the electric power.

SriSri becomes more alive on account of Sri Mira's endeavour. I congratulate Mira on his performance...

—*Prof. Dr. S. V. JOGARAO*

Research Directcr, Andhra University,
Formerly Professor of Telugu,
University of Leningrad, U. S. S. R.

□

శ్రీశ్రీ కాళిదాసుకు మిరియాల రామకృష్ణ మల్లినాథుడు!

—ఆచార్య డాక్టర్ సి. నారాయణరెడ్డి

ఉస్మానియా యూనివర్సిటీ

# ప్రజలదే ఈ పుస్తకం

**...నా ఆదర్శాలను సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వలజడిగా...**

ఒక శ్రమసంపదను వ్యక్తిపరం చేయడం ఫ్యూడల్, బూర్జువావ్యవస్థల్లో కనిపిస్తుంది. ఒక రచనను ఒకరికే అంకితంచేయడంలోకూడా ఇదే మూలసూత్రం ఉంది. కృతిభర్త, కృతికర్త 'యశసే అర్థకృతే' అనే ప్రయోజనాలను పొందడానికి ఉమ్మడిగా చేసుకున్న వ్యాపారమే అంకితోత్సవం. మరి శ్రీ ఉప్పలపాటి విశ్వేశ్వరరావు (విశ్వశాంతి పిక్చర్స్; మద్రాసు-17) గారికి ఈ గ్రంథాన్ని అంకితంచేయడంకూడా అలాంటిదేనా? కాదు, కానేకాదని చెప్పడానికే ఈ ఉపోద్ఘాతం!

ఈ గ్రంథానికీ విశ్వేశ్వరరావుగారికీ ఏమిటి సంబంధం? శ్రీశ్రీగారు చూపించేదాకా యు. వి.ని నేనుచూడలేదు. శ్రీశ్రీ చెప్పేదాకా యు.వి.ని గురించి తెలియదు. తన కవిత్వంమీద రాసిన ఈ గ్రంథాన్ని తన మిత్రుడు యు.వి.కి అంకితం చేయాలని శ్రీశ్రీ సూచించేదాకా నాకా అభిప్రాయమే లేదు! అశేషాంధ్రప్రజకే అంకితం చేయాలనే మొదటినుంచీ నా అభిప్రాయం. శ్రీశ్రీయే చెప్పారు పీడితప్రజావళికి ఒక సంకేతం యు.వి. అని! అప్పుడే తెలిసింది యు.వి. ఒక వ్యక్తి కాదని! విప్లవానికి అభివ్యక్తి అని! విశ్వశాంతికి ఒక శక్తి అని! శ్రీశ్రీకి ఒక శుక్తి అని! సామ్యవాదావేశం ఆయన సూక్తి అని!

అవును! లేకపోతే యు. వి. తీర్పు, మార్పు, నగ్నసత్యం, హరిశ్చంద్రుడు లాంటి సినిమాలు తీసిఉండేవారుకారు! అవును! కాకపోతే 'we can shoot anybody anywhere to eliminate the evils of Society' అని ఉండేవారు కారు. 'జవానుచేతిలో తుపాకి ఎంతో మాచేతిలో కెమేరా అంత' అనగలిగేవారు కారు! తన సంస్థకు 'విశ్వశాంతి' అనే నామకరణం చేయగలిగేవారు కారు! వేదికనెక్కి నిర్మొహమాటంగా నిష్కపటంగా 'పెద్దమనుషుల'ను వెక్కిరించగలిగేవారు కారు!

శ్రీశ్రీ కవిత్వం తనకు అంకితమవుతున్నదని తెలుసుకుని, ఆ కవిత్వరసానికి 'మిరియాలపొడి' ఎంత అవసరమో 'ఉప్పు'కూడా అంత అవసరమే అనీ ఉప్పుద్వారా అదిమరింత వ్యాప్తిపొందుతుందనీ చమత్కరించగలిగాడంటే యు.వి. 'రసజ్ఞత' తక్కువదా? శ్రీశ్రీ విప్లవచైతన్యాన్ని ప్రజలకు పంచిపెట్టడానికి యు. వి. యే తగిన నాయకుడు. అందుకే యు వి.కి శ్రీశ్రీని అంకితం చేస్తున్నాను. శ్రీశ్రీని ప్రజలకు యు. వి. అంకితం చేస్తున్నారు. ప్రజలదే ఈ పుస్తకం!

త్వం మిరియాల రామకృష్ణ శ్రీశ్రీ కవిత్వం మిరియాల
రామకృష్ణ శ్రీశ్రీ కవిత్వం మిరియాల రామకృష్ణ శ్రీశ్రీ

## శ్రీ యు. విశ్వేశ్వరరావుగారికి

కవిత్వం మిరియాల రామకృష్ణ శ్రీశ్రీ కవిత్వం మిరియాల
రామకృష్ణ శ్రీశ్రీ కవిత్వం మిరియాల రామకృష్ణ శ్రీశ్రీ

# శ్రీశ్రీ కవిత్వం



స్వీకర్త

శ్రీ యు. విశ్వేశ్వరరావు



డాక్టర్ మిరియాల రామకృష్ణ          మహాకవి శ్రీ శ్రీ

No 1 South Bank Rd
Madras - 28

Dear Doctor

Yours patiently
Sri Sri.

తన కవిత్వంపై డాక్టరేటువచ్చిందని వినగానే మిరియాల రామకృష్ణకు
మహాకవి శ్రీశ్రీ రాసిన ఉత్తరం

तीसरा मोड़ THIRD FOLD

FIRST FOLD

इस पत्र के भीतर कुछ न रखिए NO ENCLOSURES ALLOWED

प्रेषक का नाम और पता :— SENDER'S NAME AND ADDRESS :—

శ్రీశ్రీ

Madras - 28

पिन PIN





# స్వీయజీవితరంగం

నేను సైతం కవిత్వానికి గ్రంథమొక్కటి రాసి యిచ్చాను !

□

శ్రీశ్రీగారు మహాప్రస్థానగీతం రాసిన 1934 ఏప్రిల్ 12వ తేదీ నాటికి నేను ఏడురోజుల శిశువుని! 1956లో భాషాప్రవీణ పూర్తయాకా భారతిలో పడిన నా 'శారదాయణం' పద్యాలు నాకు కవిగా గుర్తింపుతెచ్చాయి. 1957లో రాజమండ్రిలో పండితశిక్షణ పొందుతూఉండగా శ్రీశ్రీ అవతారం గేయాన్ని పాఠం చెప్పమంటూ పరీక్షపెట్టారు శ్రీ గొడవర్తి సూర్యనారాయణ గారు. ఆనాడే మొదలయింది నా శ్రీశ్రీ కవిత్వాధ్యయనం! దరిమిలా నా అభ్యుదయదృక్పథానికి శ్రీ సోమసుందర్ దోహదంచేశారు. 1960లో హైదరాబాదులో అ. భా. తె. రచయితల మహాసభలో కృష్ణశాస్త్రి, నారాయణరెడ్డిగార్ల పరిచయస్నేహాభిమానాలు లభించాయి. 1962 జూలైలో ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ఎం. ఏ. అధ్యయనానికి చేరడంలో డా॥ యస్వీ జోగారావు గారి ప్రోత్సాహముంది. 1965లో 'బాలాభిరామం'కు దక్షిణభాషాపుస్తకసంస్థవారి బహుమానం లభించడం, 1965 ఆగస్టు 31న కాకినాడ పి. ఆర్. ప్రభుత్వకళాశాలలో లెక్చరర్‌గా చేరడం, 1966లో బాలాభిరామం ప్రచురణ, తిలక్‌తో పరిచయం ముఖ్యమైన ఘట్టాలు. 1970 మే 8 నుంచి హైదరాబాదు తెలుగు అకాడమీలో మూడేళ్ళ ఉద్యోగం, డిసెంబరు 17న 'రంగురంగుల రత్నదీపాలు'కు భారతప్రభుత్వ బాలసాహిత్యం పోటీలో అవార్డు, 1971 డిసెంబరు 5న ఆ పుస్తకం ప్రచురణ, 1973 మే 23న 'స్నేహదేహళి' గేయసంపుటి ప్రచురణ, డా॥ కె. వి. రావు, డా॥ పి. యన్. ఆర్. అప్పారావుగార్ల ఆత్మీయత చెప్పుకోదగిన మలుపులు. 1974 మార్చిలో శ్రీశ్రీ కవిత్వంమీద పరిశోధనకు శ్రీకారంచుట్టడం, అక్టోబరులో అఖిలభారత తెలుగు బాలల మహోత్సవాలలో పాల్గొనడం, 1975 ఏప్రిల్‌లో ప్రపంచ తెలుగు మహాసభల ఆహ్వానసంఘ సభ్యుణ్ణి కావడం, 1976 ఏప్రిల్ 4న ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ సభ్యుణ్ణి కావడం నా జీవితంలో విశేషాంశాలు. 1977 డిసెంబరు 20న థీసిస్సును సమర్పించడం, 1978 మార్చిలో శ్రీ దాశరథిగారి ఆముఖంతో ముత్యాలగొడుగును ప్రచురించడం, నవంబరు 4న పిహెచ్. డి. పట్టం పొందడం, తెలుగు అకాడమీచే నా సాహిత్యపదకోశం ప్రచురింపబడటం, 1980జనవరిలో థీసిస్సు ముద్రణకు ప్రయత్నాలు ఫలించడం, మార్చి 2న శ్రీశ్రీసప్తతి మహోత్సవాలలో సత్కరింపబడటం, అక్టోబరు 31న సర్ రఘుపతి వేంకటరత్నంనాయుడు పరిశోధన పతకం లభించడం, ఇప్పుడీగ్రంథప్రచురణ—అతిముఖ్యమైన విజయాలు.

— మిరియాల రామకృష్ణ □

# ఏ భాగం ఏ పేజీలో సాధించిన దే పరమార్థం?

□

□

# గ్రంథావతరణం

## ...పురటినొప్పులు కొత్తసృష్టిని స్ఫురింపించాయి !

□

శ్రీశ్రీగారి షష్టిపూర్తికి 1970లో శ్రీశ్రీ సాహిత్యం సంపుటాలు వెలువడిన తరువాత, వాటి ఆధారంతో 1973-77 మధ్య పరిశోధనచేసి ఆంధ్రవిశ్వకళాపరిషత్తునుంచి పిహెచ్. డి. డిగ్రీని పొందిన నేను, ఆ గ్రంథాన్ని మరిన్ని ఉన్నతలక్ష్యాలతో పరిష్కరించి ప్రచురిస్తున్న గ్రంథమే ఈ 'శ్రీశ్రీ కవిత్వం'.

కవిత్వాన్ని భ్రమలనుంచి వాస్తవానికీ రసానందంనుంచి చైతన్యానికీ జాతీయతనుంచి అంతర్జాతీయతకీ సంపన్నవర్గాలనుంచి పీడితవర్గానికీ యథాస్థితివాదంనుంచి విప్లవవాదంలోకీ వ్యష్టినుంచి సమష్టిలోకీ వృత్తంనుంచి గేయంలోకీ గ్రాంథికంనుంచి వ్యావహారికంలోకీ ఫ్యూడల్ బూర్జువావ్యవస్థలనుంచి సామ్యవాదవ్యవస్థలోకీ శ్రీశ్రీ ఎలా కదిలించి, మార్చించాడో ఈ గ్రంథమంతటా నిరూపించబడింది! 20వ శతాబ్దం శ్రీశ్రీ యుగం ఎందుకయిందో సూచింపబడింది! సామ్యవాదవిప్లవం వచ్చేదాకా శ్రీశ్రీయుగమే వర్ధిల్లుతూ ఉంటుందని వ్యక్తంచేయబడింది!

ఈ గ్రంథాన్ని మూడు ప్రధానభాగాలుగా విభజించాను. (1) భావకవిత్వానికి భరతవాక్యం (41పే.) (2) అభినవకవితాప్రస్థానానికి అన్వేషణ (101పే.) (3) అభ్యుదయ కవితాయుగానికి ఆవాహనం (185 పే.) అని. వీటిలో 85 ఖండికలను కాలానుక్రమంలో విశ్లేషించి వాటిలో గల ఒక అనుస్యూతచైతన్యధారను ప్రదర్శించడానికి సంవత్సరానుక్రమంగా 18 అధ్యాయాలు (47-597 పే.) వేరుపరిచాను. కవిగా శ్రీశ్రీ ఎలాప్రభవించిందీ, ఎలాపరివృద్ధిపొందిందీ ఎలామహాకవిగా పరిణతుడయిందీ వేర్వేరుప్రకరణాల్లో (43, 105, 181 పే.) సూచించాను. వస్తుసంవిధానాలను నిర్దిష్టంగా నిర్వచిస్తూ శ్రీశ్రీ కవిత్వంలో ఆరెండింటి నిష్పత్తిని గురించి చర్చించాను (625-642 పే.). ఈ సందర్భంలోనే తెలుగు కవిత్వంలోని వస్తుసంవిధానాలు సామాజికవ్యవస్థలనుబట్టి ఎలామారుతూ పోతున్నాయో వివరించాను.

ప్రభవ, స్వర్గదేవతలు రాసిన శ్రీరంగం శ్రీనివాసరావు దృష్టిలో కవిత్వం వైయక్తికానుభవానికి సంబంధించినదికనుక, భావకవితాధోరణికి చెందుతూ దానినుంచి విడివడటానికి ప్రయత్నిస్తున్నది కనుక ఆ కవిత్వాన్ని భావకవితాసాహిత్యవిమర్శధోరణిలోనే వ్యాఖ్యానించాను. మహాప్రస్థానం రచించిన శ్రీశ్రీ దృష్టిలో కవిత్వం సామాజికవిప్లవప్రయోజనం గలదికనుక

ఆ కవిత్వాన్ని మార్క్సిస్టుసాహిత్యవిమర్శధోరణిలోనే వ్యాఖ్యానించాను. ఈ వ్యాఖ్యానం ఒక్కొక్క ఖండికకూ ప్రత్యేకంగా జరపడం నేనొక 'ప్రయోగం'గా స్వీకరించాను. సమకాలిక సంప్రదాయానికి భిన్నంగా ఉన్నందుకు దీన్ని కొందరు వెక్కిరించవచ్చు. కానీ శ్రీశ్రీ కవిత్వాన్ని ఇలా వ్యాఖ్యానించడంవల్ల ఎక్కువమంది లాభం పొందుతారనీ ప్రాథమికమైన అవగాహనకిది అవరోధాలు లేకుండా చేస్తుందనీ శ్రీశ్రీ క్రమవికాసాన్నీ పరిణామాన్నీ ఇది నిరూపిస్తుందనీ నాకు గట్టిగా అనిపించింది. సాహిత్యవిమర్శ కూడా నిర్దిష్టలక్షణాలకు కట్టువడిపోయినప్పుడు ఎదుగుదల ఉండదు కదా!

నన్నయనుంచి- ఇంకా ముఖ్యంగా గురజాడనుంచి- శ్రీశ్రీ వరకూ సాగిన సామాజిక పరిణామాలూ కవితాపరిణామాలూ ఎలాంటివో తెలుగు కవిత్వాన్ని శ్రీశ్రీ ఏవిధంగా మలుపు తిప్పి ఏ వెలుగులలోకి నడిపించ దలచాడో ఏ ఉద్యమాలను నడిపించాడో ఎలాంటి వ్యుత్పత్తిని చూపించాడో ఆ విషయాలను తులనాత్మకంగా వివరించాను. ఈ అధ్యయనంలో ఏ మహాకవిని గానీ చిన్నబుచ్చాలనే చూపు లేదు. ఇలాంటిచోట- ఒక శాస్త్రకారుడి ధోరణి నాది!

మహాకవి, ప్రజాకవి, భావకవి, విప్లవకవి, విద్వత్కవి, రాజకీయకవి, జాతీయకవి, అంతర్జాతీయకవి, అధివాస్తవిక కవి, పదచిత్రవాద కవి, ప్రతీకవాదకవి, ఇంప్రెషనిస్టు కవి- ఇలా ఏదో ఒకపేరనే శ్రీశ్రీని వ్యవహరించడం సాధ్యం కాదు! ఎందువల్లనంటే ఆయన అన్నీను! అన్నీ ఆయనలో ఉన్నాయి! అనేకత్వంలో ఏకత్వాన్నీ ఏకత్వంలో అనేకత్వాన్నీ సాధించారాయన. తెలుగులో ఒక్క కవిత్వానికే గాక, తాత్త్వికధారకూ భావధారకూ విద్యలకూ సంస్కృతికీ సంప్రదాయానికీ కళలకూ ఛందస్సుకీ రసానికీ భాషకీ అలంకారాలకీ కొత్తమలుపులు, కొత్త సొగసులూ తెచ్చిన మహామనీషి శ్రీశ్రీ! ఈ జాతిజీవితంతోనే ముడివడిన రచనలాయనవి. ఈ విషయాన్ని ఈ గ్రంథంలో స్థాపించాను.

తెలుగుకవిత్వాన్ని సామ్యవాదానికి అంకితంచేయడంలో- భౌతికవాద, హేతువాద, మానవతావాదాలను కలగలపడంలో- అంతర్జాతీయమహాకవులను తెలుగువారికి పరిచయం చేయడంలో పాశ్చాత్య సాహిత్య కళావాదాలను ప్రయోగించడంలో 'మార్క్సిజం-లెనినిజం'ను తెచ్చిపెట్టడంలో మొట్టమొదటివాడు శ్రీశ్రీ ఎలా అయిందీ; వ్యావహారిక భాషామహోద్యమాన్నీ జానపదగీతికాపునరుద్ధరణోద్యమాన్నీ ఛందోవిమోచనోద్యమాన్నీ శ్రీశ్రీ ఎలాసమయానుకూలంగా అందుకుని వాటిని ముందుకు తీసుకుపోయిందీ నిరూపించాను.

రచనాసౌందర్యానికీ చమత్కారానికీ లొంగిపోకుండా స్పష్టతకూ రమ్యతకూ సమప్రాధాన్యంఇస్తూ సులభవ్యావహారికంలో రచించి సామాన్యపాఠకులకు ఈగ్రంథాన్ని ఉద్దేశించాను. ఈనాడు శ్రీశ్రీకవిత్వానికి సంబంధించినంతవరకూ నాల్గురకాల పాఠకులు

కనిపిస్తున్నారు. (1) మార్క్సిజం బాగా తెలిసి, కళాప్రమాణాల గతిక్రమాన్ని అన్వయించుకోలేనివారు. (2) కళాప్రమాణాలను మాత్రం క్షుణ్ణంగా ఎరిగి, మార్క్సిజంను సహించలేనివారు. (3) ఈ రెండింటినీ బాగా ఎరిగి, రెండింటి తుల్యప్రాధాన్యాన్నీ అంగీకరించేవారు. (4) ఈ రెండూ సరిగా తెలియక, శుద్ధకవిత్వం పట్ల బాగా మోజుపడే సామాన్యులూ విద్యార్థులూ యువకవులూను. వీరందరిలో నిజానికి నా గ్రంథానికి పాఠకులు నాల్గవ తరగతికి చెందినవారే! మొదటి రెండు తరగతులవారి ప్రభావం నాలుగో తరగతివారిమీద పడి, ఎటూ కాకుండా పోయే ప్రమాదం ఈనాడు కనిపిస్తోంది. అందువల్ల వీరికి ఓనమాలనుంచీ నేర్పాలి. ఇక మొదటి రెండుతరగతుల వారూ శ్రీశ్రీ కవిత్వాన్ని తామిదివరకు చూసిన ప్రమాణాలకూ నేనిప్పుడు చూపిస్తున్న ప్రమాణాలకూ తేడా ఏమిటో చూసి నాకు చూపిస్తారు. తప్పదు! ఈ సంఘర్షణలో శ్రీశ్రీ కవిత్వంగురించిన నిజాలను నాలుగోతరగతివారు బాగా నేర్చుకుంటారు. ఇక మూడవ తరగతి వారు నా కృషిని గుర్తించడానికి సర్వధా సమర్థులు!

నిజానికి శ్రీశ్రీ కవిత్వంగానీ ఈ నా గ్రంథంగానీ ఈ నాటివర్గసమాజంలో సామాజికాన్యాయాలను అనుభవించే పీడితులకోసమే! అయితే కప్పికప్పి చెప్పడం కవిత్వధర్మం! విప్పివిప్పి చెప్పడమే విమర్శ! ఈ ప్రయత్నంలో మరీ చిన్నవిషయాలను కూడా చెప్పిఉంటే, అవి చెప్పనందువల్లకంటె చెప్పినందువల్లనే మేలు కలుగుతుందని నా నమ్మకం!

చెలంగారు చెప్పినట్లు ఒకప్పుడు "ఉత్తమకవిత్వం ఎప్పుడు ప్రచురితమవుతుందా అని వెయ్యికన్నులతో కనిపెడుతూ" ఉండేవారు! కాని, ఇప్పుడు ఆ ఉత్తమకవిత్వంమీద వ్యాఖ్యానమూ విమర్శా ఎప్పుడు వెలువడుతాయా అని ఎదురుచూసే కాలం వచ్చేసింది! అందుకే ఈ ఆవిష్కారం!

సాహిత్యవిమర్శను ఒక పాఠప్రవచనంగా ఒక తత్త్వంగా ఒక శాస్త్రంగా ఒక కళగా ఒక చరిత్రగా భావిస్తూ రచించిన ఈ గ్రంథాన్ని శ్రీశ్రీగారి జీవితకాలంలోనే వారిచేతనే ఆవిష్కరింపజేసి లోకానికి అందించగల్గడం కృతార్థతగా భావిస్తున్నాను.

కవితాస్వాదంలో రచనాస్వేదంలో రవళించిన
ఈ వేదం! ఈ నాదం! ఈ వాదం!
నవతాశ్రుతిగా కవితాకృతిగా సమతాగతిగా
అందుకోండి! ఇదె నా అభివాదం!

—మిరియాల రామకృష్ణ



# కృతజ్ఞతాభివాదాలు

మనస్సులో ఏదో స్మృతి! తటిన్మణి! మణీఘృణి!

□

నా పరిశోధనకు పర్యవేక్షణ వహించిన ఆచార్య శ్రీ యస్వీ జోగారావుగారికి-
నాకు డిగ్రీనీ విశిష్టపరిశోధనపతకాన్నీ ఇచ్చిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకి-
నా పరిశోధనను ఆమోదిస్తూ 'జర్మన్‌థరోనెస్'ను మెచ్చిన శ్రీశ్రీ గారికి-
నన్నభినందిస్తూ ప్రత్యేకసంపాదకీయం రాసిన స్పందనవాణి పత్రికకు-
నా థీసిస్సును ప్రచురించవలసిందిగా ప్రోత్సహించిన అభిమానులకు-
నా గ్రంథప్రచురణకు హార్దిక అర్థికబలాలు చేకూర్చిన శ్రీ యు. విశ్వేశ్వరరావుగారికి-
శ్రీ అల్లూరి వెంకటరామరాజుగారికి- డా॥ శ్రీమతి పి. చిరంజీవినీకుమారిగారికి-
నా కృషిని ఎంతో ప్రోత్సహించిన శ్రీ రవణం శ్రీరాములుగారికి-
శ్రీ కె. జగ్గయ్యగారికి- ఆచార్య శ్రీ సి. నారాయణరెడ్డిగారికి-
నాకు తమ హార్దికశక్తిని అందించిన శ్రీ సోమసుందర్‌గారికి- డా॥శ్రీ పి.యస్. మూర్తిగారికి-
నాకు సామగ్రినీ సమాచారాన్నీ అందజేసిన శ్రీ కె. వి. రమణారెడ్డిగారికి-
నా గ్రంథప్రచురణకు ఐదువేలరూపాయిల గ్రాంటునిచ్చిన
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వవిద్యాసాంస్కృతిక సంబంధాలశాఖకు-
నా గ్రంథాన్ని శ్రీశ్రీగారిచేతనే ఆవిష్కరింపజేసి, మా ఉభయులనూ సత్కరించిన
శ్రీశ్రీ సప్తతిపూర్తిమహోత్సవసంఘకార్యవర్గానికి-
నా గ్రంథాలంకరణకు తమకళాకౌశలాన్ని అందజేసిన శ్రీ బాపుగారికి-
శ్రీ యన్. శివన్నారాయణగారికి- శ్రీ ఈశ్వర్‌కి-
నా శ్రమను తగ్గించి సహాయపడిన శ్రీ ఎస్. వి. యల్. యన్. వరప్రసాద్‌కు-
శ్రీ ఎల్. కామేశ్వరరావుకు- శ్రీ ఎస్. శేషగిరిరావుకు-
నా గ్రంథాన్ని అందంగా ముద్రించిన
దుర్గాప్రెస్ యజమాని శ్రీ యస్. టి. నాయుడుగారికి-
నా శ్రేయోభిలాషులకు, ఆత్మీయులకు నా కృతజ్ఞతాభివాదాలు!
నాకు అనేకవిధాలుగా తోడ్పడిన నా శ్రీమతి లక్ష్మీదేవికి-
నాకు ఉత్సాహం కల్పించిన మా చిరంజీవులు
శ్రీనివాస, శ్రీకాంత, శ్రీధర్‌లకు నా శుభాశీస్సులు! □

# I/ శ్రీశ్రీ జీవితరేఖాచిత్రం

## '...నేనేయే వీధులలో చంక్రమణం చేశానో?'

అనంతమైన జీవితానుభవం, అపురూపమైన అమాయికత, అపారమైన ప్రపంచపర్యటనం, అచంచలమైన హేతువాదం, అపూర్వమైన వ్యుత్పత్తి, అనన్యసామాన్యమైన ప్రజ్ఞ, అనితర సాధ్యమైన సంవిధానచాతుర్యం, అతులితమైన ఉద్యమస్ఫూర్తి, అంతర్జాతీయమైన సాహితీ చైతన్యం, అజేయమైన మానవతావిశ్వాసం – ఇన్ని లక్షణాలూ మూటగట్టుకున్న ఒకే ఒక్క తెలుగుకవిని పేర్కొనమంటే ఎవరైనా చెప్పగలిగేది రెండే రెండు అక్షరాలు – శ్రీశ్రీ!!

తెలుగుకవి ఇలా రూపొందడానికి ఇరవైయవశతాబ్ది జీవితమే స్థూలకారణం! ఈశతాబ్దిలో శ్రీశ్రీ జీవితం రెండవదశకం (1910) తోపాటు ఆరంభమై విశాఖపట్టణం, మద్రాసువంటి పారిశ్రామికనగరాలతో పెనవేసుకుని కాలంతోపాటు పురోగమిస్తూ సమాజవ్యవస్థలోని విశిష్ట మైన అనుభవాలను పొందుతూనే, సమాజవ్యవస్థలోని అన్యాయాలకు బలి అవుతూ వాటికి ఎదురుతిరుగుతూ ఎదురీదుతూ ముందుకుపోతూ ఉంది. తనదేశంలోని – ఈ ప్రపంచంలోని ఒక సగటుమానవుడి అంతరంగబహిరంగజీవితాలకు ప్రతీకగా మారిన జీవితం శ్రీశ్రీది! కానీ, తన దేశంలోని ఒక అసామాన్యమానవుడి మానసికచైతన్యానికి ప్రతీకగా నిలిచిన జీవితం కూడా శ్రీశ్రీది! ఈ వైరుధ్యంలేని మానవుడికోసమే శ్రీశ్రీ అనే కవి కలలు కంటున్నాడు! జీవితవాస్తవి కతనుంచే శ్రీశ్రీ కవిత్వం ఉద్భవించింది. సమకాలికసమాజజీవితస్వరూపస్వభావాల యొక్క ప్రతిబింబంగానే ఆయన కవిత్వం అవతరిస్తూ ఆ వాస్తవికతను మార్చాలనీ పరిపూర్ణ పు బ్రతుకు వైపుకు నడిపించాలనీ తహతహపడుతోంది. అందుకే ఆ సమాజంలో ఒక భాగమే అయిన శ్రీశ్రీ జీవితం ఎలా నడిచింది? ఎందువల్ల అలాజరిగింది? ఎలానడిచిఉండవలసింది? అనే అంశాలు కుతూహలాన్ని రేకెత్తిస్తాయి. ఆయన కవిత్వంచదివే అసంఖ్యాకజనాలకు ఆయన జీవితగమనం, అందులోని మలుపులు, ఆశలు, నిరాశలు, పతనాలు, అభ్యుదయాలు అన్నీ తెలుసుకోవలసిన అవసరం ఉంది. వీటన్నింటినీ శ్రీశ్రీ తానే స్వయంగా ప్రపంచానికి తెల్పదలచి 1945లో ఆత్మచరిత్రను రాయడానికి శ్రీకారం చుట్టాడు. అదే ఒక ముడిసరుకు కాగలుగుతోంది. ప్రస్తుతగ్రంథంలో 1947 లోగా వచ్చిన శ్రీశ్రీ కవిత్వాన్ని మాత్రమే పరిశీలించడం జరిగినా, శ్రీశ్రీ సజీవకవి కనుక గ్రంథప్రచురణ పూర్తిఅయ్యేదాకా నడిచిన ఆయన జీవితవిశేషాలను

క్రోడీకరించడం అవసరమని కొందరు పెద్దలుచేసిన సూచననుసరించి 1980 చివరిదాకా నడిచిన శ్రీశ్రీ జీవితయాత్రలోని స్మరణీయఘట్టాలను ఎన్నుకుని కాలానుక్రమణికను కూరుస్తున్నాను. (మొదటి నాల్గుదశలను గురించి 1, 20, 50 ప్రకరణాల్లో వివరంగా చెప్పడం జరిగింది.)

### మొదటిదశ 1910-19

1910 జనవరి 2వ తేదీనపుట్టిన శ్రీశ్రీ 1911లోనే తల్లి అప్పన్నకొండను కోల్పోయాడు. 1915లో విశాఖపట్నంలోనే అక్షరాభ్యాసం... 1918లో పొట్టిపొడుగు పాదాలతో కందపద్యం వంటి పద్యం, 'గోకులాయి' అనే డిటెక్టివ్ నవలకూడా రాశాడు. 1919లో 'జగన్మిత్రనాటక సమాజం'లో చేరి బాలపాత్రలు ధరిస్తూ ఉండేవాడు.

### రెండవదశ 1920-29

1920 లో ఎ. వి. యన్. కాలేజిహైస్కూలులో శ్రీశ్రీ విద్యాభ్యాసం ఆరంభమయింది. 'వీరసింహవిజయసింహులు' అనే నవలను రాశాడీయేడే! 1922లో 'సావిత్రీసత్యవంతము' అనే పద్యనాటకం రచించాడు... సుభద్రమ్మ అనబడే సవతితల్లి కూడా 1924లో మరణించింది. 1925 లో శ్రీశ్రీ యస్. యస్. ఎల్. సి. పూర్తిచేశాడు. 'పరిణయరహస్యము' అనే డిటెక్టివ్ నవల రచించాడు. అదే అచ్చయిన మొదటిపుస్తకం. 1925లోనే శ్రీశ్రీకి 'వెంకటరమణమ్మ'తో వివాహమయింది...పురిపండాతో పరిచయం...1926 మే 6వ తేదీన విశాఖలో శ్రీశ్రీ, పురిపండా ప్రభృతులు కలిసి 'కవితాసమితి'ని నెలకొల్పారు. 1928 లో 'ప్రభవ' ప్రచురింపబడింది. ఆ యేడే ఇంటర్మీడియట్ పూర్తి అయింది. మద్రాసు క్రిస్టియన్‌కాలేజీలో బి. ఏ. జూనియర్ తరగతిలో చేరాడు.... కొంపెల్ల జనార్దనరావు పరిచయం మద్రాసులో శ్రీశ్రీకి లభించింది. అంతేకాదు; బసవరాజు, నండూరి, మల్లంపల్లి, వేటూరి, ముద్దుకృష్ణ, మల్లవరపు, గన్నవరపు వంటి సాహిత్యవేత్తలందరినీ కలుసుకున్నాడు...టెన్నిసన్, కీట్సుల కవిత్వాలను తెలిగించాడు...షెర్లాక్‌హోమ్స్ కథల్లో ఒకదాన్ని అనువదించాడు. పిక్‌విక్‌పేపర్సు ఆధారంగా 'సోములు చెప్పిన కథ' అనే రచనను 1929 లో ప్రచురించాడు....పురిపండాద్వారా శ్రీశ్రీకి నజురుల్ ఇస్లాంకవిత్వంతో మైత్రి ఏర్పడింది.

### మూడవదశ 1930-39

1930 లో శ్రీశ్రీ అరవైమూడురోజులు టైఫాయిడ్ జ్వరంతో పీడింపబడ్డాడు....1931లో బి. ఏ. పూర్తిచేసి, ఏవియన్ కాలేజీలో డిమాన్‌స్ట్రేటర్‌గా పనిచేశాడు...1932 లో 'కన్యాశుల్కంలో స్త్రీ పాత్రలు' అనే పరిశీలనాత్మకవ్యాసం రాశాడు....హరీంద్రనాథఛటోపాధ్యాయ (1898) కవితలను తెలిగించాడు....1933 లో బరంపురం అఖిలాంధ్ర కవి పండితసభలకు హాజరయ్యాడు.. రూపర్ట్‌బ్రూక్ (1885-1915), జెన్స్‌బాగెసన్ (1764-1826) అల్లన్‌పో,

బాడ్లెయిర్, స్టిఫెన్‌ఫిలిప్సు వంటి అంతర్జాతీయకవుల్ని చదవడం, వారి కవితల్ని అనువదించడం 1933 లోనే చేశాడు .... ఆంధ్రవిశ్వవిద్యాలయ గ్రంథాలయం, హిందూరీడింగ్‌రూంలలో గ్రంథాలు బాగాచదువుతూ ఉండేవాడు. అబ్బూరి, ద్వారం జగన్నాథరావుగార్ల సన్నిహితుడుగా ఉండేవాడు. An Anthology of World Poetry, Degneration అనే విమర్శగ్రంథము (MAX NORDAU రచన) ఆరోజుల్లోనే శ్రీశ్రీ చదవగలిగాడు... 1934లో కాకినాడలో జరిగిన ఆంధ్రరాష్ట్రీయయువజనసంఘసభకు హాజరై 'మహాప్రస్థానం' గీతాన్ని పాడి వినిపించాడు...త్రివేణి పత్రికలో ఎమ్. చలపతిరావురాసిన Modern Trends అనే వ్యాసంచేత ప్రభావితుడయ్యాడు. W. H. Davies (1871–1940), A.E. (1867–1935) వంటి కవుల కవితలను అనువదించాడు.

1935 లో బాడ్లెయిర్, మపాసా, అల్లన్‌పోలను తన 'ఋషిత్రయం'గా ప్రకటించుకున్నాడు. స్విన్‌బర్న్ కవిత్వంచేత ప్రభావితుడయ్యాడు. గురజాడవారి ముత్యాలసరం విశిష్టతను నిరూపిస్తూ నవ్యులమీద దానిప్రభావాన్ని గురించి పరిశోధించాడు. ట్రాట్‌స్కీ, క్రోపాట్కిన్‌ల ఆలోచనలను అభిమానించసాగాడు.

1936లో 'వీణ' పత్రికలో 'శృతులు' రాశాడు. కాకినాడలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్ సభలకు హాజరయ్యాడు. 1937 లో చెలంగారితో పరిచయం సంపాదించుకున్నాడు. లండన్ అభ్యుదయరచయితల మానిఫెస్టో చదివి ప్రభావితుడయ్యాడు. అలగ్జాండర్ బ్లాక్ గీతాన్ని అనువదించాడు (వికిరనృత్యం). కొంపెల్ల జనార్దనరావువంటి మిత్రుడ్ని కోల్పోయాడు. మల్లవరపుగీతాలపై సమాలోచన రాశాడు. మహాప్రస్థానంలో అతిముఖ్యమైన గీతాలెన్నో 1937 లోనే రచించాడు...

1938లో మద్రాసులో ఆంధ్రప్రభ ఉపసంపాదకుడుగా నియమితుడయ్యాడు. అధివాస్తవికధృక్పథం అలవడింది. ఫ్రాయిడ్ రచనలు మధించాడు. 1939లో 'నేటితెలుగుకవిత : కొత్తపోకడలు' అనే విశిష్టవ్యాసం, పఠాభి ఫిడేలురాగాలడజన్‌కు 'ఇంట్రో' వంటి విశిష్టపీఠిక, Emile Verhaeren (1855-1917) రాసిన Les Pauvres అనే గీతానికి విశిష్టమైన అనువాదం (పేదలు), తెలుగుకథానిక గురించి విశ్లేషణాత్మకమైన విశిష్టమైన ఆంగ్లవ్యాసం రచించాడు. Regis Michaud రాసిన Modern Thought and Literature in France అనే విశిష్టగ్రంథాన్ని శ్రీశ్రీ 1939 లోనే చదివి ప్రభావితుడయ్యాడు.

## నాల్గవదశ 1940-49

'ప్రతిభ' సంపాదకవర్గంలో సభ్యుడయ్యాడు. 1942లో ఆలిండియా రేడియోలో ఉద్యోగిగా నియమితుడయ్యాడు. 1943 లో లక్నోలో I. A. M. C. Training & Depot Centre లో V.C.O. Laboratory Assistant గా నియమితుడై ఏడునెలల 'స్కంధావారజీవితం' గడిపాడు. ఆరోజుల్లోనే

'మలేరియా' సోకింది...లక్నో యూనివర్సిటీ ఆంధ్రసంఘంవారి సభలో ఉపన్యసించాడు .... 1944లో విక్టర్‌సాడన్ ప్రిట్‌చెట్ (1900) కథల్నీ విలియంసారోయాన్ (1908) కథల్నీ అనువదించాడు... అబ్బూరివారు పెట్టిన 'నటాలి' అనే నాటకసమాజంలో పనిచేశాడు...'ప్రజా నాట్యమండలి' ప్రదర్శనాల పట్ల అభిమానం వ్యక్తంచేశాడు.

1945లో తండ్రి వెంకటరమణయ్య కాలధర్మంచెందడంతో శ్రీశ్రీలో మానసికపరిణామం వచ్చింది. అధివాస్తవికతమీద నిష్ఠ ఎక్కువయింది. ఆంద్రే బ్రెతన్ రాసిన Beauty will be convulsive అనే సర్రియలిస్టుమానిఫెస్టోనీ ఆంద్రే బ్రెతన్, పాల్ ఎలార్డ్‌లు రచించిన The Immaculate Conception అనే అధివాస్తవిక రచననీ అనువదించాడు (సంక్షుబ్ధసౌందర్యం, అలవాటు బలిమి). సెప్టెంబరు 29న బెజవాడలో అధివాస్తవికతమీద ప్రసంగించాడు. 1945లోనే మపాసా కథలననువదించాడు. 'అనంతం' రచనను ఆరంభించాడు. దాలీచిత్రాలు గురించి ప్రశంసావ్యాసం రాశాడు. చింతాదీక్షితులు గారికి సన్మానపత్రం రాశాడు. 'ఆనందవాణి'లో 'వారంవారం' రాయనారంభించాడు. నవంబరు 3 న అభ్యుదయరచయితల సంఘం మద్రాసు శాఖకూ డిసెంబరు 31 న రాజమండ్రిలో ఆంధ్రఅభ్యుదయరచయితలసంఘం తృతీయమహాసభకూ ప్రారంభోపన్యాసాలు చేశాడు.

1946 లో 'వారంవారం' పుస్తకంగా ప్రచురింపబడింది... నిజాంనవాబుగారి రిఫార్మ్ సెక్రెటేరియట్‌లో ఉద్యోగిగా కుదురుకున్నాడు... సిరిసిరిమువ్వశతకం రచించాడు .... రడ్‌యార్డ్‌కిప్లింగ్ రచనను అనువదించాడు. 46-49 మధ్య ఆనందవాణి వగైరా పత్రికల్లో పని చేశాడు. 1947 లో మద్రాసులో రాయపేటలో మకాం ఏర్పరుచుకున్నాడు. చెహోవ్ (1860-1904) రాసిన The Cherry Orchard ను 'సంపెంగతోట'గా అనువదించాడు. పురిపండావారి 'సౌదామిని'ని ఆంగ్లీకరించాడు. ఫ్రాంజ్‌కాఫ్కా (1883-1924) రచనలు అనువదించాడు (వింతజంతువు). జేమ్సుజాయిస్ చైతన్యస్రవంతిని గురించి వ్యాసం రాశాడు. 'అదర్శజీవులు' అనే రేడియోగొలుసు కట్టు నవలలో 'సుదర్శనం; లోకం' అనే భాగం రచించాడు....తన కవిత్వం గురించి తనే వ్యాఖ్యానించుకోసాగాడు...గుర్రపుపందేలలో పాల్గొనసాగాడు.

1948 లో చలనచిత్రరంగంలోకి ప్రవేశించాడు... 'సామ్యవాదమహాభారతం'లో 'ఆనుశాసనికం' రాశాడు. కాంగ్రెసును కవిత్వంలో విమర్శింపనారంభించాడు...ఆరుద్రతో కలిసి రచనలు చేయడం మొదలుపెట్టాడు...టాగోరుమీద ఎల్లెర్జీని ప్రకటించాడు...విశాఖపట్నంమీద మహాకావ్యం రాయాలని సంకల్పించాడు. 1949లో తిరుచునాపల్లి రేడియోనుంచి తెలుగు సాహిత్యంమీద ఆంగ్లంలో ప్రసంగించాడు. ఆరుద్రత్వమేవాఽహమ్‌కు' 'లఘుటిప్పణి' రాశాడు. ...నీరాజొర్‌నందా అనే హిందీచిత్రానికి 'ఆహుతి' అనే పేర డబ్బింగ్ చేశాడు...ఒక బంధువుల అమ్మాయిని పెంచుకున్నాడు.

ఈ నాలుగోదశలో శ్రీశ్రీ ఎందరో అంతర్జాతీయకవుల కవితల్ని తెలిగించాడు పాల్ఎలార్డ్, జేమ్సుజాయిస్, ఆంద్రేబ్రితన్, బాద్లెయిర్, ఎఫ్. విలన్, ఎపోలినెయిర్, ఆడెన్, డిలాన్థామస్, ఒడిస్యూస్ఎలిటస్, హెన్రిమిషా, సాల్వెడార్డాలీ, లూయీమెక్నీస్, క్రిష్టఫర్లోగ్ మొ॥

## ఐదవదశ 1950-59

1950 లో నళినీకుమార్ స్నేహసాహచర్యాలు లభించాయి శ్రీశ్రీకి. మహాప్రస్థానం మొదలైన గీతాలు పుస్తకంగా ముద్రింపబడింది... హెచ్. యం. రెడ్డిగారి రోహిణీపిక్చర్సులో మాటలు, పాటలు రాయడానికి కుదురుకున్నాడు... హెలెన్గార్డెనర్రాసిన ఈలియట్ శిల్పం అనే గ్రంథాన్ని విమర్శించాడు...'ఆనందవాణి'లో తాడూ-బొంగరం' శీర్షికను నిర్వహించాడు.

1951 లో 'నిర్దోషి' చిత్రానికి మాటలు, పాటలు రాశాడు...భారతీయచలనచిత్రోత్స వానికి జడ్జీగా బొంబాయికి విమానంలో తొలిప్రయాణం చేశాడు. చేతనానంద్, జైమినీదివాన్, శాంతారాం ప్రభృతులను కలుసుకున్నాడు. విభిన్నభారతీయ భాషాచిత్రాలు చూశాడు... 1952లో ఏలూరులో ఆంధ్రరాష్ట్ర శాంతి సాంస్కృతిక మహాసభ (ఆగస్టు 30)కు అధ్యక్షోప న్యాసం చేశాడు. కారల్ చాపెక్ (1890-1938) రచించిన The Mother నాటకాన్ని అనువ దించాడు (అమ్మా!)...మరదలుపెళ్ళి చిత్రానికి మాటలు, పాటలు రాశాడు. 1953లో 'నాగొడవ' ఆవిష్కరణసభలో ఆలంపురంలో ప్రసంగించాడు శ్రీశ్రీ. హైదరాబాదులో తెలంగాణారచయితల సంఘం ప్రథమవార్షికోత్సవానికి అధ్యక్షోపన్యాసం చేశాడు...'ప్రాస క్రీడలు'...'సదసత్సంశయం' రచించనారంభించాడు.....ఎం. ఎల్. సి.గా ఎన్నిక అయ్యాడు... అక్కాచెల్లెళ్ళు, పెంపుడుకొడుకు, కన్నతల్లి, ప్రపంచం వంటి సినిమాలకు పాటలు రాశాడు. 1954 లో ఆరుద్ర, వరదలతో కలిసి 'మేమే' ఆశువుగా రచించాడు శ్రీశ్రీ...హైదరాబాద్లో విశాలాంధ్రసదస్సుకు అధ్యక్షోపన్యాసం చేశాడు... హెల్సెంకీలో జరిగిన ప్రపంచశాంతి మహా సభ (నవంబరు)కు ప్రతినిధిగా వెళ్ళాడు. అక్కడనుంచి రష్యా, పారిస్, లండన్లు వెళ్ళివచ్చాడు. ....'సామాజిక కవిత' అనే అంశంమీద రేడియో గోష్ఠిలో పాల్గొన్నాడు....'ఆరంభంపెద్ద అవస్థ' అనే రేడియో ప్రసంగం చేశాడు.

1955లో ఆంధ్రపత్రికలో తన మీద పెద్ద గాలిదుమారం రేగినప్పుడు తట్టుకున్నాడు. కానీ ఫిబ్రవరి-మార్చినెలల్లో ఎన్నికల ప్రచారంలో తిరుగుతూ మతి చలనానికి గురి అయ్యాడు- (కొన్ని అవాంఛనీయసంఘటనలవల్ల) .... విశాలాంధ్రలో 'ప్రజ' అనే శీర్షికను నిర్వహిం చాడు ... అభ్యుదయరచయితల సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. విజయవాడలో ఆంధ్ర అభ్యుదయరచయితల ఐదవమహాసభకు అధ్యక్షోపన్యాసం చేశాడు. 1956లో రాజమండ్రిలో విశాలాంధ్రసంస్కృతీసభల సాహిత్యగోష్ఠిలో - కాకినాడ ఆంధ్రాపాలిటెక్నిక్ కాలేజీలో-

ఢిల్లీలో ఆఫ్రోఆసియన్ రచయితల మహాసభలో ప్రసంగాలు చేశాడు ...'కవితా ప్రయోజనం' మీద రేడియోగోష్ఠిలో పాల్గొన్నాడు. సాహిత్యఅకాడమీ సభ్యుడయ్యాడు.. 'Three Cheers for Man', 'చరమరాత్రి' ప్రచురితమయ్యాయి. ఉపద్రష్ట సరోజతో ద్వితీయవివాహం చేసుకున్నాడు. 1958 లో 'ముత్యాలసరాలు'కు పీఠిక రాశాడు. 1959లో 'అంగారవల్లరి'కి పీఠిక రాశాడు....'సజీవరచన' మీద రేడియోగోష్ఠిలో పాల్గొన్నాడు....'గురజాడ' వ్యాససంపుటి ప్రచురితమయింది...మాంగల్యబలం, గాంధారీగర్వభంగం సినిమాలకు పాటలు రాశాడు. నాన్ సొల్లుం రహస్యం అనే అరవసినిమాకు డబ్బింగ్ 'చెవిలో రహస్యం' చేశాడు. పెట్టుబడికూడా పెట్టాడు .. కూతురు పుట్టింది.

## ఆరవదశ 1960-69

1960లో '20వ శతాబ్దపు తెలుగుసాహిత్యం' అనే వ్యాసం రాశాడు. 1961 లో విజయవాడలో సి. పి. ఐ. ఆరవసమావేశపు సాంస్కృతికోత్సవాలకు అధ్యక్షోపన్యాసం చేశాడు. (ఏప్రిల్ 7)...మద్రాసులో ఆంధ్రమహాసభవారు చేసిన విశ్వనాథసన్మానసభలో ప్రసంగించాడు (అక్టోబరు 15)....కాకినాడలో ఒక కాంగ్రెసువ్యక్తి చేసిన అత్యాచారానికి గురి అయ్యాడు... వెలుగునీడలు, ఇంటికి దీపం ఇల్లాలే, పెండ్లిపిలుపు, బావామరదళ్ళు, భార్యాభర్తలు మొదలైన సినిమాలకు పాటలు రాశాడు.....1962 లో 'ఆరుసారాకథలు'కు మొదటిమాట రాశాడు.... పదండి ముందుకు, ఆరాధన, కులగోత్రాలు మొదలైన సినిమాలకు పాటలు రాశాడు ... కుమారుడు జన్మించాడు....1963 లో హైదరాబాదులో విద్యార్థియూనియన్ నాలుగోవార్షికోత్సవానికి ప్రారంభోపన్యాసం చేశాడు ...పునర్జన్మ సినిమాకు పాటలు రాశాడు.

1964 లో జనశక్తి పత్రికకు ఇంటర్వ్యూ ఇచ్చాడు .... విజయవాడలో ఆంధ్రరాష్ట్ర విద్యార్థిఫెడరేషన్ 29 మహాసభకు ప్రారంభోపన్యాసం (జనవరి 18) చేశాడు ... 'కూనలమ్మపదాలు'కు ప్రశంసరాశాడు ... 'లిమబుక్కులు' రాయనారంభించాడు. 'మూడుయాభయిలు' ప్రచురింపబడింది ... బొబ్బిలియుద్ధం, రాముడు-భీముడు, డాక్టర్ చక్రవర్తి, నర్తనశాల మొదలైన సినిమాలకు పాటలు రాశాడు. 1965 లో ఒంగోలుతాలూకా యువజనమహాసభకు ... విజయవాడలో పౌరహక్కుల మహాసభకు ప్రారంభోపన్యాసాలు చేశాడు .. దేవత సినిమాకు పాటలు రాశాడు. 1966 లో హైదరాబాదు హిందీప్రచారసభవారు శ్రీశ్రీకి 'సాహిత్యాచార్య' బిరుదం ఇచ్చారు ... ఏలూరులో ఆంధ్రప్రదేశ్ యువజనమహాసభలో ఉపన్యసించాడు... 'ఖడ్గసృష్టి' ప్రచురింపబడింది ... సోవియట్‌భూమి అవార్డు లభించింది .... విజయవాడలో ఇస్కస్ వారిచే సన్మానింపబడ్డాడు (డిసెంబరు 11). 1967లో సోవియట్‌రష్యాకు రెండవసారి పయనమయ్యాడు. 'సోవియట్ లిటరేచర్' పత్రికలో ప్రత్యేకంగా ప్రశంసింపబడ్డాడు. 1968లో 'శంఖారావం'కు పీఠిక రాశాడు.... నెల్లూరు వి. ఆర్. కాలేజిలో ఉపన్యసించాడు...1969లో

నెల్లూరులో తిక్కనగురించి ప్రసంగించాడు...జనశక్తి పత్రికాప్రతినిధికి ఇంటర్వ్యూ ఇచ్చాడు... ప్రగతి వారపత్రికలో 'జాబు-జవాబు' శీర్షికనిర్వహించాడు... ప్రజారథం పత్రికకు ఇంటర్వ్యూ ఇచ్చాడు... అనంతపురం నాటకోత్సవాలలో ప్రసంగించాడు... 'సృజన' పత్రికకు ఇంటర్వ్యూ ఇచ్చాడు(నవంబరు)... 'నవత' పత్రికకు గౌరవసంపాదకత్వం స్వీకరించాడు...'దిగంబరకవిత్వం' ఆంగ్లీకరించసాగాడు... Beginning of the End అనే గ్రంథాన్ని 'రెక్కవిప్పిన రివల్యూషన్'గా తెలిగించాడు... పంతాలు-పట్టింపులు, మనుషులు మారాలి మొదలైన సినిమాలకు పాటలు రాశాడు.

పై ఐదు ఆరుదశల్లో వాల్ట్ విట్‌మన్, ఈ. ఈ. కమ్మింగ్స్, మయకోవస్కీ, పాబ్లోనెరూడా, హరీంద్రనాథఛటోపాధ్యాయ, పుష్కిన్, నికోలాయ్ సెక్రసోవ్, అలగ్జాండర్ ష్లెమిన్, లారిసా వాసిల్యేవా, కోన్‌స్టాంతిన్ వాన్‌షెంకిన్, ద్విత్రికావలియోవ్, ఆంద్రేవోజ్నెసెన్‌స్కీ మొదలైన వారి కవితల్ని తెలిగించాడు శ్రీశ్రీ.

## ఏడవదశ 1970-79

1970 లో 'శ్రీశ్రీసాహిత్యం' సంపుటాలు ప్రచురింపబడ్డాయి. మయకోవస్కీ 'లెనిన్' కావ్యాన్ని తెలిగించాడు శ్రీశ్రీ. మద్రాసులో సోవియట్ కాన్సల్ జనరల్ సమాచారశాఖ వారిచే సత్కరింపబడ్డాడు. సాహిత్యఅకాడమి విశిష్టసభ్యత్వం లభించింది. విశాఖలో షష్టిపూర్తి మహోత్సవాలు (ఫిబ్రవరి) జరిగాయి. శ్రీశ్రీ సన్మానసంచిక, సృజన, కళాకేళి ప్రత్యేకసంచికలు ప్రచురింపబడ్డాయి. విజయనగరం, శ్రీకాకుళం, నూజివీడు, చిత్తూరు, కర్నూలు మొదలైనచోట్ల సత్కరింపబడ్డాడు...నెల్లూరులో కవిత్రయజయంతిలో ప్రసంగించాడు ... చలంగారిని కలుసుకున్నాడు (మే24)... సెవెన్‌స్టార్స్ సిండికేటువారి సన్మానాన్ని తిరస్కరించి, 'విరసం' అవతరణకు దోహదంచేసి విరసం అధ్యక్షుడయ్యాడు (జూలై 4)...సాయుధవిప్లవాన్ని సమర్థిస్తూ 'ఝంఝ' గీతం రచించాడు (ఆగస్టు16) .. శ్రీకాకుళం నక్సలైటు ఉద్యమాన్ని ప్రోత్సహిస్తూ 'నిన్నటి జట్కావాలా' గీతం రాశాడు (సెప్టెంబరు 12)... ఖమ్మంలో విరసం ప్రారంభోత్సవసదస్సుకు అధ్యక్షతవహించాడు (అక్టోబరు 8, 9)....సాహిత్యఅకాడమీ; కవితాసమితి సభ్యత్వాలకు రాజీనామాలు ప్రకటించాడు...

1971 లో 'తుదిపయనం: తొలివిజయం' అనే విప్లవగీతం రాశాడు (మే 14) .. విరసం రెండవమహాసభలకు అధ్యక్షోపన్యాసం చేశాడు (నవంబరు)... 1972 లో విరసం మూడవమహాసభలకు అధ్యక్షోపన్యాసంచేశాడు (డిసెంబరు). 1973లో కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు లభించింది...'మరోప్రస్థానం' గీతాన్ని రచించాడు (డిసెంబరు)...1974లో విరసం రచయితల నిర్బంధాన్ని నిరసించాడు...

1975లో విశ్వనాథతో కలిసి ప్రపంచ తెలుగు మహాసభల బహిష్కరణకు ప్రకటన ఇచ్చాడు (మార్చి 3) ...ఆ మహాసభల ఆహ్వానాన్ని తిరస్కరిస్తూ 'రాక్షసఉగాది' గీతాన్ని ముఖ్యమంత్రికి పంపాడు (ఏప్రిల్). ఊరేగింపుజరుపుతూ కరపత్రాలు పంచుతూ అరెస్టయ్యాడు, ... విడుదలపొందాడు (ఏప్రిల్ 13)... 'ప్రజాతంత్ర'లో 'అనంతం' రాయనారంభించాడు.... 'తుంగతుర్తి'లో రైతుకూలీ సంఘంవారి బహిరంగసభలో ఉపన్యసించాడు...

1976లో చైనాకు బయలుదేరాడు (డిసెంబరు 4) .. చైనా సందర్శించి ఇండియాకు తిరిగి వచ్చాడు (డిసెంబరు 28)... 1977లో ఎమర్జెన్సీని సమర్థించినందుకు విరసం అధ్యక్షపదవి నుంచి తొలగింపబడ్డాడు. (జూన్ 10) ... జ్యోతి మాసపత్రికలో 'నవరసాలశ్రీశ్రీ' రాయనారంభించాడు... 1978లో కాకినాడ చైనా భారతమిత్రమండలి సభలో ప్రసంగించాడు... విరసంనుంచి సస్పెండ్ చేయబడ్డాడు (జూన్ 14).... ఢిల్లీలో కన్నడ సాహిత్యపరిషత్తుచే సత్కరింపబడ్డాడు.... జవహర్లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో ప్రసంగించాడు ...

1979లో బెంగుళూరులో బండాయసాహిత్యసమ్మేళనప్రారంభోపన్యాసం చేశాడు (మార్చి).... వరంగల్లులో చలం సంస్మరణసభలో ప్రసంగించాడు (మే 6) ... విరసం సస్పెన్షన్ రద్దు (సెప్టెంబరు 29).... మద్రాసులో రాజాలక్ష్మీ ఫౌండేషన్‌వారి పదివేల రూపాయిల అవార్డును అందుకున్నాడు(నవంబరు 19)....శ్రీశ్రీ సప్తతిపూర్తిమహోత్సవసంచికకు ఇంటర్వ్యూ ఇచ్చాడు (డిసెంబరు 5)....

ఈ దశలో సిజారెవెలాజో, నాజింహిక్మత్, పాబ్లోనెరూడా మొదలైన కవుల కవితల్ని శ్రీశ్రీ తెలిగించాడు... అల్లూరి సీతారామరాజు, భూమికోసం, యమగోల, ఎదురీత, నిశ్శబ్దం మొదలైన సినిమాలకు పాటలు రాశాడు... 'స్వాతి' లో 'అనంతం' పునఃప్రారంభించాడు.

ఎనిమిదవదశ 1980–

జనవరి నిరీశ్వరాశ్రమంలో ప్రసంగించాడు... కృష్ణశాస్త్రిస్మృతికి సంతాపం ప్రకటించాడు... కాకినాడలో సప్తతిపూర్తి సత్కారాలు పొందాడు...థీసిస్సును ఆవిష్కరించాడు (మార్చి 2)... 'మరోప్రస్థానం' ప్రచురింపబడింది (మే)... విరసం సభ్యత్వం రద్దుచేయబడింది (జూన్)... విరసంకు రాజీనామా ఇచ్చాడు (జూలై 3)... విరసంకు రాజీనామా ఉపసంహరించుకున్నాడు (జూలై 26)... పురిపండాతో కలిసి లండన్ వెళ్ళాడు (సెప్టెంబరు) .. లండన్ కామన్వెల్తు ఇన్‌స్టిట్యూట్‌లో మహాకవి జార్జిబార్కర్ అధ్యక్షతను సత్కరింపబడ్డాడు (డిసెంబరు 12)... (ఇది అనంతం)

చిరునామా : శ్రీశ్రీ 11 కెనాల్ బాంక్‌రోడ్, మద్రాసు-28.



# II/పరిశోధనకు పరికరాలు

లక్షనక్షత్రాల మాటలు! కోటిజలపాతాల పాటలు!

జేమ్స్‌జాయిస్ గురించి రాస్తూ శ్రీశ్రీ అననే అన్నాడు— "సాహిత్యశిల్పపుమెలకువలన్నీ తెలిసినవాడు, సంప్రదాయాలను జాగ్రత్తగా గమనించినవాడు, శబ్దశక్తిని సగౌరవంగా ఆరాధించేవాడు" అంటూ! ఈ విశేషణాలు శ్రీశ్రీకి కూడా అక్షరాక్షరమూ అనువర్తించేవే! అంతే కాదు; తానుంటున్న సమాజవ్యవస్థకు ఏది చెప్పాలో ఎరిగినవాడు, తన రచనలు ఎందుకోసమో నిర్ణయించుకున్నవాడు, తన సాహిత్యం ఏ వర్గంకోసమో ఎంచుకున్నవాడు, సాహిత్యపు అంతర్జాతీయస్థాయిని గుర్తించినవాడు కూడా శ్రీశ్రీ !!

సంపధానాలకోసం శ్రీశ్రీ గవేషణ నన్నయగారి అవిరళజపహోమతత్పరత్వం వంటిది! తిక్కనగారి యజ్ఞంవంటిది! 'చిరదీక్షాశిక్షాతపస్సమీక్షణ' కదా అది! అంతర్జాతీయ సాహిత్యోద్యమాల అధ్యయనం, అంతర్జాతీయ కవితాఖండాల అనువాదం మాత్రమేగాక ఆర్థికరాజకీయ సామాజిక సాంస్కృతిక తత్త్వశాస్త్రాల మీమాంస, సమకాలికసమాజవివేచన కూడా శ్రీశ్రీ వ్యుత్పత్తినీ ఉత్పాదకశక్తినీ బాగా మెరుగుపరిచాయి.

కవితావిశ్వరూప సందర్శనం కోసం తాను శోధన, సాధన సాగించానని శ్రీశ్రీ స్వయంగా చెప్పుకున్నాడు. శోధన వ్యుత్పత్తినీ సాధన అభ్యాసాన్నీ సానపెట్టాయి. ఒక భావకవి కవిత్వం మీద పరిశోధించడానికి అనుభవం, స్పందనం అతిముఖ్యం. కానీ తాను కవిత్వంరాయడానికే ఏకవి పరిశోధనలు సాగించాడో ఆ కవి కవిత్వంగురించి వ్యాఖ్యానించడానికి కేవలం అనుభవం, స్పందనం సరిపోవు. వాటితో పాటు తీవ్రమైన పరిశోధన, బౌద్ధికవ్యాయామం కూడా అవసరమవుతాయి. ఇందువల్లనే శ్రీశ్రీ కవిత్వంమీది పరిశోధన "చీకట్లో చిందులాట" కాజాలదు.

శ్రీశ్రీ కవిత్వం మీది పరిశోధనలో రెండు అంశాలున్నాయి. మొదటిది వస్తువు; రెండవది సంవిధానం. ఈ రెండింటినీ సప్రమాణంగా సాగించకుంటే పరిశోధన ఉపరిశోధనగా మిగిలిపోతుంది. వస్తువును విశ్లేషించడానికి మార్క్సిజం, సంవిధానాన్ని విశ్లేషించడానికి సాహిత్య సంప్రదాయ, ప్రయోగాలు చదవాలి. ఈ చదువుకు కావలసిన పరికరాలే విశ్వసాహిత్యపు భాండాగారంలోనుంచి ఎంచుకున్న గ్రంథజాలం!

ఔను! ఈ పరిశోధనకు నేనుపయోగించుకున్న పరికరాల్లో ఎంపిక చేయబడినవి మాత్రమే ఈ అధ్యాయంలో ఉదాహరించబడుతున్న గ్రంథజాలం! శ్రీశ్రీ కవిత్వంమీద ఇంత భాష్యం రాయడానికి ఏ గ్రంథాలు, సర్వస్వాలు, నిఘంటువులు, శాస్త్రాలు, మీమాంసలు, సంహితలు, వ్యాసాలు, పత్రికలు, లేఖలు, గోష్ఠులు, ఉపన్యాసాలు వగైరా వగైరా ఆధారాలుగా మార్గదర్శకాలుగా ప్రమాణాలుగా ఆకరాలుగా ముడిపదార్థాలుగా వెలుతురు చూపిస్తూ ఉపయోగపడ్డాయో నిరంతరం నేను వేటినీ సంప్రదించానో వాటిలో ముఖ్యమైనవే ఎంచుకుని, ఆయా గ్రంథకర్తలకూ, రచయితలకు, సంపాదకులకు, ప్రచురణకర్తలకు నమస్కరిస్తూ ఇక్కడ పేర్కొంటున్నాను. నాకు ఈ గ్రంథాలను అందుబాటులోకి తెచ్చిన మిత్రులకూ, గ్రంథాలయాలకూ కృతజ్ఞతలు తెల్పుకుంటూ వీటిని భావిపరిశోధకుల, పరిశీలకుల, పాఠకుల సౌకర్యార్థం క్రింది విధంగా విశ్లేషిస్తున్నాను:

### (A) Companions, Dictionaries & Encyclopedias

1. Floren Elliott: A Dictionary of Politics 2. Foreman: Collins National Encyclopedia 3. Harvey & Hessel Tine : The Oxford Companion to French Literature 4. Hornstein Percy Brown : The Reader's Companion to World Literature (R. C. W. L.) 5. Joseph T. Shipley : Dictionary of World Literary Terms 6. Moore : A Dictionary of Geography 7. Palmer : A Dictionary of Modern History 8. Ronald Ridout & Clifford Nitting : The Facts of English 9. Rosenthal & Yudin : A Dictonary of Philosophy 10. The Columbia Encyclopedia 11. The Random House Dictionary of English.

### (B) Biography, History & Politics

12. Alexeyev, Kartsov & Troitskv : A Short History of the U. S. S. R. 13 Alice Magenis & John Conrad Appel : A History of the World 14. Appadorai : The Substance of Politics 15. Kapur : Principles of Political Science 16. Lenin : The State 17. Loon : The Story of Mankind 18. Manfred : A Story History of the World 19. Nathanial Platt : Our World through Ages 20 Susobhan Sarkar : A Marxian Glimpse of History 21. Wells : A Short History of the World.

### (C) Socio-political Philosophy, Materialism & Psychology

22. Brill : Basic Principles of Psychoanalysis 23. Engels : (a) The Part played by Labour in the transition from Ape to Man (b) Socialism : Utopian and Scientific 24. Ivochuk: Philosophical Traditions Today 25. Lenin : (a) On Socialist Ideology and Culture (b) Meterialism and Empirio Criticism 26. Lenina Ilitskaya : ABC of Dialectical and Historical Materialism 27. Marx & Engels : Manifesto of the Communist parry 28. Maurice Corn Forth : Dialectical Materialism

### (D) Literary Ciiticism, Art, Rhetoric, Aesthetics & History of Literature

29. Abercrombe : Principles of Literary Criticism 30 Anthony X. Soares : An Introduction to the Study of Literature 31. Arthur Pollard : Satire 32. Basil Worsfold : Judgement in Literature 33. Charles Chadwick : Symbolism 34. Charlton M. Lewis : The

Principles of English Verse 35. Christopher Caudwell . Illusion and Reality 36. Classen : Lectures on Style and Composition 37. Coombes : Literature and Criticism 38. Cunningham: The Problem of Style 39. Damian Grant : Realism 40 David Daiches : Poetry and the Modern World 41. Day Lewis : Poetry for you 42. Denis Saurat : Modern French Literature 43. Edward Thomas: A. C. Swinburne – A Critical Study. 44. Eliot : The Sacred Wood 45, Elizebeth Drew : Poetry : A modern guide to its understanding and enjoyment 46. Emile Legouis : A History of English Literature 47. George A. C. : Critics and Criticism 48. Wilkinson : How to read Literature 49. George Reavey : Soviet Literature To day (1946) 50 George Thomson : Marxism and Poetry 51. Herford : National and International ideals in the English poets 52. Howard Fast : Literature and Reality 53. Hudson : (a) An Introduction to the Study of Literature (b) An Outline History of English Literature 54. Jagdish Shivpuri : Six Modern English Poets 55. James Reaves : Understanding Poetry 56. John Berger : The Success and Failure of Picasso 57. John Heath–Stubbs : The Verse Satire 58. Kulikova & Zis : Marxist Leninist Aesthetics and Life 59. Laura Riding & Robert Graves : A Survey of Modernist Poetry 60. Laurence Binion : Tradition and Reaction in Modern Poetry. 61. Leavis : New Bearings in English Poetry 62. Lenin : On Literature and Art 63. Leonard Unger : Seven Modern American Poets 64. Lunacharsky : On Literature and Art. 65. Marguerite Wilkinson : New Voices 66. Maurice Nadeau : The History of Surrealism 67. Maxim Gorky : On Literature 68. Michael Millgate : Tennyson 69. Mullik (a) Theory of Literature (b) Modern Literature , 70. Nambudripad : Marxism and Literature 71. Omond : English Metrists 72. Plekhanov . Art and Social Life 73. Prasad : An Introduction to English Criticism 74. Rene Wellek & Austin Warren : Theory of Literature 75. Rees : An Introduction to English Literature 76. Richards : Principles of Literary Criticism 77. Srinivasa Iyengar: Introduction to the Study of English Literature 78. Strong : Common Sense about Poetry 79. Vladimir Shcherbina : Lenin and problems of Literature 80. William Allan Neilson: Essentials of Poetry 81. William K. Winsatt & Cleanth Brooks: Literary Criticism 82. Winchester : Some Principles of Literary Criticism

**(E) Anthologies & Compilations**

83. Edgar Allan Poe : Great Tales and Poems of Edgar Allan Poe 84. Kazi Nazrul Islam: The Rebel and other Poems 85. Maupassant : The Short Stories ot Guy de Maupassant 86. Mayakovsky : Vladimir Mayakovsky's Poems 87. Michael Roberts : The Faber Book of Modern Verse 88. Oliver Bernard : Rimbaud, Selected Verse 89. Oscar Williams : The pocket Book of Modern Verse 90. Palgrave : The Golden Treasury 91. Ramana Reddy : Sri Sri Miscellany 92. Sri Sri : Soudamini 93. William H. Marshall : The Major Victorian Poets.

**(F) చరిత్ర, రాజనీతి, జీవితచరిత్ర & మార్క్సిజం**

94. ఎంగెల్స్; (a) నరుని పరిణామం (అను.) అమరవాది కృష్ణమూర్తి (b) ప్రకృతి: గతి తర్కము (అను.) మహీధరజగన్మోహనరావు (c) వానరుడు : నరుడు – పరిణామక్రమంలో కర్మపాత్ర (అను.) మహీధర జగన్మోహనరావు (d) కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల

పుట్టుక (అను.) మహీధర రామమోహనరావు 95. ఎమిలీబరన్సు: మార్క్సిజం అంటే ఏమిటి? 96. కారల్ మార్క్స్ & ఫ్రెడరిక్ ఎంగెల్స్ : కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక (అను.) రాచమల్లు రామచంద్రారెడ్డి 97. క్లైమెన్స్‌దత్ : మార్క్సిస్టు లెనినిస్టు మూలసూత్రాలు – సోషలిజం, కమ్యూనిజం (అను.) కంభంపాటి సత్యనారాయణ & మోటూరి వేంకటేశ్వరరావు 98 చిన్మోహన్ సహనోబిస్ ; కమ్యూనిజం అంటే ఏమిటి (అను) వై. విజయకుమార్ 99. మార్క్స్ : కూలీ శ్రమా పెట్టుబడీ (అను.) రాచమల్లు రామచంద్రారెడ్డి 100. మావోసేటుంగ్: కళలూ సారస్వతం ఎవరికోసం ? (అను.) కొడవటిగంటి కుటుంబరావు 101. మొమ్‌జాన్ : సోషలిజం– వర్తమానము, భవిష్యత్తు (అను.) వుప్పల లక్ష్మణరావు 102. లెనిన్ (a) కారల్ మార్క్స్ ఉపదేశాలు (అను.) మహీధర జగన్మోహనరావు (b) సోషలిస్టుభావశాస్త్రము, సంస్కృతి (అను) వుప్పల లక్ష్మణరావు (c) విప్లవదుందుడుకు విధానం (అను.) తుమ్మల వెంకట్రామయ్య 103. స్టెపనోవా: (a) ఫ్రెడరిక్ ఎంగెల్స్ సంక్షిప్త జీవితచరిత్ర (అను) నిడమర్తి ఉమారాజేశ్వరరావు (b) కారల్‌మార్క్స్ సంక్షిప్త జీవితచరిత్ర (అను.) తుమ్మల వెంకట్రామయ్య 104. సోబొలెవ్; షిరిన్య; షీర్సోవ్ : కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సంక్షిప్తచరిత్ర (అను.) కొండేపూడి లక్ష్మీనారాయణ 105. తెలుగుభాషాసమితి : తెలుగు విజ్ఞానసర్వస్వము 1, 4, 6 & 7 సంపుటాలు.

### (G) ఛందోఽలంకారగ్రంథాలు, సారస్వతవ్యాస సంకలనాలు, సాహిత్యసమాలోచనలు & సిద్ధాంతగ్రంథాలు మొదలైనవి

106. అప్పకవి : అప్పకవీయము 107. కురుగంటి సీతారామయ్య : నవ్యాంధ్రసాహిత్యవీధులు 108. కుటుంబరావు : సాహిత్యప్రయోజనం 109. చింతాదీక్షితులు : ప్రజావాఙ్మయము 110. దువ్వూరి రామిరెడ్డి : వ్యాసములు 111. నారాయణరెడ్డి సి. : ఆధునికాంధ్రకవిత్వము 112. పురిపండా: సారస్వతవ్యాసములు (సంకలనం) 113. రామకృష్ణ & రామిరెడ్డి : సాహిత్యపదకోశము 114. రావూరి దొరసామిశర్మ ; తెలుగుభాషలో ఛందోరీతులు 115. లక్ష్మీకాంతం, పింగళి : సాహిత్యశిల్పసమీక్ష 116. లెనిన్ : సాహిత్యంమీద వ్యాసాలు (అను) రా. రా. 117. శంకరాచార్య : వివేక చూడామణి 118. శివశంకరస్వామి & సుబ్రహ్మణ్య శాస్త్రి : కావ్యస్వరూపమ్ 119. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి : కావ్యాలంకార సంగ్రహము 120. సంపత్కుమార: ఛందఃపదకోశము 121. సుబ్రహ్మణ్యం, జి. వి. : సారస్వత వ్యాసములు (సంకలనం)

### (H) కావ్యాలు, కవితాసంకలనాలు

122. అబ్బూరి రామకృష్ణారావు : ఊహాగానము, ఇతరకృతులు 123. గురజాడ ; ముత్యాల సరాలు, 124. దేవులపల్లి కృష్ణశాస్త్రి : కృతులు 125. బసవరాజు అప్పారావు : పాటలు 126. ముద్దుకృష్ణ; వైతాళికులు 127. విశ్వనాథ : భ్రష్టయోగి,కిన్నెరసానిపాటలు 128. వేంకట పార్వతీశ్వరకవులు: ఏకాంతసేవ 129. శిష్ట్లా : విష్ణుధనువు 130. శ్రీశ్రీ : (a) శ్రీశ్రీ సాహిత్యం (శ్రీశ్రీసా.) (b) మరోప్రస్థానం

### (I) ఆధునికసాహిత్యవ్యాసాలు చర్చలు & సమీక్షలు

131. ఆధునిక సాహిత్యం గురించి వెలువడిన అసంఖ్యాక సమాలోచనలు - వివిధపత్రికలలో వెలువడినవి : స్థలాభావం వల్ల పేర్కొనడంలేదు.

### (j) శ్రీశ్రీ సాహిత్యసమాలోచనా గ్రంథాలు

132. అమరేంద్ర : భావవీణ (ఒకవ్యాసం) 133. అద్దేపల్లి రామమోహనరావు: శ్రీశ్రీ కవితా ప్రస్థానం 134. నారాయణ రెడ్డి : ఆధునికాంధ్రకవిత్వము (ఒకభాగం) 135. రామకోటి శాస్త్రి & రంగారావు : విమర్శిని (కొన్ని వ్యాసాలు) 136. విజయలక్ష్మి సి. : శ్రీశ్రీ ఖడ్గసృష్టి కావ్యపరామర్శ 137. సుబ్రహ్మణ్యం జి. వి. : ప్రతిభాలహరి (ఒక వ్యాసం)

### (K) శ్రీశ్రీ సన్మాన ప్రత్యేక సంచికలు

138. తెలుగురాజ్యమ్, కాకినాడ 1970, 139. శ్రీశ్రీ షష్టిపూర్తిసన్మానసంచిక - విశాఖ 1970 140. సృజన (a) 1970 షష్టిపూర్తి ప్రత్యేకసంచిక (b) 1980 ప్రత్యేకసంచిక 141. కళాకేళి 1970 శ్రీశ్రీ షష్టిపూర్తి అభినందన సంచిక

### (L) పత్రికావ్యాసాలు, చర్చలు, ఇంటర్వ్యూలు, & లేఖలు

142. శ్రీశ్రీ గురించి వివిధపత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఇవి అనేకం. స్థలాభావం వల్ల పేర్కొనడం లేదు.

### (M) శ్రీశ్రీ సాహిత్యవ్యాసాలు

143 రమణారెడ్డి, కె. వి. (సంపా) : 'శ్రీశ్రీ సాహిత్యం' సంపుటాలలో కూర్చబడినవి.

[సంకేతాలు : అను. = అనువాదం; సంపా. = సంపాదకులు; కావ్య = కావ్యవిభాగం; వచన. = వచనవిభాగం; పే. = పేజీ; D. W. L. T. (Shipley) = Dictionary of World Literary Terms; చూ. = చూడండి; R. H. D. = The Random House Dictionary.] □

# III/విశిష్టపదసూచిక

## ఏ శిల్పం? ఏ సాహిత్యం? ఏ శాస్త్రం? ఏ గాంధర్వం?

శ్రీశ్రీ శుద్ధకవిగా కళ్లువిప్పి, వ్యవహారకవిగా కవుల కళ్లువిప్పించినవాడు కనుక-తన కవిత్వంలో అనిదంపూర్వమైన విషయాలను చొప్పించినవాడు కనుక-ఆయనకవిత్వంమీద రాసిన ఈ వ్యాఖ్యానపూర్వకవిమర్శలో శుద్ధకవిత్వపరిభాష లేగాక సాంప్రదాయికసాహిత్యవిమర్శ కతీతమైన అనేకపరిభాషలు, పదాలు వచ్చికూర్చున్నాయి. ఈ పదజాలం సాహిత్యవిమర్శ పరిధిని బాగా విస్తృతంచేస్తోంది. ఈగ్రంథంలో ఆరింట నాలుగువంతులు సంపూర్ణంగా మార్క్సిస్టు సాహిత్యవిమర్శపంథాలో సాగింది. సామాజికవ్యవస్థకూ సాహిత్యవ్యవస్థకూ గల ఓతప్రోతగుణం చర్చింపబడింది. అందువల్ల అపూర్వమైన పదజాలాన్ని తొలిసారిగా సాహిత్యవిమర్శలో వాడవలసివచ్చింది. గ్రంథానికి దిక్సూచిగా ఉండటంకోసం విశిష్టపదజాలాన్ని అకారాదిగా కూర్చి ఇవ్వడం జరుగుతున్నది. పదజాలాన్ని ఎంపికచేయడంలోనూ కూర్చడంలోనూ కొన్ని నియమాల ననుసరించక తప్పలేదు. దేశనామాలు, స్థలనామాలు వదిలివేయబడ్డాయి. పదబంధాలవిషయంలో ప్రాథమికపదాన్ని సూచించి అనుబంధాలను అక్కడికక్కడే చూపడం జరిగింది. పుటలసంఖ్య ఎక్కువైపోయినప్పుడు తొలి, తుది పుటలు మాత్రం సూచింపబడ్డాయి.

## ముఖ్యమైన సవరణలు

ఆయా పేజీలలో పడిన దుష్టరూపాలకు శిష్టరూపాలు ఈక్రింద ఇవ్వబడుతున్నాయి. బ్రాకెట్లలోనివి పేజీ నంబర్లు.

(24) డిసెంబరు 8; నం. 1; (57) దృష్టి; ప్రఫుల్ల; (75) ఫణివిషస్ఫీత; (79) అని భిన్నరూపకాలు; Shipley; (108) నేర్చు; (118 & 189) Allan Poe; (188) A match; కోకిలమ్మ; (210) నల్లూరి; (220) అసలే; (246) హరీంద్ర; (250) కర్తవ్యం; (272) ముంతాజబేగమ్; (300) ఎవ్వరని యెంతురో; (319) చెప్పలేదు; (377) దుర్మతి; (420) Autumn; (431) Dialectical; (498) వైరుధ్యాలు (499) బూర్జువా (504) అర్థాల్లో (516) గరుత్పరిరంభం; (527) మైన; (569) సంప్రదాయాలను; వర్ణన; (576) ఆంధ్రదేశపు; (610)వార్తలను; (616) పరిష్కార; అస్రసైవేద్యం; (642) అందుకే. ఎంగిల్సు = ఎంగెల్సు అనీ అల్లెన్ పో = అల్లన్ పో అనీ దిద్దుకోవాలి. □

శ్రీ శ్రీ కవిత్వం

వస్తువు – సంవిధానం

1927 - 28

ప్రభవ

# భావకవితాయుగానికి భరతవాక్యం

'నేను ఏవో యతిప్రాసలు లేని పద్యాలు
వ్రాస్తూండడంచూచి మా నాన్నగారు
నాకు సులక్షణసారం కొనిపెట్టారు.
ఛందస్సు ప్రథమపాఠం చెప్పారు....
అప్పటికి నా వయస్సు ఏడెనిమిది
సంవత్సరాలకు మించి ఉండదు.
ఆ రోజు నుండి ఎన్నిపద్యాలు వ్రాశానో
చెప్పను. అన్నీ తప్పులే !
కాని ఒకసారి చేసిన తప్పు మళ్లీ చెయ్యలేదు.
అందరూ నా తప్పులు ఒద్దేవారే !
కొన్ని తప్పులు నాకు తప్పుగా తోచలేదు.
అవి చెయ్యడానికి నాకేదో
హక్కు ఉందనిపించింది. అందువల్ల
నా వ్యక్తి చైతన్యం ప్రగాఢతరం
అవుతున్నట్లు నా రక్తం పరిశుభ్రమవుతున్నట్లు
నా బలం హెచ్చినట్లు
నాకు స్పష్టంగా తోచింది !'

—శ్రీ శ్రీ

1

## కవిగా శ్రీరంగం
## శ్రీనివాసరావు ప్రభవం

### శిశువు చిత్రనిద్రలో
### ప్రాచీన స్మృతులాచే చప్పుడు !

ఇరవయ్యో శతాబ్దం. 1910వ సంవత్సరం. స్థలం విశాఖపట్నం. తెలుగు కవితా సరస్వతికి పురుటినొప్పులు మొదలయ్యాయి. ఆ కొత్తసృష్టి జనవరి రెండవ తేదీని జరిగింది. ఆ శిశువు పేరు శ్రీనివాసరావు. అతని ఇంటిపేరు శ్రీరంగంవారు. రెండు శ్రీలు ధరించిన శిశువతడు - శ్రీరంగం శ్రీనివాసరావు.

అతని తల్లి పేరు అప్పన్నకొండ. అతని కన్నతండ్రి వెంకటరమణయ్య. 'యమాతా రాజభానసలగం' - అతని మొదటి కవితామంత్రం. దానికి ఉపదేష్ట అతని తండ్రిగారే! అంతకు ముందే అతడు కందపద్యం రచించడానికి ప్రయత్నించాడు.

ఈ కవికిశోరుడు చిన్నారిపొన్నారి చిరుత కూకటి నాడే రచించాడట 'వీరసింహవిజయ సింహులు' అనే ఒక నవలనీ ! 'సావిత్రీ సత్యవంతము' అనే పద్యనాటకాన్నీ ! అవి బాల్యక్రీడలు. కాగితం పడవలై కాలంలో కలిసిపోయాయి.

పదిహేనవ యేట 'పరిణయరహస్యం' అనే నవలను రచించగా విశాఖపట్టణంలో 'స్వసంఘం'వారు దాన్ని ముద్రించారు. కాని అది కూడా ఈనాడు ఆనవాలుకైనా లభించదు.

### పురిపండా దోహదం

ఆ పదిహేనవ ఏటనే ఒక ఖండిక తేటగీతుల్లో అతడు రచించి పురిపండా అప్పలస్వామి గారికి చూపించాడు. ఆయన దాన్ని మెచ్చుకుని తన సంపాదకత్వంలో నడుస్తున్న 'స్వశక్తి' పత్రికలో వేయించారు. ఆ ఖండిక పేరు 'విశ్వరూపసందర్శనము' అను 'దివ్యాలోచనములు'. ఆ ఖండిక కూడా ఈనాడు పూర్తిగా లభించదు.

నిజానికి ఆ ఖండికయే శ్రీనివాసరావు తొలికవితగా పరిగణించదగింది. అందులోని వస్తువేమిటి ? సంవిధాన మెలాంటిది ?

'విశ్వరూపం ధరించిన కృష్ణపరమాత్మను ధృతరాష్ట్రుడు దృష్టిదానాన్ని అర్థించడం' ఆ ఖండికలోని వస్తువు1. అందులో నుంచి మూడే మూడు పాదాలు లభిస్తున్నాయి.

'ఓ మహాత్మ! త్వదీయ మహోన్నత ప్ర
భావ మింతని తెలుప నెవ్వాని తరము?
..............................
దివ్యలోచనములఁ బ్రసాదింపుమయ్య!'

ఇందులోని సంవిధానం నాటకీయం. భావావేశం నిరర్గళం. శైలి ప్రసన్నమధురం.

ఈ ధృతరాష్ట్రుడి మాటల్లో కవి ఆర్తి కనిపిస్తోంది. ఈ దివ్యలోచనం కవికి కావలసిన భావయిత్రీప్రతిభయే! ఏ ప్రతిభ లేనివాడికి దర్శనమే ఉండదో దాన్నే తన కిమ్మని కవి ప్రార్థిస్తున్నాడనిపిస్తుంది. పైగా అది విశ్వరూప దర్శన కుతూహలం.

పదిహేనవ యేట – స్కూల్‌ఫైనల్ చదువుతూఉన్న శ్రీనివాసరావుకు ఈ విధమైన కవుని వేదన లభించడం ఒక చమత్కారం.

ఇక్కడే శ్రీనివాసరావు భవిష్యత్తంతా తొంగి చూస్తోంది. ఆనాడే శ్రీనివాసరావును ఆకర్షించింది–మహాభారతగాథ. సత్యసందర్శనం పట్ల అతనికున్న ఔత్సుక్యమూ ధర్మసంగ్రామం పట్ల అతనికున్న అభిమానమూ అతని సుదూరభవిష్యత్తులో ఎలా పరిణమిస్తాయో మనం చూడగలం.

## సమరాహ్వానం

మహాభారత గాథా ప్రీతి అతని చేత 1926 లోనే – 16వ ఏట – నూనూగు మీసాల నూత్నయౌవనంలో – 'సమరాహ్వానము'2 అనే ఖండికను రచియింపజేయించింది. ఈ ఖండిక 1926 నవంబరు నెల భారతిలో ముద్రితమయింది. శ్రీనివాసరావు తొలికవితగా ఈనాటికీ సంపూర్ణంగా కనిపిస్తున్నది ఇదే.

ధైర్యము త్యజించి ఘోరయుద్ధంబు సేయ
ననుచిత పలాయన పథంబు ననుసరించి
ఓ సుయోధన! యెందేగి యుంటివిపుడు
రమ్ము క్షత్రియోచితసంగరం బొనర్ప!

1. కె. వి. రమణారెడ్డి: శ్రీశ్రీసా. ఒకటి.కావ్య. 8వ పే.
2. అదే. 120-121 పే.

అని ప్రారంభమవుతూన్న ఈ కవితలో నాటకీయశైలి, పదాల పొందిక, భాషావేగం, పద్య రచనాకౌశలం కనిపిస్తున్నాయి. తేటగీతిమాలికలు గ్రుచ్చి, సామెతలూ జాతీయాలూ తెచ్చి, నడిపించిన ఖండిక యిది. ఇందులో మహాభారతగాథ అంతా ప్రసక్తమవుతుంది. ధర్మమే జయ మనుమాటను సుయోధనుడు మరిచిపోయాడని వెక్కిరింపబడతాడు.

## కవితాసమితి

ఈవిధంగా వికసిస్తున్న శ్రీనివాసరావు కవితాప్రతిభకు మరింత దోహదం కలిగించిన సంస్థ 'కవితాసమితి'. ఇది 1926 లోనే విశాఖపట్టణంలో అవతరించింది. దీనికి సూత్రధారి పురిపండా అప్పలస్వామిగారే! శ్రీనివాసరావు, వడ్డాది సీతారామాంజనేయులు, కాళ్ళకూరి నరసింగరావు, శ్రీరంగం నారాయణబాబు మొదలైన యువకులూ మారేపల్లి రామచంద్రశాస్త్రి, పూడిపెద్ది వెంకటరమణయ్య, ఆచంట వేంకటసాంఖ్యాయనశర్మ, సెట్టి లక్ష్మీనరసింహం మొదలైన పెద్దలూ అందులో సభ్యులు. ఈ కవితాసమితి 'అఖిలాంధ్రఖ్యాతి' సంపాదించుకుంది.[1]

ఇలా ఉండగా, 1927లో శ్రీనివాసరావు మొదటిసారిగా భావకవిగా దర్శనమిచ్చాడు. ఆ యేడు జూలై భారతిలో పడిన 'అభిసారిక'లో ఆ పోకడ లున్నాయి.

## ప్రభవ ప్రచురణ

1927 జూలై నుంచి 1928 ఏప్రిల్ వరకూ శ్రీనివాసరావు రచించిన ఖండికలను ఎప్పటి కప్పుడే విని ఆనందిస్తూ ఆ ఖండికలను ఏర్చికూర్చి కవితాసమితి తొలిప్రచురణగా వెలువరించినది పురిపండా అప్పలస్వామిగారే! ఆ కవితాసంపుటి పేరే ప్రభవ!

ప్రభవలోనివి 17 ఖండికలు. ఆ ఖండికలలోని వస్తుసంవిధానాలను రచనా (లేక ముద్రణా) కాలానుక్రమాన్ని అనుసరించి పరిశీలిద్దాం!

---

1 చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 9వ పే. కె. వి రమణారెడ్డి పీఠిక.

## ప్రభవకు పురిపండా వ్రాసిన ఉపక్రమణిక నుంచి

"ఇవి కేవల స్వేచ్ఛాదివసములు. ఆంధ్రవాఙ్మయమున కిది స్వర్ణయుగము కాకున్నను ఆ యుగారంభమున కివి ప్రథమదివసములనుట తథ్యము. తిరుపతివేంకటేశ్వరకవులతో ఆంధ్ర వాఙ్మయము పతనోన్ముఖమైనదనువారితో మాకుఁ బనిలేదు. ఈ స్వేచ్ఛాదివసములలో ప్రభవించిన యీ ప్రభవ: ప్రభవాబ్దమున కవిహృదయమునుండి వెలువడిన ఖండకావ్యములు 'ప్రభవ' యనుపేర సంపుటీకరణము గావింపబడినవి. గ్రంథకర్తయగు శ్రీ శ్రీనివాసరావుగా రిందలి ప్రతి గీతమును తాము రచింపగనే నాకడకుఁ గొనివచ్చి శ్రవణానందము కలిగించుచుండెడివారు. కేవలము కడుపిన్నవయసుననే యిట్టి 'లలితభావకవితావియద్వాహిని' యలవడినది వీరికి........

శ్రీనివాసరావుగారి కవితయం 'దొక యనిర్వచనీయమహోన్నతమగు హాయి' యున్నది. 'విరులలో రసిపారు గాంగనిర్ఝరిణియట్లు' వీరిగీతి (చెంగుచెంగున) తురంగలించును...............

మా కవితాసమితి గ్రంథావళిలో 'ప్రభవ' ప్రథమకుసుమముగ వికసించినది..........."

విశాఖపట్టణము )
౨౪-౪-౨౮ )

పురిపండా అప్పలస్వామి,
కవితాసమితి కార్యదర్శి.

కవితాసమితి గ్రంథావళి—౧

# ప్రభవ



శ్రీ. శ్రీనివాసరావు,
కవితాసమితి

ప్రభవ ముఖపత్రం నమూనా (1/8 క్రౌన్)
(1928)

భావకవితా ప్రవాహంలో పగడాల పడవలు

## *1927* కవితలు

అభిసారిక    ప్రళయనర్తనము    రజనీగానము

'నిన్నటినుంచి ఇవాళ లాగ
నిజటికవుల నుంచి
నేటికవులు పుడతారు'

—శ్రీ శ్రీ

2
అభిసారిక

ఈ నిశీథిని ప్రబలఝంఝానిల ప్రసార
విదళిత వృక్ష సంచయ కలితము !

తన ప్రియుణ్ణి కలుసుకోవడానికి అభిసారిక ఒక కాళరాత్రి గాలివానలో ఏకాంతంగా బయలుదేరుతుంది. ఆమె సంకేతస్థలం ఒక దుర్గమారణ్యం! ఈ ఇతివృత్తంతో సాగిన భావగీతిక అభిసారిక 1.

తుఫానురాత్రి

రాత్రివర్ణనతో తన కథను మొదలుపెడుతుంది అభిసారిక. ఆరాత్రి 'ప్రబలఝంఝానిలం' ప్రసరించడంచేత వృక్షాలు విదళితమవుతున్నాయి. ఝంఝానిలాలకు ఏనుగులతో పోలిక ధ్వనిస్తుంది. తరువాత పెనుమబ్బులు కనిపిస్తాయి. అవి 'కులిశఘాత ప్రతారణ కుశల కుధరపంక్తి సన్నిభఘనపయోవాహాలు'. దేవేంద్రుడి వజ్రపుదెబ్బలనుకూడా ప్రతారించగల కొండలవంటి మబ్బులవి. ఇంద్రుణ్ణికూడా అవి లెక్కపెట్టవు. ఇంద్రుడు మేఘగతి నిర్ణయించేవాడే. కొండల రెక్కల్ని ఛేదించగలవాడే. అయినా ఆనాటి రాత్రి మేఘాలు అతణ్ణి తప్పించుకుంటాయి. ఇంద్రుడికి వేటగాడితోనూ మబ్బులికి అడవిజంతువులతోనూ పోలిక ధ్వనించేలాగుంటుంది ఈ పదచిత్రం. ఆ తరువాత పెంజీకటి కనిపిస్తుంది. అది 'భూనభోంతర విచ్ఛన్న' మైనది. ఇంత చీకటిలో అభిసారికకు దారీ తెన్నూ తెలియదు. ఈ పదచిత్రంలో చీకటికి వలతో పోలిక స్ఫురిస్తుంది. తరువాత కనిపిస్తాయి మెరుపులు. ఇవి 'ధ్వాంతసంకీర్ణ గగనహృదయవిదీర్ణ శక్తియుక్త క్షణప్రభలు'. ఈ మెరుపులు ఆకాశహృదయాన్ని చీలుస్తున్నాయి. ఆ హృదయం చీకటితో నిండినది. ఈవర్ణనలో మనకు నరసింహుడు హిరణ్యకశిపుని హృదయం చీలుస్తున్న దృశ్యం కనిపిస్తుంది. చీకటిలో దారిచూపించే మెరుపులుకూడా ఇలా భయంకరంగానే ఉన్నాయి. అంతలో ఉరుములు వినిపిస్తాయి. అవి 'చండహర్యక్షభయదగర్జాసమానకంధరధ్వానాలు'. అంతే కాదు; ఆ ఉరుములచేత దిగ్గజాలు భయపడతాయి. చివరికి వాన మొదలవుతుంది. ఇది 'మహిత వేదండతుండప్రమాణసలిలసంతతైకధారాపాతం'గా ఉంటుంది. ఇందులో విశేషణవిశేష్యాల స్వారస్యం ఆకర్షిస్తుంది మనల్ని.

---

1 ముద్రణ — 1927 జూలై భారతి. ప్రభవ. చూ. శ్రీశ్రీపా. ఒకటి. కావ్య. 38 పే.

## దుర్గమారణ్యం

సమయ మిలాఉంటే ప్రదేశం దానికి తీసిపోతుందా ? ఆ అరణ్యం క్రూరమృగాకీర్ణం. కానీ ఈ విషయాన్ని చెప్పడంలో వక్రత నవలంబించాడు కవి.

ఈ ప్రదేశ మనూన భయప్రదాన
శరభ వేదండ భల్లూక హరిసమూహ
ఘోరఘోరాతిఘోర నిర్ఘోష పాటి
తాఖిలజన శ్రవణపుటమగుచుఁ దనరు
విజనమగు విభ్రమాస్పద విపినతలము !

శరభాలు, ఏనుగులు, భల్లూకాలు, సింహాలు మొదలైనవి ఉండటం కాదిక్కడ ముఖ్యం; వాటి నిర్ఘోషాలచేత జనుల చెవులు బద్దలవుతూ ఉండటం. ఈ వర్ణనలోనే కవి స్వవచోవ్యాఘాత దోషానికి పాల్పడ్డాడు. అది విజనం అని చెబుతూనే 'పాటితాఖిలజనశ్రవణ' అనడం ఏం బావుంది ?

## ప్రణయగీతమా ? ముక్తిగీతమా ?

ఈ స్థలకాలాలిలా ఉన్నా అభిసారిక సంకేతస్థలానికి వెళుతూనే ఉంది. అందుకొక్కటే కారణం. ఆమె ప్రణయపుగాఢకుతూహలం. ఆమె ప్రణయాధిదేవుడు 'ప్రణయరాజ్యరమా ప్రాణపతి'గా సూచింపబడటం గమనించదగింది.

అయిన నేమాయె ప్రేమ మెంతైనఁ జేయు
దుర్గమ భయంకరారణ్యదుర్గములును
ప్రళయకాల సమాన విభావరులును
ప్రణయరాజ్యరమాప్రాణపతి కొఱకయి
తరలియరిగెడు నా కవాంతరములగునె ?

ఇది అభిసారిక హృదయం. అసలు అలాంటి అరణ్యాంతర్భాగమే సంకేతమెందుకు కావాలి ? అనే ప్రశ్న కనక వేసుకుంటే ఒక విచిత్రమైన అర్థస్ఫూర్తి మనకు కలుగుతుంది.

## మధురభక్తి సంప్రదాయం

అసలు ఇది ప్రణయగీతం కానే కాదు. అభిసారిక భక్తుడి ఆవేశం నుంచి ఇందులో బయట పడటం లేదు. కేవలం విషయవాంఛల కోసం వెళ్లేది అభిసారిక. కాని ఇక్కడ ప్రణయరాజ్యం కైవల్యమే. ఆ వర్ణింపబడిన రాత్రి జీవితానికి ఒక సంకేతం. జీవితంలోని దుఃఖమే ఆ వర్షకాలం. ఈ జీవితాన్నీ ఈ ప్రపంచాన్నీ (అరణ్యావాతావరణం) విడిచి భక్తుడు పరమేశ్వరాభిముఖంగా సాగిపోవడమే అభిసరించడం.

సమాసశిల్పం

రాత్రివర్ణన రెండేసిపాదాలలో ఒక్కొక్క సమాసంగా సాగుతుంది. ఆ సమాసాలన్నీ సమతాగుణంతో ఉంటాయి. అంతేకాదు; అవి ఓజోగుణంతో లయవేగంతో పరుగెత్తుతాయి. పదాలు విరామంతో నడుస్తాయి. ప్రాసలు హాయలుతో గంతులు వేస్తాయి. మచ్చుకి—

చండహర్యక్షభయదగర్జా సమాన
కంధరధ్వాన చకిత దిగ్దంతిచయము!
ధ్వాంతసంకీర్ణ గగనహృదయవిదీర్ణ

బహువ్రీహిసమాసం వాడటం అలవోక.

అనూన భయప్రదాన శరభవేదండ భల్లూక
హరిసమూహ ఘోరఘోరాతిఘోర
నిర్ఘోష పాటితాఖిల జనశ్రవణపుటము (విపినము).

పర్యాయపదశిల్పం

ప్రబంధాలలోని శైలి పర్యాయపదాల కూర్పువల్ల రాణిస్తుంది. ఎక్కడ ఏ పదానికి ఏ పర్యాయపదం వాడితే మొత్తంసమాసం శ్రుతిపేయంగా ఉంటుందో ప్రబంధకవులు గ్రహించారు. కవితాశిల్పంలో ఇదొకభాగమైంది. సింహాన్ని హర్యక్షమంటే వైచిత్రి. ఈ భాషాశిల్పాన్ని కవి పుష్కలంగా గ్రహించాడు. మబ్బుని పయోవాహం అంటాడు. వజ్రాన్ని కులిశం అంటాడు. మెరుపుని క్షణప్రభ అంటాడు రాత్రిని విభావరి అంటాడు. శైలి ఈవిధంగా ప్రాబంధికత నందుకున్నది.

ప్రళయనర్తనము

## మాయామేయ జగద్వినాశనమతిన్ నర్తింపుమా!

ఈ లోకమంతటినీ మూడవకంటితో తగులబెట్టి శివుడు నర్తించాలట. ఇలా ప్రార్థిస్తూ రచించిన మూడు ఉద్ధతవృత్తాలు ప్రళయనర్తనము1. ఈ వృత్తాలలో మధ్యనున్నది మత్తేభం. మొదటిదీ మూడోదీ శార్దూలాలు. ఉద్ధతరసంతో కూడిన తాండవానికి ఉద్ధతిగల వృత్తాలు తోడ్పడుతున్నాయి. మూడు పద్యాలతో మూడులోకాల్ని సంకేతించాడు.

జగద్వినాశనం

శివుని లీలాతాండవాన్ని కాక ప్రళయతాండవాన్ని కోరుతున్నాడు కవి. కానీ 'శంకరా' అనే సంబోధన లోకానికి శుభాలనే కలిగించవలసిందనే ప్రార్థనను అభివ్యంజిస్తోంది.

సాయం ప్రస్ఫుటరాగరంజిత లసత్సంపూర్ణ సౌందర్యరా
శీయుక్తామల దివ్యమూర్తివయి, సాక్షీభూత నానామర2
స్తోయస్తోత్ర గభీరగానరస సంతుష్టాంతరంగంబునన్
మాయామేయజగద్వినాశనమతిన్ నర్తింపుమా ! శంకరా !

తాండవంచేసే సమయంతోపాటు శంకరుడు కూడా అరుణరాగరంజితుడై సాక్షాత్కరించాలని కవి ఉత్కంఠ. స్తోత్రపరులయి, దేవతలందరూ నిలబడి చూస్తూఉండగా పరమానందంతో చేయవలసిన శివనర్తనానికి 'మాయామేయజగద్వినాశనం' పరమావధిగా కవి భావించడమే విచిత్రమైన విషయం.

---

1 ముద్రణ : భారతి 1927 సెప్టెంబరు. చూ. శ్రీశ్రీసా. ఒకటి, కావ్య, 41 పే.

2 'సాంధ్యకాలారుణ గభస్తి సముదయమున। ప్రస్ఫురించెడు నిజవపుర్వైభవమ్ము। ఉచిత మానసికోత్సాహముజ్వలింప। అమరులనిమేషనయనులై అరయునపుడు। ఏ పరాత్పరమూర్తి సదాపవిత్ర। నాట్యలీలానుకూల విన్యాసములను। నెరపుచున్నాడో ఆ హరు నిటలమందు। దాగియడగిన అగ్నిహోత్రమును నేను' అన్నాడీ కవియే అగ్నిహోత్రము అను ఖండికలో (1928).

## ప్రళయగర్జనలు - జలప్రళయం

గంగాధరుడైన శివుడు[1] నర్తనం మొదలుపెట్టగానే లోకమంతా చీకట్లతో నిండిపోతుంది. సముద్రాలు పొంగి భూమిమీదపడతాయి. ప్రళయకాలమేఘాల ఉరుములు వినిపిస్తాయి. కాని వాటిలో శివుడి గంభీరాట్టహాసం కలిసిపోతుంది. ఆ ధ్వనికి దిగ్గజాలు కంపిస్తాయి. అప్పుడు శివుడు నర్తనంతో విజృంభించాలని కవి ప్రార్థన.

అలఘుధ్వాంతవితాన సంభరిత రోదోంతర్మహాగహ్వర
స్థలి యంభోనిధియయ్యె సంతతజలస్రావాతిరేకంబునన్
విలయాంభోధర ఘోషసమ్మిళితగంభీరాట్టహాసధ్వని
చలితప్రాకటదిగ్గజుండవగుచున్ సంప్రీతి నర్తింపుమా !

## ఫాలాగ్నితో బ్రహ్మాండాల దహనం

ప్రళయనర్తనంలో చరమలక్ష్యం బ్రహ్మాండాలను 'ఫాలాక్షుజ్వలదగ్ని'తో దగ్ధంచేయడం. 'ధ్వాంతవితానసంభరితం'గా రోదోంతరాలను వర్ణించిన కవి బ్రహ్మాండాలను దహించే ఫాలాగ్నిని 'అర్కకోటిఘృణిసంకాశం'గా వర్ణించి చీకట్లలో వెలుగును చూపిస్తాడు.

కాలాంతప్రభవార్క కోటి ఘృణిసంకాశప్రతాపస్ఫుర
త్ఫాలాక్ష జ్వలదగ్నిదగ్ధ సకలబ్రహ్మాండభాండుండవై
జ్వాలాదీప్త మహాప్రభావగరిమన్ స్వచ్ఛందసంవర్తకే
ళీలోలాత్ముడవై సమస్తజగముల్ కీర్తింప నర్తింపుమా !

శివుడు చేసే ఈ సంహారాన్ని 'స్వచ్ఛందసంవర్తకేళి' గా పేర్కొన్నాడు కవి. శివుడా నర్తనాన్ని 'సమస్తజగముల్ కీర్తింప' గా చేయాలనడంలో మాత్రం కవి స్వవచోవ్యాఘాతానికి పాల్పడ్డాడు. అగ్నిదగ్ధసకల బ్రహ్మాండభాండుడైన తరువాత శివుడు చేసే నర్తనాన్ని చూడటానికెవరుంటారు? సమస్త జగములూ ఎక్కడుంటాయి కీర్తించడానికి ?

---

1 ఇతని అభిమాన కావ్యసామగ్రిలో శివుడు ఒకడు. 1. ఆ హరునిటలమందు దాగియుడగిన అగ్ని హోత్రమును నేను, 2. జగదీశ్వరాంఘ్రిమంజీర నటనమటులు. 3. హరజటాజూటగంగాంబు శీతలవృష్టి. 4. హరోంహరోం హర.........అని కదలండి. 5. ఖండపరశుగళకపాలగణముల. 6. రుద్రాలికనయనజ్వాలిక, 7. నటధూర్జటినిటాలాక్షి మొదలైనవి. కానీ కవికి భౌతికవాజ కీయావగాహన హెచ్చయ్యాక ఈ సామగ్రి సన్యసింపబడింది.

## నూతనయుగావతరణంసూచన

ఒక యుగం పూర్తి కాగానే ప్రళయం సంభవించి తదనంతరం తిరిగి సృష్టి జరుగుతుందనేది ఆర్షమతం. కథతో నిమిత్తం లేకుండా శివుని ప్రళయనర్తనాన్ని ఖండకావ్య పరిధిలో వర్ణించడమే కవి సంకల్పం. అసలిటువంటి వస్తువును తీసుకోవడంలోనే కవి దృక్పథం అర్థమవుతుంది.[1]

రసోచితపదశిల్పం

'విలయాంభోధర ఘోష సమ్మిళిత గంభీరాట్టహాసధ్వనీ చలిత ప్రాకట దిగ్గజుడు', 'కాలాంత ప్రభవార్క కోటి ఘృణిసంకాశ ప్రతాప స్ఫురత్ ఫాలాక్షజ్వాలదగ్నిదగ్ధ సకలబ్రహ్మాండ భాండుడు' అనే బహువ్రీహిసమాసాలలో ఆరభటీవృత్తి[2] కనుగుణంగా గౌడీరీతి[3]కి ఓజో గుణాన్ని[4] కలిపిన భాషను వాడటంలో ప్రబంధ సాంప్రదాయిక పదశిల్ప పరిజ్ఞానాన్ని ప్రదర్శింప చేశారు.

## రజనీగానము

సృష్టిసౌభాగ్యవిభవవైచిత్రిఁ గాంచి
పరవశతనొంది గొంతెత్తిపాడుకొంటి!

నిరంతరం స్వప్నసీమల్లో తేలియాడే భావకవి పాడుకున్న రాత్రిపాట రజనీగానము.[1]

### పూలతోటలో వెన్నెలరాత్రి

వివిధసూనవితానశోభితకుజప్రశస్తసుప్రమదావన స్థలము సాంద్ర
చంద్రికాసముజ్జ్వలదివ్యశర్వరీప్రశాంతవేళ సమంచితసౌఖ్య మొసఁగ!

కవి చెప్పకపోయినా ఇది స్వప్నమని ఈ వర్ణన అంతా రుజువుచేస్తుంది.

మైమరచిపోతినంత సమస్త భువనసముదయమలర్చినపుడె విస్తారమధుర
గాన నిస్వనకల్లోలకలితలలితభావకవితావియద్వాహినీ విధాన.[2]

అసలీ సృష్టియే భావకవిత్వంలా కనిపించిందంటే ఈ కవి సౌందర్యసీమావిహారానికి అది పరాకాష్ఠ. 'వినూతనోత్సాహదాయక మనోజ్ఞ సమయమది'. వయసూ అలాంటిదే. ఆ పూలతోటయే జీవితం. ఆ శరద్రాత్రియే యౌవనం. ఆ భావావేశమే కవిత్వం.

### గగనసాగరంలో భావనౌక

ఈ సంభ్రమంలోనే అతనికి పాటలు పాడాలనిపించి పాడుకున్నాడు! ఈ గానకుతూహలానికి కారణం 'సృష్టిసౌభాగ్యవిభవవైచిత్రి'. ఈ 'గానస్రవంతికానవీన తరంగాలలో' స్నానమాడుతూ ఉండగా కనిపించిన చందమామను చూచి అతడు నర్తనం కూడా చేశాడు. ఎవరీ చందమామ?

'ప్రవిమలామృతరసపరిప్లావితాభ్రిధామ సందీప్త పూర్ణసుధానిధి' అతడు. క్రింద తాను గానరసంలోనూ పైన చందమామ అమృతరసంలోనూ స్నానంచేస్తున్నారు. అతడు పూర్ణ సుధానిధి. అంతటివాడు తానూ కావాలని కుతూహలం కలవాడు కనుకనే —

---

1 ముద్రణ; భారతి 1927 డిసెంబరు. ప్రభవ. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 32 పే.

2 భావకవిత్వానికిది ఒక చక్కని లక్షణం.

కాల్పనికభావచిత్రం

'ఈదుకొనిపోతి మామకహృదయకుహరజనితభావనౌకాధిరోహణమొనర్చి
కంధరతరంగనివహసంకలితమహితగగనసాగరగంభీరగర్భమందు'

అంటాడు. భావనౌకలో మేఘతరంగాలుగల ఆకాశసాగరంలో ప్రయాణం చేయడం అనే కాల్పనికమైన భావచిత్రరచన1 ఇతని ఊహావైభవానికే కాదు, రచనా శిల్పానికి కూడా పతాకనెత్తుతోంది.

పదశిల్పవైవిధ్యం

(1) విశేషణపరంపరాసంఘటననైపుణ్యం, (2) లలితపదవిన్యాసచాతుర్యం, (3) భావాభివ్యంజకపదగమనసంయోజననిపుణత అని మూడురకాలయిన పదశిల్పం ఈ ఖండికలో కనిపిస్తుంది. ఇందుకి రెండు ఉదాహరణలూ చాలు.

(1) విస్తారమధురగాననిస్స్వనకల్లోలకలితలలితభావకవితావియద్వాహిని
(2) కంధరతరంగనివహసంకలితమహితగగనసాగర

ముత్యాలసరం నడకలు

ఈ తేటగీతి పాదాలలో ముత్యాలసరపునడకలు కనిపిస్తాయి.

(1) వివిధసూన వితాన శోభిత (కుజప్రశస్తి) (2) ప్రవిమలామృతరసపరిప్లా (వితాభ్ర)

# 1928 కవితలు(1)

మొట్టమొదటిసారి
నాకు పద్యం వ్రాయాలని బుద్ధిపుట్టినప్పుడు
ఏదో కొత్తది కనిపెట్టినట్లే భావించాను!
నేను వెతుకుతున్న గులేబకావళి దొరికిందనుకున్నాను.
అతఃపూర్వసాహిత్యానికి అది అనుకరణం కాదు!
తర్వాత తర్వాత సాహిత్యదృష్టి హెచ్చి
నాలాగే ప్రమాదప్రయాణాలు చేసి
అనుభవాలు సంపాదించి
విశేషాలు కనుక్కొని
మజాగా చెప్పినవారి పరిచయం
పూర్వులదీ, నవ్యులదీ కలిగినపిమ్మట
వాటికి తగినంత చేరువగా
అనుకరణచేస్తూ పోవాలని బుద్ధిపుట్టింది!

—శ్రీశ్రీ

ప్రభాతగానము

కదలించిన హృదయారవిందసుమము
భక్తిపూర్వకముగ సమర్పణమొనర్తు!

అది ఒక ప్రభాతం. పరమేశ్వరుడి సన్నిధికి వెడతాడు భక్తుడు. తన హృదయపుష్పం సమర్పిస్తాడు. భావగీతాలు పాడతాడు. భగవంతుడిలో లీనమైపోతున్న అనుభూతి కలుగుతుందతనికి. ఈ కథను దేవుడితోనే చెప్పుకుంటాడు.1

దేవాలయం

అస్మదీయప్రఫుల హృదంతరాళసంస్థితపవిత్రతరభావసముదయప్ర
దర్శనోత్సుకమతినౌచుఁ దమకమెసగ దేవ! నీ సన్నిధికి నేగుదెంచినాడ!

తన పవిత్రతరభావాలను ప్రదర్శించడానికే తాను వచ్చానని చెప్పుకుంటాడు దేవుడితో. హృదంతరాళం ప్రఫుల్లమయిందనీ పవిత్రభావా లందులోనే ఉన్నాయనీ చెప్పడం భావచిత్రంగా భాసించి ఆ భావాలకు పరిమళసాదృశ్యం కలిగిస్తోంది. అతడు దేవాలయానికి వెళ్లిన తరువాత సూర్యోదయమయింది.

ప్రతిపదసార్థక్యం

అత్యుదగ్ర తమిస్రదుర్వ్యాపృతి ప్రభిన్నమానైకశక్తి
సంపన్న నిశితభానుకిరణ ప్రశస్తమై ప్రాచి దోచె!'

ఇది ప్రతిపదసార్థకమైన వర్ణన. తమిస్రం అజ్ఞానానికి ప్రతీకగా భాసించి దాని అత్యుదగ్రత్వం, దాని దుర్వ్యాపారత్వం సూచింపబడ్డాయి. చీకట్లదుర్వర్తనంలో అజ్ఞానపు విచ్చలవిడితనం స్ఫురిస్తోంది. దాన్ని భేదించేశక్తి వాడియైనసూర్యకిరణానికే ఉంది. ఆ సూర్యకిరణాలతో ప్రశస్తంగా తూర్పు కనిపించిందనడంలో కవి ఊహాబలం గోచరిస్తుంది.

దైవదర్శనం

జ్ఞానస్వరూపుడైన భగవంతుడ్ని పూజించడానికనువైన సమయం ఉదయకాలమే మరి. భక్తుని దృక్పథంలో భగవంతు డెలాంటివాడు? అతని సంస్కారమేమిటి భగవంతుడ్నిగురించి?

1 ముద్రణ: 1928 ప్రభవ. చూ. శ్రీశ్రీ సా. ఒకటి. కావ్య. 37 పే.

ఏయనంత ప్రభావ దుర్జ్ఞేయమాన
మానితాచ్ఛపరంజ్యోతివో! నితాంత నిస్తుల గుణాబ్ధివో!

ఇట్టి పరాత్పరుడ్ని దర్శించాలని ఉవ్విళ్లూరుతాడు భక్తుడు. ఆయన కనిపిస్తే భక్తుడు చేసేదేమిటి?

హృదయార్పణం

కందళించిన హృదయారవిందసుమము
భక్తిపూర్వకముగ సమర్పణమొనర్తు.

అని సంకల్పం చెప్పుకుంటాడు. అసలు భగవంతుడ్ని చూడలేకపోయినా, ఆలయంలోని ప్రతి కృతిని చూసి ఉప్పొంగిపోతాడు. దర్శనైకమాత్రంచేత కలిగిన ఆనందం కాదిది. ఆ దర్శనంవల్ల తన కల్మషాలన్నీ క్షాళితమైనట్లు భావించే ఆనందం. ఈవిషయాన్ని ఒక మనోహర భావ చిత్రంతో వ్యక్తీకరించాడు—

మహిత భవదీయరూపసంపద్విలాసనిర్మలాంచితమందాకినీతరంగ
సమవగాహనోపార్జితవిమలపుణ్యమహిమ కారణగళితకల్మషుండనైతి.

భగవంతుని రూపమందాకినీతరంగాలలో తాను స్నానమాడాడు. అందువల్ల కలిగిన పుణ్యం, తన పాపాలను హరించిందని తృప్తిపడ్డాడు.2 ఈ భక్తుని అర్చనవిధానంలో వివిధావస్థలున్నాయి. ఈ ఖండికలో మొదట అర్చనకుతూహలం, తరవాత దర్శనం, తరవాత ధ్యానం, ఆ తరవాత సంకీర్తనం. కవియైన భక్తుడికి సంకీర్తనమే పరమధ్యేయం.

పరమేశ్వరైక్యం

దీర్ఘహర్ష ప్రదాయకదివ్యభావగీతికానవ్యరాగసంకీర్తనమున
నైక్యమయ్యెదద్వన్మనోహరదిగంత విశ్రుతశ్లోకపరిశుభ్రవీచికలను

అంటాడు. భావగీతికలకు భక్తికూడా ఒక దినుసు. వాటికి 'రాగం' ప్రాణదాయిని. ఈ భక్తి చైతన్యంతో భగవంతుడ్ని కీర్తిస్తూ ఆయన కీర్తివీచికలలో తాను లీనమైపోతాననడం భక్తికి పరాకాష్ఠ.

---

2 ఈ కవియే ఉత్తరకాలంలో 'ఏది పాపం ఏది పుణ్యం' అని ప్రశ్నిస్తాడు. భగవంతుడ్నిగూర్చి విచికిత్సలో పడతాడు. (చూ. సదసత్సంశయం).

## ఓ వలాహకశకలమా ! నీవు కూడ నావలెఁ బరిభ్రమించున్నావదేల?

ఆకాశంలో తనలాగే తిరుగుతున్న మబ్బుతునకను చూస్తాడు కవి. దానితో తనకేమి పోలిక ? చిత్తచాంచల్యం ఒక్కటే ! దానికున్న శక్తులెన్నో తనకులేవు.1

మేఘశక్తి

ఈ ప్రకృతి రహస్యం గాఢమైనది. దాన్ని తెలుసుకోవాలని 'విశ్వపథముల నడయాడి' వేసరిల్లుతున్నాడు కవి. కాని ప్రకృతినే అనుశాసించగల మేఘశకలం కూడా తనవలెనే పరిభ్రమించడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. 'ఓ వలాహకశకలమా ! నీవు కూడ నావలెఁ బరిభ్రమించుచున్నావదేల ?'2 అని అచేతనమైన మబ్బును పలకరించడం ఆశ్చర్యావహం. అయితే ఆ మబ్బు రహస్యం తనకు తెలుసు. ఇది అతడు కనుగొన్న ప్రకృతిరహస్యమే. వలాహకశకలానికున్న శక్తులను పేర్కొంటూ దాన్ని స్తుతిస్తాడు కవి. అందులో మొదటిది సూర్యుడ్నికూడా మరుగుపరచగలగడం.

నీవెకా నిస్తులోన్నిద్ర నియతకాంతి
రాశివై, భువనత్రయారాధ్యుఁడైన
భానునంతటి భాస్వత్ప్రభావయుతుని
మఱుగుపఱతు వనాయాసకరనిరూఢి !

ఈ శక్తి తనకున్నట్లు మబ్బుకు తెలియదట. అదే కవికాశ్చర్యకరం. రెండవది ఎడతెగని వానలు కురిపించగలగడం.

తీక్ష్ణశక్తులతో సముద్రకల్పవిలయకాల ఝంఝామరుద్వీచికలు సెలంగ
భీషణశతఘ్నికావినిర్ఘోషసదృశసింహనాదమొనర్చుచు స్థిరనిరంత
వారిధారలఁ గురియించు వైభవంబు నీ ప్రభావము కాదె !

---

1 ముద్రణ : ప్రభవ (1928) చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 28–29 పే.

2 ఓయి సంధ్యాసమీరణా ! అనే కృష్ణశాస్త్రిగారి సంబోధన గుర్తుకువస్తుంది.

మేఘశకలం విజృంభించినపుడు ప్రళయకాలపుతుపానుగాలులు వీస్తాయనీ, అది సింహంవలె ఉరుముతుందనీ, వానలు కురిపిస్తుందనీ వర్ణించడం ద్వారా కవి అభివ్యక్తం చేయదలచినది ఆకృతిని బట్టి అంతర్మహిమను గుర్తించలేమనియే. శక్తి విజృంభించడానికి సముచితసమయమూ వాతావరణమూ లభించాలి కదా. మూడవది – సంధ్యలందు రంగులతో ప్రకాశించగల్గడం.

సాంధ్యరాగప్రభాంకురచ్ఛాయలందు వివిధవర్ణసముజ్జ్వలవిభవమంది ..
...విహాయసవీథులందుఁ దాండవించెడు సమధికోత్సాహశక్తి నీ నిధానము కాదె.

మబ్బు నల్లనిదైనా ఇంద్రధనుస్సు ఏర్పడినప్పుడు వివిధవర్ణసముజ్జ్వలవైభవం పొందుతోంది. ఉభయసంధ్యలలోనూ మబ్బులు రంగులు మార్చుకుంటాయి. ఈ ప్రకృతిసత్యం ద్వారా కవి చెప్పదలచిన దేమిటంటే బాహ్యాదర్శనాన్నిబట్టి వ్యక్తి విలువలు నిర్ణయించుకోరాదనీ సమయానురూపంగా శక్తులు బయటపడతాయనీ.

## ఆదర్శాలకై ఆవేదన

ఈశక్తులను స్తుతించడం ద్వారా వాటినన్నింటినీ తానుకూడా మున్ముందు సంపాదించుకోవాలనే ఉత్కంఠను కవి వ్యక్తం చేస్తున్నాడు. ఇంతకీ ఈ మేఘశకలం ఎవరు ? తన ఆదర్శం మాత్రమే.3 ఆదర్శాలను అందుకోవడానికి తపన ఉండాలి. ఆ తపనయే చివరిపద్యంలో గాఢంగా ముద్రితమయింది.

'చంచలమనస్కుఁడై పరిభ్రమించు నేను నిన్నుఁ బోలితిగాని యత్యున్నత
ప్రభావసంపన్నిరూఢవైభవములందు నిన్నుఁ బోలిన ధన్యుండనే...'4

7

స్వేచ్ఛ

# విహాయసపథాల నెఱుకపడరాని యెచటికో ఎగసిపోదు!

తానొక పెద్దచెట్టుకి ఆకుగా మారిపోవాలి. రెక్కలురావాలి. గాలిలో పైకి ఎక్కడికో ఎగిరిపోవాలి. ఇలాంటి స్వేచ్ఛను కవి కోరుకుంటాడు.1

## స్వేచ్ఛాభిలాష

మానవుడుగా తానొక ఉన్నతోన్నతస్థానం పొందడానికి కావలసిన స్వేచ్ఛయే కవి ఆకాంక్ష. ఈ స్వేచ్ఛాభిలాష తెలుగులో భావకవిత్వంతోనే మొదలయింది. కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షంలో తొలి ఖండికలు 'స్వేచ్ఛాగానము'లే.

'ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలోఁ గొమ్మనై నునులేత రెమ్మనై'

పోతాననీ 'జగమునిండ స్వేచ్ఛాగానఝురుల నింతు' ననీ 'అలుగునమ్యోదఁ జిగురాకు నయ్యోదను' అనీ, సంధ్యాసమీరంతో 'నీదు నునులేత ఱెక్కలమీద వడిగ నెత్తుకొని పోవరాదె నన్నెచటికేని' అనీ కృష్ణశాస్త్రిగారి వాణిలోని బాణీలు. ఈ ఆవేశంతోనే—

నేను సైతమొక్కాకునై యెనయుదేని2 ...గాలియొసఁగెడు కొత్త ఱెక్కల.ధరించి
అతినిరాఘాటముగ విహాయసపథాల నెఱుకపడరాని యెచటికో ఎగసిపోదు3

అని పాడుకున్నాడీకవి.

## దివ్యవృక్షం

కానీ తాను ఏ వృక్షంమీద ఆకుగా మారదలచాడో ఆ వృక్షం మాత్రం సామాన్య మైనది కాదు. అది 'మహోన్నతదివ్యవృక్షాగ్రం.' ఈ దివ్యవృక్షం ఈ జగత్తుకొక ప్రతీకగా

---

1 ముద్రణ : 1928 ప్రభవ. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 27 పే.

2 ఈ నుడికారం జయభేరి గీతంలో 'నేనుసైతం ప్రపంచాగ్నికి సమిథనొక్కటి ఆహుతిచ్చాను' (1933) అని రూపొందింది.

3 ఈ ఆశయమే రూపాంతరం పొంది 'నేనుసైతం భువనభవనపుబావుటానై పైకి లేస్తాను' అనీ, 'అనర్గళం, అనితరసాధ్యం, నా మార్గం' అనీ ఆవిష్కృతమయింది. సామాజిక స్పృహ ఏర్పడి నపుడు 'పదండి ముందుకు......పోదాంపోదాం పైపైకి' అన్నాడు.

భావించాడు కవి. ఈ చెట్టున పుట్టే ఆకులన్నీ గొప్పవి కావు. 'నూత్న చైతన్యరాగసన్నుతము' లైనవి కొన్ని మాత్రమే ఉంటాయి. ఈ పత్రాలు ఉత్తమ మానవులకు ప్రతీకలు. ఇటువంటి పత్రసంఘముల నడుమ తానొక పత్రం కాదలచాడు కవి. ఈ విధంగా తన మహిత్వాశయాన్ని మర్మంగా ప్రకటించాడు. తాను అందరివంటివాడు కాకూడదు. అయితే అందరూ ఎటువంటి వారు ? చెట్టునుంచి క్రిందికి రాలిపోయే ఆకులవంటివారు.

> '...జీవించియున్న కాల మాటపాటలతోఁ
> బూర్తియైన వెనుకఁగళలఁగోల్పడి కలుషపంకమునఁ జిక్కి క్రిందఁబడి
> పాంథజనుల త్రొక్కిళుల నుక్కి ప్రకృతి యాగారమున'

నశిస్తూ ఉంటారు. తన కటువంటి నాశనం రాకూడదు. ఆకాశంలోకి ఎక్కడికో రెక్కలుదాల్చి ఎగసిపోవాలి. కవి భవిష్యజ్జీవితంలో తానే 'విహాయసపథాలకు' పోదలిచాడో ఇక్కడ ఆ ఆత్మ విశ్వాసం వ్యక్తమవుతోంది.4 కవికి గల స్వేచ్ఛాప్రియత్వం, భావావేశతీవ్రత వ్యక్తమవుతున్న ఈ ఖండిక 'ప్రభవ'కు తిలకాయమానమవుతోంది.

విహగ కలకూజితధ్వనివిధములందు
స్వీయకంఠారవము మేళవించుకొందు !

ప్రకృతిసౌందర్యానికి ముగ్ధుడవుతాడు; ప్రకృతి వాత్సల్యానికి ఉప్పొంగిపోతాడు. తన సంగీతం, సాహిత్యం, నాట్యం అన్నీ ప్రకృతిని ఆరాధించడానికి వినియోగపడాలంటాడు—ఈ కవి.[1] అయితే ఈ బాణీ కొత్తదేమీకాదు. అప్పటికే రాయప్రోలు, వెంకటపార్వతీశ్వరకవులు, కృష్ణశాస్త్రి, రామిరెడ్డి, అబ్బూరి, కవికొండల మొదలైనవారు ప్రకృతిని ఆరాధిస్తూ గీతాలు వ్రాశారు. ప్రకృతిగీత అనే ఈ ఖండికలో ఈ కవి ఛందస్సులో కొత్తదనం చూపిస్తాడు. మూడు తేటగీతులూ మూడు శార్దూలాలూ పర్యాయక్రమంలో రచిస్తాడు.

ప్రకృతిక్రీడాంగణం

ప్రకృతిలో మాధుర్యసౌందర్యాలూ పూలపరిమళాలూ రంగురంగులూ కనిపించాయంటాడు. ఆ ప్రకృతినిలయంలో అతనికి ఆడుకోవాలనిపిస్తుంది.

మాధురీమోహనంబిది మసృణకుసుమవాసనావాసితం బిది వైభవప్ర
భావభావబంధురబహుతరప్రభలకెల్ల ఆటపట్టిది ! ఇచట నేనాడుకొందు !

ఈ శిశుదశనుంచి కవి దాటి తన భావనను యౌవనాంగణంలోకి ప్రసరింపజేయగానే అతనికి ప్రకృతి ఒక కాంతగా గోచరిస్తుంది.

ప్రకృతిప్రణయం

ఆమె స్వచ్ఛప్రణయం ప్రకటిస్తూ స్వాగతం పలుకుతుంది. ఆ ప్రణయాన్ని అందుకుని ఆమె మెడలో పూలదండలు వేస్తాడు. అయితే అవి అతని కావ్యమాలలు మాత్రమే !

నవ్యంబీ ప్రకృతీలలామ మృదుకంఠంబిందు మద్గీతికా
కావ్యస్రఙ్నివహంబు గూర్చెద నలంకారప్రభాస్ఫూర్తితోన్

1 ముద్రణ : 1928 ప్రభవ, చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 30 పే.

ఈవిధంగా తాను కవిననే చైతన్యం ప్రస్ఫుటీకరించుకున్నాడు. ప్రకృతియే తన కవిత్వానికి ప్రేరణమయింది. కవిత్వానికే కాదు సంగీతానికి కూడా ప్రకృతియే ప్రేరణ. కవి సంగీతప్రియుడు. ప్రకృతిలో పక్షుల కలరవాలే సంగీతం. ఆ సంగీతంతో తన కంఠాన్ని మేళవించుకోవాలని అతని ఆకాంక్ష.

...అమృత పేశల నవమాధురిమము గూర్చు
విహగకలకూజితధ్వనివిధములందు
స్వీయకంఠారవము మేళవించుకొందు.

ప్రకృతిప్రేరణవల్ల కవిత్వసంగీతాలతోబాటు నృత్యమూ తనకు లభిస్తుందని కవి ఆశయం. 'ప్రత్యూష స్ఫురదభ్రమండలవిభావైచిత్ర్యం' చూసి అతడు నృత్యక్రీడలలో తేలిపోతానంటాడు. ఈ ఉదయాకాశం అతనికి ఆనందకరమే కాదు; ఆశ్చర్యకరం కూడాను. ప్రకృతిలో ప్రధానాంశంగానే అది అతనికి గోచరించింది. అందుకే–

'ఈ ప్రకృతి గర్భకుహరకాంతిప్రసార
వీచికామార్దవమునకు వివశమతిని'

అని ప్రకటించుకుంటాడు. ప్రకృతి అతనికొక 'ఆనందసదనం'గా సాక్షాత్కరించింది.

### ప్రకృతిమాత

ఈ ప్రకృతియే 'సృష్టిప్రాభవమూర్తి', 'కృపామాధురీ వృష్టింజెందెడు దేవి'. ఈ రెండు విశేషణాలూ సార్థకాలే. ప్రకృతి నొక దైవీశక్తిగా భావించడం వేరు; ఆమెను దయామూర్తిగా భావించడం వేరు. ఆమె కారుణ్యమూర్తి కనుకనే మానవుడు లలితకళలను పొందగల్గుతున్నాడు. ఆనందమయంగా జీవించగల్గుతున్నాడు. అందుకే కవి 'అర్పించెదన్ సాష్టాంగప్రణతుల్ నిరంతరము సాహస్రాతిరేకంబుగన్' అంటాడు. కవిత్వం, సంగీతం, నాట్యం ఈ మూడింటినీ కవి క్రీడలుగానే భావించాడు. ఆ క్రీడలను ప్రకృతిపర్యంకంలో ఆడుకోదలచిన ముగ్ధహృదయుడీకవి. ఇది భావకవితాసంప్రదాయమే.

### అక్షరపునరావృత్తి

సమాసరచన చేసేటప్పుడు శ్రావ్యత కోసమూ ఉచ్చారణమాధుర్యం కోసమూ ఒక అక్షరాన్ని పునఃపునరావృత్తం చేయడం ఒక శైలీ విశేషం. మచ్చుకి–

(1) మసృణ కుసుమవాసనా వాసితము (2) వైభవ ప్రభావ బంధుర బహుతరప్రభలు

పద్యరచనాపాటవం

పద్యరచన పసందుగా ఉండటానికి కొన్ని చిట్కాలున్నాయి. వాటిలో కొన్నింటిని ఈకవి అవలంబించాడు. మొదటిది: సంయుక్తాక్షరప్రాసతో పద్యం నడపడం. ఈ ఖండికలో మూడు శార్దూలాలూ అలాంటివే. వ్య, త్య, ష్ణ అనేవి వాటిలోని ప్రాసాక్షరాలు. రెండవది: కనీస మొక దీర్ఘసమాసమైనా కూర్చడం. ఇందువల్ల పద్యగతికి ఠీవి వస్తుంది. ఈ రెండింటికీ ఒక పద్యం ఉదాహరిస్తే చాలు.

అత్యంతప్రమదప్రదంబగుచు నత్యాశ్చర్యముంగూర్చు నీ
ప్రత్యూషస్ఫురదభ్రమండల విభావైచిత్ర్యముంగాంచి ప్రా
కృతారాధ్య మహాద్భుత ప్రతిభకున్ హృష్టాంతరంగుండనై
నృత్యక్రీడలఁ దేలిపోదు నను నేనే విస్మృతిం జెందుచున్.

మూడవది: పద్యం శార్దూలమో మత్తేభమో అయితే అందులో పరుషాలు, మహాప్రాణాలూ, ద్విత్వసంయుక్తాక్షరాలూ బహుళంగా వాడటం. దీనివల్ల గతిలో ఓజస్సు సిద్ధిస్తుంది. ఇది శ్రీనాథ మార్గం. దీనికి కూడా పై పద్యమే ఉదాహరణ. నాల్గవది: ఒకేవిధమైన వాక్యాలను పద్యంలో గుప్పించడం. ఇది తేటగీతులలో కనిపించే పద్ధతి.

(1) ఇది మహోజ్జ్వలమమృతరసైక మధుర
మిది మనోహర మానందసదన మిద్ది

(2) మాధురీమోహనంబిది మసృణ కుసుమ
వాసనావాసితంబిది వైభవప్రభావ
బంధురబహుతర ప్రభలకెల్ల ఆటపట్టిది.

ఇది కృష్ణశాస్త్రిగారి బాణీ! 'ఇది నితాంతతమఃక్రాంత మిది దరిద్ర మీ నిశాంతమ్ము, శూన్యమిం దెన్నడో రహశ్శిథిలసుప్తిఁ గలవరమంది లేచి గుబులుకొను లేత నెత్తావి గుసగుసలెవో' కృష్ణపక్షము–94 పే.

మయూరనర్తనము

గుణమెమ్మొటనున్న నచ్చటం బరగెడు దుర్గుణాంబు
గుణమాత్రమె మెత్తురు మానవోత్తముల్

నాట్యమాడే నెమలి ఎంత అందంగా ఉంటుంది? కానీ దాని కూత ఎంత కఠోరంగా ఉంటుంది? దాన్ని మెచ్చుకోవాలా? అసహ్యించుకోవాలా? దీనికి సమాధానం ధ్వనించే ఖండకావ్యం మయూరనర్తనం.1

నృత్యన్మయూరం

'అతి దివ్యసుఖోత్సవదాయి నీల సత్ప్రియక వనాంతర స్థలవిరాజిత రమ్య సరస్తటంబు' లలో తాండవించేటపుడు ఆ మయూరం శోభను ఇనుమడింపజేసేవి దాని 'శిఖానుయనాఖములు'. ఆ పింఛపుకాంతులు 'సాంధ్యరాగరక్తిమము'ను గేలిచేస్తాయంటాడు కవి. అనితరసాధ్యమైన రూపవైభవం నెమలిది. అందువల్ల దానిలో ఒక గర్వరేఖ ప్రకాశిస్తూ ఉంటుంది. అందువల్లనే అది వనానికి రాజువలె గోచరించింది కవికి. ఆ స్ఫూర్తితో అంటాడిలా-

'వనమునకెల్లఁ బూజ్యతరభావముచే నభిషిక్తసార్వభౌముని గతిఁ
జిద్విలాసములఁ బొల్పగు రీతుల నాట్యమాడుచూ!'

మబ్బులను చూసి పురివిప్పడం మయూరసహజాతమే. మయూరనాట్యసౌందర్యరసజ్ఞత జలదాలకే ఉంది కాబోలు. ఆ సమయంలో మయూరనాట్యనవోన్మేషరోచులు ప్రమదవనంలోని సూర్యోదయకాంతులవలె భాసిస్తా యని కవి అంటాడు.

సందర్భోచితసాదృశ్యం

జలదములఁ గాంచి సంతోషజలధిఁ దేలి యతిమనోహరగతి నాట్యమాడునపుడు
నీ నవోన్మేషరోచిర్వితానములరుఁ బ్రమదవనమున సూర్యోదయమువిధాన.

ఇక్కడొక విచిత్రమైన భావస్ఫూర్తి ఉంది. నెమలి నాట్యమాడేది ప్రమదవనంలో. జలదాలు రాగా ప్రమదవనంలో కాంతి దిగజారుతుంది. అప్పుడు నెమలి పురివిప్పుతుంది. అది సూర్యోదయంగా భాసిస్తుందట. ఇలా ఉపమానాన్ని వర్ణ్యమానసందర్భంనుంచే తీసుకుంటాడు. వనాం

---

1 ముద్రణ: 1928. ప్రథవ. చూ. శ్రీ శ్రీ పా. ఒకటి. కావ్య. 31 పే.

తరవీథులలో తాండవించే మయూరాన్ని చూడగా తనకు ఆ అనిర్వచనీయసుఖానుభూతి ఎందుకు కలుగుతోంది? ఇది కవి తనకు తానే వేసుకున్న ప్రశ్న.

కలితసురూపసంపదలఁ గల్గినవారిని గాంచినంత ని
ట్లలరు గదా మనోహరతరామలభావము వారియందునన్[2]

సౌందర్యసందర్శనజనితానుభూతి కిది వ్యాఖ్యానం.

మయూరగళకఠోరత

ఇక్కడే ఈ కవి ఇంకొక అడుగు ముందుకు వేసి తన బుద్ధికౌశలాన్ని నిరూపించుకున్నాడు. నెమలి రూపం, నాట్యం చూసి ఆనందించేవారే దాని కంఠధ్వనికఠోరత్వం విని అసహ్యించుకుంటున్నారు.

నీ సముదగ్రనాట్యము ననేకులుగాంచి యనంతహర్ష సం
వాసితమానసంబుల సెబాసని మెచ్చిరిగాని నీ కఠో
రాసహరావమున్ వినినయంతట వారికి రోతపుట్టె న
య్యో! సరికావె కూతలు మహోద్ధతతావకలాస్యపాళికిన్.

దీనికి కారణమేమిటి? వారి అల్పత్వమే. గుణదోషాలు రెండూ ఉండటం ప్రకృతిసహజమనీ గుణమే మెచ్చుకుని దోషం విడిచిపెట్టడం ఉత్తమలక్షణం అని కవి సమాధానం. ఈ సమాధానంలో నెమలి కంఠధ్వని నసహ్యించుకొనేవారిని నిందించడం వ్యంగ్యంగా నిక్షిప్తమై ఉంది. వారు దోషదర్శనం మానుకోవాలని కవి అభిప్రాయం. లాస్యపాళికి సరికాని కూతలను చూసి కవి జాలిపడుతున్నాడు.

సాత్త్వికదృక్పథం

ఈదోషానికి కారణం దైవసృష్టియే అయినా దైవనింద పనికిరాదనే కవి చెప్పదలచాడు. ఏమంటున్నాడు కవి?

సురుచిర రూపసంపదల సొంపులొసంగి యొసంగఁడయ్యె మా
ధురిఁ జిలికించు సుస్వరము ధూర్తుఁడు దేవుఁడటంచు నెంచరా
దరయఁగ నుర్వి నిల్లె కసనొను గుణమ్మొటనున్న నచ్చటం
బరగెడు దుర్గుణంబు గుణమాత్రమె మెత్తురు మానవోత్తముల్.

---

2 కాళిదాసుసూ, కిట్సునూ జ్ఞాపకంచేసే సూక్తి ఇది.

ఈ సాత్త్వికదృక్పథం కవికి సంప్రదాయం నుంచి సంక్రమించిందే.3

అర్థాంతరస్ఫురణ

ఈ ఖండికను ఒక చిన్న ధ్వనికవితగా భావించవచ్చు. భగవంతుని సౌందర్యసృష్టి మయూరం. ఈ మయూరం కవి కావ్యసౌందర్య సృష్టికొక ప్రతీకగా భాసిస్తోంది. మహాకావ్యం 'అనితరసాధ్యరూప విభవాతిశయంబునఁ బొల్చు గర్వరేఖను వెలిబుచ్చుతూ' ఉంటుందని అది సాహిత్యవనంలో అభిషిక్త సార్వభౌమునివలె నాట్యమాడుతుందనీ రసజ్ఞజలదాలవల్ల కావ్య మయూరం నాట్యమాడుతుందనీ కావ్యపఠనంవల్ల 'అనిర్వచనీయసుఖానుభూతి' కలుగుతుందని మహాకావ్యంలో సహితం దోషాలుండకపోవనీ గుణగ్రహణపారీణులే ఉత్తమపాఠకులనీ ఈఖండిక లోని భావచిత్రాల అంచులలో మెరిసీమెరయకుండా కనిపించే అర్థాంతరం.

నాకుఁ దోచెను ప్రకృతికాంతాశరీర
సౌరభాకృష్ట మధురసంస్పర్శ సుఖము!

ప్రకృతి తనతల్లి. పూలలో ఆమె శరీరాన్ని తాకుతాడు. గాలిలో ఆమె మాటలు వింటాడు. సెలయేళ్లలో ఆమె ప్రేమను అనుభవిస్తాడు. ఈ అనుభవాలను తనలో తాను స్మరించుకుంటాడు.[1]

## ప్రకృతికాంత స్పర్శ

ఈ యుషః ప్రస్ఫురద్రమణీయ వేళ నవవికస్వరమృదులతాంతములయందు
నాకుఁ దోచెను ప్రకృతికాంతాశరీరసౌరభాకృష్టమధురసంస్పర్శసుఖము

అంటాడు. పూలు మెత్తనివి; వికసించినవి; క్రొత్తవి. సమయం అందమైనది. తల్లి శరీరం సౌరభవంతం; మధురం. ఈ చెప్పబడిన విశేషణాలన్నీ ప్రకృతికాంతాశరీరసంస్పర్శలో ప్రతిబింబించడమే ఇక్కడ వైచిత్రి. ఆ పూలను తాను కోసుకోలేదు. అవి లతాంతాలుగానే ఉన్నాయి. ఇలా ఇందులో ప్రతిపదమూ కవిభావనకు దోహదంచేస్తుంది.

## ప్రకృతి మృదూక్తులు

ఆ ఉదయకాలంలోనే గాలికెరటాల మర్మరధ్వనులు వినిపించాయి. కానీ ఆ ధ్వనులలో అతడు విన్నవి ప్రకృతియోషామృదూక్తులు. అవి అమృతప్రాయంగా ఆనందం కలిగించాయి.

మంజులసమీరణోర్మికామర్మరధ్వనీమిషమ్మునఁ బ్రకృతియోషామృదూక్తు
లమృతనిభముగ హర్షదాయకములయ్యె రసపిపాసాతురహృదంతరాళమునకు

ఈ రసపిపాస మాతృప్రేమరసానికే సంబంధించినది.[2]

---

1 ముద్రణ: 1928 ప్రభవ. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 33 పే.

2 బాల్యంలోనే మాతృవియోగం పొందిన కవి ఇతడు. తల్లిమాటలు వినే భాగ్యానికి దూరమైన కవికి ఎప్పుడైనా ఆ స్మృతులే.

## ప్రకృతిప్రేమ

ఆ ఉదయకాలంలోనే కొండచరియలమీదనుంచి ప్రవహించే సెలయేళ్లు అతనికి మాతృప్రేమవాహినిగా కనిపించాయి.

ఉరుమహీధరసానునిర్ఝరనికాయనిర్మలాంబుప్రవాహానిర్ణిద్రవృత్తి
విలసనమ్ములం బ్రకృతిదేవీ ప్రహృష్ట హృత్ప్రపూర్ణానురాగవాహినిగఁదోచె.

ఈ దృశ్యాలు మూడింటినీ అతడు ప్రకృతిలోనే చూశాడు. వీటి వర్ణనలో తనదైన అనుభవాన్ని జోడించడంలోనే భావకవిత ఆవిర్భవించింది. అందువల్ల ఇవి ఉత్తమభావచిత్రాలవుతున్నాయి. ఈ మూడు దృశ్యాలనూ ప్రకృతికాంతాపరంగానే ఉత్ప్రేక్షించడంలో శిల్పం ఉంది.

### భావాభివ్యంజకపదసామగ్రి

భావకవిత్వానికి సంగీతజనకమైన సుకుమారపదసామగ్రి అవసరమేకాని ఆ పదసామగ్రి ఉత్తిశ్రావ్యతకోసమే కాదు. ఆయా భావాలనది అభివ్యక్తంచేయగలగాలి. అనుభూతిని ఇంద్రియాల ద్వారా హృదయానికి అందజేయాలి. ఈ ఖండికలోని పదసామగ్రి భావాభివ్యంజకంగా ఉంది. అందుకే పర్యాయపదాల వాడకం భావకవిత కావశ్యకం. 'మంజుల సమీరణోర్మికామర్మరధ్వని' అనే పదబంధంలోని 'ఉర్మికామర్మర' పదాలు గాలిఊలలను చెవి కందజేస్తున్నాయి.

'ఉరుమహీధరసానునిర్ఝర నికాయ నిర్మలాంబుప్రవాహ నిర్ణిద్రవృత్తి'

అనే పదబంధంలోని 'మహీధర'లోని ఈకారదీర్ఘత కొండఎత్తునీ, నిర్ఝరనికాయనిర్మలశబ్దాలు సెలయేటి గలగలలనీ వ్యక్తంచేసి ఆ అనుభూతిని కలిగిస్తున్నాయి.

## 11

## సముద్రఘోషము

నేను దుఃఖింతు మానవాజ్ఞానమునకు!
నేను హర్షింతు మానవజ్ఞానమునకు!

తానే ఒక సముద్రుడు. మానవజీవితాన్ని విమర్శిస్తాడు. తన శక్తిని తాను తెలుపుకుంటాడు. భగవంతుడే గొప్పవాడంటాడు. ఈ మాటలు ఉపన్యాసంలా ఆవేశంతో నడుస్తాయి.[1]

సాగరఘోష

'ఈ నిరాఘాట దేదీప్యమానకాంతిసంతతుల
మధ్యమున నిరభ్యంతరముగ నే వెలిగిపోదు-'

ఈ కాంతిసంతతులు సూర్యచంద్రాగ్నితేజస్సులకు ప్రతినిధులు. ఈ మూడు తేజస్సులూ ప్రపంచ ప్రకాశానికి మూలకారణాలు. సూర్యచంద్రులు కాలానికి సంకేతాలు. కాలగర్భంనుంచి వీరిద్దరూ ఉద్భవిస్తారు.

నా మహానినదములకుఁ గాలగర్భప్రతిధ్వానగతులు వచ్చు!

ఈ కాలగర్భప్రతిధ్వానాలు సూర్యచంద్రులే! అయితే సముద్రుని నినదాలకు హేతువైనవాడు వాయువు. శాస్త్రివాస్తవికతను కవి కవితాసత్యాలుగా మలచుకుంటున్నాడీవిధంగా. 'కాలగర్భం' అనే పదబంధం చిత్రమైనది. దీనికి గతకాలం అని కూడా అర్థం. గతకాలం అంటే చరిత్ర. సముద్రుడుచేసే ప్రతినినదమూ కాలగర్భంలో ప్రతిధ్వనిస్తూ ఉంటుందని వ్యక్తమౌతోందిక్కడ. ఈ సముద్రుడు ఎవడు? ఒక మానవోత్తముడికి ప్రతీక. ఈ మానవోత్తముడి మాటలే ఆ నినదాలు. ఆ మాటలు చరిత్రలో నిలుస్తాయి.

---

1 ముద్రణ: 1928. ప్రభవ. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 34 పే.

నా కవిత్వానికి సముద్రమే ఆవేశం. -(శ్రీశ్రీసా. రెండు వచన. 389 పే.) అంటాడు శ్రీశ్రీ. అందుకే గగనసాగరగంభీర గర్భం; తిరిగితిరిగి సముద్రాల్ జలప్రళయనాట్యం చేస్తున్నవి; నోరెత్తి హోరెత్తి నొగులు సాగరము; విలయసాగరతరంగాలో; ఆనందం అర్ణవమైతే; నడిసంద్రపు కెరటాల్లో మ్రోగిన శంఖారావం; శతకోటిసముద్రతరంగాల మ్రోతలు; హోరెత్తిన సప్తసముద్రాల్; నడిరాతిరి కడలివద్ద హోరుగాలి ఉపశ్రుతి; జడలు విచ్చిన సుడులు రెచ్చిన కడలినృత్యం; సముద్రంలో బడబాగ్ని; మాయమైన మహాసముద్రాలు; నిరంతరం ఘోషించే నీరనిధి; సముద్రంమీద సంతకం చేసే (జాబిల్లి) మొదలైన పదచిత్రాలెన్నో శ్రీశ్రీ కవిత్వంలో కనిపిస్తాయి.

## సముద్రుని సామ్రాజ్యం

ఈ మానవజాతి కంతటికీ పరిపాలకుడు కూడా ఈ సముద్రుడు. ప్రపంచంలో అన్ని ఖండాలనూ సముద్రుడు చుట్టుకునే ఉన్నాడు కనుక ఈ పరిపాలన సాధ్యమవుతోంది. అతని నినాదాలకు అర్థాలు అతని ఆజ్ఞ లేనట !

నేనొక విశాలరాజ్యలక్ష్మీనృపాలపద మధిష్ఠింతు !
నా రాజ్యపాలనమున నిరత ముదయించు
నిర్ఘోషనిచయమందు
మామకాజ్ఞాప్రణాళికల్మలయుచుండు.

ఈతని ఆజ్ఞలతో మానవజాతిని నిగ్రహించడమే పని కాదు. మానవజాతి నతడనుగ్రహిస్తూనూ ఉంటాడు. ఈ పరిపాలనలో అతనికి సుఖదుఃఖాలు రెండూ కలుగుతూనే ఉంటాయి. సుఖదుఃఖ పరంపరలతో నిండిన వ్యక్తి జీవితమే చరిత్ర అవుతుంది. సముద్రుని చరిత్ర మాత్రం నిరంతర కల్లోలాలతో నిండిఉండటంవల్ల అతనికికూడా అర్థంకాదట.

నే ననుగ్రహనిగ్రహజ్ఞానమతిని నా కనారతమానందశోకగతులు
కలుగుచుండును నాకింత తెలియరాక నా చరిత్రము నాకె యన్వయము కాదు.

ఆనందశోకాలు రెండూ కలగడానికి కేవలం వ్యక్తిగతాలు కావు కారణాలు సముద్రుని విషయంలో. అతడు వసుధైకకుటుంబి కావడంవల్ల మానవజాతివల్లనే అవి రెండూ కలుగుతూ ఉంటాయి.

## జ్ఞానం, అజ్ఞానం

ఇలా చెప్పుకుంటాడతడు_

నేను దుఃఖింతు మానవాజ్ఞానమునకు నేను హర్షింతు మానవజ్ఞానమునకు
అఖిలమనుజ దుఃఖప్రమోదాశ్రుసలిల ధార భరియింతు క్షారడిండీర రుచుల.

మానవుల అజ్ఞానంవల్ల కలిగే అనర్థాలనేకం. ఇవి సముద్రుని దుఃఖానికి కారణం. మానవుడు జ్ఞానంవల్ల బాధావిముక్తుడవుతూ ఉంటాడు. ఇది సముద్రుని ఆనందానికి హేతువు ! ఆ దుఃఖమూ ఈ ఆనందమూ సముద్రప్రమాణం గలవే. సముద్రపుక్షారరుచికి నూతనార్థమొకటి ఊహింపబడింది. మానవుల దుఃఖాశ్రుసలిలమే ఆ క్షారసముద్రంగా రూపొందింది. సముద్రపు డిండీర రుచికి (ఇక్కడ రుచి అంటే కాంతి మాత్రమే) మానవుల ఆనందాశ్రుధారయే కారణం అని ఒక నూతనార్థం ఊహించబడింది.

ఆనందదుఃఖాలు

సముద్రుని నినాదాలుకూడా రెండురకాలు. మొదటిది ఆనంద ఘోష. రెండవది దుఃఖ ఘోష.

అస్మదీయప్రమోదఘోషారవమున నవ్యగాన నినాదముల్ శ్రావ్యములగు !
మామకీనప్రచండతరామనస్యభరరవమునందు గద్గదస్వరము తోచు !

ఇంతటి ఉదారబుద్ధి, విశ్వహితైషి అయినవాడు సముద్రుడు. అతనికి అహంభావమూ ఉంది; అణకువా ఉంది. మొదటిదానికి కారణం మానవాతీత తేజశ్శక్తు లతనికి ఉండటం. అతడొక చండశాసనుడు. రెండవదానికి కారణం అతని ప్రజ్ఞ అతని సొంతంకాదనే వివేకం. తనను సృష్టించి తన గతులు నడిపే ఘనుడు మరొకడున్నాడనే జ్ఞానం.

'నా నిజప్రజ్ఞ శూన్యము ! నే నపూర్వ
మానవాతీత తేజఃక్రమ ప్రతీత
శక్తిగల్గిన చండశాసనుఁడ నిజము
కాని నన్ను సృజించి నా గతులు నడుపు
ఘనుఁ డతీతతరుండొక్కరుఁడు గలఁడు'.

ఆత్మాశ్రయత్వంలో వైచిత్రి

భావకవితాసంప్రదాయం ఈ శైలిలో చప్పట్లు చరుస్తున్నంత స్పష్టంగా ఉంది. మాటి మాటికి నేను, నా, నాకు, నన్ను వంటి తెలుగు సర్వనామాలే కాక, మామక, అస్మదీయ, మామకీన వంటి గీర్వాణపదాలు కూడా వాడటం భావకవుల ప్రత్యేక ధోరణి.

ఎఱుఁగవే నన్ను లోకభీకర మహోగ్ర
ఫణి విషస్ఫీత మృత్యురూపిణిఁగ నీవు?

మృత్యువు కనిపిస్తుంది. తన మహిమను గురించి వివరిస్తుంది. స్వార్థం మొదలైన దుర్గుణాలను విడిచివేయవలసిందని హెచ్చరిస్తుంది. ఇదంతా మానవుడితోనే. కవి తనే మృత్యువవుతాడు. మృత్యువు మానవశ్రేయస్సునే అభిలషిస్తుంది. కానీ ఆమె రూపం భయానకం.

మృత్యువు-మానవుడితో

మృత్యువుముందు మానవుడు నిస్సహాయుడు, హీనుడు, దీనుడు. తనదుఃస్థితిగతులను గురించి అతడు ఆలోచించుకోలేక తప్పటడుగులు వేస్తూ ఉంటాడు. ఇతరులను మోసగించడానికి ప్రయత్నిస్తూ ఉంటాడు; అందుకే మృత్యువు మానవుణ్ని ముఖాముఖిగా ఎదుర్కొంటుంది.

ఓయి మనుజుఁడ! నీ నిస్సహాయదీనహీనదుఃస్థితి గతులనూహింపలేక
ననుఁ బ్రతారింప వ్యర్థయత్నములొనర్చి నా కనుల ముందె తిరుగుచున్నావు!

జాతస్య మరణం ధ్రువం అనే సూక్తి ఇంతవరకూ తార్మారు కాలేదు. చావుతప్పదని తెలిసి కూడా మృత్యువు నెదుర్కోవడానికి మానవుడు యత్నిస్తూనే ఉంటాడు. ఇందులో తప్పులేదు. కానీ మృత్యువును ప్రతారించడం అంటే దాని శక్తిని గుర్తించనట్లు ప్రవర్తించడం. కలకాలం జీవిస్తాననే ఆశతో మనిషి ఎన్నో సంపాదించి, తానసుభవించక ఇతరుల ననుభవించనీయక దుర్మార్గంగా ప్రవర్తిస్తాడు. ఇది మృత్యుప్రతారణ మవుతుంది.

మృత్యువు స్వరూపస్వభావాలు

కానీ మృత్యువు అసామాన్యశక్తి కలది. అది ఎప్పుడెవరికోసం దిగివస్తుందో తెలియదు. అసలు దాని స్వరూపస్వభావాలెలాంటివి? ఇది ఊహించవలసిందే కాని ఎవరూ మృత్యువును సాక్షాత్ దర్శింపలేదు. మృత్యుదేవతను ఉద్ధతరసభావాల మూర్తిగా ఊహించడం సమంజసమే. ఈ కవి మృత్యువును రౌద్రవీరభయానకాద్భుతబీభత్సరసాల సమ్మేళనంగానే భావించాడు.

---

1 ముద్రణ: 1928 ప్రభవ. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 35-36 పే.

ఆమె (1)లోకభీకరమహోగ్ర ఫణివిషస్ఫీత. (2)(మానవ) హృదంతరసదనసంస్థితకరాళశిఖిశిఖాచ్ఛట. (3) భీప్రదక్రకచోగ్రదంష్ట్రాప్రభూత విస్ఫురత్తేజమున తాండవించునది. (4) విషానలకీలాప్రభావ దగ్ధసమస్త. (5) కరాళజిహ్వాక. (6) విషానలధూమరేఖావృత. (7) దివ్యతేజస్సముజ్జ్వల త్రిభువనాంతరాళనాట్యాలయ. (8) అగ్నివర్షిణి. (9) మేఘగర్జాగభీరభయదనిర్ఘోషగళ. (10) చరమసంధ్యాప్రదీప్తశోణవర్ణాభరక్తరోచుల స్ఫురించుగతులు గలది. (11) సర్వలోకైకచండశాసనచణ. ఈ వర్ణనలో కవి వాడిన కవితాసామగ్రి (1) నాగుబాము విషం. (2) అగ్నిజ్వాలలు, (3) రంపాల వాడి. (4) (విషాగ్ని) పొగలు. (5) అగ్నివర్షం. (6) ఉరుములు. (7) సాయంసంధ్యయందలి ఎర్రని కాంతులు. ఈసామగ్రిని ఎన్నుకోవడంలోనేకాదు దానిని వర్ణ్యానుకూలంగా మార్చుకోవడంలోనూ ఉంది-కవి శిల్పచాతుర్యం. మృత్యుప్రబోధంలోని వస్తువు మానవుడ్ని, ఉపనిషన్మిమాంసవలె మృత్యువును గురించి ఆలోచింపచేస్తుంది.2

శాబ్దికమృదంగంతో అనుభూతికల్పన

మృత్యువు మానవుడితో మాట్లాడటానికి వచ్చినట్లు కల్పించడమే ఈ కవి ప్రజ్ఞకు నిదర్శనం. మృత్యువు మానవుడితో ఏమంటుంది ?

ఎఱుంగవే నన్ను లోక భీకరమహోగ్ర
విఫణి వస్ఫీత మృత్యురూపిణిగ నీవు ?
నీ హృదంతర సదన సంస్థిత కరాళ
శిఖిశిఖాచ్ఛటనని గ్రహించెదవో లేవో ?
భీప్రద క్రకచోగ్ర దంష్ట్రాప్రభూత
విస్ఫురత్తేజమునఁ దాండవించు నన్ను
మృత్యుదేవతగా మది నెఱుంగ లేవో ?3

శాబ్దికమృదంగంద్వారా మృత్యుభీతిని కళ్లకు కట్టించడానికి ఇదొక ప్రయత్నం. ఫణివిషస్ఫీత, శిఖిశిఖాచ్ఛట, క్రకచోగ్రదంష్ట్ర వంటి పదబంధాల నుచ్చరించడమే ఒక భయంకరానుభూతి.4

2 ఈతని కవితావస్తువులో ముమ్ముందు రానున్న ఒక మార్పుకి ఈకవిత నాందీవాచకం వంటిది. దీని చివురులే సుప్తాస్థికలు, ఖండశశి, దివ్యానుభూతి, ఒకరాత్రి, ఆకాశదీపం, భిక్షువర్షీయసి, నవకవిత, కేక, పిశాచి, విదూషకుని ఆత్మహత్య, మేమే మొదలైనవి.

3 కృష్ణశాస్త్రిగారి బాణియే యిది.-ఎవ్వరనియెంతురో నన్ను - ఏ ననంత శోకభీకరతిమిరలోకైక పతిని కంటకకిరీటధారినై, కాళరాత్రి మధ్యవేళల, జీమూతమందిరంపుఁ గొలువుకూటాల నేకాంతగోష్ఠి దీర్చి......(కృష్ణపక్షము 58 పే.)

4 వికృతక్రూరక్షుధాక్షుభితమృత్యుకఠోరవికటపాండుర శుష్కవదనదంష్ట్రాగ్నిలో నవ్వేలా ? (ఆశః కృష్ణపక్షము 51 పే.) వంటి పాదాలలో ఈ అనుభూతి ఉంది.

ఇక్కడ పలికేది, పలికించేది కూడా మృత్యువే. శబ్దంనుంచి అర్థంవైపుకు మళ్లితే మనకు కనిపించేది నాగుబాము విషంతో మెరిసే రూపం, అగ్నిజ్వాలలు చేసే నాట్యం, రంపాలవంటి కోరలు. ఇదే తన రూపం అంటుంది మృత్యువు.

## మృత్యువుకీ జీవజాలానికీ అనుబంధం

తనకూ జీవజాలానికీ ఉండే చిరంతనానుబంధాన్ని మృత్యువిలా వివరిస్తుంది–

కనుగొనగదోయి! భావలోచనము దెఱచి మామకీన ప్రచండ తేజోమహత్త్వ
మీ విషానలకీలా ప్రభావ దగ్ధమై సమస్తము నడఁగు సృష్ట్యాది నుండి!
ఈ మదీయ కరాళ జిహ్వాకలయందు జీవసముదయమెప్పుడైనఁ జిక్కవలయు
ఈ విషానల ధూమరేఖావృతమయి యుందు జీవాళికదియె వైకుంఠపథము.

సృష్టితోపాటు మృత్యువుకూడా సృష్టింపబడింది. దానివల్ల సమస్తం దగ్ధమవుతుందా? జీవశక్తి నశించినదే దగ్ధంచేయబడుతోంది. అందువల్ల 'సమస్తము నడఁగు' అనే మాట అత్యుక్తిమాత్రమే. మృత్యువు ఒకే జిహ్వకలది కాదని కవి ఊహ. పాముకు రెండు నాలుకలుంటాయి. మృత్యువుకు చాలా నాలుకలుంటాయి. ఎప్పుడో ఒకప్పుడు జీవసమూహం దాని జిహ్వకలకు చిక్కక తప్పదు. మృత్యువొక విషానలధూమరేఖ. ఈ పొగలు సోకగానే జీవాలు మరణిస్తాయి. దీనినే 'వైకుంఠ మార్గం'గా మృత్యువు వర్ణిస్తుంది.

## మృత్యువు ప్రవృత్తి

మృత్యువు తన ప్రవృత్తిని గురించి ఇలా వివరించుకుంటుంది–

దివ్యతేజస్సముజ్జ్వల త్రిభువనాంతరాళతలమె మదీయ నాట్యాలయమ్ము!
నా ప్రళయతాండవమున జీవప్రకాండహృదయతంత్రులె నినదించు నుదితగీతి!
నా కనులఁబొల్చు సుప్రసన్న ప్రశాంతహాసకాంతులె కురియించు నగ్నివృష్టి
నా గళమునందు మేఘగర్జాగభీరభయదనిర్ఘోషములు వినంబడుచునుండు
నా గతులయందు చరమసంధ్యాప్రదీప్త శోణవర్ణాభరక్తరోచులు స్ఫురించు!
నా ప్రభావప్రతాపవిన్యాసగరిమ సర్వలోకైక చండశాసనచణమ్ము!

మృత్యువుకు నాట్యసంగీతాలంటే అభిమానం ఉన్నట్లు వర్ణించబడింది. ఇది కవితాచమత్కారమే. ఇంతక్రూరమైన మృత్యుదేవతకు కూడా నవ్వటం తెలుసునట! అయితే ఆ నవ్వే అగ్నివర్షంగా మారుతుంది. మృత్యువు మాటలు ఉరుముల వంటివి. మృత్యువు నడకలలో రక్తకాంతులు కనిపిస్తాయి. ఈవిధంగా మృత్యుజీవితం మానవజీవితానికి ప్రతిబింబంగా వర్ణించబడింది.

## మృత్యువు హెచ్చరిక

మృత్యువు ఈవిధంగా తననుగురించి వర్ణించుకోవడంతోనే ఈ ఖండిక ముగిసిపోతే వైచిత్రి లేనేలేదు. ఈ ఖండిక ముగింపులో మృత్యువు మానవుణ్ని ఇలా హెచ్చరిస్తుంది. ఇదే మృత్యువు సందేశం !

నా మహాద్భుతశక్తి నింతగ నెఱింగి
తావక స్వార్థదుర్గుణ ధ్వాంతపటలిఁ
దొలఁగఁద్రోయుచు నిఁకనైనఁ దెలివిఁ గనుము.

13

వియోగశాంతి

అతిభయంకర విరహగాఢాంధకార
మలముకొనెడిని నా హృదయాంతరమున

తన ప్రియుడు భగవంతుడే. ఆయన విరహంనుంచి తనకు విమోచనం కావాలి. ఎలా? తాను ప్రియురాలై ఏంచేస్తుంది? వియోగశాంతికి.[1]

వియోగాగ్ని-అశ్రుస్నానం

వియోగాగ్ని అవయవాలను కాల్చినపుడు తన అశ్రుకణాలలో స్నానంచేయదలుస్తుందామె. అగ్నికి నీరు ఉపశాంతిని కలిగించేది కావడం అనే భౌతికసత్యాన్ని కవి స్వీకరించాడు.

అక్కటా! ఈవియోగాగ్ని యతిశయించి
కాల్చెడిని మామకీనాంగకముల నెల్ల
కాఱుచున్న యనంతాశ్రుకణములందు
స్నానమొనరింతుఁ దాపప్రశాంతికొఱకు!

ఈ భావచిత్రంలో ఒక అనౌచిత్యం ఉందనిపిస్తుంది. అగ్నిలో శరీరం కాలినప్పుడు స్నానం చేయడం చికిత్సకాదు. అయితే ఇది వియోగాగ్ని, అది బాష్పస్నానం కావడంవల్ల ఆ విరోధం రమ్యతావ్యంజకంగా ఉంది.

విరహసాగరం-సుధామృతం

విరహసముద్రంలో శరీరం మునిగిపోగా, ఆ సముద్రాన్ని మథించి సుధామృతం పొందదలుస్తుందామె.

అంతమే లేని ఈ విరహాంబురాశి
ముంచుచున్నది తనునెల్లఁ బొంగిపొరలి
దీనిఁ బూనికఁ బూని మథించి తుదకుఁ
బడసెద ననంత సుఖసుధాస్వాదురసము!

సముద్రాన్ని మథిస్తే అమృతం లభించిందనే పౌరాణికవిషయం ఇక్కడ కవికి అలంకారసామగ్రి అయింది.

---

1 ముద్రణ: 1928 ప్రభవ. చూ. శ్రీశ్రీసా, ఒకటి, కావ్య. 39 పే.

## విరహాంధకారం - సూర్యకాంతి

విరహాంధకారం హృదయంలో వ్యాపించగా, ఆ చీకటిని పోగొట్టే సూర్యకాంతిని చూడ గలనని విశ్వాసం వ్యక్తంచేస్తుందామె.

అతిభయంకర విరహాగాంధాంధకార
మలముకొనెడిని నా హృదయాంతరమున
అయిన నరసెద నిట నీ సహస్రకిరణ
మాలికాదివ్య దేదీప్యమానకాంతి !

ఇది ప్రకృతినుంచి స్వీకరించిన కావ్యసామగ్రి. ఈ చివరిపద్యంలో మొదటి రెండు పద్యాలలోను లేని మలుపు ఉంది. విరహశాంతిని పొందడానికి మొదటి రెండింటిలోనూ స్వీయయత్నం ఉంది. మూడవపద్యంలో అటువంటి స్వీయప్రయత్నం వ్యర్థమనీ, ప్రియసాక్షాత్కారమే వియోగ శాంతికి మార్గమనీ సూచింపబడుతున్నది.

భావచిత్రరచన

మూడు పద్యాలలోనూ భావచిత్రాలున్నాయి. అవి హృదయావేదనను మన కందిస్తున్నాయి. విరహం మూడుచిత్రాల్లోనూ ఉపమేయమే. విరహాగ్ని, విరహాబ్ధి, విరహాంధకారం అభిన్న నిరూపకాలు తయారై చివరిపద్యంలోని రూపకాన్ని ఉదాత్తం చేస్తున్నాయి.

ప్రబలకష్టపరంపరల్ ప్రతిఘటించి
నిల్చిపోయితి నీకయి నేటివఱకు!

ఎంత వెదకినా ఆ ప్రియుడు కనిపించలేదు. ఆమె విరహం ఎలాంటిది? ఆమెను మింగిలిండల్లా నిరీక్షణమే కదా![1]

వెన్నెలలో పొదరిళ్లలో

ఈ ప్రియురాలు అతడెక్కడుండిపోయాడో తెలియక ఒక రాత్రివేళ వెదకడం ఆరంభిస్తుంది. అసలామె అతని ఇదివరకు చూడనేలేదు. అతని 'రూపదర్శనాశ'తో పొదరిళ్లన్నీ గాలిస్తుంది. అవి 'సముజ్జ్వలరజనీవిలాసపథాలు' అంటే వెన్నెలరాత్రులన్నమాట. ఇంత వెన్నెలలోనూ అతడు కనిపించకపోయేసరికి ఆమె మనస్సులో అంధకారం (నిరాశ) వ్యాపించడం సహజమైనదే. కవి భావన చూడండి.

ఈ నిరర్థ గవేషణావృత మదీయ భావవీథులు నిస్పృహతా విషాద
కలితగాఢాంధకార పంకిలములగుచు నన్ను నాకతిదూరమొనర్చివైచు!

నిస్పృహతా విషాదకలిత అనే విశేషణం లేకపోయినా 'గాఢాంధకారపంకిలములైన భావవీథులు' విషాదాలయాలే అవుతాయి. బైట ఉన్న వెన్నెల లోనిచీకటిని పోగొట్టలేకపోవడం వైచిత్రి.

రిక్తాశ్రువర్షం

తరువాత ఆమె నైరాశ్యం దుఃఖానికి దారితీసింది. ఆ దుఃఖాన్ని ఒక భావచిత్రంద్వారా వివరిస్తాడు కవి–

అపుడు శాంతిలేశము సైతమంతరింప నతినిరాశను నా నయనాంబుదములు
దిక్కుదిక్కులఁ గరుణార్ద్ర దృష్టులంపి రిక్తబాష్పాంబుధార వర్షింపఁదొడఁగు.

1 ముద్రణ: 1928 ప్రభవ చూ. శ్రీశ్రీసా. ఒకటి, కావ్య, 40 పే.
ఈ ఖండికకూ వేదులవారి 'ఉత్కంఠ' ఖండికకూ కొన్ని పోలికలు కనిపిస్తాయి. చూ. దీపావళి. కానీ వేదుల 'నిరీక్షణము'నకు ఈ ఖండికకూ పోలిక లేదు.

ఈవిధంగా భావవీథులలో ఆకస్మికవర్షరాత్రి ఆవిర్భవించింది. మబ్బులు దిక్కుదిక్కులకూ మెరుపులతో ప్రయాణంచేసి వానకురవడం అనే ప్రకృతిసత్యాన్ని కవి ఇక్కడ కావ్యసామగ్రిగా వాడుకున్నాడు. కళ్ళు అంబుదములు (నీటినిచ్చేవి) కావడం, చూపులు కరుణచేత తడిసిపోవడం చమత్కారంగా ఉన్నాయి.

## ఆరని వియోగాగ్ని

ఇప్పుడామె విరహిణిగా మారిపోయింది. ఆమె మనస్సుయొక్క స్థితిని కవి ఇలావర్ణించాడు-

చిరవియోగాగ్ని కీలా విశీర్ణమగుచు2 ననవరతము విషణ్ణగీతారవమున
మానసము బాహ్యవిశ్వమ్ము మరచిపోయి కడుఁదపించును వడవడ వడఁకి వడఁకి.

ఇంతకు ముందు (చూ. వియోగశాంతి ఖండిక) నయనాంబుదాలు బాష్పాంబుధార కురిసినా ఆరని వియోగాగ్ని ఇక్కడ వర్ణింపబడుతోంది. ఇది చిరవియోగాగ్ని కావడమూ, అవిరిక్తబాష్పాంబుధారలు కావడమూ గమనిస్తే వైచిత్రి బాగా అర్థమవుతుంది.

## ఆధ్యాత్మిక శృంగారం

అయితే ఈ విషాదంతోనే నాయిక క్రుంగిపోదు. ఆమెలో ఆశ పొటమరిస్తుంది.

అతిపవిత్రప్రపూజ్య మన్యోన్యహృదయదీప్తమని మన ప్రేమను దెలియఁగలిగి
ప్రబలకష్టపరంపరల్ ప్రతిఘటించి నిల్చిపోయితి నీకయి నేటి వఱకు

అంటుంది ప్రియురాలు. ఈమె అతడ్ని ప్రేమిస్తున్నట్లే అతడీమెనూ ప్రేమిస్తున్నాడు. భక్తునికీ భగవంతునికీగల అన్యోన్యప్రేమ ఇది. ఇది భారతీయభక్తిదృక్పథం. కాని లౌకికమైన ఆవరణలతో నిండిన భక్తుడి హృదయం మధ్యమధ్య నిరాశకు లోనుకావడం కూడా సహజమే. అందుకే ఈ ఖండిక ఇలా ముగింపబడింది- 'ఈ నిరీక్షణపరిణామ మేమియగునొ'3. ఈ నిరీక్షణము శృంగార నాయికానిరీక్షణం వంటిదిగా పైకి కనిపించినా అంతకంటె అతీతమైన ఆధ్యాత్మికత ఇందులో ఉంది.

2 చూ. వియోగశాంతి ఖండికలో 'అక్కటా ఈ వియోగాగ్ని' అనే పద్యం.

3 వేదుల 'ఏమగునో ఇక నా బ్రతుకు' (దీపావళి 41 పే. అనే గీతం)తో పోలిక.

## 15

## గీతపద్యాలు

> విస్తృత వనాంతరోదగ్ర వీథులందుఁ
> గ్రేళ్లుఱుకు లేడివలె గీతి త్రుళ్లులాడు !

తేటగీతి పద్యాలంటే తనకెంతో ఇష్టం. ఎంత ఇష్టమో చెప్పడానికి ఒక కవిత నే వ్రాసి చూపిస్తాడు– తేటగీతులను గురించే; అదీ తేటగీతులలోనే ![1]

### తేటగీతిపై అభిమానం

ముందు తేటగీతిమీాద ఆ అభిమానం ఎందుకో ? అతడే చెబుతాడు-

(1) పద్యములు ముఖ్యముగ గీతపద్యములవె యొసఁగు నింతింతకాని సంతసము నాకు
(2) ఒక యనిర్వచనీయమహోన్నతమగు హాయి యున్నది గీతపద్యములయందు
(3) ఆ మహోన్నతగీతవితానములను సంతతము సంతసిలి విహరింతు నేను

### తేటగీతి రచనాభ్యాసం

గీతపద్యరచనను ఇతడొక ఎడతెగని అభ్యాసంగా స్వీకరించాడని క్రింది పంక్తులు సాక్ష్యమిస్తాయి.

(1) వేళపాళయులేక యెవ్వేళలందు గీతములు వ్రాసి గీపెట్టి కేకలిడుచు
(2) పద్యములు ముఖ్యముగ గీతపద్యములు రచించి, హర్షించి పాడి
నర్తించి మించి పిదప – వ్రాసిన పద్యాలనెదియొ యొక్కపత్రికకుఁ
బంపులే నాకుఁ బని – నిరంతరమ్ము వ్రాయుదు నింతవిశ్రాంతి లేక
(3) పద్యములు ముఖ్యముగ గీతపద్యములు రచించి, కీర్తించి, పూజించి,–

---

1 ముద్రణ: 1928 ప్రభవ. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 42 పే.
తేటగీతని కృష్ణశాస్త్రి ప్రభృతు లెక్కువగా ఆదరించారు. ప్రాసనియమం లేని ఈ తేటగీతికి సూర్యేంద్ర గణాలు స్వేచ్ఛనూ, గీతిమాధురినీ కలిగించాయి.

తేటగీతులను దేవతలను వలె పూజించడం కవి అభిమానానికి పరాకాష్ఠ. తేటగీతి రహస్యాలను బాగా ఆకళించుకున్న మీదటే ఈ గౌరవం కలిగిందతనికి.2

## తేటగీతి ఆకర్షణకు కారణాలు

గీతపద్యం ఎందుకితడ్ని ఇంతగా ఆకర్షించిందనే ప్రశ్నకు ఇతడే సమాధానం చెప్పుకున్నాడు. మొదటి కారణం ఆనందం. ఇది అనిర్వచనీయం అనీ మహోన్నతమనీ కూడా అతని అభిప్రాయం.3 ఇది వ్యక్తిగతానుభావమే కావచ్చు. పద్యంలోని భావం మీద ఆనందం ఆధారపడి ఉంటుంది: ఛందోగత లయమీద మాత్రమే కాదు. కానీ భావ మెంత అధమంగా ఉన్నా పద్యరచనే ఆ రసానందాన్ని కలిగించగలదనడం4 కాస్త వింతగా ఉన్నా, ఏ రసభావానికైనా గీతపద్యం అనువైనఆకారం కలిగించ గలుగుతుందనేది ఇతడు నమ్మిన విషయం. శార్దూలమత్తేభాదులు శృంగారోచితాలు కాకపోవచ్చు కానీ తేటగీతి ఆయా రసభావాలకన్నింటికీ పనికివచ్చే గతిభేదాలను సంతరించుకోగల్గుతుంది.

### ఉపమాగాంభీర్యం

'ఆధునికదివ్య ఖండకావ్యములయందుఁ బ్రాణసన్నిభమై గీతి త్రుళ్లులాడు !' అనే పాదాలలో 'గీతి' అనేమాట సాభిప్రాయం. కనుక తేటగీతి ఆకర్షణకు రెండవ కారణం ఈ గానానుకూల్యమే.5 మరలమరల మంజులగానఝరులఁదేలి నాట్యమాడుట మాత్రమే నాకొక పని' అంటాడందుకే. గానంతోపాటు కలిగేది నాట్యం. ఈ నాట్యం అపరిమితానందసూచకం. తేటగీతివైభవాన్ని భావించినపుడు ఇతనికి రెండు ఊహాలు వచ్చాయి. ఒకటి: 'దరులొరసి పారు గాంగనిర్ఝరిణి కరణి చెంగుచెంగున గీతి తురంగలించు'. రెండు: 'విస్తృతవనాంతరోదగ్రవీథు లందుఁ గ్రేళ్లుఱుకు లేడివలె గీతి త్రుళ్లులాడు'. ఈ రెండు ఉపమానాలలోనూ చలనమూ, వేగమూ, సౌందర్యమూ అభివ్యక్తమవుతున్నాయి.

---

2 ప్రభవలోని ఖండికలు చెక్కు తేటగీతులే. తరువాత ఇతని అభ్యాసం వృత్తాలవైపు మళ్లింది. తేటగీటులమీది ఈ మోజు తాత్కాలికమైనది. 'ఛందస్సును లొంగించుకొని దానిచేత చిత్రవిచిత్రరీతులలో కదం త్రొక్కించడం' అతని లక్ష్యంగా మారింది.

3 పద్యం పాడటంవల్ల కలిగేది ఇంద్రియానందం. అది రసానందంగా పరిణమించడానికి భావావేశం కారణమవుతుంది.

4 'ఉత్కృష్ట రసానందం పద్యం చదవగానే కలిగే ఆశ్చర్యంలోనే ఉంది. అర్థం తుదకు మేడిపండులా తేలినాసరే' అని ఒకచోట ఈ కవి వ్రాయడం గమనింపదగింది.

5 తేటగీతిని Semi elastic metre గా భావించా డితడు. – చూ. శ్రీశ్రీసా. రెండు. వచన. 428 పే.

## చిందఱవందఱలుగనై చిందిన జ్యోతిశ్శకలములు!

ఇహలోకం పాతయిల్లు. పరలోకం కొత్తయిల్లు. పాతయిల్లు పడిపోతోంది. కొత్త యింట్లోకి పోవాలి. ఈ బదిలీని భగవంతుడే చేయాలట. అందుకోసం ఆయనకు మొరపెట్టు కుంటాడు. అయితే ఎలా? వృద్ధయోగిగా మారిపోయి. ఇంతకీ మరణిస్తే కానీ ఆ పరలోకం లభించదు. అంతిమయాత్ర సాగించాలి.1

జీవితవైరాగ్యం

ఇహలోకాన్ని గురించి నిర్వేదం ప్రకటిస్తూ ఇలా అంటాడు-

ఈ యవసథమందున వసియించుటయే సతతము నా
కవసరమని యనుకొని నేనాశించితినా ?
కడపటి నిన్నాళ్లిచ్చటఁ గాలమ్ము నిరర్థకముగ
విఱిగిపడిన గృహమున జీవితమికఁ నేలా ?

ఇహలోకాన్ని ప్రకృతం తాను నివసిస్తున్న గృహంగా భావించాడు. ఈ గృహంలో నివసించడమే సతతమూ అవసరమని నేనాశించానా? అనేది భగవంతుడ్ని వేస్తున్న ప్రశ్న. తనను ఈ లోకంలో ఉంచినవాడతడే అనే ఆరోపణ ఇందులో తొంగిచూస్తోంది. కాలం నిరర్థకంగా గడిచి పోయిందనే అతని విచారం జ్ఞానోదయానికీ, సంస్కారానికీ సూచన. 'ఇన్నాళ్లు' అనే మాట జీవితకాలాన్ని అంతటినీ ప్రతీయమానం చేస్తోంది. ఇన్నాళ్లు లేని విరాగం ఇప్పుడెందుకు కలిగిందనే ప్రశ్నకు సమాధానంగా ఇది 'విఱిగిపడిన గృహము' అంటున్నాడు.

శిల్పలోపం

ఇక్కడ కూలిపోతున్న ఇల్లు ఇహలోకానికిగాక తన శరీరానికే ప్రతీకగా మారిపోతుంది. తీసుకున్న ప్రతీకను చివరంటూ నిలబెట్టుకోలేకపోవడం శిల్పలోపం. ఈ గృహం విరిగి పడకపోతే ఇంకా జీవితం కావలసిందే అనే ధ్వని కూడా 'విఱిగిపడిన గృహమున జీవితమికనేలా ?' అనే ప్రశ్నలో పొటమరిస్తోంది. వైరాగ్యాన్ని సంకుచితంచేస్తోంది ఈ ధ్వని.

---

1 ముద్రణ: 1928 ప్రభవ. చూ. శ్రీశ్రీసా, ఒకటి. కావ్య. 43-44 పే.

## ఇహలోక పరలోకాలు

'ఎఱుఁగుదు మఱియొక్క మనోహరతర గేహము కలదని!
అచట నిన్ను దర్శింపఁగ ననుమతిలేదా ?'

ఈ 'మఱియొక్క మనోహరతర గేహము'2 పరలోకమే. అక్కడ ఉంటాడట భగవంతుడు. ఆయన దర్శనానికి తనకనుమతి నివ్వించమని కోరుతున్నాడిక్కడ.3 ఈ కోరికలోనే ఉంది మరణ వాంఛ.

ఈ శుష్కావసథమ్మున నిరులొర సెడుఁదెర తెరలై
అచ్చట నెచ్చటఁ గనిన మహాతేజస్సే!
ఏ మూలలఁ గనిన నపారామనస్యమే ఇచ్చట
అతుల బ్రహ్మానందం బలరెడు నచటన్
ఇచటఁ గరాళించెడు నన్నదియో అవ్యక్తశక్తి
ననుఁ గొనిపొమ్మా స్వస్థానమునకుఁ ద్వరగన్ !

రెండులోకాలూ పరస్పరవ్యతిరేకవాతావరణాలు గలవి. ఇహలోకంలో తెరలుతెరలుగా ఇరులుండగా, పరలోకంలో సర్వత్రా మహాతేజస్సుంటుంది. అది జ్యోతిర్మయం. ఈ లోకంలో అంతటా దుఃఖంకాగా ఆ లోకంలో అంతటా బ్రహ్మానందం. ఇతనికి ఈలోకం దుర్భరం కావడానికి కారణం ఏదో అవ్యక్తశక్తి తనను బాధించడం. ఈ దుఃఖవిముక్తికి మార్గమే పరలోకగమనం. ఇతడుకోరుతున్నదా అంతిమయాత్ర. దానికి భగవంతుడి దయకావాలంటూ డీకవి.

## జీవాత్మ పరమాత్మలు

ఈ ఖండిక చివర కూర్చిన రెండు భావగీతాలలో మార్మికతాస్పర్శ కనిపించినా అవి గూఢతను లోగొనలేదు. భారతీయవేదాంతభావాలకు హారతిపడుతున్నాయి.

చిందఱవందఱలుగనై చిందిన జ్యోతిశ్శకలము
లేక మహాతేజస్సుననే కలియు గదా !

---

2 ఈ పారలౌకికభావన శిథిలమైపోయి దానికి బదులు మార్క్సిజంనుంచి తాను దర్శించినదే 'మరో ప్రపంచం'గా రూపొందింది.

3 కృష్ణశాస్త్రిగారు 'అవధరింతువు' ఖండికలో 'దేవ! ఏనుకూడ నీవలె వటియింపనిమ్ము ఎడతెగనియాత్ర నెట్లొ సాగింపువరకు! ఎట్లొ నీదర్శనము సాధించువరకు' అంటారు. (చూ. కృ. ప, 144 పే.)

జ్యోతిశ్శకలాలు జీవులకు ప్రతీకలే. ఏకమహాతేజస్సు పరమాత్మునికే ప్రతీక. జీవులంతా పరమాత్మునినుంచి విడివడి ఇహలోకానికి వచ్చి తిరిగి తిరిగి పరమాత్మునిలోనే కలిసిపోతారు. ఇక్కడొక చక్కని ఊహచిత్రం భాసిస్తుంది. చిందఱవందఱలుగా జ్యోతిశ్శకలాలు చిందడం సూర్యబింబం నుంచి కాంతులు భూలోకంలోకి పడటం వంటిది. అవి తిరిగి సూర్యునిలోనే కలుస్తాయి. కాని భూమిమీద నిలిచి ఉండవు. రెండవభావగీతంలో కూడా ఇదేభావం భంగ్యంతరంగా ప్రకాశింపజేయబడింది.

వికసితహృదయప్రభూతవివిధరసావేశములు
మహానందబ్రహ్మమ్మున లీనమగుగదా!

రసావేశాలు జీవులకు ప్రతీకలు. మహానందబ్రహ్మం పరమాత్మకు ప్రతీక. వివిధరసావేశాలకు జనిస్థానం హృదయం. ఆనందంకూడా హృదయాంశమే. భావాల సమ్మేళనమే రసం. ఆ రసమే పరమాత్మ అని భారతీయవేదాంతుల ప్రతిపాదన. రసోవైసః.

### మరణం పరమాత్మతాదాత్మ్యం

ఈ రెండు భావగీతాలతో మరణానికిగల అమంగళత్వం పరిహరింపబడింది. మరణమంటే పరమాత్మతాదాత్మ్యంగా కవి భావించాడు. తాను దివ్యతేజస్సులోని ఒక శకలంగా, ఆనందంలోని ఒక ఆవేశరేఖగా భావించుకోవడం ఉదాత్తంగా ఉన్నది. ఈ భావన ఉపనిషన్మీమాంసకు కవిని సన్నిహితం చేసింది.

### గేయప్రయోగం

మొదటి మూడు పాదాలలో పన్నెండేసి మాత్రలు, నాలుగోపాదంలో ఎనిమిదేసి మాత్రలుగల గేయాలివి.4

17

మతస్వీకృతి

ఏమతమ్మునను న్న నాకేమి?
నాకు దైవపూజాప్రతీతచిత్తంబు గలదు!

అవి గంగానదీతీరకాంతారాలు. ఒక పర్ణశాల. అందులో ఒక కృష్ణభక్తుడు. పేరు యదునాథవసువు. అతడు ఇస్లాంమతం తీసుకుంటాడు. ఎందుకలా జరిగింది? అదొక కథ.1

మతవ్యాప్తి-అహింసావాదం

మతాలన్నీ సమానమే. అన్నింటా దైవపూజ ముఖ్యం. మతవ్యాప్తికో మతరక్షణకో మానవులు హింసించుకోవడం ఎందుకు? ఏమతంలోచేరినా దైవపూజ చేసుకోనిస్తే అదే పదివేలు. అందువల్లనే అతడు ఇస్లాంమతంలో చేరిపోతాడు. ఇది ఔరంగజేబుకాలంనాటి కథ. ముస్లిం పీరులు ఆ కృష్ణభక్తుణ్ణి బలవంతంచేస్తారు. అతడు అభ్యంతరం చెప్పడు.

కథాసన్నివేశవిభాగం

అయితే ఈ కథ ఎలాచెప్పాడు కవి? అందులోని సన్నివేశా లేమిటి? సంవిధానం ఏమిటి? సందేశం ఎలా వ్యక్తమయింది? రసానందం కలిగిస్తుందా? పరిశీలించాలి. ఈ కథనంతటినీ తేటగీతుల్లో చెబుతాడు. మధ్యలో కొన్ని భావగీతాలు వస్తాయి. ఈ కథలో నాలుగుభాగా లున్నాయి. మొదటిది- మొగలాయిప్రభువుల్లో తొలితరంవారి అన్యమతసహనం, పరిపాలనావిశిష్టత, ఔరంగజేబు మతోన్మాదధోరణులు. రెండోది- యదునాథవసువు నివసించే గంగాతీరం, అక్కడి ప్రశాంతవాతావరణం, అతని దినచర్య. మూడోది- యదునాథవసువు భక్తిపారవశ్యం. నాలుగోది- ముస్లింసేనలదాడి, యదునాథుడి లొంగుబాటు, సందేశం.

అక్బర్-జహంగీర్-షాజహాన్

ఇస్లాంమతవ్యాప్తికి ఔరంగజేబుకు ముందు అతడి తండ్రితాతముత్తాత లెవరూ ఆరాటపడలేదు. మొదట అక్బరు 'హైందవమహమ్మదీయ హృన్మందిరాలలో' ఐకమత్యం నెలకొల్పాడు. తరవాత 'సంతతోత్సాహకలితు'డవుతూ జహంగీరు జనానందకరంగా పాలించాడు. 'ప్రాక్ప్రతీచ్య

1 ముద్రణ: 1928 ప్రథప. చూ. శ్రీశ్రీసా. ఒకటి, కావ్య, 45-53 పే.
ఆకాశదీపం, భిక్షువర్షీయసి, బాటసారి సాంఘికవాతావరణంగల కావ్యకథానికలు

శిల్పచాతుర్యబంధురప్రభావసమ్మేళనమ్ము'2 తో బాటలన్నింటినీ శిల్పమయం చేశాడు షాజహానుడు. వీరిముగ్గురి వ్యక్తిత్వాలు సాభిప్రాయంగా వర్ణింపబడ్డాయి. వీరి పాలనాలు అంతరించిన తరవాత-

నాటి సౌహార్ద్రసద్గుణౌన్నత్యశక్తి నాటి సదమలశాంతిసౌందర్యగరిమ
నాటి లలిత కళా నిరాఘాటపటిమ కలయవెదకిన నెందును గానరావు!

అనడంలో తొలి మూడు పాదాలలో మూడుతరాల విశేషాలను స్మరించడం కవి పాటించిన శిల్పమర్యాద.

### ఔరంగజేబు నిరంకుశపాలన

ఔరంగజేబు నిరంకుశపాలనాన్ని ఒక భయంకరదృశ్యచిత్రంగా ప్రదర్శిస్తూ-

'అది మదోన్మత్త వేదండ సదృశవిహరణాప్తి నౌరంగజేబు నిరంకుశముగ
భారతక్షితి నవ్యకల్హారసరసిఁగలఁత నొందించిన విషాదసమయము'

అన్నాడు. అతడొక మదపుటేనుగు. భారతదేశం ఒక కొత్త చెంగల్వలచెరువు. దాన్ని కలిచి వేశాడు. అక్బర్‌ప్రభృతుల పాలనంలో సుఖించిన హైందవులకు 'దినకర మనోజ్ఞకిరణసందీప్తి యడఁగి కల్గినట్లయ్యె నప్పుడు కాళరాత్రి'. ఆ కాళరాత్రిలో 'ఎచటఁ గనినను రోదనప్రచలితమగు హైందవదుఃఖాశ్రులలముకొనియె'. ఇదొక కరుణభయానకభావసమ్మిళితదృశ్యంగా చిత్రించబడింది.

వెనుక భారతోర్విలో పుట్టుపొందడమే పుణ్యంగా భావింపబడింది. కాని 'కటకటా! నాడు భారతఖండమందు హిందువుని జన్మమత్యంతహీనమై' పోయిందట. ఇది కవి కథాకథనంలోని వ్యాఖ్య. ఎన్నోవిధాల హిందువులను దండించినా పాదుషాకు 'తృప్తి యనుమాట' తెలిసిందికాదట. స్వీయమతధారణమొనర్ప జేయడానికి అతడు దారుణక్రియలొనరింపదలచాడట. ఆ దారుణ క్రియలలో అన్యమతముల నన్నిటినడగద్రొక్కడం ముఖ్యమైనది. రాజాజ్ఞను పురస్కరించుకుని సైన్యం 'నిజమతమ్మును నెలకొల్పు నెపముమీద భరతభూమిని చీకాకు' పరిచింది. ఈ సందర్భంలో కవిచేసిన వర్ణన ప్రతిభాద్యోతకం.

నాడు హైందవరుధిరమ్ము నల్గడలను గాంగతటినీప్రవాహసంకాశమయ్యె
నాడు హైందవజన రోదనస్వనమ్ము భూనభోంతరముల మాఱుమ్రోగఁదొడఁగె

ఈ అల్లకల్లోలానికి కారణాలను కవి వ్యాఖ్యానిస్తూ-

'మతమునందలి గట్టినమ్మకముచేత హిందువులు ప్రాణములనైన నిచ్చినారు
మతమునందలి గట్టినమ్మకముచేఁ దురకలును హిందువులఁ జంపఁదొడఁగినారు'

---

2 తాజమహల్ నిర్మాణం సూచన

అని తన తార్కికప్రతిభను వెలారుస్తాడు. మతాభినివేశంతో తురకలు చేసిన అట్టహాసఘోష ములకెందును కొదవలేదని కవి వక్రోక్తి. చివరికి హిందువులు తమ లక్ష్యంకోసం చేసినత్యాగం ఎలాంటిదంటే–

ఆ నిరాఘాటసంఘట్టనాగ్నియందు నతిదురంతవ్యధాక్లిన్న హైందవజన
శతసహస్రాధిక ప్రాణసమిథలెల్ల నొక్కపరి బగ్గుమని మండి యూరకుండె'

అని హైందవత్యాగాన్ని యజ్ఞతుల్యంగా వర్ణించడంలో మెలకువ ఉంది. ఈ భావచిత్రంలో హైందవుల ఆవేశం అచ్చువడింది.

గంగాతీరకాంతారాలు

రెండవ భాగం గంగాతీరకాంతార వర్ణనతో మొదలవుతుంది.

'......ప్రకృతిలక్ష్మికి స్వాగతాభ్యర్చనమునఁ
బ్రత్యహజ్వలదరుణ గభస్తిచయము నిరత నిరవధికానంద నియతిఁగూర్చు'
'......వివిధవిహంగమములు కలకలారవ సంక్షోభకారణమున
నచటి నిశ్శబ్దభావము నపనయించు'
'......ప్రతిదినాంత ప్రదోషప్రభాపటలము ప్రవిమలనదీజలంబులఁ
బ్రతిఫలించి స్వర్ణసిరప్రకార విభ్రాంతిఁ గూర్చు'
'......అతిపిపాసను జనుదెంచు హరిణసమితి ప్రతికురంగమరూపబింబమును
గాంచి త్రాసభరమున నీటెనిఁ ద్రావమాను'

ఇలా మనోజ్ఞంగా సాగుతుంది వర్ణన.

యదునాథవసువు భక్తి

ఈ నదీతీరంలోనే పర్ణశాలలో యదునాథవసువు నివాసం. ఆ శాంతమూర్తి దినచర్యలో ముఖ్యమైనది భక్తిబంధురగీతాలు పాడుకోవడం. 'ఆర్య తేజఃప్రభావ గానామృతమునఁ గృష్ణలీలా చరిత్రసంకీర్తనమునఁ గంఠనిర్గతరవళి గద్గదికమెనయఁ బరవశత్వము నొంది మైమరచునతడు'. హైందవవీరుల గాథలను పాడుతూ ఉండగా అతని '...అశ్రుబిందూత్కరములు వెడలి గాంగ నిశ్చలసలిలసంఘములఁ గలియు' అనే భావచిత్రం అతని తన్మయత్వానికి పరాకాష్ఠను ప్రకటిస్తోంది.

ఉదయవర్ణన

మూడవ భాగం ఉదయవర్ణనతో ఆరంభమవుతుంది. పద్మాలు వికసించడం, తుమ్మెదలు వాటిలో ఝుంకరించడం చక్కని నాదచిత్రంగా వర్ణితమయింది.

'కమలమంజులమందిరాంగణములందు
సమద బంభర గాన ఘోషలు నదించె!'

ఈ తేటగీతిలో అనావశ్యకమైన ప్రాస బంభరగానానికి ఆవశ్యకంగా పరిణమించింది. ప్రకృతిలోని ఈ గానారంభం యదునాథుని గానారంభానికి కావ్యార్థ సూచనగా నిలిచింది. ఆ భక్తుడు-

ప్రత్యూషః పవనాంకుర ప్రతతులందుఁ
గీర్తన నినాదమును తరంగిత మొనర్చె!

ప్రత్యూషఃపవనాంకురాలలో తరంగాలు లేవు. యదునాథుడి కీర్తనలు వాటిలో తరంగాలను సృష్టించాయని కవి చమత్కారం!

'ఆ సమయమందు గంగానదీసమీరచలితవీచులు నాట్యవిద్యలనటింప మాధురీ మార్గ్యమున....'

యదునాథుడు భావగీతిని పాడసాగాడు. అతని భావగీతిలో నాట్యంకూడా ఉందికనుకనే గంగానదిలోని సమీరవీచులు దానిని నేర్చుకుంటున్నాయని ఉత్ప్రేక్షిస్తున్నాడు కవి.

## భక్తిభావగీతికలు

యదునాథుని భావగీతులు సంగీతనృత్యాల సమ్మేళనాలనే సూచనచేసిన కవి వాటిని తేటగీతులుగా గాక తీయని పాటలుగా కూరుస్తాడు. వీటిలో మొదటిది-

భయదవిరహానల ప్రబలతీక్ష్ణత యందు
జీవనంబే ఇంకిపోవునని భయమయ్యె
ఓ ప్రేమవారాన్నిధీ - దీనునకు - నీ ప్రాపుఁ జేకూర్చుమా![3]

భక్తుని విరహానలం భయదమైనది. దాని తీక్ష్ణతలో తన 'జీవనమే' ఇంకిపోతుందని అతని భయం. భగవంతుడు ప్రేమవారాన్నిధి. ఆ విరహానలం ఆర్పివేయడానికి ఈ వారాన్నిధీసంగమం కావాలి. అప్పుడు 'జీవనం' ఇంకిపోదు. భక్తుని జీవితానికి నదితో పోలిక వ్యంగ్యం. దానికి భగవత్ప్రేమసాగరసంగమం కోరబడింది. ఈవిధంగా ఇది గంభీరభావగీతికయే.

అంధతమస్సంక్రాంత నిరర్థకజీవితపథముల
శారదరజనీ జ్యోత్స్నాకారా! కనబడవేరా!

3 'వియోగకాంతి' ఖండికలోని 'అక్కటా ఈ వియోగాగ్ని యతిశయించి కాల్చెడిని మామకీనాంగకములెల్ల కాఁచుచున్న యనంతాశ్రుకణములందు స్నానమొనరింతుఁ దాపవ్యశాంతికొఱకు' అనే పద్యంతో దీనిపోలిక గమనించదగింది.

ఇది రెండవ భావగీతిక. భక్తుని అన్వేషణ ఇందులో భావచిత్రంగా రూపొందింది. అతని జీవిత పథాలు అంధతమస్సంక్రాంతాలుగా నిరర్థకాలుగా ఉన్నాయి.4 ఆ చీకటిపాటలలో 'శారదరజనీ జ్యోత్స్నాకారుడై' భగవంతుడతనికి కనిపించాలి. ఇది అతని తహతహ. భగవత్ సాక్షాత్కారం లేనంతవరకూ తన జీవితం నిరర్థకంగా ఉందనుకోవడం ముముక్షువు లక్షణం.

హాలాహాల కీలా నిర్వేల ప్రాపంచాంబుధి
నోకారుణ్యామృతమూర్తీ ! కానంబడవేరా !

ఇది మూడవది. నిర్వేలమైన ప్రపంచాంబుధిలో హాలాహాలకీలరేగిన సమయం తన జీవితమే ! ఆ సమయంలో భగవంతుడు ఆ హాలాహాలం హరించి కారుణ్యామృతమూర్తిగా కనిపించాలని భక్తుని ఆక్రందన. ఇక్కడ కవి తీసుకున్న పౌరాణికకవిసమయం భగవంతుడ్ని శివుడుగా నిరూపిస్తోంది.5 ముందు గీతంలోని శారద రజనీజ్యోత్స్నాకారా అనే సంబోధన కూడా శివుడ్నే అభివ్యక్తంచేస్తోంది.

దేదీప్యమానదీధితులకంధుండనై
నా మది నిరంతరము నడయాడు హృదయేశుం
గనుగొనంగ లేకుంటచే - ఇది వియోగవ్యథగ నూహించితిన్.

ఇది నాల్గవది. ఇందులో అతని విరహం, ఆవేదన, ఆక్రందన, అన్వేషణ అన్నీ ఒక మలుపు తిరిగిపోయాయి. భగవంతుడు తన మదిలోనే నిరంతరం నడయాడే హృదయేశుడని అతడు తెలుసుకున్నాడు. అయితే ఇదివరకీ విషయం గమనించలేకపోవడానికి కారణం భగవంతుని దేదీప్యమానదీధితులు, వాటికతడంధుడై పోయాడిన్నాళ్లు. అందువల్లనే వియోగవ్యథగా భావించాడు తన దుఃఖాన్ని. ఇప్పుడు జ్ఞానోదయమయింది. భగవంతుడెక్కడో పరలోకంలో లేడు.6 తనలోనే ఉన్నాడు.

ఇది వియోగానర్హా - విభుసమాగమకాల
మిది విచారానర్హా - మధురహర్షణవేళ
భావదర్పణమందునన్ - శ్రీమూర్తి
ప్రతిబింబితుండయ్యెగా !

---

4 అంతిమయాత్ర ఖండికలోని 'కడపితినిన్నాళ్ళిచ్చటం గాలమ్ము నిరర్థకముగ' అనే పంక్తులతో పోలిక.

5 యదునాథుడు కృష్ణభక్తుడుగా ముందుపేర్కొనబడ్డాడు, అలా పేర్కొనకుండా ఉంటే మరింత సార్థకంగా ఉండేది. అయితే శివకేశవాభేదం సూచ్యం.

6 'అంతిమయాత్ర' ఖండికలో పరలోకంలో భగవంతుడుంటాడని ఈ కవి నమ్మినట్లు కనిపిస్తుంది. ఇక్కడ పాత్రపరంగానైనా భావాలు కవివే.

ఇది చివరిది. ఈ గీతంలో జ్ఞానోదయానంతరజీవితకాలం వర్ణితమయింది. ఆ కాలం వియోగా సర్వామూ విభుసమాగమయోగ్యమూ విచారానర్హమూ మధుర హర్షదాయకమూ అయినది. ఇందుకు కారణం భావదర్పణంలో శ్రీమూర్తి ప్రతిబింబితుడు కావడం.

అచేతన చేతనీకరణ శిల్పం

భక్తిజ్ఞానవైరాగ్యాల పరమార్థం పై భావచిత్రాలలో ఉజ్జ్వలంగా ప్రతీయమానం చేయబడింది. ఈ 'మనోహరభావగీతామృతముల తీయదనమును' 'భాగీరథీ మనోజ్ఞ వీచికాసంతతులు తలలూపి మెచ్చె' అని కవి ఉత్ప్రేక్షించాడు. ఇలా కథాకథనంలో ప్రకృతికి చేతనత్వం కల్పించడంలో కవి శిల్పం అమోఘం.7 ఈ శిల్పంలో భాగంగానే ఇక్కడింకో రెండు పద చిత్రాలు కనిపిస్తాయి.

(1) ప్రార్థనాత్మకగీతముల్పాడువేళఁ బుష్పసంతతు లానందమున హసించె

(2) పరిసరస్థిత భూరుహపత్రవితతి సాంద్రనీహారహర్ష బాష్పములురాల్చె

యదునాథుని గీతాలవల్ల పువ్వులూ ఆకులూ ఆనందం పొందాయని చెప్పడం ఆ అడవిలో ఆతని ఏకాంతవాసానికి మెరుగులు పెడుతూంది.

పదచిత్ర వైచిత్రి

నాల్గవభాగం ముస్లింసేనల ప్రవేశంతో మొదలవుతుంది. తలవనితలంపుగా అన్ని దిశలూ 'ఘోరభీషణఘోషసంకులములు' అవుతాయి. అందుకు కారణం—

అపుడు యవన చమూసమూహాంబురాశి
యమభటఘటాహఠాదాగమముగఁ బర్వె

యవనసేనలను అంబురాశియే అనడంలోనే వారి కోలాహలం, కల్లోలతీవ్రత, అసంఖ్యాకత్వం వ్యక్తమవుతున్నాయి. వారి ఆగమనం యమభటాగమనంగా భావింపబడడంతో వారి క్రూరత, భయంకరరూపాలు గోచరమవుతున్నాయి. ఇక్కడ శాబ్దికలయామృదంగం భావాభివ్యంజనకు సహకరించి ఏకకాలంలోనే పదచిత్రాలకు భావనాదాలను సమకూరుస్తోంది.

---

7 ప్రకృతికి చేతనత్వం కల్పించి కథానన్ని వేళాలపట్ల, పాత్రలపట్ల ప్రకృతిపొందిన అనుభూతులను వర్ణించడం PATHETIC FALLACY అంటారు. ఈ పరిభాషను సృష్టించినవాడు రస్కిన్. ఇది భారతీయకవి సంప్రదాయం కూడా. ఈ ప్రకృతి చేతనీకరణం సముద్రఘోషం, మృత్యుప్రబోధం మొదలైన ఖండికలలోకూడా ఉంది.

PATHETIC FALLACY: "The presentation of the inanimate world as having human feeling. Natural subjectivity." —D. W. L. T. —J. T. Shiplay (Editor)

ముస్లిం సేనలతో యదునాథవసువు

వారిని యదునాథవసువు చూడనేలేదు. అతడు తన ధ్యానదీక్షలో మునిగి భావగీతులు పాడుతూండగా జరిగిందేమిటి?

క్రాగుచుండు నయఃపాత్రికల నపూర్వశీతలతుషారబిందువుల్ చిలికినట్లు
క్రమసత్ప్రార్థనామేయగానరవళి యవనసైన్యజనాగ్నికి నాజ్యమయ్యె.

అతని ప్రార్థనలు యవనసైన్యానికి కోపహేతువులయ్యాయి. ఇక్కడ కవి వాడిన ఉపమాలంకారం రూపకాలంకారంలో కలిసి సమానధర్మాన్ని కోల్పోయింది. క్రాగుతున్న అయఃపాత్రికలు యవనసేనలు. అంతేకాదు వారే అగ్నికూడాను. 'తుషారబిందువులు'8 అతని ప్రార్థనలు. అవి సైన్యాగ్నికి ఆజ్యం కూడాను.

దృశ్యకావ్యశిల్పం

అప్పుడొక యవనభటుడు యదునాథుడితో 'ప్రాణములనొసంగెదవో ? మహమ్మదీయ మతము గొనియెదో ? మఱిమఱుమాట వలదు' అంటాడు. ఈ మాటలు 'జలధరమహోగ్ర ఘోషాప్రచండ నినదమష్టకకుబంత ముఖరితంబై' ధ్వనించాయని కవి వర్ణన. అష్టకకుబంతాల లోనూ ముఖరితమైన ఆ జలధరఘోషకతడు చలించకుండా 'మృదుమధుర మందహాస సంస్ఫీత వదనవనజుఁడు' అయ్యాడని చెబుతాడు కవి. ఇక్కడ సన్నివేశసాక్షాత్కరణం ఒక శిల్పంగా భాసించింది.

యదునాథుడు చిరునవ్వు నవ్వుతూ శృంఖలాబంధనానికి చేతులివ్వడమూ వారు బంధించడమూ జరుగుతూండగా యదునాథుడు 'వీణాప్రసన్నగాన నవ్యనిర్ఘోషము'తో మాట్లాడాడని కవి వర్ణన సాభిప్రాయం. యవనభటుడు చేసింది ఉరుము కాగా యదునాథుడు చేసింది వీణాధ్వని. రెండింటి తారతమ్యం స్ఫురింపచేయడమే కవి ఉద్దేశం.

యదునాథుని సందేశం

యదునాథుడిచ్చిన సందేశమే ఈ ఖండకావ్యానికి ముగింపు. ఈ సందేశం విశ్వజనీనమయినది. ఇందులో మతప్రయోజనం, పరమతసహనం, సర్వమతసమన్వయం, ఏకేశ్వర భావన అనేవి ప్రతిపాదింపబడ్డాయి.

8 తుషారశబ్దం నీటికి లక్షకంగా గ్రహించాడనాలి. లేకుంటే ఉపమానం లోకవిరుద్ధమవుతుంది.

(1) మతములన్నియు దైవసమ్మతములగు.
(2) మతములన దైవపూజకు మార్గములగు.
(3) అన్ని మతములయందున ననుసరింపదగిన నీతులు గలవు వందలకొలంది

అని యదునాథుడంటాడు. ఏ మతమ్మైననున్న నాకేమి? అని ప్రశ్నించుకుని దైవపూజాప్రణీత చిత్తము తనకున్నదని అదే ముఖ్యమని సూచిస్తూ 'మీ మతమ్ముల నొక్కడనై మెలంగుట నాకు సమ్మతమగు' అని ఆమోదిస్తాడు.

ఆపరాత్పరదివ్యపాదారవిందసేవకంబెను నా కన్యచింత లేదు
ఆసనాతను గానమ్ముఁజేసికొనుచుఁ బాపుకొనెద మదీయ జీవనభరమ్ము

అని పరతత్త్వం గురించీ కైవల్యం గురించీ తన నిశ్చయాన్ని తెల్పుకుంటాడు.

కళాదృక్పథం

'మతస్వీకృతి' కథ రసానంద సందేశాల సమ్మేళనానికి నిదర్శనంగా నిర్వహించబడింది. శిల్పాన్నీ వస్తువునీ విడదీయరానివిధంగా అల్లుకున్నాడుకవి. వస్తువుకు శిల్పం ఉద్దీపకంగా మారింది. కళ కళకోసం మాత్రమేకాదు; విశ్వశ్రేయస్సునుకూడా అది సాధించాలి. ఈదృక్పథం మతస్వీకృతిలో బయల్పడింది. మతసహనం శుష్కప్రచారంగా కాక కథాసన్నివేశగత పాత్ర సంభాషణలో ప్రతిపాదింపబడింది. సాహిత్యానికి వైయక్తికప్రయోజనం కాక సామాజిక ప్రయోజనం కూడా ఉంటుందని నిరూపింపబడింది.[9] అంతేకాదు; అవి రెండూ సహజీవనం సాగించాయి మతస్వీకృతిలో. కథాకథనం, వర్ణనలు, నాటకీయత మూడుసంవిధానాలూ ముప్పిరి గొన్నాయి కూడా. 'మత స్వీకృతి' వంటి ఖండిక భావకవితాయుగంలో రాలేదు.

విచిత్రలయవిన్యాసాలు

పదవిన్యాసంవల్ల లభించే అనేకవిచిత్రలయలను ప్రదర్శించాడు ఈ మతస్వీకృతిలో. అయితే అవి అన్నీ భావపరిపుష్టిని కలిగిస్తూ రసావేశానికి సహకరించేవే కానీ కేవలం శబ్దాలంకారాలుగా మిగిలిపోయేవి కావు. ఇంతకుముందే వాటిని ఉదాహరించి ఉన్నా పునరుక్తి అని సందేహించక కొన్నిటిని తిరిగి ఉదాహరిస్తాను. మొదటిది పదాదిధ్వని సాదృశ్యం (Alliteration).

ప్రతిదినాంతప్రదోషప్రభాపటలము
ప్రవిమలాంబునదీజలంబులప్రతిఫలించి

---

9 Applied Poetry (వ్యవహారకవిత్వం) అని శ్రీశ్రీ ప్రతిపాదించిన కవితాసిద్ధాంతానికి ప్రాతిపదిక మతస్వీకృతి-కవితాకథానికలోనే కనిపిస్తుంది.

రెండవది ప్రాసవైచిత్రి. 'యవనచమూసమూహా' 'యమభటఘటాహతానాగమ' 'కమల మంజుల-సమదబంభర' మొదలైనవి మనోహరాలు.

మూడవది వాక్యారంభ సాదృశ్యలయ. 'మతమునందలి గట్టినమ్మకముచేత హిందువులు ప్రాణములనైన నిచ్చినారు; మతమునందలి గట్టినమ్మకముచేతఁ దురకలును హిందూవులఁ జంపఁ గడఁగినారు.'

నాల్గవది వాక్యసాదృశ్యలయ. 'ఘోషముల కెందు వెదకినఁ గొదువలేదు; ఘోరముల కెందు వెదకినఁ గొఱత లేదు'.

నుడికారపు సొంపులు

వాడుక భాషలోని నుడికారాలను గ్రాంథిక భాషలోనికి మార్చుకోవడం 'మతస్వీకృతి' శైలిలో కనిపిస్తుంది. మచ్చుకి– 'ప్రాణసమిథలెల్ల నొక్కపరి బగ్గుమని మండి యూరకుండె' అన్నప్పుడు 'మండి ఊరుకున్నాయి' అనేది వాడుక నుడికారపుసొంపే. 'తృప్తి యనుమాట పాదుషా తెలియడయ్యె' అన్నప్పుడు 'తృప్తి అనేమాట తెలియదు' అనే నుడికారం స్ఫురిస్తుంది.

మాత్రాచ్ఛందస్సులు

ఖండగతిలోనూ చతురస్రగతిలోనూ నడుస్తాయి మతస్వీకృతిలోని భావగీతికలు. వీటిలో కృష్ణశాస్త్రి గేయాలకు అనుకరణ ఉంది. చతురస్రగతిలోనే 6 మాత్రలుగా విరిగే గేయం పేర్కొనదగినది.

అంధతమస్సంక్రాంత ని
రర్థక జీవితపథముల
శారదరజనీజ్యోత్స్న
కారా ! కనబడవేరా ?

## ఇవి నితాంతాజ్ఞాత నిష్ఠుర దివస నిచయములు!

తన కన్నతల్లి 'అప్పన్నకొండ' తనకు రెండేళ్ళయినా నిండకుండానే చనిపోయింది. అప్పటి నుంచీ తనను పెంచుతూవచ్చిన 'సుభద్రమ్మ' తన 14వ ఏట చనిపోయింది. ఆమె తన తండ్రి వెంకటరమణయ్యగారి రెండో భార్య అయినా తనను ఎంతో ప్రేమతో చూసిన జ్ఞాపకాలున్నాయి. ఇద్దరుతల్లుల్నీ పోగొట్టుకున్న శ్రీనివాసరావు ప్రకృతిలోనే మాతృవాత్సల్యాన్ని చూరగొంటూ తన పదహారవఏటినుంచీ రెండేళ్ళపాటు భావకవిత్వం అల్లుతూ గడిపివేశాడు. తన 18వఏట-1928 ఏప్రిల్‌లో 'ప్రభవ' అచ్చయింది. 54 పేజీలలో 16 ఖండికలుగా అచ్చయిన ఆప్రభవను తన పినతల్లి సుభద్రమ్మ స్మృతికి అంకితంచేసి ఋణంతీర్చుకుందా మనుకున్నాడు. అందుకొక అంకితగీతం రాశాడు. అందులో విషాదాశ్రువులు రాల్చాడు. సుభద్రమ్మ మరణంతో తనకూ తన తండ్రికీకూడా ఇంట్లో పెద్దదిక్కు లేకపోయింది. మృత్యువు ఎంత సహజమో తెలిసివచ్చింది.

గ్రీష్మకాలం

తన పెంపుడుతల్లి సుభద్రమ్మ "నవవసంతప్రాతరంచితభువనమోహనకుసుమవల్లరి". ఆమె "గ్రీష్మకాలాతపభరం"వల్ల మరణించిందట! ఆగ్రీష్మకాలం మృత్యువే. నవవసంతం తనే. భువనం తన జీవితమే. కుసుమవల్లరి తన పినతల్లి.

అకాల ప్రళయఝంఝలు

అకాలంలోవచ్చిన మృత్యువు అతనికి 'ప్రళయఝంఝూవాయువు'లాగా కనిపించింది. ఈ తుపానుగాలిలో తానే మిగిలిపోయాడు. ఎగిరిపోయింది పినతల్లి. తనకిప్పుడు దారిచూపించే వారెవరూ లేరు. జీవితవాస్తవికత బాగా అర్థమవుతోంది.

నా శిశుత్వాజ్ఞానవేళా నష్టమాతృచరిత్రనెరుంగను
తావకానిర్వాచ్య సద్వాత్సల్యమునందల్లీ!

అని పినతల్లికి తన పరిస్థితిని చెప్పుకుంటూ భోరుమంటాడు. తన కన్నతల్లినికూడా మరిపిస్తూ పెంచిన పినతల్లిప్రేమ ఎంతగొప్పదికాకుంటే తనకింతదుఃఖం కలుగుతుంది?

పినతల్లిపోయి మూడేళ్లుదాటింది. ఈ మూడేళ్లూ ఎలాగడుస్తున్నాయి? ఇవి 'నితాంత-అజ్ఞాత-నిష్ఠుర-దివస నిచయాలు'. కానీ మామూలురోజులు కావు.

## అలస రావాలు

చనిపోయినవారు 'స్వర్గంచేరుకుంటారు. అక్కడ సంగీతసభలు జరుగుతూ ఉంటాయి. వాటిని ఆలకిస్తూ ఉంటుంది తన పినతల్లి. ఇదీ శ్రీనివాసరావు భావన. తన పినతల్లికి తానింత కవిత్వం రాసినట్లు ఎలా తెలుస్తుంది? తాను ఈ భావగీతాలనన్నింటినీ ఆమెకు వినిపిస్తే బాగుండును. కానీ ఆమె తన 'అలస సంగీతం' వింటుందో లేదో? ఇప్పుడామె దివ్యగాయకుల మధురగీతాలు వింటూ ఉంటుంది. అయినా తాను ప్రార్థిస్తాడు.

> త్రిదివధామ ప్రథితగాయక మధురరుతముల నడుమ నించుక
> మామకీనాలసరవమ్ముల మనసు నిల్పంగదే!

మొదటిముత్యాలసరాలు

వృత్తాలూ, గేయాలూ మాత్రమే కాదు; గురజాడవారి ముత్యాలసరం ఛందస్సుకూడా శ్రీనివాసరావుకు కరతలామలక మే అయింది. గతులు, శ్రుతులు, లయలు బాగా అర్థం అయ్యాయి. ఈ స్మృతిగీతాన్ని ముత్యాలసరాల్లోనే రాశాడు.1 మిశ్రగతి నందుకున్నాడు. మూడు+నాలుగు+మూడు+నాలుగు మాత్రలే-పాదానికి. అయితే త్రిమాత్రాగణం సూర్యగణమే. నాలుగో పాదంలో 8 లేక 9 మాత్రలే. యతిప్రాసలు తప్పవు మరి.

## 19

## ప్రభవలోని ప్రతిభావైభవం

> నే నపూర్వమానవాతీత తేజఃక్రమప్రతీత
> శక్తి గల్గిన చండశాసనుఁడ నిజము !

**1927**

శ్రీనివాసరావు సహజప్రతిభావంతుడు. చూపు చురుకైనది. ఆవేశం వేడి అయినది. పనితనం పటిష్ఠమయినది. అతని వ్యక్తిత్వం ప్రభవలోనే మొనలయింది.

శ్రీనివాసరావు భావకవిగా అవతరించిన సంవత్సరం 1927. అతని తొలి భావగీతం 'అభిసారిక'. శృంగారరూపమైన మధురభక్తికి మనోహరభావన ఈ గీతం. కవి తానే అభిసారిక అయి, భగవంతుణ్ని అభిసరిస్తాడు. ఇది చక్కటి ధ్వనికావ్యం.

ప్రబంధభాషాశిల్పమంతా 17వ ఏటనే ఈ కవికి పట్టుపడిపోయింది. ప్రౌఢవర్ణననిపుణత్వం, సాభిప్రాయపదప్రయోగం, బహువ్రీహిసమాసవిన్యాసం, భాషాడంబరత్వం, రీతిప్రియత్వం ఆనాటికే కవి కలవడ్డాయి.

ఈ దశలో కవి శివభక్తుడు. కాని అతని భక్తి చిత్రమైనది. మాయామేయమైన జగత్తు నంతటినీ మూడవ కంటితో తగులబెట్టి నర్తించవలసిందని అతని శివప్రార్థన. మత్తేభ శార్దూల వృత్తాలపై కవికెంతో మోజు.

ఈ దశలోనే కవి సౌందర్యపారవశ్యం కవితావస్తువుగా తీసుకోవడం కనిపిస్తుంది. భావ నౌకలో మేఘతరంగాలుగల ఆకాశసాగరంలో అతడు ప్రయాణంచేస్తాడు.

(1) విశేషణ పరంపరా సంఘటన నైపుణ్యం, (2) లలితపదవిన్యాస చాతుర్యం, (3) భావాభివ్యంజక పదగమన సంయోజననిపుణత ఆనాటి శిల్పలక్షణాలు. ఇంత చిన్నవయస్సులోనే అతడు రచించిన తేటగీతుల్లో ముత్యాలసరాల నడకలు కనిపిస్తాయి.

**1928 (1)**

తేటగీతులను మాలికలుగా రచించసాగాడు. ప్రకృతి దృశ్యాలే అతని కవితావస్తువులు మేఘశకలాన్ని చూసి ముఖాముఖిగా భాషిస్తున్నట్లు కల్పించడంలో భావనాశక్తి ఎలాపుంజివిప్పు కుంటోందో అర్థమవుతుంది.

భవిష్యత్తును గురించి కలలుకంటున్న వ్యక్తిగా కవి కనిపిస్తాడు. స్వేచ్ఛకోసం తపించడంలో కృష్ణశాస్త్రికి ప్రతిధ్వని అయిపోతాడు. అతని వ్యక్తిగత ఆశయాలు ఈ కవితలలో గోచరిస్తాయి. అందరితోబాటు మందలో తానూ ఒకడుగా కలిసిపోవడాని కిష్టపడడు. జీవితంలో ఎంతో ఔన్నత్యం సాధించదలుస్తాడు.

ప్రకృతికి తన సంగీతసాహిత్యనాట్యాలను అర్పించుకోరుకునే స్వచ్ఛమానవుడుగా కవిత లల్లుతాడు.

ఈ దశలోనే వృత్త్యనుప్రాస వైపు దృష్టి మళ్లింది. పద్యరచనలోని చిట్కాలను ప్రయోగిస్తున్నాడు. పదశిల్ప పద్యశిల్పాలలో మెలకువలు గ్రహిస్తున్నాడు.

'మయూరనర్తనం' అనే ఖండికలో కవికానాడున్న సాత్త్వికదృక్పథం ప్రతిబింబించింది. తిరుగుబాటు సహించలేని సంయమనసంస్కార మానాటిది.

మరో కవితలో ప్రకృతిని మాతృమూర్తిగా దర్శించాడు. బాల్యంలోనే మాతృవియోగం పొందిన కవి కది సహజంగా భాసిస్తోంది.

కవిత్వానికి సంగీతజనకమైన సుకుమారపదసామగ్రి కేవలశ్రావ్యతకోసమే కాదు; భావాభివ్యంజనకు కూడా అని గ్రహించాడు. ఆత్మాశ్రయ కవిత్వంలోని అస్మదర్థకసర్వనామప్రయోగం ఈ కవి సొంతం చేసుకున్న సంవిధానం.

సావేశోపన్యాససంవిధానంతో కవితలనల్లడం 'సముద్రఘోషము', 'మృత్యుప్రబోధము' అనే ఖండికలలో ఒక ప్రత్యేకత గడించుకుంది. 'మృత్యుప్రబోధము' ఖండికలో కవి మౌలిక ప్రతిభ ప్రత్యక్షమవుతుంది. మృత్యువు మానవుడితో మాట్లాడటానికి వచ్చినట్లు కల్పించడం వైచిత్రీస్ఫోరకం. ఉద్ధతభావోచితమైన శాబ్దికమృదంగనాదం సృష్టించడం కవి సాధించిన అపూర్వ సంవిధానం. దీనికి మృత్యుప్రబోధమే తార్కాణ.

ఇంత చిన్న వయస్సులోనే అంతిమయాత్రను గురించి ఆరాటపడతాడు. మరణమంటే పరమాత్మతాదాత్మ్యం అని భావిస్తాడు. మాత్రాచ్ఛందస్సులితడ్ని 1928 నుంచే ఆకర్షిస్తూ వచ్చాయి. అంతిమయాత్ర చతురస్రగతిగేయమే. ముత్యాలసరంలో వలె ఈ చతుష్పాది గేయంలో ఆఖరిపాదాన్ని కత్తిరించి ప్రయోగం చేశాడు.

కథాకథనంలో కూడా శ్రీనివాసరావు ప్రతిభ ఆశ్చర్యాపాదకం. 'మతస్వీకృతి' అందుకు నిదర్శనం. రసానందం, సందేశం ఈ రెంటినీ రెండుచేతులతో అందించిన కథాఖండం ఇది. కథాకథన, వర్ణన, నాటకీయశైలులకిది త్రివేణీసంగమం. పరమతసహనం, సర్వమతసమ

న్వయం, ఏకేశ్వరభావన ఇందులో ప్రతిపాదితం. కథ చారిత్రకం. ప్రయోజనం విశ్వశ్రేయస్సు. ఈఖండికలో కవి ప్రదర్శించిన (1) పదాది యతిసాదృశ్యం (2) వాక్యారంభ వాక్యసమాప్తి సాదృశ్యాలు (3) ప్రాసవైచిత్రులు లయపోషకాలు.

శ్రీనివాసరావు మొదటి 'స్మృతిగీతం' తన పినతల్లి సుభద్రమ్మను గురించి. స్మృతిగీతమే అంకితగీతం. అతని 'ముత్యాలసరాలు' ఈ స్మృతిగీతంతోనే మొదలయ్యాయి.

### భావకవితాజలపాతం

భావావేశం, భావనాబలం, ఆలోచన, పదగుంఫనం-ఈ నాలుగూ నాజూకుగా పరిమళించే కవితాపారిజాతం ప్రభవ! ఆత్మాశ్రయత్వాన్నీ కాల్పనికభావాల్నీ గీతిమాధుర్యాన్నీ రీతిసౌంద ర్యాన్నీ విరజిమ్మే భావకవితాజలపాతం ప్రభవ!!

వస్తుసంవిధానాలలో కొత్త వెలుగులు చూపిన భావకవితాయుగదీపం అనుకరణఘూపంతో కొడిగట్టుకునిపోతున్న వేళకు వచ్చాడు శ్రీరంగం శ్రీనివాసరావు రంగంమీదికి. ఆ వెలుగులనే అందుకుని ఉజ్జ్వలంగా ప్రకాశించాడు. భావకవితాయుగం అతనితో పరాకాష్ఠ పొందింది. కాల్ప నిక కవితా సంప్రదాయాలకు వారసుడయ్యాడతడు. ఆ సంప్రదాయప్రస్థానంలో నుంచి కొత్త దారులను వెదుక్కుంటూ ముందుకు సాగిపోయాడు. మరో అభినవయుగానికి ఆద్యుడుగా అభ్యు దయకవితాయుగానికి ఆచార్యుడుగా పరిణమించేలోగా వస్తుసంవిధానాలలో అతడు చేసిన అన్వేషణ, దృక్పథంలో అతడు చెందిన పరివర్తనం, పరివర్ధనం ఎలాంటివో గమనించవలసి ఉంది.

శ్రీ శ్రీ కవిత్వం

వస్తువు – సంవిధానం

1928 - 33

స్వర్గదేవతలు

# అభినవ కవితాప్రస్థానానికి అన్వేషణ

'హృదయాలను, మానసాలను కలవరపరుస్తూ
అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాదప్రాంతరాలలో
కవికి నిరాఘాటంగా విహరించగల
అధికారం గలదు.

అట్టి అతని సంచారాలలో ఏ సన్ముహూర్తానో
కావ్యగీతం ఒకటి
మెరుగులు తీరిన విలక్షణరచనాధోరణిలో
వెలుగు చూస్తుంది!

ఆ గీతం కవి అనుభవించిన రసస్థాయిని
సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించగల్గుతుంది!
ఉత్కృష్టభావగీతానికి నా నిర్వచనం ఇది!!'

—శ్రీ శ్రీ

## స్వర్గద్వారపుతోరణమై వ్రేలిన మస్తిష్కం !

1928 ఏప్రిలులో ప్రభవ అచ్చయితే 1928 ఆగస్టు భారతిలో కొంపెల్ల జనార్దనరావు దానిమీద సమీక్ష చేశాడు. ప్రభవలో గుణాలూ లోపాలూ స్థూలంగా బైటపెట్టాడు.

### జనార్దనరావు దోహదం

శైలి బాగుందన్నాడు. భావగాంభీర్యాన్ని గుర్తించాడు. భావస్వాతంత్ర్యం, భాషాసౌష్ఠవం మెచ్చుకుంటున్నా నన్నాడు. ప్రకృతిపథాల్లో తత్త్వాన్వేషణ చేస్తున్నాడని ప్రశంసించాడు. మనస్సు ఉత్సాహరంజితంగా ఉందని వెన్నుతట్టినట్లు ప్రకటించాడు. అయితే ప్రభవలో లోపాలు లేవా ? ఉన్నాయి. ఎందుకా సమాసాలంటే వల్లమాలినమోజు ? అవన్నీ సార్థకంగా ఉన్నాయా ? సంవిధానంమీద అవసరాన్ని మించిన శ్రద్ధ ఇది. పాండితీప్రకర్ష వల్లకలిగిన అనర్థం ఇది. తేలికగా మితంగా చెప్పవలసిన భావాన్ని ఆడంబరంగా అత్యుక్తిగా చెప్పడం ప్రభవలో కనిపిస్తోంది. తెలుగుకవిత్వం రాస్తూ తెలుగుమాటల కన్నా సంస్కృతపదాలను హెచ్చుగా వాడటంకూడా నచ్చలేదు. తెలుగు నుడికారాలు, జాతీయాలు ప్రభవలో లేకపోలేదుగానీ తక్కువగానే ఉన్నాయి. పదగుంఫనం విషయంలో సరిదిద్దుకోవలసిన అంశమే ఇది.

### ఆత్మవిమర్శ

ఈ విమర్శరాకముందే శ్రీనివాసరావులో ఆత్మవిమర్శ ఆరంభం అయింది. అప్పటికే అతడు ప్రణయగీతాలనుంచీ ప్రకృతిగీతాలనుంచీ ప్రక్కకు జరిగి జాతీయగౌరవప్రశంసవైపు దృష్టి మళ్లించాడు. తెలుగు నుడికారాన్ని అందుకున్నాడు. ముత్యాలసరాలవైపు దృష్టి మళ్లించాడు.

### మద్రాసులో విద్యాభ్యాసం

1928లోనే మద్రాసులో బి. ఏ. చదవడానికి వెళ్లాడు. ఆ రెండేళ్లలో విశ్వనాథతో బసవరాజు అప్పారావుతో నండూరి సుబ్బారావుతో మల్లంపల్లి సోమశేఖరశర్మతో వేటూరి ప్రభాకరశాస్త్రితో ముద్దుకృష్ణతో మల్లవరపు విశ్వేశ్వరరావుతో కొంపెల్ల జనార్దనరావుతో గన్నవరపు సుబ్బరామయ్యతో సాహితీపరిచయాలు ఏర్పడ్డాయి. జనార్దనరావుతో గాఢమైత్రి

ఏర్పడింది. అడయారు, కన్నెమెరా లైబ్రరీలలో సాహిత్యం మథించాడు. నగరజీవితం బాగా తెలిసివచ్చింది. భారతిలో కవితలూ గ్రంథసమీక్షలూ రాయడం మొదలుపెట్టాడు.

### ఆంగ్లసాహిత్యాధ్యయనం

ఆంగ్లసాహిత్యాన్ని బాగా మథించసాగాడు. టెన్నిసన్, కీట్సు ఆకర్షించారు. వారి కవితలు అనువదించాడు. థేకరే, జాన్‌బన్యన్, ఛార్లెస్‌డికెన్సువంటి ఆంగ్లరచయితల సాహిత్యాన్ని అవలోకించాడు. కొన్నిరచనలను తెలుగుచేశాడు.

### సుప్తాస్థికలు

1928లో గతకాలవైభవంలో గాలిమేడలు కట్టుకుంటూ విశ్వనాథప్రభృతుల్ని అనుకరించినా 1929లో ఉదాత్తకవిత్వంకోసం ఉజ్జ్వలస్వప్నాలను కనడం ఆరంభించాడు. కృష్ణశాస్త్రి శైలీరహస్యాలను పసిగట్టాడు. ఈ ప్రయత్నంలోనే దృక్పథం మారింది. 'సుప్తాస్థికలు' (16-4-29) రచనతో మరోమెట్టు పైకెక్కాడు; గతాన్ని ఒక దీర్ఘ రాత్రిగా భావించాడు. ధరాగర్భాన్నీ ధరాతలాన్నీ వదిలి ఆకాశంవైపు దృష్టి తిప్పాడు.

### కాల్పనికభావాలు

ఆంగ్ల సాహిత్యాధ్యయనంతో శ్రీనివాసరావులో కాల్పనికభావ సంచలనం పెరిగింది. సౌందర్యదిదృక్ష, సుకుమారవాంఛలు, ప్రకృతి పరిశీలన, స్వేచ్ఛాప్రియత్వం, కారుణ్యం, ప్రేమ, ఒంటరితనం, భక్త్యావేశం, భగవద్విశ్వాసం, దైన్యం, కళారాధన, ప్రణయరహోవేదన వంటివే పెక్కు ఖండకావ్యాల్లో వ్యక్తంచేస్తూపోయాడు. అయితే వీటిలో భావచిత్రాలను అపూర్వంగా ప్రయోగిస్తున్నాడు. గేయగతిలో వృత్తగమనంలో వేగం సాధిస్తున్నాడు. ఎదురుగా కనిపిస్తున్న ప్రకృతిసీమలనుంచి తన చూపును ఊర్ధ్వంగా మళ్లించి ఆకాశసీమలను అన్వేషిస్తున్నాడు.

### వేణుగానం

1930లో 63రోజులు టైఫాయిడ్ జ్వరంతో మంచంపట్టి మృత్యువుతో పోరాడి బైటపడిన తరువాత సంవిధానపుష్టికోసం సాహిత్యవ్యాయామాలు చేస్తూ 'వేణుగానము' (1930 సెప్టెంబరు) వంటి మంచికవితాఖండాన్ని వెలయించాడు. పూర్వాంధ్రకవుల కథాశిల్పాన్ని అనుకరించాడు.

### గతితార్కికభౌతికవాదం

1931లో బి.ఏ. డిగ్రీతీసుకుని విశాఖపట్నం తిరిగి వచ్చేశాకా గతితార్కికభౌతికవాదంతో కొద్దిపాటిపరిచయం ఏర్పడింది. ఈ ఊపులోనే కన్యాశుల్కాన్ని చదివి అందులోని స్త్రీపాత్రలు

గురించి వ్యాసంకూడా ప్రచురించాడు సమదర్శిని (1932)లో. పురిపండా స్నేహంతో నజ్రుల్ ఇస్లాం కవితతో పరిచయం ఏర్పడింది. 1932లో హరీంద్రనాథఛటోపాధ్యాయ కవితలను చదువుకుని అనువాదాలు చేశాడు. ఆవేశ మేఘాల ఆలోచనావర్షాలు కురుస్తున్నాయి. కాల్పనికతకూ వాస్తవికతకూ వింతవంతెనలు కడుతున్నాడు.

## మూగతలపులు

1931 ఏప్రిల్ 13న రాసిన 'మూగతలపులు' అభినవకవితాప్రస్థానానికి అన్వేషణలో మరో మైలురాయి. ప్రకృతిలో మానవజీవితాన్ని చూశాడు. జడప్రకృతికి మానవసహజమైన బాధలున్నట్లు ఆరోపించి పతితజనోద్ధరణాభిలాషను వ్యక్తంచేశాడు.

## ఖండశశి

1932లో రాసిన 'ఖండశశి' నిజానికి 1929లోనే రచన మొదలైనా 1932 మార్చి 21 నాటికిగానీ తుదిరూపం ధరించలేదు. అప్పటికే ఆంగ్లసాహిత్యంలోని విషాదాంత నాటకాలూ సానెట్లూ తెలిసివచ్చాయి. నిజ జీవితంలో ఎన్నో కష్టాలు మొదలయ్యాయి. దానితో ప్రపంచమంతా భయంకరంగా కనిపించసాగింది.

## బరంపురంలో కవిపండితసభలు

1933 మార్చిలో బరంపురంలో జరిగిన అఖిలాంధ్రకవిపండితసభకు హాజరుకావడం తన సాహిత్యజీవితంలో మరోమలుపును తెచ్చింది. వ్యావహారికభాషఅన్నా మాత్రాచ్ఛందస్సులన్నా కరుణరసమన్నా అభిమానంగల సాహితీవేత్త చింతా దీక్షితులుగారితో పరిచయం కలిగిందక్కడే. దీక్షితులుగారి ద్వారా గురజాడ సాహితీవ్యక్తిత్వాన్ని బాగా ఆకళించుకున్నాడు. అక్కడే చెప్పాడు కొంపెల్ల జనార్దనరావు తాను 'ఉదయిని' స్థాపిస్తానని.

## విద్యున్మాలికలు

ఇంతలోనే వస్తుసంవిధానాలలో నూతన వాతాయనాలను చూడగల్గాడు. కవిత్వంగురించి అభిప్రాయాలు పూర్తిగా మారిపోయాయి. గ్రాంథికవచనపద్యం రాయడానికి పూనుకుని 'విద్యున్మాలికలు' (1933 మార్చి) ప్రచురించాడు. ఛందస్సును లొంగదీసుకుని దానిచేత చిత్రవిచిత్ర రీతుల్లో కదం త్రొక్కించసాగాడు. ప్రకృతిప్రపంచంలోంచి మానవప్రపంచంలోకి ప్రవేశిస్తున్నాడు.

## మారుమ్రోతలు-స్వర్గదేవతలు

1928-33 మధ్య 'అహార్ముఖం'నుంచి 'విద్యుజ్జ్వాలికలు' వరకూ రచించిన కవితలను గ్రంథరూపంలో ప్రచురించదలచి వ్రాతప్రతిని తయారుచేసుకుని దానికి 'మారుమ్రోతలు' అని నామకరణంచేసుకున్నారు. కానీ జీవితంలో దృక్పథంలో కవిత్వంలో ఎన్నో మార్పులు రావడంతో ఆ వ్రాతప్రతి అలాగే ఉండిపోయింది. 1970లో 'శ్రీశ్రీ సాహిత్యం' ఏర్చి కూర్చి ప్రచురిస్తూ శ్రీ కె. వి. రమణారెడ్డి ఆ వ్రాతపతినికూడా వెలుగులోకి తెచ్చారు. కానీ దానికి 'స్వర్గదేవతలు' అని పేరు మార్చారు.

ప్రభవానంతరకృతుల్నీ మహాప్రస్థానపూర్వోత్తరకృతుల్నీ[1] ఇప్పుడు కాలానుక్రమంగా పరిశీలించి వాటిలోని వస్తుసంవిధానాలను వివరిస్తాను.

# 1928 కవితలు (2)

అహర్ముఖము అంతస్సమాధి అగ్నిహోత్రము

కవితాశిల్పము సంధ్యాభావన

విరహవంశి ఆంధ్రకవితాపితామహుడు

అంధకారము సముద్రపుటొడ్డున

రచనకి ముందు

రచనానిబంధనలతో గింజుకోవడం

మంచిది కాదు!

ఈతనేర్చుకోడానికి మార్గం

సాహసించి నీళ్లలోకి దూకడమే!

అసలు రహస్యం ఏమిటంటే

ఎంత చెయ్యి తిరిగిన రచయిత అయినా

ఎలా రాయాలో చెప్పలేడు!

—శ్రీ శ్రీ

# విస్మృతానేక చరితగత పురాతనసమయ భారతధరిత్రి!

1928 ఏప్రిల్ 10

కవి భావిస్తే చూడలేని దేముంటుంది? తాను పురాతన భారతదేశాన్నే చూశాడు. గతకాలమే తనకు గొప్పదిగా కనిపించింది.1 అహర్ముఖం అంటే ఉదయం. ప్రపంచం ఒక అహస్సయితే దాని ముఖం భారతదేశం. ఆ భారతదేశం కలలో కనిపించిందంటాడు. ఆ కలలో "వెనుకదినములఁ బ్రజ్వలించిన చిరంతనార్యవైభవసహస్రశిఖలు కనులు పొడిచిన మెరుపులై" కనిపించాయుట!

## పురాతనభారతదేశం

ఇది రాత్రివచ్చిన కలకాదు. "అహర్ముఖాంచితహర్ష వీచికలజాండభాండమున నిండిన" ఉదయకాలంలో వచ్చిందంటూ తనకు చరిత్ర చదువుకోవడంవల్ల కలిగిన జ్ఞానోదయాన్ని సూచిస్తున్నాడు. తాను కాలగర్భంలో ప్రయాణంచేసి పురాతనకాలంలోకి వెళ్ళిపోయానంటున్నాడు. ఆ పురాతనకాలంవరకూ చీకట్లు అలముకొని ఉన్నాయుట! పురాతనవైభవం అంతా మరుగున పడిపోయిందట! భావాల మెరుపుతీగలమీద కూచుని తాను ప్రయాణం చేశానని ఈ తిరోగమనాన్ని వర్ణించుకుంటున్నాడు. అప్పుడతనికి 'భావనాభావితోత్సవం' ఏర్పడిందట! ఆ ఉత్సవంలోనే తనకు 'విస్మృతానేకచరితగతపురాతనసమయభారతధరిత్రి' కనిపించిందంటున్నాడు. ఆ ఉత్సవంలో తనకు 'ఆర్యవైభవవహ్నిసహస్రశిఖలు' మిరుమిట్లుగొలుపుతూ కనిపించాయంటున్నాడు. ఆర్యవైభవం అనే వేయిజ్వాలలు గల అగ్ని తనకు ప్రాచీనకాలపు తపోవనాల్నీ వాటిలోని హోమకుండాల్నీ, యజ్ఞవేదికల్నీ జ్ఞాపకంచేసిందట! తాను చూసిన దృశ్యాలను అన్నింటినీ పాఠకులకు చెప్పడానికి ఉత్సాహపడుతున్నాడు. 'అవియె ఋష్యాశ్రమమనోజ్ఞదివిజసదననిభతలమ్ములు! వారె మానిప్రకాండు లవియె దిక్కటాహములు నిండి మారుమ్రోతల ఋగ్వేదమంజురవళి' అంటాడు. సూర్యోదయంవల్ల చీకట్లు తొలగిపోయాయనీ అన్నీ తనకు కనిపించాయనీ చెప్పుకుంటాడు. అంతేకాదు; ఈ కాంతులవల్ల తన హృదయపద్మం వికసించిందట.

---

1 ముద్రణ: భారతి. 1928 అక్టోబరు. చూ. శ్రీశ్రీసా, ఒకటి, కావ్య. 59-60 పే.

పదశిల్పం

విశేషణాలను గుప్పించి సమాసాన్ని పోడిగించడం గొప్పపనితనంగా భావించబడుతున్న రోజులవి. ఆ పనితనానికే మురిసిపోతున్నాడు: 'ఉదయకాలరమ్యరహస్యగర్భసురభిళలతాంత గుచ్ఛమాధురులు' అలాంటిసమాసమే. పదాలకూర్పువల్ల చెవికి కలిగే ఇంపునే అభిమానిస్తున్నాడు. సంస్కృతపదాలలో హలంతాలను ప్రయోగించగలగడం కూడా పనితనంగానే ఆ రోజుల్లో పరిగణిస్తున్నారు. అహస్, రహస్, హరిత్ వంటి సంస్కృతహలంతాలను అందుకే వాడాడు. పదచిత్రాలమీద చూపు ఉన్నా అవి దీర్ఘసమాసాలనుంచి బైటికి రావటంలేదు. అనవసరవిశేషణాలు పదచిత్రాన్ని అస్పష్టతకు పాలుచేస్తాయని గ్రహించలేని పరిస్థితి ఏర్పడింది. సంస్కృతపదాలలో దీర్ఘాంతాలైన స్త్రీలింగశబ్దాల్ని వాడటం ఆనాటి కవుల అలవాటు. దాన్ని అనుసరిస్తున్నాడు. 'దినోదయవేళారాగఘోషములు' అనే పదబంధంలోని వేళా శబ్దం అలాంటిదే. ఉదయాన్ని కాంతతో పోల్చడానికి ఈ శబ్దం సహకరిస్తోంది. ప్రభా, ఘోషా, సౌదామినీ వంటి శబ్దాలెన్నో ప్రయోగిస్తున్నాడు. అవన్నీ చెవికీ, నాలుకకీ ఇంపు, రుచి కలిగించడానికే.

గేయం: పద్యం

'అహర్ముఖాంచిత హర్ష వీచికలజాండభాండమున నిండినవి' అని జగణంతో మొదలుపెట్టి పాదాలను వేగంగా పరుగుతీయిస్తున్నాడు.2 'ఇంద్రహరిత్సముదంచితదీధితు లంధకారముల నడచినవి' అని భగణంతో మొదలుపెట్టి పాదాలను నెమ్మదిగా నడిపిస్తున్నాడు. చతురస్రగతిలో నడిచే ఈ గేయాలను రెండింటినీ ఖండికకు మొదటా చివరా ఉంచి మధ్యనన్నీ తేటగీతులు రాసి తనకు గేయంమీదా పద్యంమీదా సమానమైన అభిమానం ఉందని నిరూపించుకుంటున్నాడు. పద్యం పెత్తనం వహిస్తున్న రోజులలో తీసుకుంటున్న చొరవ ఇది.

## నాటి సంపత్సమృద్ధి ఏ నాటికైన ఆంధ్రనిర్భాగ్యధాత్రికి నలవడునొకొ!

1928 ఏప్రిల్ 27

'పారిజాతాపహరణం' లో ప్రథమాశ్వాసం చదవడం పూర్తిఅయింది. ఆశ్వాసాంత పద్యం చదువుతున్నాడు. అంతే, కృష్ణరాయల కావ్యరసాస్వాదన ఎంత గొప్ప అనుభవమో మనసుకి హత్తుకుపోతుంది. చేతిలోంచి పుస్తకం జారిపోతుంది. ఆ తరవాత అతనికి కనిపించిన దృశ్యాలెన్నో !

### తిమ్మన ఆశ్వాసాంత పద్యం

తిమ్మనగారి పద్యానికి భావం ఇది – ప్రతిసంవత్సరం రాయల ఆస్థానంలో వసంతోత్సవం జరుగుతుంది. కావ్యపఠనం అందులో ఒక అంశం. మహాకవుల కావ్యాలు విని రాయులవారు రోమాంచం పొందుతారు. అదిచూసి రాణులు అసూయపడతారు. వారిని రాయలు రసికతతో ఓదారుస్తాడు.

రాయల రసికతకి ఆశ్చర్యపడిపోతాడు మనకవి. వెంటనే అతని మనస్సు రాయల సభకు పోయి వాలుతుంది. అది ఒక నందనవనం. ఆనాటి సిరిసంపదలు దేశానికి మళ్లీ ఎప్పటికి వస్తాయి? అని విచారంలో పడిపోతున్నాడు.1

### సమకాలంమీద అసంతృప్తి

గతకాలమే గొప్పదనుకుంటూ వర్తమానాన్ని చూస్తున్నాడు. సమకాలంలోని సాహిత్య వాతావరణంకానీ రాజకీయవాతావరణంకానీ గతంతో తూగలేవనిపిస్తోంది. కృష్ణరాయలకాలం అందుకే ఎంతో గొప్పదిగా కనిపించింది. బానిసతనంతో బాధలుపడుతున్న భారతీయులూ ఆంధ్రులూ అలాంటి బంగారుకాలాన్ని తిరిగి పొందగలరా అని సందేహిస్తున్నాడు. గతించిన ఆంధ్రవైభవం గురించి ఆవేదన ప్రకటిస్తున్నారు ఆరోజుల్లోనే రాయప్రోలు, విశ్వనాథ, కొడాలి మొదలైన కవులు. వారి ప్రభావాన్ని తప్పించుకోలేని ఆలోచనలివి.

### గతవైభవంమీద గౌరవం

గతవైభవం ఎంతగొప్పదో అని భావించుకుని తిరిగి దేశానికి అలాంటిరోజు లెప్పుడైనా వస్తాయా ? అని ఆవేదనపడటం జాతీయవాదం లక్షణం. జాతీయపునరుజ్జీవనమహోద్యమం సాగు

---

1 ముద్రణ : భారతి 1929 ఫిబ్రవరి. చూ. శ్రీ శ్రీ సా. ఒకటి. కావ్య 61-62 పే.

తున్న రోజులవి! అందుకే గతంలోని సాహిత్యవసంతోత్సవాన్ని భావించుకుని మురిసిపోవడమే గాక, ఆ భావనాకృత్యం పూర్తికాగానే 'నాటి సంపత్ సమృద్ధి ఏనాటికైన ఆంధ్ర నిర్భాగ్య ధాత్రికి' అలవడుతుందా అని వాపోతున్నాడు. ఆంధ్రదేశం ఒక నిరుపేదదేశంగా కనిపించిందప్పుడు.

దృశ్యచిత్రాలు

కృష్ణరాయల సభామంటపానికి తన హృదయం వెళ్లివాలిందట! 'పూర్వ విస్తృత నితాంత దశదిశాంత పరిక్రాంత ధవళ కీర్తిచామరమ్ములతో సముజ్జ్వల విభా విరాజితమ్ము'గా ఉందట ఆ మండపం. ఆ కీర్తిచామరాలు సభామండపంలోనే కాదు; పది దిక్కుల కొసలదాకా వ్యాపించాయట! ఇక కవులు అక్కడ 'దివ్యప్రబంధ కథన సుధల నఖండసుఖప్రదం'గా చిలుకుతున్నారట!

రాయల రసికత

ప్రబంధాలను వింటూ కదులుతున్న రాయల భంగిమను వర్ణించి కళ్లముందు నిలుపుతున్నాడు—'మహోజ్జ్వలాంగ దీధితులెగసి స్వీయాక్షికోణనిర్గతాపాంగరుచి సమున్మేషమునకు వింతసొగసుల నెగడించు విధము చూప'గా 'పారవశ్యమ్ముచెంది మెచ్చుచున్నాడు నయన నిమీలనమున శిరఃకంపనమున'! ఈ భావచిత్రంతో రాయల అనుభూతిని స్ఫురింపజేశాడు. రాయల సభాస్థలిని వర్ణిస్తూ మనల్ని భావనాసీమల్లోకి తీసుకుపోతాడు.

విశేషణ విన్యాసం

కానీ చెప్పదలచినదాన్ని క్లుప్తంగా సూటిగా చెప్పకుండా అనవసరమైన విశేషణాల పరంపరలతో పొడిగిస్తాడు. ఆనాటి విద్వత్కవుల ధోరణి ఇలాగే ఉండేది. దాన్ని తప్పించుకోనలేకపోతున్నాడు.

"మది కలంచిన శైశిరోన్మాదరేఖ వదలినంతట నూత్నలావణ్యమునకు
సదమలానూన తేజః ప్రశస్తి నొసఁగు శ్రీగరిష్ఠవసంతసమాగమమున మెల్లగా వీచు
పిల్ల తెమ్మెరలకులికి కులుకు మెలకువతో నవకోరకములు నూతన వయఃపిపాసా
పరీతహృదయసదనసంస్థితగాఢవాంఛలకు రేగి తెరలు తెరలగు
సిగ్గుదొంతరల పొరల మనసు బిగువున నెగజిమ్మికొనుచు ఘనవియోగశాంతిని
కలగాంచి ఒడలు నిలువు పులకరిల్లిన హృదయమాపుకొనలేక
వలపుదెసల పిసాళించు వలను తెలిపి విరిసి వెలిగి విజృంభించు వేళలందు
ఏ మనోహర మంజులారామ భూమి సౌరభానంత సౌందర్యసౌఖ్యగతుల
నందనవనోపమానంద బంధురంబొ అదియె విలసిల్లు
కృష్ణరాయల సభాప్రభా శుభాకరతలము_"

## రాయలసభాస్థలి

రాయలసభాస్థలి ఒక అందాల తోట. దాన్ని తిరిగి నందనవనంతో పోలుస్తాడు. ఆ తోట లోకి వసంతం వచ్చింది. అప్పుడు పిల్లగాలులు వీస్తాయి. మొగ్గలు మేలుకుంటాయి. ఆ మొగ్గలకు యౌవనపిపాస ఉంది. అందువల్ల వాటి గుండెల్లో ఒత్తుగా కోరికలున్నాయి. అవి సిగ్గుదొంతరల్ని తెరలుతెరలుగా, పొరలుపొరలుగా విప్పుకున్నాయి. అంటే పువ్వులయ్యాయి. అప్పుడు వాటికి విరహం తగ్గిపోయింది. అవి తన్మయత్వంతో తమ సుగంధాల్ని పదిదిక్కులకూ పంపించాయి. అలాంటివేళల్లో ఉండే పూలతోటే రాయల సభాస్థలి. ఇదే కవి మనకు చెప్పదలచింది. ఈ అందమైన ఊహాని రచనాసంవిధానం అందించలేక మూలుగుతోంది. అయితే ఈ ధారాశుద్ధితోనే చెవుల్ని ఆకట్టుకుంటున్నాడు. ప్రకృతిలోని అందాలమీద తన కుతూహలాన్ని ఈ వర్ణనలోంచి చూపుతున్నాడు.

పదశిల్పం — పదాడంబరం

పదబంధాల్లోని పరుషత్వాన్ని వదిలి సరళమైన శబ్దాలతో సమాసాలు అల్లుతున్నాడు- 'పూర్వవిస్మృత నితాంతదశదిశాంత పరిశ్రాంత ధవళకీర్తిచామరములు' 'నూతనవయఃపిపాసా పరీత హృదయసదన సంస్థితగాఢవాంఛలు' మొదలయినవి. తెలుగు నుడికారం, తెలుగు పలుకుబడి కమ్మగా వినిపిస్తున్నాడు కొన్నిచోట్ల- 'మెల్లగా వీచు పిల్ల తెమ్మెరల కులికి కులుకు మెలకువతో నవకోరకములు' వంటివి. శైశిరోన్మాదరేఖ, నూతనవయఃపిపాస, సిగ్గుదొంతరలు వంటి పదచిత్రాలను భావకవిత్వసంప్రదాయంనుంచి తీసుకుంటున్నాడు. నితాంతదశదిశాంత, హృదయసదన సంస్థితగాఢవాంఛలు, సౌరభానంత సౌందర్యసౌఖ్యగతులు, నందనవనోపమానందబంధురంబు వంటి సమాసాలను ప్రబంధకవితాసంప్రదాయంనుంచి గ్రహిస్తున్నాడు. కానీ వ్యర్థపదాలను తప్పించుకోలేకపోతున్నాడు. 'అఖండ వివిధ భావభంగీ తరంగసంపదలు'లో 'భావతరంగాలు' తప్ప తక్కినదంతా రీతికోసమే. ఈ రీతినే గొప్పదిగా గౌరవిస్తున్న రోజులవి.

## ఆ హరునిటలమందు దాగియుండగిన అగ్నిహోత్రమును నేను!

1928 మే 25

శివుని మూడవకంటిలోని అగ్ని తనే. హోమకుండాల్లోని అగ్ని తానే. సముద్రంలోని బడబాగ్ని కూడా తానే. తానగ్నిహోత్రుడై పలుకుతున్నాడో తన స్వీయచరిత్రని; అగ్ని హోత్రుడే కవియై మాటాడుతున్నాడో తనలోతాను.1 అసలిలాంటి భావన ఎలా వచ్చింది!

### అద్వితీయస్థానంగల అగ్ని

మనపురాణాలలో అగ్నిహోత్రానికి అద్వితీయస్థానం ఉంది. శివుడి మూడవకంటిలో ఋషుల యజ్ఞాలలో సముద్రాలలో అగ్ని ఉంది. మొదటిది ప్రళయాన్ని తెస్తుంది. రెండవది కర్మలను సాధిస్తుంది. మూడవది సముద్రాలను అణిచి ఉంచుతుంది. ఈ మూడు రకాలయిన అగ్నినీ తానేనని చెప్పుకుంటాడు. ఇది పురాణాలమీదా, హైందవసంస్కృతిమీదా కవికి ఆనాటికి ఉన్న నమ్మకానికి నిదర్శనం. అయితే అగ్నిని ఒక ప్రతీకగా కూడా కవి యిక్కడ తీసుకుని ఉండవచ్చు. తనలో ఉన్న అపారశక్తినీ, పవిత్రతనీ, అనశ్వరత్వాన్నీ ఆ ప్రతీకద్వారా వ్యక్తం చేయడానికి వీలవుతోంది.

### పురాణగాథలు

'అగ్నిహోత్రమును నేను' 'బాడబజ్వాల నేను' అనే మాటలద్వారా మనకొక భయాన్ని, ఆశ్చర్యాన్ని, విస్మయాన్ని కలిగిస్తున్నాడు కవి. శివతాండవం, దేవతల అనిమేషత్వం, బ్రహ్మర్షుల యజ్ఞవేదికలు, వేదఘోషలు, హోమకుండాలు, ప్రళయాగమనం, సప్తసముద్రాల పొంగు వంటివన్నీ పురాణాలద్వారా విని కవి పొందిన ఆశ్చర్యభయాందోళనల భావరూపాలను తొడుక్కున్నాయి.

### శివతాండవం

శివతాండవదృశ్యాన్ని కవి వర్ణించిన తీరులో అతడి ఊహావైభవం కనిపిస్తుంది. శివుడి తాండవానికి ప్రేక్షకులు దేవతలు. వారెలా చూస్తున్నారు? 'సాంధ్యకాలారుణ గభస్తి సము దయమున ప్రస్ఫురించెడి నిజవపుర్వైభవమ్ము ఉదిత మానసికోత్సాహ ముజ్జ్వలింప అమరు లనిమేషనయనులై' చూస్తున్నారట! ఇక్కడ 'అనిమేషనయనులు' అనే పదాన్ని సార్థకంగా వాడాడు.

1 చూ. శ్రీశ్రీసా. ఒకటి. వావ్య. 63-64 పే.

### ప్రళయకాలం

'జగతి పాపాంధకారవిచ్ఛన్నమగుచు పుణ్యమను మాట పూజ్యమైపోవునపుడు' ప్రళయం వస్తుందట! 'దారుణదురంతకలుషవర్తనముచేత మానవచరిత్రమున కస్తమయము కలుగు' తుందట ఆ ప్రళయకాలంలో. అస్తమయము అనే పదాన్ని వాడటంలో భావుకత్వం చూపించాడు. మేఘాల గర్జనలు రోదసీగహ్వరంలో ప్రతిధ్వనిస్తే వాటిని వినడానికొక్క ప్రాణియైనా మిగలదని చెప్పడంద్వారా అప్పటి భయంకరత్వాన్ని వ్యక్తంచేస్తున్నాడు.

### బడబాగ్ని

అప్పుడు సప్తసముద్రాలలోనుంచి పుట్టే బడబాగ్నికొక రూపాన్ని ప్రతిపాదిస్తాడీకవి. 'కరాళజిహ్వా సహస్రదుర్దాంతరుచుల ప్రజ్వరిల్లు'తుందట ఆ బడబాగ్ని. ఇక్కడ జిహ్వాశబ్దాని కున్న అర్థాలనుబట్టి ఈ బడబాగ్నిని ఒక విషభుజంగంగా స్ఫురింపజేస్తూ భయాన్ని కలిగిస్తున్నాడు.

### విద్వత్కవుల సంవిధానాలు

రసోచితంగా పదబంధాలను వాడటం మహాకవుల లక్షణం. తిక్కన అలాంటి శిల్పంలో ఆరితేరినవాడని శ్రీనాథు డంటాడు. ఆ శిల్పాన్ని రౌద్రబీభత్సాలలోనూ వీరభయానకాల లోనూ వాడటం సంప్రదాయం. అవి ఉద్ధతరసాలు కనుక ఆ రసాల భావాలు వచ్చినప్పుడు మహాప్రాణాక్షరాలు, ద్విత్వాక్షరాలు, సంయుక్తాక్షరాలు, పొడుగైన సమాసాలు వాడు తున్నాడు. ప్రళయకాల మేఘాన్ని వర్ణిస్తూ 'ప్రళయభీకరపుష్కలావర్త మేఘఘోషణకఠోరతా ప్రసంకుల సమస్తరోదసీగహ్వరప్రతినాదములు' అనీ బడబాగ్నిని వర్ణిస్తూ 'కరాళజిహ్వాసహస్ర దుర్దాంతరుచుల ప్రజ్వరిల్లెడు బాడబజ్వాల' అనీ రాయడంలో ఆ రీతిని చూపిస్తున్నాడు. ఉపసర్గ లను ఎక్కువగా వాడటం విద్వత్కవుల పద్ధతి. దాన్నికూడా అనుసరిస్తున్నాడు. తాను పండిత కవి ననిపించుకోవాలనే కాంక్ష ఇందుకు కారణం. ఉజ్జ్వలింప, అతిపవిత్రులు, విచ్ఛన్న, ప్రసంకుల, ప్రతినాద, ఉద్భూత, దుర్దాంత, ప్రస్ఫురించు వంటివన్నీ అందుకే వాడుతున్నాడు. సంస్కృతంలోని యత్తదర్థకాలతో వాక్యంరాయడంకూడా పండితకవుల బాణీయే. దానినికూడా అవలంబిస్తున్నాడు. 'ఏ పరాత్పరమూర్తి సదా పవిత్రనాట్యలీలానుకూలవిన్యాసములను నెరపుచున్నాడో ఆ హరు నిటలమందు' అని సంస్కృతసంప్రదాయాన్ని పాటిస్తున్నాడు. తేటగీతికి ప్రాసనియమం లేదు. కానీ ప్రాసను పాటించి రాయగల్గడం పనితనానికి పరీక్ష. ఇలాంటిది చిత్రకవిత్వసంప్రదాయం. ఆ సంప్రదాయాన్ని అనుసరిస్తూ గతిలోనూ శ్రుతిలోనూ వింతదనాన్ని చూపిస్తున్నాడు. 'తత సనాతన భారతక్షితితలమున/కతులితాలంక్రియామహోన్నతి వెలుంగు/అతిపవిత్రులు నాటి బ్రహ్మర్షివరులు/సతత మొనరించు క్రతుకార్యతతులయందు' అంటూ.

## శ్రవణ మోహన గానవైభవము !

1928 జూన్ 2

కవిత్వం ఎందుకు ? కవిత్వం ఎలా రచించాలి ? కవికి కళాప్రపంచంలో ఎలాంటిస్థానం ఉంటుంది ? కవి చేసే పని ఏమిటి ? ఇలాంటి ప్రశ్నలేవో ఎదురైనపుడు వీటికి సమాధానాన్ని కవిత్వంలోనే చెబుతున్నాడు. మరి అదీ భావకవిత్వధోరణిలోనే. వ్యాసంలో చెప్పదగిన అనేక విషయాల్నీ, విపులంగా చర్చించవలసిన అంశాల్నీ ఆలంకారికసంవిధానంతో సూత్రప్రాయంగా సులువుగా చెబుతున్నాడు.1

### కావ్యమీమాంస

కవితాశిల్పాన్ని గురించి తనకు అభిప్రాయాలు కొన్ని ఏర్పడ్డాయి. ఈ అభిప్రాయాల్లో తన విమర్శనసంస్కారాన్ని ప్రతిబింబిస్తున్నాడు.

### కవితాస్వభావం

శాస్త్రం బుద్ధిగమ్యం. కవిత్వం హృదయగమ్యం. సుకుమారహృదయుడు కానీ కవి కాలేడు. అతడు బుద్ధిశాలికూడా అయితేగానీ రచనాశిల్పం ప్రదర్శించలేడు. అందువల్ల కవిత్వం ఏకకాలంలో రెండుపనులు నిర్వహిస్తుంది. శాస్త్రం నెరవేర్చే పనులను కూడా కవితాకళ మరో మార్గంలో సాధిస్తుంది. అందుకే 'అది మనోమోహనమ్ము హృదయంగమమ్ము' అని కవిత్వం యొక్క గొప్పతనాన్ని వర్ణిస్తున్నాడు.

### కవిత్వం సృష్టి! శిల్పం!

'దాని సృష్టించు శిల్పి నిత్యప్రపూజ్య ఘనతరప్రాభవయుతుండు...

కవిత్వాన్ని రచించేవాడి విశిష్టత ఏమిటో పై పాదాలలో సూచిస్తున్నాడు. కవిత్వం ఒక సృష్టి. కవి తాను దర్శించినదాన్ని శబ్దశక్తివల్ల సృష్టించి ప్రదర్శిస్తాడు. అతను సృష్టించేవి అపూర్వ విషయాలు. ఈ సృష్టిలో అతడు శిల్పసౌష్ఠవం ప్రదర్శిస్తాడు. శిల్పం ఆకారరామణీయకాన్ని ఆవిష్కరిస్తుంది. పదగుంఫనంలోనూ ఛందోవిధానంలోనూ అతడొకనైపుణ్యం చూపుతాడు. సంగీతచిత్రలేఖననాట్యాదికళల లక్షణాలనన్నింటిని కవిత్వంలో క్రోడీకరిస్తాడు.

---

1 చూ: శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 65 పే

### కవి ప్రతిభ

ఈ పనుల నత డెలా చేయగలుగుతున్నాడు ? దీనికి సమాధానంగానే అతను 'నిత్య ప్రపూజ్యఘనతరప్రాభవయుతుండు' అని చెబుతున్నాడు. ఇందులో ప్రాభవం అనే మాటను ప్రతిభకు సమానార్థకంగా వాడుతున్నాడు. ఈ ప్రతిభ చేత అతడనేకమహిమలను ప్రదర్శించ గలడు. ప్రతిభ 'అపూర్వవస్తునిర్మాణక్షమ' మైనశక్తి. ప్రతిభ లేనివాడు కవి కాలేడు. అందుకే ప్రతిభ 'నిత్యప్రపూజ్యఘనతరం' అంటున్నాడు.

### భావనాశక్తి

ప్రతిభవల్ల కవి నిర్వహించే పను లేమిటి ? దానికిలా సమాధానమిస్తాడు.

'భావనాతీత వివిధ ప్రపంచములను భావనామాత్రమున దాటి పోవువాఁడు !
సుఖమహాదుఃఖ మిళిత నిష్ఠుర మనుష్యజీవితమునకు వ్యాఖ్య రచించువాఁడు!'

కవి చూపు ఒక పరవశావస్థలో ఒక రసానుభూతిలో నింగి అంచులదాకా నేల చెరగులదాకా చూడగల్గుతుంది. ఎప్పుడూ ఎవ్వరూ చూడనివస్తువులను కవి భావనా నేత్రంతో చూస్తాడు. అతడి కలం అభూత–అపూర్వవస్తువులను సృష్టిస్తుంది. ఏమీ లేనిచోట ఎన్నో ఉన్నట్లు నిరూపిస్తుంది. ఎక్కడో ఉన్నదాన్ని ఇక్కడ ఎదురుగా నిల్పుతుంది. నామరూపాలు లేనివాటికి నామరూపాలు కలిగిస్తుంది. అచేతనాలను చేతనాలుగాను, చేతనాలను అచేతనాలుగాను మార్చివేస్తుంది; చమత్కరిస్తుంది. దీనినే 'భావనాతీతవివిధప్రపంచాలను భావనామాత్రమున దాటిపో'తాడని టూకీగా సూచిస్తున్నాడు. భావనాశక్తి లేనివాడు కళాకారుడు కానేకాలేడు. ఇది అతని మొదటి అర్హత. ఈ అర్హతలోనే అతడు చేసేపనికూడా ఇమిడిఉంది.

### కవితా వస్తువు

రెండవది : అతడి వస్తువు ఏమిటి ? ఆ వస్తువు నతడెలా కవిత్వంగా రూపొందిస్తాడు ? మానవజీవితమే కవికి వస్తువు. మానవజీవితమంటే కేవలం సుఖాలో కేవలం దుఃఖాలో అనుభవించే మానవుల జీవితాలుకాదు. సుఖదుఃఖాలతో మిళితమయిన మానవజీవితమే. మానవజీవితం భావావేశంతో నిండిఉంది. సుఖదుఃఖాదులే భావావేశానికి ప్రేరణలు. ఈభావాలు మానసికమైనవి. ఇది అంతర్వాస్తవికత. జీవితంలో బాహ్యవాస్తవికత వేరు. ఈ రెండింటినీ భావనాత్మకంగా వ్యాఖ్యానించడమే కవిచేసే కవితావ్యాపారం. కవి తన 'భావన' అనే కంటితో జీవితబాహ్యాంతర్వాస్తవికతలను చూసి తాను చూసిన అందాలనూ సత్యాలనూ ఆస్వాద యోగ్యమయ్యే రీతిలో వ్యాఖ్యానించి, పాఠకులందరకూ ఆనందం కలిగిస్తాడు.

### రసానందం

దీనినే రసానందం కలిగించడం అంటాం. ఈ రసానందం ఎలాంటిదో చెబుతున్నాడు–

'సుందరము తద్ఘటితరసస్ఫూర్తి. మనుజ హృదయములయందు విహరించి
అది స్వకీయ శాశ్వతానంద ముద్రనచ్చట ఘటించు'

కవిత్వాన్ని ఆస్వాదించడానికి రచనాశిల్పం సహకరిస్తుంది. పదగుంఫనంద్వారా చెవికి ఆనందం కలిగించి, కవి తాను చెప్పదలచినదాన్ని గుండెల్లోకి చేరుస్తాడు. శైలి, ఛందస్సు, లయ మొదలైనవి బాహ్యసౌందర్యహేతువులే అయినా రసానుభూతికి తగిన వాతావరణాన్ని కల్పిస్తాయి. ఈ వాతావరణం లేనిదే రసానుభూతి హృదయానికి తొందరగా అందదు. అందువల్ల బాహ్యేంద్రియాల్ని తృప్తిపరచడం కవికి మొట్టమొదటి కర్తవ్యం.

### నాట్యసంగీతచిత్రలేఖనగుణాలు

ఆకారసామ్యం లేనిదే అందం కంటికి గోచరించదు. కంటికి చెవికి గోచరించని అందం హృదయానికి అందడం దుర్లభమవుతుంది. పైగా కవిత్వానికి అస్తిత్వం భాషవల్లనే కలుగుతుంది. ఈ భాష మనోహరంగా ఉండటం మాత్రమే కాదు; తత్ప్రసంగోచితంగా ఉండటం కూడా అవసరం. ఈ విధంగా కవిత్వానికి సంగీతం ఒక అంగమవుతుంది. లయబద్ధత లేనిదే ఏ కళా రాణించదు. సంగీతం పదాలలయవల్ల సిద్ధిస్తుంది. పదాల లయవల్ల కవిత్వం సమగ్రతనొందుతుంది. ఈ అభిప్రాయాలనన్నింటినీ వ్యక్తంచేస్తున్న పంక్తులివి- 'అది హృదయభూమి తాండవమాడునపుడు శ్రవణమోహనగానవైభవము మ్రోయు'. నాట్యసంగీతాల గుణాలు రెండూ కవిత్వానికున్నాయని ఇక్కడ కవి సూచించాడు. కవిత్వం హృదయంలో తాండవిస్తుంటే చెవులలో సంగీతం కురుస్తూంటుంది.2 పదాలకు అర్థాభివ్యక్తిగుణమే కాక సంగీతగుణం, నృత్యగుణం కూడా ఉన్నాయి. వాటిని కవిత్వంలో సమ్మిళితం చేయాలని కూడా అభిప్రాయపడుతున్నాడు. ఇక్కడ కవి చెప్పకపోయినా, పదాలకు ఉండే మూడవ గుణం చిత్రలేఖనగుణం. ఈ చిత్రలేఖనగుణంవల్లనే కవి పదచిత్రాలను సృష్టించి మనోనేత్రానికి హాయికలిగిస్తున్నాడు. సంగీతనృత్యగుణాలు ఛందశ్శిల్పం వల్లనూ చిత్రలేఖనగుణం అర్థాలంకారాలవల్లనూ లభిస్తుంది. ఇదంతా కలిసి కవితాశిల్పమవుతుందని గ్రహిస్తున్నాడు.

### శిల్పప్రపంచంలో కవి

ఇప్పుడు లలితకళలన్నింటిలోనూ కవిత్వం ఎందుకు మేలుబంతి అయిందో చెప్పడం సులువు. ఈవిషయాన్నే కళాకారులలో కవి ప్రథమగణ్యుడని చెబుతూ-

ప్రౌఢశిల్పజగత్తున ప్రథమగణ్యు డగును కవి, కవితాశిల్ప మతనిదగుట !

అని సూచించాడు. 'కవితాశిల్పం' మీద ఆనాటి లక్ష్యం తక్కువది కాదు.

---

2 "Poetry is the rhythmical creation of beauty" —Edgar Allen Poe.

## అతివికృతభయదాట్టహాసధ్వనుల్ !

1928 జూలై 12

సాయంసంధ్య అయింది. అదొక సముద్రంలా కనిపించింది. నక్షత్రాలు వచ్చాయి. అవి ముత్యాలుగా కనిపించాయి. కానీ అంతలోనే చీకట్లు వచ్చాయి. అవి దుఃఖంగా కనిపించాయి. అసలు సంధ్యారాగమే జీవితమేమో! నక్షత్రాలే ప్రేమభావాలేమో! జీవితంలో సుఖదుఃఖాలు రెండూ ఉన్నాయి. ఆ జీవితానికి వ్యాఖ్యానమే కవిత్వం కదా! ఆ వ్యాఖ్యానం తన జీవితానికే.1

### సంధ్యారాగంలో జీవితం

'సంధ్యారాగజలధిలో తారాసహస్రముక్తావాలలు' పుట్టాయట! ఆ సంధ్యారాగం జీవితమట! ఆ నక్షత్రాలు ప్రణయభావాలట! ఆ సంధ్యారాగం ఉద్యానమట! అందులోని పూలు సముద్రగర్భంలోని ముత్యాలమాలలట!

#### అలంకారభారం

ఇన్నిరకాలుగా చెప్పి అలంకారభారం పెంచుతాడు. 'ఆ సాంధ్యరాగప్రభాసౌకుమార్యమ్ములో సుధలుమాత్రమే భాసిల్లిపోయినవి'. ఈ సుధలను సుఖాలకు ప్రతీకగా తీసుకున్నాడు. ఇలా 'సుధలు మాత్రమే' అని చెప్పినవాడు ఊరుకోకుండా 'ఆనందభావవీచీనినాదంబులో కానంగ రాక దుఃఖమ్ము శ్రుతి కల్పినది', 'రోదోంతరాళసంరూఢాంధకారాన మాధుర్యమేది సంధ్యాదీప్తి నశియించె' అంటూ దుఃఖమూ చీకటీ వచ్చాయని వర్ణిస్తాడు. సంధ్యాకాంతిమీద కవి కెంతో ఇష్టం. కానీ ఆ సౌఖ్యానుభూతి తాత్కాలికం. దాని తరువాత చీకటి రాకతప్పదు. 'వికృత భయదాట్టహాసాలు' చేస్తూ దుఃఖమే అంతటా ఆటపాటలు సాగించిందంటాడు. ప్రపంచంలో కవికి ఆనందం కన్నా దుఃఖమే ఎక్కువగానూ భరించరానిదిగానూ కనిపిస్తుంది. చీకటి అనేకదురంతాలకు నిలయం. వాటి నెవరూ ప్రత్యక్షంగా చూడలేరని కవి గమనించాడు. అయితే దుఃఖంనుంచి జీవులను తప్పించగలదేమీ లేదా? అది ప్రేమమాత్రమే అని నిర్ణయించుకుంటాడు. ఆ విషయాన్ని రూపకాలంకారంతోనే చెబుతాడు. 'ఆమనస్యమహోజ్జ్వలాగ్నికీలలయందు ప్రేమైకదృక్కులే పీయూషశతములు' అనీ 'నశ్వరాంధధ్వాంతనద్రజీవితమెత్తి శాశ్వతప్రేమ తేజంబె ఉన్నతికూర్చు' అనీ చెప్పడంతో అంతా గజిబిజిచేస్తున్నాడు. రూపకాలంకారాన్ని కవిత్వసర్వస్వం అనుకోవడం వల్ల వస్తువును మరుగున త్రోసివేస్తున్నాడు. అందువల్ల ప్రతిపాదిస్తున్నదేమిటో స్పష్టపడదు. శృంగారసంబంధిప్రేమనుకాక మానవసమాజానికి మేలుచేకూర్చే దయనే ప్రేమగాభావిస్తున్నాడు. దుఃఖంలో ఉన్నవాడిపట్ల ప్రేమ చూపడంవల్ల ఆ దుఃఖం తొలగుతుందని భావిస్తున్నాడు.

---

1 ముద్రణ: భారతి. 1932 జనవరి. చూ. శ్రీశ్రీసా, ఒకటి. కావ్య. 66 పే.

## సుధాగానమ్ములో గద్గదాక్రోశమ్ముల్ వినదించు గీతికలు!

1928 జూలై 18

ప్రియురాలు తనకు దూరంగా ఉంది. ఆమెను తన దగ్గరకు ఆహ్వానిస్తూ తన విరహ వేదనను వెల్లడించుకుంటాడు. విరహవేణువు నూదుతాడు.[1] ఇది ప్రణయకవిత్వమే; కానీ ఉద్ధత వృత్తాలలో- మత్తేభశార్దూలాలలో- పాడుకుంటాడు. వస్తువుకు అనుకూలంగాలేని సంవిధానాన్ని ప్రయోగించి చూస్తాడు.

విరహవేదన

తన ప్రియురాలి 'కరుణాపాంగద్యుతుల' కోసం తపిస్తాడు. ఆమెతో 'విలాసానందమ్ములో' 'ప్రేమరాజ్యముల చూరాడంగ' ఊహిస్తాడు. ఆమె కోసం 'దీనగానం' చేస్తాడు. ప్రేమభిక్ష అడుగుతాడు. అదే తనకు సత్కారం అంటాడు. ఆమె నవ్వులకోసం మనోహరమైన తోటల్లో ఆమెతో పరవశించ దలుస్తాడు. తనపట్ల అనురాగం చూపించమంటూ అర్థిస్తాడు. తన వలపు తొందరను వ్యక్తంచేస్తాడు.

రూపక ప్రయోగాలు

'సంధ్యాభావన' ఖండికలోలాగే ఇందులోనూ రూపకాలెన్నింటినో వాడాడు. గానరస వాహిన్యంబువులు, ప్రేమరాజ్యములు, హృత్కుహరవహ్ని, ప్రేమభిక్షాసత్కారము, హాస జ్యోతులు, సౌదామినీలతికాంగి మొదలైన రూపకాలతో భావాలను మెరిపిస్తున్నాడు. 'హృత్కుహరవహ్ని' అనే రూపకంలో ఒక వైచిత్రి చేశాడు. హృత్కుహరం అంటేనే రూపకం పూర్తయింది. కాని హృత్కుహరవహ్ని అనడంతో భావసంశ్లిష్టతను సాధిస్తున్నాడు. తన హృత్కుహరవహ్నిని చూపిస్తూ ప్రేమభిక్ష నడగటం అనే ఊహాచిత్రం తొందరగా అర్థం కాదు. వహ్నిని ఆకలి అనే అర్థంలో వాడుతున్నాడు. ఆకలివేసినవాడు మాడుతున్న తన కడుపునుచూపి అన్నం పెట్టవలసిందని యాచిస్తాడు. అలాగే హృత్కుహరంలోని ప్రణయాగ్నిని చూపి ప్రేమభిక్ష నర్థిస్తున్నాడు.

1 ముద్రణ: చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 67 పే.

## జీవచిత్రకళారహస్యము చిందువార్చిన కవిత్వము!

1928 జూలై 22

పెద్దనగారి మనుచరిత్ర చదివాడు. ఆంధ్రకవితాపితామహుడి కవితాశిల్పానికి ఉబ్బితబ్బిబ్బయిపోయాడు. రాయలు పెద్దనకు గండపెండేరం తొడిగాడా ? మనుచరిత్రను రాయలు కృతి పొందాడా? పెద్దన కవిత్వం ఎంత గొప్పది? ఇలా ఆలోచిస్తూ పెద్దనగారికి కవితాంజలి సమర్పించుకున్నాడు.[1] ఆ కవితాంజలిని ముత్యాల సరాలలో రచించాడు.

### పెద్దన కవితావైభవం

భువనవిజయమహాసభావైభవాన్ని కళ్లకుకట్టేటట్లు వర్ణిస్తున్నాడు. తన భావనను పదచిత్రాలతో మెరిపిస్తున్నాడు. పెద్దనగారి ప్రతిభ అనేకరుచులతో తురంగలిస్తుందట ! ఆయనది 'మధువు లొలికిన మంజుకవిత'. ఆయన కవితాస్రవంతి రాయల మహాసభలో ధారకట్టిందట ! ఆయన తీయనిపాటలు విని నల్లత్రాచులు పరవశంపొందినట్లుగా పండితుల హృదయాలు అవశమయ్యాయట ! పెద్దనపాదంనుంచి గండపెండేరపుగానం పుట్టి సభలో మ్రోగిందట ! పెద్దనకీర్తి నేటికీ శరత్సుధాకరనిర్మలత్వాన్ని ధరిస్తోందట! పెద్దనకవితావైభవాన్ని ప్రతీకలతోకూడా వర్ణిస్తున్నాడు. పెద్దనకవిత్వం ఒక తోట. ఆయనయే దాన్ని నాటాడు. అందులో మనోహరభావాలు పూలగుత్తులవంటివి. అవి ఈనాటికీ తేటవలపులను దెసలనిండా నింపుతున్నాయట ! నిజానికి పెద్దన కవిత్వానికిది అద్భుతమైన ప్రశంస. పెద్దన కవితాగుణాలలో తనకు నచ్చినది ఆయన చేసిన 'మూర్తిచిత్రణ' అంటున్నాడు. పెద్దనగారిని ఆంధ్రవాఙ్మయాకాశంలోని చంద్రుడితో పోలుస్తూ ఆ పోలికను వ్యంగ్యంగా సూచిస్తాడు. 'తెలుగుకవనపుతీరుతీయము నిలిచి వెలుగుట కొరకు మెరుంగును చిలికి చుక్కల నడుమ మింటను కులుకుచున్నావు'! తక్కిన కవులు చుక్కలు కాగా పెద్దన వారిమధ్య మెరిసే చందమామ. 'మింటను కులుకుట' అనే జాతీయంతో ఉన్నతిని అభివ్యక్తంచేస్తాడు.

#### తేటతెలుగులో ముత్యాలసరాలు

'నీవు నాటిన తోటలోపల చేవతరుగని పూవుగుత్తులు నేటివరకును తేటవలపులు నింపెడిని దెసల'-ఈ ముత్యాలసరంలో ఒక తత్సమపదంకూడా లేకుండా జాగ్రత్తపడ్డాడు. ధారకట్టు, పండ్లుపూడ్లు, చేవతరుగని, నాటినతోట, తేటవలపులు నింపు, నిండువార్చు, తీరుతీయము మొదలైన జాతీయాలద్వారా పెద్దనగారి పలుకుబడిని జ్ఞాపకం చేస్తున్నాడు.

1 ముద్రణ: కవితాసమితివార్షికసంచిక. వైశాఖి. 1928 చూ.శ్రీశ్రీసా. రెండు. కావ్య. 69 పే.

## ఈ గభీరనిశీథినీగర్భకుహరాన ఎలుగెత్తిఏడ్తు వెందులకు ?

1928 అక్టోబరు 14

సాయంసంధ్య సంశయం లాంటిది. అంధకారం నిరాశలాంటిది. నక్షత్రం ఆశవంటిది. సంశయాన్ని నిరాశ ఆవరిస్తుంది. కానీ నిరాశవల్లనే ఆశ ప్రకాశిస్తుంది. అందువల్లనే నిరాశ గొప్పదిగా కనిపిస్తుంది. అందుకే అంధకారం కవితగా రూపుదిద్దుకుంది.[1] కవి ప్రకటించదలచినవి తన ఆవేదన, తన అనుభూతి, తన ఆవేశము. అయినా వాటినన్నింటినీ అచేతనాలద్వారా చెప్పిస్తాడు. అంటే అచేతనాలను తనకారోపించుకుని స్వగతంలో భాషిస్తాడు. సాయం సంధ్య, అంధకారం, నక్షత్రం మూడూ పాత్రలవలె పలుకుతాయి. ఈ మూడూ కవికి ప్రతీకలుగా ఎన్నో భావాలను వ్యక్తంచేస్తాయి.

### సాయంసంధ్యగా కవి

ప్రతిరోజూ సూర్యుడస్తమిస్తాడు. సాయంకాలమవుతుంది. తరవాత చీకట్లుక్రమ్ముతాయి. ఇది సహజపరిణామం. దీనినే కవి మానవజీవితానికీ లోకచరిత్రకీ అన్వయించాడు. ఒకయుగం పాతబడిపోయి, నూత్నయుగం మొదలుకావడానికి ముందుఉండే సంధియుగంలాంటిది సాయంసంధ్య. ఇందులో ఏదీ నిర్దిష్టలక్షణాలతో గోచరించదు. స్తబ్ధతకూ చైతన్యానికీ; చీకటికీ వెలుతురికీ ;మధ్య అవస్థ ఇది. ఒక వెలుగు పోతుంది. చీకటి ఇంకా రాదు. మధ్య నుండేది గ్రుడ్డివెలుగు మాత్రమే. ఇందులో దేన్నీ స్పష్టంగా చూడలేము. అంతా భ్రాంతి, అంతా సంశయం. సాయంసంధ్యగా కవి తానే మారిపోతాడు. మానవజీవితంలోలాగే దినజీవితంలో కూడా ఉదయదశ, యౌవనదశ, వార్ధకదశ ఉంటాయట! రోజుకి ముసలితనం వచ్చిందట! రోజుకు భర్త సూర్యుడట! (దినము : దినరాజు). భార్య ముసలిది కాగానే భర్త చైతన్యాన్ని కోల్పోయాడట! అప్పుడు 'సాయంసంధ్య'గా తాను పుట్టాడట! కానీ ఈ 'సాయంసంధ్య' జనించగానే సూర్యుడు మరణించాడట! ఈ మృతికి కారణం సాయంసంధ్య అని కథావ్యాజంతో చెబుతాడు కవి. 'ఔద్ధత్యమున నేనహర్పతిన్ మ్రింగితిని' అంటుంది సాయంసంధ్య. అయితే

---

1 ముద్రణ: భారతి. 1928 డిసెంబరు. చూ.శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 81–82 పే.
చూ. మహాప్రస్థానికలు రేడియోనాటిక (1948) శ్రీశ్రీసా. మూడు, వచన. 101-102 పే.

తన తల్లికే అరిష్టం తెచ్చిన సాయంసంధ్య తన వల్ల లోకానికైనా ఆనందం కలుగుతుందా అని చింతిస్తుంది. ఒకరిని చంపడానికి పుట్టిన తనకు మాత్రం జీవితం శాశ్వతమా అని తర్కించు కుంటుంది.2

అంధకారంగా కవి

సాయంసంధ్య పోగానే వెన్నెల అయినా రావచ్చు; చీకటి అయినా రావచ్చు. సంధియుగ లక్షణం కూడా ఇదే. అయితే కవి భావనలో చీకటే వచ్చింది. (అది కృష్ణపక్షమే గాని శుక్ల పక్షం కాదన్నమాట). ఈ అంధకారమే తానై పోయాడట కవి! అంధకారం దుఃఖానికీ అజ్ఞానానికీ నిరాశకూ కూడా ప్రతీకే కావచ్చు. ఇక్కడ అంధకారస్వగతంలో ఈ మూడు భావాలూ ధ్వనిస్తాయి. అంధకారం ఎలా ఎప్పుడు పుట్టింది? సూర్య చంద్రుల్ని కూల్చి మరీ పుట్టిందట! నిజంగా చీకటికి అంత శక్తి ఉందా? లేదుగానీ కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు. సూర్యచంద్రులున్నంత కాలం చీకటి రాదు. వారు లేనప్పుడే వస్తుంది చీకటి. తాను చేసిన ఘనకార్యంగా చీకటి చెప్పు కుంటున్నది సూర్యచంద్రులను చంపివేయడాన్ని గురించి. ఇందులో కూడా వ్యాజోక్తి ఉంది. హంతకుడైన వాడొకడు బయలుదేరగానే వాడ్నిచూసి లోకం భయపడుతుంది. 'నే బయలు దేరిన యంత జగతి యేమోగాని నగమేమరచిపోయి వగపుచే నిట్టూర్చి వనటచే చలియించు' అంటుంది అందుకే అంధకారం. అంధకారం అంటే అజ్ఞానమనీ, నిరాశ అనీ పాపమనీ అనేక విధాలుగా సంకేతార్థం చెప్పకునే వీలుంది కనకనే 'నా మేలిముసుగులో నలుపులూరెడునంట నా మీద జగతికింతయు ప్రేమ లేదంట' అని తన ఆత్మస్వరూపం గూర్చి తెలుసుకుంటున్నట్లు చిత్రి స్తాడు కవి. ఇందులో అంధకారం యొక్క పశ్చాత్తాపం, పరితాపం, దుఃఖం చిత్రింపబడ్డాయి. కవి సాయంసంధ్యగానూ అంధకారంగానూ కూడా లోకానికి ఏ విధంగానూ మేలు కలిగించలేక పోయాడు. తన అవతరణవల్ల లోకానికి దుఃఖమే కలిగింది. తనకూ ఆ దుఃఖమే తప్పలేదు. కాని సమస్త సౌఖ్యాలకూ ఆనందాలకూ భూమికగా ఉండేది దుఃఖమే అని కవి సిద్ధాంతం. దుఃఖానం తరమే సౌఖ్యం లభిస్తుంది. అదే గొప్పది కూడాను.

నక్షత్రంగా కవి

కవి తన అవతారాన్ని మార్చుకుని నక్షత్రంగా మారాడు. చీకటిలోగానీ నక్షత్రం ప్రకా శించదు. నక్షత్రంగా ఉదయించిన కవి చీకటిని చూసి అన్నమాటలే మూడో భాగంలో కవి

2 లోకంలో ఒక్కొక్కడు పుట్టినకాలం మంచిది కాకపోతే, మరొకరు (దగ్గరబంధువు) మరణించడం జరుగుతుందనే విశ్వాసం ఇక్కడ అనుసంధించుకోవాలి. 'వీడు పుట్టి వాడిని మ్రింగాడు' అనే నానుడి ఈ భావనకు మూలం.

పిస్తాయి, రాత్రి అనే గుహాలో పడి, - తనమీద లోకానికి ప్రేమ లేదని-చీకటి దుఃఖిస్తోందట ! చీకట్ల మేలిముసుగులోనే నలుపులూరుతాయట ! అందుకేనట దానిమీద నిరాదరణ. ఇక్కడ కథావ్యాజోక్తి ఉంది. నల్లటివాళ్ల నెవరూ ప్రేమించరు లోకంలో. కాని ధగధగలాడే నక్షత్రం మాత్రం - నల్లటి ఆ చీకటినే ప్రేమిస్తుందట ! చీకటిరాత్రులలోనే చల్లని గాలులు దిగంతాలనుంచి వస్తాయట! చీకటిరాత్రులు లేకుంటే తాను (నక్షత్రం) నిలవదట! ఈ విషయాలు నక్షత్రం చెప్పుకుంటుందిలాగ: 'స్వాగతమ్మొసగు నాశాగంధవాయువుల్ నిలువలేనే నీవు నిలిచియుండని వేళ వెలుగలేనే నీవు విస్తరించని వేళ'; అంతేకాదు; 'నీకాటుకలచేత నా నాకనుల్వికసించు' అంటుంది నక్షత్రం చీకటితో. ఇందులో కాటుకలు అంధకారానివనడం, కనులు నక్షత్రానివనడం గొప్పభావన. కాటుకలు నలుపు, అంధకారం నలుపు, కళ్లు తెలుపు, నక్షత్రం తెలుపు. చివరికి నక్షత్రం, అంధకారం - ఈ రెండింటికీగల సంబంధంలో 'అద్వైతం' స్ఫురిస్తుంది. 'నీవు నేనే నాకు నీవె యీలోకాన' అని చీకటితో పలుకుతుంది. అంధకారాన్ని నక్షత్రం ఆశ్రయించుకుని ఉన్నట్లే నిరాశ నాశ్రయించుకుని ఆశ ఉంటుందని పరస్పరవిరుద్ధాలైన ద్వంద్వాలకు ఒక అనుబంధం ఉండితీరుతుందని ఒక అద్వైతాన్నే ఒక తత్త్వంగా స్వీకరిస్తున్నాడు.

గేయంలో వచనసంవిధానం

ఖండగతి గేయరచనలో భావకవుల్ని-ముఖ్యంగా కృష్ణశాస్త్రిని ఒరవడిగా తీసుకున్నాడు. ఒకపాదాన్ని రెండుగా విడగొట్టి వ్రాయడం, నాల్గుపాదాల నియమాన్ని వదలుకోవడం, యతి ప్రాసల్ని పాటించడం మొదలైనవాటిలో భావకవుల్ని అనుసరించడంకన్నా క్రొత్తప్రయోగమేదీ లేదు. వేంకటపార్వతీశ్వరకవులు తమ భావసంకీర్తనంలో పద్యపాదాన్ని ఒక వాక్యంగా మలుచుకుని, ఆ వాక్యం వచనక్రమంలో ఉండేటట్లు వ్రాశారు. వచనంలో పద్యపాదాలు వ్రాసే పురాణ పద్ధతికిది వ్యత్యయం. గణబద్ధంగా ఉంటూనే వచనమునే భ్రాంతిని కలిగిస్తుంది ఈ పద్ధతి. పదాలు వచనక్రమం (Prose order) విడువకుండా గేయంగా మారతాయి. దానినే అనుసరిస్తున్నాడు. 'దివసమ్మునకు వయోధికత ప్రాప్తించినది' అనే వాక్యంలో దివసమునకు అనే మార్పు వచన క్రమానికి సన్నిహితమవుతుంది. భావంవల్ల కవిత్వంగాని ఛందోగుణంవల్ల కాదు. ఛందస్సు కవిత్వానికి నిమిత్తమాత్రమే అనీ కవిత్వగుణాధిక్యాన్ని ఛందస్సు నిరూపించదనీ గ్రహిస్తున్నాడు.

## కలుషకర్దమ మధికవక్రమ్ము ఈ నితాంతవాతావరణము!

1928 నవంబరు 16

సూర్యుడస్తమిస్తున్నాడు. తాను సముద్రతీరంలో కూర్చుని చూస్తున్నాడు. ఎన్నో భావాలు కలుగుతున్నాయి. ఆ పారవశ్యంలో లోకాన్నే మరిచిపోయాడతడు. ఆ క్షణాలంటే అతని కెంతఇష్టమో.[1]

### సంధ్యాకాలం-సాగరతీరం

అందమైన అనుభూతి కలిగించిన నిమిషాలు అతని మనస్సును వశంచేసుకున్నాయి. ఎదురుగా ఉన్న సముద్రం ఎంతలోతుగా ఉందో తెలియదు;కానీ భయంకరమైన తరంగాలధ్వనులతో ఉప్పొంగిపోతోంది. అతని మనస్సులోకూడా భావనాతరంగాలు పొంగుతున్నాయి. ఈ రెండింటి అల్లకల్లోలంలోనూ అతనికి బాహ్యప్రపంచమంతా ఎలాగుందో తెలియని పరిస్థితి ఏర్పడింది.

‘ఇవి గభీరోదకములు నా ఎదుట భీషణార్భటులతోడ నుప్పొంగునవసరమున
నా మనస్సునఁ గల భావనాసహస్రసంతతులలోన సృష్టి అస్పష్టమయ్యె’

‘మనశ్చంచలత నశించ కొంగ్రొత్త భావాలు చివురులెత్త’ అక్కడే కూచునిపోయాడట.

### అనుభూతిపారవశ్యం

వెనుక ‘పశ్చిమాశ కూడబెట్టుకున్న కుంకుమ’ చూచినట్టు కూడ అతనికి జ్ఞాపకంలేదట! ఇంతలో సంజగాలి వీచిందట! ఆ గాలి కెరటాలలో ప్రకృతి అంతా ముగ్ధమైపోతోందట! కాని తాను మాత్రం దానికి పరవశించలేకపోయాడట! కారణం అతని మనస్సులో కలిగిన భావనా మాధుర్యంకన్నా గొప్పదిగా కనిపించలేదట- ఆ సంజగాలిలో పరవశం చెందిన ప్రకృతిఅంతా!

సాంధ్యవాతూలవీచీప్రసారముగ్ధ మీసమస్తప్రకృతి కాని ఏమొ నాకు
నామధురభావనలలోనే మనస్సు బద్ధమై ముగ్ధమై మహాభాగ్యమిచ్చె!

ఇంతలో దిక్కులనిండా ఘోషలు నిండాయట! అవి పిట్టలకూతలు, కెరటాల సవ్వడులు వగైరా వగైరా కావచ్చు. అవి ఏవీ ఇతనికి వినబడలేదట! లోకంలో ఉన్న వాతావరణమంతా కలుషమయిందట! బురదతో నిండినదట! వంకరటింకరగా ఉందట! అందుకే దాన్ని వదిలివేశాడట! తనకేవో పవిత్రభావాలు కలుగసాగాయి. ఆ నిమేషాలనే ప్రేమించసాగాడు.

---

1 చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 83 పే. Keats inspired this —అని కవియే వ్రాసుకున్న నోట్.

ఉదాత్తకవిత్వం కోసం ఉజ్జ్వలస్వప్నాలు

---

*1929* కవితలు

---

నిశీథసాంత్వనము తమస్విని మధుమూర్తి

సుప్తాస్థికలు సుమార్చన భావిదృష్టి గీతి

అనుకరణకు శిల్పంలో
స్థానం లేకపోలేదు !
మరొక కవిని తలపించుతూ ఉన్నంతమాత్రంచేత
ఒకపద్యం మంచిది కాకపోనక్కరలేదు !
కాని స్వస్వత్వద్యోతకమైన ప్రత్యేకత
వాఙ్మయంలో అన్నిటికన్నా
మిన్నగా ఉపాదేయమనీ
అందువల్లనే కవికి
ఉన్నతశిఖరాలమీద
స్థానం దొరుకుతుందనీ విస్మరించకూడదు !

—శ్రీ శ్రీ.

## ...శర్వరి నా నవవృత్తగానపక్షాల సుషుప్తి తేలెడిని!

1929 ఫిబ్రవరి 9

ఒక అర్ధరాత్రి–వెన్నెల–తెలిమబ్బులు ఆకాశంనిండా అలముకుని ఉన్నాయి. అతడు ప్రకృతిలో చిరునవ్వులు, చుంబనాలు చూస్తాడు. తనలో కవిత్వం ఉప్పొంగుతుంది. తన హృదయానుభవాన్ని వ్యక్తంచేయడానికి భావనాలోకాలలోకి పరుగెడతాడు. ఆ 'రాత్రి'కే ఒక రూపం కల్పిస్తాడు.1

### అర్ధరాత్రి-తెలిమబ్బు

వెన్నెలలో మేలుకొని ఉన్నకవి 'అర్ధరాత్రి'ని ఒక విరహిణిగా భావిస్తాడు. ఆమెకు వెన్నెల వ్యర్థంగా కనిపించిందట! ఆమె గుండె మధుధారగా ద్రవించిందట! గళం మూగపోతుందని పించిందట! ఆమెను ఒక తెల్లమబ్బు చూసిందట! ఆ తెల్లమబ్బు జాలిపడిపోయిందే తప్ప అర్ధరాత్రి నోదార్చలేకపోయిందట! తెల్లమబ్బు ఏమీచేయలేనిస్థితిలో తెల్లబోతూ వెన్నెలలో మునిగి పోయిందట! ఈవిషయాన్ని ఇలా వర్ణిస్తాడు– 'శాంతవిభావరీ హృదయసాధ్వసమున్ గ్రహియించి వింతలో ఎంతయు తెల్లబోయినటులే ఒక లేతెలిమబ్బు నింగిపై అంతయు క్రమ్మికొన్న ధవళాంశుమరీచులలో మునింగి' ఆవిరిలా మాయమైపోయిందట!

### అమృతస్రవంతికలు

ఈ దృశ్యాన్ని చూసిన కవి మనస్సు అనుభూతితో స్పందించింది. అతనిలోని ప్రణయం, భయం, సుఖం, దుఃఖం మొదలైన సహజభావాలు ఒక్కమారుగా పొంగాయి. వీటినే కవి 'నిసర్గ పిపాసలు' అన్నాడు. ఆ నిసర్గపిపాసలుండే చోటు మనస్సు. అది సముద్రంవలె ఆకాశమంత ఎత్తుకు ఎగిసింది. ఇలాంటి రసోదయస్థితిలో అతడు తన ఊహల్ని చెప్పకుండా ఎలా ఉంటాడు? 'ఏగతి పాడకుందును జనించిన ఊహల నెల్ల నా మనస్సాగర మంతకంతకు నిసర్గపిపాసల పొంగి నింగిపై ఊగగ నేగునంతట' అని ప్రశ్నించుకుంటాడు. కవిత్వం ఉదయించడానికి కావలసిన భావావేశపరిస్థితి ఇదే! ఈసమయంలో అతనిలో 'నవోజ్జ్వలమోహన కావ్యగీతికా వాగమృతమ్ము లాగక స్రవంతికలై' ప్రవహించసాగాయట! మనస్సు అనే సముద్రంలోంచి పుట్టిన మాటల అమృతం ఇది!

---

1 ముద్రణ: భారతి. 1932 జనవరి. చూ. శ్రీశ్రీసా, ఒకటి. కావ్య. 66 పే.

## శృంగారోద్దీపనాలు

ప్రకృతిలో ఆరాత్రి కవికి ఉద్దీపకవాతావరణం కనిపించింది. లోకపుచిరునవ్వులు చూశాడు. వెన్నెలలో పులకించిన చంద్రకాంతశిలలనుంచి జారుతున్న జలధారల్ని చూశాడు. దిక్కుల అమృతపు చెక్కిళ్ళను ముద్దిడుకుంటున్న గాలిని చూశాడు. వీటిని చూడగానే అతని భావాలు సంగీతమయంగా వెలువడ్డాయట !

మామకవాణి ఈ నిఖిల మంగళలోకదరస్మితమ్ములో
ఈ మృదుచంద్రికాపులకితేందు శిలాజలధారలో దిశా
స్తోమ సుధాకపోలపరిచుంబనతత్పర మాతరిశ్వహృ
త్సీమ సుఖమ్ములో కని నదించు నుదంచిత భావరాగముల్.

ఇంతకు ముందు భయదుఃఖాలతో ఉన్న విభావరీవిరహిణి కవి భావరాగాలను విని తేరుకుంది.

## విభావరికి కవితాశయ్య

కవి రచించిన నవ్యవృత్తాల రెక్కలమీదికి వచ్చి చేరిందట ఆ విరహిణి. కవి రచించినవి 'ఉత్పల (కోరకావళీ) మాలికలు'. వాటినే 'రాత్రి' తనకు 'శయ్య'గా చేసుకుని హాయిగా నిద్రించింది. 'నా లలితధ్వనుల్ విని మనస్సు వినిర్మలతాపరీతమై చాల సుఖప్రభూతి కన శర్వరి నా నవవృత్తగానపత్రాల సుషుప్తి తేలెడిని శాంతిగ నుత్పలకోరకావళీమాలికలే మనోహర సమంచితశయ్యగ హాయి హాయిగాన్' అంటాడు.

భావగీతికాలక్షణాలు

ఈ ఉత్పలమాలికావృత్తాలలో భావగీతికాలక్షణాలను ప్రదర్శిస్తున్నాడు. 'ఏ గతి పాడ కుందును జనించిన ఊహల' అని ప్రశ్నించుకోవడంలో తన భావావేశాన్ని వ్యక్తం చేయకుండా ఉండలేకపోవడం భావకవి లక్షణమే! భావకవిత్వానికి ప్రధానలక్షణమైన మధురశబ్దరచనను 'మనోహర సమంచిత శయ్య' అనే మాటలో వ్యక్తంచేశాడు. 'నదించు నుదంచిత భావరాగముల్' అని చెప్పుకోవడంలో భావావేశం గీతి రూపం ధరించడం కూడా భావకవితాలక్షణమే. భావ గీతికకు కావలసిన అంతరంగశుద్ధి (sincerity) ఈ కవితలో ఉందని కవి కూడా అభిప్రాయపడ్డాడు.

## వినూతనచకోరకగీతి! సుధాకరబంధురజ్యోతి!

1929 ఏప్రిల్ 9

జీవితంలో దుఃఖం వచ్చినప్పుడు ఏడవడం ఎందుకు? ఆ దుఃఖాన్నే ప్రేమిస్తే సరిపోదూ? దుఃఖానికి ప్రతీక చీకటిరాత్రి. తానే ఆ తమస్విని అయిపోతాడు. ఇప్పుడు అమావాస్య. చంద్రుడు లేడు; చకోరిక లేదు. కాని చుక్కలున్నాయి. మబ్బులున్నాయి. గాలులున్నాయి. అన్నీ తనలాగే దుఃఖిస్తున్నాయి. అవును, అవి తన కలాగే కనిపిస్తున్నాయి.[1]

### అమావాస్యా విహాయసం

కవి ఒక అమావాస్యనాటి రాత్రి నిరాశాహతుడై దుఃఖంతో క్రుంగిపోతాడు. ఇందు కతని జీవితపరిస్థితులు కారణం కావచ్చు. ప్రకృతిలో అతనికి ఎక్కడా ఆనందం గోచరించలేదు. ఆకాశంకూడా శూన్యంగా ఉంది. అతడు 'వినూతనచకోరకగీతి'నిగానీ, 'సుధాకరబంధురజ్యోతి'ని గానీ కోరుకుంటున్నాడు. ఈరెండూ ఆనంద సంకేతాలు. అమావాస్యనాటి ఆకాశంలో ఈరెండూ లభించవు. అయితే అక్కడ నక్షత్రాలు లేకపోలేదు. అవి ఆనందాన్ని కలిగించ కూడదా? అంటే 'ఒక ఎరుంగని వేదనోద్వేలత వహించి, వికసించి ముకుళించి బెగడు'తున్నా యట ఆ నక్షత్రాలు. ఇందుకు కవి దుఃఖమే కారణం! తన సుఖదుఃఖాలనే తాను ప్రకృతిలో కూడ చూస్తున్నాడు. మబ్బులుకూడా తనలాగే దుఃఖిస్తున్నాయి. అచేతనాలయిన మబ్బులకు కూడా చేతనసహజమైన 'హృదంతరబాధ' ఉందంటాడు కవి. అయితే అది ఎలా తెలుస్తుంది? అవి ఆ బాధను పడలేకపోవడంవల్లనే ఒక దానినుంచి ఒకటి విడిపోయి దారి కనిపించక కదలి పోతున్నాయట!

### సమీరవీచికలు

ఇక గాలులు కూడా ఆ రాత్రివేళ దుఃఖాన్ని అనుభవిస్తున్నాయి. అంతేకాదు; అవి తమ దుఃఖాన్ని దిగమ్రింగుకోవడానికే ఏ చెట్లచాటుల్లోనో దాక్కొని తిరిగి తిరిగి చివరికి సమాన ధర్ముడైన కవిదగ్గరకు వచ్చి తమ బ్రతుకును వివరించుకుని ఏడుస్తాయట! తన దుఃఖం తనకు చాలదా? కాని ప్రకృతిలోని దుఃఖాలన్నీ తనకే ప్రాప్తించాయి. ఇక్కడ 'నా గర్భముచ

---

1 ముద్రణ: భారతి 1929 మే. మూ. శ్రీ శ్రీ పా. ఒకటి. కావ్య. 36 పే.

రోదనధ్వానములై మ్రోగు' అంటాడు కవి చీకటిరాత్రి రూపంలో. కవి హృదయంలో ఎంత జాలి నిండి ఉందో తెలుస్తుంది ఇక్కడ.

మంచుసోనలు

తాను అమావాస్యారాత్రి కదా, ఇప్పుడు కాకపోయినా ఇంతకు ముందయినా ఆనందమంటే ఏమిటో తనకు తెలుసు. వెన్నెలను తానెరుగును. 'ప్రేయసీనూత్నయౌవనాధీనుడై ప్రియుడు వర్తిలిన వెన్నెలరాత్రి తీయనై'నదే కావచ్చు. కానీ అంతటి తీయదనం తనకు నచ్చదు. శృంగార రసంకన్నా కరుణరసం అంటేనే తనకు ప్రీతి. అందుకే 'ఈ యమావాస్యనే హెచ్చునే వరియింతు, నేను దట్టపుమంచుసోనలే కురియింతు' అంటూ కన్నీటిని సూచిస్తాడు. వ్యక్తిగతమైన దుఃఖాను భూతిని వ్యక్తంచేయడానికి ప్రకృతిని ఆధారంగా తీసుకుంటున్నాడు. తన భావావేశాన్ని వ్యక్తం చేయడానికే ప్రకృతిని వర్ణిస్తున్నాడు.

గణసంగీతం

గేయపాదాల్ని బేసిసంఖ్యతో పూర్తిచేస్తున్నాడు (3, 5, 7 పాదాలు). ఇది చతుష్పాత్తు లను తిరస్కరించడంకోసమే. రెండేసి రెండేసి పాదాలకు ప్రాసను వేయడం జరిగినా చివర మరొక పాదం ప్రాసతో నిమిత్తం లేకుండా అతికిస్తున్నాడు. ఇదికూడా ఒక నవ్యసంవిధానమే.

పంచమాత్రాగణాలుగా కేవలం 'సలములు' మాత్రమే వాడటం తలవనితలంపుగా జరిగిన పనికాదు. గణసంగీతంమీద ప్రీతి దీనికికారణం.

(ఎదో హృదం) తరబాధ।పడలేక।విడిపోయి।కదలాడు। తెరువింత।కనరాక।జలదాలు2

కృష్ణశాస్త్రీయం

ఈ రచనాసంవిధానంమీద కృష్ణశాస్త్రిగారి ప్రభావం ఉందని కవి అంగీకరిస్తున్నాడు. కానీ తాత్త్వికదృష్టిలో కృష్ణశాస్త్రికీ తనకూ భేదం ఉందంటాడు.3

కృష్ణశాస్త్రిగారి దుఃఖం విరహంనుంచి పుడుతుంది. ప్రణయదుఃఖంతోనే ఆయన ఆనందించారు. ఉదాహరణకు (1) ఏడం జనిన మనోహారి జాడలరసి కలంగు హృదయంబు (2) నా

2 ఇలా 'సలములు' వాడటం కృష్ణశాస్త్రిలో కనిపిస్తుంది-
'ఎలదేటి చిరుపాట సెలయేటి కెరటాలం బడిపోవ విరికన్నె వలపువోలె'

3 "Not a Krishnasastrian exultation in things that are gloomy, though technique recalls some of his lyrics" (చూ. శ్రీశ్రీ. సా. ఒకటి. 86 పే.)

మనోహారి! నిన్నుఁ గన్నారఁ గాంచ నలవిగాకుండ దుఃఖాశ్రుసలిలమౌక్తికంబొకటి నాదు ప్రణయ వీక్షణముఁ గప్ప (3) ప్రణయభంగ ప్రభూతతాపజ్వరార్తి నెటులు భరియింతునో సఖా! మొదలైనవెన్నో ఉన్నాయి. కాని ఇతని దుఃఖానికి ప్రేయసీవిరహం మూలంకాదు. 'ఒక యెరుంగని వేదనోద్వేలత', 'ఏదో హృదంతర బాధ' అది. అందువల్లనే అతడు 'ఈ యమావాస్యనే హెచ్చునే వరియింతు!' 'నేను దట్టపు మంచుసోనలే కురియింతు' అని ప్రకటించుకుంటాడు. ఈ అమావాస్య లేకపోతే ఈ బాధలు, వేదనలు ఉండవు. ఈవిధంగా వ్యక్తిగత హృదయావేదనలో నిజాయితీ కనిపిస్తుంది.4

రచనాసంవిధానంలో కృష్ణశాస్త్రిప్రభావం గోచరిస్తుందని కవిచెప్పిన మాట అక్షరాలా నిజమే! ఉదాహరణకు: 'ఏదోవింతకోర్కె తీయుదనపు వేదన' అని కృష్ణశాస్త్రి అంటే 'ఏదో హృదంతరబాధ పడలేక' అని ఎత్తుకుంటున్నాడు. 'వదలునా యెట నెదురేగి వెదకు వలపు కలుగునా నాకు నీ వియోగమ్ము సకియ' అన్నారు కృష్ణశాస్త్రి. అంతకన్నా అందంగా 'వినదించునా వినూతన చకోరిక గీతి కనిపించునా సుధాకరబంధురజ్యోతి' అంటున్నాడు. 'ఏనెరుంగుదు నావలెనే యతండు పాట పదములకై నిత్యపథికుడయ్యె' అన్నారు కృష్ణశాస్త్రి. 'ఏనెరుంగుదు ప్రేయసీ నూత్నయౌవనాధీనుడై ప్రియుడు' అంటున్నాడితడు.

## నే ద్రవింతు రసపుంజముగా మిహికాస్రవంతిగా!

1929 ఏప్రిల్ 6

నాట్యం. సంగీతం, కవిత్వం గొప్పకళలు. అవి ఎలా లభిస్తాయి? వాటివల్ల కలిగే ఆనందం ఎలా లభిస్తుంది? ఒకవేళ ఇవన్నీ ఏ దివ్యుడి సంపదలో? ఆయననే 'మధుమూర్తి' అని పిలుస్తాడు. తేనె లాంటిది ఆహ్లాదం. దాన్ని ఇచ్చే రూపం గలవాడే 'మధుమూర్తి'. ఆయన తన మనస్సులో తాండవిస్తే, పాటలు పాడితే ఎంత బావుంటుంది? నాలుగు వృత్తాలలో ఒక కొసమెరుపుతో ముగించిన కవితాప్రక్రియ ఇది.[1]

కటాక్షకాంతులు

ఆ మధుమూర్తి ఎక్కడో చేసే నాట్యాన్ని తన మనస్సులోనే చేయాలట! ఆయన సంగీతం తన కంఠంలోనే కాలువలు కట్టి ప్రవహించాలట! ఆయన క్రీగంటి చూపుల కాంతులతో తన జీవితపు చీకటి గుమ్మాన్ని పగులగొట్టాలట! తనకు వచ్చిన గళమాంద్యం ఆయన మృదు గానరావాలు మ్రోగితే నశిస్తుందట! నిరర్గళంగా తాను కవిత్వం చెప్పాలట! అందుకు ఆయన ప్రేమ తనకు లభించాలి. ఆయన నర్తనంతో తనమనస్సు నిండితే తనమనస్సుకూడా తాండ విస్తుందట! 'త్వద్వినర్తన కళాపరిపూర్ణమెయైన నా మనస్సాగర మంత తాండవవిశారదతన్ వహి యించు నీవలెన్' అని చెప్పుకుంటాడు. గాననాట్యాలు లభిస్తే తనకు తన్మయత్వం కలుగుతుంది. కానీ ఆ పారవశ్యం తనకు శాశ్వతంగా వద్దంటున్నాడు. 'నా స్వాంతము సౌఖ్యవేదన నెసంగు! భరించగచాలకంత ప్రార్థింతు సుఖమ్ము తీసుకొని దీనతన్ కరుణించగా ప్రభూ!' అంటాడు. తనకు కావలసినది పరిపూర్ణానందంకాదు – నిరంతరదైన్యం! దాన్నే ఇమ్మని ప్రార్థిస్తాడు. ఆయన చిరు నవ్వు నవ్వుతాడట. ఆయన చిరునవ్వులు వెన్నెలలవుతాయి. వాటిలో తాను ఒక గసపుంజంగా మారిపోతాడట! కరిగిపోతాడట!

పద్యవిద్య

వాక్యాలనూ వాక్యరీతులనూ ఆవృత్తం చేసి పద్యాన్ని బాగా నడిపిస్తున్నాడు.

నీ నాట్యమ్ములు నా మనఃస్థలిన కానిమ్మోయి! నీ గాన లీ
లా నైర్మల్య నవోజ్జ్వలస్రుతులు కాల్వలగట్టి నా కంఠమం
దే నిండంగ నదించుమోయి! మధుమూర్తీ! నీ కటాక్షద్యుతుల్
రానిమ్మోయి! మదీయజీవితతమిస్రద్వారమున్ జీల్చుచున్!

---

1 ముద్రణ: 1929 జూన్ భారతి. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 87 పే.

## ఆ నిశా శ్మశానశయ్యకు ప్రాతఃప్రసక్తి లేదు !

1929 ఏప్రిల్ 16

పుట్టిన ప్రతిమనిషీ చస్తున్నాడు. మనిషి మృత్యువును జయించలేకపోతున్నాడు... ఇప్పటిదాకా ఎందరు గతించారో? అందరూ సహజంగా మరణించలేదు. బలవంతంగా చని పోయారు. హత్యలవల్ల పోయారు. యుద్ధాలలో కనుమూశారు. ఆ పోయినవాళ్లుకూడా తమ తమకాలాల్లో ఎన్ని అద్భుతాలు సృష్టించలేదు? ఎన్ని విజయాలు సాధించలేదు ? ఆనాటి కళలు, ఆనాటి సంస్కృతి, ఆనాటి జీవితవిధానాలూ మళ్లీ రమ్మంటే వస్తాయా ? ....అందరిలాగే తానూ మట్టిలో కలియక తప్పదు. మట్టిలో ఎన్నిఎముకలు పడి ఉన్నాయో? అవన్నీ అక్కడ నిద్రిస్తున్నాయి. వాటికి కూడా ఒకప్పుడు స్వప్నావస్థ, జాగ్రదవస్థ ఉండేవి. ఇలా తలుచుకుంటూన్నప్పుడు కవికి దుఃఖం కలుగుతుంది... ఇంతకు ముందు గతవైభవం గొప్పదని తలపోసిన కవే ఇప్పుడు గతం మరిరాదని తెలుసుకున్నాడు. ఆ భావనలో 'సుప్తాస్థికలు'[1] వెలు వడ్డాయి. కరుణబీభత్సాలవైపు కవిభావాలు మలుపుతిరుగుతున్నాయి.

### సుప్తాస్థికలు అంటే ?

సుప్తాస్థికలు అనే పదబంధానికి నిద్రించిన ఎముకలు అని అర్థం. కానీ ఎముక లేమిటి? నిద్రించడం ఏమిటి? అనేప్రశ్న ఎదురవుతుంది. ఎముకలు చనిపోయినవారికీ, నిద్ర జడత్వానికీ ప్రతీకలు. సుప్తాస్థికలు అనే మాట గతించిన మానవులకు ప్రతీక. ఇవి అనేక మానవుల ఎముకలు. కనుకనే 'పరంపరలు' అంటాడు. ఇవన్నీ భూగర్భంలో కవికి కనిపించాయట! అతడు భావనానేత్రం తోనే దర్శించాడు. యుగయుగాలనుంచీ మానవుడు భూమిమీద జననమరణాలు పొందుతున్నాడు. కోట్ల మానవులు గతించారు. వారి ఎముకలు భూగర్భంలో కప్పువడ్డాయి. అవన్నీ నిద్రిస్తున్నవనీ నిశ్శబ్దంగా ఉన్నవనీ ప్రోగులుగా పడిఉన్నవనీ కవి ఊహిస్తున్నాడు.[2]

### నిశ్శబ్దసంపుటాలు

'సుప్త నిశ్శబ్దసంపుటములు' అనే పదచిత్రంతో వాటి జడత్వాన్ని ప్రకటించాడు. సంపుట ములు' అనే మాట చిత్రమైనది. పుస్తకాల రాశులకు సంపుటాలని వాడతాం. భూగర్భంలో

1 ముద్రణ: సమదర్శిని 1930 చూ.శ్రీశ్రీసా. ఒకటి, కావ్య. 89 పే.

2 చూ. 'ప్రభవ'లోని 'మృత్యుప్రబోధము.

ఉన్న ఎముకల గుట్టలు కూడా మూతపడిన పుస్తకాలవంటివే అని కవి అభిప్రాయం. వాటిని పరిశీలిస్తే అనేకవిషయాలు తెలుస్తాయి. లేకుంటే అలా పడి ఉంటాయి. సంపుటాలలో శబ్దాలుంటాయి. కానీ ఈ అస్థికాసంపుటాలలో నిశ్శబ్దాలే ఉన్నాయి. అవి పైగా నిద్రాణస్థితిలో ఉన్నాయి. అలాంటి వాటిని కవి చూశానంటున్నాడు. ఈ భావమంతా రెండుపంక్తులలో కుదించగల్గుతున్నాడు.

'అవి ధరాగర్భమున మానవాస్థికాపరంపరలు! సుప్తనిశ్శబ్దసంపుటములు!'

## శ్మశానశయ్య

సుప్తనిశ్శబ్దసంపుటాలుగా మానవాస్థికాపరంపరలు పడిఉన్న భూగర్భంలో సూర్యోదయం, చంద్రోదయం మొదలైనవి లేవు. అందుచేతనే 'అటనొకే దీర్ఘయామిని' అని చమత్కరిస్తున్నాడు. అది దీర్ఘమైన రాత్రి కావడం ఒక భయంకరత్వాన్ని వ్యక్తం చేస్తోంది. ఈ భయానకపరిస్థితి ఇలా ఉండగా కవి దాన్ని మరింత భయానకంగా చిత్రిస్తూ 'ఆ నిశాశ్మశానశయ్య' అంటాడు. అసలే రాత్రి, దానికి తోడు శ్మశానం. ఆ శ్మశానమే సుప్తాస్థికలకు శయ్య. ఆ సుప్తాస్థికలు నిద్ర నుంచి ఎన్నటికీ మేల్కొనవు. మేల్కొనక పోవడానికి కారణం సూర్యోదయం కాకపోవడం. ఈ విషయాన్ని 'ప్రాతః ప్రసక్తి లేదు' అని సూచిస్తున్నాడు.

'అటనొకే దీర్ఘయామిని! ఆ నిశా శ్మశాన శయ్యకు ప్రాతః ప్రసక్తి లేదు'

## మృత్యుశైతల్యం

ఆ ధరాగర్భంలోని వాతావరణ మెటువంటిది? అక్కడ చల్లని గాలులు లేవు. మరి ఉన్నది 'మృత్యుశైతల్యం' మాత్రమే. శైతల్యమనే పదమే మృత్యువుకు వాయుత్వాన్ని తెల్పుతుంది. మృత్యువక్కడ చల్లబడిపోయి ఉంది. కాని అది తాండవిస్తోందట. మృత్యువు తాండవించే చోటు నరకమవుతుంది. ఈ ధరాగర్భం మృత్యునివాసమే! అది 'అగమ్యతమోరహస్యాంగణము'గా కూడా కవికి కనిపించింది. ఇక్కడ మూడు విశేషణాలున్నాయి. ఈ మూడూ సాభిప్రాయమైనవే. (1) అగమ్యం అంటే చేరడానికి వీలుకానిది. (2) తమస్సు అంటే చీకటితో నిండినది. (3) రహస్యము అంటే ఎవరికీ తెలియరానిది.

'ఆ యగమ్యతమో రహస్యాంగణాన తాండవించును మృత్యుశైతల్య మొకటె'

## అనుభవాల సమాధి

భూగర్భాన్ని ఈ కవి చాలా అపూర్వంగా వర్ణించాడు. మృత్యుశైతల్యం తాండవించే ఆ రహస్యాంగణం ఒక సమాధి లాగుంది. ఆ సమాధి (గోరీ) - మామూలు సమాధి కాదు.

అందులో అనుభవాలు ఎన్నో గడ్డకట్టుకుపోయాయి. వాటికి కదలిక లేదు. ఆ అనుభవాలు 'నితాంత హేమంత హృదంతరంతరం' లోనివి. ఎడతెగని మంచుకాలంలో ఆ మానవులు పొందిన గుండెలోతులలోని అనుభవాలు ఇప్పుడున్నాయా? లేవు. అవన్నీ ఇప్పుడు ఘనీభవించాయని చమత్కరించాడు. చనిపోయి ఎముకల రూపంలో మిగిలిపోయిన మానవులనేకులు తాము బ్రతికి ఉన్న కాలంలో శృంగారానుభవాలెన్నో పొందారు. ఆ అనుభవాలు ఈ ఎముకలలో ఘనీభవించాయి ఈనాడు. ఈ విధంగా కవి భావన ఎన్ని యుగాల వెనుక వెనుకకో పరిగెడుతోంది.

'అవి నితాంత హేమంత హృదంతరంతరనుభవాళి ఘనీభవించిన సమాధి'

### భైరవస్వప్నవీథి

కవి చూసిన మనుష్యాస్థికలు నిద్రావస్థలో ఉన్నాయని చెప్పాడు. నిద్రలో ఉన్న మానవుడు స్వప్నం పొందడం సహజం. ఈ స్వప్నావస్థ అస్థికలకు కూడా ఉందట! అయితే ఈ కలలు మనోహరమైనవి కావు. అవి భైరవస్వప్నాలు. ఆ భయంకరస్వప్నవీథిలో అస్థికలు సంచరిస్తాయి. మానవజాతి యొక్క ఆదిమయుగంలోని అనాగరికదశను ఇక్కడ సూచిస్తున్నాడు.

'ఆ మనుష్యాస్థికలు నిద్రలో మునింగి సంచరించును భైరవస్వప్నవీథి'

### బ్రతికినదినాల తలపోతబరువు

ఈ ఎముకల కొకానొకప్పుడు చర్మం కప్పబడి ఉండేది. దానినే కవి 'చర్మకవచం' అన్నాడు. ఇది గొప్ప పదచిత్రం. ఈ చర్మకవచంవల్లనే స్పర్శయొక్క అనుభూతి లభించేది. చర్మకవచ మిప్పుడు చనిపోయింది. ఎప్పుడో ఒకానొకప్పుడు అది సజీవంగా ఉండేది. ఆ బ్రతికినదినాలతలపోత నేటికీ ఎముకలకు ఉందంటాడు కవి; ఆ తలపోతబరువువల్లనే అవి చలిస్తూ ఉంటాయట. ఇది జాగ్రదవస్థ. ఎముకలకు సుషుప్తి, స్వప్నం, జాగృతి క్రమంగా చెబుతున్నాడు.

'అవి చలించును తమ చర్మకవచ మెపుడో బ్రతికినదినాల తలపోత బరువుచేత'

### నీరవాహ్వానం

భూగర్భంలో శయనించిన అస్థికలను గురించి ఆలోచించినపుడు ప్రతి మానవుడు ఎప్పుడో ఒకప్పుడు ఆ స్థితిని పొందక తప్పదనే వివేకం కలుగుతుంది.3 సుప్తాస్థికలు నీరవంగా ఆహ్వానిస్తున్నాయి మానవులనందరినీ. అయితే ఆ నీరవాహ్వానం వినేది ఎందరు? తానొక్కడే విన్నాడట!

---

3 1948లో గాంధీమహాత్ముడు మరణం పాలయినపుడు శ్రీశ్రీ రచించిన రేడియో నాటిక 'సుప్తాస్థికలు'. చూ.శ్రీశ్రీసా. మూడు, వచన. 98–107 పే.

విని దుఃఖించాడట! అతని 'కనుంగవ కన్నీళులై' కరిగిపోయిందట! మానవుడు మరణాన్ని ఎప్పుడు జయిస్తాడు? ఇది కవి ఆక్రోశానికి అంతరార్థం. అతని 'హృదయపుటం' ఎందుకో 'శోషిల్లుతూనే' ఉంది. అతని 'అస్థిపంజరం' ఎందుకో వణకుతూనే ఉంది. తన శరీరంలో ఉన్న అస్థికలు నేడు జాగ్రదవస్థలో ఉన్నాయి. అవి ఎప్పటికోఅప్పటికి 'సుప్తాస్థికలు' కాకతప్పదు. మట్టిలోకి పోక తప్పదు.4

కరుణబీభత్సాలు

ఈ అనంతకాలప్రవాహంలో మానవుని జీవితం ఒక బుడగవంటిదనీ ప్రతిమానవుడూ భౌతికశరీరం విడువక తప్పదనీ చివరికి అతని శరీరంలో మిగిలేవి ఎముకలు మాత్రమే అనీ భావించుకున్నప్పుడు కలిగిన దుఃఖావేశం ఈ ఖండికలో అంతస్సూత్రంగా ఉంది. మట్టిలో గుట్టలుగుట్టలుగా సుప్తనిశ్శబ్దసంపుటాలుగా ఉన్న మానవాస్థికల బీభత్సదృశ్యాన్నీ కరుణగాథనీ ఊహించుకుని కవి ఏడుస్తాడు. ఆఎముకలస్థితి తనకూ తప్పదనీ అవి తన్నుకూడా ఆహ్వానిస్తున్నాయనీ తెలుసుకుంటాడు.

శబ్దార్థాల సమప్రాధాన్యం

సుప్తనిశ్శబ్దసంపుటాలు, నిశాశ్మశానశయ్య. తమోరహస్యాంగణం, మృత్యుశైత్యం, నిశాంతహేమంతహృదంతరంతరనుభవాళి, భైరవస్వప్నవీథి, చర్మకవచము, నీరవాహ్వానం వంటి పదబంధాలనిర్మాణంలో అపూర్వమైన ఊహాసంవిధానంతోపాటు శబ్దార్థాలకు సమానంగా ప్రాధాన్యం కనిపిస్తుంది. ధరాగర్భం, నిశ్శబ్దసంపుటం వంటి పదచిత్రాల్లోనూతనప్రయోగం ఉంది. శబ్దాలకు నిఘంటువుల్లోని అర్థాలుగాక అర్థాంతరాలు కవులవాడుకవల్ల లభిస్తాయి. లక్షణా వ్యంజనాశక్తులని వాటిని ఆలంకారికులు పేర్కొన్నారు.5 గోరంతశబ్దంతో కొండంత అర్థాన్ని సాధించవచ్చు. 'అవి చలించును తమ చర్మకవచ మెపుడో బ్రదికినదినాల తలపోత బరువుచేత' అనే పంక్తుల్లో ఆ శిల్పాన్ని ప్రదర్శించాడు. సార్థకమైన విశేషణాలనుమాత్రమే ప్రయోగించాడు. 'అగమ్యతమోరహస్యాంగణం' అనే సమాసంలోని విశేషణాలన్నీ సార్థకాలే! మార్పుని సహించని పదాలనే ప్రయోగించాడు. 'దీర్ఘయామిని' అనే పదబంధాన్ని 'దీర్ఘరాత్రి'గా మారిస్తే సొంపు చెడుతుంది. అనుభూతిని గాఢంగా కలిగించడానికి పదాలను ప్రతీకలుగా వాడవచ్చు, 'సుప్తాస్థికలు' ఇలాంటి ప్రతీకగానే వాడబడింది. విశేష్యాలకు విరుద్ధమైన విశేషణాలను వాడి నూతనార్థం కలిగించవచ్చు. 'నీరవాహ్వానం' ఇలాంటిదే. ఇలాంటిపదశిల్పం కవికి చేతికందుతోంది. ఈ శిల్పం కవికి ఎంతో ఆత్మవిశ్వాసం కలిగించింది. అందుకే One of my best poems in my and many another's opinion అని ప్రకటించుకున్నాడు.

---

4 19 ఏళ్ల వయస్సులోనే కవి ఈ వివేకాన్ని పొందాడు. 17వ ఏట వ్రాసిన 'మృత్యుప్రబోధము'లో కూడా ఈ వివేకం కనిపిస్తుంది.

5 లక్షణావ్యంజనా శక్తులను గురించి తెలుసుకోవడానికి — చూ. కావ్యాలంకార సంగ్రహము: సన్నిధానం వారి వ్యాఖ్య.

## ఉజ్జ్వలవనీ రమణీయ వసంతవీధులు!

1929 సెప్టెంబరు 12

ఆమె వసంతవనవీధుల్లోకి వెడుతుంది - బంగారుపళ్ళెం పుచ్చుకుని. పూలుకోస్తుంది పళ్ళెం నిండా. బయటికి వస్తూఉండగా ఆయన ఎదురవుతాడు. ఆమె పూలను ఆయన పాదాలపై పోస్తుంది. సిగ్గుతో ఆయనను చూస్తుంది. తన హృదయాన్నే ఆయనపాదాలకు అర్పించి కృతార్థురాలవుతుంది. ఈ పద్యాలను నాలుగు 'ఉత్పలమాల'ల్లో కూరుస్తాడు.[1] ఇది 'దివ్యప్రణయం'- మధురభక్తికి మరోపేరు. ఆమె సంచరించిన ఆ వనం జీవితానికి ప్రతీక. ఆ వనంలోకి వసంతం వచ్చింది. 'ఉజ్జ్వలవనీరమణీయవసంతవీధులు' అవి. ఆ వసంతం యౌవనానికి ప్రతీక. అప్పుడామెకు పూజకు కోరిక కలిగింది. 'ఎద రవుల్కొన్న కోర్కె' అది.

ప్రియసాక్షాత్కారం-హృదయార్పణం

పువ్వులే ఆమెను 'మానమనోహరమ్ముగ' పల్కరించాయుట! అంతేకాదు; అవి కళ్లు విప్పిచూస్తూ ఆమెను ఆహ్వానించాయి కూడా. ఎందుకు? 'పూజానవభాగ్యవాంఛనలు' జాలుకొనడంవల్ల! ఆమె వాటి కోరికను మన్నించింది. వాటిని కోస్తున్నప్పుడు ఆమె 'అంగుళులించుక' సంచలించాయుట! ఆమె పూలను పళ్లెంలో వేసుకుని పూలతోటలోంచి బయటికి కాలుపెట్టిందో లేదో ఆమెకు ఆశ్చర్యంకలిగింది. తానెవరిని పూజించదలచిందో ఆ అందగాడు తన ముంగిట నిలబడి ఉన్నాడట! ఆమె అతడ్ని పూర్తిగా చూడటానికి సిగ్గుపడింది. అతని పాదాలమీద పూలపళ్లెరం గుమ్మరించింది. అయితే ఆమె అతనిని పూర్తిగా చూడనేలేదా? ఈ ప్రశ్నకు సమాధానం ఆమెయే చెబుతుంది-

'చాల చలించు చూడ్కులలసమ్ముగ తావకదివ్యమూర్తి నే
వీలుననో కనుంగొని అవేద్యమనోజ్ఞ సుఖానుభూతులన్
తేలఁగ, నా ఎడంద భవదీయపదానతభాగ్యరేఖలన్
వ్రాలు నవప్రఫుల్ల సుమనస్సమమాకృతి నర్చనారతిన్'

ఆమెవి చంచలమైన చూపులట! అతనిది దివ్యమైన మూర్తి అట! ఎట్లో వీలుకలిగించుకుని ఆమె అతనిని చూసిందట! అప్పుడామెకు కలిగిన అనుభూతి ఒకటికాదు; అవేద్యమనోజ్ఞసుఖానుభూతులవి. ఆమె ఆ అనుభూతులలో తేలిపోయినప్పుడు సుమార్చన మళ్ళీ మొదటికి వచ్చింది. అప్పుడామె హృదయమే అతని పాదాలమీద వ్రాలిపోయింది.

1 ముద్రణ: భారతి. 1929 అక్టోబరు. చూ. శ్రీశ్రీసా. ఒకటి, కావ్య. 90-91 పే.

## సంధ్యా నిశితారుణ ప్రభలు దాచిన యామిని!

1929 సెప్టెంబరు 16

ఇదిగాక ఇంకో ప్రపంచం ఉంది. అదే భవిష్యత్తు. ఎక్కడ కవిత్వం రసవంతంగా సరికొత్తగా ఉంటుందో ఎక్కడ సూర్యకాంతులు రంగురంగుల్లో తేలిపోతాయో ఎప్పుడు తన ఆలోచనలకు రెక్కలువచ్చి ఆకాశగంగాతీరంలో విహరిస్తాయో అదంతా భవిష్యత్తు. ఇప్పుడు తానున్నదాక రాత్రి. 'రేపు' తనకు ఎర్రనికాంతులతో కనిపిస్తుంది.1 ఆ మరోప్రపంచంలో కవిత్వం రేయింబవళ్ళు చేసేనాట్యం 'రసవన్నవీనవిస్ఫుటం'గా ఉందట! అక్కడ చీకట్లుండవు. ఫేనవేల సూర్యకాంతులుంటాయి. అవి కూడా 'మేదురరమ్యవర్ణ సంఘటనం'తో ప్రకాశిస్తాయి. అందువల్ల అంతులేని ఆనందంతో కాలం గడుస్తుంది. ఇటువంటి కవితా ప్రపంచమే తనకు కావాలట!

భావివికాసవాటికలు

ఆ ప్రపంచాన్ని చేరుకోవడానికి వాహనాలు అతని ఆలోచనలేనట! ఆలోచనలు కనిపించని రెక్కలు కట్టుకుని 'రయోద్ధత సుపర్వవిమానపలాయన క్రియాతీతములై' పరుగెత్తుతాయట! అవి భవిష్యత్తులోని 'సుధామధుర దివ్యపథాలకు, భావికాల విద్యోతితనాట్యశాలలకు, జ్యోతిరఖండయశోంగణాలకు' చేరతాయట!

ఈవిధంగా తాను 'భావివికాసవాటికల బాటలలో' పోతుండగా తన కవితా గీతాలనే తాను వింటాడు. తన కవిత్వాని కప్పుడు గొప్ప వ్యాప్తి వస్తుందనీ ప్రజలంతా తన గీతాలను పాడుతూ ఉంటారనీ కవి ఆశపడుతున్నాడు. తాను ఈ ప్రయాణంలో స్వర్గంలోని మందాకినీనదీ తీరంలో ఇసుకతిన్నెల వరకూ పోతాడు. అక్కడ విహరిస్తాడట! అప్పుడు తాను రచించిన పూలపాటలే తేనెవెల్లువలుగా కనిపిస్తాయట!

ఈనాడు తాను ఒక రాత్రిలో సంచరిస్తున్నాడు. ఈ రాత్రికి ముందున్నది సంధ్య. తరువాత వచ్చేది ఉషస్సు. ఆ సంధ్య ఎర్రని వాడియైన కిరణాలు గలది. దాన్ని దాచివేసినది ఈ రాత్రి. ఈ రాత్రిలో చరిస్తున్నది తన మనస్సు. కాని ఈ రాత్రి ఎంతో కాలం ఉండదు. త్వరలోనే 'భావిసుషమావికసద్రుచులు' వస్తాయి. ఆ 'రుచులను' తన మనస్సు ఆస్వాదిస్తుంది. ఈ ఊహను ముద్దకట్టి చూపిస్తున్నాడు- 'నేడు సంధ్యానిశితారుణ ప్రభలు దాచిన యామినిలో చరించు నా మానసమింక భావిసుషమా వికసద్రుచు లాస్వదించెడున్.'

1 ముద్రణ : 1929 నవంబరు. చూ. శ్రీశ్రీసా. ఒకటి కావ్య. 92-93 పే.

# మొయిలుకదుపుల నునుమేలిముసుగు !

1929 నవంబరు 18

ఆకాశంలో ఒక మెరుపు మెరిసింది. దాన్ని చూడగానే తన మనస్సులో ఏదో తళుక్కుమంది. ఒక ఊహాచిత్రం గీసుకున్నాడు. ఎంతో ఆనందంతో దాన్ని పాడుకున్నాడు. ఆగీతికి ఛందస్సూ ఏర్పడింది. రాగతాళాలూ కుదిరాయి. నాలుగుపాదాల తేటగీతిలో-ముక్తకంలో-మాత్రం ఎంతెంత భావం ఇమడదూ ?1

గగనసీమంతినీకటాక్షాలు

ఆకాశంలో కవికి కనిపించిన మెరుపు స్త్రీగంటిచూపులా గోచరించింది. అయితే అది ఎవరి చూపు ? ఆకాశకాంత చూపు. ఆమె ఇంతకు ముందుచూడలేదు. కారణం ఏమిటి ? 'మొయిలు కదుపుల నునుమేలిముసుగు' వేసుకుని ఉందామె. అది ఇప్పుడు గాలికి జారిపోయింది. వెంటనే ఆమె చూపులు మెరిశాయి. ఆమె ఒక అందగత్తె. అందుచేత ప్రేమదాహంగల కవి మోహంలో మునిగాడు. అతని భావాలు నాట్యమాడసాగాయి. ఈ భావసంచలనానికి రూపచిత్రణ చేశాడు కవి. మబ్బులు మెరిసినపుడు నెమలి ఉత్సాహంతో పురివిప్పి ఆడటం ప్రకృతిసహజమే కాక కవిసమయం కూడాను. దాన్నే కవి స్వీకరించాడు. తనభావాలే 'నెమలిపురినీలివన్నెలవలె' నటించసాగాయని ఊహించాడు. 'మొయిలు కదుపుల నునుమేలిముసుగు', 'గగనసీమంతినీ కటాక్షాలు' అనే పదచిత్రాలతో ఆకాశాన్ని అందాల అంతఃపురంగా మార్చివేశాడు. కవిమాత్రం నేలమీద ఉండిపోయాడు. గగన సీమంతినిసంయోగం అతని కెంతమాత్రం లభించేది కాదు. కానీ అతడు ఆనందాన్ని భావించుకుని అనుభవించగలడు. ఆ ఆనందానికి రూపకల్పన చేయడంలోనే మయూరనాట్యం ఆవిర్భవించింది. దానితో అతడే నెమలి అయిపోయాడు.

---

1 ముద్రణ: భారతి. 1929 డిసెంబరు. చూ.శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 94 వే.
మల్లవరపు విశ్వేశ్వరరావు రచించిన ఒక కవితలో ఒక పదబంధం ఈ గీతి రచనకు ప్రేరణ అట !

'ఉత్కృష్టమైన
కళాకార్యాలు అన్నింటికీ
ఒక Symmetry
ఉంటుంది!
Symmetry
ఉన్నవన్నీ
ఉత్కృష్టరచనలు
కావు!!'

— శ్రీ శ్రీ

## నా మదియే ప్రసూన నవనందనమై వికసించు!

1930 జనవరి 17

భగవంతుడెక్కడ ఉంటాడు? ఆయనను చూడాలని తనకు ఎంతో ఆరాటంగా ఉంది. ఆయన బహుశా ఒక స్వేచ్ఛావిహంగం అయి ఉండవచ్చు. అదిగో ఆయన ఆకాశంలోకి ఎగురుతున్నాడు. ఆకాశమే ఆ పక్షిగూడు. తనకు రెక్కలు లేవుగానీ ఉంటే తానూ పైకి ఎగిరేవాడు. చూస్తూ ఉండగానే ఆ పక్షి కదిలిపోయింది. ఆ పక్షి ఆకాశగంగాతీరంలో సంచరిస్తోందేమో! ఇలా ఇతడు అనుకుంటూ ఉండగానే మళ్ళీ స్వేచ్ఛావిహంగం జాడలు కనిపించాయి. అప్పుడు కవి మనస్సే ఒక నందనవనంగా మారిపోతుంది. భగవంతుడు తన మనోనందనంలోకి దిగివస్తాడిప్పుడు.1 ఇదొక 'దివ్యానుభవం' అట!

ఆకాశంలో ఆ స్వేచ్ఛావిహంగం తిరిగే మార్గంవైపు అతడు క్షుధావిలమైన చూపులతో చూస్తూ ఉంటాడట!

### సురాపగా సుధాతీరాలు

ఈ స్వేచ్ఛావిహంగం అనంతాకాశంలోకి పోయి అదృశ్యమవుతుంది. అప్పుడు భక్తుని వియోగబాధ మొదలవుతుంది. స్వేచ్ఛావిహంగం 'ఏ రుచిరానురాగముల నీనెడు దూరదిశా నిశాంతము'నకో చేరుతుందని ఈ భక్తుడి ఊహ. ఆకాశంలో మందాకినీ నది, ఆ నదియొక్క మనోహరమైన తీరమూ ఉన్నాయి. ఆ తీరంలో వికసించిన కలువపూల పరిమళాలు నిండి ఉంటాయి. అక్కడే స్వేచ్ఛావిహంగం సంచరిస్తూ ఉంటుందట! కాని ఆ విహంగదర్శనం లభించకపోవడంవల్ల తనకు దైన్యం కలుగుతోంది. తనకు కూడ స్వేచ్ఛ లభిస్తే ఆ సీమలను దర్శించి ఉండేవాడు.

### స్వేచ్ఛావిహంగ సందర్శనం

కానీ ఇంతలో స్వేచ్ఛావిహంగం కవికి కనిపిస్తుంది. అది విడిచిపెట్టబడిన గొప్పబాణంలా దూసుకుపోతోంది. దానిరెక్కల చక్కని కాంతి ఒక ప్రవాహంలా ఉంది. అందులో ఆకాశం

---

1 ముద్రణ: ఆంధ్రపత్రిక ప్రమోదూత సంవత్సరాదిసంచిక 1930-31. చూ. శ్రీశ్రీ సా. ఒకటి, కావ్య. 95-96 పే.

అంతా స్నానంచేస్తోన్నట్లుంది. ఇలాంటి దృశ్యాన్ని కవి భావిస్తున్నాడు. అందువల్ల అతని హృదయంలో అందమైన భావాలు పారిజాతాలవలె పూశాయట !

నూతన పారిజాత సుమనోరమణీయములైన భావముల్
పూతలు పూచు నా యెద, విముక్త మహాశుగమట్లు దాటుచున్
ద్యోతలమున్ విహార పరిధూత గరుస్మృదుకాంతి వాహినీ
స్నాత మనోహరమ్ముగ నొనర్చు నినున్ కనునంత వింతగన్

నందనారామంగా మారిన కవిమనస్సు

అతని కోరికలు కొత్త చిగుళ్ళయ్యాయి. అప్పుడు 'నా మదియే ప్రసూననవనందనమై వికసించు' అంటాడు కవి. ఆకాశంలోనే కాకుండా కవి హృదయంలోకూడా ఇప్పుడీ విధంగా నందనవనం ఏర్పడింది. స్వేచ్ఛావిహంగం ఇప్పుడు కవి మనోనందనం చూసి దిగివచ్చి తన స్థిర నివాసం ఏర్పరచుకుందట !

ఉక్తివైచిత్రి

స్వేచ్ఛావిహంగాన్ని చూసి 'పాండుపయోదమాలికలు' త్రోవయివ్వడం, కవి క్షుధావిలమైన చూడ్కులతో స్వేచ్ఛావిహంగం వైపు చూడటం, విహంగం 'రుచిరానురాగములనీనెడు దూర దిశానిశాంతం' చేరడం, 'ప్రఫుల్లకల్హార సుమావళీపరిమళమ్ములు మూగు సురాపగాసుధాతీరాలు', కవి హృదయంలో 'నూతనపారిజాత సుమనోరమణీయాలయిన భావాలు' పూయడం, పక్షి 'విముక్త మహాశుగంవలె' దాటడం, 'విహారపరిధూతగరుస్మృదుకాంతివాహినీ స్నానాన్ని' ఆకాశం పొందడం, కోరికలు 'కోమలపల్లవాలు' కావడం, మనస్సు 'నవనందనంగా' వికసించడం మొదలైన పదచిత్రాలలో తన ఉక్తివైచిత్రిని తీగలు సాగిస్తున్నాడు. భాషలో సాంస్కృతికత తగ్గలేదు. కాని భావాలకు అందచందాలిచ్చే భాషకోసం ఈ ప్రయత్నమంతా. భావాలను పదాలతో సంగ్రహించి చెప్పడం ఒక పనితనం. వికసించిన కలువపూలవాసనలతో నిండిన మందాకినీ నదీతీరాలు అని చెప్పడానికి 'ప్రఫుల్ల కల్హారసుమావళీ పరిమళమ్ములు మూగు సురాపగా సుధాతీరములు' అనడంలోని లయను అనుభవించడానికి చెవి మాత్రమే చాలదు; పాఠకుడికి కూడా భాషాపరిజ్ఞానం బాగా ఉండవలసిందే.

## విశాలవిహాయసాల వినూతనాధ్వములు !

1930 ఫిబ్రవరి 19

తానూ తన ప్రియురాలూ ఒక వెన్నెలరాత్రిలో కలుసుకున్నారు. వాతావరణం ఎంతో హాయిగా ఉంది. అందంగా ఉంది. అప్పుడు తన ప్రేయసితో కలిసి ఆకాశానికి పోదా మనుకున్నాడు. చంద్రుడికిరణాలే త్రాళ్లు. వాటిని ఊతగా తీసుకుని తన ప్రియురాలితో పైకి పోవచ్చు. తన మనస్సు సముద్రంలా పొంగుతోంది. ఆమె కోసం అతను గీతాలు పాడతాడు. ఈ సంయోగశృంగారాన్ని అనుభవిస్తూ ఆ ప్రేయసీప్రియులు వెన్నెలలో వెలిగిపోతారు.1

### వెన్నెలరాత్రి-హృదయసముద్రం

ఆ రాత్రి తనకూ తన ప్రియురాలికీ స్వాగతమిస్తున్నట్లుగా ఉందట! స్వాగతం ఇచ్చినది రాత్రి కాదు. రాత్రి యొక్క నిశ్శబ్దమైన హృదయం. ఎలాంటి స్వాగతం అది? మాటలతో కాదు. 'శ్వేతస్మితామృతశిశిరవీచీశీకరాలతో'. శ్వేతస్మితమనే పదచిత్రంతోనే కవి చంద్రో దయాన్ని సూచించగల్గాడు. శృంగారానుభవానికిది సముద్దీపకమైన సమయం. శృంగారవాతా వరణానికి మెరుగుపెట్టే నిశ్శబ్దమూ, వెన్నెలా, చల్లగాలీ ఈ మూడింటినీ చెప్పడానికి అనుసరించిన విధానం విచిత్రమైనదే!

ఇలాంటి వెన్నెలరాత్రిలో కవి హృదయం సముద్రంలా తరంగాలతో నాట్యం చేసింది. ఆ స్థితిలో అతడు పాడే గీతాలు ప్రియురాలిని గురించేనట!

### విహాయసవిహారం

ఇప్పుడతనికి ఆమెతో కలిసి ఆకాశానికి ఎగిరిపోవాలన్నంత మానసోద్వేగం కలిగింది. అయితే తనకు రెక్కలూ లేవు. నింగికి మెట్లూ లేవు. కాని అతని భావన చిత్రమైనది. ఆకాశం నుంచి క్రిందికి దిగివస్తున్న చంద్రకిరణాలే అతనికి త్రాళ్ళవలె కనిపించాయట! ఆ త్రాళ్ళను ఊతగా గొని, 'విశాల విహాయసాల వినూతనాధ్వములకు' తన ప్రియురాలిని తీసుకొని పోదలచాడు. అవి 'శీతలకిరణతంతులు' కావడంవల్ల అతనికీ ఆమెకూ శ్రమఉండదట!

---

1 ముద్రణ: శృంగారకంఠాభరణము 1930 అక్టోబరు 24. చూ.శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 97 పే.

### వీణాగానం-కైరవగంధం

ఆ సమయంలో కలువ పూల కొత్త వాసనలు వీచాయి. వెన్నెలలో వీణాగానం వినిపించింది. ఆ వీణాగానం ప్రవాహాలు కట్టింది. అందులో కలువల వాసనలు కరిగిపోయాయి.

'ఏతెంచుచున్నవి కౌముదీ రమణీయవీణాగానపున్
స్రోతస్సులన్ ద్రవియించు కైరవసూనముల నవగంధముల్'

మాటలలో చెప్పజాలని అనుభూతిని మూటకట్టి అందించడానికి కాల్పనికభావాన్ని ఆశ్రయించాడు. వెన్నెలకు చల్లదనమే కాని గానమాధుర్యం లేదు. కాని 'కౌముదీ రమణీయవీణాగానం' అనే రూపకంతో అసాధ్యాన్ని సాధ్యపరుస్తున్నాడు. చల్లదనమూ, మాధుర్యమూ కలిసినచోట పరిమళంకూడా కలిసి ఒక ప్రవాహం అయింది.

### వెన్నెలలో హారతి

ప్రణయానుభవానికి తగినవాతావరణమంతా లభించింది. తనప్రియురాలితో అంటాడట-

'జ్యోతిర్మనోజ్ఞము లీ పవిత్ర ముహూర్తముల్ మన భాగ్యముల్'

అని. ఆ ముహూర్తాలు 'జ్యోతిర్మనోజ్ఞాలే' కాదు. అవి వారి భాగ్యాలు కూడా నట! ఇలాంటి సమయానికి చరితార్థత వారిద్దరి ప్రణయానుభవానికీ దోహదం కలిగించడం. అందుకే 'పీతప్రపంచ వ్యథాత్ము లు'గా వారిద్దరూ వెన్నెలలో వెలిగిపోవాలనుకుంటారు. ప్రపంచవ్యథలను విడిచిపెట్టడానికి తన ప్రియురాలితో కలిసి వెన్నెలలో వెలిగిపోవడమే మార్గంగా కనిపించింది.

#### ముత్యాలసరంలో కొత్త ప్రయోగం

మొదట ఒక గురువును అదనంగా వాడటంద్వారా ముత్యాలసరంలో కొత్తప్రయోగం చేస్తున్నాడు.

ఈ / తామసీ నిశ్శబ్దహృది మన
కిర్వురకు స్వాగతముగా
శ్వే / తస్మితామృతశిశిరవీచీ
శీకరములొలయించగా

బేసిపాదాలలో 16 మాత్రలు, సరిపాదాలలో 12 మాత్రలు, సరిపాదాలలో చివర గురువు, ప్రతిరెండుపాదాలకూ ప్రాస లేదా ప్రాసయతి, బేసిపాదాలన్నింటికీ ఒకేప్రాస-ఇలా బహు నియమాలతో నడిపిస్తాడు ఈ గేయాన్ని. అందువల్లనే అతివేలగ్రుతిలయలతో ఇది కదంత్రొక్కింది. సరిపాదాలను గురువుతో ముగించడంవల్ల శ్లోకం చదువుతున్న నడకవస్తుంది. చిత్రశబ్దాలంకారాలెన్నింటినో ఈ గేయంలో బిగిస్తాడు. ఏకాక్షరావృత్తి, అంతఃప్రాసలు, దీర్ఘ స్వరపరంపర వంటి విచిత్రాలను చేసి పనితనానికి పట్టంగడుతున్నాడు.

**అచటి గాన స్వాదురుచిరమునందు**
**భువనములు లవమ్ముల గనై పొరలిపోవు !**

కృష్ణావతారం తక్కిన అవతారాలవంటిదికాదు. ఆ చరిత్ర అంతా నానారససమ్మేళనం. ఆ కథలో ఎన్ని అద్భుతాలున్నాయి ? కృష్ణుడు గానకోవిదుడు కూడా. ఆయన బాల్యం ఒక ముచ్చట. ఎర్రన హరివంశంలోనూ పోతన భాగవతంలోనూ ఆ శైశవక్రీడలు పసందుగా వినిపిస్తాయి. గొల్లపిల్లలు, గోవులమందలు, యమునానదీతీరం-వీటిమధ్య బాలగోపాలకృష్ణుడి వేణుగానం అద్భుతంగా వినిపిస్తుంది. ఆ గానవర్షంలో ప్రకృతి, పక్షులు, ఎలాగుంటాయో భావిస్తే అదొక కావ్యప్రపంచ మైపోతుంది. కథనం, వర్ణనం తన ప్రతిభకు పరీక్షలు. ఆ పరీక్షలలో కృతార్థుడు కావాలి తాను. మహాకవుల శిల్పమర్గాలను అనుకరించగల్గాలి. అందుకే 'వేణుగానం' రచించాడు.1

గానవర్షం

సూర్యోదయవర్ణనతో ఖండికను మొదలుపెడతాడు. మొదట దిక్కులనిండా ఉన్న చీకట్లు అంతరించాయి. తరువాత తెల్లదనం వచ్చింది. అది నదికి వరద వచ్చినట్లుగా మెల్ల మెల్లగా వచ్చిందట ! 'మెల్లమెల్లన తెల్లన వెల్లువయ్యె' అనే భావచిత్రం సూర్యకాంతి వ్యాపించడానికి కవితారూపం. ప్రపంచమంతా ఆనందించింది. లోకంలో వచ్చిన ఈ మార్పును చూసి ప్రకృతి తానుకూడా తెల్లగానే నవ్విందట ! తరువాత పక్షులు కూశాయి. ఈ కూతకు ఒక రూపకల్పన చేస్తాడు.

గూడులన్ వీడి తమవారితోడఁగూడి చివురుఁగొమ్మలపై మహోత్సవముగాఁగ
వీనులకు విందుగాఁగ సుధానవమగు గానవర్షము నీడజగణము గురిసె.

పక్షులు గాయకులుగా కనిపించారు కవికి. ఈ పక్షిగాయకులు చివురుగొమ్మలపై ఆసీనులై సభ తీర్చినట్లు వర్ణించాడు. వాటి పాట అమృతంలా కొత్తగా ఉంది. ఈ పాటనే కవి గానవర్షమన్నాడు. ఈ గానవర్షంయొక్క ప్రభావంవల్ల అంతవరకూ అచేతనంగా అణిగిఉన్న విశ్వంలో చైతన్యం వెల్లివిరిసింది.

---

1 ముద్రణ: భారతి 1930 సెప్టెంబరు. చూ.శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 122-23 పే.
ఈ ఖండికారచనలో కేతవరపు కృష్ణమూర్తి తోడ్పాటు ఉందిట, ఇవి 12 తేటగీతులు.

కాంతికల్లోలినులు

'చేతన పదార్థములు కాంతిచే వెలింగె కాంతికల్లోలినులు ధాత్రిఁగడలుకొనియె'. అచేతనాలు చేతనత్వం పొందితే మరి చేతనాలు కాంతిచే వెలిగాయనడం చమత్కారం. కాంతికల్లోలినులు అనే సరికొత్త పదచిత్రం కవిచేసే ఇంద్రజాలానికి మచ్చుతునక. భూమిమీద వెలుగు వరద లయిందట. దిక్కులనుంచి చెట్లకొమ్మలకు, చెట్లనుంచి భూమిమీదికి తన వర్ణనను అవరోహణ క్రమంలో దింపుతూ గమ్మత్తుచేస్తాడు. తరువాత గొల్లపిల్లల వర్ణన మొదలుపెడతాడు.

గొల్లపిల్లలు-చలిదిబువ్వలు

పాలకై విడి లేగలు పరువులెత్తి తల్లిపొదుగులఁ బొడుచుచుఁ ద్రావెఁ బాలు
చలిదిబువ్వలు భుజియించి సంగడీండ్రఁ బిలువసాగిరి గొల్లల పిల్లలపుడు.

గొల్లపిల్లలకన్న ముందు కవి మనకు గోవులను, లేగలను చూపించాడిక్కడ. ఉదయం కాగానే లేగదూడలు ఆవుల పొదుగుల దగ్గరకు పరుగెత్తాయి. అవి పొదుగుల్ని పొడుస్తూ పాలు త్రాగాయని చెబుతాడు. ఇక గొల్లపిల్లలు ఉదయంకాగానే చలిదిబువ్వలు తినడం, సంగడీండ్రను పిలవడం ఎంతో స్వాభావికంగా ఉన్నాయి. గొల్లపల్లెనుంచి యమునానది యొడ్డుకు ఆవులను, లేగలను తోలుకు పోతారు గొల్లపిల్లలు. ఈ విషయాన్ని చెప్పడానికి ముందు యమునానదిని వర్ణించాడు. ఇందులో తన ఊహాశాలిత్వాన్ని నిరూపించుకుంటాడు.

యమునానది-శైశవక్రీడ

బాలపవనుండు ముందుగాఁ బరువులెత్తఁ బట్టఁగాఁ బోవఁగా వలెఁ బల్లటీల
గొట్టుచున్ బోవఁగా సాఁగెఁ గోమలంపుఁ జిన్నికెరటాలు యమునలోఁ జెన్నుమిగిలి

యమునలో చిన్నికెరటాల వర్ణన ఇది. చిన్నికెరటాలకు చిరుతగాలులకు పోటీ ఏర్పడింది. చిరుగాలి కూడా ఒక చిన్నిబాలుడు. చిన్నికెరటాలూ చిన్నిపిల్లలే! బాలపవనుడు ముందు పరుగెడుతున్నాడు. అతనిని పట్టుకోవాలని చిన్నికెరటాలు అతని వెనకాల పరుగెడుతున్నాయి. ఇదంతా యమునానదిలో కనిపించే శైశవక్రీడ. ఇలా వర్ణించడం గొల్లపిల్లల ఆటలకు కావ్యార్థ సూచనగా భాసిస్తోంది. ఇలా వస్తుధ్వనిని సాధిస్తాడు.

పచ్చికబయళ్లు

తరువాత యమునాతీరంలో అక్కడక్కడ పచ్చికనిండిన బయళ్ళను కవి చూపిస్తాడు. ఇంతకుముందే చేసిన వర్ణనవల్ల అక్కడి చిరుగాలి చిరుగాలిమాత్రమే కాదనీ అది చల్లనిగాలి అనీ చక్కని వాతావరణమనీ సూచించాడు. పచ్చికబయళ్ళలో గోవుల్నీ లేగదూడల్నీ గోపబాలురు మేపుకుంటూ ఆ చక్కని వాతావరణంలో తిరిగారు. ఇంతవరకు ఖండికకు ప్రాణంలాంటి

వేణుగానం ప్రసక్తి లేదు. ఈ వర్ణన అంతటినీ ఇకముందు చెప్పబోయే కృష్ణవేణుగానానికి ఉద్దీపకమైన వాతావరణంగా మాత్రమే చేశాడు. కావ్యప్రపంచాన్ని సృష్టించే శిల్పికి ఇలాంటి మెలకువ అవసరమే! గొల్లపిల్లలలో ఒక బాలుడు వన్నెకాడు. అతని వర్ణన సంప్రదాయం తెలుసుకుని చేసిందే. నీలిమబ్బువంటి శరీరం, శుభలక్షణాలు, తీయని చిరునవ్వు, తేజస్సు గల ఆకారం అతని ప్రత్యేకతలు. అతడొక మనోహరవేణువు నూదాడు.

కథనశిల్పం

ఈ ఖండికలోనే ఇంతకు ముందు సూర్యోదయవర్ణన చేస్తూ తెలుపు వెల్లువలవడం, నలుపు అంతరించడం, ప్రకృతి నవ్వడం చెప్పాడు. ఆ పద్యాన్ని ఉదాహరించుకోక తప్పదు.

> అంధకారము దిక్కుల నంతరించె మెల్ల మెల్లన తెల్లన వెల్లువయ్యె
> అంతలోపల జగమంత హ్లాదపరత నలరఁ బ్రకృతి సితస్మేరలలితమయ్యె

ఇప్పుడు నల్లనివాడు కనిపించడం, అమృతమధురంగా నవ్వడం చెబుతున్నాడు.

> నీలనీరద సంకాశనిస్తులాంగుఁ డమల శుభలక్షణాన్వితుఁ
> డమృతమధురమందహాసాననుఁడు......

కథనశిల్పాన్ని ఈవిధంగా ప్రదర్శించాడు. ఇలాటిదే మరోచమత్కారం గోచరిస్తుంది. ఖండిక మొదటిభాగంలో పక్షులు గాయకులవలె పాడగా అచేతనాలు చేతనత్వం పొందడం, చేతనాలు కాంతిమంతాలు కావడం వర్ణించాడు. దాన్నికూడా తిరిగి ఉదాహరిస్తాను.

> వీనులకు విందుగాగ సుధానవమగు గానవర్షము నీడజగణము గురిసె
> అంతవరకు నచేతనముగ నణఁగియున్న విశ్వమందుఁ జైతన్యమ్ము వెల్లివిరిసె
> చేతనపదార్థములు కాంతిచే వెలింగె కాంతకల్లోలినులు ధాత్రి గడలుకొనియె

ఇక్కడ మళ్ళీ వేణుగానంవల్ల ఏ మార్పులు జరిగాయో చెబుతున్నాడు.

> ఒక మనోహర వేణువు నూదనతడు చేతనాచేతన సమగ్రసృష్టి యులికి
> మారుమ్రోతలొనర్చుచు మరలమరల
> మధురమధుర గీతానంద మయముగాఁగ.

మొదటిదానికన్న ఇది గొప్పది అని చెప్పడంకోసం ఇలా చేశాడు. ఇప్పుడు వేణుగానం వినగానే చేతనాలు, అచేతనాలు కూడా ఉలికిపడి మారుమ్రోతలు చేశాయి. సృష్టి అంతా మధురమధుర గీతానందమయ మైపోయిందట!

వేణుగానఝరి

ఈ గానమాధుర్యం అన్నింటిని తిరస్కరిస్తుంది. అలా తిరస్కరింపబడినవి అమరగీతికలు, కిళలు, మధుమతులు కూడా. ఈ వేణుగానం ఒక మధురమైన ప్రవాహం కాగా అందులో భువనాలు కనిపించకుండా పోతాయట!

'అచటి గాన స్వాదుఝరమునందు భువనములు లవమ్ములుగనై పొరలిపోవు'

పక్షిగాయకులగానంవల్ల కాంతికల్లోలినులు ధాత్రినిండా వ్యాపించాయన్న వర్ణనతో పోల్చిచూస్తే కృష్ణగానంయొక్క గొప్పతనం స్ఫుటమవుతుంది.

విహంగపారవశ్యం

ఇదివరకు పక్షులు గానంచేశాయని ఉదయవర్ణనలో చెప్పినకవి ఇప్పుడు అరణ్యంలో కృష్ణ వేణుగానం విని పక్షులు తమ గానాన్ని కట్టిపెట్టి చివురాకులు తింటూ పరవశమయిపోతున్నాయంటాడు.

కానన విహంగమా! నీదు గానరవళి మాని, దట్టంపుటాకుల ద్రమానిచివురు
లాని, మహాగ్ర్యమ్ము పూని యేమాలకింతు వేమి యానంద మెంతవహించినావు.

చేతనకోటిలో చేరే విహంగం పరవశత పొందడం అలాగుండగా అచేతనాలయిన తమాలవృక్షము, యమునాతరంగాలు కూడా వేణుగానం విని ఆనందం పొందుతున్నాయని సాభిప్రాయంగా ప్రశంసిస్తాడు. 'ఓ తమాల శాఖిక! యమునాతరంగ నాట్యమూర్తి! మీకెంత యానందమిపుడు'

మానసికమూర్ఛ

పాలకై విడి లేగలు పరువులెత్తి తల్లిపొదుగులఁ బొడుచుచుఁ ద్రావెఁ బాలు
చలిదిబువ్వలు భుజియించి సంగడీంద్రుఁ బిలువసాగిరి గొల్లల పిల్లలపుడు!

అని వర్ణించినకవి ఇక్కడ కృష్ణవేణుగానం విని 'లేగలావులు, గోపకులీ గభీరగానమున మానసిక మూర్ఛ గనిరో యేమొ!' అనడం కూడా సాభిప్రాయమే.

ఇటువంటి వేణుగానం ఆకాశందాకా వ్యాపించింది. దాన్ని దేవతలుకూడా విన్నారు. ప్రకృతి ఒక ప్రతిమగా మారిపోయి వింది. సమస్తభువనాలూ నందనవనాలుగా మారిపోయాయి.

కథను రెండు ప్రధాన భాగాలుగా విభజించుకుని రెండింటికి తారతమ్యం నిరూపిస్తూ ఈ కావ్యకథానికను చెక్కుకుపోయాడు. ఆలోచనామృతాలైన పదచిత్రాలతో ఊహావైభవాన్ని మెరిపిస్తూమహాకవుల గడుసుపోకడలను గుర్తుకు తెస్తున్నాడు. ఈ శిల్పంతో పూర్వాంధ్ర కవులతో పోటీకి నిలుస్తున్నాడు.

ఆవేశమేఘాల ఆలోచనావర్షాలు

---

# *1931* కవితలు

---

| | |
|---|---|
| లాస్యతృష్ణ | బౌద్ధతేజస్సు |
| భావనాపథి | మూగతలపులు |
| వనదృశ్యము | స్వర్గదేవతలు |

కొన్ని గీతాలు
భావబంధురంగా ఉన్నా
కొందరికి నచ్చవు!
అర్థం తెలియక ముందే
ఆకర్షిస్తాయి
కొన్ని పద్యాలు!

— శ్రీ శ్రీ

## శీతవీచికా మేదుర తుషార సేచనము !

1931 జనవరి 6

సముద్రతీరంలో కూర్చున్నాడు. అదిగో ఎదురుగా పూర్ణచంద్రుడి ఉదయం. మనసులో ఒక భావావేశం కలుగుతోంది. భావనాకల్లోలం మొదలవుతోంది. కడలికెరటాల శ్రుతిలో గంధర్వుల పాటలు వినిపిస్తున్నాయి. వెన్నెల నాట్యం చేస్తోంది. సముద్రతీరంలో శివుడి కాలి అందెలు ఘల్లుమంటున్నాయి. తనకు తెలుసు గుండెల్లో ఇముడ్చుకోలేని ఆనందం ఎలాంటిదో. అలాంటి ఆనందంతోనే కాబోలు ఈ సముద్రుడు ఆకాశాన్ని అంటుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రకృతిలోని ఈ అందాలు చూస్తూఉంటే తను కూడా ఒక చంద్రకిరణంగా మారిపోవాలనిపించింది. ఇలాంటి ఉద్విగ్నభావాలు కలిగాయి ఆ అద్భుతదృశ్యాలను భావనానేత్రంతో చూసినప్పుడు.1

### గంధర్వగానం-లీలానాట్యం

సముద్రతీరాన్ని ఒక నాట్యశాలగా భావించడంతో క్రొత్త ఊహను బయటపెడతాడు కవి. కడలి కెరటాలు శ్రుతి మొదలుపెట్టాయట! ఆ శ్రుతికి తగినట్లుగా ఆకాశంలో ఉండే గంధర్వులు రాగం ఆలాపించారట ! ఇలాంటి ముహూర్తంలో తూర్పుదిక్కులో 'తరళ ధవళ విలాసవర్తనాన్ని' 'పూర్ణిమాతుహినకరుడు' ఆవిష్కరించాడట ! అక్కడి వాతావరణమంతా నాట్యం చేస్తున్నట్లు కనిపించిందట తనకి.

> ఈ విశాలసమగ్రవాతావరణము కాంతితంత్రీసుధామృదుగాన గీతు
> లెగయు జగదీశ్వరాంఘ్రిమంజీరనటనమటులనంత లీలానాట్యమభినయించె.

ఆ నాట్యం ఉద్ధతమైనది కాదు. లీలానాట్యం అది. అది అనంతం. దాన్ని చూస్తుంటే అతనికి గుర్తువచ్చిన సాదృశ్యం పరమేశ్వర నాట్యం. శివుడి కాలి అందె కదులుతున్నప్పుడు కాంతితంత్రి మ్రోగి అమృతతుల్యమైన పాట మొదలవుతుందట ! వెన్నెలతో నిండిన అక్కడి వాతావరణం శివాంఘ్రిమంజీరం వలె నాట్యమాడిందని చెబుతాడు. మంజీరకూ చంద్రబింబానికీ పోలికను సూచిస్తాడే గానీ స్పష్టంగా చెప్పడు. ఆకాశంవైపు చూశాడట తాను. చుక్కలు కనిపించలేదట! తెల్లమబ్బులు వ్యాపించిన ఆకాశాంగణాన్ని 'ధవళాంబరి'తోనూ, 'అమృతవారాశి'తోనూ

1 ముద్రణ : భారతి 1931 ఏప్రిల్. చూ. శ్రీ శ్రీ సా. ఒకటి. కావ్య. 98-99 పే.

పోలుస్తాడు. 'ధవళాంబరి' అనే మాటతో సరస్వతీదేవినీ, 'అమృతవారాశి' అనే మాటతో మాధుర్యాన్నీ స్ఫురణకు తెస్తాడు. అందువల్లనే చరాచరాలకు ఆకాశం ఆ సమయంలో 'లాస్య రుచులను', 'సాహిత్యరుచులను' పంచిపెట్టిందని వాచ్యంగా చెబుతాడు. తరువాత సముద్రం ఆకాశమంటుకునే తరంగాలతో కనిపించిందంటాడు.

'ఇది జలధినాథు నెదలోన నిముడలేని ఎదురులేని మహాసౌఖ్యమేమొ - శీత
వీచికామేదురతుషారసేచనమున ఆకసమునంటుకో సోలియాడు నితడు.'

ఆ సముద్రానికి జలధినాథుడని నాయకత్వం ఆరోపించి అతడు ఒంటరిగా ఉండలేక ఆకాశాన్ని స్పృశించదలుస్తున్నాడని ఆరోపిస్తాడు. అది మామూలు స్పర్శ కాదు. శీతవీచికాతుషారాన్ని ఆకాశంమీద చిమ్ముతూ ఆమెను (ఆకాశాన్ని) స్పృశించదలుస్తాడట !

సుధాంశుకిరణం

అక్కడ చంద్రకిరణాలెన్నో తరంగాలతో కలిసి పొంగుతున్నాయి. ఆనందగాననినాదాలు చేస్తున్నాయి. కొత్త నురగల కాంతులలో లీనమవుతున్నాయి. ఈ దృశ్యాన్ని చూస్తే తనకు కలుగుతున్న కుతూహలాన్ని వివరిస్తాడు.

ఉరలునా నా ఎడంద ఈ దొరలు తరగలందాక సుధాంశుకిరణమై హర్షగాన
కలకల శ్రావ్య నినదము లొలయుచున్ నవీన ఫేనద్యుతులలోన లీనమగుచు.

తన హృదయం కూడా ఆ సుధాంశుకిరణాలలో ఒకటిగా మారిపోవాలనుకుంటూ ప్రకృతి సౌందర్యంలో తాను భాగస్వామి కావాలనుకుంటాడు.

రంగు రుచి పరిమళంగల పదజాలం

పూర్ణిమాతుహినకరుడు, తరళధవళవిలాసనర్తనము, కాంతి తంత్రి, సుధామృదుగాన గీతులు, జగదీశ్వరాంఘ్రిమంజీర, అంబరాంగణం, ధవళాంబరి, అమృతవారాశి, శీతవీచికామేదుర తుషార సేచనము మొదలైన పదబంధాలలో మాధుర్యం, కోమలత్వం, ఉదాత్తత వంటి గుణాలనే గాక రంగు, రుచి, పరిమళం వంటి ఆకర్షణలను కూడా చూపించి అనుభూతికి దోహదం చేస్తున్నాడు. పదాల హొయలు, పదాల బిగింపు, పదాల శ్రావ్యత మొదలైనవాటితో పద్యాలకు శ్రుతిలయలు సమకూరుస్తున్నాడు.

జగదీశ్వరాంఘ్రిమంజీరనటనము - జ, శ్వ, ఘ్రి, మ, జీ వంటి అక్షరాలు అందెమ్రోతలను చవిచూపిస్తున్నాయి. ఈ సమాసంలో జగదీశ్వర శబ్దం తీసి పరమేశ్వర శబ్దం పెడితే సొంపు చెడుతుంది. గణభంగం కలగకపోయినా ఏ పదం మార్పుసహించదో ఆ పదం అనేకవిధాల సమర్థమయిన పదం. ఇలా పరివృత్తి సహించని శబ్దాల కోసం అన్వేషిస్తూ ముందుకు సాగుతున్నాడు.

ఒక్క కరుణార్ద్ర నయన కవోష్ణధార
గగననది కెరటాలుండుకన్ దహించు!

1931 ఏప్రిల్ 7

బుద్ధుడు భారతదేశంలో పుట్టాడు. అతని మతం మాత్రం విశ్వమంతా వ్యాపించిందొకప్పుడు. ఆయన బోధించేదేమిటి? ప్రేమనూ కారుణ్యాన్నీ. భారతదేశం ఉదయాకాశంలాంటిది. బౌద్ధ తేజస్సు సూర్యోదయంవంటిది. ప్రకృతిలోనే బౌద్ధ తేజస్సును దర్శించి వర్ణిస్తాడు.1

పరంజ్యోతి

బుద్ధుని కారుణ్యమతానికి సంకేతమైన బౌద్ధతేజస్సును పరంజ్యోతిగా భావిస్తూ—

ప్రాతరాకాశమున పరంజ్యోతి యొకటి వేనవేలు దీధితులీని వెల్గిపోయె
ఆర్పరాని తేజోదవానలమ్ము, కౌముదీశీతలము దెసల్ కారుకొనియె!

అన్నాడు. ప్రతీకలుగా పదాలను వాడుతున్నాడు. ప్రాతరాకాశం భారతదేశం. పరంజ్యోతి బౌద్ధతేజస్సు. ఈ తేజస్సు సూర్యోదయం లాంటిది. భారతదేశంలో బౌద్ధమతంయొక్క అవతరణ, వికాస, క్షీణతలను ప్రతీకలతోనే వర్ణిస్తున్నాడు. ఒక దశలో అది తేజోదవానలమైపోయిందట! ఈ తేజోదవానలమనే పదచిత్రాన్ని విస్తృతార్థం సాధించడానికి వాడాడు. తేజస్సువలె వెలుగునిస్తూ దవానలంవలె దహించే లక్షణంగలది తేజోదవానలం. ఇది కొన్నాళ్ళకు కౌముదీశీతల మైపోవడమే కాక మరికొన్నాళ్ళకు దెసలుకారుకొనడం జరిగింది. ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, రాత్రి అనే నాలుగవస్థలు బౌద్ధమతానికి సూచిస్తూ చెప్పినవిధానం అపూర్వమే.

రత్నత్రయం

బౌద్ధతేజస్సును ఒక మహాసముద్రంగా భావిస్తున్నాడు.

అది మహాంభోనిధానమైనది! తరంగ నాట్యములలో ప్రశాంతి విన్నాణమొలికె
దాన సంభూత మైనరత్నత్రయమ్ము నేరుకొన్నారు ముగ్ధమహీజనాలు.

1 ముద్రణ: భారతి. 1931 ఆగస్టు. చూ. శ్రీశ్రీసా, ఒకటి, కావ్య. 100 పే.

తరంగనాట్యాలు బోధనలకు ప్రతీకలుగా భాసిస్తున్నాయి. ఈ బోధనలలో ప్రశాంతి విజ్ఞాన మొలికించింది. యుద్ధాది అశాంతులు తొలగిపోయాయి కనుకనే ప్రశాంతి లభించింది. ఆ సముద్రంలో మూడురత్నాలు (త్రిశరణాలు) లభించాయట! ఈ రత్నాలను ప్రజలేరుకున్నారు.

నయనకవోష్ణధార

బుద్ధుడు బోధించిన ప్రేమ, కారుణ్యాల గొప్పతనాన్ని అతిశయోక్తితో మేళవించి ఊహా చిత్రాలలో వర్ణించాడు.

> ఒక్క కరుణార్ద్రనయన కవోష్ణధార గగననది కెరటాలుడుకన్ దహించు
> ఒక్కయెద ప్రేమచే స్రోయునో చరాచరాత్మకము విశ్వహృదియె విహ్వలత కాంచు

భూమిమీది ఒక వేడినీటిధార ఆకాశంలోని గంగానది కెరటాలను ఉడికించి ఆవిరిగాచేయడం అసంభవం. అసంభవాన్ని కవితాభావనలో సంభవం చేయవచ్చు. అందుకే ఒక్కకరుణార్ద్ర నయనకవోష్ణధార ఆ పనిని చేయగలదన్నాడు కవి. కారుణ్యానికి గల అపారశక్తి నిలా వ్యక్తం చేయగలిగాడు. ఇలాగే ప్రేమయొక్క గొప్పతనంకూడా వర్ణనాతీతం. మామూలు పాటవలన చరాచరాత్మకసృష్టి కదలదు. కాని ప్రేమతో కూడిన ఒక హృదయం పాడితే ఆ కదలిక వస్తుంది.

నిర్వాణపదవి

ఈ ప్రేమకారుణ్యాలను మానవుడు ప్రకృతినుంచే నేర్చుకున్నాడట!

> ఆ హృదంతిక మా నయనాశ్రువృష్టి సృష్టినుండి ప్రతిధ్వనుల్ చేదికొనియె
> ప్రాణులు విముక్తి కాంచు నిర్వాణపదవి జగమెరింగెను బౌద్ధతేజస్సువలన.

ఆ హృదంతికము, ఆ నయనార్ద్రదృష్టి బుద్ధుడివే. దీన్ని మన ఊహకు వదిలివేశాడు. బుద్ధుడు ప్రకృతియొక్క ప్రతిధ్వనులనే బోధించాడు. ఇవి లేనిదే ప్రాణులు విముక్తి పొందజాలరు. బౌద్ధం దాన్నే 'నిర్వాణం' అన్నది. ఈ నిర్వాణాన్ని జగత్తు బౌద్ధతేజస్సువల్లనే నేర్చుకొంది. ఈ విధంగా బౌద్ధమతిపుటనల్పార్థాన్ని అల్పాక్షరాల్లో చెప్పివేయగలిగాడు. వాస్తవాలను యథాతథంగా వర్ణించడం మాని ప్రతిబింబాలుగా వర్ణించదలిచాడు. ఆకాశమంతవిషయాన్ని అరచేతిలో చూపించే ప్రయత్నం ఇందులో ఉంది. వాచ్యంకన్నా వ్యంగ్యంపట్ల, వివరణకన్నా కుదింపుపట్ల ఇష్టపడుతూ నడుస్తున్నాడు.2

---

2 'Abstract expression preferred to the concrete, compression and concentration to the elaborate and dilute'–అని కవి వ్యాఖ్య.

# చేయనొ ప్రవాళద్వీపనిర్మాణముల్ !

1931 ఏప్రిల్ 12

చల్లగాలి వీస్తోంది. అది రాత్రిసమయం. చీకట్లు పారిపోయాయి వెన్నెలరాగానే. తాను ఒంటరిగా ఉన్నాడు. చుట్టూ ఎంత అందం ఉంది ? తానే రాత్రిగా మారిపోదామనుకున్నాడు. భావనాశక్తికి సాధ్యంకానిదేముంటుంది ? రాత్రిగా మారిపోయాడు. తనలో సంగీతం, నాట్యం ఉన్నాయి. వాటినే వెన్నెలలుగా మార్చివేశాడు. తనలో ఆశయాలున్నాయి. వాటిని నక్షత్రాలుగా భావించాడు. వెన్నెలలనూ నక్షత్రాలనూ కలిపి పగడాలదీవులను నిర్మించదలచాడు కాలమహాసముద్రంలో. తనచుట్టూ ఉన్న పూలను భగవంతుడి ఊయాలలుగా తలపోశాడు. ఆ పూలవాసనలనే కవిత్వం అన్నాడు. ఇలా అపూర్వమైన వస్తువులను నిర్మించాలని ఆరాటపడుతున్నట్లు కనిపిస్తుంది.1

## ఎదురైన చల్లగాలులు

కవి భావనామార్గంలో పోతూఉండగా ప్రశాంతవాయువు కనిపించింది. అది 'ధారుణీ మనోమానరహోవకుంఠనము' మాటికి మాటికెడల్చుతూ ఉందని ప్రౌఢంగా ఊహిస్తాడు. ధారుణీ అనే స్త్రీలింగదీర్ఘాంతం సాభిప్రాయంగా వాడి ధారుణి నొక కాంతగా సూచిస్తాడు. ఆమె మనస్సు మానమనే మేలి ముసుగు వేసుకుందట ! ఆ 'రహోవకుంఠనాన్ని' మాటిమాటికీ తొలగిస్తున్నాడట రసికుడైన ప్రశాంతవాయువు. ధారుణిని, ప్రశాంతానిలాలను నాయికానాయకులని చెప్పకుండానే చెబుతూ శృంగార రేఖలను గీశాడు కవి. అతనికి దారిలో కనిపించిన దృశ్యమట ఇది. ఆ దారి ఆలోచనామార్గమని మనం ఊహించుకోవచ్చు. ఆ ప్రశాంతానిలాలు అంతటితో ఊరుకోక 'ఆజ్ఞలు'గా 'స్వాగతగీతికలు'గా 'ప్రబోధశంఖనాదాలు'గా ధ్వనిస్తున్నాయంటూ మలుపు తిరుగుతాడు.

## పారిపోయిన చీకట్లు

ఆ రాత్రి సుకుమారమైన విలాసంతో అందంగా కనిపించిందని చెబుతూ

మంజుల మానిశీథ సుకుమార విలాసము ! చంద్రికారజః
పుంజమునందడంగిన తమోనివహమ్ములు షట్పదీధను
శ్శింజితముల్ చెవిన్ జొర కృశించెడు శైశిరకాందిశీకు రే
ఖంజనియెన్ తమాలములు క్రమ్మినచాటుల దాగిపోవఁగన్.

---

1 ముద్రణ: గృహలక్ష్మి 1931 జూలై. చూ.శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 101-102 పే.

అంటాడు. రజఃపుంజంలా వ్యాపించిన వెన్నెలలో చీకట్లు అణగిపోయాయట ! చీకట్లు ఏవిధంగా పారిపోయాయో కవి చెప్పిన ఉపమానంలో ప్రబంధాల వాసన చూపిస్తాడు. అవి మన్మథుని వింటినారి ధ్వనులు వినగానే శిశిరమనే కాందిశీకుడు పారిపోయినట్లు పోయాయట! వసంతం రావడాన్ని ఇంత సులువుగా సూచించాడు. శిశిరాన్ని కాందిశీకుడుగా ప్రకటించి వసంతుడికీ శిశిరుడికీ ఉన్న వైరాన్ని జ్ఞాపకం చేస్తున్నాడు. లౌకికసత్యాన్ని కవితాసత్యంగా మారుస్తున్నాడు. చీకట్లు తమాలవృక్షాలు క్రమ్ముకున్న చాటుల్లో దాగుకోవడానికి పారిపోయాయంటూ ప్రకృతిలో తమాలవృక్షచ్ఛాయలలో తప్ప ఎక్కడా చీకట్లులేవని వ్యక్తంచేస్తున్నాడు.

### ప్రవాళద్వీపనిర్మాణం

ఇంతచక్కని వెన్నెలరాత్రిలో తానూ రాత్రీ ఉన్నారు. తానే రాత్రిగా మారిపోవాలని పించిందతనికి. భావనాశక్తికి సాధ్యంకానిదేమీలేదని నిరూపిస్తాడు.

నేనే ఈ నిశనై, మదీయరచనానిష్పన్నముల్ గానవీ
ణానాట్యమ్ములుగాగ ఈ మృదుల చంద్రజ్యోత్స్నలై మామక
ప్రాణాధారములాశయద్యుతులె తారాకోరకాలైన వే
లానంతాంబుధులందు చేయనొ ప్రవాళద్వీపనిర్మాణముల్.

స్వాప్నికుడుగా ఊహాశాలిగా చిత్రకల్పనలను చేస్తున్నాడు. రాత్రిలో మెత్తని వెన్నెలలుంటే తనలో గానవీణానాట్యాలున్నాయట ! తన గాననాట్యాలుకూడా వెన్నెలలుగా మారిపోవాలట ! రాత్రిలో మొగ్గలవంటి నక్షత్రాలున్నాయి. తనలో తన ఆశయాల కాంతులున్నాయి. తన ఆశయద్యుతులు తారాకోరకాలుగా మారిపోవాలట ! అప్పుడు తాను చేయగలిగిందేమిటి ? వెన్నెలలను నక్షత్రాలను కలిపి తాను పగడాల దీవులను నిర్మిస్తాడట! అవి దీవులు గదా ? వాటిని ఏ సముద్రంలో నిర్మిస్తాడు ? అనంతకాలమనే సముద్రంలో. ప్రవాళద్వీపాలను తన నవ్య కవితలకు ప్రతీకలుగా భాసింపజేస్తున్నాడు.

### పాటలుపాడే రాత్రి

ఆ రాత్రి వ్యాపించిన పూల పరిమళాలను స్వేచ్ఛాకవిత్వపరిమళాలుగా ఊహించాడు. స్వేచ్ఛగా రాసుకుంటూ పోవాలి. తానిప్పుడు అభ్యుదయపదం మీద ఉన్నాడు. అందులో శరత్కాలపు కొత్త వెన్నెలలు కాస్తున్నాయట ! ఈ వెన్నెలలు రాసక్రీడలాడుతున్నట్లు శృంగారానుభూతి కలిగిందతనికి. చుట్టూ పువ్వులున్నాయి. అవి భగవంతుడి ఊయాలల లాగున్నాయట ! వెన్నెలలు నాయికలు, విశ్వవిభుడు నాయకుడు, పూలు ఊయలలుగా కనిపించాయంటాడు. తానా రాసక్రీడకు పాటలు పాడుతున్నాడట ! తానక్కడ కవికాడు. తానొక రాత్రిమాత్రమే. తన్నెవ్వరు పలకరిస్తారు ? అందుకే 'హృదయము కల్గెనా పలుకరింపుడు పాటలుపాడు రాత్రిని' అంటాడు. ఇలా తన నవ్యకవితాసృజనేచ్ఛనీ, స్వేచ్ఛాభిమానాన్నీ వెల్లడిస్తూ కవితలల్లుతున్నాడు.

## ఏ స్మితభిక్ష కోసమొ వహించిన జీవితపాత్ర!

1931 ఏప్రిల్ 13

తనలో ఎన్నో మూగతలపులున్నాయి. వాటిని వెల్లడించేదెలా? తానిప్పుడొక ఏటి ఒడ్డున ఒంటరిగా కూర్చుని చూస్తున్నాడు. ఎదురుగా ఎన్నెన్నోదృశ్యాలు! గాలిలో ఎండుగడ్డి పరకలగొట్టాలను చూశాడు. వాటిని తాను ఊదితే వేణుగానం పుట్టదా? ఏటిలో కొట్టుకుపోతుంది ఒక చెట్టు. దాన్ని ఒడ్డున తాను చేరవేస్తే దాని దుఃఖంతీరదా? ఏటికెరటాలు చిరునవ్వులతో వెన్నెలకౌగిలింతలో ఎంతహాయిగా ఉన్నాయి? ఆకాశంలోని నక్షత్రాలను చూస్తూఉంటే అవన్నీ కలిసి ఒక వీణలా కనిపిస్తున్నాయి. ఆవీణ మూగపాటను వినడానికా దిక్కులు ఎదురు చూస్తున్నాయి? తాను విరహంతో చీకట్లో ఒక్కడూ కూర్చుని ప్రియురాలి చిరునవ్వునే భిక్షగా కోరుతూ తన జీవితపాత్రను చాపితే, అది బాధలతో నిండిపోతున్నదే! ఈ విధంగా తన మూగతలపులను అక్షరాలలోకి అనువదించుకున్నాడు.1

### జీర్ణతృణాల జీవితాశ

ఎదురుగా ఉన్న ఎండుగడ్డిపరకల గొట్టాలలోనుంచి గాలి వీచినపుడు పుట్టిన చిన్నిధ్వనిలో 'జీర్ణతృణాల జీవితాశ'ను గమనించగల్గుతున్నాడు. వెదురుబొంగులలోనుంచి ప్రవహించే గాలి వేణుగానానికి మూలం. అల్పమైన జీర్ణతృణాన్ని మాత్రం తాను ఉద్ధరించి ఊదితే వేణుగానం బయల్దేరదా? 'కలవరించే జీర్ణతృణాల'ను అల్పజీవులకు ప్రతీకలుగా భావించి పతిత జనోద్ధరణాభిలాషను సూచిస్తున్నాడు 'కలవరించు', 'జీవితాశ'అనే మాటలను ప్రకృతికీ మానవజీవితానికీ వంతెనలు వేయడానికి ప్రయోగించాడు.

### మొరవెట్టు మహీరుహం

ఆ యేటియొడ్డున ఉన్న చెట్టొకటి వరదవేగానికి కొట్టుకునిపోవడాన్ని చూశాడు కవి.

ప్రవాహినీ వేగములో చలించి మొరవెట్టు మహీరుహమందు నార్తిపోగా
గిలిగింత కొల్పి తమకమ్మున నొడ్డున చేరవైతునా?

---

1 ముద్రణ : కవితాసమితి ద్వితీయవార్షిక సంచిక 1932, చూ. శ్రీశ్రీసా. ఒకటి, కావ్య. 103-104 పే.

అది తనకు గలిగిన ఆపదనుంచి తప్పించుకోలేని వానిలా మొరపెడుతున్నట్లు అనిపించిందట. తాను దానిని ఒడ్డుకు చేరవేసి ఆనందం కలిగించకూడదా అని కవి మూగతలపు. మొరపెట్టు, గిలిగింతలు, ఒడ్డునచేరవేయు అనే జాతీయాలను అచేతనమైన చెట్టుపట్ల ప్రయోగించడంద్వారా ప్రకృతిలోంచి మానవప్రపంచంలోకి అడుగుపెడుతున్నాడు.

కెరటాల చిరునవ్వు

ఏటి కెరటాలనిండా ఉన్న నురుగులతనికి నవ్వుతున్నట్లు కనిపించాయట!

'ఆ కెరటాలు ఫేనదరహాస మొనర్చుచు కైరవాప్త రే
ఖా కిలికించితాల తెలికౌగిళులన్ శయనించు హాయిగా
ఏ కలనెంత తీయదన మానెడినో'

ఎందువల్ల ఆ దరహాసం? పైన చందమామ శృగారచేష్టలు చేస్తున్నాడు. అతడు వెన్నెలతోనే కౌగిలించుకుంటున్నాడు కెరటాలను. అవి ఆ కౌగిలింతలో నిద్రిస్తున్నాయి. అవి పొందుతున్న ఆ దాంపత్యసౌఖ్యాన్ని చూసి తన ఆనందాన్ని ప్రకటించాడు. అవి పొందే కలలెంతమధురమైనవో అనుకున్నాడు. దరహాసం, కిలికించితాలు, కౌగిళులు, శయనించడం వంటివి చేతనజగత్తు ధర్మాలు. వాటిని ప్రకృతి కన్వయించడం ద్వారా జీవిత వ్యాఖ్యానం చేశాడు. ఇంకా శృంగారానుభవకాంక్ష తనను వదలడంలేదు.

నక్షత్రవీణ మూగపాట

చీకట్లో కూర్చుని ఆకాశంలోని నక్షత్రావళిని చూస్తే అది అందమైన వీణవలె కనిపించిందట!

ముసరు నిశాంధకారముల మ్రోతలలో నొకమూల తారకా
రసికవిలాసవీణకొసరన్ తలపోసెడు మూగపాటకే
దెసలు చెవుల్ నిగుడ్చి పరతేరని రాగములాస చేయు, ని
శ్వసనములాగుచున్ హృదయవాద్యరుచుల్ బిగియించి వేగుచున్.

మ్రోగని ఆ వీణయొక్క మూగపాట కోసం దిక్కులన్నీ ఎదురుచూస్తున్నాయనిపించింది కవికి. దిక్కులు సంగీతప్రియులు. ఆ పాట వినిపించకుండా పోతుందేమో అని తమ నిశ్వాసాలనూ హృదయవాద్యాల ధ్వనులనూ ఆపుకుంటున్నాయని భావించాడు. తలపోయడం, మూగపాట, చెవులు నిగుడ్చడం, ఆసచేయడం, నిశ్వసనము లాగడం మొదలైన ప్రాణిధర్మాలను ప్రకృతి కన్వయిస్తున్నాడు. సహజంగా గానప్రియుడైన ఈ కవి ప్రకృతినిండా అలముకుని ఉన్న సంగీతం వినాలని అభిలాషపడుతున్నాడు.

స్మితభిక్ష

విరహపీడితుడై చీకట్లో ఒంటరిగా కూర్చుని తన ప్రియురాలి చిరునవ్వుకోసం వెదుక్కుంటున్నాడు.

ఏ స్మితభిక్షుకోసము వహించిన జీవితపాత్రనిండ బా
ధా స్మృతులే స్రవించి ఎడఁదన్ కలగించ, నిగూఢకంధరా
వేశ్మమునందు చేరిన వివిక్త నిశీథిని కోరినాడ నా
కస్మిక చంచలాచ్ఛలతికానటనన్, తిమిరాల సోలెడిన్.

బిచ్చగాడు తన పాత్రలో ఆహారంకోసం యాచించినట్లు తాను తన జీవితాన్ని ఒక చిరునవ్వుకోసంవహించాడు. కానీ అతని జీవితపాత్రలో స్మితభిక్ష పడనేలేదు. పైగా ఆ పాత్రలో కన్నీరు పడినట్లు బాధాస్మృతులే పడ్డాయి. ఇటువంటి నిరాశలో అతడొంటరిగా ఒకయింట్లో కూర్చున్నట్లు చీకట్లో చేరాడు. అక్కడ చీకటి మాత్రమే ఉంది. ఆకస్మికంగా వచ్చిన మెరుపులవల్ల చీకట్లకయినా ఆనందం కలుగుతోంది కానీ అతనికి మాత్రం లభించడం లేదు.

భావనను భాషలో కదించడంలో నేర్పు చూపిస్తున్నాడు. పతితజనుల్ని ఉద్ధరించాలనే కోరికను వెల్లడిస్తూ కవితలుఅల్లుతున్నాడు.

పదచిత్రాలు-ప్రతీకలు

ఫేనదరహాసం, తెలికౌగిలి, పుష్పశయ్య, మూగపాట, స్మితభిక్ష, జీవితపాత్ర వంటి పదచిత్రాలు భావకవితాసంప్రదాయంలోనివే. కానీ కలవరించెడి జీర్ణతృణాలు, మొరవెట్టు మహీరుహం వంటివి ప్రతీకాత్మకపదచిత్రాలు. అచేతనాలకు చేతనధర్మాలను ఆరోపిస్తున్నాడు. అదికూడా క్రియాజన్యవిశేషణం సహాయంతో. ప్రకృతి ప్రపంచంలోంచి మానవ ప్రపంచంలోకి అడుగులు వేయడానికే ఈ ప్రయత్నం!

ఎలుగెత్తి పాడుకొను పుల్గులె
నా ఎద మెచ్చునెచ్చెలుల్ !

1931 అక్టోబరు 1

ఈ సౌందర్యదిదృక్షకు అంతులేదు. ఎన్నోసుకుమారకాంక్షలు కలుగుతున్నాయి. కవితాపిపాస పెరిగిపోతోంది. స్వేచ్ఛపై ఎడతెగని మక్కువ. అందువల్లనే తాను సెలయేటితీరాలలో సంచరిస్తాడు. అక్కడ ఆకాశంలో హాయిగా ఆటలాడుకుంటూ పాటలు పాడుకునే పక్షులు కనిపిస్తాయి. వాటితోనే తన స్నేహం. పూలనెత్తావులూ కమ్మతెమ్మెరలూ ఎదురవుతాయి. అవి తనలోని పసుచుతనపుకోరికలను ప్రేరేపిస్తాయి. భావతంత్రులను మీటి కవిత్వం చెప్పిస్తాయి. వెన్నెల తన చుట్టూ వ్యాపించి ఎన్నో స్మృతులను కలిగిస్తుంది. పూలలో దైవకృప సాక్షాత్కరిస్తుంది. ఇవన్నీ ఆనాటి కవి తీయని కలలు.1

మలయమారుత సేవ

ఒక సాయంసంధ్యలో అడవిలో సెలయేటి యొడ్డుకు వెళ్ళినప్పుడు తనకు అక్కడ 'వాయువీచి'లా తిరగాలనిపించిందంటూ తనస్వేచ్ఛాప్రియత్వాన్ని తెల్పుతాడు. తరంగాలు గద్గదస్వనంతో చెప్పే రహఃకథలే అతడాస్వాదించే మధుజలాలట ! అతడు 'భావనామానపథాల'లో తిరగాలనుకుంటాడు. 'మలయమారుతసేవ' తనకు లభిస్తుందని ఆశపడతాడు.

పక్షులతో స్నేహం

ఎదురుగా కొండ అంచులలో ఎగురుతున్న పక్షులతనికి ఎదమెచ్చిన నెచ్చెలులట ! అందుకు కారణాలు క్రింది పద్యంలో చెబుతాడు.

గగన వితంకమందుకొనగా పరువెత్తు నగాంచలమ్ములన్
సొగసుల ప్రోవులల్లెగురుచున్, వలయావళులన్ రచించుచున్
దగకొనియున్న నా శ్రవణతత్పరతా పరితృప్తికిన్ సుఖ
మ్ముగ నెలుగెత్తి పాడుకొను పుల్గులె నా యెదమెచ్చు నెచ్చెలుల్

1 ముద్రణ: భారతి. 1931 నవంబరు. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 105-106 పే.

మొదటిది: ఆ పక్షులు 'సొగసుల ప్రోవులు'. రెండవది: ఆకాశాన్ని అందుకోవడానికవి పరుగెడుతున్నాయి. మూడవది: గుండ్రంగా తిరుగుతూ వృత్తాలను గీస్తున్నట్లున్నాయి. నాల్గవది: వాటి పాటలు శ్రవణపరితృప్తి కలిగిస్తున్నాయి. తన కవితలు ఆ పక్షుల్లా ఉండాలని కోరుకోవడం ఇందులోంచి తొంగిచూస్తోంది.

## పూలనెత్తావులు-కమ్మతెమ్మెరలు

పూలనెత్తావులూ కమ్మతెమ్మెరలూ అతణ్ని ఆకర్షించకమానలేదు. అవి తనకోసమే అనిపించాయంటాడు-

ఈ వెడ విస్తరిల్లు ప్రతిహృద్యలతాంత పరీమళాల నా
లో యువకానుభోగసరళుల్ పులకించు, రసప్రమోదపున్
తీయఁదనాలు నించుకొను తీరనదత్ ప్రతికమ్రవాయువుల్
నా వెద భావతంత్రుల నినాదిల చేయునెవో కవిత్వముల్.

పూల పరిమళాలు యౌవనోద్దీపనం కలిగించగా కమ్రవాయువులు భావతంత్రులను మీటి కవిత్వం పలికించాయట! వెన్నెలతో నిండిన వనం అతని కెన్నో స్మృతులను కలిగించింది. దైవకృపమే పువ్వులుగా వికసించిందని చెబుతాడు. సెలయేళ్లు, పక్షులు, పూలు, గాలులు, కెరటాలు వంటి కాల్పనిక కవితాసామగ్రి తననింకా వెంబడిస్తూనే ఉంది.

స్వర్గ దేవతలు

## నాకధునీసుధాపులిన నాట్యవిశారదులు!

1931 నవంబరు 19

అది ఒక వెన్నెలరాత్రి–సాగరతీరం. తాను ఆకాశంవైపు చూస్తూ ఉంటాడు. చంద్రుడు దీపంలా వెలుగుతూ ఉంటాడు. ఆకాశంలోకి దేవతలు దిగుతారు స్వర్గంనుంచి. వారు తనని చూడటానికే వచ్చారనుకుంటాడు. ఈ దివ్యానుభవాన్ని మరచిపోలేనంటాడు. ఆ స్వర్గ దేవతలతో తాను మాట్లాడినట్లు కూడా చెబుతాడు.[1]

చంద్రదీపశిఖ

సముద్రనాట్యదర్శనంకోసం వచ్చినవారెవరో చంద్రదీపశిఖను వెలిగించగా ఆ దీపపు పొగలవలె 'పయోదములు' తేలియాడుతున్నాయంటూ అపూర్వంగా ఊహిస్తాడు. ఆకాశం నాట్యశాలగా, చంద్రుడు దీపంగా, మబ్బులు పొగలుగా, సముద్రచలనం నాట్యంగా, తరంగాలు గీతాలుగా, దేవతలు ప్రేక్షకులుగా కనిపించారని సూచిస్తూ తన చూపు ఊర్ధ్వంగా ప్రసరించడాన్ని వ్యక్తంచేస్తున్నాడు. ఈ మనోజ్ఞదృశ్యంతోపాటు దేవతలనుకూడా చూసి, వారిని ప్రశ్నిస్తున్నట్లు 'చెప్పుడు వెన్నెలలిట్లె నిల్చునా' అనడం ఒక ఆసక్తికరమైన చమత్కారం. ఆనాటి వెన్నెల ఎంత మనోహరంగా ఉందో చెప్పడానికి కవి ఊహలతో పల్లటీలు కొట్టక తప్పిందికాదు.

> మీ తెలిస్వప్నమేమొ కుసుమీకృతనాకహృదంతరాళ ని
> ర్యాత పరీమళమ్మయిన రమ్యశశాంకమరీచిమాలికా
> శీతలశోభ నేటిదిది? చిందెదరా చిరగాఢసుప్తి ము
> ద్రాతిమిరావృతావధులు దారికనుంగొను పూర్వసంస్మృతుల్

మొదట దేవతలు కన్న 'తెలిస్వప్నమేమో' అన్నాడు వెన్నెలను. అంతటితో తృప్తికలుగ లేదు. స్వర్గమే ఒక కుసుమమైతే దానినుంచి వెలువడిన పరిమళం ఈ వెన్నెలకుందన్నాడు. ఈ వెన్నెల శోభ శశాంకమరీచిమాలికా శీతలంగా కనిపిస్తోందన్నాడు. ఈ ఊహాలను తనలో తాను అను

---

1 ముద్రణ: భారతి 1932 మే. చూ. శ్రీశ్రీసా. ఒకటి, కావ్య. 107-109 పే.

కోవడంకాకుండా దేవతలకు నివేదిస్తూ మనకి ఆశ్చర్యం కలిగిస్తున్నాడు. ఆకాశ వేదికమీద దేవతల పదవ్యాపృతిని చూసి 'మల్లికాసుమదళాచ్ఛకళాద్యుతిగా' భావిస్తాడు, ఆ దేవతలు 'పరిమళవర్షిష్ణ తుషారపృషత్పరంపరలను' కురిపించడం చూసి ఆశ్చర్యపడిపోతాడు.

## స్వర్గ దేవతలు

ఇంతవరకూ ఆకాశంలో కనిపించిన వారెక్కడనుంచి దిగివచ్చారో తనకు తెలియదన్నట్లు గానూ, ఇప్పుడే వారిని పోల్చుకున్నట్లుగానూ ఇలా అంటాడు.

మీరెవరో క్షణక్షణనిమీలన మోహన నేత్రులై తమో
భారసుషుప్తిలో తోణకు స్వప్నగరుత్తుల చంచలానిలాం
కూరములన్ దిశావధులకున్ వెలిపూతల సోయగమ్ము క
ర్పూర సువాసనా మిళిత భోగముగా నిడు స్వర్గదేవతల్ కాదుగదా!

వారెవరో అనిమేషులుకారనడం చిత్రంగా ఉంది. కదలికలేని కళ్లు అందంగా ఉండవని అనిమేషులను కూడా క్షణక్షణనిమీలనమోహననేత్రులుగా మార్చాడు కాబోలు కవి. వారు క్రిందికి దిగివస్తున్న దృశ్యం వర్ణించడంలో కవి ఉత్ప్రేక్ష కాల్పనిక-ప్రాబంధిక-శిల్పం గలది. దిశావధులకు వారు కర్పూరసువాసనామిళితమైన వెల్ల వేస్తున్నారనీ దానిని వారు 'తమోభారసుషుప్తిలో తోణకు స్వప్నగరుత్తుల చంచలానిలాంకూరముల'తో సాధిస్తున్నారనీ కాల్పనికంగా ఊహించాడు. ఈ అద్భుతక్రియ చేయడంవల్లనే వారిని 'స్వర్గదేవతల్ కాదుగదా' అని పల్కరించాడు. స్వర్గ దేవతలు దివ్యాతిదివ్యమైన ఇంద్రజాలాలు చేస్తారనే నమ్మకానికి ఇది నిదర్శనం.

## నాకధునీసుధాపులిననాట్యం

సాధారణంగా ఇటువంటి వెన్నెలరాత్రులలో స్వర్గ దేవతలు మందాకినీతీరంలోని సుధాపులినాల మీద నాట్యమాడతారనీ అప్పుడు కల్పవృక్షాల చల్లనిగాలి వారిమీద చందన చర్చలాగ వ్యాపిస్తుందనీ వారిచుట్టూ అప్సరసలు నవ్వుతూ ఉంటారనీ ఆ నవ్వుల అందాలలో వారు స్నానం చేస్తారనీ కవి నమ్మకం-

'మనోహరమ్ముగా నిశిపాడెడునిట్టివేళలన్
నాకధునీ సుధాపులిన నాట్యవిశారదులై
త్రివిష్టపానోకహ మందమారుత మనోజ్ఞత
చందనచర్చవోలికన్ సోకగనప్సరో
హాసనశోభల తానములాడు మీరలు'

అనే పంక్తులలో తొంగి చూస్తోంది. కానీ ఈనాడు వారా భోగాలన్నీ వదలుకుని ఇలా ఎందుకు వచ్చారో కవి కనుమానం వేస్తుంది. అందుకే 'ఏలా కకుబంతవీధికల లాస్యమొనర్తురు సోలిపోవుచున్' అని ప్రశ్నిస్తాడు.

ఎడారిలో శీతలసమీరాలు

ఇలా ప్రశ్నిస్తాడేగాని వారు క్రిందికి దిగివచ్చినది తనవంటి భక్తుడ్ని చూడటానికే అని వెంటనే సమాధానపడుతూ—

దయగనినారు సుప్తి నలతన్ నశియించిన నాపయిన్ జలా
శయరసవత్ సమీరముల చాడ్పున కారుపెడారిదారిలో
పయిపయిసోకగా భవదపార మనోహరగాన గీతికల్.

అని ప్రశంసించడంలో అతడు చెప్పుకున్న ఉపమానం ఉజ్జ్వలంగా ఉంది. ఎడారిలో పోయేవాడికి చల్లనిగాలి తాకితే, సన్నిహితంగా జలాశయమున్నదని తోచడం సహజం. ఇందులో అతని కృతజ్ఞత సువ్యక్తం.

గగనసింధుసుధాపరిషేచనం

దేవతలు దివ్యదర్శనమిచ్చిన ఆ రాత్రి గతించినా ఆ స్మృతి మాత్రం మాసిపోదట. ఆ స్మృతి ఎట్లాంటిది ?

'గగన సింధు సుధాపరిషేచనోజ్జ్వల వ్యూహములన్ మదీయహృదినూచిన
ఈ స్మృతి భావనాగరుద్ గ్రాహితమై చరించెడు నుదారముదావహకాలమెల్లెడన్.

కవి హృదయం 'గగనసింధుసుధాపరిషేచనం' చేసి వచ్చింది. ఇందుకు కారణం దేవతల సాక్షాత్కారం. ఇంతకూ ఇది ఈతని భావన. ఈ భావనయే అతనికి రెక్కలిచ్చింది.

తనకు దివ్యానుభవాలు, దివ్యస్వప్నాలు వచ్చాయని చెప్పుకోవడంలో కథాకథనశిల్పాన్ని సాధనచేస్తున్నాడు. ఈ దివ్యానుభవాల కథనంతో లోకవాస్తవికతనూ ప్రకృతి వాస్తవికతనూ వదిలి ఆకాశమార్గాలలో నూతనకవితాసామగ్రి కోసం పరిశోధన సాగిస్తున్నాడు. 'సుప్తాస్థికలు'లో ధరాగర్భానికి దృష్టి సారించినవాడు ఆ తరువాత స్వేచ్ఛావిహంగం, హారతి, లాస్యతృష్ణ వంటి ఖండికల్లో తనదృష్టిని ఊర్ధ్వముఖంగా ప్రసరింపజేస్తున్నాడు. అభినవకవితాప్రస్థానానికి అన్వేషణలో ఇవన్నీ సోపానాలే!

పనివాడితనం అంటామే,

అదే నిజమైన కళాజీవికి లక్షణం !

ఇది వ్యక్తిగతం (subjective)

అయినప్పటికీ

దీని నిర్ణేత రసజ్ఞుడే కాబట్టి-

రసం సామాజికనిష్ఠం కాబట్టి-

ఎదుటివాడు ఆనందించేదాకా

రచనకు కావ్యార్హత లేదు.

కాబట్టి- పనివాడితనం

Objective Reality కూడా

అని చెప్పకతప్పదు !

—శ్రీ శ్రీ

## ఆకాశకర్పరమెల్ల నిండు నీ గ్రుడ్డివెన్నెల !

1932 మార్చి 21

జీవితం ఇంతవరకూ స్వప్నంలా కనిపించింది. కానీ ఇప్పుడే కష్టాలు మొదలవుతున్నాయి. చవితిచందమామ కనబడ్డాడో లేదో లోకమంతా భయంకరంగా కనిపించసాగింది. వెన్నెల అందంగా లేదు. నల్లనిమేఘాలు విషాదాంతకావ్యంలా కనిపించాయి. లోకంలో ఇంత బీభత్స రౌద్రభయానకరసాలు తాండవిస్తున్నాయా ? చందమామ కొడవలిలాగున్నాడే! తనని చంపడానికి వచ్చిన హంతకుడా చవితిచంద్రుడు ? నిట్టూర్పులు విడుస్తూ చంద్రుడ్నే ప్రార్థిస్తున్నాడు తనకు శాంతిని కలిగించవలసిందిగా-గ్రుడ్డివెన్నెలను సముద్రంలో కలిపివేయవలసిందిగా ! లోకమే ఒక శ్మశానమా ? అయితే తనకు శివుడి జటాజూటంలోని గంగాజలం కావాలి. ఎలా లభిస్తుంది ?1 దృక్పథంలో ఎంతమార్పు వచ్చింది ?

చవితి చంద్రుడు

నల్లమబ్బుల్లో కనిపించిన చవితిచంద్రుడ్ని చూస్తే తనకు భయంగా ఉందని చెబుతూ తన భావనావిధానంలో మలుపుతిరుగుతున్నాడు.

> ఆ పశ్చిమాశా విషాదాంత కావ్యమై వ్యాపించు కాలమేఘాళిలోఁ బొడసూపి
> ఖండేందుమూర్తి ! ఆకాశకర్పరమెల్ల నిండు నీ గ్రుడ్డివెన్నెల ధూమధూపమై.

ఇందులో వెన్నెలను అనేకవిధాల భయహేతుకంగా వర్ణిస్తాడు. మొదటిది : అది గ్రుడ్డివెన్నెల కావడం. రెండవది : దానికికారణభూతుడైనవాడు ఖండేందుమూర్తి (చవితిచంద్రుడు) కావడం. మూడవది : అది జన్మించిన స్థలం కాలమేఘాళి కావడం. నాల్గవది : ఆ కాలమేఘాలు కవికి పశ్చిమాశావిషాదాంత కావ్యమై కనిపించడం. ఐదవది : ఆ వెన్నెలకు ఆశ్రయమైన ఆకాశం ఒక పుర్రెలా కనిపించడం. ఆ వెన్నెల పుర్రెలోని పొగలా తోచడం-ఇంత విషాదసామగ్రిని కవి పోగుచేశాడు. 'పశ్చిమాశావిషాదాంతకావ్యం' అనే పదచిత్రరచన సాభిప్రాయం. అప్రస్తుతమే

---

1 రచన: తొలిసారి 1929 మే. 13. (ఖండేందుమూర్తి, చవితిచంద్రుడు) మలిసారి: 1932 మార్చి. 21. ముద్రణ: భారతి 1932 జూన్. చూ.శ్రీశ్రీసా. ఒకటి కావ్య. 110 పే. 14 పాదాల భావగీతిక ఇది. ఆంగ్లంలోని Sonnet వంటిది.

అయినా పాశ్చాత్యప్రపంచంలో పుట్టిన ట్రాజెడీని ఈ పదబంధం ద్వారా జ్ఞాపకానికి తెస్తున్నాడు కవి. పశ్చిమాశ విషాదాంతకావ్యసదృశంగా కూడా కనిపించడానికి కారణం సూర్యాస్తమయమే. ఆకాశకర్పరంలో గ్రుడ్డివెన్నెల ధూమధూపంగా వ్యాపించడమనే ఊహాచిత్రం ఈ బ్రహ్మాండాన్నే ఒక శ్మశానంగా మార్చివేస్తున్నది. ఇలాంటి దృశ్యం చూసి కవి భయపడుతున్నాడు. తన జీవిత వాస్తవికతలోని భయమే ప్రకృతిలో కనిపించిందతనికి.

గ్రుడ్డివెన్నెల

జీవితంలోని కష్టాలకు ప్రతీకగా ఈ గ్రుడ్డివెన్నెలను భావించిన కవి, దానికి హేతుభూతుడైన ఖండశశిని ప్రార్థిస్తూ

వలదు దయలేని ఆ జిలుగు వెలుగెందేని కలిపివేయుము పల్లటిలు వార్ధి కెరటాల

అంటాడు. ఆ గ్రుడ్డివెన్నెల 'దయలేని జిలుగువెలుగు'గా కనిపించడం ఆశ్చర్యం. దయావిహీనమైన గ్రుడ్డివెన్నెల కన్నా అంధకారమే మంచిదని భావిస్తూ చవితిచంద్రుణ్ని నిష్క్రమించమంటున్నాడు. వార్ధి కెరటాలలో జిలుగువెలుగును కలిపివేయడం అంటే చంద్రాస్తమయం జరిగిపోవడమే.

వంపు తేరిన కత్తి

అసలు ఆనాటి చంద్రుడి ఆకారమే అతనికి భయంకరంగా కనిపించింది. ఈ భయంవల్లనే చంద్రుణ్ని కవి నిందిస్తున్నాడు. ప్రబంధాలలోని చంద్రోపాలంభనాలకు కారణం విరహాతిశయం కాగా ఇక్కడి నిందకు కారణం వ్యక్తిగతదుఃఖం.

సంపెంగ విరిపైడి చాయలో నాకేమొ వంపు తేరిన కత్తి వలె నుంటివీ రేయి

మెరిసేదంతా బంగారం కాదన్నట్లు పైడిచాయలో కనిపించే ఖండచంద్రుడు క్రూరుడుగా 'వంపు తేరిన కత్తి'లా కనిపించాడు. పైడిచాయ ధనానికీ, వంపు తేరిన కత్తి క్రౌర్యానికీ ప్రతీకలు.2 కవి భావాల కనుగుణంగా తోచిన ఆ ఉపమానం మౌలికం. కవితా సంప్రదాయంమీద విప్లవం.

చంద్రుడి క్రౌర్యాన్ని అతని ఆకారంలోనే కాదు, గుణంలో కూడా చూసి, శాంతిప్రియుడైన కవి అతణ్ని ఉపశమింపజేయడానికి ప్రయత్నిస్తూ-

---

2 భవిష్యత్కవితాధ్యాయంలో ఈ కవి ధనస్వామ్యవ్యవస్థమీద విరుచుకు పడతాడు. దానికిది ఒక విధంగా ప్రాతిపదిక.

'ఖండేందుమూర్తి! లోకముపై కుపితదృష్టి మండించు ఈసమున్మాద నాట్యమిదేమి?'

అంటాడు. చంద్రుడిలో లేని కుపితదృష్టి, సమున్మాదనాట్యం కవికి ఎలా కనిపించాయనేది మనం అర్థంచేసుకోవడానికి కవి హృదయం లోతులలోనికి తొంగిచూడాలి.3

## వ్యక్తిగతకష్టనిష్ఠురాలు

వ్యక్తిగతమైన కష్టనిష్ఠురాలవల్ల కవి భావాలానాడు వికలాలుగానూ శకలాలుగానూ అయిపోయాయి. అతడు చేసేది లేక నిట్టూరుస్తూ చందమామను నిందించడం మానివేసి

ఓ సుధాహృదయ! నిట్టూర్పులై ప్రసరించు వికల మామక భావశకలముల్ నీవంక

అంటాడు. శివజటాజూటంలోని గంగాంబు శీతలవృష్టిని తనపై చంద్రుడు కురిపించాలట 4

భయంకరమైన ఊహచిత్రాలు

కాలమేఘాళి పశ్చిమాశావిషాదాంత కావ్యంగా కనిపించడం, గుడ్డివెన్నెల ఆకాశకర్పరంలో ధూమధూపంలా నిండిపోవడం, ఖండచంద్రుడు వంపుతేరినకత్తిలా కనిపించడం నూతనమైన ఊహలేకాదు; భయంకరమైనవి కూడా. అన్నింటిలోనూ అందాన్నే చూడాలనే సిద్ధాంతంనుంచి క్రమంగా నిష్క్రమిస్తున్నాడు. స్వర్గదేవతలనుంచి చంద్రమండలం దాకా క్రిందికి దిగి వచ్చాడు. వాస్తవికత అర్థమవుతోంది.

3 ఉత్కృష్టభావగీతానికి శ్రీశ్రీ చెప్పిన నిర్వచనం— చూ.శ్రీశ్రీసా. ఒకటి కావ్య. 225 పే. (మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారికి వ్రాసిన లేఖ.)

4 1933లో రచించిన 'ఒకరాత్రి' ఖండికలో బహుళపంచమిచంద్రుడుకూడా తనను భయపెడుతున్నట్లు తెల్పాడు. ఆకాశమిక్కడ కర్పరంగా కనిపిస్తే అక్కడ ఎడారిగా కనిపించింది. అక్కడా ఇక్కడా కూడా వెన్నెల పొగలాగే కనిపించింది. ఇక్కడ చంద్రుడు వంపుతేరిన కత్తికాగా అక్కడ చంద్రుడు కాళ్లు తెగిన ఒంటరి ఒంటెగా కనిపించాడు. వెన్నెల పొగలాగూ వెలిబూదిలాగూ కనిపించడంవల్ల అక్కడా ఇక్కడా కూడా లోకమొక శ్మశానంగానే భావించబడింది. శ్మశానంగా కనిపించడంవల్లనే హరజటాజూట గంగాంబు శీతలవృష్టి కోరబడటం సాభిప్రాయమవుతోంది.

## నిత్యరాకాశశాంకమూర్తి !

తనకు మృత్యువే ఎదురయింది. తనను తీసుకుపోవడానికి యమభటులు కూడా వచ్చేశారు. కాని తనను చూసి వాళ్ళే పారిపోయారు. ఏమిటి తనలోని విశేషం? తాను కష్టాలలో పడి ఉండగా ఒక దివ్యానుభవం కలిగిందట ! 1

అంధకారవీథిలో

సంకుల పయోధరచ్ఛటావంకిల నిబిడాంధకార నిర్జనవీథికాంతరముల
నా చరించెడు వేళ ప్రోన్మత్తరీతి, అవశ మొకరించు దివ్య తేజోనుభూతి
సరసినై, చల్లనై నన్ను జలకమార్చె !

ఉన్మాదంతో అతడంతకుముందు తిరుగుతున్న వీధులు కష్టాలకూ దుఃఖాలకూ నిలయాలు. అందుకు నిదర్శనాలుగా దట్టమైన మబ్బులూ చిక్కని చీకట్లూ ఆ వీధులలో ఉన్నాయట ! నిర్జనమైన ఆ వీధులలో అతడొక్కడే తిరుగుతూండగా అతనికా దివ్య తేజోనుభూతి ఎందుకు కలిగిందో తెలియదు కానీ అది ఎటువంటిదో మాత్రం చెప్పాడు.

ఈ అనుభవంలో మరో వైచిత్రి 'నందనవనిలతాంతస్రజమ్ముగా నొక క్షణము' అతని మెడను కౌగిలించుకోవడం. కవి మెడలో పడిన ఆ పూలదండ నందనవనంలోనిదట ! ఇంతలో యమభటులు నల్లని త్రాళ్లు పట్టుకునివచ్చి కవిని కట్టి తీసుకుపోదలచారు. కాని, 'సుమనశ్శిరీమళావృత'మైన అతని గళసీమను చూసి భయపడి దివ్యానుభవం గల వ్యక్తిగా గుర్తించి అతడ్ని తీసుకుపోకుండా తిరిగి చీకట్లలోకి వెళ్ళిపోయారు. ఆ దివ్యానుభవంతో మృత్యువును జయించాడట! వెంటనే చుట్టూ ఉన్న మేఘాలు తొలగిపోయాయి. ఆకాశంనిండా ఇదివరకు కనిపించని నక్షత్రాలు తిరిగి కనిపించసాగాయి. అప్పుడు కవి మరొక విజయాన్ని సాధించగలిగాడు. తానే క్షీణతలేని పున్నమిచందమామగా మారిపోయాడు. ఆకాశరాజ్యాన్ని ఆక్రమించాడు. 'ఖండశశి'ని చూసి విషాదగీతం పాడుకున్నవాడే ఇప్పుడు పూర్ణశశిగా మారి ఆకాశరాజ్యంలోకి వెళ్ళిపోయాడు. దివ్యానుభవాలను కథలుగా కల్పించడంలో ఆకాశంలోని చంద్రలోకందాకా పోయి వస్తున్నాడు.

---

1 ముద్రణ : ఆంధ్రపత్రిక (ఆంగీరస) సంవత్సరాది సంచిక 1932–33
చూ. శ్రీశ్రీ సా. ఒకటి. కావ్య. 113 పే.

ఛందస్సు గుర్రం వంటిది

గుర్రం ఎటుతీసుకుపోతే

అటల్లా వెళ్ళిపోయేవాడు

అశ్వికుడు కానట్లే

ఛందస్సు లాగుకుపోయినట్లు వ్రాసేవాడు

సంవిధానజ్ఞుడు కాడు!

మరి

ఆ ఛందస్సును లొంగించుకుని

దానిచేత

చిత్రవిచిత్రరీతులలో

కదం త్రొక్కించినవారినే

ప్రశంసిస్తాము!

—శ్రీ శ్రీ

**వేటకాని కోలలకు కూలి వేదనల తూలు**
**హరిణాల కండ్లు జాలికి పురిటిండ్లు !**

1933 మార్చి ?

ఈ లోకం గురించి తన దృక్పథం మారింది. కవిత్వం గురించి కూడా అభిప్రాయాలు మారి పోతున్నాయి. వస్తువులోనూ సంవిధానంలోనూ తాను కొత్త బాణీలు కనిపెట్టాలి. ఆత్మాశ్రయం గానే అన్నీ వ్రాయనక్కరలేదు. కథావస్తువులే అక్కరలేదు. ఛందోబంధాలే అవసరం లేదు. స్వేచ్ఛాపద్యాలు వ్రాయాలి. శృంగారేతరరసాలవైపు దృష్టి మళ్ళించాలి. ఇలాంటి ఆలోచనల్లోనే పుట్టింది 'విద్యున్మాలికలు'.1 ఇది కవితావీధిలోనే మెరుపుదండలను చూపించింది. మెరుపుల్ని చూశాడు ఆ రాత్రి. లోకంలోని అనేకసంఘటనలు ఆ మెరుపులవల్ల జ్ఞాపకానికి వచ్చాయి. అవి దారితప్పిన బాటసారులా? కవి భావాలా? కొత్తపెళ్లికూతురి సిగ్గులా? ప్రవాసజీవితంలోని అప్సరసలా? పూలతోరణాలా? దివ్యబాలికల పావడా జలతారులా? ఇలాంటి ఊహలన్నీ పాతవే. శృంగారరసానికి సంబంధించినవే. ఒక కొత్త ఊహ వచ్చింది. వేటగానివల్ల గాయపడిన లేళ్ల కళ్లవలె జాలిని కలిగిస్తున్నాయి ఈ మెరుపులు. ప్రళయంలోని తాండవంవలె భయంకరంగా ఉన్నాయి ఈ మెరుపులు.

దారితప్పిన బాటసారులు

అచేతనాలైన మెరుపులకు మానవత్వం ఆరోపిస్తున్నాడు మొదటి ఊహాచిత్రంలోనే.

బారులు బారులుగ తీరిన / మబ్బుగుబ్బలులదారుల
దారితప్పి చరించె / ఆ రేయి తరళ సరళేరమ్మదములు !

'దారితప్పి చరించె' అనే చేతనక్రియద్వారా ప్రయాణంచేస్తున్నవారు బాటసారులని ధ్వనింప జేస్తున్నాడు. దారి తప్పిన బాటసారులుగా మెరుపులను ఉత్ప్రేక్షించి, అలా దారి తప్పడానికి పరిసరవాతావరణం కారణమని ప్రకటించదల్చుకున్నాడు. స్థలం ఎగుడుదిగుడుగా ఉన్న మబ్బుల కొండదారి. సమయం : వెలుగులేని రాత్రి.

---

1 ముద్రణ: భారతి. 1933 మార్చి. చూ. శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 124-125 పే. అక్షరచ్ఛందస్సులనూ మాత్రాచ్ఛందస్సులనూ జీర్ణించుకుని ప్రయోగాత్మకంగా వచనచ్ఛందస్సును ఈ రచనకు స్వీకరించాడు.

కవి భావాలు

వికారరహితమైన హృదయంలో ఒకానొక అనుభూతివల్ల గగుర్పొడిచిన భావాల క్రమక్రమ సాక్షాత్కారాన్ని ఆ మెరుపుల్లో చూస్తున్నాడు.

అవి కవిడెందమందు గగురుపొడిచి / ఓరగా / కోకిలపాట జీరగా
పైరుల పైవయి సోకి చను / తూరుపుగాలి తీరుగా
కవిడెందమున / తాకి తాకనటుల
తరలిపోయిన / ఏ పిన్న భావాలో

తలుపుచాటునుంచి తొంగిచూసి తప్పుకున్న కాంతను 'ఓరగా' అన్న ఒక్కమాటద్వారా స్ఫురణకు తెస్తున్నాడు. ఉండిఉండి కూస్తూ క్రమంగా గొంతెత్తే కోకిల కుహూనాదం 'కోకిలపాటజీరగా' అనే ఒక్కపంక్తిలో వెల్లడిచేస్తున్నాడు. సస్యసంవృద్ధికి దోహదం చేసే తూర్పుగాలియొక్క చంచలస్వభావం కూడా అల్పాక్షరాల్లో వివరించాడు. కవిహృదయంలోని భావాలు కూడా ఈ మూడుదశలలో ఆవిర్భవిస్తాయనీ వాటివలె మెరుపులున్నాయనీ తాకీతాకనట్లు సాగిపోతున్నాయనీ నిరూపిస్తున్నాడు. కాంత చూపునీ, కోకిలపాటనీ, తూరుపుగాలినీ కవిభావాలకు ఉపమానాలుగా చేశాడు. కానీ కవిభావాలను మెరుపులకు ఉపమానాలు చేశాడు. ఒక వస్తువుకి ఎన్నో ఉపమానాలు! ఒక ఉపమానానికి ఎన్నో వస్తువులు!

పరిమళతరంగాలు

మెరుపుల్ని నవ వధువు మనోభావాలుగా ఊహిస్తున్నాడు మూడవ భావచిత్రంలో,

భారంపు సిగ్గు తడియారక
నుడిలో విడుదలవడజాలక / విహ్వలించు
ఏ పిన్న భావాల పరిమళతరంగాలో
ఆనాటి చకచకిత చంచలా వితతి?

ఇందులో నవవధువు ప్రస్తావనే లేకుండా భారంపుసిగ్గు అనే మాటతో ఆమెను సూచించగల్గాడు. బరువైన సిగ్గు తడియారకపోవడంవల్ల ఆమె భయపడుతోందట! మాటలు తడబడుతూ ఉండడం వల్ల మాటలలో బందీయై ఆమె భయపడుతోందట! ఇలాంటి ఆమె భావాలను పరిమళంతో కూడిన కెరటాలుగా భావించాడు. పరిమళాలు ప్రవహిస్తున్నాయట! తళుకుతళుకుమంటున్న మెరుపులను ఆ పరిమళతరంగాలతో పోల్చడంద్వారా జీవితంలోని అతిముఖ్యమైన అందమైన వివాహోత్సవఘట్టాన్ని జ్ఞాపకానికి తెస్తున్నాడు.

ప్రవాసపు బ్రతుకు

శాపవశాన పూలుగా మారిన నక్షత్రాలుగా మెరుపుల నూహిస్తాడు.

స్వర్గవీథీవిహారతారకలు మారి / శాపవశాన
మానవునితోట మడికట్లలోన / ప్రవాసపుబ్రతుకుతోన
నవయుచుండియు నవ్వు వెల్లువలు జల్లు
రకరకాల రంగుల వికచలతాంత సంతతులుగ
వినువీథిమీద / తమకోరికలతోడ / పరిపూరితములైన
కనులకాంతి వినయవిస్మృమరత లేమొ
ఆనాటి రేయి నవఘళించిన / శంపాసహస్ర / నిశావిశాలకుహారవిహారములు !

స్వర్గంలో విహరించే అప్సరసలే తారకలట! అవి శాపంవల్ల స్వర్గంనుంచి పడిపోయాయట! మానవుడి ఉద్యానవనాలలోకి అవి దిగివచ్చాయట! అది వాటికి 'ప్రవాసపు బ్రతుకు!'. ఈప్రవాస దుఃఖంలో సైతం అవి నవ్వులప్రవాహాలను వెదజల్లుతూ రకరకాల రంగురంగుల విరబూసిన పువ్వులుగా విరాజిల్లుతున్నాయట! కాని వీటి కోరికలన్నీ వినువీథిమీదనేనట! ఆ కోరికలతో నిండిన కళ్లు వాటివి. ఆ కళ్లకాంతినే ఆ వేనవేలమెరుపులలో తాను చూస్తున్నానంటూ తన భావాలను స్వర్గంనుంచి మానవలోకానికి దింపి, తిరిగి ఆకాశమండలంలోకి ఎగరవేస్తున్నాడు. 'శంపాసహస్రనిశావిశాలకుహారవిహారములు' అనే సమాసంలో అన్వయక్లిష్టతను చూపాడు. లేకుంటే ఇది 'నిశావిశాలకుహారవిహారశంపాసహస్రములు' అయి ఉండేది. శాపాలు, ప్రవాసాలు, స్వర్గాలు, తారకలు–పౌరాణికవాతావరణాన్నే చెబుతున్నా వాటిని మానవప్రపంచంలోకి తీసుకువస్తున్నాడు.

విష్ణుక్రాంతతోరణాలు

నల్లనిరాత్రి గుమ్మంముందు వేలాడుతున్న విష్ణుక్రాంతతోరణాలట మెరుపులు !

అవి యేమొ / యామినీవిపిలగేహదేహళీ
విష్ణుక్రాంతనితాంతతోరణములో ?

రాత్రిని ఇల్లుగానూ ఆకాశాన్ని నల్లనిగుమ్మంగానూ మెరుపులను ఆ గుమ్మంలోని విష్ణుక్రాంత తోరణాలుగానూ భావిస్తూ మానవసమాజవాతావరణాన్ని జ్ఞాపకం చేస్తున్నాడు.

వేల్పుబాలికల పావడాఅంచులు

మానవలోకంలోలాగే స్వర్గంలో కూడా ఆడపిల్లలున్నారట! ఆ కన్యలుకూడా జలతారు అంచుల పరికిణీలు ధరిస్తారట !

ఆటలాడు వేలుపు బాలికల / పావడా అంచుల బంగారుతీవియలో ?

వేలుపు బాలికలు ఆ వర్షారాత్రివేళ ఆటలాడుకోవడం అసహజంగా కనిపిస్తుంది. కాని వారి పరికిణీ అంచుల బంగారు తీగలుగా మెరుపుతీగలను చూస్తూ తన సమాజంలోని అందాలను నెమరు వేసుకుంటున్నాడు.

చిత్తవికాసంనుంచి చిత్తద్రుతికి

ఇంతవరకూ చెప్పిన ఊహాచిత్రాలు కాల్పనికాలు. ఇక్కడనుంచి కవి మనస్సులోనే కరుణరసం ఆవహించింది. ప్రపంచంలో హృదయరంజకమైన దృశ్యాలే కాదు; చిత్తద్రావకమైన సంఘటనలూ ఉన్నాయి. శృంగార వాత్సల్యాదులు చిత్తవికాసాన్ని కలిగిస్తాయి. పై భావాలన్నీ ఆ కోవకు చెందినవే. ఆ చిత్తవికాసంనుంచి చిత్తద్రుతికి పయనించడానికి కవి మనస్సులో మార్పురావాలి. ఆ మార్పు ఈ కవిలో వచ్చింది.

దెబ్బతిన్న లేళ్లకళ్లు

కనుకనే పైన చెప్పిన ఊహాలన్నింటినీ తిరస్కరిస్తూ

కావవి ! / వేటకాని కోలలకు కూలి
వేదనల తూలు హరిణాలకండ్లు / జాలికి పురుటిండ్లు
దిక్కుదిక్కులకంపిన దీనంపుచూడ్కులే
ఆనాటి / ప్రళయతాండవ భయంకర సౌదామినులు !

అంటాడు. ఇంతవరకూ 'తరళసరళేరమ్మదములు' అనీ, 'చకచకితచంచలావితతి' అనే 'శంపాసహస్ర నిశావిశాలకుహరవిహారములు' అనీ అభివర్ణిస్తూ వచ్చిన కవి ఆ మెరుపులను 'ప్రళయతాండవ భయంకర సౌదామినులు' అంటున్నాడు. ప్రళయతాండవంవలె ఆ మెరుపులు భయాన్ని కలిగించాయి కవికి. కారణమేమిటి ? క్రూరుడైన ఒక వేటకాడు అమాయికాలైన, లేళ్లను గాయపరచిన దృశ్యం అతనికి గుర్తువచ్చింది. దెబ్బతిన్న లేళ్లకళ్ళు జాలికి పురుటిళ్ళవంటివి. ఆ కళ్ళలోంచే జాలి పుడుతుందట ! ఆ లేళ్ళు మమ్మల్ని రక్షించేవారు ఎవరూ లేరా అన్నట్లు దిక్కుదిక్కులకు చూస్తున్నాయి. అసలే లేడికళ్ళు అందమైనవి. చంచలమైనవి. ఆ చంచల వీక్షణాలలో శృంగారానికి బదులు, సౌందర్యానికి బదులు ఇప్పుడు దైన్యం కనిపిస్తోంది. ఆ దీనమైన చూపులే ఈ మెరుపులు అంటాడు కవి. కవి దృక్పథంలోనే వచ్చిన మార్పుని ఈ ఊహాచిత్రం పట్టి చూపిస్తోంది.

శబ్దశిల్పం

పదబంధాలలో కూర్చిన అచ్చులూ హల్లులూ ఆ పదబంధం ద్వారా వ్యక్తంచేయదలచిన భావాన్ని రూపు కట్టించడానికి సహకరించవచ్చు. 'తరళసరళేరమ్మదములు' అనే పదబంధంలో అకారం, రేఫ, ళకారం ఒక చిత్రమైన లయను తెచ్చి మెరుపుల రూపు నొకవిధంగా ధ్వనింప

చేస్తున్నాయి. 'యామినీపినీలగేహదేహాళి' అనే పదబంధంలో ఏ అక్షరాన్నీ మార్చలేము. ఈకార ఏకారాలు ఆ పదబంధానికి లయను తెచ్చిపెట్టాయి. శబ్దంమీద ఇలా పెత్తనం చెలాయిస్తున్నాడు. చకచకిత చంచలావితతి, శంపాసహస్రనిశాపిశాల కుహరవిహారములు వంటివి కూడా ఇందుకు మచ్చుతునకలే.

కొన్ని వాక్యాలను పాడుతున్నట్లుగా, నృత్యమాడుతున్నట్లుగా రాయడానికి ప్రయత్నిస్తున్నాడు. 'ఓరగా కోకిలపాట జీరగా పైరులపైపయి సోకిచను తూరుపుగాలి తీరుగా' అనే వాక్యం చదువుతూంటే ఆ లయ గుండెను తాకుతుంది.

కొన్ని పదబంధాలలో దేశీయత ఉండాలి; కొన్నిపదబంధాలలో సాంస్కృతికత ఉండాలి. లేకుంటే అందరినీ ఆకట్టుకోవడం సులువుకాదు. మబ్బుగుబ్బలులు, తూరుపుగాలి, నవ్వువెల్లువలు, పావడా అంచులు, బంగారు తీవియలు, పురిటిండ్లు వంటివి తేటతెలుగులు. తరళసరళేరమ్మదములు, చకచకితచంచలావితతి వంటివి సంస్కృతపుమెరుపులు. విశేషణాలను తూచితూచి వాడుకుంటున్నాడు.

భావంనుంచి శబ్దానికి

కవి శబ్దంనుంచి అర్థానికి పరుగెత్తడం శైశవచిహ్నం. భావంనుంచి శబ్దానికి వెళ్ళడం యౌవన సంకేతం. 'విద్యున్మాలికలు' రచనలో బలమైన భావాలున్నాయి. శబ్దంనుంచి వేరు చేసినా ఆ భావాలు కవితామయాలే. శబ్దం వాటికి సుందరాకారాన్ని ఇచ్చింది.

గ్రాంథిక వచనపద్యం

'విద్యున్మాలిక'లను భావకవిత్వంయొక్క అవసానదశకూ అభ్యుదయకవిత్వంయొక్క ఆరంభదశకూ సంధ్యవస్థలో రచించాడు. దృక్పథాన్నీ శబ్దజాలాన్నీ ఛందోవిధానాన్నీ మార్చుకుంటున్నాడు.

తన ఛందోయాత్రలో సరికొత్తమజిలీగా 'విద్యున్మాలిక'లను భావించాడు. సొంతగొంతుకోసం పలికిన స్వతంత్రచ్ఛందస్సు ఇందులోనిది. భాష గ్రాంథికమే అయినా ఛందస్సు ఏ సంప్రదాయానికీ పూర్తిగా చెందదు. అయితే ఇందులోనే అన్నిసంప్రదాయాల ముద్రలూ లేకపోలేదు. సంప్రదాయాల్ని ఎరువుగా వాడుకుంటూ కొత్తజాతి ఛందోలతను పెంచుతున్నాడు. దీన్ని గ్రాంథికవచనపద్యం[2] అని చెప్పవచ్చు. ఇందులో పాదాల విభజన చేశాడుగాని పాదసంఖ్యానియతి పెట్టుకోలేదు. నిర్దిష్టమైన ఛందస్సును తీసుకోలేదుగానీ లయాత్మకవాక్యరచనలో పోల్చుకోలేని చందశ్శకలాలను వాడటం మానలేదు. కొన్ని వృత్తగంధిపాదాలను రాస్తున్నాడు. మచ్చుకి-

---

2 'ఆకాశదీపం' వ్యావహారిక వచనకవిపద్యం.

(1) తీరిన మబ్బుగుబ్బలుల దారుల (ఉత్పలమాల)

(2) దారి తప్పిచరించె ఆ రేయి తరళ (తేటగీతి)

(3) ఆరేయి తరళ సరళేరమ్మదములు (ద్విపదగతి)

పై మూడురకాల పాదాలను ఇముడ్చుకున్న వచనపద్యం ఇది.

బారులు బారులుగ తీరిన
మబ్బుగుబ్బలుల దారుల
దారితప్పి చరించె
ఆరేయి తరళసరళేరమ్మదములు.

ఈ నాలుగు పాదాలనూ అక్షరగణాలుగా విభజిస్తే దీనినొక విషమవృత్తంగా స్వీకరించవచ్చు. మాత్రాగణాలుగా విభజిస్తే గురికి బారెడుదూరంగానైనా చతురస్రగతి స్పష్టంగా కనిపిస్తుంది. మార్గ, దేశి చ్ఛందస్సులలో చేసిన నిరంతరమైన కసరత్తువల్ల రెండింటి సమ్మేళనంతోనే వచనపద్యం సృష్టిస్తున్నాడు. ఇది అపూర్వమైన ప్రయోగం! ఇంకా కొన్ని ఉదాహరణాలు.

(1) పొడిచి ఓరగా కోకిలపాట జీర (తేటగీతి)

(2) తాకితాకనటుల తరలిపోయి (ఆటవెలది)

(3) తీరుగా కవిడెందమున తాకితాకనటు (ఖండగీతి)

(4) భారంపుసిగ్గు తడియారకనుడిలో విడుదలవడజాలక (చతురస్రగతి)

(5) నవయుచుండియునవ్వు వెల్లువ (ముత్యాలసరం)

(6) యామినీ వినీలగేహ దేహళీ (త్రిస్రగతి)

(7) ......విష్ణుక్రాంత నితాంతతోరణము (శార్దూలారంభం)

(8) దిక్కుల కంపిన దీనంపు నూడ్కులే (సీసం)

ఈవిధంగా ఇంత ఛందోవిధేయంగా రాసుకుంటూ వెడుతున్నాడు.3 ఈ అన్వేషణయే 'వచన పద్యం'లో ఫలిస్తుంది.

---

3 1943 ఫిబ్రవరి భారతిలో 'నేటికవిత్వం' అనే ఒక వ్యాసంలో ఇలా రాశారు శ్రీ సుందరాచారి: 'విశృంఖలమార్గంలో నడిచే కవిత్వం అపరిచితమైన ఏవో ఒక ఆవేశాన్ని, ఆనందాన్నీ కలిగిస్తుంది. రాగానికిరాకున్నా లయలేకున్నా. సంప్రదాయరహితమైనా కవితాహృదయం మాత్రం ఇందులో పొంగిపొరుతుంది. దీన్నే గ్రావ్యంగా ఛందోబద్ధకవిత్వానికి ఎంతమాత్రం తీసిపోని ధోరణిలో వ్రాయ గలిగిన అవకాశాలున్నాయని శ్రీరంగం శ్రీనివాసరావుగారు విద్యున్మాలికలలో నిరూపించారు.

నా గుహలో కుటిలో చీకటిలో
ఒక్కడనై ప్రుక్కిన రోజులు లేవా ?

1928 ఏప్రిల్ నుంచి 1933 మార్చివరకూ ఐదేళ్లు గడిచిపోయాయి. కవిజీవితంలో 23వ ఏడు వచ్చింది. ఈ ఐదేళ్ళ కాలంలో అన్వేషణ మానలేదు. అభ్యాసం నిరంతరంగా సాగిస్తున్నాడు. గతం గొప్పదిగా భావించినవాడికి గతం తిరిగిరాదనే వివేకం కలిగింది. భవిష్యత్తుమీద ఆశ ఏర్పడింది. కరుణబీభత్సాలవైపు మళ్ళింది చూపు. పద్యాలు రాసి రాసి విసుగెత్తి కొత్త బాణీల కోసం వెదుకుతూ వచనపద్యం దగ్గరకు వచ్చాడు. ఒక విధంగా అభినవకవితాప్రస్థానానికి అన్వేషణ ఇక్కడే ఒక ఫలితాన్ని సాధించింది.

'అహర్ముఖం' (1928) నుంచి బయలుదేరి ఎన్నో రాత్రులు ఎన్నో కలల విచిత్రాలను ప్రకృతిలో నింగిలో నేలలో చూసి భావనాబలంతో వాటిని వర్ణించిన ఆత్మాశ్రయకవి ఒక అర్ధరాత్రి 'విద్యున్మాలికలు' (1933) దగ్గర వస్త్వాశ్రయకవిగా రూపాంతరం పొందుతూ దృక్పథం మార్చుకున్నాడు. సంవిధానాలను సమ్మేళనంచేస్తూ ప్రయోగాలు ప్రారంభించాడు. పదచిత్రాల నిర్మాణంలో చేయి బాగా తిరిగింది. ఈ ప్రయోగాలకు ముందున్న కృషిని సంవత్సరానుక్రమంలో మరొకమారు సూత్రప్రాయంగా ఈ ప్రకరణంలో ప్రతిపాదిస్తాను.

## 1928 (2)

శ్రీనివాసరావు కవితాజీవితంలో రెండవదశ 1928లోనే మొదలయింది. ఈ దశారంభం లోని అతని కవితల్లో గతకాలంమీద అభిమానం, ఆర్షసంస్కృతి మీద భక్తి, సమకాలంమీద అసంతృప్తి, పురాణసంప్రదాయాలమీద అనురక్తి, కవితాతత్త్వమీమాంస, జీవితద్వంద్వ విచారం, ప్రాచీనవైభవభావన స్పష్టంగా కనిపిస్తున్నాయి. వీటిని వ్యక్తంచేయడానికి ఆత్మాశ్రయ సంవిధానాలను వదలలేదు. నూతనరీతులకోసం వెదుక్కోవడం మాననూ లేదు. జాతీయవాదం కవి నావేశించింది.

ఈ సంవత్సరంలోనే అతడు స్వీయకవితావిమర్శకు పూనుకున్నాడు. ప్రబంధాలతో పాటు ఆంగ్లకాల్పనికకావ్యాలను కూడా బాగా చదువుకున్న రోజులివి.

1929

1929 ఏప్రిల్‌లో రచించబడిన 'సుప్తాస్థికలు' ఈ కవి దృక్పథంలో గొప్ప మలుపును చూపిస్తోంది. గతమంతా ఒక దీర్ఘ రాత్రిగా కనిపించింది. ఆ నిశాశ్మశానశయ్యకు ప్రాతః ప్రసక్తి లేదని తెలుసుకున్నాడు. "One of my best poems" అని కవియే సంతృప్తి పడిన మొదటి కవిత ఇదే. ఇందులో కృష్ణశాస్త్రీయ శైలి పరిపక్వత నందుకుంది. కాల్పనికత, వాస్తవికత, సాంస్కృతికత-మూడూ ముడివడ్డాయి.

భవిష్యత్తును గురించి కలలు కనడం 1929 సెప్టెంబరులో రచించిన 'భావిదృష్టి'లో కనిపిస్తుంది. కానీ ఇదంతా భావకవితాధోరణిలో ఒక స్వప్నకథ. వాస్తవదూరం.

1930

ఇంతలోనే స్వేచ్ఛావిహంగమైన భగవంతుడు తన మనోనందనంలో దిగుతాడని భావిస్తూ మరో మార్మికగీతం అల్లుకున్నాడు.

నాలుగేసి వృత్తాలతో ఖండికలు రచించడం అనే ప్రక్రియ మొదలుపెట్టాడు. ఇది సాగుతూ ఉండగానే మాత్రాచ్ఛందస్సులో 'హారతి' అనే శృంగారగీతం రచించాడు. వీటన్నింటిలో తన శైలికి సానలు పెట్టుకోవడం లక్ష్యంగా కనిపిస్తుంది.

'వేణుగానము' అనే ఖండికలో మహాకవుల శిల్పమర్మాలను ఆవిష్కరించడానికి సాహిత్య వ్యాయామాలు చేశాడు.

1931

ఇంతలో వెనకటి ప్రకృతిసౌందర్యసందర్శనపారవశ్యం కవితావస్తువవుతుంది. ఈ ఖండికలలో ఒంటరితనం, సౌందర్యపిపాస, స్వేచ్ఛాభిలాష వంటి భావకవితాధోరణులు ప్రతిధ్వనించాయి. 'మూగతలపులు' అనే ఖండికలో పతితజనోద్ధరణాభిలాష ప్రకృతిభావచిత్రాలలో నుంచి తొంగిచూస్తుంది. ఇది ఈదశలో రెండవమలుపు.

## 1932

ఈ దశలో కవి పనితనం పెరుగుతూ వస్తోంది. 1929లో మొదలుపెట్టి 1932 వరకూ మూడేళ్ళలో మూడు సార్లు మార్చిమార్చి తుది మెరుగులు దిద్దిన కవిత 'ఖండశశి'. ఇది మూడవమలుపు. ఆంగ్లంలోని సానెట్ పద్ధతి గీతమిది. స్వీయజీవితకష్టాలలో చవితి చందమామను చూసి లోకాన్నిచూడగా లోకమంతా భయంకరంగా కనిపించింది. ఇందులో కవిఊహాచిత్రాలపూర్వాలు. భావకవిత్వంనుంచి వాస్తవికధోరణిలోకి దిగి వస్తున్న ఘట్టమిది. 'దివ్యానుభూతి' ఖండికలో ప్రతీకధోరణి కనిపిస్తుంది. ఒక మృత్యువునుంచి కవి తప్పించుకున్న స్వప్నవృత్తాంతమిది.

## 1933 (1)

రెండవదశలోని చివరి ఘట్టం 'విద్యున్మాలికలు' రచన. ఇది వస్తుసంవిధానాలలో సరికొత్త ప్రయోగం. శృంగారంనుంచి కరుణం వైపుకు కవి దృక్పథం ఎలా పరివర్తితమయిందో వ్యక్తం చేయబడింది. లయకు, శ్రుతికి, గతికి, ప్రాసకు, యతికి ప్రాధాన్యమిస్తూ ఆవేశం తనను లాగుకొనిపోయిన పంథాలోనే సంయమనం కోల్పోకుండా సహజసుందరధోరణిలో రచింపబడిన ఈ ఖండిక ఆధునికకవితా సంవిధానంలో నూతనగవాక్షం తెరిచింది. పద్యాలను సన్యసించింది ఈ యేడే.

శబ్దం నుంచి అర్థానికి పరుగెత్తే శైశవచిహ్నాలను వదిలించుకుని, భావం నుంచి శబ్దానికి వెళ్ళే యౌవనసంకేతం ధరించాడిక్కడ. తన ఛందోయాత్రలో ఇదొక మజిలీ. అయితే ఇది గ్రాంథికభాషలోనే ఉంది. కాని తెలుగునుడికారంతో ముచ్చటలాడుతున్న కవిత ఇది. అంతేకాదు; మార్గదేశిచ్ఛందస్సుల శకలాలు ఈ స్వేచ్ఛాపద్యంలో చెల్లాచెదురుగా ఉన్నాయి.

ఈ విధంగా ప్రతిభ, అభ్యాసమూ మేళవించబడిన పరివర్ధనదశ ఇది. మహాకవిగా ఉన్మేషించడానికి వ్యుత్పత్తి సమగ్రత కూడా అవసరం. అదే మూడవదశలో సాక్షాత్కరించింది.

# శ్రీశ్రీకి చెలం యోగ్యతాపత్రం

— "తనకీ ప్రపంచానికీ సామరస్యం కుదిరించడానికా కవి చేసే అంతర్బహిర్యుద్ధారావమే కవిత్వం.

— నెత్తురూ కన్నీళ్లూ తడిపి కొత్త tonic తయారుచేశాడు శ్రీశ్రీ యీ వృద్ధప్రపంచానికి!

— హృదయం ఎల్లా కంపిస్తే ఆ కంపనకి మాటలరూపాన్ని యివ్వడం అతనికే తెలుసు! మాటల్ని కత్తులూ యీటెలూ మంటలుగా మార్చడం అతనికే చాతనవును.

— పద్యాలు చదువుతోవుంటే ఇవి మాటలు కావు, అక్షరాలు కావు–ఉద్రేకాలు, బాధలు, యుద్ధాలు-అతని హృదయంలోంచి మన హృదయంలోకి directగా పంపిన ఉత్సాహాలు, నెత్తురుకాలవలనిపిస్తుంది. ఎందుకంటే-క్రిష్ణశాస్త్రి తన బాధని అందరిలోనూ పలికిస్తే శ్రీశ్రీ అందరి బాధనూ తనలో పలికిస్తాడు. క్రిష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపుబాధ అంతా శ్రీశ్రీ బాధ.

— ఈ నాటి కవిత్వమంతా ఏమిటి? ఎందుకు వుంది? ఏం చేస్తోంది? అని దిక్కరించి అడిగే తెలుగుప్రజకు శ్రీశ్రీ కవిత్వం ప్రత్యుత్తరం. కొద్దిరోజుల్లో నేడు విర్రవీగే కవులు ప్రతివొక్కరూ శ్రీశ్రీ నీడకింద నించుని తమ ఉనికిని సమర్థించుకోవలసిన గతి వొస్తుంది.

— పాతపదాలు, డిక్షన్, వర్ణనలు, అలంకారాలు, ఛందస్సు, ఉపమానాలు, పద్ధతులు, ఆచారాలు, కవిత్వంలోవీ జీవితంలోవీ ఇంక మళ్లీ లేవకుండా వాటి నడ్డి విరక్కొట్టాడు శ్రీశ్రీ.

— ఈ విధ్వంసం అనంతరం నవప్రపంచనిర్మాణకర్తల ఉత్సాహంతో కంఠం కలిపి పాడుతున్నాడు శ్రీశ్రీ.

— ఏ లోకంలో అన్యాయాలు, అధికారాలు, ఏడుపులు, హోమాలు, యాచకాలు, క్షుద్ర కవిత్వాలు, శిక్షలు, Scandals లేవో ఆ లోకాన్ని dream చేస్తున్నాడు ఈ కవి.

— ఇంకా రాత్రి చీకట్లో లోకం నిద్రలో భయంకరస్వప్నాలు కంటో దీనంగా పలవరించే సమయాన ఉషాగమనాన్ని గుర్తించి స్వాగతమిచ్చే వైతాళికుడు శ్రీశ్రీ.

— రాబందుల రెక్కలచప్పుడు, పయోధరప్రచండఘోషం, ఝంఝానిల షడ్జధ్వానం విని తట్టుకోగల చావ వుంటే ఈ పుస్తకం తెరవండి!"

1940 జూలై 17

ఎగిరి ఎగిరి ఎగిరి పడుతున్నవి ఎనభై లక్షల మేరువులు!
తిరిగి తిరిగి తిరిగి సముద్రాల్ జలప్రళయనాట్యం చేస్తున్నవి!

1933 జూన్ 2వ తేదీ_తెలుగుకవిత్వంలో ఒక ముఖ్యమైన తేదీ-ఆధునిక కవిత్వం మలుపు తిరిగిన రోజు_అభ్యుదయకవితాయుగానికి 'జయభేరి' మ్రోగిన శుభదినం_ఆనాడే శ్రీరంగం శ్రీనివాసరావు కుబుసంవిడిచి 'శ్రీశ్రీ'గా మారాడు! ఆరోజే శ్రీశ్రీ కవిత్వంలో నూతన వస్తువూ నూతనసంవిధానమూ మారుమ్రోగాయి. 'పాతరాతియుగం'లోంచి మరోప్రపంచంలోకి ప్రవేశించాడు శ్రీశ్రీ. తన సొంతగొంతును తాను విన్నాడు. పాతదారులు వదిలి కొత్తదారి కనిపెట్టాడు.

భువనభవనపు బావుటా

కొంపెల్ల జనార్దనరావు సంపాదకుడుగా 'ఉదయిని' మొదలయింది 1934లో. అందులోనే శ్రీశ్రీ కొత్తకవిత_'జయభేరి' అచ్చయింది. గతచరిత్ర అవగాహన, వర్తమానదుఃస్థితుల విశ్లేషణ, భవిష్యద్విశ్వాసం 'జయభేరి'కి ఊపిరి. ముత్యాలసరం, వ్యావహారికభాష, నిర్మాణమార్మికత 'జయభేరి' రూపరేఖలు. మానవత, మార్క్సిజం, వాస్తవికత 'జయభేరి'కి ప్రతిధ్వనులు.

రోచిర్నివహం

వాస్తవికతలో వాడుకభాషలో ముత్యాలసరంలో ఆధునికులకు అనేకవిధాలుగా గురజాడ మార్గదర్శి అయినా ఆయన మార్గాన్ని నండూరి, బసవరాజు, దీక్షితులు, కవికొండల వంటివారు అప్పటికి కొందరే అనుసరిస్తున్నారు. తక్కినవారు భావకవులుగానే మిగిలిపోతున్నారు. గిడుగు వ్యావహారికభాషకోసం ఉద్యమం నడుపుతున్నాడు. శిష్ట్లా ఉమామహేశ, ముద్దుకృష్ణ వంటివారు పాశ్చాత్యరచనారీతులను అనుకరించి వచనపద్యంకోసం ప్రయోగాలు చేస్తున్నారు. చలం వచనంలో కొత్తశైలిని నిర్మిస్తున్నాడు. అబ్బూరి ఛందశ్శాస్త్రంలోని మారుమూలవృత్తాలకు సంస్కరణలుచేస్తూ ప్రయోగిస్తున్నాడు. మాత్రాచ్ఛందస్సులెన్నో జానపదసాహిత్యంలో కానవస్తున్నాయి. విశ్వనాథ కిన్నెరసానిపాటల్లో కోకిలమ్మపెళ్ళిలో వాటి అందాలు చూపిస్తున్నాడు. నండూరి ఎంకిపాటల్లో యాస, కాకువు ప్రయోగింపబడుతున్నాయి. దువ్వూరి రామిరెడ్డి, బసవరాజు అప్పారావుగార్ల గేయభాషలో వేగం, లయ అపూర్వంగా ఉన్నాయి. నజురుల్ ఇస్లాం, హరీంద్రనాథఛటోపాధ్యాయ గీతాలలో విప్లవజ్వాలలు లేస్తున్నాయి. బర్న్స్, బ్లాక్ మొదలైనవారి కవితల్లో

అపూర్వత కనిపిస్తోంది. బాద్లెయిర్ మొదలైన సింబాలిస్టుకవులూ ఎజ్రాపౌండు మొదలైన ఇమేజిస్టు కవులూ తెలుగుకవులకు చాలా దూరంలోనూ తన అవగాహనకు సన్నిహితంగానూ ఉన్నారు. అమెరికన్ కవి ఎడ్గార్ అల్లెన్ పో శబ్దక్రీడలు తనను ముగ్ధుణ్ని చేస్తున్నాయి. మరోప్రక్క వేమన రచనాసౌలభ్యం. సమాజ విమర్శ తనను ఆకర్షిస్తున్నాయి. ఇన్ని కాంతులు తనచుట్టూ ఒక్కసారిగా మూగి మిరుమిట్లు గొల్పుతున్నాయి. వీరందరూ తనకు మార్గదర్శకులే! నూతన కవిత్వానికి శ్రీకారం చుట్టాడు ఈ కోలాహలంలోనే శ్రీశ్రీ.

## ఆకాశదీపం

1934 మార్చి 7వ తేదీ—వ్యావహారిక భాషలో శ్రీశ్రీ మొట్టమొదటిసారిగా ఆకాశదీపం అనే వచనపద్యాన్ని రాశాడు. సంజ్ఞావాదకవుల సంవిధానాలనూ పదచిత్ర వాదకవుల సంవిధానాలనూ ఒక్కసారిగా తెలుగు కవితలో దింపివేశాడు. 1934 డిసెంబరు భారతిలో వచ్చింది 'ఆకాశదీపం'.

## మహాప్రస్థానం

1934 ఏప్రిల్ 12వ తేదీ—కవిత్వానికి వస్తువూ సంవిధానమూ (Content & Technique) మాత్రమే గాక దృక్పథం (Outlook) అనే మరోఅంశం అన్నిటికన్నా ముఖ్యం అని నిరూపించిన 'మహాప్రస్థానం' గీతాన్ని శ్రీశ్రీ రచించిన రోజు! 1934లో కాకినాడలో జరిగిన ఆంధ్రరాష్ట్ర యువజనసంఘసభలో శ్రీశ్రీ ఈ గేయాన్ని చదివి వినిపించాడు. ఈ గేయాన్ని రచించినప్పుడే విశాఖపట్నం టర్నర్‌చౌల్ట్రీలో అడవి బాపిరాజుగారికి చదివి వినిపించాడట శ్రీశ్రీ. ఈ గీతాన్ని ప్రచురించిన ఘనత ముద్దుకృష్ణగారికే దక్కింది. ఇది 1935 జనవరి 16న 'జ్వాల'లో పడింది. సమాజాన్ని ముందుకు నడిపించడమే నవ్యసృక్పథం. సామ్యవాదంవైపు ఈ ప్రస్థానం. ఈ దృక్పథాన్నీ వస్తువునీ సంవిధానాన్నీ ఒకటిగా– అవిభాజ్యంగా రూపొందించుకుని శ్రీశ్రీ 'మహాకవి' అయిపోయాడు. మహాప్రస్థానం అనే గీతమే శ్రీశ్రీ Magnum Opus కావ్యానికి మకుటగీతం. ఈ గీతంలోనే సామ్యవాదవిప్లవనాయకుడుగా కవి అందరినీ పిలుస్తాడు. కవిత్వంలోని అనేకాంశాలకు సమత్వాన్ని సాధించడం కోసం శ్రీశ్రీ అద్భుతంగా కృషిచేశాడు. ఈ కృషికి నిలువుటద్దమే "మహాప్రస్థానం మొదలైన గీతాలు".

## పద్మవ్యూహం

1934 ఏప్రిల్ 14—నవ్య కవిత్వానికి సూత్రాలను (బుక్కులను) నిర్దేశించాడు శ్రీశ్రీ. ఆరోజే పురాణప్రతీకలతో సామ్యవాద విప్లవాన్ని సూచించాడు 'అవతారం' అనే ఖండిక ద్వారా. ఈ ప్రతీకల్ని 'జగన్నాథుని రథచక్రాలు' (1940) వరకూ వదిలిపెట్టలేదు శ్రీశ్రీ. విశ్వనాథవారి కిన్నెరసానిపాటలనూ కోకిలమ్మ పెళ్ళినీ శ్రీశ్రీ సమీక్షించింది 1934 డిసెంబరులోనే.

## నాడులమీదుగా విద్యుచ్ఛక్తి

దేశదేశాల రచయితల్నీ కవుల్నీ ఇంగ్లభాషద్వారా చదువుకుంటున్న శ్రీశ్రీ వారి సంవిధానాలనూ ఇజాలనూ తనలో జీర్ణించుకుని, తన కవిత్వానికి నూతనతేజస్సునూ ఓజస్సునూ కూర్చుకోవడంలో 1935 జనవరి నాటికే సమకాలికులైన తెలుగుకవు లందరికన్నా ముందున్నాడు. 1935 జనవరి 'ప్రబుద్ధాంధ్ర'లో శ్రీశ్రీ ప్రచురించిన 'ఒక సంభాషణ శకలము' ఇందుకు నిదర్శనం. శ్రీశ్రీ కావ్యజీవితాన్ని ప్రోదిచేసి, ఆదర్శాలను మలచిన ప్రముఖులు ముగ్గురు. Charles Baudelaire, Guy De Maupassant, Edgar Allen Poe. వీరిని ముగ్గురినీ తన ఋషులుగా భావించాడు శ్రీశ్రీ. షేక్స్‌పియర్, షెల్లీ, కాళిదాసు, తిక్కన, శ్రీనాథుడు తాను అభిమానించే కవులు మాత్రమేనట! స్విన్‌బర్న్ తనకు గురుతుల్యుడు. గద్యం రాసిన 'చపాసా' తన మహాకవి.

## ముత్యాలసరం సత్యాలు

గురజాడవారి ముత్యాలసరం స్వరూపస్వభావాలనూ ఆ ఛందస్సును అనుసరించిన ఆధునికుల పోకడలనూ ఆకళించుకుంటూ ఒక పరిశోధనవ్యాసం రాశాడు శ్రీ శ్రీ. 'ముత్యాలసరం—ఒకకృషి' అనే ఈ వ్యాసం 1935 ఫిబ్రవరి 'ఉదయిని'లో వచ్చింది. వ్యాఖ్యాతగా, విమర్శకుడుగా, లాక్షణికుడుగా, ప్రయోగదక్షుడుగా మారాడు శ్రీశ్రీ. ముత్యాలసరం పాదానికి 14 మాత్రలు. ఇందులో ఎన్నోగతులను చూపించవచ్చునని గ్రహించాడు శ్రీశ్రీ. కవిత్వానికీ సంవిధానానికీ ఎలాంటి సమత ఉండాలో నిరూపించాడు. వాడుకభాషను కవిత్వంలోకి ప్రవేశ పెట్టాడు.

## మోహినీగంధర్వగానం

స్విన్‌బర్న్ కవిత్వం నాట్యసంగీతకవిత్వాల సమ్మేళనం. అతని భావాలూ విప్లవాత్మకాలే. స్విన్‌బర్న్ కవిత్వం చదివి కదిలిపోయాడు; కరిగిపోయాడు శ్రీశ్రీ. 1936 జూన్ 'వీణ'పత్రికలో ప్రచురించిన 'స్విన్‌బర్న్ కవికి' అనేప్రశంసాగేయం అందుకు నిదర్శనం. అంతేకాదు; ఆయేడే స్విన్‌బర్న్ రచించిన The Match అనే గేయాన్ని 'అద్వైతం'గా అనుసృజించాడు శ్రీశ్రీ. ఈ సంవత్సరంలోనే కాకినాడ నవ్యసాహిత్యపరిషత్తుకి హాజరయ్యాడు. పాటిబండ మాధవశర్మ స్థాపించిన 'వీణ' పత్రికకు 'శ్రుతులు' రచించి యిచ్చాడు.

## విప్లవశంఖం

1937 మే 7—సామ్యవాదవిప్లవంలో పీడితజనపక్షం వహించి తన కవిత్వం కార్మికులకూ శ్రామికులకూ అంకితం చేస్తానంటూ విప్లవశంఖం పూరిస్తూ 'ప్రతిజ్ఞ' రచించిన తేదీ! శ్రీశ్రీ ఈ

'ప్రతిజ్ఞ' రాయడానికి ముందు 'వాడు, వ్యత్యాసం, మిథ్యావాది' రచించాడు. ఇవన్నీ సామ్యవాద విప్లవదృక్పథంతో రాసినవే. అబ్బూరి రామకృష్ణారావుగారి ద్వారా ఆంధ్రవిశ్వవిద్యాలయ గ్రంథాలయంలో లండన్ రచయితల మేనిఫెస్టో శ్రీశ్రీకి లభించగానే మార్క్సిస్టు సాహిత్యదృక్పథం బాగా అర్థమయింది. ఆ సంస్కారంతోనే ఈ ఖండికలు రాశాడు. కవితాప్రయోజనం స్పష్ట పరుచుకున్నాడు. Applied Poetry అనే సిద్ధాంతం ఆనాటిదే కావచ్చు. అయితే దీన్ని నిర్వ చించినదిమాత్రం 1947లో. రసానందాన్నీ సమాజాభ్యుదయాన్నీ తుల్యప్రయోజనాలుగా భావించడమే 'వ్యవహారకవిత్వం'. పెట్టుబడిదారీవ్యవస్థను వ్యతిరేకించడంతో కవితామార్గం మారిపోయింది. కవితకు ప్రచారధోరణీ, పార్టీసాహిత్యలక్షణాలు, సిద్ధాంతప్రతిపాదన వచ్చినా రసోద్రేకస్థాయిని విడిచిపెట్టకపోవడమే శ్రీశ్రీ ప్రతిభకు గీటురాయి అయింది.

Revolution in writing (1935) అనే గ్రంథంలో C. DAY LEWIS మాటలు వినండి : "A good poem ........enters deep into the stronghold of our emotions, if it is written by a good revolutionary, it is bound to have a revolutionary effect on our emotions, and therefore to be essentially-though not formally - propaganda."

### వికసించిన విద్యుత్తేజం

1937 ఆగస్టు 3—శ్రీశ్రీ 'నవకవిత' రచించిన తేదీ! అయితే ఇంతకు ముందే 'కవితా ఓ కవితా' కూడా రచించాడు. భావకవిత్వాన్నీ, గ్రాంథికభాషనీ, పాతసంప్రదాయాలనూ విడిచి ఎన్ని యోజనాలు ముందుకు సాగివచ్చిందీ ఈ రెండు ఖండికలూ చదివితే తెలుస్తుంది తన కవితాదృక్పథంలోని పరిణామవికాసాలనూ తన నూతన కవితాదర్శనాన్నీ 'కవితా ఓ కవితా'లో వివరిస్తూ లక్ష్యలక్షణాలను రెండింటినీ ఏకత్ర ప్రదర్శించాడు. పారిశ్రామికనాగరికతవల్ల ఉత్పన్న మైన నవకవితాసామగ్రిని ప్రతీకలతోనూ పదచిత్రాలతోనూ కూడా వ్యక్తంచేశాడు. పాశ్చాత్య దేశాల్లో 19వ శతాబ్దినుంచీ మొదలైన ఇజాలనన్నింటినీ కూలంకషంగా అవగాహన చేసుకుని వాటిని సామ్యవాద సాహిత్యమార్గంలోకి లాగుకుని వాడుకోవడంలో శ్రీశ్రీ ప్రతిభ అద్వితీయంగా కనిపిస్తుంది. శ్రీశ్రీ ఇప్పుడు కవితాశిఖరం చేరుకున్నాడు. చలంగారితో శ్రీశ్రీ పరిచయం 1937 లోనే మొదలయింది. 37 జూన్‌లో కొంపెల్ల మరణించాడు. 37 నవంబరులో శ్రీశ్రీ 'విశ్వం ప్రేమగీతాల'ను పరామర్శించిన తీరు అపూర్వం.

### ఇతిహాసపుచీకటికోణం

1938 ఏప్రిల్ 19_'దేశచరిత్రలు' రచించిన తేదీ! చారిత్రక భౌతికవాదం తన వ్యుత్పత్తికి వన్నె పెట్టగా శ్రీశ్రీ చారిత్రక విమర్శకుడైన మహాకవిగా మారిపోయిన రోజు! చరిత్రను సశాస్త్రీ యంగా అధ్యయనం చేయడం మార్క్సిజంలోని ఒక అంశం. నేటివరకూ వెలువడిన దేశచరిత్రలను

సవాలుచేస్తూ వాటిని మార్చవలసిందిగా ఆదేశిస్తాడు శ్రీశ్రీ. అనుష్టుప్పులోని అక్షరపరిమితీ ముత్యాలసరంలోని 14 మాత్రలూ కలిసిపోయి 'దేశచరిత్రలు'లో ఒక సులభగతి ఛందోవిశేషం ఏర్పడింది. తెలుగులో 'సంస్కృతశ్లోకాలు' అవతరించాయి.

చారిత్రకావగాహనే 'జ్వాలాతోరణం, మానవుడా' వంటి ఖండికల రచనకు పునాది.

### సంవర్తభయంకర ఝంఝూపవనం

1937 జూన్‌లో చనిపోయిన తన ప్రియమిత్రుడు కొంపెల్ల జనార్దనరావును గురించి విలపిస్తూ 1938లో శ్రీశ్రీ రాసిన గీతం అంకితగీతం; అదే స్మృతిగీతం. హద్దులేని విషాదవాతావరణాన్ని భావచిత్రాలలో వచనగేయంగా రూపుకట్టించాడు శ్రీశ్రీ. వచనగేయానికింతకన్నా విశిష్టలక్ష్యం శ్రీశ్రీలోనే లేదు. సమకాలిక సాహిత్య-సమాజస్వరూపానికీ ఆత్మచరిత్రకూ అద్దం పట్టిన ఈ కవిత ఒక మహాకావ్యం !

### సంధ్యాసమస్యలు

1939 జూన్ 20—'కేక' రచించిన తేదీ ఇది ! దీనికి ముందుగా 'దేనికోసం'? 'సంధ్యాసమస్యలు' అనే మరో రెండు కవితలు రాశాడు శ్రీశ్రీ. వాటి తేదీలు లేవు. ఆంధ్రప్రభలో ఉద్యోగానికై మద్రాసుకు 1938 లోనే తిరిగి చేరుకున్నాడు శ్రీశ్రీ. ప్రపంచయుద్ధచ్ఛాయలు ప్రసరిస్తున్నాయి. అధివాస్తవికత ఆకర్షిస్తోంది శ్రీశ్రీని. వాస్తవికతను వదలలేడు శ్రీశ్రీ. 'సంధ్యాసమస్యలు' మద్రాసునగరంలోని బూర్జువా సమాజాన్ని చిత్రించే విచిత్రకావ్యకథానిక ! బెల్జియం కవి వెర్‌హేరన్ Les Pauvres అనే గీతానికి 'పేదలు' అనే పేర అనువాదం చేశాడు శ్రీశ్రీ. ఈ సంవత్సరంలోనే శ్రీశ్రీ 'నేటి తెనుగుకవిత' కొత్తపోకడలు' అనే అమూల్యవ్యాసం రాశాడు. 'ఫిడేలు రాగాల డజన్'కు ఇంట్రో రాశాడు.

### నటధూర్జటి నిటాలాక్షి

1939 సెప్టెంబరు 1—రెండో ప్రపంచయుద్ధం మొదలయింది. ఇది సామ్యవాద విప్లవానికి కూడా దారి తీస్తుందని శ్రీశ్రీ ఆశించాడు. తననే ఆ విప్లవానికి నాయకుడుగా భావించుకుంటూ పీడితులకు అభయహస్తం చూపించి ఓదారుస్తూ 1940లో 'జగన్నాథుని రథచక్రాలు' రచించాడు. ఛందోజగన్నాథుడుగా శ్రీశ్రీ ప్రకాశించాడు.

### చెలం యోగ్యతాపత్రం

1940 జూలై 17-మహాప్రస్థానం గీతాలకు గుడిపాటి వెంకటచలం (చెలం) యోగ్యతాపత్రం రాసిన తేదీ ఇదే! శ్రీశ్రీ కవిత్వానికి చెలంగారే మొట్టమొదటి వ్యాఖ్యాత. ఈ పీఠికకు ప్రేరకుడు జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి. ఈ పీఠిక శ్రీశ్రీని మహాకవిగా విప్లవకారుడుగా ప్రతిష్ఠించింది. శ్రీశ్రీకి 'ప్రతిభ' సంపాదకవర్గంలో సభ్యత్వం లభించింది 40 లోనే.

### సింహగర్జన

1941 జూన్ 22—సామ్యవాద దేశమైన సోవియట్‌రష్యామీద నాజీనియంత హిట్లర్ దాడిచేయగా సోవియట్లు ఆ దాడిని వివమానదళంతో ఎదుర్కొన్న వార్త వెలువడగానే శ్రీశ్రీ ఉత్తేజితుడై 'గర్జించురష్యా'గీతం రాశాడు. ప్రపంచమంతా సామ్యవాదం రావటానికి రష్యా (U. S. S. R.) కృషిచేస్తుందని ఆశించాడు. తాను కలలు కంటున్న మహాప్రస్థానానికి 'గర్జించు రష్యా'యే సరిహద్దు. అదే 'మరోప్రపంచం'. నిజానికి ఈ గీతంతోనే 'మహాప్రస్థానం గీతాలు' ముగించవచ్చు. కాని శ్రీశ్రీ మరో రెండుగీతాలను ఆ కావ్య సంపుటిలో చేర్చాడు. అవి 'నిజంగానే' (1941) 'నీడలు' (1947).

### మద్రాసునుంచి ఢిల్లీ, లక్నో

శ్రీశ్రీకి ఆలిండియా రేడియో ఉద్యోగం రాగా అతడు 1942లో మద్రాసునుంచి కదిలి ఢిల్లీ వెళ్ళిపోయాడు. తనకు కవితావేశం ఇస్తూ వచ్చిన సముద్రానికి దూరం అయిపోయాడు. ఢిల్లీలో కూడా స్థిరపడలేదు. 1943లో ఆర్మీ (Army) లో ఉద్యోగంరాగా అతని మకాం 'లక్నో'కు మారింది. అది శారీరకంగా కూడా తనకు హాయినివ్వలేదు. మలేరియాతో పోరాడవలసివచ్చింది. స్వేచ్ఛ కరువైంది. ఆంధ్రదేశంలో 1943లో ఆంధ్రఅభ్యుదయరచయితల సంఘం ఆవిర్భవించింది. తెనాలిలో మొదటిమహాసభ, బెజవాడలో (1944) రెండవమహాసభ జరిగాయి. శ్రీ శ్రీ మహాప్రస్థానం గీతాలు ఆ రచయితలు శిరసావహించారు. గళాన ధరించారు. అభ్యుదయరచయితలకు ఆ గీతాలు వేదాలయ్యాయి. ఉపనిషత్తులయ్యాయి. శ్రీశ్రీ నవ్యకవిత్వానికి 'అభ్యుదయకవిత్వం' అనే రూఢి ఏర్పడింది. శ్రీశ్రీ అభ్యుదయకవిత్వానికి ఆదికవి; పితామహుడు; మార్గదర్శి; 'మహర్షి' అయ్యాడు. అతడ్ని యుగకర్తగా గౌరవించారు, అనుసరించారు, అనుకరించారు; ఆరాధించారు. 'శ్రీ శ్రీ యుగం' మొదలయింది.

### సంపెంగతోట

ఆర్మీని వదిలి 1944లో విశాఖపట్నం చేరుకుని అబ్బూరి రామకృష్ణారావుగారు నడుపుతున్న 'నటాలి' నాటకసమాజంలో స్క్రిప్టురచయితగా చేరాడు. Anton Chekov రచించిన 'The Cherry Orchard'కు 'సంపెంగతోట' అనే పేర అనువాదం ఆనాటిదే!

### అశాంతి-అధివాస్తవికత

1945లో తిరిగి మద్రాసు చేరుకున్నాడు శ్రీ శ్రీ. తెలుగు పత్రికల మధ్యపడ్డాడు. ఆనంద వాణి, ఢంకా వంటి పత్రికలకు రచనలందించాడు. 'వారం వారం' వ్యాసాలు, ఇతర లఘువ్యాసాలు ఆ రోజుల్లో రాసినవే. 1945లోనే శ్రీ శ్రీ తండ్రి వెంకటరమణయ్య మరణించాడు. ఇదీ

'అశాంతి'కి కారణమయింది. దేశంలో నవ్యసాహిత్యపరిషత్తు కొడిగడుతున్న రోజులవి. 1945 డిసెంబరు 31న రాజమండ్రిలో అభ్యుదయరచయితల తృతీయమహాసభకు శ్రీశ్రీ అధ్యక్షతవహించి, ప్రారంభోపన్యాసం చేశాడు. అభ్యుదయకవిత్వం కన్నా తాను ముందంజలు వేయడానికి మొదలు పెట్టాడు. ప్రపంచయుద్ధం ఆరంభమైన తొలిరోజుల్లోనే తాను ఫ్రాయిడ్ ప్రభావంతో ఫ్రెంచి సర్రియలిస్టుల వాసనలతో అధివాస్తవిక సంవిధానాన్ని ఆకళించుకున్నాడు. 1930లలోనే తొలిసారిగా ఫ్రెంచి సర్రియలిస్టుల కవితలు ఆంగ్లంలోకి అనువదించబడ్డాయి. 1935 లో A Short History of Surrealismను DAVID GASCOYNE రచించి ప్రచురించాడు. 1936లో Surrealist Exhibition జరిగింది. శ్రీశ్రీ వీటి నన్నింటినీ గమనించాడు. 1940లోనే రుబాయత్, కొంకెకోణాలు వంటివెన్నో రాశాడు. ANDRE BRETON వ్రాసిన Beauty will be convulsive అనే వ్యాసాన్ని 1945లో శ్రీశ్రీ అనువదించాడు-'సంక్షుబ్ధసౌందర్యం' అనే శీర్షికతో. 'దాలీ' చిత్రాలు గురించి ప్రశంసావ్యాసం వ్రాశాడు. Breton, Elaurd ల 'The Immaculate Conception' ను శ్రీశ్రీ అనువదించింది 1945లోనే. సర్రియలిస్టు సంవిధానం శ్రీశ్రీకి నచ్చింది. ఫ్రెంచి సర్రియలిస్టుల కవితలూ మేనిఫెస్టోలూ అనువదించి ప్రచారం చేశాడు. Paul Eluard, Andre Breton, Apollinaire, Salvadar Dali వంటి అధివాస్తవికుల కవితలు శ్రీశ్రీ ద్వారా తెలుగులోకి వస్తున్నాయి. ఈ కాలంలోనే 'అనంతం' రచనకు పూనుకున్నాడు శ్రీశ్రీ.

### మార్క్స్-ఫ్రాయిడ్

శ్రీశ్రీకి ఒకప్రక్క మార్క్సుమీద గౌరవం; మరోప్రక్క ఫ్రాయిడ్ మీద అభిమానం. నిజానికి మార్క్సిజం, సర్రియలిజం పరస్పర విరుద్ధవాదాలు. సామాజికవాదం మొదటిది; వైయక్తికవాదం రెండోది. అయితే పాశ్చాత్యకవులూ ఈ రెండింటినీ అభిమానించారు ఆరోజుల్లో. ఈ రెండూ ఒకదానికొకటి భంజకాలైనా రెండూ సనాతనుల ఛాందసాభిప్రాయాలమీదా బూర్జువాల మనస్తత్త్వం మీదా తిరుగుబాట్లే కావడం అందుకు కారణం. వ్యక్తిస్వాతంత్ర్యానికి ఫ్రాయిడ్ దారిచూపాడు.

'To some revolutionaries it seemed that, though Marx was God, Freud was his Prophet. Both had iconoclastic effects; both upset the bourgeoisie and laid bare the springs of action. Both explained personal and social motivation in a new way' అంటాడు Robin Skelton అనే సాహిత్యవేత్త 'Poetry of the Thirties' (1964)అనే కవితాసంకలనానికి పీఠికరాస్తూ. శ్రీశ్రీ అంతర్జాతీయదృష్టి ఇక్కడ మనకర్థమవుతుంది. సామాజికమైన కట్టుబాట్లను శ్రీశ్రీ అవహేళన చేయనారంభించాడు.

### విదూషకత్వం

సమాజానికి నాయకుడుగా 'జగన్నాథుని రథచక్రాలు'లో కనిపించిన శ్రీశ్రీయే సమాజంలో అధివాస్తవికవిదూషకుడుగా కూడా కనిపించదల్చుకున్నాడు. ఇందుకు కారణం శ్రామికవర్గానికి వ్యతిరేకత కాదు; పెట్టుబడిదారీ విధానపు సంకెళ్ళకు వ్యతిరేకత! Andre Breton ఇలా అంటాడు:

,'Let it be clearly understood that for us, Surrealists, the interests of thought cannot cease to go hand in hand with the interests of the working class and all armed attacks on it cannot fail to be considered by us as attacks on thought like-wise' (Introduction: Poetry of the Thirties 33 P.) శ్రామికవర్గంమీద జరిగే ఏ హింస అయినా సర్రియలిస్టులు తమ భావ ధారమీద జరిగే ప్రతిక్రియగానే భావించారనడాని కింతకంటె నిదర్శనం ఏం కావాలి ?

## ఖడ్గసృష్టి గీతాలు

రుబాయత్, De-Compositions, విదూషకుని ఆత్మహత్య, టాంటాం, కొంకెకోణాలు, అభిసారికి కడసారి, అధివాస్తవికుల ప్రవేశం, మాటలమూట, మహాకవి ఆశ్చర్యం, మంచి ముత్యాల సరాలు, శ్రీశ్రీ మార్కు పద్యాలనే వాడుకు మొదలైన ఖడ్గసృష్టి గేయాలన్నీ మహా ప్రస్థానం గీతాల రచనా కాలంలోనే 1940-45 మధ్యనే శ్రీశ్రీ రచించాడు. ఇవన్నీ అధివాస్తవిక రచనలే. ఈ కాలంలోనే 'అశాంతినికేతనంగా' తన మనస్సును అభివర్ణించుకుంటున్నాడు. అధివాస్తవికతకు ప్రవక్తగా ప్రయోక్తగా మారాడు. శ్రీశ్రీఅధివాస్తవిక కవితోద్యమాన్ని పరామర్శించేందుకు ఈ గ్రంథంలో చోటులేదు. అయితే మహాప్రస్థానం గీతాలలోని అధివాస్తవికతను ఆయా సందర్భాలలో వివరిస్తాను.

## అధ్యయనం-అనువాదం

1946లో నిజాం నవాబుగారి రిఫార్మ్స్ సెక్రటేరియట్‌లో ఉద్యోగం కోసం ఖాసింఖాన్ సిఫార్సుతో శ్రీశ్రీ హైదరాబాదు చేరుకున్నాడు. ఇంచుమించు ఈ కాలంలోనే సిరిసిరిమువ్వ శతకం రచించాడు. మపాసా, విలియం సారోయాన్, జేమ్సుజాయిస్, ఫ్రాంజ్ కాఫ్కాల వంటి ప్రపంచప్రసిద్ధరచయితలను శ్రీశ్రీ అధ్యయనం చేశాడు. వారి రచనలను అనువదించడానికి పూనుకుని, కొన్నింటిని ప్రచురించాడు. 1947లో మద్రాసు తిరిగి చేరుకున్నాడు. ఈసంవత్సరం లోనే నా కవిత్వం I, II అనే వ్యాసాలద్వారా శ్రీశ్రీ తన తన కవితాసంవిధానం గురించి వివరించాడు.

## నీడలు

మహాప్రస్థానంలో కాలానుక్రమాన్ని బట్టి చిట్టచివరి గీతాన్ని రచించిన తేదీ 1947 జూన్ 19. అది 'నీడలు' గీతం. 'నిజంగానే' అనే గీతానికీ 'నీడలు' గీతానికీ మధ్య 6 ఏళ్ళ ఎడం ఉంది. మరి నీడలు గీతాన్ని కూడా మహాప్రస్థానం గీతాలలో చేర్చడానికి కారణం ఒక్కటే; మహాప్రస్థానం గీతాల సంవిధానపు సహజలక్షణాలైన పదసంగీతం, పదచిత్రనవ్యత, ప్రతీకధోరణి, అనుప్రాస కోలాహలం, గూఢత, లయవిన్యాసం మొదలైనవి 'నీడలు'లోనూ ఉన్నాయి. పైగా అధివాస్తవికత కూడా తీవ్రితనందుకున్న గీతం ఇది. పాతపద్ధతికీ కొత్తపద్ధతికీ సంధి గీతం ఇది.

### అధివాస్తవికత అనంతరం

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా మహాప్రస్థానం గీతాలు సంపుటిగా అచ్చు కాలేదు. 1947 నాటికే శ్రీశ్రీ 'మహాకవి'గా సుప్రతిష్ఠితుడయ్యాడు. శిఖరారోహణంచేశాడు. తరువాత శిఖరక్రీడలు మొదలుపెట్టాడు. సమాజవిమర్శకు పూనుకున్నాడు. స్వతంత్రభారత దేశంలో సామాన్యుడి భవిష్యత్తును గురించి, అఖిలప్రపంచంలో మానవుడి మహాప్రస్థానం గురించి, ఆంధ్రదేశంలో ఫ్యూడల్ బూర్జువా దురాచారాలగురించి, దోపిడి విధానంగురించి కవిత ల్లుతూ మరోమార్గం తొక్కాడు. 1948లో సినీరంగంలో ప్రవేశించాడు. అక్కడనుంచి ఆ జీవితకథ, కవిత్వపంథా వేరు. వాటినిప్రత్యేకం పరిశీలించాలి. 1970లో విప్లవరచయితల సంఘంలోకి ప్రవేశించాడు. అప్పటినుంచి వస్తున్న కవితలు వేరు. ఇప్పటికదే చరమపరిణామం.

### మహాప్రస్థానం ముద్రణ

1933నుంచి 1947వరకూ రచించిన గీతాలలో నుంచి ప్రత్యేక లక్ష్యంతో 41 గీతాలను మాత్రం ఏర్చికూర్చి ముద్రించిన ఖండకావ్యసంపుటియే 'మహాప్రస్థానం'. ఈ గీతాలలో శ్రీశ్రీ మరోప్రపంచాన్ని దర్శించి ప్రదర్శించాడు. ఇప్పటి ప్రపంచంలోని సమాజవ్యవస్థలో సామాన్యుడి బాధలను చూపించాడు. వర్గరహితస్వర్గంకోసం కలలుకన్నాడు. సామ్రాజ్యవాదవ్యవస్థలో ఉంటూ (భారతదేశంలో ఫ్యూడల్ వ్యవస్థ) సామ్యవాదవ్యవస్థలోకి పురోగమనం సాగించ డానికి ఊహలద్వారా ప్రయత్నించాడు. ఆనాటి వ్యవస్థలోని పరపీడనను అభివ్యక్తంచేశాడు. ఈ గీతాలలో అనితరసాధ్యమూ అపూర్వమూ అయిన పంథాను ఆవిష్కరించాడు. భాషను పారిశ్రామికయుగానికి అనురూపంగా పరిణతం చెందించాడు.

'మహాప్రస్థానం'లో శ్రీశ్రీ సర్వతంత్ర స్వతంత్రుడు. పాశ్చాత్యసాహిత్యసముద్రావగాహనం చేసివచ్చిన శ్రీశ్రీ మహాప్రస్థానంలో కనిపిస్తాడు. ఇందులో వస్తువూ అపూర్వమే. సంవిధానమూ నూతనమే. వ్యుత్పత్తీ అపారమే.

మహాప్రస్థానం పుస్తకంగా 1950 జూన్‌లో వెలువడింది. నళినీకుమార్ దాని ప్రచురణకు సూత్రధారి. మొదటి ముద్రణ రాయల్ సైజులో 96 పేజీలలో మచిలీపట్టణంనుంచి వెలువడింది. అప్పటినుంచీ అది పునర్ముద్రిత మవుతూనే ఉంది.

### మహాప్రస్థానం వ్యాఖ్యానాలు

మహాప్రస్థానం గ్రంథరూపం ధరించడానికి ముందే సాహితీలోకంలో సంచలనం తెచ్చింది. 1950 తరువాత దానిమీద ఎన్నో సమాలోచనలు వెలువడ్డాయి. గత ముప్పయ్యేళ్లుగా ఎందరో ఆ గీతాలను వ్యాఖ్యానిస్తూనే ఉన్నారు. శబ్దార్థాల గురించీ, వ్యంగ్యార్థాల గురించీ ఎన్నో వివాదాలూ తగాదాలూ తలెత్తాయి. 1970లో వాటి సంఖ్య మరీ పెరిగింది. శ్రీశ్రీ షష్టిపూర్తి

సందర్భంగా ఎన్నో ప్రత్యేక సంచికలు (విశాఖ సన్మానసంచిక, కళాకేళి, సృజన మొదలైనవి) శ్రీశ్రీ సాహిత్యంమీద వచ్చాయి. ఈ సమాలోచనలన్నీ పరిశీలించనిదే ఎవరూ కొత్తగా వ్యాఖ్యానించజాలరు. ఆ బాధ్యత నామీద పడింది. శ్రీశ్రీ కవిత్వం సామ్యవాదోద్యమానికి ప్రధానపరికరంగా పరిణతం చెందడంవల్ల దానికి అనన్య సామాన్య ప్రచారం లభించింది. అభ్యుదయరచయితల సంఘానికి గానీ విప్లవరచయితల సంఘానికి గానీ మహాప్రస్థానం విద్యుత్తును సరఫరా చేస్తూనే ఉంది నేటికీ.

## గతితార్కికపద్ధతి పరిశీలన

మహాప్రస్థానగీతాల పరిశీలనం బహుక్లేశబంధురమైన పని. శ్రీశ్రీ ఆ ఖండికలను ఏ తేదీల్లో రచించాడో వాటిని అనుసరించి గతితార్కికంగా అధ్యయనం చేయడం ఇంతవరకూ జరిగింది కాదు. ఈ అధ్యయనం ఈనాడు మరీ సాహిత్యావసరంగా మారింది.

'art has a socio-economic function and art and literature are to be Judged according to how this function is fulfilled'......'Literature is, accordingly a tool of propaganda to be used in the onward march of Society.·The Doctrine of art for art's sake has no relevance in this theory (Critics and Criticism 176P).ఇదీ మార్క్సిస్టు సాహిత్య లక్ష్యం. ఈ సిద్ధాంతానికి తెలుగులో మొదటి ఉదాహరణ మహాప్రస్థానమే.

తన కవితాపరిణామాన్ని గతితార్కికభౌతికవాద దృక్పథంతో పరిశీలించి "కవికీ వస్తువుకీ ఆనాటి ఆర్థికరాజకీయసామాజికవ్యవస్థకూ ఉన్న సంబంధాలను గ్రహించి వాటివల్ల కవి వివృతంచేసిన విషయాలు సంఘపురోగమనానికి ఎంతవరకూ తోడ్పడగలవో, ఎంతసజీవమైన శబ్దచిత్రణద్వారా కార్యనిర్మాణంచేశాడో విలువకట్టడమే" శ్రీశ్రీ వ్యాఖ్యాతను కోరుకున్నది. ఆ మేరకే నేను ప్రయత్నంచేసింది.

శ్రీశ్రీని చదవడం అంటే వస్తువును అవగాహన చేసుకునేందుకు 'మార్క్సిజం' చదవాలి. సంవిధానాన్ని తెలుసుకునేందుకు సాహిత్యోద్యమాలను చదవాలి. ఇంతకు ముందు తెలుగు కవులను చదవడానికి ఇన్ని ఇజాలను తెలుసుకోనక్కరలేదు. అయితే ఇజాలను తెలియకపోయినా శ్రీశ్రీని చదివి స్పందించవచ్చు. కానీ ఆ స్పందన అవగాహనకు సరిపోదు. శ్రీశ్రీ మీద సశాస్త్రీయమైన పరిశోధనకు బీజాలు డా॥ సి. నారాయణరెడ్డిగారి ఆధునికాంధ్రకవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు అనే సిద్ధాంతగ్రంథంలోనే ఆరంభమయ్యాయి. అయితే ఆ బృహద్గ్రంథంలో శ్రీశ్రీ కవిత్వాని కొక్క ప్రకరణమే కేటాయించబడింది. శ్రీ అద్దేపల్లి రామమోహనరావు శ్రీశ్రీ కవితా ప్రస్థానం అనే చిన్నిగ్రంథాన్ని రచించారు. అది ప్రాచ్యసాహిత్యప్రమాణాలతో నడిచిన ప్రశంసాగ్రంథం.

చెల్లాచెదరుగా ఉన్న శ్రీశ్రీ సాహిత్యాన్ని సేకరించి సంపుటాలుగా కూర్చి ప్రచురణకు దోహదం చేసిన శ్రీ కె. వి. రమణారెడ్డి ఆ సంపుటాలకు రాసిన ఉపోద్ఘాతాలలో శ్రీశ్రీ వ్యక్తి-శక్తి అవతరణ పరిణామ వికాసాలను అంచనా వేయడంలో విశిష్టప్రజ్ఞను చూపించారు. వారే శ్రీశ్రీ రచన లన్నింటికీ కాలానుక్రమం కూర్చి యిచ్చారు. ఈ పద్ధతిని అనుసరించకుండా శ్రీశ్రీ కవిత్వాన్ని 'తూచడానికి' యత్నించకూడదు. శ్రీశ్రీ చెప్పినట్లు - చెలం చేసినట్లు - చాలామంది మహాప్రస్థానం గీతాలను 'అనుభవించి పలవరించ'డానికే యత్నించారు. ఆ పలవరింత వ్యాసాలన్నీ సామయికంగా పత్రికల్లో వచ్చినవే. అయితే పరిశోధనకు అవీ ముడిసరుకులే.

## ఇజమ్‌ల నిజాలు

శ్రీశ్రీ కవిత్వాన్ని అవగాహన చేసుకోవడంలో అవరోధాలు వ్యాసఘట్టాల లాంటివి. శ్రీశ్రీకి గల శబ్దశక్తి అపూర్వం. ఆయన శబ్దాలను లక్షణావ్యంజనాశక్తులతోనే గాక సంజ్ఞావాదపు నూతన సాంకేతిక సంగీతశక్తితోనూ వాడతారు. పదచిత్రవాదం తాలూకు రసోద్దీపనం శబ్దాలకు కలిగిస్తారు. Evocativeగా పదాలను ప్రయోగిస్తారు. అందువల్లనే పదానికి అర్థం తెలుసుకునేందుకు నిఘంటువులు, సంప్రదాయాలు పనిచేయవు. Literary Ismsనూ వాటినిజాలనూ తెలుసుకుని వాటి తత్త్వాన్నీ అవి ప్రతిపాదించే భావవాతావరణాన్నీ గుర్తించి వాటిని పరిశీలించి, ఆయా కాలాల్లో రచించిన కవితలను అధ్యయనం చేయాలి. లేకపోతే ఎన్నో కువ్యాఖ్యలు వచ్చే అవకాశం ఉంది.

శ్రీశ్రీ కవిత్వం వర్తమానకాలంలో పొటమరించి భవిష్యత్తులోకి ఎదుగుతూపోయే లక్షణం గలది. ప్రపంచ రాజకీయాల చారిత్రకయాథార్థ్యాలూ నేపథ్యతత్త్వాలూ పరిశీలించకుండా ఆ కవితలను వ్యాఖ్యానించడం నేల విడిచిన సాము అవుతుంది. అందుకే శ్రీశ్రీ తన కవితలను రచించిన తేదీలను భద్రపరిచారు.

ఈ కాలానుక్రమంలోనే ఆయన కవితలను సంప్రదించాలి. కాలానుక్రమం గుర్తించకుండానూ, కవిత రచించిననాటి వాస్తవాలు గ్రహించకుండానూ, చేసే వ్యాఖ్యానం అపార్థాలకూ గజిబిజికీ దారితీస్తుంది. అందువల్ల నా వ్యాఖ్యానం కాలానుపూర్విగానే సాగించాను.

## శ్రీశ్రీ స్వయం వ్యాఖ్యానం

కవితా రంగాన్ని విప్లవీకరించదలచిన (revolutionize) ఏకవి అయినా తనకావ్యదృక్పథాన్ని గురించీ సంవిధాన నవ్యత గురించీ తానే వ్యాఖ్యానించుకోక తప్పదు. కాలంకన్నా సమకాలికుల కన్నా ముందు కతడు నడిచిపోవడంవల్ల వెనుకనున్నవారి కోసం అతడీ బోధనలను అవలంబిస్తాడు. శ్రీశ్రీ అలాగే చేశారు. ఆయన నూతనకవిత్వానికి Manifestoలుగా కొన్నికవితలూ కొన్ని సాహిత్యవ్యాసాలూ రచిస్తూ వచ్చారు. ఆత్మకథకు కూడా ఉపక్రమించారు. వీటన్నింటి తత్త్వాన్ని అవగాహన చేసుకున్నప్పుడు గానీ శ్రీశ్రీలోని వ్యాసఘట్టాలకు పరిష్కారం లభించదు.

### చెలం వ్యాఖ్యాన సరణి

మహాప్రస్థాన గీతాలు చదువుకోవడం, పాడుకోవడం అదొక అపూర్వరసానుభవం. వాటిని వినడం కూడా అలాంటి అనుభవమే. అందుకే 'సారీస్' వాటిని 'పాల్‌రోబ్సన్' సంగీతంతో పోలుస్తూ ఉంటుందని చెలం చెబుతూ ఇలా రాశారు: "ఆ రెంటికీ హద్దులూ ఆజ్ఞలూ లేవు. అప్పుడప్పుడు లక్షణాలనూ రాగాలనూ మీరి చెవులు కీర్రుమనేట్టు ఇద్దరూ అరుస్తారు. ఏమీ రసం లేకుండా flat గా ఎక్కడికో, ఏమీ చాతకానివాళ్ళమల్లే జారిపోతారు. కాని ఆ అరుపుల్లో, చీకట్లో మొహాలూ తోకలూ కనపడక వెతుక్కునే ప్రజలరొద, గాలిదెబ్బల కింద ఎగిరిపడే సముద్రపుతుపాను గర్జనం, మరఫిరంగుల మరణధ్వానం గింగురుమంటాయి. కంఠం తగ్గించి వినపడకుండా తగ్గుస్థాయిలో మూలిగారా, దిక్కులేని దీనుల మూగవేదన, కాలికింద నలిగిన చీమలకాళ్ల విరిగిన చప్పుడు, నీళ్ళులేక ఎండుతున్న గడ్డిపోచ ఆర్తనాదం వినిపింపచేస్తారు". ఈవిధంగా వ్యాఖ్యానించడం 'ఇంప్రెషనిజం'కు చెందుతుంది ("the adventures of the soul among the masterpieces"—Anatole France).. ఇది తెలుగులో చెలంకే చేతనయిన వ్యాఖ్యానం. అయితే చెలంగారు 'కవిత్వాన్ని తూచే రాళ్లు తన దగ్గర లే'వని అంగీకరించారు. 'తూచవద్దు; అనుభవించి, పలకరించ'మని శ్రీశ్రీ అన్నాడు.

"శ్రీశ్రీ కవిత్వాన్ని analyse చేసి ముక్కల కింద ఎత్తిచూపి, కవీ మనిషీ శైలీ బాల్యం కవిత్వం, ఛందస్సు ఎదిరింపు, కొత్తపోకడలు, పాత influences అంటో వాటి శ్రేష్ఠత్వాన్ని explain చెయ్యడానికి చెలానికి అధికారమూ అర్హతా లేవు" అని అన్నాడు చెలం. విమర్శకుల్నీ వ్యాఖ్యాతల్నీ చెలం వేళాకోళంచేస్తున్నాడో తన అనర్హతని అంగీకరిస్తున్నాడో తెలియదుగానీ శ్రీశ్రీ కవిత్వానికి సశాస్త్రీయమైన విశ్లేషణ మాత్రం యింతకు ముందు జరగలేదు. అందుకే ఈ వ్యాఖ్యాత పూనుకున్నాడు.

### తెలుగు కవిత్వానికి మహాప్రస్థానం

శ్రీశ్రీ మహాప్రస్థానం వల్ల తెలుగు కవిత్వానికి నూరేళ్ళ పురోగమనం జరిగింది. కవిత్వం కదిలింది; మారింది. తెలుగు భాషను కదిలించింది; తెలుగువాడిని మార్పించింది.

గ్రాంథికానికి ఉద్వాసన, వృత్తాలకు స్వస్తి, పురాణ కథలకు భరతం, భావకవితకూ ఆదర్శవాదానికీ మతానికీ ఉపసంహారం, హేతువాదానికీ, వాస్తవికతకూ ప్రాధాన్యం, మాత్రాచ్ఛందస్సులకూ, కావ్యభాషకూ సంస్కరణం, మానవుడి గొప్పతనం మీద నమ్మకం, వర్గ కలహంపట్ల మొగ్గు, గతంకన్నా భవిష్యత్తు గొప్పగా ఉంటుందనే భరోసా, పెట్టుబడిదారీ వ్యవస్థమీద ద్వేషం, సామ్యవాదంమీద అభిమానం మొదలైనవాటి నెన్నింటినో పేర్కొనవచ్చు. అయితే వీటి కన్నింటికీ శ్రీశ్రీలో ఉన్న సంస్కరణవాదం, విప్లవవాదం వెన్నెముకలు. విప్లవవాదం వైపు శ్రీశ్రీ కదలిక మహాప్రస్థానం గీతాల్లోనే మెరుస్తుంది.

## మహాసంకల్పాలు

శ్రీశ్రీ ఆదర్శాన్ని వాస్తవంగా మార్చాలనుకున్నాడు. అన్నీ కొందరికిమాత్రమే లభించడం చూసి ఆగ్రహించాడు. అన్నీ అందరికీ లభించాలని కోరుకున్నాడు. దరిద్రులను చూసి జాలి పడ్డాడు. అందుకు దోపిడి కారణమని గ్రహించాడు. మానవుడి మహత్తర విజయావకాశాలను నమ్మాడు. కవిత్వం కవిత్వంకోసం కాక, సమాజం కోసమే అనే అభిప్రాయానికి వచ్చాడు. ప్రపంచంలో నిరాదరణపొందుతున్న సమస్తవస్తుభావ-పదజాలానికీ సాహిత్యంలో స్థానం కల్పించడంద్వారా వాటికి ఉదాత్తతను కలిగించాడు. సమాజం, సాహిత్యం, రాజకీయం, విజ్ఞానం వేటికి అవే గదులు గదులుగా ఉండిపోకుండా అన్నిటికీ కవిత్వంలో సహజీవనం ఏర్పాటుచేశాడు. కాలంకన్నా ముందుకు ఊహాలతో పరుగులుతీశాడు. కానీ ఇది పలాయనంకాదు; పురోగమనం. కట్టుబాట్లు, సంకెళ్ళు, నిబంధనలు ఏరంగంలోనివైనా పగులగొట్టి వాటిస్థానంలో స్వేచ్ఛానిరూపకాలైన కొత్తనియమాలను చేర్చాడు. ఏ నవ్యకల్పన అయినా మానవుడి పురోగమనానికి పనికి రావాలని నిశ్చయించాడు. ఆధునికీకరణం (Modernization), సంస్కరణం (Reformation), విప్లవీకరణం (Revolutionization), తిరస్కరణం (Rejection), నవకల్పన (Innovation), ప్రయోగం (Experiment), అనుకరణ (Imitation), అను-సృజన (Trans-creation), పునరుద్ధరణ (Renaissance), పునర్నవీకరణం (Renewal) మొదలైన విధానాల ద్వారా సాహిత్యసంప్రదాయాలకు చికిత్స చేశాడు. వినూతనసంప్రదాయాలను నెలకొల్పాడు. బూజుపట్టిన సంప్రదాయాలనూ త్రుప్పుపట్టిన శబ్దజాలాన్నీ తుడిచి ◌ రవేశాడు. ఈ ప్రక్రియలో గతితార్కికత్వం అంతర్లీనంగా కనిపిస్తుంది.

శ్రీశ్రీ కవిత్వం సాహిత్యపురోగమనానికి ఎన్నోవిధాల దోహదంచేసింది. సాహిత్యపురోగమనంద్వారా సాంఘికపురోగమనాన్నీ భాషావిప్లవంద్వారా భావవిప్లవాన్నీ సాధించదలచిన మహావ్యక్తి శ్రీశ్రీ. అక్షరలక్షాధికారి, మాటలకోటీశ్వరుడూ అయినా మాటల పొదుపు నెరిగిన మహాశిల్పి శ్రీశ్రీ. స్వీయజీవితానుభవాలనే సమాజంలోని సర్వజనజీవితాల్లో-ముఖ్యంగా పీడిత వర్గజనజీవితాల్లో దర్శించగల్గిన మహానుభావుడు శ్రీశ్రీ. అందుకే తన బాధలో సమాజం బాధను ప్రతిధ్వనింపజేయగలిగాడు. సమాజం బాధను తన బాధగా ప్రకటించగలిగాడు,

## ఆధునికత్వం

శ్రీశ్రీ సాధించిన ఆధునికత్వం (modernity) అనేకకోణాలనుంచీ అనేకశిల్పాలనుంచీ అనేకప్రస్థానాలనుంచీ ఒక చోటికి చేర్చిన అయస్కాంతశక్తి. ఆయన వస్తువులోగానీ సంవిధానంలోగానీ దృక్పథంలోగానీ లేని అంశం ఏదీ 'ఆధునికత'లో లేకుండా ఉండదు. ఈ చర్చ ఈ సిద్ధాంతగ్రంథంలో పొడుగునా జరుగుతూనే ఉంటుంది కనుక పునరుక్తం చేయను. పండిత పామరులనుభయులనూ ఏకకాలంలో రంజింపజేయాలనుకోవడం మహాప్రస్థానంనాడు శ్రీశ్రీ సంకల్పం. అయితే సౌలభ్యం కోసం ఆయన ఎంతో ప్రయోగం చేశాడు. సౌలభ్యాన్నీ సౌష్ఠవాన్నీ సమ్మేళనం

(Synthesis of clarity and Classicism) చేయడంలో కృతార్థుడయ్యాడు. ప్రతిభనీ వ్యుత్పత్తినీ (genius and scholarship) మేళవించడంలో శిఖరం ఎక్కాడు.

## నలభై మహాకావ్యాలు

మహాకావ్యానికి పరిమాణంతో నిమిత్తంలేదని నిరూపిస్తాయి శ్రీశ్రీ కవితలు. శ్రీశ్రీ కవిత లోని హ్రస్వలిపి సంవిధానం వాటిలోని వస్తువును భూతద్దంలోవలె చూపిస్తుంది. అందువల్లనే వస్తుసంవిధానాలను విడదీయడం కష్టం. "విషయానికి సంబంధించిన వివేచన సాగించడంలో కవిత్వం అంటే ఏమిటి? అనే ప్రశ్న వేసుకుంటాము. విధానం గురించి ఆలోచించేటప్పుడు కవిత్వం అంటే ఎట్లు? అనే ప్రశ్న బయలుదేరుతుంది. కాని విమర్శన సౌలభ్యంకోసం మాత్రమే ఈ విభజన చేయటం తప్ప విషయాన్నీ సంవిధానాన్నీ ఒకదానినుండి ఒకటి వేరుచేయలేము" అని శ్రీశ్రీయే చెప్పుకున్నారు. కనుక వస్తుసంవిధానాలను వీలైనంతవరకే విడదీసి వ్యాఖ్యానిస్తాను.

శ్రీశ్రీ తన కవితలను వ్యాఖ్యానించదలచిన వారికి ఉండవలసిన అర్హతలను గురించికూడా సూచించి ఉన్నాడు—"రత్నపరీక్షకులకు తప్ప రత్నాన్ని చూచిన ప్రతి వ్యక్తికీ దాని విలువ చెప్పగలిగిన శక్తి ఉండనట్లు ఒక గీతం విలువ సాహిత్యవేత్తలకు తెలిసినట్లు ఆ వ్యాసంగంలేని వాళ్లకు తెలియదు. ఈ సాహిత్యవేత్త లంటేమాత్రం ఎవరు? నిరంతర వ్యవసాయంవల్ల అభిరుచిని పరిణతం చేసుకొన్నవాళ్లు". "నాయకమైన రచన గ్రహించడానికి శాణితమైన అభిరుచి ఉండాలి" అంటూ.

'గొప్పకవులు తాము చెప్పినదానికంటె చెప్పకుండా వదిలిపెట్టినచోట అమూల్యమైన నిధులు దాస్తూ ఉంటారు' అని తనరహస్యాలనే శ్రీశ్రీ సూచించాడు.

"గ్రుడ్డిగా ఎడ్మైర్ చేసేవాళ్ళను కావ్యస్రష్ట ఎంత ఈసడించుకుంటాడో, మూడవకంటితో చూసే Creative Critic కోసం అంత తహతహలాడతాడు" అంటూ తన కవిత్వాన్ని గ్రుడ్డిగా మెచ్చుకోవద్దని హెచ్చరించాడు.

"చక్రాల్లో చక్రాల్లాగ అర్థాల్లో అంతరార్థాలుంటాయి. కొంతమట్టుకే బోధపడవచ్చు కొందరికి. ఇంకా అందులో ఏముందో చెబుతాడు వ్యాఖ్యాత. అర్థంకాని రహస్యం లేనట్టే అసలే బోధపడనిదంటూ ఏదీ ఉండదు" అని వ్యాఖ్యానం తన కవితల కెంత ఆవశ్యకమో సూచించాడు శ్రీశ్రీ.

"ప్రతివచనగీతాన్ని దేన్ని దానికిగా విశ్లేషించి సమాలోచించాలి" అని శ్రీశ్రీయే అభిప్రాయపడ్డాడు.

శ్రీశ్రీ మహాప్రస్థానం గీతాలు దేనికదే ఒక మహాకావ్యమంత లోతూ, ఎత్తూ గల శిల్ప ఖండం. పరిమాణంలో అవి చిన్నవే కానీ గుణంలో గొప్పవి. అందుకే వాటిని విడివిడిగా పరిశీలించి నూతనత్వాన్ని వివరిస్తాను. శ్రీశ్రీ కవితా రహస్యాలను బయల్పడతాను.1 ఇంద్రజాలానికి తెరదీస్తాను.

---

1 మహాప్రస్థానానంతర కృతుల పరిశీలన మరొక గ్రంథానికి విషయంగా కేటాయించుకుంటాను.

ఏ కవికైనా సరే

అతనిచుట్టూ ఒక సమాజం

ఆ సమాజానికొక చరిత్రా

ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి!

సామాజిక చారిత్రక పరిణామగమనంలో

కవియొక్క సాహిత్యస్థానం

నిర్ణీతమవుతుంది!

కవి ప్రగతిశీలీ, ప్రతిభాశాలీ అయితే

ఈ గమనాన్ని

అతడు మరింత వేగవంతం చేస్తాడు.

—శ్రీ శ్రీ

## 51/జయభేరి

### నేను సైతం భువన భవనపు బావుటానై పైకిలేస్తాను !

1933 జూన్ 2

వ్యక్తికి కష్టాలు ప్రకృతి సహజంగా కన్నా సమాజవ్యవస్థవల్ల ఎక్కువగా కలుగుతున్నాయి. ఒకడు శ్రమపడి సంపదలను సృష్టిస్తున్నాడు. మరొకడు శ్రమపడకుండా ఆ సంపదలను దోచుకుంటున్నాడు. పీడితజనాలకు తమ కష్టనష్టాల కారణాల్ని అర్థంచేసుకుని పీడకులమీద తిరుగుబాటు చేసే చైతన్యం లేదు. తాను పీడితుల పక్షంలో నిలబడాలి. వారి ప్రతినిధిగా గొంతెత్తి, శ్రామికుడి చరిత్రను పాడాలి. గతంలోనూ వర్తమానంలోనూ భవిష్యత్తులోనూ కూడా ఈ ప్రపంచం సాధించిన, సాధించే ప్రగతికి మూలం శ్రామికుడే. తానే శ్రామికుడైతే ఈ ధనస్వామ్య సమాజ వ్యవస్థమీద తిరుగుబాటుచేసి, జయభేరి మ్రోగిస్తాడు. ఇదీ శ్రీశ్రీ ఆలోచన 1933 నాటికి.

తాను పాతకవిత్వానికి స్వస్తి చెప్పాలి. పద్ధతులను మార్చాలి. గ్రాంథికాన్ని సన్యసించాలి. పద్యాలను వదలాలి. కవుల దృక్పథాన్ని మార్చాలి. భవిష్యత్తును గొప్పదిగా సూచించాలి.

కవిత్వంలో తన సొంత గొంతుకను నిరూపించుకోవాలి. అనుకరణలు మానాలి. నూత్న ప్రయోగాలు చెయ్యాలి. తన ఆవేశానికి ఆలోచన పునాదిగా ఉండాలి. గతితార్కికభౌతిక వాదాన్ని శిరసావహించాలి. ఇదీ శ్రీశ్రీ అవగాహన.

33 జూన్ 2న 'జయభేరి' రచించాడు. 1934 ఉదయినిలో అచ్చయిందా కవిత. ముత్యాలసరం, వ్యావహారికభాష, మార్క్సిజం ముడిపడ్డాయి ఆ కవితలో. భువనభవనపు బావుటా ఎగురవేశాడు శ్రీశ్రీ.

శ్రామికుడి గతం, వర్తమానం, భవిష్యత్తు 'జయభేరి'లో అనన్యసామాన్యరీతిలో ధ్వనించాయి. శ్రీశ్రీయే శ్రామికుడి అవతారం ఎత్తి ఉపన్యసిస్తున్నాడు. ప్రశ్నిస్తున్నాడు, తిరుగుబాటు చేస్తున్నాడు. తనదే విజయమంటున్నాడు.

#### శ్రామికుడి స్వస్వరూపజ్ఞానం

ప్రపంచాభ్యుదయం కోసం ఎన్నో త్యాగాలు చేశాడు శ్రామికుడు. ఎంతో కృషిచేశాడు గతంలో. ఆ గతం అంతా శ్రామికుడు నెమరు వేసుకుంటున్నాడిప్పుడు.

నేనుసైతం / ప్రపంచాగ్నికి / సమిధ నొక్కటి ఆహుతిచ్చాను.

'నేనుసైతం' అనే నుడికారం మానవజాతి చరిత్రలో పేరుకుకూడా నోచుకోని ఒక సామాన్యుడికి ప్రాముఖ్యం కలిగిస్తోంది. తరతరాలనుంచి ఇతనికి చరిత్రలో గుర్తింపులేదు. ఇప్పుడు ఇతడు కొరగబడి తన ప్రాముఖ్యం గుర్తించవలసిందిగా ఘోషిస్తున్నాడు.

ఆహుతిచ్చాను / ధారవోశాను / గొంతుకవిచ్చిమ్రోశాను.

ఇవి అరుపుల్లా వినిపిస్తాయి. అగ్నికి సమిధనాహుతి ఇవ్వడం ఆ అగ్ని ఆరిపోకుండా నిరంతరం మండుతూ ఉండటానికే. ప్రపంచాగ్ని ఆరిపోతే ప్రపంచమే లేకుండా పోయేది. అగ్నిలేనిదే మనిషి జీవనం నడువదు. పురాతనమైన వైదిక సంస్కృతిలో యజ్ఞవేదికముందు సమిధలను అగ్నిహోత్రుడికి ఆహుతి ఇస్తూఉండేవారు. ఆ వేదకాలంనాటివాడే ఈ శ్రామికుడు. అప్పుడందరూ శ్రామికులే. సమిధ శ్రామికుడి శ్రమశక్తికి ప్రతీక. ఈ శ్రమశక్తి లేకపోతే ఈ ప్రపంచం అనాదిలోనే ఆగిపోయి, ఆరిపోయి ఉండేది.

నేనుసైతం / విశ్వవృష్టికి / అశ్రువొక్కటి ధారవోశాను.

పంటలు పండించడానికి వర్షం కావాలి. ఆ వర్షానికి తన కన్నీటి బిందువు నిచ్చాడు శ్రామికుడు. ఈ వర్షం విశ్వవర్షం. ఈ వర్షం (విశ్వం) ఆగకుండా చేసింది శ్రామికుడే. ఇక్కడ శ్రీశ్రీ 'ధారవోశాను' అనే మాట వాడి పైపదచిత్రంలో అనేక భావాలు ఇమిడించాడు. 'ధారవోయడం' అనే జాతీయం యజ్ఞకర్త వటువుకు జలధార వోయడాన్ని జ్ఞాపకం చేస్తుంది. శ్రామికుడు తాను పండించిన పంటలన్నింటిని పూర్వంనుంచీ ధారవోస్తూనే వచ్చాడు. ఇది అతని దారిద్ర్యానికి కారణంగా పరిణమించింది.

నేనుసైతం / భువనఘోషకు / వెర్రిగొంతుక విచ్చిమ్రోశాను

ఒకప్పుడు శ్రామికుడే వాఙ్మయాన్ని సృష్టించి వేదమంత్రాలు గానంచేసి లోకానికి జ్ఞానం కలిగించి మేలుకొల్పాడు. ఈ భావాన్నే 'భువనఘోషకు వెర్రిగొంతుక విచ్చి మ్రోయడం'లో ఇమిడించాడు శ్రీశ్రీ. భువనఘోష అంటే జనచైతన్యం. ఈ భువనఘోష ప్రపంచాగ్ని. విశ్వవృష్టి వలె రూపకం కాదు.

ఈవిధంగా కాలానుక్రమంలో శ్రామికుడు ఎలాప్రపంచాభ్యుదయానికి కృషిచేస్తూవచ్చాడో మూడు పాదాల్లో వ్యక్తంచేశాడు శ్రీశ్రీ. ఈ అభివ్యక్తిలో క్లుప్తత, గుప్తత ఉన్నాయి. వీటిని భావించినకొద్దీ విచిత్రస్పందన కలుగుతుంది. ఈ మూడు పాదాల భావాలకు విశ్వజనీనతాగుణం ఉండటంవల్ల అనేక సందర్భాల్లో వీటిని అన్వయించుకొనే వీలు ఉంది. విస్తృతి ఉంది.

శ్రామికుడి తిరుగుబాటుధోరణి

ప్రపంచంకోసం ఎన్ని త్యాగాలు చేసినా, శ్రామికుడికి కష్టాలు మాత్రం తప్పనేలేదు. ప్రకృతి కల్పించే ఈతిబాధలనుంచి అతడికి ముక్తి కలగలేదు. ఈ బాధలకు కారణం తన శ్రమ శక్తిని బలవంతులు దోచుకోవడం అనే జ్ఞానం కలిగిన తరువాత అతడు ఎదురుతిరుగుతాడు.

ఎండకాలం మండినప్పుడు / గబ్బిలంవలె / క్రాగిపోలేదా ?

ఛందస్సులో, పదజాలంలో, వాక్యరీతిలో గోచరిస్తున్న వేగం (speed) తిరుగుబాటుకంతాన్ని మనకు స్పష్టంగా వినిపింపజేస్తోంది. పూర్వం ప్రపంచాగ్నికి సమిధనాహుతిచ్చిన శ్రామికుడే ఎండ కాలపుమంటలో క్రాగిపోయాడు. ఈ ఎండకాలం శ్రామికుడి కష్టనిష్ఠురాలకు ప్రతీక. సమాజంలో మేడలూ మిద్దెలూ ఇతని శ్రమతోనే కట్టుకుని కొందరు సుఖపడుతూంటే ఇతడు మాత్రం శిథిల గృహంలో గబ్బిలంలా క్రాగిపోయాడట! ఈ సామాజికదురన్యాయాన్ని (social injustice) గురించి శ్రామికుడు ప్రశ్నించాడు. ఈ ప్రశ్నకుముందు అవగాహన (understanding) ఉంది. వీటిని ఛందస్సులో కూడా వ్యక్తంచేయడం శ్రీశ్రీ శిల్పం.

| అవగాహన | తిరుగుబాటు |
| --- | --- |
| నేనుసైతం | ఎండకాలం మండినప్పుడు |
| ప్రపంచాగ్నికి | గబ్బిలంవలె |
| సమిధనొక్కటి ఆహుతిచ్చాను ! | క్రాగిపోలేదా ? |

పై రెండు గీతాలలో పాదప్రమాణాలు ఎలా తిరగబడ్డాయో చూస్తే ఆ శిల్పం గోచరిస్తుంది.

వానకాలం ముసిరిరాగా / నిలువు నిలువున / నీరుకాలేదా ?

ఈ రెండో ప్రశ్న 'విశ్వవృష్టికి అశ్రువుధారవోయడం' అనే అవగాహన మీద బయలుదేరింది. అక్కడ వాన కురిపించిన శ్రామికుడే వానలో గొడుగులేక, గూడులేక, బట్టలేక నిలువునా నీరై పోయాడు. ఇది అతడనుభవిస్తున్న దారిద్ర్యానికి పరాకాష్ఠ. ఇంత క్లుప్తంగా భావాలను వ్యక్తం చేయడం శ్రీశ్రీ అసామాన్య శిల్పానికి నిదర్శనం.

శీతకాలం కోతపెట్టగ / కొరడుకట్టీ / ఆకలేసీ కేకలేశానే ?

ఈ మూడో ప్రశ్న 'భువనఘోషకు వెర్రిగొంతుక విచ్చిమ్రోయడం' అనే జ్ఞానంమీద బయలు దేరింది. అక్కడ జ్ఞానంకోసం అరచినవాడే ఇక్కడ చలికాలంలో ఆకలితో అరవవలసిరావడం అన్యాయం. ఇది శ్రామికుడికి ఈనాడు సంభవించిన నిరక్షరాస్యతను వెల్లడిస్తోంది.

ఎండకాలం మండిపోవడం కోపం. వానకాలం ముసిరిరావడం దండయాత్ర. శీతకాలం కోతపెట్టడం దార్జన్యం. ఇవి అధికారదాహంగల రాజుల ఫ్యూడల్ వ్యవస్థని సూచిస్తాయి. ఆ వ్యవస్థలో శ్రామికుడు బానిసగా పీడితుడుగా సామాన్యుడిగా ఉన్నాడు. ఆయా ఘట్టాల్లో క్రాగిపోవడం, నీరుకావడం, కేకలేయడం శ్రామికుడి శోకభయాందోళనలను సూచిస్తాయి. క్రాగిపోలేదా? నీరుకాలేదా? కేకలేశానే-ఈప్రశ్నలు గతకాలంలోంచి చీల్చుకువస్తున్న స్మృతులు.

ప్రతి భావచిత్రానికి వాక్యసంవిధానం విడదీయరాని అంగం (part)గా రూపొందించడం శ్రీశ్రీ విశిష్టత.

## సమాజంలో అల్లకల్లోలం

ఇక, శ్రామికుడు సమాజాన్ని సూటిగా ఎదుర్కొంటాడు. ఇది వర్తమానకాలంలో జరుగుతుంది. కార్మికులుగా కర్షకులుగా వివిధవృత్తులవారుగా పనిచేస్తున్న శ్రామికులు ఆ పనులు చేయడం మానివేస్తే సమాజం స్తంభించి తలక్రిందులవుతుంది. సమాజంలో అల్లకల్లోలం (chaos) ఆరంభం అవుతుంది. శ్రమ విలువను దోచుకుని, అధికలాభాలతో విలాసంగా కులికే పెట్టుబడిదార్లు తల్లడిల్లిపోతారు. అప్పుడుగానీ సమసమాజస్థాపనకు పోరాటం మొదలుకాదు. ఈ వర్గకలహం సోషలిజంకు నేపథ్యం.

> నేనొక్కణ్ణే / నిలిచిపోతే ?

అని ప్రశ్నిస్తాడు శ్రామికుడు. సమ్మె (strike) కట్టడమే నిలిచిపోవడం. యజమానులు జీతాలు పెంచకపోతే సమ్మెలు తప్పవు. సమ్మె మానయుద్ధమే. "ఆకటి చీకటి చిచ్చుల హాహాకారం, ఆర్తారావం" మొదలవుతాయి. కానీ అంతటితో ఆగదు. ఆ దుష్పరిణామాలు చాలా దారుణంగా ఉంటాయట !

> చంద్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు
> భూమిమీదా భగ్నమౌతాయి.

శ్రామికుడు సూర్యుడంతటివాడు. అందుకే అతడు పనిలోకి రాకపోతే ఎండకాలం, వానకాలం, శీతకాలం ఆగిపోతాయి. వేడిగాలి, వానమబ్బు, మంచుసోన ప్రపంచంమీద పడతాయి. నిజానికి ఇవన్నీ నేలమీద పడిపోకుండా రక్షిస్తున్నవాడు శ్రామికుడే (సూర్యుడు జగద్బంధువు). ఎలాగంటే శ్రామికుడే అనేక నిర్మాణాలను చేస్తున్నాడు. ఇళ్లు కడుతున్నాడు. బట్టలు నేస్తున్నాడు. నేల దున్నుతున్నాడు. అవన్నీ ఆగిపోతాయి.

పూర్వాపూర్వభాగాల్ని ఉత్తరోత్తరం స్ఫురింపజేయడం శ్రీశ్రీ గొప్పశిల్పం.

| 1 | 2 | 3 |
|---|---|---|
| ప్రపంచాగ్ని | ఎండకాలం | చంద్రగాడ్పులు |
| విశ్వవృష్టి | వానకాలం | వానమబ్బులు |
| భువనఘోష | శీతకాలం | మంచుసోనలు |

ఇలాంటి అనుబంధాలతో గీతాలల్లడం గొప్ప చమత్కారం. వీటిని 'లోనారసి' మెచ్చవలసిందే.

విశ్వవృష్టికి అశ్రువు ధారవోసే శ్రామికుడే స్తంభిస్తే

నింగినుండీ తొంగిచూచే / రంగురంగుల చుక్కలన్నీ
రాలి నెత్తురు క్రక్కుకుంటూ / పేలిపోతాయి

ఉన్నతసౌధాల్లో కూర్చుని విలాసజీవితాలు గడుపుతూ అధోలోకంలో ఉన్న పీడితులవైపు తొంగిచూసే పెట్టుబడిదారులే ఆ చుక్కలు. వీరంతా బీభత్సానికి గురిఅవుతారు. రక్తం క్రక్కుకుంటారు. శ్రామికుడివలె అశ్రుధారవోయలేరని భావం.

శ్రామికుల సమ్మె సమస్యలకు పరిష్కారం. వారి సమ్మెవల్ల ప్రళయం సంభవిస్తుంది. అహోరాత్రాలు ఆగిపోతాయి.

పగళ్లన్నీ పగిలిపోయీ / నిశీథాలు విశీర్ణిల్లీ
మహాప్రళయం జగంనిండా / ప్రగల్భిస్తుంది!

'పగళ్లు పగిలిపోతే' చీకటి వ్యాపిస్తుంది. నిరాశ అలముకుంటుంది. 'నిశీథాలు విశీర్ణిల్లితే' అశాంతి పుడుతుంది. శ్రామికుడు (సూర్యుడు) కుపితుడైతే జరిగే అల్లకల్లోలం (chaos) ఇది. 'చిరకాలం జరిగిన మోసం, బలవంతుల దౌర్జన్యాలూ, ధనవంతుల పన్నాగాలూ' ఇక చెల్లనిపరిస్థితి వస్తుంది. ఒక వ్యక్తిని మరొక్కవ్యక్తీ ఒక జాతిని మరొక్క జాతీ పీడించే సాంఘికధర్మం' ఇకసాగదు.[1]

ఈ వ్యవస్థమీద వచ్చే తిరుగుబాటును సూచించడానికి' విశీర్ణిల్లు, ప్రగల్భించు' అనే రెండు సంప్రదాయ భిన్నమైన క్రియలను శ్రీశ్రీ వాడటం గొప్పపనితనం.

### శ్రామికుడి ఆశావాదం

తన శక్తిని తాను తెలుసుకున్న శ్రామికుడికి భవిష్యత్తుమీదే నిఘా ఏర్పడుతుంది. తాను ఆధిపత్యం వహించే

ఆ ముహూర్తాలాగమిస్తాయి

1 చూ. దేశచరిత్రలు గీతం.

అని ప్రకటిస్తాడు. అయితే ఆ సామ్యవాదమహాయుగం ఎలాంటిదంటే-

నేనొకజ్జ్ఞ ధాత్రినిండా / నిండిపోయి
నా కుహూరుతశీకరాలే / లోకమంతా జల్లులాడే

ముహూర్తాలవి (The Socialist Era). ఇక్కడ 'ఒకజ్జ్ఞ' అనేది కేవలం ఏకవచనం కాదు; శ్రామిక జాతి కంతటికీ ప్రతీక. 'ధాత్రీ నిండా నిండిపోవడం' శ్రామికవిశ్వరూపాన్ని సూచించే పదచిత్రం. సామ్యవాద మహాయుగంలో (ఇదే మరోప్రపంచం) శ్రామికులు తప్ప మరెవరూ ఉండరు.

ఎండకాలం మండినప్పుడు గబ్బిలంలా క్రాగిపోయిన ఆ శ్రామికుడే త్వరలో కోకిలగా మారిపోయి కుహూరుతశీకరాలు కురిపిస్తాడట! గతంలో మూడే ఋతువులు రాగా భవిష్యత్తులో 'వసంతం' కూడా వస్తుందని సూచన. కానీ ఆ వసంతాన్ని వాచ్యం చేయకపోవడం శ్రీశ్రీ గడుసుపోకడ.

### శ్రామికాభ్యుదయం

ధనస్వామ్యం (Capitalism) తుడిచిపెట్టుకుపోతుంది. శ్రమజీవి ప్రపంచానికి ప్రాణం అవుతాడు. ఆ కాలం రానున్నదని శ్రామికుడు 'జయభేరి' మ్రోగిస్తాడు. ఇంతకు ముందితరులసౌఖ్యాలకై తాను దుఃఖాలపాలైన శ్రమజీవి అందరినీ శ్రమజీవులుగా మార్చి అందరూ సుఖపడేలాగు చేస్తాడు. అదే సామ్యవాదం (Socialism).

'జయభేరి' ఖండిక ఆద్యంతగీతాల రచనలో శ్రీశ్రీ ఒక పరిణామాన్ని పాటించాడు. అది గతి తర్కంతో కూడిన శిల్పం.

| గతం | భవిష్యత్తు |
|---|---|
| ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను | ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను |
| విశ్వవృష్టికి అశ్రువొక్కటి ధారవోశాను | విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలు పోతాను |
| భువనఘోషకు వెర్రిగొంతుక విచ్చిమ్రోశాను | భువనభవనపుబావుటానై పైకిలేస్తాను |

'ప్రపంచాగ్నికి సమిధనివ్వడం'లో లేని అవయవఅవయవిసంబంధం 'ప్రపంచాబ్జపు తెల్లరేకు' కావడంలో ఉంది. ప్రపంచవికసనం (flowering of the world)లో శ్రమజీవికి విడదీయరాని భాగం ఉంటుంది. గతంలో 'నేనుసైతం' దైన్యసూచకంగా వాడిన శ్రీశ్రీ భవిష్యత్తులో 'నేనుసైతం' ధైర్యసూచకంగా వాడి శబ్దశిల్పంలో పరిణతిని ప్రకటించాడు.

'విశ్వవృష్టికి అశ్రువుధారవోయడం'లో లేని స్వాతంత్ర్యం 'విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలు పోవడం'లో ఉంది. మునుపు శ్రమజీవి దాతమాత్రమే. భవిష్యత్తులో భోక్తయై చరితార్థుడవుతాడు.

నిన్న 'భువనఘోషకు వెర్రిగొంతుక విచ్చి మ్రోయడం'లో లేని విజృంభణం 'భువనభవనపు బావుటాయై పైకిలేవడం'లో ఉంది. ఇది అతని విజయానికి పరాకాష్ఠ.

ఒకే ఉపమేయానికి భిన్నస్థలాల్లో భిన్నంగా ఉపమానాలు వాడటంలో సారస్వత ప్రయోగం ఉంది. ఒక ప్రపంచమే భిన్నకాలాల్లో భిన్నవ్యవస్థలు పొందుతుందని ధ్వనింపజేయడంలో సమాజానికి వ్యంగ్యోపదేశం ఉంది.

'జయభేరిలో' మొదలైన ఈ శ్రామికపురోగమన భావాలను శ్రీశ్రీ 'మహాప్రస్థానం, వ్యత్యాసం, జగన్నాథుని రథచక్రాలు' మొదలైన ఖండికల్లో విభిన్నరీతులలో చెక్కి చూపించాడు.

## ముత్యాలసరం కొత్తపోకడలు

పద్యరచనను మాని, జానపదచ్ఛందస్సయిన ముత్యాలసరంలో తనకవిత్వాన్ని రాసినందుకు గురజాడను 'గణబద్ధచ్ఛందస్సుల ఫ్యూడలిజంనుంచి మాత్రాబద్ధచ్ఛందస్సుల ప్రజాస్వామ్య యుగానికి' తెలుగు కవిత్వ చరిత్రగమనాన్ని పరివర్తన చేశాడని ప్రశంసించిన శ్రీశ్రీ 1933కు ముందు పద్యరచనలోనే ఉంటూ జయభేరితో ముత్యాలసరంలోకి పూర్తిగా గళం తిప్పి గురజాడకు శిష్యుడవడమే కాక గురజాడ ఛందోగమనాన్ని మరింత ముందుకు తీసుకువెళ్ళగలిగాడు. భావకవుల్లో కృష్ణశాస్త్రి, రాయప్రోలు, రామిరెడ్డి, విశ్వనాథ, శివశంకరులు, బసవరాజు, అబ్బూరి, కవికొండల, దీక్షితులు, బాపిరాజు కొద్దో గొప్పో ముత్యాలసరాలు రాసినవారేగానీ శ్రీశ్రీలా ముత్యాలసరంలో శోధనా సాధనా చేసినవారుమాత్రం కారు. 'ముత్యాలసరం-ఒకకృషి' అనే వ్యాసాన్ని 1935లోనే రాసినా 1933 నుంచీ ఆ కృషి ప్రయోగరూపంలో శ్రీశ్రీ జరుపుతున్నాడనడానికి 'జయభేరి' సాక్ష్యం. పైన చెప్పిన భావకవులందరి ముత్యాలసరాలనూ పరిశీలించి గురజాడ ఆద్యుడుగా వర్ధిల్లిన ఆ ఛందస్సుకు ఒకమోస్తరు లక్షణశాస్త్రం రాసిన శ్రీశ్రీ మహాప్రస్థానం గీతాలలో ముత్యాలసరానికి ఎన్నో సరికొత్త లక్ష్యాలు రచించి లోకానికి అందజేశాడు. వాటి లక్షణాలను ఇంకా పూర్తిగా విమర్శకులు నిర్దేశించలేదు. ఆపనిని ఈ గ్రంథకర్త చేతనైనంతవరకూ చేయవలసిఉంది.

శ్రీశ్రీకి ముందే ముత్యాలసరం ఛందోవ్యవస్థను పరిశీలిస్తూ అబ్బూరి రామకృష్ణారావుగారు ముత్యాలసరంలో సూర్యేంద్రగణాలున్నాయంటూ విశ్లేషిస్తే, శ్రీశ్రీ ఆయన మతాన్ని నిరాకరిస్తూ ముత్యాలసరం గణబద్ధంకాదనీ మాత్రాబద్ధమనీ దానికి లయ ముఖ్యం అనీ సిద్ధాంతీకరించి కళ్లు

తెరిపించాడు. ఇంత స్వతంత్రదృక్పథం శ్రీశ్రీకి ఉంది కనుకనే ముత్యాలసరంలో నిర్భయంగా ఎన్నో కొత్త ప్రయోగాలు చేయగలిగాడు.

బాగా సాగగల (Elastic metre) ముత్యాలసరం ఛందస్సును తన ఇష్టంవచ్చినట్లు సాగిస్తూ కూడా శ్రీశ్రీ నియమరహితంగా సాగలేదు. ముత్యాలసరానికి తాళం (త్రిపుట) గతి (మిశ్ర) ముఖ్యమనీ యతిప్రాసలు యథేచ్ఛాలనీ ముందు శ్రీశ్రీ ఒక నిర్ధారణకు వచ్చాడు. పాదవిభజనలో స్వాతంత్ర్యం అవలంబిస్తూ గొప్ప విసురులు చూపిస్తూ run-on-verse గా ముత్యాల సరాన్ని నడిపించిన కవికొండల వేంకటరావుగారిని శ్రీశ్రీ శిరసావహిస్తూ కొత్త ప్రయోగాలు మొదలు పెట్టాడు. ముత్యాలసరంకూడా గణబద్ధచ్ఛందస్సులలాగే చతుష్పాత్తు అయిపోవడాన్ని గమనించిన శ్రీశ్రీ దాన్ని సామాన్యస్థాయికి తీసుకురావడానికి చిన్న చిన్న ఛందస్సులుగా విభజించాడు. దీనితో ముత్యాలసరం 14 మాత్రల పొడుగుపాదం 7 మాత్రల ప్రమాణానికి దిగిరాగలిగింది. దీనితో ఆధునిక కాలావసరాలకు ముత్యాలసరం అందుబాటులోకి వచ్చింది. నేటి సమాజంలోని విషమవ్యవస్థను ముత్యాలసరం పాదవ్యవస్థలో ప్రతిబింబించగలిగాడు శ్రీశ్రీ. ముత్యాలసరంలోని పాదం గురజాడ సృష్టిలో 14 మాత్రలకన్నా పెరగలేకపోగా, శ్రీశ్రీ ఆపాదాన్ని 21 మాత్రల వరకూ పెంచివేశాడు. పాదాల హ్రస్వదీర్ఘత్వాలను నిర్మించుకోవడంలో ఆకృతినీ నడకనూ అవి పోషించే భావాన్నీ గమనించుకోవాలనీ ఔచిత్యభంగం కలగకూడదనీ శ్రీశ్రీ చేసుకున్న నియమాలు. ముత్యాలసరం ఛందస్సును లొంగదీసుకుని దానిచేత చిత్రవిచిత్ర రీతులలో కదం త్రొక్కించిన సంవిధానజ్ఞుడు శ్రీశ్రీయే అని మహాప్రస్థానంలోని ముత్యాలసరాలన్నీ నిరూపిస్తాయి. గురజాడ, విశ్వనాథ, శివశంకరశాస్త్రి, కవికొండలగార్ల ముత్యాలసరాలలోని గుణలోపాలను పసిగట్టిన శ్రీశ్రీ మొహమాటం లేకుండా ఆ ముగ్గురిలోపాలను వేలెత్తి చూపాడంటే, ఆ లోపాలు తన ముత్యాలసరాలలో లేకుండా చూసుకోవడానికే కాక వారి గుణాలను తాను కృతజ్ఞతతో అనుసరించడానికి కూడాను.

శ్రీశ్రీనాటికే ముత్యాలసరానికి కొన్ని సంప్రదాయా లేర్పడిపోయాయి. వాటిని శ్రీశ్రీ లెక్కచెయ్యకుండా సంస్కరించాడు. 3+4+3+4=14 మాత్రల కొలతతో సాగిపోతున్న ముత్యాలసరం పాదాన్ని శ్రీశ్రీ 3+4 మాత్రల పాదంగా భాగించుకున్నాడు. అరపాదమే పాదంగా మారిందన్నమాట. ఇలాంటి పొట్టిపాదాలూ, పొడుగుపాదాలూ కలిసి ఏ సంకోచం లేకుండా Stanza లో నడిచే సౌకర్యాన్ని సంపాదించుకున్నాడు శ్రీశ్రీ. ఈ పద్ధతికి కవికొండల మార్గదర్శి.

| కవికొండల | శ్రీశ్రీ |
|---|---|
| చంద్రమకుటము<br>జటాజూటము<br>సాంద్రనీలపు చదలపాపట<br>సురిగిపోతున్నాయి | నేనుసైతం<br>ప్రపంచాగ్నికి<br>సమిధనొక్కటి ఆహుతిచ్చాను |

పైన ఉదాహరించిన శ్రీశ్రీ ముత్యాలసరం అక్కడితో పూర్తి అయిపోయింది. నాలుగుపాదాల ముత్యాలసరంలో 14+14+14+8=50 మాత్రలో అంతకన్నా ఎక్కువో (చివరిపాద ప్రమాణాన్నిబట్టి) తక్కువో ఉండవచ్చు కానీ 45 మాత్రలకు తగ్గదు. కానీ 29 మాత్రలతో (7+7+15=29) మూడుపాదాలతో శ్రీశ్రీ తన ముత్యాలసరాన్ని ముగించేశాడు. కవికొండల వారి ముత్యాలసరం బహుపాదిగా సాగిపోతుంది కానీ అల్పపాదిగా ఆగదు.

గురజాడకన్నా విశ్వనాథ, కవికొండల ముత్యాలసరం గణాలవిషయంలో తీసుకున్న స్వేచ్ఛను శ్రీశ్రీ గమనించాడు. వారిద్దరూ త్రిమాత్రాగణంగా "లగం" (I∪) కూడా వాడారు. అయితే వారికి స్వచ్ఛందగమనం లభించలేదు.

| విశ్వనాథ | కవికొండల | శ్రీశ్రీ |
|---|---|---|
| చివురులూ కొమ్మలా చివర<br>గుబురులూ గుబురులా చివర | అర్ధభాగపు మహంకాళీ<br>ఆకలా అని అనేదెవరు | నేనుసైతం ప్రపంచాగ్నికి<br>నిశీధాలూ విశీర్ణల్లీ<br>మహాప్రళయం జగం నిండా |

ఈముగ్గురిలోనూ శ్రీశ్రీకి గల గమనసౌలభ్యం, వేగం సాటిలేనివి.

| పాతపద్ధతి | శ్రీశ్రీపద్ధతి |
|---|---|
| 14+14+14+8=50 | 7+7+21+7+8=50 |
| నేనొకణ్ణే నిలిచిపోతే<br>చంద్రగాడ్పులు వానమబ్బులు<br>మంచుసోనలు భూమిమీదా<br>భగ్నమౌతాయి, | నేనొకణ్ణే<br>నిలిచిపోతే<br>చంద్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు<br>భూమిమీదా<br>భగ్నమౌతాయి ! |

ఆధునిక గణితశాస్త్రపు మెలకువలు తెలిసిన శ్రీశ్రీ పాదాలను విరవడంలో విప్లవాన్ని తేవడం సమంజసమే. 21 మాత్రలుగల మధ్యపాదం తక్కిన పాదాలకన్నా పొడుగై చంద్రగాడ్పులు మొదలైనవాటి తీక్ష్ణతనూ నైరంతర్యాన్నీ సూచిస్తుంది.

రసస్ఫూర్తినీ, వక్తృచైతన్యాన్నీ అనుసరిస్తూనే శ్రీశ్రీ ముత్యాలసరంను నడిపించాడు. పాదాల మాత్రాప్రమాణాలను రకరకాలుగా ప్రస్తరించుకుని లయవిన్యాసం చేయించాడు.

7+7+15=29 మాత్రలు

14++7+9=30 మాత్రలు

పైని చూపించిన మాత్రాప్రణాళిక ఎంతభిన్నమో రసస్ఫూర్తికూడా అంతభిన్నమే.

| | |
|---|---|
| నేనుసైతం<br>ప్రపంచాగ్నికి<br>సమిధనొక్కటి ఆహుతిచ్చాను ! | ఎండకాలం మండినప్పుడు<br>గబ్బిలంవలె<br>క్రాగిపోలేదా ? |

పై రెంటిలోనూ మొదటి ఉదాహరణంలోని చివరిపాదంలో 14 మాత్రలు 15గా మారి వక్త అవగాహనను సూచిస్తూంటే రెండో ఉదాహరణంలోని చివరిపాదంలో 8 మాత్రలు 9గా మారి వక్త తిరుగుబాటును వ్యక్తం చేస్తోంది.

### వ్యావహారికంలో కవిత్వం

'ప్రభవ' కాలంలోనే తేటగీతి పద్యాలు రాస్తూ ముత్యాలసరం గమనాన్ని అందులో అప్రయత్నంగా ఇమడ్చగలిగిన శ్రీశ్రీ2 'ప్రభవ' అంకితగీతాలను ముత్యాలసరాలలోనే రాశాడు. అయితే అప్పటి ముత్యాలసరాలలో శ్రీశ్రీకి స్వాతంత్ర్యం లేదు. యతిప్రాసలే కాక, గణబద్ధత కూడా ఆ గీతాలలో చోటుచేసుకుంది. పైగా అవి అచ్చపు గ్రాంథికంలో అలసగమనంతో నడిచాయి. మరి 'స్వర్గదేవతలు' రాసేనాటికి శ్రీశ్రీలో ఏమార్పూ రాలేదనడానికి 'ఆంధ్రకవితా పితామహుడు' ఖండిక సాక్ష్యం. అయితే ఇందులో తేటతెలుగును శ్రీశ్రీ విన్యసించాడు. 'జయభేరి'లో మళ్ళీ ముత్యాలసరాలు రాసేనాటికి శ్రీశ్రీలో వచ్చిన మార్పు లనేకం. వస్తువులో దృక్పథంలో శైలిలో వచ్చాయి ఆ మార్పులు.

ముఖ్యంగా మనమిప్పుడు చెప్పుకోవలసినది వ్యావహారిక భాషనుగురించి. భావవిప్లవాన్ని సాధించదలచిన శ్రీశ్రీ భాషావిప్లవాన్ని దాని కభిన్నంగానే భావించినందువల్ల 'జయభేరి'ని సమకాలికసమాజం వాడుకునే సజీవభాషలోనే రాశాడు. భావవ్యక్తీకరణలో శ్రీశ్రీ ముత్యాలసరం సౌలభ్యాన్ని సాధించిందనేందుకు ప్రభవలోని ముత్యాలసరాలతో జయభేరి ముత్యాలసరాలను పోల్చి చూడవచ్చు. ఈసౌలభ్యాన్ని సాధించేందుకు శ్రీశ్రీ ఎంతో శ్రమపడి, అన్వేషణ సాగించాడు.

శ్రామికుడు చేసే తిరుగుబాటును శ్రామికప్రజాభాషలో కాక ఉన్నతవర్గాల అర్థంకాని కృతకభాషలో రాయడం సమంజసం కాదు కనుకనే శ్రీశ్రీ సులభవ్యావహారికంలో ముత్యాలసరాలతో ఈ రకమైన కవిత్వం మొదలు పెట్టాడు. ఇంతకుముందు కవిత్వంలో గ్రాంథికాన్నే వాడుతూ

2 చూ. రజనీగానము, మాతృగీతి ఖండికలు.

వచ్చిన శ్రీశ్రీ గ్రాంథికంలోనే మొట్టమొదటి వచనపద్యాన్ని రచించి[3] వ్యావహారికంలోకీ మాత్రాచ్ఛందస్సులలోకీ మలుపుతిరగడానికి కారణం అతనిలో అంకురించిన భావవిప్లవమే.

గురజాడతో తెలుగుకవిత్వంలోకి అడుగు పెట్టిన వ్యావహారిక భాష ఆయన ముత్యాల సరాలతో అంకురదశలోనే కనిపిస్తుంది. 'వైరములు వాణిజ్యమందే' 'మేలుకొలుపులు కోడి కూసెను' 'ఉత్తమాశ్వంబిది నరేశ్వర' 'కొన్నాళ్ళకు పతి కొనిపోవచ్చెను' 'వగచిరి వదినలు వగచిరి తమ్ములు తల్లియు కంటను తడిబెట్టెన్' వంటి గురజాడ ప్రయోగాలను చూస్తే ఆయన ఇంకా గ్రాంథికవాసనలను పూర్తిగా పరిహరించలేకపోయారని స్పష్టం అవుతుంది. ముఖ్యంగా క్రియాపదాల గ్రాంథికత్వం మిగిలిపోవడానికి కారణం ఆయన కృషిలోపమే కావచ్చు. ఎంకి పాటలలో వ్యావహారికం గ్రామ్యపు యాసతోకూడినదే కానీ శిష్టవ్యావహారికం కాదు. కోకిలమ్మ పెళ్ళిలో మాండలికముద్ర లెక్కువ. బసవరాజు, కవికొండల గ్రాంథిక వ్యావహారికాల సరిహద్దుల్లోనే సంచరిస్తున్నారు.

ఇలాంటి సమయంలో శ్రీశ్రీ వచనంలో రాసినంత సులువుగా వ్యావహారికాన్ని మాత్రాచ్ఛందస్సులో ఇమిడించి చూపించాడు. అశ్రు వాక్కుటి ధారవోశాను, నిలువునిలువున నీరు కాలేదా, ఆకలేసీ కేకలేశానే, నెత్తురు క్రక్కుకుంటూ పేలిపోతాయి వంటి వాక్యాలూ, నేను సైతం, ఎండకాలం, పగళ్ళన్నీ, జగంనిండా వంటి వాక్యభాగాలూ, పదశకలాలూ నింగినుండీ తొంగిచూచే, క్రక్కుకుంటూ, భూమిమీదా భుగ్నమౌతాయి వంటి యాసలూ, కాకువులూ శ్రీశ్రీ ఛందస్సంఘటనకు అడ్డం కాలేదు.

| ప్రభవనాటి ముత్యాలసరం (1928) | మహాప్రస్థానంనాటిముత్యాలసరం (1933) |
|---|---|
| త్రిదివధామ ప్రథితగాయక<br>మధురరుతముల నడుమనించుక<br>మామకీనాలసరవమ్ముల<br>మనసునిల్పఁగదే ! | నింగినుండీ తొంగిచూచే<br>రంగురంగుల చుక్కలన్నీ<br>రాలి నెత్తురు క్రక్కుకుంటూ<br>పేలిపోతాయి. |

| గురజాడ ముత్యాలసరం (1910) | శ్రీశ్రీ ముత్యాలసరం (1933) |
|---|---|
| ధూమకేతువు కేతువనియో<br>మోము చందురు డలిగిచూడడు<br>కేతువా యది ? వేల్పులలనల<br>కేలివెలితొగ కాంచుమా ! | నేనుసైతం<br>ప్రపంచాబ్జపు<br>తెల్లరేకై పల్లవిస్తాను. |

3 విద్యున్మాలికలు

## కాళ్లుతెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి!

1933 ఆగస్టు 12

ఒక సామాజికవ్యవస్థకు ఒక ఆశయావళికి చెందిన వ్యక్తి ఒక వస్తువును దర్శించే పద్ధతి ఆ సామాజికవ్యవస్థకు, ఆ ఆశయావళికి తగినట్లే ఉంటుంది. రాత్రినీ వెన్నెలనూ చిరకాలంనుంచీ కవి దర్శిస్తున్నా భిన్నభిన్న భావనలు చేస్తూఉండటాని కింతకన్నా ముఖ్యకారణం కనిపించదు. భావకవి పరమేశ్వరభక్తుడూ సౌందర్యవాదీ ఫ్యూడల్‌వ్యవస్థలో జీవించినవాడూ కనుక వెన్నెల రాత్రిని వర్ణించేటప్పుడు అతని ఆ వ్యక్తిత్వం బయటకు వస్తుంది. కృష్ణశాస్త్రి 'విశ్రాంతి' చూద్దాం.

నీలాభ్రసరసిలో నిండుజాబిల్లి
రాయంచవలె విహారము సల్పుచుండె
కమ్మతెమ్మెరలు శాఖాపత్రములనో
కల్లోలినీ తరంగములనో వాగె
నాట్యంబు మధురగానంబును మాని
గాటంపు నిద్దురఁగాంచె శైవలిని
సర్వేశ్వరుని హస్తజలజయుగ్మమున
విశ్వమే హాయిగా విశ్రాంతిఁ జెందె.[1]

విహారం, నాట్యం, గానం, నిద్ర, విశ్రాంతి–ఇదే (శాస్త్రిగారి) భావకవి జీవితానందం. ఇలాగే శ్రీశ్రీ కూడా భావకవిగా ఉన్నప్పుడు రాసిన 'లాస్యతృష్ణ' చూద్దాం.

కడలి కెరటాల శ్రుతిలోన కలసిమెలసి
గగనగంధర్వ గానరాగములు మ్రోయ
తూర్పుదిక్కున పూర్ణిమాతుహినకరుడు
తరళధవళ విలాసనర్తనము తెరచె

1 కృష్ణపక్షము.

ఈ విశాలసమగ్రవాతావరణము
కాంతితంత్రీసుధామృదుగానగీతు
లెగయు జగదీశ్వరాంఘ్రి మంజీరనటన
మటు లనంత లీలానాట్య మభినయించె
తారకలు లేని స్వచ్ఛసౌందర్య బంధు
రాంబరాంగణ మొక ధవళాంబరివలె
అమృతవారాశివలెనె చరాచరముల
కిడెను తన దివ్యలాస్యసాహిత్యరుచులు
ఇది జలధినాథునెదలోన నిముడలేని
ఎదురులేని మహాసౌఖ్యమేమొ-శీత
వీచికామేదుర తుషార సేచనమున
ఆకసమునంటుకో తేలియాడు నితడు
ఊరలునా నా ఎడంద ఈ దొరలు తరగ
లందొక సుధాంశుకిరణమై హర్ష గాన
కలకల శ్రావ్యనినదములొలయుచున్ న
వీన ఫేన ద్యుతులలోన లీనమగుచు.2

ఈ పద్యాలలో గానం, రాగం, నర్తనం, ఈశ్వరుడు, ధవళాంబరి, సాహిత్యం, సౌఖ్యం, తేలియాడటం, చంద్రకిరణం, లీనంకావడంవంటివన్నీ శ్రీశ్రీ వైయక్తిక జీవితదృక్పథాన్ని ప్రతిబింబిస్తున్నాయి. సమాజంతో కవి తన సంబంధాన్ని వ్యక్తంచేయలేకపోయాడంటే నిజంగా ఆ సంబంధాన్ని పట్టించుకోలేదు కనకనే ఆనందం, ఒంటరితనం, సౌందర్యానుభవతృష్ణ ఎంతకీ తీరనివి. ఇది 1931 జనవరి 6 నాటి శ్రీశ్రీ స్థాయి. 1932 మార్చి 21న శ్రీశ్రీ పూర్తిచేసిన 'ఖండశశి' చూద్దాం.

ఆ పశ్చిమాశా విషాదాంత కావ్యమై
వ్యాపించు కాలమేఘాళిలో పొడచూపి
ఖండేందుమూర్తి ! ఆకాశకర్పరమెల్ల
నిండు నీ గ్రుడ్డివెన్నెల ధూమధూపమై

---

2 స్వర్గదేవతలు.

వలదు దయలేని ఆ జిలుగువెలు గెందేసి
కలిపివేయుము పల్లటిలు వార్ధి కెరటాల
సంపెంగ విరిపైడిచాయలో నాకేమొ
వంపు తేరినకత్తి వలె నుండి వీ రేయి-
ఖండేందుమూర్తి! లోకముపై కుపితదృష్టి
మండించు ఈ సమున్మాద నాట్యమిదేమి
ఓ సుధాహృదయ! నిట్టూర్పులై ప్రసరించు
వికల మామక భావశకలముల్ నీవంక
కురియింపు మింక నిష్ఠురవృత్తి పోనాడి
హరజటాజూట గంగాంబు శీతలవృష్టి.[3]

విషాదం, గ్రుడ్డివెన్నెల, నిర్దయ, వంపుతేరినకత్తి, కుపితదృష్టి, సమున్మాదనాట్యం, నిట్టూర్పులు, వికలభావాలు, నిష్ఠురవృత్తి మొదలైనవి వ్యక్తికి సమాజసంబంధంవల్ల కలిగిన చైతన్యంలోని భాగాలు. లాస్యతృష్ణ రాసినవ్యక్తి ఖండశశి రాసేనాటికి మారిపోయాడు. ఆ మార్పు భావనలో, సంవిధానంలో పదజాలంలో గోచరిస్తోంది.

1933 ఆగస్టు 12న ఆ శ్రీశ్రీయే రాసిన 'ఒకరాత్రి'ని చూద్దాం.

గగనమంతానిండి పొగలాగుక్రమ్మి-
బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టునన్ను!
ఆకాశపుఎడారి నంతటా అకట
ఈ రేయి రేగింది ఇసుకతుపాను!
గాలిలో కనరాని గడుసుదయ్యాలు
భూదివమ్ములమధ్య ఈదుతున్నాయి
నోరెత్తి హోరెత్తి నాగులు సాగరము
కరి కళేబరములా కదలదు కొండ
ఆకాశపు ఎడారిలో కాళ్లు తెగిన
ఒంటరి ఒంటెలా గుంది జాబిల్లి
విశ్వమంతా నిండి వెలిబూదివోలె-
బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టు నన్ను.[4]

3 స్వర్గదేవతలు
4 మహాప్రస్థానం

భయపెట్టడం, ఇసుకతుపాను రేగడం, కనిపించని గడుసు దయ్యాలు, ఈత, నోరెత్తి హోరెత్తి నొగలడం, కదలనికొండ, ఎడారి, కాళ్ళు తెగడం, ఒంటరితనం, ఒంటు మొదలైనవి వ్యక్తి, జీవితం, సమాజం, ప్రపంచం అనే నాలుగింటి వాస్తవికతను ప్రతిఫలిస్తున్నాయి.

మద్రాసులో జంతుశాస్త్రంలో బి. ఏ., పట్టా తీసుకుని, విశాఖపట్టణానికి తిరిగివచ్చి సరి అయిన ఉద్యోగం ఏదీ లభించక, ఆర్థికమైన ఇబ్బందులలోపడి జీవితపుకష్టపరంపరలు చవిచూస్తున్న శ్రీశ్రీ మనకు ఈగీతంలో తనవంటి అనేకయువకుల ప్రతినిధిగా కనిపిస్తాడు. విశాఖపట్టణానికి హార్బరు వచ్చినపుడు తనకు యౌవనం వచ్చిందనీ అందరూ ప్రేమగీతాలు రాసేరోజుల్లో తాను పారిశ్రామిక విప్లవాన్ని కౌగిలించాననీ ఆంధ్రవిశ్వవిద్యాలయం తనకు ప్రపంచసాహిత్యం చదవడానికి దారి చూపిందనీ పిచ్చాసుపత్రి తనకు ఫ్రాయిడ్‌ను చదవడానికి ప్రేరణకలిగించిందనీ సెంట్రల్ జెయిల్‌లో తన మిత్రుడి ఉరితీత ఘట్టం తనను కదిలించిందనీ విశాఖ శ్మశానం (తుమ్మెదలమెట్ట)లో తన తాతగారి దహనంయొక్క ప్రభావం తనమీద ఉందనీ5 స్మరించుకుంటూ ఉండే శ్రీశ్రీ మనకు ఈ గీతంలో కనిపిస్తాడు. ఏరాడకొండమీద ఒంటరిగా నిలబడి విశాఖపట్టణాన్ని చూస్తూవచ్చిన శ్రీశ్రీకి 'కరికళేబరం'లా ఆ కొండయే కనిపించడంలో ఆశ్చర్యంలేదు. ప్రభవ, స్వర్గదేవతలు రాసే కాలంలో భావకవులను అనుకరిస్తూ తన వ్యక్తిత్వాన్ని పైకి తెచ్చుకోలేకపోయిన ఈ నూతన యుగవ్యక్తి మద్రాసువంటి మహానగరాన్ని చూసివచ్చాకా కుబుసం ఊడ్చుకుని తన ప్రధానరసం బీభత్సమని గుర్తించాడంటే అతడు చూస్తున్న ప్రపంచం అంతగా మారిపోయిందన్నమాట

సంస్కృతాంధ్ర వ్యాకరణాలంకారశాస్త్రాలూ, మానవీయశాస్త్రాలూ, తత్త్వశాస్త్రం, వేదాంతంవంటివి చదువుకుని తెలుగుకవిత్వం రాసినవాళ్ళకీ జంతుశాస్త్రం చదువుకుని తెలుగు కవిత్వం రాసిన శ్రీశ్రీకీ సహజంగానే భావనావిధానంలో తేడా ఉంది. తాను చదివిన జంతు శాస్త్రం శ్రీశ్రీకి వ్యుత్పత్తిగా సంస్కారంగా మారిపోయి, మహాప్రస్థానం గీతాలలో ఆ జంతు కోటిని 'సింబల్సు'గా వాడుకోవడానికి ఒక చైతన్యంగా పనిచేసింది. 'ఒకరాత్రి'లోని ఒంటె, ఏనుగు అలాగే దిగాయి.

'మీరు మనసారగా నేడ్వనీరు నన్ను, నా విరులతోట పెంచికొన్నాడ నొక్కపవడపు గులాబిమొక్క, ప్రేయసీ ప్రేయసీ ప్రియుడనే ప్రియుడనే' వంటి భావకవితాపంక్తుల్లో 'నేను' సౌందర్యానుభవం గల కవికే ప్రాతినిధ్యం వహించి సమానానుభవం గల వాడినే స్పందింప జేస్తూంటే శ్రీశ్రీ 'నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను.' 'గగనమంతా నిండి పొగలాగు క్రమ్మి బహుళ పంచమిజ్యోత్స్న భయపెట్టు నన్ను' వంటి కవితాపంక్తుల్లో 'నేను'

5 విశాఖపట్టణపు జ్ఞాపకాలు (1948 మే 2 నవోదయ) శ్రీశ్రీ సా. రెండు. వచన. 393-94 పే.

సామాజికవ్యవస్థలోని శ్రామికమానవుల నందరినీ స్పందింపజేస్తుంది. సౌందర్యానుభవానికి అల వాటుపడిన వర్గంవారికివి విడ్డూరంగా కనిపిస్తాయి. కాల్పనికలోకానికీ వాస్తవలోకానికీ గల తేడాలే వీటికి కారణం. సమాజవ్యవస్థలోని వికృతత్వాన్ని శ్రీశ్రీ ప్రకృతిలో దర్శించాడు. మృత్యువు, కష్టాలు, దుఃఖాలు, అన్యాయాలు వీటన్నింటికీ మధ్య శ్రీశ్రీ మానసిక స్థితికి ప్రతి బింబమే 'ఒకరాత్రి' అయింది.

వ్యక్తి వాస్తవికత

పౌర్ణమి వెళ్ళిపోయిన తర్వాత అయిదోరోజున ఆకాశంవైపు చూసిన ఒకరాత్రి అది. అప్పటి వెన్నెల

గగనమంతానిండి పొగలాగు క్రమ్మి

ఉందట! ఆ రోజు తన భయానికి కారణం ఆ వెన్నెల! వెన్నెలకు పోలికగా పొగ నెప్పుడైతే చెప్పాడో, ఆకాశానికి పోలిక శ్మశానంగా అప్పుడే సూచిస్తున్నాడు శ్రీశ్రీ. పొగద్వారా శ్మశానాన్నీ, శ్మశానంద్వారా శవదహనాన్నీ, శవదహనం ద్వారా మృత్యువునీ జ్ఞాపకం చేస్తున్నాడు. తానప్పటికే 1930లో 63 రోజులు టైఫాయిడ్ జ్వరం అనుభవించి మృత్యువును గెలిచి బ్రతికాడు శ్రీశ్రీ. కానీ బ్రతికిన తనకు బ్రతుకు తెరువు కనిపించడం లేదు. ఇదే భయానికి కారణం.

'బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టు నన్ను'

అంటాడు. బహుళపంచమి తన జీవితంలోని నిరుద్యోగదశ. నిరుద్యోగానికి కారణం సమాజవ్యవస్థ.

శ్రీశ్రీ ఆనాడు చూస్తున్న ఆకాశం అతని భయానికి తగినట్లే మారిపోయింది. ఆకాశం ఎడారి! వెన్నెల ఇసుక తుపాను! ఈ పోలికలు శ్రీశ్రీ ఒంటరితనాన్ని సూచిస్తున్నాయి.

జీవితవాస్తవికత

ఎడారిలో ఇసుకతుపాను రేగిన దృశ్యం బీభత్సరసాస్పదం. జీవితవాస్తవికత ఇదే! ఆకాశపు టెడారి శ్రీశ్రీ హృదయానికి ప్రతీక. ఆ మనస్సులోనే రేగింది ఇసుకతుపాను.

అకట! ఈరేయి రేగింది ఇసుకతుపాను అన్నప్పుడు 'అకట!' అనే విషాదార్థక అవ్యయం అతని నిట్టూర్పుని వ్యక్తంచేస్తోంది. 'ఈరేయి' అనేది తాను ఆ విషాదాన్ని అనుభవించిన రాత్రికే కాదు, కఠోరమైన సమాజవాస్తవికత నెలకొన్న కాలానికే సంకేతం.

ఈ భయంకరవాతావరణంలో శ్రీశ్రీకి ఎన్నో భ్రాంతులు కలిగాయి.

గాలిలో కనరాని / గడుసుదయ్యాలు
భూదివమ్ముల మధ్య / ఈదుతున్నాయి!

'ఈదుతున్నాయి' అనే క్రియను విచిత్రమైన అర్థాలలో శ్రీశ్రీ వాడాడు. ఈదుతున్నవి గడుసు దయ్యాలట! ఈదేచోటు భూమ్యాకాశాల మధ్యభాగం అట! ఇదంతా శూన్యం ఆ గడుసు దయ్యాలు కనిపించనిరూపంలో ఉన్నాయి. గాలిలో చేయవలసిన పని ఎగరడం అయిఉండగా దాన్ని 'ఈదడం'గా ఊహించాడు శ్రీశ్రీ. ఈతకు కావలసింది నీరుకాగా దాన్ని గాలిగా మార్చాడు శ్రీశ్రీ.

ఈ వైచిత్రి ఒక్కక్షణంపాటు మనల్ని చకితుల్ని చేస్తుంది. ఈ గడుసుదయ్యాలు తిమింగిలాలవలె కవిని భయపెడుతున్నాయి. సమాజమే ఈ భూమ్యాకాశాల మధ్యభాగం. అందులో వాతావరణమే గాలి. ఆ వాతావరణంలో కనరాకుండా సంచరిస్తున్నవారు స్వార్థపరులైన భూస్వాములూ, ధనస్వాములూ, సామ్రాజ్యవాదులూ కూడాను. ఈ వ్యవస్థలో శ్రామికుడికి వీరంతా ప్రతిపక్షంలోనివారే.

శ్రీశ్రీ నిర్దిష్టంగా ఇదంతా భావించాడా అనే సందేహానికి తావులేదు. సుప్తచేతనలోంచి ఇవన్నీ పొడుచుకువస్తున్న భావాలు. సమాజవాస్తవికత కవి వాడిన ప్రతీకలలోంచి తొంగి చూస్తోంది. అది శ్రీశ్రీ సహజపరిణామం.

సమాజవాస్తవికత

నిజానికి ఈ మానసికకల్లోలం అనుభవించిన ఆరాత్రి శ్రీశ్రీ కూర్చున్నచోటు సాగరతీరమే!

నోరెత్తి హోరెత్తి నొగులు సాగరము!

అంటాడందుకే. హోరెత్తడం సముద్రానికి సహజమేకాని, 'నోరెత్తి హోరెత్తడం' మాత్రం అచేతనానికి మానవత్వం ఆరోపించడమే. ఇక్కడ సముద్రదుఃఖంలో శ్రీశ్రీ దుఃఖమే ధ్వనిస్తుంది. అంతేకాదు; సమాజంలోని అన్యాయాలను గురించి సాగరుడంతటివాడు నోరెత్తి హోరెత్తి నొగులుతూ ఉన్నా ఆ సమాజం మాత్రం వినిపించుకునే స్థితిలో లేదు. ఈ విషయాన్ని ధ్వనించిన తీరు అపూర్వం.

కరికళేబరములా కదలదు కొండ

ఏనుగుశవంలా ఎదురుగుండా ఉన్న కొండ ఆ సమాజమే! కొండను కరికళేబరంతో పోల్చడంలో శ్రీశ్రీ కొత్తపుంత త్రొక్కాడు. ఈ ఉపమానం కేవలం వైచిత్రికోసమే అనుకుంటే శ్రీశ్రీ గొప్పతనం అర్థంకాదు. ఉన్నతంగా ఉన్నవ్యక్తులుకూడా శవప్రాయులుగా ఉన్నారేమిటి ఈ సమాజంలో అనే ఆవేదన ఈ ఉపమానానికి వెనక పొంచి ఉంది.

ఇంత అస్తవ్యస్త సమాజవ్యవస్థలో తనవంటి వ్యక్తుల కెందరికో భద్రత లేదు. వాళ్లంతా ఒక్కొక్కడూ

'కాళ్లు తెగిన ఒంటరి ఒంటె'

లాగున్నారు. ఏకాకిత్వం, వికలత్వం, వికృతత్వం, కదలిక లేని జడత్వం ఇవన్నీ ఈ ఉపమానానికి నిండలే! నిరుద్యోగి అయి, డబ్బులేని తానూ అలాగే ఉన్నాడు. కానీ, తానేం తక్కువవాడా? తనకు పట్టిన ఈ దారిద్ర్యాన్ని శ్రీశ్రీ మహాకవిలాగే వ్యక్తంచేశాడు.

'ఆకాశపు ఎడారిలో కాళ్లు తెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి'

ఇదివరకే ఇసుకతుపాను రేగిన ఆకాశపు ఎడారిలో చందమామ దెబ్బతిని కాళ్లు విరిగిన ఒంటరి ఒంటెలా (వ్యాపారపారీణులచేత విడిచిపెట్టబడినవాడై) మిగిలిపోయాడు. ఆ చందమామే శ్రీశ్రీ, తాను పురోగమనం సాగించలేని కుంటివాడిలాగున్నాడు. బరువు మోయలేకపోతున్నాడు.

ఇందులో శ్రీశ్రీ ఉపమానం మాలికమైనది. బహుళపంచమి చంద్రుడు క్షీణిస్తూఉంటాడు కనుక ఆకారంచేత ఒంటెలాగే కనిపిస్తాడు.

తన విషమపరిస్థితికి కారణం సమాజవ్యవస్థ అని గ్రహించడంవల్లనే శ్రీశ్రీ భావకవులకన్నా ముందుకు పోగల్గాడు.

### ప్రక్రియావైచిత్రి

భావకవులకు భావవైచిత్రులూ శబ్దవైచిత్రులూ ఇష్టమేమో కానీ ప్రక్రియావైచిత్రి (Surprising Form) తెలియదనే చెప్పాలి. శ్రీశ్రీ అందులో గడుసరి. ఈ గీతమే తీసుకుందాం. తాను వ్యక్తంచేయదలచిన ఒక అంశాన్ని భావచిత్రాల పొదుపు (economy of images)తోనూ భావచిత్రాల పునరుక్తి (repetition of images) తోనూ చెప్పడంలో శ్రీశ్రీ ప్రక్రియావైచిత్రి అపురూపం. ఒకరాత్రిలోని 6 గీతాల (stanzas)లోనూ సమాజబీభత్సాన్ని చెప్పింది 3 గీతాలలోనే. తతిమ్మా మూడూ వాటి రూపాంతరాలే. మొదటిగీతం, ఆరవగీతం (మొదలు, తుది) ఒకటే. కానీ ఈషద్భేదంతో ధగధగలాడతాయి. అక్కడ వెన్నెల ఆకాశంలో పొగలాగు, ఇక్కడ వెన్నెల ప్రపంచంలో వెలిబూదిలాగు కనిపించి భయపెట్టడమే తేడా. ఇది భయవ్యాప్తి లక్షణం. శవదహనానికి ముందు పొగ, చివర వెలిబూది. కానీ శ్మశానం ఇంకా అలాగే ఉండిపోయింది.

రెండవగీతం, ఐదవగీతం ఒకేలా మొదలవుతాయి. కానీ కొంచెం తేడా. అయినా రెంటికీ అవినాభావ సంబంధం.

2

ఆకాశపు ఎడారి<br>
నంతటా అకట!<br>
ఈ రేయి రేగింది<br>
ఇసుక తుపాను

5

ఆకాశపు ఎడారి<br>
లో కాళ్లు తెగిన<br>
ఒంటరి ఒంటెలా<br>
గుంది జాబిల్లి

అసలు ఇసుకతుపాను రేగిన ఎడారి. అది భయంకరం. అందులో ఒంటెకు కాళ్లు తెగడం విషాదకరం.

సమాజంలో ఎవడికివాడే జీవితభారాన్ని మోసుకుంటూ వ్యవస్థలోని దోపిడీవల్ల అసహాయుడై ఏకాకియై మిగిలిపోతున్నాడు. ఈ సమాజం త్వరలోనే శ్రీశ్రీకి "పద్మవ్యూహం"[6]లా కనిపించనున్నది.

బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టు నన్ను! ఈ సమాజంలో ఇలాంటి 'నేను' లెంతమంది ఉన్నారో, అదే శ్రీశ్రీ చెబుతున్న అంశం!

మహాప్రపంచ కవిత్వానికి కావలసిన వినూత్నపదజాలాన్ని శ్రీశ్రీ ఏరుకుంటున్నాడు. ఎడారి, ఇనుకతుపాను, దయ్యాలు, ఒంటె, వెలిబూదివంటి పదజాలాన్ని ప్రయోగించడంలో శ్రీశ్రీ ప్రజ్ఞ మహాప్రస్థానం గీతాల్లో సూర్యకాంతిలా అలముకోబోతున్నది. భావకవితానక్షత్రాలు వెలవెలపోబోతున్నాయి.

### మంజరీద్విపదకు మార్పులు

వృత్తాలనుంచి మంజీరద్విపదఛందస్సుకేసి మలుపుతిరిగినవారు భావకవులేగానీ వారు వృత్తాలనూ గేయాలనూకూడా గ్రాంథికంలో రాశారు.

నవ్వేపోదురుగాక నాకేటి సిగ్గు (3 ఇంద్ర 1 సూర్య)
నా యిచ్ఛయేగాక నాకేటి వెఱపు

అంటూ రాసిన కృష్ణశాస్త్రి ఛందస్సులో గణబద్ధత వదిలివేయబడలేదు.

పెళ్లిపందిట్లోన పెద్దలంతాను (5+5+5+3)
వేంచేసివున్నారు పెళ్లికొడుకేడి

అంటూ రాసిన బసవరాజు అప్పారావు గణబద్ధత వదిలేసి మాత్రాబద్ధత పాటించి వాడుకభాషను తీసుకున్నాడు. శ్రీశ్రీ మహాప్రస్థానంలో మంజరీద్విపదను మాత్రాబద్ధంచేసుకుంటూ పాదవిభాగాన్ని మార్చుకున్నాడు. ఈ ఛందస్సు ఒకరాత్రిలో తప్ప మరెక్కడా లేదు.

గాలిలో కనరాని (5+5) A
గడుసుదయ్యాలు (5+3) B
భూదివమ్ములమధ్య (5+5) A
ఈదుతున్నాయి! (5+3) B

అయితే యతిప్రాసలూ, గ్రాంథికావశేషాలూ శ్రీశ్రీని వదలలేదనవచ్చు కానీ అవి కృతకంగా కనిపించకపోవడం విశేషం.

---

6 బుక్కులు

ప్రపంచం అంతటా
అభివృద్ధిని కాంక్షించే కవుల స్వప్నాలు
రష్యన్ విప్లవంలో
ఆకృతిధరించడం నాకు కనబడింది !

సామాజికవిప్లవానికి
పురోగామిగా
సాహిత్యవిప్లవం
సాగలన్న దృఢనిశ్చయం
ఏర్పడింది.

—శ్రీశ్రీ.

# 1934 కవితలు (1)

# 53/గంటలు

## నీ హృదయములో నా హృదయములో గంటలు ! గంటలు ! !

1934 ఫిబ్రవరి 18

వస్తువును లేదా క్రియను సూచించే శబ్దం ఆవస్తువు ఆక్రియ ఎదురుగా లేకపోయినా అది ఉన్నప్పుడు కలిగే అనుభవాన్ని తన ధ్వనిచేత ఇంద్రియాలకు కలిగించగలిగితే అది సార్థకమైన శబ్దమే అవుతుంది. ఇలాంటి శబ్దాలను కూర్చి కవిత్వం వ్రాయడం కవి పరిణతికి చిహ్నం. తెలుగులో నన్నయనాటినుంచి శ్రీనాథునివరకు ఈరీతికోసం గొప్ప కృషి జరిగింది. మను చరిత్రలో అది శిఖరస్థానం అందుకుంది.

"అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్లకలాపకలాపిజాలమున్
కటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్"

హిమవంతంనుంచి క్రిందికి దిగే సెలయేళ్ల తరంగాల చప్పుళ్ళను మన చెవులు రెండుమూడు పాదాల లోని సమాసార్భటిలో వింటాయి. అయితే ఇందులో ప్రతిపదానికీ అర్థం తెలిసిన పండితశ్రోత మాత్రమే ఆ అనుభూతిని పూర్తిగా పొందగలడు

"ప్రళయకాలమహోగ్రభయదజీమూతోరుగళ ఘోర గంభీర ఘుళఘుళార్భటులలో మెఱపేలా?" వంటిపంక్తుల్లో భావకవికూడా ఆరీతికోసమే ప్రయత్నించాడు. ఇటువంటి భాషార్భటిని శ్రీశ్రీ కూడా ప్రభవలో అనుకరించాడు. "భీప్రదక్రకచోగ్రదంష్ట్రా ప్రభూత విస్ఫురత్తేజమునఁ దాండవించు నన్ను మృత్యుదేవతగా మదినెఱుఁగలేవా"

భావబంధురంగా ఉన్నా కవిత్వం కొందరికి నచ్చకపోవడానికీ అర్థం తెలియకపోయినా కవిత్వం ఆకర్షించడానికీ ఈ రీతియే కారణమవుతున్నదని శ్రీశ్రీ ఒకప్పుడు వివరిస్తూ ఉత్కృష్టరసానందం పద్యం చదవగానే కలిగే ఆశ్చర్యంలోనే ఉందనీ తుదకు అర్థం మేడిపండులా తేలినా ఎవరికీ అక్కరలేదనీ విచారించాడు.[1] ఒక పద్యాన్ని చదివి అందులో ధ్వనిని అనుభవించి ఆనందించిన తరువాత తిరిగి అర్థాన్ని వెదుక్కోవలసిరావడంకన్నా ధ్వనిని అనుభవించే సమయంలోనే

---

1 శ్రీశ్రీ సా. ఒకటి. కావ్య. 188 పే.

అర్థంకూడా అనుభవానికి వస్తే అది చక్కటి కవిత్వం అనడంలో ఎవరికీ సందేహం ఉండదు. ప్రాచీనకవిత్వంలో కానీ సంస్కృతకవిత్వంలో కానీ ఇలాంటి ఉదాహరణలు కొద్దిగానే ఉండటానికి కారణం ఆ కవులు తమ పాఠకుల స్థాయిని ఉన్నతంగా ఊహించుకోవడమే. సులువుగా చెప్పడం క్లిష్టమైన పని అని కష్టంగా చెప్పడం సులువనీ గ్రహించిన శ్రీశ్రీ మొదటిపద్ధతికోసమే అన్వేషణ, అభ్యాసం సాగిస్తూ వచ్చాడు. అలా సులువుగా చెప్పడంవల్లనే తిక్కన, వేమన, గురజాడ శ్రీశ్రీకి కవిత్రయం అయ్యారు.

ఈ అన్వేషణలో విదేశీయకవులను అధ్యయనం చేయసాగిన శ్రీశ్రీని అమెరికన్‌కవి, విమర్శకుడు, కథకుడు అయిన ఎడ్గార్ అల్లన్‌పో ఆకర్షించాడు. అల్లన్‌పోను తన ఋషిత్రయంలోనే ఒకడ్నిగా భావించుకున్న శ్రీశ్రీ అతడు తన కావ్యజీవితాన్ని ప్రోదిచేసి తన ఆదర్శాలను మలిచాడనీ అతని గీతాల్లో ప్రతిపదం రసబంధురం అనీ అతడు ప్రతి అంగుళం కవి అనీ అతని కావ్యాల్లో ఒక అతీతమైన మహస్సు ఉందనీ దాన్ని అందుకోదగిన ఇంద్రియాలున్నవారికి అందులోని గంధర్వసంగీతం అనుక్షణానుభూతమవుతుందనీ వర్ణించాడంటే అల్లన్‌పో ప్రభావానికి శ్రీశ్రీ ఎంతగా లోబడ్డాడో అర్థం అవుతుంది. తన కవిత్వంమీద ఇక్కడా అక్కడా అనకుండా అంతటా ఇద్దరే ఇద్దరి ప్రభావాలు పనిచేసున్నాయని ఒప్పుకున్న శ్రీశ్రీ ఆ యిద్దరూ గురజాడ, పో అనేశాడు. గురజాడ 'ఆర్థికం'గా దారిచూపిస్తే, పో శాబ్దికంగా దారిచూపించాడనుకోవాలి. ఎందుకంటే గురజాడ కవిత్వం వెనుకచెప్పుకున్నరీతిగ తాడంబరానికి స్వస్తి చెప్పింది కనుక. "మేలుకొలుపులు కోడికూసెను విరులు కన్నులు విచ్చి చూసెను ఉండి ఉడిగియు ఆకులాడగ కొసరెనోయన గాలి వీచెను". శబ్దార్థాలు రెండూ ఒకేసారిగా అనుభవానికి అందే కవిత్వం గురజాడది. ఈ విధమైన అనుభూతిని శ్రీశ్రీ కూడా ఇంతకన్నా ఉదాత్తరీతిలోనే కలిగించగలగడానికి మొదటి మార్గదర్శి అల్లన్‌పో, తరవాత బాడ్లెయిర్, పిదప స్విన్‌బర్న్ మొదలైనవారు కనుక పో గురించి గురించి అంతగా శ్రీశ్రీ ప్రశంసించాడు.

19వ శతాబ్దపు తొలి అర్ధభాగంలో జీవించిన అల్లన్‌పో శబ్దక్రీడలు సులభావగాహన కలిగించగల నిరాడంబరధోరణిలోవి. భావజాలం ఎంత భయంకరమైనదో పదజాలం అంత సరళంగా ఉండటం అల్లన్‌పో ప్రతిభాలక్షణం. తెలుగువారి శబ్దాలంకారాలు శబ్దాడంబరంమీద ఆధారపడి క్లిష్టతకు పట్టం కడతాయి. కానీ అల్లన్‌పో శబ్దాలంకారాలు పాఠకుడ్ని ఆశ్చర్యపరుస్తూ అర్థానికి ముసుగువేయకుండా చూపిస్తాయి.

Repetition, Alliteration, Assonance, Echoes, Repetends, Refrains, Onomatopoeia మొదలైనవే అల్లన్ పో వాడే శబ్దక్రీడలైనా వీటన్నింటిలో Onomatopoeia అతడిసొత్తు అంటారు.

"the formation of a word by an imitation of the sound associated with the object or action disignated"1

అనేదే ఓనోమాటోపియా లక్షణం అయితే శ్రీశ్రీ ఈ ధ్వన్యనుకరణ శబ్దాలప్రయోగంతో పాఠకుడికి ఇంద్రియానుభూతిని కలిగిస్తూ సామాజికచైతన్యాన్ని సరఫరా చేయడానికి ఎలా ఈ పరికరాన్ని వాడుకున్నాడో మహాప్రస్థాన గీతాల్లో మనం చూడగలం.

Poe's short stories and poems are miracles of precision. Each word is in place. Every sentence is constructed with the aim of contributing sharply to the ultimate and clearly envisioned effect.2

అనే ప్రశంసలనందుకున్న పో రాసిన గీతాలలో The Raven, To Helen, Annabel Lee, Ulalume, Eulalie, For Annie వంటి గీతాలను మరీమరీ మెచ్చుకుంటూనే 'చప్పుడువ్రాత'గా అధిక్షేపింపబడిన The Bells అనే గీతాన్ని శ్రీశ్రీ అనువదించడంకన్నా మౌలికమైన పద్ధతిలో అనురణిస్తూ వ్రాయడం తెలుగుదేశానికీ అమెరికాకీ ముడిపెట్టడమే అయింది. విశ్వపరివ్యాప్తమయిన కవితాచైతన్యాన్ని తెలుగుకవులను మాత్రమే చదివి ఆధునికకవి పొందలేడు కనుక శ్రీశ్రీ అంతర్జాతీయ కవుల సంవిధానాలను అన్వేషించడానికి ఈవిధంగా శ్రీకారం చుట్టాడు.

జీవితంలో అరాజకానికీ, విపరీతస్వేచ్ఛకూ వ్యసనాలకూ లోబడినా, కవిత్వంలో గొప్ప సంవిధానాలను చూపించి ఫ్రెంచిసింబాలిస్టులకే గురువైన అల్లన్‌పో అంతర్జాతీయ ఆధునిక సాహిత్యానికే మూలపురుషుడు కాగా అతనిని అనుసరించిన మొదటి తెలుగుకవి శ్రీశ్రీ కావడం చరితార్థం. తీసుకున్న కవితాదర్శం The Bells; చేసిన అనురణనం 'గంటలు' అనే పేరుతో. గంటలకు సహజమైనది అనురణనమే కావడం శ్రీశ్రీ పాటించిన ఔచిత్యం. తెలుగుపాఠకుల సౌకర్యం కోసం పో రచించిన The Bells మూలాన్ని ఉటంకిస్తాను.

### *The Bells*

I

HEAR the sledges with the bells—
Silver bells
What a world of merriment their melody foretells!
How they tinkle, tinkle, tinkle,
In the icy air of night!
While the stars that oversprinkle
All the heavens seems to twinkle
With a crystalline delight;
Keeping time, time, time,
In a sort of Runic rhyme,
To the tintinnabulation that so musically wells
From the bells, bells, bells, bells,
Bells, bells, bells—
From the jingling and the tinkling of the bells.

---

1 The Oxford companion to English Literature.
2 Introduction : Great Tales and Poems of Edgar Allan Poe.

II

Hear the mellow wedding bells,
Golden bells!
What a world of happiness their harmony foretells!
Through the balmy air of night
How they ring out their delight!
From the molten-golden notes,
And all in tune,
What a liquid ditty floats
To the turtle-dove that listens, while she gloats
On the moon!
Oh, from out the sounding cells
What a gush of euphony voluminously wells!
How it swells!
How it dwells
On the Future! how it tells
Of the rapture that impels
To the swinging and the ringing
Of the bells, bells, bells.
Of the bells, bells, bells, bells
Bells, bells, bells—
To the rhyming and the chiming of the bells!

III

Hear the loud alarum bells—
Brazen bells!
What a tale of terror, now, their turbulency tells!
In the startled ear of night
How they scream out their affright!
Too much horrified to speak,
They can only shriek, shriek,
Out of tune,
In a clamorous appealing to the mercy of the fire,
In a mad expostulation with the deaf and frantic fire,
Leaping higher, higher, higher,
With a desperate desire,
And a resolute endeavor
Now—now to sit, or never,
By the side of the pale-faced moon.
Oh, the bells, bells, bells!
What a tale their terror tells
Of despair!
How they clang, and clash, and roar!
What a horror they outpour
On the bosom of the palpitating air!
Yet the ear it fully knows,
By the twanging,
And the clanging,
How the danger ebbs and flows;
Yet the ear distinctly tells,
In the jangling,
And the wrangling,
How the danger sinks and swells,
By the sinking or the swelling in the anger of the bells—
Of the bells—
Of the bells, bells, bells, bells,
Bells, bells, bells—
In the clamor and the clangor of the bells:

IV

Hear the tolling of the bells—
Iron bells!
What a world of solemn thought their melody compels!
In the silence of the night,
How we shiver with affright
At the melancholy menace of their tone!
For every sound that floats
From the rust within their throats
Is a groan.
And the people—ah, the people—
They that dwell up in the steeple,
All alone,
And who tolling, tolling, tolling,
In that muffled monotone,
Feel a glory in so rolling
On the human heart a stone—
They are neither man nor woman—
They are neither brute nor human—
They are Ghouls:
And their king it is who tolls;
And he rolls, rolls, rolls,
Rolls

Apaean from the bells!
And his merry bosom swells
With the paean of the bells!
And he dances, and he yells,
Keeping time, time, time,
In a sort of Runic rhyme,
To the paean of the bells—
Of the bells:
Keeping time, time, time,
In a sort of Runic rhyme,
To the throbbing of the bells—
Of the bells, bells, bells—
To the sobbing of the bells;
Keeping time, time, time,
As he knells, knells, knells,
In a happy Runic rhyme,
To the rolling of the bells—
Of the bells, bells, bells—
To the tolling of the bells,
Of the bells, bells, bells, bells—
Bells, bells, bells—
To the moaning and the groaning of the bells.[3]

పో The Bellsను నాలుగు గీతాలుగా విభజించుకుని Silver bells, Golden bells, Brazen bells, Iron bellsను శబ్దానుప్రాసలతో వర్ణించాడు.

### కవితా విశ్వరూపం

పో గంటలకూ శ్రీశ్రీ గంటలకూ సంవిధానంలో కొంత పోలిక కనిపించినా వస్తువులో ఏ పోలికలూ లేవు. కాదేదీ కవిత కనర్హం అని అన్నీ కవితామయమే అని విశాలమైన కవితా దృక్పథం అలవరుచుకుంటున్న శ్రీశ్రీకి ప్రపంచమంతటా ప్రతిధ్వనించే గంటలుగా కవిత్వమే సాక్షాత్కరించింది. ఇందుగల దందు లేదని సందేహం లేకుండా భూగోళంలోని ప్రతిజీవంలోనూ ప్రతిపదార్థంలోనూ ప్రతిమానవుడిలోనూ ప్రతివ్యవస్థలోనూ కవిత్వాన్ని దర్శించి ఆ కవితావేశాలకు గంటలను ప్రతీకలుగా తీసుకున్నాడు శ్రీశ్రీ 'సికై నే నేరిన వేయోధ్వనులలో ఏయే మూలల వెదకిన ప్రోవుల ప్రోవుల రణన్నినాదాలో నానాజంతుధ్వనులలో' అంటూ కవితారమణిని ప్రశ్నించబోతున్న శ్రీశ్రీ ఆ ప్రశ్నలకు పూర్వరంగాన్ని 'గంటలు' లోనే సిద్ధంచేసుకున్నాడు స్వర్గద్వారపు తోరణమై వ్రేలిన శ్రీశ్రీ మస్తిష్కంలో ఎన్నో ఘోషలూ భాషలూ దృశ్యాలూ తోచాయి. చిత్రవిచిత్రశ్యమంతరోచిర్నివహం చూశాడు. తన కవిత్వానికి ప్రాణస్పందన నిచ్చిన కొన్ని శక్తులను గుర్తించాడు. శంఖారావం, ఢంకాధ్వానం, జాతుధ్వనులు, భూకంపాలు, ప్రభుత్వ పతనాలు, విప్లవాలు, యుద్ధాలు, ఫిరంగిలో జ్వరంధ్వనించే మృదంగరావాలు, బాలెంతరాలి మనః ప్రపంచపు టావర్తాలు. శిశువు చిత్రనిద్రలోని ప్రాచీన స్మృతుల చప్పుడు, రోగార్తుని రక్తనాళ సంస్పందన, త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, పశుపుకత్తె భయంకరబాధల పాటలు, ఉరితీయబడిన శిరస్సు చెప్పిన రహస్యాలు, ఉన్మాది కేకలు, సమ్మెకట్టిన కూలీల కుటుంబాల హాహాకారాలు, ఆర్తారావాలు, లక్షనక్షత్రాల మాటలు, తరంగాల మ్రోతలు, జలపాతాలపాటలు మొదలైన వాటిలో కవితాధ్వనుల్ని వినబోతున్న శ్రీశ్రీ మొదట ఆ ధ్వనుల్ని గంటల గణగణల్లో విన్నాడు.

---

3 The Great Tales and Poems of E. A. Poe 389–392 pp.

అగ్నిసరస్సున వికసించిన వజ్రంలో ఎగిరే లోహశ్యేనంలో కవిత్వాన్ని చూడబోతున్న శ్రీశ్రీ గంటలలో దాన్ని మొదట చూశాడు.

కొన్నిస్థలాల్లోనే కవిత్వాన్ని దర్శిస్తూ కొన్నిక్షణాల్లోనే కవితాస్పందన ననుభవిస్తూ కొన్నిరసాలనే కవిత్వంలోకి తీసుకుంటూ కవిత్వాన్ని ఒకవర్గపుటాస్తిగా భావిస్తున్నవారినుంచి కవిత్వానికి స్వేచ్ఛకలిగించే దృక్పథమే శ్రీశ్రీచేత కవితావిశ్వరూపం గురించి వెదికించింది. పారిశ్రామిక విప్లవంవల్ల వచ్చిన యాంత్రికచైతన్యం దేశాలమధ్య, సంస్కృతులమధ్య ఉన్న సరిహద్దులను రద్దుచేయడంవల్ల కవిత్వాలు పరస్పరప్రభావితాలై పరస్పర సమ్మిళితాలై అంతర్జాతీయ కవిత్వం ఏర్పడింది. ప్రపంచమంతటినీ పర్యటించి రాకపోయినా సాహిత్యంద్వారా శ్రీశ్రీ ప్రపంచమంతటినీ దర్శించగలిగాడు. అలా దర్శించిన ప్రపంచంలో కాలంలో అడుగడుగునా క్షణక్షణానా కవితాఘంటానాదం విన్నాడు. ప్రకృతి, మానవుడు, కాలం, జంతువులు, ఆయుధాలు, నాగరికత వికసించే స్థలాలు గంటలగణగణలకు నిలయాలుగా కనిపించాయి శ్రీశ్రీకి.

భౌతికదృక్పథం

ప్రపంచమంతా ప్రతిధ్వనిస్తూ మ్రోగే ఆ గంటలు వినిపించిన స్థలాలను జంటలు జంటలుగా చెబుతూ ఆ జంటలను పరస్పరభిన్నాలు చేయడం, మానవుడనుభవించే వివిధరసభావాలను గంటలకు ఆరోపిస్తూ ఆ భావాలను కూడా పరస్పర విరుద్ధద్వంద్వాలుగా చెప్పడం శ్రీశ్రీ ప్రపంచాన్నిచూసే భౌతికదృక్పథాన్ని నిరూపిస్తున్నాయి.

| | | | |
|---|---|---|---|
| <u>స్థలవాచకాలు</u> | పల్లెటూళ్లలో | × | పట్టణాలలో |
| | బట్టబయలునా | × | పర్వతగుహలా |
| | ఎడారులందూ | × | సముద్రమందూ |
| | అడవులవెంటా | × | అగడ్తలంటా |
| <u>రసభావాలు</u> | భయంకరముగా | × | పరిహాసముగా |
| | ఉద్రేకముతో | × | ఉల్లాసముతో |
| | సక్రోధముగా | × | జాలిజాలిగా |
| | అనురాగముతో | × | ఆర్భాటముతో |

ఇలా కనిపించిన గంటలు కవితాచైతన్యాలే.

గంటలకు పోలికలుగా కనిపించిన ఉపమానాలు భిన్నస్వభావాలూ భిన్నస్వరూపాలూ గల చేతనాచేతనాలు.

సింహములాగా — సివంగిలాగా
ఫిరంగిలాగా — కురంగిలాగా
శంఖములాగా — సర్పములాగా
సృగాలమట్లూ — బిడాలమట్లూ
పండితులట్లూ — బాలకులట్లూ

గాణగాణ గణగణ వినిపించిన గంటలు వివిధరూపాలు ధరించాయి. ఇందులోని సింహమే 'అరణ్యమున హరీంద్రగర్జన'గా మారింది. ఫిరంగి 'ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగరావం'గా రూపుదిద్దుకుంది. 'శంఖం' విప్లవశంఖం అయింది. సర్పము 'త్రాచులవలెనూ రేచులవలెనూ' అనే పదచిత్రంగా మారిపోయింది. సృగాలం 'భైరవభైరవభీకరఘోషల'లోకి పోయింది.

ప్రాణం మ్రోగే ప్రతిస్థలంలో గంటలను విన్న శ్రీశ్రీ పారిశ్రామికనాగరికతవల్ల బయలు దేరిన విద్యారాజకీయ సాంఘికకార్యాలయాల నన్నిటినీ కవితామయంగా చూడగలిగాడు. ఫ్యాక్టరీలు, కాలేజీలు, ఆఫీసులూ జైళ్లూ మొదలైనవాటిలో నిజంగానే గంటలు మ్రోగుతూ ఉంటాయి

కర్మాగారము కళాయతనమూ
కార్యాలయమూ కారాగృహముల
దేవుని గుడిలో బడిలో మడిలో

అంటూ మొదటి రెండుపాదాల్లో సంస్కృతీకరణాలను వాడి వాటి బూజును స్ఫురింపజేశాడు. సమ్మెకట్టిన కూలీల కుటుంబాల హాహాకారాలూ ఆర్తారావాలూ కవిత్వంగా వినబోతున్న శ్రీశ్రీ-రగులుకొనే రాక్షసిబొగ్గు, బుగులుకొనే బుక్కాగుండా కవిత్వానికి కావాలనబోతున్న శ్రీశ్రీ కర్మాగారాన్ని కవితామయంగా చూశాడు. కార్మికుల శ్రమతో నిర్మింపబడిన దేవుని గుడిలో గంటలను కవితామయంగా విన్నాడు. శిశువులను జాతిసంపదగా భావించిన శ్రీశ్రీ బడిలో కవిత్వాన్ని చూశాడు. కర్షకుల ఘర్మజలానికి ఖరీదు లేదని చెప్పబోతున్న శ్రీశ్రీ మడిలో కవిత్వాన్ని చూశాడు ఈవిధంగా కవితావస్తువును విస్తృతం చేయడమే ఈ స్థలాలను పేర్కొనడానికి కారణం.

## కాలంలో కవిత్వం

కాలస్వరూపాన్ని కాలంలో వివిధాంశాల్నీ కాలంయొక్క విశ్వరూపాన్నీ శ్రీశ్రీ కవిత్వంగా చూశాడు. వెన్నెల ,చీకటి, మండుటెండ, జడి, చలి, ఇపుడు, అపుడు, ఎపుడూ అనే మాటల ద్వారా కాలాన్నీ ఉత్తరదక్షిణాలు, ఉదయప్రదోషాలు ద్వారా దిక్కులనూ పేర్కొని వాటిలో కవితాస్వరూపాన్ని చూశాడు.

ఉత్తరమందూ × దక్షిణమందూ
ఉదయమునందూ × ప్రదోషమందూ
వెన్నెలలోనూ × చీకటిలోనూ
మండుటెండలో × జడిలో × చలిలో

ఇపుడూ అపుడూ ఎపుడూ మ్రోగే గంటలంటే మానవుడున్న ప్రతిదేశంలోనూ నాగరికత ఉన్నా లేకపోయినా కవిత్వం ఉందనీ ప్రకృతి, కాలం కవితా ప్రవాహాలే అనీ చెప్పడమే.

ప్రపంచమంతా భగవంతుడున్నాడనే వేదాంతభావననే శ్రీశ్రీ ప్రపంచమంతా కవిత్వం ఉందనే భౌతికభావనగా మార్చుకున్నాడు. ప్రపంచాన్ని అంతటినీ కొన్ని విభాగాలు చేసుకుని జాబితాలు ఇవ్వడం ఎప్పటికీ అసంపూర్ణమే. అందుకే కాదేదీ కవిత కనర్హం అనీ అన్నీ కవితామయమే అనీ ఋక్కులలో చెప్పబోతున్నాడు.

శబ్దపునరుక్తినీ ధ్వనిపునరుక్తినీ ప్రతి గీతానికీ పల్లవిగా వాడటంలో 'పో' శ్రీశ్రీకి దారి చూపించాడు.

| E. A. POE | శ్రీశ్రీ |
|---|---|
| From the bells, bells, | గంటలు ! గంటలు ! |
| bells, bells, | గంటలు ! గంటలు ! |
| Bells, bells, bells— | గంటలు ! గంటలు ! |
| From the jingling and | గణగణ గణగణ గణగణ |
| the tinkling of the bells | గంటలు ! |
| | గణగణ గణగణ |
| | గంటలు ! గంటలు ! |

## చతురస్రగతిగేయం

అనామధేయమహాకవులకు అభివాదాలు సమర్పించి పాటకపుజనుల పాటల్లోని ప్రాణవాయువులు పీల్చుకుని జవికమీద పాడిన జంగం కథలు విని, రోజురోజుకీ రకరకాల ఛందస్సుల రహస్యాలను తెలుసుకుంటూ వాటి వాటి గమనంలో సమాజజీవితజవనం స్ఫురింపజెయ్యడానికి శ్రీశ్రీ ప్రయత్నం[4] 'గంటలు'లోనే మొదలయింది. తనకన్నా ముందే ఇలాంటి ప్రయత్నం చేసి గురజాడ జానపదచ్ఛందస్సులనుంచి రెండు గమనాలను ప్రయోగించి చూపించాడు. ముత్యాలసరం కాక ఆ రెండోది చతురస్రగతి గేయం. అది పుత్తడిబొమ్మా పూర్ణమ్మలో రూపొందింది.

4 శ్రీశ్రీ సా. రెండు. వచన. 406 పే.

మేలిమి బంగరు మెలతల్లారా కలువల కన్నుల కన్నెల్లారా తల్లులుగన్న పిల్లల్లారా విన్నారమ్మా యీ కథను అంటూ సహజలయతో వ్యావహారికంలో సాగిపోయిన ఈ గేయానికి ప్రేరణ జానపదగేయాలే. ఉరుములు మెరుపులు ఉటాపుతీగలు కాళ్లాగజ్జా కంకాళమ్మా వంటి పిల్లలగీతాలెన్నో చతురస్రగతిలోనే నడిచాయి. గురజాడవారి ననుసరిస్తూ రామిరెడ్డి, బసవరాజు, దీక్షితులు, బాపిరాజు (కృష్ణశాస్త్రి మినహాయింపు) మొదలైనవారు కొందరీచతురస్ర గతి గేయాలను నాగరికంగా రాశారు. ధగధగ మెరిసే కాంతినిచల్లే కళ్లు నెమలి కెవరిచ్చారో5 (దీక్షితులు) జీవనగంగాహారితతటంబున చింతావటతరుమూలమునన్6 (రామిరెడ్డి) జలబిందువులో భాస్కరబింబము తలతలమెఱయుంగాదే దేవా7 (బసవరాజు) ప్రభువుగారికీ దణ్ణంపెట్టూ పాదం వంచీ భక్తినిపెట్టూ8 (బాపిరాజు)

ఈ చతురస్రగతిఛందస్సునే శ్రీశ్రీ మహాప్రస్థానగీతాలలో పలువిధాలుగా వాడుకున్నాడు. శంకరుల భజగోవిందం, జయదేవుని గీతగోవిందం శ్లోకాలు కూడా చతురస్రగతిలోనే విరగడం శ్రీశ్రీ గమనించాడు. కందపద్యంకూడా చతురస్రగతిలోనే నడుస్తుందని గుర్తించాడు. ఈ పరిజ్ఞానాన్ని శ్రీశ్రీ ఎలా అనుభవంలోకీ ప్రయోగంలోకీ తీసుకుని వాడుకున్నాడో ముందుఖండికల్లో చూడగలం.

అనంతునివంటి ఛందోలక్షణకారులు చతురస్రగతి గేయానికి మధురగతి (4×4 మాత్రలు), హరిగతి (4×8 మాత్రలు) రగడలనే పేర్లతో యతిప్రాసపాదాది నియమాల నేర్పరచినా వాటిని ధిక్కరించి నూతననియమాలను కూర్చుకుని ఆధునికులు స్వేచ్ఛనవలంబించారు. ఈ స్వేచ్ఛను శ్రీశ్రీ విస్తృతంచేశాడు. ఇలా విస్తృతం చేసుకుంటేగానీ గేయాలు లయాత్మకంగా పరుగెత్తవు.

ముత్యాలసరం 14 మాత్రల ప్రమాణంగలదికాగా చతురస్రగతిగీతం 16 మాత్రల కొలతగలది. ఈ 16 మాత్రలను 4×4 గా గానీ 8×2 గా గానీ విరుచుకోవడంలోనే శ్రీశ్రీ స్వేచ్ఛ ఉంది.

సంప్రదాయాలను పూర్తిగా ఉల్లంఘించాలనే అరాజకవాదికాడు కనుకనే శ్రీశ్రీ సంప్రదాయాలలోని గుణగౌరవాన్ని అంగీకరిస్తూ ఉంటాడు. మాత్రాబద్ధతను ప్రేమించే శ్రీశ్రీ గణబద్ధతనుకూడా విడవలేకపోవడం ఈ గౌరవంవల్లనే ఎడారులంటూ సముద్రమందూ అనే పాదంలో జగగ+జగగ అనే సమాన గణాల విన్యాసంకోసం చూసుకోకపోతే ఎడారులందూ సాగరమందూ అంటూ రాసిఉండేవాడు.

---

5 నెమలికన్నులు 6 బాష్పబౌత్యము 7 వివృతయాథార్థ్యము 8 గంగిరెద్దు

దీపం ఆరిపోయింది! తారగా మారిపోయింది!

1934 మార్చి 7

ఆగర్భశ్రీమంతుడైనా దరిద్రనారాయణుడైనా మానవుడు మృత్యువును తప్పించుకోలేడు కానీ బ్రతికినరోజుల్లో మాత్రం వాళ్లిద్దరూ అనుభవించే కష్టసుఖాలకు కారణంమాత్రం విధివిలాసమే అనుకోవడం ఆదర్శవాది లక్షణం— కాగా ఆ కష్టసుఖాలకు ఆర్థిక తారతమ్యాలూ సామాజిక విషమవ్యవస్థ కారణం అనడం భౌతికవాది లక్షణం. విశ్వనాథ సత్యనారాయణను ఆదర్శవాదికీ శ్రీశ్రీని భౌతికవాదికీ ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. 'నక్షత్రాలు రెండు' అనే ఒక ఖండికలో విశ్వనాథ ఒక రాజకుమారుడికీ ఒక కవికుమారుడికీ జీవనమరణాలలో ఎంత భేదం ఉందో వివరించారు.

—వ్రేగగు హైమసౌధమణివీథిక పుట్టెను రాచబిడ్డ; క
ల్యాగముఁబోలె నేల విరియంబడి బంగరుముద్ద లేదెసన్
త్యాగముపొందె; వారసతులాడిరి; ముంగిట తూర్యరావముల్
మ్రోగెను; లోకపుంజనులు బోరన సన్నుతిపెట్టి రెంతయున్.

—ఒక్క చిఱుపేదగుడిసెలో నుద్భవిల్లి
నాడు కవికూన; పదియవనాడు మంత్ర
సానిదెప్పినదన్నము చాలదంచు;
మంత్రమో, సన్నినాడు, బ్రాహ్మణుడు వచ్చి.

—ఆ రాచబిడ్డ కల్యాణ పల్యాణ స
జ్జితపంచకల్యాణి చెలువు గులికె
ఈ కవికూన పేరాకట మాడి క
న్నులలోన ప్రాణముల్ నిలుపుకొనియె
ఆ రాచకూన మార్గాయాసఖిన్ను డౌ
జములు వంగి పథిశ్రమము వాపె
ఈ కవిబిడ్డ దుఃఖైకజన్ముని తీక్ష్ణ
కిరణుండు శుచి నుడికించివైచె.

—రాజు నిరంతభోగమధురంబగు జీవితమై గతించెడున్
రోజున తూర్యముల్ మరల మ్రోసెను శ్రీ కలకంఠ కంఠగీ
తీ జగతీ ఘలంఘల గతిప్రమదం బొలసెన్ మనోజ్ఞవ
శ్యా జయనాదసిరదనభంబయి మ్రోగె త్రయీనినాదముల్.

—నాటి సంజవేళ నభమున ధగధగా
యితవిలాసదీప్తి జతను పరచి
సానయిడిన మణివిధాన దీప్తుల్లు తా
రకయొకండు నేల రాలిపడియె.

—కవికి క్షుధాగ్నిపీడితము కాయము గ్రెళ్లను కాష్ఠవహ్నిలో
శవమిడునంతలో నపరసాగరమందున కర్మసాక్షి క్రుం
కవజె, నొకింతలోన మెఱుగుల్ దెసలందునక్రమ్ముకొంచు నూ
త్న విలసనంబు చిమ్ము నొకతారక మింటికినెక్కె వెంబడిన్.[1]

భోగభాగ్యాలనుభవించి రాజకుమారుడు చనిపోగానే నక్షత్రం ఒకటి నేలరాలిపోయిందనీ, ఆకలితో నిరుపేదగా కవి చనిపోగా ఒక నక్షత్రం ఆకాశంమీద కనిపించిందనీ చెప్పిన విశ్వనాథ ఇహలోక సౌఖ్యాలకంటె పరలోకసౌఖ్యం గొప్పదని స్ఫురింపజేశారు. అంతేకాక ఒక సౌఖ్యం ఉంటే రెండోది ఉండదనీ వ్యక్తంచేశారు. రాజు, కవికూడా గొప్పవాళ్లే విశ్వనాథదృష్టిలో.

భౌతికవాది అయిన శ్రీశ్రీ ఆకాశదీపం అనే ఖండికలో ఒక సామాన్యుడి చావును ఇతివృత్తంగా తీసుకుని దానికి అధివాస్తవికతను జోడించి, ఆ దురదృష్టజీవి మరణానంతరం దీపంగానూ తర్వాత నక్షత్రంగానూ మారిపోయాడని వర్ణించాడు.

## సాంస్కృతికప్రతీక

చిరకాలంనుంచి భారతీయసంస్కృతి తన తాత్త్వికభావాలను ప్రతీకలతో వ్యక్తం చేస్తున్నదని గమనించిన శ్రీశ్రీ 'ఆకాశదీపం' అనే ప్రతీకను ఆధునికయుగంలో సామాన్యుడి ఉన్నతిని సూచించడానికి వాడుకున్నాడు. కార్తికమాసంలో శివాలయధ్వజస్తంభంమీద నెల రోజులూ వెలిగించే కార్తికదీపాన్ని ఆకాశదీపం అంటారు. అది సాయంకాలం వెలిగింపబడి వేగుజుక్క వచ్చేవరకూ వెలుగుతూ ఉంటుంది. దాన్ని దర్శించడంవల్ల శివసాయుజ్యం కలుగుతుందని మతవిశ్వాసం.

---

1 భ్రష్టయోగి 23-24

నేలమీద వెలగవలసినదీపం ఆకాశంమీద వెలగడంవల్ల ఉన్నతస్థానంలో ఉన్న దీపం అవుతుంది. లాంతరువంటి ఒక గదిలో ఆ దీపాన్ని పెట్టి పరిసరాలకు కనిపించేలా వెలిగిస్తారు దాన్ని. పగలు ఆ దీపం వెలగదు. సాయంకాలం కాగానే వెలిగి తెల్లవారుజామున ఆరిపోతుంది. సింబాలిజం ప్రేరణతో ఈ విధానాన్ని సామాన్యుడి జీవితానికి అన్వయించుకుని 'ఆకాశదీపం' రాశాడు శ్రీశ్రీ. ఉదయం ఆరున్నరకు ఆరిపోయిన ఆ దీపాన్ని (చనిపోయిన) సమాజంలో విస్మరింపబడిన సామాన్యుడితోనూ సాయంకాలం ఆరున్నరకు వెలిగిన దీపాన్ని గుర్తింపబడిన సామాన్యుడితోనూ ఆకాశతారగా మారిపోయిన దీపాన్ని మహోన్నతిని పొందిన సామాన్యుడితోనూ సంకేతించాడు. ఇదొక అధివాస్తవికకల్పన కావడంవల్ల తర్కబద్ధత ఉండదు. కలిగే ఎన్నో సందేహాలకు సమాధానం లభించదు.

మహాప్రస్థానగీతాలలోని అవతారం, మహాప్రస్థానం, ఋక్కులు, జ్వాలాతోరణంవంటి శీర్షికలను భారతీయ మతసంప్రదాయంనుంచి గ్రహించి నూతనార్థాలలో వాడిన శ్రీశ్రీ 'ఆకాశదీపం' అనే శీర్షికకుకూడా నూతనార్థాన్ని కల్పించాడు.

### స్వప్నవాస్తవికత

ఒక దురదృష్టజీవి ఉదయం ఆరున్నరకు ఒక గదిలో ఆరిపోయాడు. ఆ గదిలో ఎవరూ లేరు. గదినిండా నిశ్శబ్దం అలముకుని ఉంది. అలా పన్నెండు గంటలు గడిచిపోయింది. సాయంత్రం ఆరున్నర అయింది. సూర్యుడస్తమించాడు. గదిలో చినుకులవలె చీకట్లు వ్యాపించాయి. ఆ దురదృష్టజీవి శవం ఆగదిలోనే పడిఉంది. ఆ గది ఖండపరశు గళకపాలగణాల కనుకొలుకుల్లోని ఒకదానిలా చూపులేని చూపులతో పరిశీలించి చూస్తోంది. అప్పుడు గదిలో ఏవేవో ఆవిరులు వ్యాపించాయి. ఇంతలో దూరంగా ఆకాశంలో ఒక చుక్క తోచి, మిణుకుమిణుకుమంటూ తన చూపుల్ని గదిమీదికి విసిరింది. ఆ గదిని తన ఆలోచనలతో కౌగిలించుకుంది. అప్పటికి ఆ గదిలో సామాన్యుడి సమాధిదీపం మూలనక్కి మూలుగుతోంది. ఆ దీపం ప్రమిదలోని చమురు తాగుతూ పలుదిక్కులు చూస్తోంది. అది చీకటిబోనులో పెట్టబడిన సింహంలా నిలబడి ఉంది. కత్తిగంటుమీద నెత్తుటిబొట్టులాగు నిర్జీవంగా ఉంది. ప్రమిదలో నిలబడిన దీపం పలుదిక్కులు చూస్తోంది. అకస్మాత్తుగా ఆ దీపానికి ఆకాశతార కనిపించింది. దాని సాహాయ్యం కోరుతూ దీపం రాకాసికేకలు వేసింది. ఆ కేకలను సమాజంలో ఎవరూ వినిపించుకోలేదు. ఆకాశతారకు మాత్రం జాలివేసి, ఆదరంగా చేతులు చాచి, చూసింది. అప్పటికే కేకలువేసి అలసిపోయిన దీపాన్ని ఆకాశతార తనదగ్గరకు రమ్మని పిలిచింది. వెంటనే దీపం ఆరిపోయి తారలో కలిసి పోయింది. ఇదీ శ్రీశ్రీ 'ఆకాశదీపం'లో చెప్పిన కథ. ఇది శ్రీశ్రీ కన్న స్వప్నంలోని వాస్తవికత.

సామాన్యుడికి రాజ్యాధికారం ఇచ్చే సామ్యవాదవ్యవస్థ ప్రపంచంలో ఎక్కడ ఏర్పడినా అది తక్కినదేశాలకుకూడా ఆ వ్యవస్థ ఏర్పడేందుకు సహకారం అందిస్తుంది. ఆకాశతార సామ్య

వాదవ్యవస్థ ఏర్పడిన దేశానికీ గదిలో దీపం బూర్జువావ్యవస్థ ఉన్న దేశంలోని సామాన్యుడికీ ప్రతీకలుగా కనిపిస్తాయి.

### సమాజ వాస్తవికత

1941లో 'గర్జించు రష్యా' గేయం రాస్తూ వ్యక్తి స్వతస్సిద్ధ స్వాతంత్ర్యదాతగా పతితనిర్గతిక ప్రపంచత్రాతగా భావికాల స్వర్ణభవన నిర్మాతగా రష్యాను పేర్కొంటూ అనంతప్రపంచం అంతటా సామ్యవాదపు గొడుగుసీడల్ని సాగించవలసిందిగా విజ్ఞప్తి చేసిన శ్రీశ్రీ

సుప్త కంకాళాలు మేలుకొంటున్నాయి
ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచింది
కార్మికులు కర్షకులు తాడితులు పీడితులు
కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారు
ప్రపంచం నీకోసం పరిపక్వంగా వుంది
కోటి గొంతులు నిన్ను కోరి రమ్మన్నాయి
కోటిచేతులు నిన్ను కౌగిలిస్తున్నాయి

అనడంలో రష్యాను 'ఆకాశతార'గా అభినందించడం ఉంది. ఎందుకంటే ఆకాశతార దురదృష్ట జీవి చనిపోయిన గదిని తలపోతతో కౌగిలించుకున్న రోజులు 1934 నాటివి కాగా కోటిచేతులు రష్యాను కౌగిలించుకుంటున్న రోజులు 1941 నాటివి. ఆకాశతార ఆదరపు చూపులు చాపి, ఆహ్వానగానం చేసిన రోజులు 1934 నాటివి కాగా కోటి గొంతులు రష్యాను కోరి రమ్మన్న రోజులు 1941 నాటివి.

ఈ దురదృష్టజీవియే కర్షకుడు, కార్మికుడు, తాడితుడు, పీడితుడు. అతడే సుప్తకంకాళంగా పడి ఉండి మేలుకొంటున్నవాడు. మూల నక్కి మూలుగుతూ, ప్రమిదలో చమురు త్రాగుతూ పలుదిక్కులు చూస్తూ చీకటిబోనులో సింహమై కత్తిగంటుమీద నెత్తుటిబొట్టులా నిర్జీవంగా ఉండిపోయిన దురదృష్టజీవి ఆ పీడితుడే

నిరంతర శ్మశానసంచారి అయిన ఈశ్వరుడి మెడలోని కపాలగణాలవలె కనిపించిన ఈ పీడితులనే కవి చూశాడు. పీడితుడు మృతప్రాయుడై పడిఉన్న ఆదేశమే శ్రీశ్రీ భావించిన గది- ఎవరూ లేని-నిశ్శబ్దంనిండిన-చినుకులవలె చీకట్లు వ్యాపించిన గది! ఆ గదియే ఏ దృక్పథమూ లేని గ్రుడ్డిచూపుతో చూపు లేని చూపులతో తేరి చూస్తోంది. అప్పుడది

ఖండపరశుగళకపాలగణముల
కనుకొలకులలో ఒకటివలె

ఉంది. చనిపోయిన వ్యక్తిని దహనం చేసినా, ఒకప్పుడు మిగిలిపోయేది అతని తలకాయలోని పుర్రె. ఆ పుర్రెలనే శివుడు మెడలో వేసుకుంటాడు. ఆ పుర్రెకు చూపు లేదు. దురదృష్టజీవి అంత భయంకరంగా ఉన్నాడు.

తలపోత ఉన్నది ఆకాశతార అయితే ఆలోచనలేక రాకాసి కేక వేసినది దీపం.

ఇటువంటి దురదృష్టజీవులనే తట్టి లేపి మహాప్రస్థానానికి శ్రీశ్రీ సిద్ధంచేయబోతున్నాడు. 'దారిపొడుగునా గుండెనెత్తురులు తర్పణచేస్తూ ముందుకు పదండి' అనబోతున్నాడు. ఈ దురదృష్ట జీవులు త్రాగుబోతులుగా పడుపుకత్తెలుగా ఉన్మాదులుగా కూలీలుగా విరామ మెరుగక పరిశ్రమించేవారుగా గనిలో వనిలో కార్ఖానాలో ధనికస్వామికి దాస్యం చేస్తున్నవారుగా నిరపరాధులై చెరసాలల్లో చిక్కినవారుగా నూతిని గోతిని వెదికేవాళ్ళుగా కడుపుమంటతో నిండిన వాళ్లగా కూటికోసం కూలికోసం పట్టణాలకు వెళ్ళే బాటసారులుగా భిక్షువర్షీయసులుగా బానిసలుగా పీనుగులుగా గానుగులుగా తెగిన తీగల విపంచికలుగా చీకటిండ్లలో భయపడేవారుగా నదికివతలి ఒడ్డున ఆగిపోయినవారుగా విసిగిన ప్రాణులుగా యుగయుగాలదోపిడిలో నరనరాల రాపిడిలో తరతరాల రోదనలో బక్కచిక్కి బిక్కచచ్చిన వాళ్లుగా అణగారిన ఆర్తులుగా రాళ్లెత్తిన కూలీలుగా పల్లకీ బోయీలుగా సంధ్యాజీవులుగా సందేహభావులుగా రైతులుగా గుడిసెలలో బ్రతికే వాళ్లుగా గంజినీళ్లు త్రాగి కాలం గడిపేవాళ్లుగా ఖైదీలుగా రౌడీలుగా ఖూనీకోరులుగా పతితులుగా భ్రష్టులుగా బాధాసర్పదష్టులుగా దీనులుగా హీనులుగా పక్షులుగా తిరస్కృతులుగా సంఘబహిష్కృతులుగా జితాసువులుగా చ్యుతాశయులుగా వ్యధానివిష్టులుగా కథావశిష్టులుగా ఊరవతల నీరింకిన చెరువుప్రక్క చెట్టునీడ గోనెలతో కుండలతో చీకటిలో దుఃఖంతో నిరాశతో ఉన్న దగాపడిన తమ్ములుగా భారతదేశంనిండా కనబడ్డారు. వీరినందరినీ మహాప్రస్థానంలోని వివిధ గీతాలలో సినిమా తెరమీద చూపించినట్లు చూపించాడు శ్రీశ్రీ.

ఖాళీగది

ఫ్రెంచిసింబాలిస్టులలో బాద్లెయిర్ తరువాత చెప్పుకోదగిన మల్లార్మే కవితాప్రతీకలను అభిమానించే శ్రీశ్రీ మల్లార్మేకు ఎంతో ఇష్టమైన Empty room అనే ప్రతీకను 'ఆకాశదీపం'లో వాడుకున్నాడు. అందుకే 'గదిలో ఎవరూ లేరు' అంటూ ఈ ఖండికను మొదలుపెట్టాడు. అయితే వ్యక్తివాది అయిన మల్లార్మే Empty room అతని మనస్సుకే ప్రతీక సమాజవాది అయిన శ్రీశ్రీ ఖాళీగది దురదృష్టజీవి చనిపోయిన దేశానికే ప్రతీక. శ్రీశ్రీ ఈ 'గది'ని మహాప్రస్థానంగీతాల్లో ఇంకా కొన్నిచోట్ల వాడక వదిలిపెట్టలేదు. నిద్రకు వెలియై ఒంటరిగా తన గదిలోపలి చీకటిలోనూ చీకటిలోపల తన గదిలోనూ శ్రీశ్రీ 'కేక' పెట్టడం, మంచిగదిలోనే బూర్జువాల ఊహాలు సంచరించడం ఏనాటినుంచో ఆ గది ఏర్పడి ఉండడం మహాప్రస్థాన పాఠకులకు కనిపిస్తాయి.

### శబ్దశిల్పం

ఎడ్గార్ అల్లన్ పో The Bellsను గంటలుగా అనురణించిన శ్రీశ్రీ అల్లన్ పో ద్వారా ప్రభావితుడైన బొద్లెయిర్‌ను కూడా ఋషిగా స్వీకరించి 'మాఘపూర్ణిమ మంచు తెరల సోయగం'ను అనుభవించాడు. సింబాలిజం అనే ఒక నూతనసాహిత్యోద్యమానికే నాయకుడైన బొద్లెయిర్ 'Poetry is the rhythmic creation of beauty' అనే పో కవితానిర్వచనానికి హారతులెత్తుతూ సంగీతకవిత్వాల సమ్మేళనం కోసం గొప్ప కృషిచేసి ఉండటం శ్రీశ్రీని ఆకర్షించింది. శబ్దాల ద్వారా సంగీతసృష్టి చేయడానికి ఎంత పనితనం అవసరమో శ్రీశ్రీ గ్రహించింది సింబాలిజం ద్వారానే. శబ్దశిల్పికావడానికి శ్రీశ్రీకి యింతకుముందు భావకవిత్వమే దారి చూపించిఉన్నా ఆ శబ్దశిల్పపు పరిమితులు సింబాలిజంవల్ల ఇంకా విస్తృతమయ్యాయి.

ఖండపరశుగళ కపాలగణముల
కనుకొలకులలో ఒకటివలె

వంటి పంక్తులలో ఆ శిల్పం కనిపిస్తోంది.

### అనుభవోద్దీపనం

ఇంద్రియానుభవాలను (వాసనలను) ఉద్దీపనం చేయడం, ఇంద్రియానుభవాలను తారుమారు చేయడం సిద్ధాంతాలుగా పెట్టుకున్న సింబాలిస్టులను శ్రీశ్రీ అభిమానించినందువల్లనే 'Poetry is evocation' అన్నాడు.2

ఒక చుక్క మిణుకు చూపులు మెలమెల్లగా విసరి
గదిని తలపోతతో కౌగిలించుకుంటున్నది.
ఒక దురదృష్టజీవి ఆగదిలోనే ఆరిపోయాడు
దీపం — మూలనక్కి మూలుగుతున్నది
ఆకాశతార అదరపుచూపులు చాపింది
అలసిపోయింది_దీపం

విసరడం, కౌగిలించుకోవడం చేతుల పనులు కాగా నయనేంద్రియానికి మొదటిపనినీ మనస్సుకి రెండోపనినీ బదిలీచేసి వై చిత్రిని చూపించాడు. ఆరిపోవడం దీపం ధర్మం కాగా దురదృష్టజీవికి అది అన్వయింపబడింది. మూలనక్కి మూల్గడం కుక్కపిల్ల లక్షణం కాగా అది దీపానికి చెప్ప బడింది. చాపడం చేతుల ధర్మం కాగా అది చూపులకు మార్చబడింది. అలసిపోవడం ప్రాణి

ధర్మం కాగా అది దీపానికి చెప్పబడింది. ఆదరపు చూపులు చాపింది అనే భిన్నావయవధర్మాల సమ్మేళనంద్వారా చేతుల సహాయాన్నీ చూపుల ఆదరణనీ కలిపి సంక్షిప్తంగా చెప్పగలిగాడు.

అగ్ని శ్వాసం క్రక్కడం, ఇనబింబం పయనించడం, మరోప్రపంచం ధరిత్రినిండా నిండటం, మదపుటేనుగు సవాల్ చేయడం, మంత్రనగరి సరిహద్దులు ముట్టడం, హృదయంలో దీపంపెట్టడం, రొట్టెముక్క చూడటం, బల్లచెక్క లోతు కనుక్కోవడం, ప్రోవుల, ప్రోవుల రణన్నినాదాలు, వజ్రం వికసించడం, ఉరితీయబడ్డ శిరస్సు రహస్యం చెప్పడం, నాదబ్రహ్మపు పరిచుంబన, హేమం పిండటం, ఘర్మజలం కాలువకట్టడం, వేగుజుక్క వెక్కిరించడం, వెర్రిగాలి ప్రశ్నించడం, పాపాలు వండించడం, భావాలు మండించడం వంటి పదచిత్రాలను శ్రీశ్రీ ఈ ఒరవడిలోనే వాడాడు.

## తొలివచనగీతం

వృత్తాలను విడిచిపెట్టి శ్రీశ్రీ మొట్టమొదట రాసిన వచనపద్యం విద్యున్మాలికలు గ్రాంథికం లోనే వెలువడినా, తర్వాత గ్రాంథికాన్ని వదిలిపెట్టి మాత్రాగణాలతో వ్యావహారిక భాషలో జయభేరి, ఒకరాత్రి, గంటలు మొదలైనవి రాశాడు. వాడుకభాషకూ ముత్యాలసరాలకూ జత గూర్చడం శ్రీశ్రీకి ముందే గురజాడనుంచీ ఆరంభమయింది. ఇతరదేశాల సాహిత్యవ్యవసాయాలను గమనిస్తూ వచ్చిన శ్రీశ్రీ వచనగమకాలలో కొత్త పరిశోధనలను చేయడానికి ఉద్యుక్తుడయ్యాడు. సింబాలిజం తరువాత ఇంగ్లాండు అమెరికాలలో పారిశ్రామిక విప్లవప్రభావంవల్ల బయలుదేరిన ఇమేజిజం కవితాస్వరూపంలో ప్రయోగాలుచేసి వచనకవిత్వాన్ని వెలయించడం శ్రీశ్రీని ఆక ర్షించింది. సామాన్యభాషలో కొత్తలయలకోసం చేసినప్రయత్నమే వచనకవిత్వం. సాంప్రదాయిక చ్ఛందోవిధానాలనుంచి విముక్తమై సంపూర్ణస్వేచ్ఛను పొందిన ఈ Free verse తెలుగుదేశం లోని వ్యావహారికభాషోద్యమానికి తగిన వాహికగా శ్రీశ్రీకి కనిపించింది. వచనగీతం అంటే చేతికి వచ్చిన వ్రాత కాదనీ గణపూరణంకోసం వచ్చే వ్యర్థపదాలు వచనగీతంలో ఉండవనీ కవి ఛంద స్త్రీరాలులేని భావవాహినిలో స్వతంత్రంగా ఈదుతూ తన అంతర్జగత్తులోంచి వల్లికలు కల్పించు కోవాలనీ శ్రీశ్రీ వచనగీతం గురించి ప్రస్తావిస్తూ ఒకచోట చెప్పినది[3] అక్షరాలా నిజం.

వచనగీతంయొక్క ప్రాశస్త్యాన్ని శ్రీశ్రీ నిర్దిష్టంగా నిర్ణయించుకున్నాడు. కవిత్వాన్ని పద్యంలో రాసినా గేయంలో రాసినా వచనంలో రాసినా శ్రీశ్రీ ఎప్పుడూ సంగీతప్రాధాన్యాన్ని విస్మరించడు. ఈ సంగీతం అంతా ఒకటి కాదు. గణబద్ధచ్ఛందస్సులలోని సంగీతం వీణావేణు ధ్వనులదైతే వచనకవిత్వంలోని సంగీతం లోహవిహంగాల ధ్వనుల్లోంచి పారిశ్రామికయంత్రాల చప్పుళ్ళలోంచి ధూమనౌకల, విద్యుచ్ఛకటాల వివిధ విచిత్ర ఘోషలలోంచి బయలుదేరే

3 శ్రీశ్రీ సా. రెండు. వచన. 478 పే.

దవుతుంది. ఆధునిక చైతన్యంగల కవియొక్క అనుభవంనుంచి ఈ నూతనలయలు బయలుదేరతాయి. అందుకే వచనగీతానికి పాతలక్షణా లేవీ పనికిరావు; అది తనరూపం తానే నిర్ణయించుకుంటుందని శ్రీశ్రీ చేసిన సూచనలో అత్యుక్తి లేదు.4

వచనగీతానికి "గమనవైవిధ్యాన్ని" ప్రాణప్రదమైన లక్షణంగా శ్రీశ్రీ పేర్కొన్నాడు. తెలుగువాళ్లు నిత్యం మాట్లాడుకునే భాషలోని "యాసలూ కాకువులూ ఉచ్చారణవిశేషాలూ" ఈ గమన వైవిధ్యానికి మార్గం తీస్తాయి.5 శిష్ట్లా, ముద్దుకృష్ణవంటి ఒకరిద్దరుమాత్రమే శ్రీశ్రీకి ముందు వచనగీతం రాయడానికి ప్రయత్నించినా వాటికి స్వరూపరామణీయకం సిద్ధించ లేదు. అందువల్ల శ్రీశ్రీ ఆకాశదీపమే తెలుగుకవిత్వంలో మొదటి వచనగీతం అవుతోంది. వచనగీతపు శైలినీ, రీతినీ నిర్ణయించుకోవడానికి ఇది ప్రథమలక్ష్యం అయింది.

కవిత్వం చెప్పడం ఒక కష్టమైన పనికాకూడదని సంకల్పించుకున్న శ్రీశ్రీ ఆ కష్టానికి ప్రథమకారణం నిర్దిష్ట చ్ఛందస్సని గ్రహించాడు. గణాలు లేకుండా పద్యాలు రాయవచ్చునంటే నియమాలే అక్కర్లేదని అర్థంకాదు. కాకపోతే అవి గణబద్ధచ్ఛందస్సుల నియమాలు మాత్రం కావు. వచనకవిత్వంలోని నియమాలను నిర్ణయించుకోవడం ప్రయోగానికి సంబంధించిందే కానీ సంప్రదాయానికి సంబంధించింది కాదు. ఛందస్సుకీ వ్యాకరణానికీ అలంకారాలకీ అన్నింటికీ అవతల స్వచ్ఛమూ స్వచ్ఛందమూ అయిన నీరవమూ నీరూపమూ అయిన కవిత్వపదార్థం ఒకటుందనీ దాన్ని అందుకోవడానికి ప్రతికవీ ప్రయత్నిస్తూ ఉంటాడనీ చెప్పుకున్న శ్రీశ్రీలో స్వాతంత్ర్య కాంక్ష అత్యంతస్థాయిలో ఉంది కనుకనే పాత పద్ధతులను వీలయినంతవరకూ వదిలిపెట్టసాగాడు. పాతపద్ధతులనే అనుసరించినప్పుడు వాటిని సంస్కరించుకున్నాడు. అది అలా ఉండగా శ్రీశ్రీ తెలుగులో కొత్తగా ప్రయోగించిన వచనగీతం పాశ్చాత్యుల Verse Libre వంటిది. "Verse in which various metres, or various rhythms are combined, or the ordinary rules of prosody disregarded.6

వచనగీతంలో ఎన్నోరకాల ఛందస్సులూ లయలూ కలగాపులగంగా ఉండనూవచ్చు; లేదా పూర్తిగా కొత్తవీ కావచ్చు. శ్రీశ్రీ ప్రయోగాలు సంప్రదాయంనుంచి ప్రయోగానికి పోయే మార్గాలే తప్ప సంప్రదాయాన్ని ఛేదించిన ఖడ్గాలు కావు. అనుప్రాసలూ, సజాతీయశబ్దాలూ వడిగల నడకా, దృశ్యాల, రూపచిత్రాల జాబితాలు, ఒక మానసికావస్థనూ ఒక moodనూ సృష్టించే భావచిత్రపరంపరలు, రసావిష్కరణకు కావలసిన మూలద్రవ్యాలు, పదాల కూర్పు

4 అదే వ్యాసం.

5 అదే వ్యాసం.

6 Oxford Companion to English Literature.

వల్ల వచ్చే వేగం, ఒకానొక కాలానికీ స్థలానికీ సంబంధించిన దృశ్యంనుంచి వెంటనే ఇంకో స్థల కాలాల దృశ్యానికి గంతువేసి ఒప్పించే పద్ధతి, కొలతలూ బరువులూ ఒరపులూ గల పదాలను ఏరుకుని ప్రయోగించడం, ఉద్దిష్టార్థం వచ్చేటట్లు పదాలను కలిపి పదబంధాలను కల్పించడం, వాక్యరచన, పనితనం, కవితాఖండంయొక్క పరిమాణం, పదపునరుక్తి, యమకాది శబ్దాలంకారాలు, వాక్యరూపవైవిధ్యం, అనువాదానికీ అనుకరణకూ లొంగనివిధంగా భావాన్ని చెప్పగలగడం, మారుతున్న వ్యవస్థకు అనుగుణంగా కవితావస్తువును తీసుకోవడం, నిరాడంబరంగా చెప్పడం మొదలైనవాటిని వచనగీతపు లక్షణాలుగా శ్రీశ్రీయే స్వయంగా సూచించి ఉన్నాడు.[7]

వచనగీతం ఇచ్చే స్వాతంత్ర్యాన్ని చాలామంది దుర్వినియోగం చేసుకుంటారని గమనించిన శ్రీశ్రీ అలా దుర్వినియోగం చేసినవారి రచనలు వచనంలోకూడా చేరకుండా bad prose అవుతాయని 1947లో హెచ్చరించాడు. శ్రీశ్రీ మహాప్రస్థానంలో రాసి చూపించిన వచనగీతాలు సాహసి, కవితా ఓ కవితా, సంధ్యాసమస్యలు, అవతలిగట్టు, పరాజితులు, వాడు, వ్యత్యాసం, మానవుడా, కొంపెల్ల జనార్దనరావుకోసం అనేవీ ఆకాశదీపం అనేదీ good poetryకి ఉదాహరణలుగా నిలిచిపోతాయి.

వచనగీతానికి గణబద్ధత లేకపోయినా ఒక 'సవ్వడి' ఉంటుందనీ అది గణాలు లేని లోపాన్ని భర్తీ చేస్తుందనీ చెప్పిన శ్రీశ్రీ తన వచనగీతాలలో దాన్ని విన్యసించాడు.

'ఆకాశదీపం' ఖండికలోని 'ఖండపరశుగళకపాలగణముల కనుకొలకులలో ఒకటివలె' అనే పంక్తిలో ఆ సవ్వడి వినిపిస్తుంది.

శ్రీశ్రీ వచనగీతాలు వచనఖండాలు కావు. అంటే పాదవిభజనవల్ల కవిత్వరూపం తెచ్చుకున్న వచనం కాదు. అలాగే పద్యానికి పాదవిభజన మార్చడంవల్ల ఏర్పడే పద్యఖండాలూ కావు. భావాన్నిబట్టి, రచననుబట్టి గణబద్ధ-గణరహిత రచనలు రెండింటికీ శ్రీశ్రీ వచనగీతం భిన్నమైనదే. గణసహితత్వం, గణరహితత్వం కూడా శ్రీశ్రీ వచనగీతంలో ఉంటాయి. అంతకుమించిన కవితా వక్రోక్తి ఉంటుంది.

పాడేందుకూ చదివేందుకూ కూడా అనువుగా ఉండటం శ్రీశ్రీ వచనగీతపు విశిష్టలక్షణం.

గ్రాంథికంలో రాసిన వచనపద్యానికీ వ్యావహారికంలో రాసిన వచనగీతానికీ తేడా చూద్దాం.

---

7 శ్రీశ్రీసా రెండు. వచన. 499.

| విద్యున్మాలికలు | ఆకాశదీపం |
| --- | --- |
| బారులుబారులుగ తీరిన । మబ్బుగుబ్బలిల దారుల<br>దాటితప్పి చరించు । ఆ రేయి తంళసరశైరమ్మదములు | ఒక దురదృష్టజీవి<br>ఉదయం ఆరున్నరకు<br>ఆ గదిలోనే ఆరిపోయాడు<br>అతని దీపం ఆ గదిలో<br>మూలనక్కి మూలుగుతున్నది. |

భాషలో నేకాదు భావంలోకూడా రెండింటికీ ఉన్న తేడా సౌలభ్యానికీ, వైచిత్రికీ సంబంధించింది.

| పద్యసంగీతం | వచనకవితాసంగీతం |
| --- | --- |
| అవి ధరాగర్భమున మానవాస్థికా<br>పరంపరలు సుప్త నిశ్శబ్దసంపుటములు | చీకటిబోనులో సింహములా నిలుచున్నది<br>కత్తిగంటుమీద నెత్తుటిబొట్టులాగున్నది |

రెంటినీ పాడినపుడు సంగీతభేదం అర్థం అవుతుంది.

ఆకాశదీపంలోని గమనవైవిధ్యాన్ని కింది పాదాల్లో చూడగలం-

| | |
| --- | --- |
| గదిలో ఎ । వరూ లేరు | — అనుష్టుప్పు నడక |
| గదినిండా నిశ్శబ్దం<br>నాయంత్రం ఆరున్నర గదిలోపలచీను<br>కులవలె చీకట్లు | } కందంనడక |
| ఖండపరశుగళ । కపాలగణముల<br>కనుకొలకులలో । ఒకటివలె | } చతురస్రగతి |
| చూపు । లేని । చూపు । లతో । తేరి | — త్ర్యస్రగతి |
| అతనిదీపం ఆగదిలో<br>మూలనక్కి మూలుగుతున్నది<br>ప్రమిదలో చమురు త్రాగుతూ<br>పలుదిక్కులు చూస్తున్నది<br>చీకటిబోనులో<br>సింహములా నిలుచున్నది<br>కత్తిగంటుమీద<br>నెత్తుటిబొట్టులాగున్నది | } సీసపద్యపు నమూనా (వచనసీసం) |
| దూరాన నింగిమీద తోచిన ఒకచుక్క | (ఖండగతి) |
| మిణుకుచూపులు మెలమెల్లగావిసరి | (ద్విపదగతి) |
| గదిని తలపోతతో | (చతురస్రగతి) |
| కౌగిలించుకుంటున్నది | (త్ర్యస్రగతి) |

పై నాలుగుపాదాలూ కలిసి ఒక వచనగీతం అయింది. ఇందులో దూరాన అనే మాట తప్పితే తతిమ్మాదంతా దేశ్యభాష.

అనుప్రాసలు

దీపం ఆరిపోయింది
తారగా మారిపోయింది

వడిగల నడక

ఖండపరశుగళకపాలగణముల
కనుకొలకులలో ఒకటివలె

సజాతీయశబ్దాలు

అలసిపోయింది పాపం దీపం

పదసంయోజనం

మిణుకుచూపులు, చీకటిబోను,
ఆకాశతార, ఆహ్వానగానం
ఆదరపుచూపు

వాక్యరచన

గదిలోపల చినుకులవలె చీకట్లు
గదిలోపల ఏవేవో ఆవిరులు

పునరుక్తి

గదిలో ఎవరూ లేరు
గదినిండా నిశ్శబ్దం
గదిలోపల చినుకులవలె చీకట్లు
గదిలోపల ఏవేవో ఆవిరులు

శబ్దాలంకారాలు

అకస్మాత్తుగా ఆదీపం ఆకాశతారను చూసింది
రాకాసికేకలు వేసింది

కుండలీకృత వాక్యం

రాకాసికేకలు వేసింది
(నీకూ నాకూ చెవులసోకని కేకలు)

సముచ్చయార్థకదీర్ఘం, యాసలు, కాకువులు

నీకూ నాకూ
ఎవరూ లేరు

బిందువ్యంతరూపాలు

గదినిండా నిశ్శబ్దం
చూస్తున్నది దీపం

భావవైచిత్రి

గదినిండా నిశ్శబ్దం
గదిలోపల చినుకులవలె చీకట్లు
ఒకచుక్క మిణుకుచూపులు మెలమెల్లగా విసరి
గదిని తలపోతతో కౌగిలించుకుంటున్నది
ఆ గదిలోనే ఆరిపోయాడు
దీపం — మూలుగుతున్నది
చీకటిబోనులో సింహములా నిలుచున్నది
ఆదరపు చూపులు చాపింది

వచనగీతంలోని వస్తువునుబట్టి ఈ సంవిధానం మారుతూ ఉంటుంది. ఆకాశదీపంలోని వస్తువు విషాదశబలితం కనుక శైలిలో పరుగు లేదు. కవితా ఓ కవితా లోని వస్తువు నానారస భావసమ్మేళనం కనుక శైలికూడా చిత్రవిచిత్రగతులలో నడుస్తుంది.

Free verse is never so free as prose, never really free in the sense of being formless or unrhythmical. Rather its rhythms follow a pattern more varied than that of traditional verse, moving away from and returning to certain rhythmical norms and regularities.[8] వచనగీతం ఛందస్సునుంచి లయవైపు జరిగే పురోగమనం.

8 The Reader's Companion to World Literature.

కనబడలేదా మరోప్రపంచపు అగ్నికిరీటపు ధగధగలు !

1934 ఏప్రిల్ 12

నూతనఖండాలను కనుక్కోవడం, పారిశ్రామికవిప్లవం సాధిస్తూ విజ్ఞానశాస్త్రప్రయోగాల వల్ల నూతనయంత్రాలను నిర్మించడం, మూఢవిశ్వాసాలను ఉన్మూలించడం, పాడిపంటలను, వాణిజ్యాన్ని, కళలను గతంలో ఎన్నడూ ఎరుగనివిధంగా అభివృద్ధిచేయడం, రాకపోకల సదుపాయాలలో వేగాన్ని సాధించడం, విద్యావైద్యసౌకర్యాలను పెంపొందించడం, వార్తాప్రసారాలలో కాలదూరాలను జయించడంవంటి అభివృద్ధిని అంతా చూస్తూంటే 20వ శతాబ్ది ప్రథమదశకంలో కవిత్వం రాసిన గురజాడ

అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్ / దేశిసరుకుల నమ్మవలెనోయ్
డబ్బు తేలేనట్టి నరులకు / కీర్తిసంపదలబ్బవోయ్
వెనక చూచిన కార్యమేమోయ్ / మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్ / వెనుకపడితే వెనకెనోయ్
పూను స్పర్ధను విద్యలందే / వైరములు వాణిజ్యమందే

అంటూ గతనిరాసంతో వర్తమానసమాజాన్ని భవిష్యత్పథంలోకి నడిపించడానికి ప్రబోధించడం సమంజసంగానే కనిపిస్తుంది. ఫ్యూడల్‌వ్యవస్థమీద బూర్జువావ్యవస్థ చేస్తున్న తిరుగుబాటును, సాధిస్తున్న అభివృద్ధిని ఆయన హర్షించారు. కాని విశ్వనాథ, రాయప్రోలు ప్రభృతులు ఫ్యూడల్ వ్యవస్థ అస్తమయాన్ని సహించలేకపోయారు ఆంధ్రోద్యమ-స్వరాజ్యోద్యమ-జాతీయపునరుద్ధరణోద్యమాల ప్రభావంవల్ల గతకాలం వర్తమానభవిష్యత్తులకన్నా గొప్పదిగా భావించి దాన్ని వేనోళ్ళ కీర్తించారు.

చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర
హృదయముల చీల్చి చదువుడో సదయులార !

అనీ

అస్మదజ్ఞాతపూర్వదివ్యత్వమొప్పు/నీ పునీతావనీఖండ మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నా యాంధ్రశక్తి/నన్నుఁగంపింపఁజేయుచున్నది భృశమ్ము

అనీ

ఆంధ్రపూర్వరాజ్యమ్ములపేరుచెప్పిన/హృదంతరమేలో చలించుపోవు

అనీ గతస్మృతులలో ద్రవించారు. కానీ దువ్వూరి రామిరెడ్డిగారుమాత్రం గతంకన్నా వర్తమానభవిష్యత్తులు ఉజ్జ్వలంగా ఉంటాయని భావించడానికి కారణం వారికిగల విజ్ఞానశాస్త్రదృక్పథం; ఆధునికావగాహన.

పూర్వసింహాసనంబులు ప్రోజ్జ్వలంపు/మణిమయకిరీటములు భోగమందిరములు
చక్రసంఘర్షణంబునఁ జదిసిపోయి/యువి, యివి యనంగరాక రూపఱెడు నేడు

అంటూ భవిష్యత్తును గురించి కలగన్నారు శ్రీశ్రీ కూడా శ్రీరంగం శ్రీనివాసరావుగానే ఉన్నప్పుడు.

నాకుఁ గననయ్యె విస్మృతానేక చరిత/గత పురాతనసమయభారతధరిత్రి

అనీ

ఆ వైభవమ్ము అప్పటి ధరారమణ గౌరవాతిశయము ఆ దినమ్ముల
సౌఖ్యానుమోదరక్తి నాటి సంపత్సమృద్ధి ఏనాటికైన ఆంధ్రనిర్భాగ్యధాత్రికి నలవడునొకో

అనీ గతంవైపు దృష్టిని మరలించినా, కొన్నాళ్లు పోయాకా 'అట నొకే దీర్ఘయామిని, ఆ నిశా శ్మశానశయ్యకు ప్రాతః ప్రసక్తి లేదు' అంటూ గతం గతమే అనుకున్నాడు. తరువాత భావిదృష్టి నలవర్చుకుని 'నా తలపోత లీక్షణమునన్ పరువెత్తు—భావికాల విద్యోతిత నాట్యశాలలకు జ్యోతిరఖండయశోంగణాలకున్—నా మానసమింక భావిసుమమావికసద్రుచు లాస్వదించెదున్' అని సంకల్పం చెప్పుకున్నాడు. తరువాత గతచరిత్ర పరిజ్ఞానం ఏవిధంగా మానవుడి వర్తమాన గమనంమీదా భవిష్యద్ధ్యేయంమీదా ప్రభావాన్ని చూపిస్తోందో తెలుసుకుని 'జయభేరి'ని మ్రోగిస్తూ మహాప్రస్థానానికి శ్రీశ్రీ సిద్ధమయ్యాడు.

## శ్రీశ్రీ మహాప్రస్థానం అవతరణగాథ

మహాప్రస్థానగీతాలు వ్రాయడానికి ముందు శ్రీశ్రీ ప్రపంచంలోని వివిధదేశాల కవులను, భారతదేశంలోని ప్రగతిశీల భావాలుగల కవులను అధ్యయనంచేయడంలో వర్తమానసామాజిక వ్యవస్థకన్నా అందమైన ఆనందప్రదమైన సమాజవ్యవస్థకై ఈ కవులంతా స్వప్నాలు కంటున్నట్లు కనిపించింది. వీరంతా వర్తమానసమాజం మీద తిరుగుబాటును కోరుతున్నట్లుకూడా గ్రహించాడు.

1933కు ముందు శ్రీశ్రీ నూతనవస్తువు కోసమే గవేషిస్తూ ఉండగా శిష్ట్లా నవీనధోరణులు, శిష్ట్లాను అనుసరిస్తూ వచనగీతాలురాస్తున్న ముద్దుకృష్ణధోరణులు ఆకర్షించినపుడు హరీంద్రనాథ్ గీతాలూ మరికొన్ని ఆంగ్లగీతాలూ అనువదించడం ప్రారంభించి, స్వతంత్రగళం తెచ్చుకున్నాడు. ఆ తర్వాత ఆంగ్లకవులతో తృప్తిపడని శ్రీశ్రీ ఫ్రాన్సు జర్మనీదేశాల కవుల ఆకర్షణకి ముగ్ధుడై ప్రపంచవిశాలమైనదృష్టిని అలవరచుకున్నాడు. ప్రపంచం అంతటా అభివృద్ధిని కాంక్షించే కవుల

స్వప్నాలు రష్యన్‌విప్లవంలో ఆకృతి ధరించడం చూసిన శ్రీశ్రీ సామాజికవిప్లవానికి పురోగామిగా సాహిత్యవిప్లవాన్ని సాగించాలని దృఢనిశ్చయానికివచ్చి ముత్యాలసరంలో వాడుకభాషలో జయభేరి రాయడం పూర్తి అయిన తరవాత 1934 ఫిబ్రవరి 18వ తేదీనాడు ఎడ్గార్‌అల్లన్‌పో గంటల్ని అనుకరిస్తూ రాయబోతున్న గీతంలో

హరోంహరోంహర హరహరహరహర/హరోంహరా అనిపలికే గంటలు

అనే పాదం వెలువడగా అది తతిమ్మా పాదాలతో బేలన్సు కాకపోవడంవల్ల ఉపసంహరించు కున్నా అది మనస్సులో బలంగా నాటుకుని ఉండిపోయింది. ఆకాశదీపం అనే వచనగీతాన్ని ముగించాకా ఒక రోజున (1934 ఏప్రిల్ 12) ఏదో వ్యాసం రాదామని 'మరోప్రపంచం' అనే శీర్షికను నిర్ణయించుకుని కాగితంమీద రాసేసరికి కలంలో సిరా అయిపోగా కాపీయింగ్ ఇంక్ పెన్సిల్‌తో అసంకల్పితంగానే మొదలుపెట్టి మహాప్రస్థానగీతం పూర్తి చేసేసరికి 5 నిమిషాలు మాత్రమే పట్టింది. ఈ గీతంలోనే వెనుక ఉపసంహరింపబడిన హరోంహరోం అనే పాదం రూపాంతరం పొంది వచ్చిచేరడం శ్రీశ్రీ కవితావ్యగ్రతకు నిదర్శనం.

సహజమైన లయజ్ఞానం, స్వచ్ఛందమైన కవితాధార, వ్యక్తావ్యక్త వివేచన, ప్రగతిశీల దృక్పథం ఉన్నవాడు కనుకనే శ్రీశ్రీ ఈ గీతాన్ని అలా అనుకోకుండా రాసేయగలిగాడు. ఈ గీతంలోని కొత్తదనానికి తెలుగుదేశంలోని ఆలోచనా, భావనా అలవాటుపడి లేవుకనకనే పంపిన మూడోరోజుననే ఒక సుప్రసిద్ధ మాసపత్రిక శ్రీశ్రీకి తిరగగొట్టింది. తరవాత శ్రీశ్రీ ఈగీతాన్ని కొన్ని మార్పులుచేసి పరిష్కరించుకున్నాడు.

కదం త్రొక్కుతూ పదం పాడుతూ/కాంద్రుకాంద్రుమని గర్జిస్తూ

అని మొదటవ్రాసిన రెండుపాదాలలో విమర్శకుడైన శ్రీశ్రీ తనలోపాన్ని కనిపెట్టి సవరించుకున్నాడు. కాంద్రుకాంద్రుమనేది పులీ, గర్జించేది సింహం కనుక ఆ రెంటినీ కలపడం నచ్చక 'కదంతొక్కుతూ పదంపాడుతూ హృదంతరాళం గర్జిస్తూ' అని మార్చాడు. తరువాత ఈపాటను విశాఖపట్టణం టర్నర్ సత్రంలో చదివివినిపించినప్పుడు విన్నవారిలో అడవి బాపిరాజుగారొకరు. వారు దీనిచేత ప్రభావితులై ఎగురనివ్వండోయ్ జ్వాలల్ అనే పాట రాసి జ్వాలకు పంపగా శ్రీశ్రీ మహాప్రస్థానాన్నికూడా జ్వాలకే పంపాడు. శ్రీశ్రీ గేయం ప్రచురణ అడవివారి గేయం ప్రచురణకన్నా ఆలస్యమయింది.

మహాప్రస్థానం గీతాన్ని రాయడానికి ముందు శ్రీశ్రీ మనస్సులో ఏ మారుమూలల్లోనో మారుమ్రోగుతూఉన్న గీతాలు కొన్నిఉన్నాయి. లామర్సెయ్యే లా ఇంటర్‌నేషనాల్, బరన్సు కవి రచించిన బెన్నాక్ బరన్, అలెగ్జాండరు బ్లాక్ రాసిన ది ట్వెల్వ్, హరీంద్రనాథఛటోపాధ్యాయ రాసిన షురూహు ఆ హై జంగ్, కాజీనజ్రుల్ ఇస్లాం రాసిన విప్లవగీతాలూ కవికొండల

వేంకటరావు రాసిన శివరాత్రిప్రభ గీతమూ గురజాడవారి ముత్యాలసరాలూ, ఎడ్గార్ అల్లన్‌పో రాసిన గీతాలూ వేమన ఆటవెలదులూ బరంపురం నవ్యసాహిత్యపరిషత్తులో శివశంకరులు చదివిన శిప్ట్లా మారోమారో అనే గీతమూ శంకరభగవత్పాదుల భజగోవిందశ్లోకాలూ జయదేవుని గీతగోవిందం పదాలూ The Sea the sea the smiling sea అనే గీతమూ ఎడిత్ సిట్‌వెల్ గీతాలూ తిక్కన ఆశ్వాసాంతపద్యాలూ మొదలైనవాటి సంస్కారమంతా శ్రీశ్రీలో జలపాతంవలె ప్రవహిస్తూంటే విద్యుత్తులా ఈగీతం ఎగజిమ్ముకు వచ్చింది.

## శ్రీశ్రీపై నజురుల్ ప్రభావం

పురిపండా అప్పలస్వామిగారి ప్రేరణవల్ల కాజీనజురుల్ ఇస్లాం విప్లవగీతాలను చదివి ప్రభావితుడైన శ్రీశ్రీ మహాప్రస్థానంవంటి 'మార్చింగ్ సాంగ్' వ్రాయడంలో నజురుల్ ఇస్లాం ఒరవడిని తీసుకున్నాడు[1]. 1920లోనే సామ్యవాదవిప్లవాన్ని గురించి తీవ్రవేగంతో కవితాసందేశం వినిపించడం మొదలుపెట్టిన నజురుల్ ఇస్లాం 1929 నాటికే అగ్నివీణ, విషేర్‌వంశి, సామ్యవాది, సర్వహార, సింధుహిల్లోల్, సంధ్యవంటి కవితాసంపుటాలు ప్రకటించి ఉన్నాడు. రవీంద్రుడి కాల్పనికదృక్పథంకన్నా నజురుల్ ఇస్లాం వాస్తవికదృక్పథం దేశంలో వ్యాపిస్తున్న ఆకాలంలో భావకవులకన్నా ముందుకు వెళ్ళడం అంటే టాగోరునుంచి నజురుల్ ఇస్లాం వరకూ సాగడమే. ఈపనినే శ్రీశ్రీ చేశాడు. విద్రోహి, ప్రళయోల్లాసం, బోధన, మానుష్, పాప్, వారాంగన, నారి, కూలి, కృషికార్‌గానం, అమర్‌కైఫీయత్, సవ్యసాచి, దారిద్ర్యం, ఛల్‌ఛల్‌ఛల్‌వంటి నజురుల్ నవ్యగీతాలు సమసమాజ దృక్పథానికెత్తిన పతాకలు. అందులో ఛల్‌ఛల్‌ఛల్ గీతం చూద్దాం.

### MARCHING SONG

Chorus :

March on, march
The drum resounds in the sky above,
the earth below is all agog,
You the corps of youth of the scarlet dawn
March on, march on !

We shall knock at the door of dawn
as usher in the bright red morning
We shall put an end to the Murky night
and to obstacles as big as the mountains.

We shall sing the song of the ever new
and shall liven up the cremation ground
of thousands.

We shall import new life and fresh
strength in the arms.

March on, new youth,
Listen carefully to the call of life
on the threshold of death !
Break, break the barriers—
March, march ! Let us march on!

1 శ్రీశ్రీ సా. మూడు. వచన. 286 పే.

Chorus :
March on, march on etc.
Above, thunder rolls out the command
You soldiers pledged to martyrdom
muster, march out in all directions
and open up the Chamber of sleep !
Long ago you lost the royal status,
you the wanderer still longs for the past
and sings and sheds tears.

Let the fabulous throne of by-gone empire
be by-gone.

Awake, you insensible ones !
Note how countries like Persia, Rome,
Greece, Russia and so many of them
went under
Yet they have all awakened again
you weaklings, awake, arise !
We shall build up a new Tajmahal
out of dust and soil !
March on, march on, march on !

Chorus :
March on march. etc.[2] (1929)

ఈ గీతంలో నజురుల్ ఇస్లాం యువకుల్ని ముందుకు నడవండని ప్రబోధిస్తూ గతాన్ని తిరస్కరించి భవిష్యత్తుమీద ఆశలు కల్పిస్తూ, పర్వతాలవంటి అవరోధాలను దాటి శ్మశానాలను పునరుజ్జీవింప జేసి, మృత్యుద్వారంలోని జీవనాహ్వానాన్ని వినమన్నాడు; గోడలను కూల్చి వేయమన్నాడు; నిద్రనుంచి మేలుకోమన్నాడు గతంగతమే అంటూ పెర్షియా, రష్యా, రోమ్, గ్రీసువంటి దేశాలు పతనమై తిరిగి ఎలా విజృంభించారో తెలుసుకోండన్నాడు. శ్రమశక్తితో సరికొత్త తాజమహాలును నిర్మించగలం అన్నాడు. ఇలా వ్యక్తిచైతన్యంనుంచి సమష్టిశ్రామికచైతన్యం వైపు మళ్ళించిన కవితాస్ఫూర్తినే శ్రీశ్రీ పదండి ముందుకు పోదాం పోదాం అంటూ ప్రకటించాడు. బెంగాల్‌నుంచి వీస్తున్న విప్లవాగ్నిని తెలుగుదేశంలోకి అక్షరాల గుప్పిళ్ళతో ఎత్తిపోసి మరో ప్రపంచపు త్రేతాగ్నిని కణకణ మండించాడు.

## శ్రీశ్రీ సమష్టిధోరణి

ఈ ప్రపంచాన్ని మిథ్యగా భావించి మరో దివ్యప్రపంచాన్ని భావించుకునే ఆధ్యాత్మికవాదులూ సింబాలిస్టులూ ఆదర్శవాదులూ ఈప్రపంచాన్నే వాస్తవంగా భావించి దివ్యలోకాలను మిథ్యగా భావించుకునే శ్రీశ్రీవంటి భౌతికవాదికి ప్రతిపక్షంవారే అయిపోయారు మహాప్రస్థానం రాయగానే. ఈ వాస్తవప్రపంచమే సామాజిక పరిణామంవల్ల మరో దివ్యప్రపంచంగా రూపొందుతుందనీ రెండు ప్రపంచాలూ వాస్తవాలే అనీ శ్రీశ్రీ నిర్ధారణకు వచ్చేశాడు 'మరో ప్రపంచం' రాసి. 'ఎఱుగుదు మఱియొక్క మనోహరతర గేహము కలదని—ఏమూలల గనిన అపారామనస్యమే ఇచ్చట అతుల బ్రహ్మానందం బమరెడు నచటన్' అంటూ దాదాపు 8 ఏళ్ళక్రితం 'అంతిమయాత్ర'లో దివ్యలోకానికి పోవడానికి సిద్ధమైన శ్రీశ్రీ ఇప్పుడాదివ్యలోకం ఈప్రపంచంలోనే ఉందని గుర్తించాడు. ఈప్రపంచంలోని దుఃఖాలకు కారణం సామాజికవ్యవస్థలోని లోపాలే తప్ప భగవద్విలాసంకాదని నిశ్చయించుకున్నాడు.

2 The Rebel and Other poems.

నూతన సామాజికవ్యవస్థ ఏర్పడటానికి శ్రామికులు పాతప్రపంచంమీద తిరుగుబాటు చేస్తూ ముందుకు నడిస్తే భవిష్యత్తు దానికి ఆలవాల మవుతుందని గ్రహించాడు కనుక ఆ శ్రామికులనే పదండి ముందుకు అంటూ ప్రబోధిస్తూ కవిత్వాన్ని వారికే అంకితంచేశాడు. ఉన్న వ్యవస్థ అంతా బాగానే ఉందనీ ఇది ఇంకా బాగుపడటానికి గతవైభవపునరుద్ధరణమే మార్గమనీ బోధించే కవులకు శ్రీశ్రీ ప్రతిపక్షంవాడై పోయాడు. ఈవిధంగా తెలుగు కవిత్వంలో కూడా రెండు ప్రపంచాలేర్పడిపోగా శ్రీశ్రీ మరోప్రపంచం కవి అయి, నూతనయుగానికి ప్రారంభకుడయ్యాడు. కవితాసంవిధానంలో ప్రయోగాన్నీ కవితాదృక్పథంలో ప్రగతినీ కవితావస్తువులో ప్రయోజనాన్నీ మేళవించుకునే, శ్రీశ్రీ మహాప్రస్థానం గీతం రాశాడు. సామాజికవ్యవస్థ మారుతున్నప్పుడల్లా మానవుడి జీవితవిధానం మారుతున్నట్టే కవిత్వంకూడా మారిపోతుందనే ప్రాథమికసూత్రమే శ్రీశ్రీ కవితా పరిణామానికి మూలహేతువు.

ఫ్యూడల్‌వ్యవస్థలోని సమష్టిబాంధవ్యాలు బూర్జువావ్యవస్థలో విచ్ఛిన్నమై వ్యక్తిస్వేచ్ఛకు ప్రాధాన్యం వస్తున్నప్పుడు కవి ఆత్మాశ్రయధోరణిలో తన కవిత్వాన్ని రాయడం జరగగా బూర్జువావ్యవస్థమీద విప్లవం సాధించదలచిన కవి సామాజిక సామూహికశక్తి నర్థిస్తూ పదిమందిలో నిలబడి పదిమందితో ఆలాపిస్తూ ముందుకు నడిపిస్తూ సమాజనాయకత్వం వహిస్తూ 'పదండి పోదాం' అనే ధోరణికి—ఉత్తమపురుషబహువచనంలోకి—కవిత్వాన్ని మలుపుత్రిప్పాడు. సమాజానికి యాజమాన్యం వహించే బూర్జువావ్యక్తులు ఆత్మాశ్రయధోరణులను ప్రోత్సహించగా పీడితజనులు సమష్టిధోరణిని అవలంబిస్తారు. ఈ పీడితజనపక్షపు కవియే శ్రీశ్రీ. (చేదుపాటలో) మనమంతా బానిసలం మనదీ ఒక బ్రదుకేనా? (అద్వైతంలో) ప్రపంచమును పరిహసిస్తాం (వ్యత్యాసంలో) ముందుదారి మాది ప్రపంచం మావెంటవస్తుంది వంటి పంక్తుల్లో కవి సమాజంతో పొందుతున్న తాదాత్మ్యం స్ఫురిస్తుంది. శ్రీశ్రీ ఆత్మాశ్రయంగా ఏకవచనంలో రాసిన గీతాలూ చాలా ఉన్నాయి. కానీ అందులో 'నేను' సామాజికప్రతినిధియే కానీ ప్రయివేటువ్యక్తి కాదు.

## శ్రీశ్రీ మరోప్రపంచం

భారతజాతికి మూలపురుషులై ధర్మస్థాపనకు సంగ్రామంచేసి అధర్మాన్ని తుత్తునియలుచేసి శరీరాలతోనే స్వర్గానికి పోవడానికి యాత్రసాగించిన పాండవుల స్వర్గయాత్రకు వేదవ్యాసుడు మహాప్రస్థానం అంటూ పేరుపెట్టగా ఫ్యూడల్, బూర్జువా వ్యవస్థలమీద తిరుగుబాటుచేసి ధర్మసంగ్రామంలో పాల్గొని సామ్యవాద సమాజస్థాపనకై పురోగమనం సాగించే శ్రామికవీరుల భౌతికయాత్రను శ్రీశ్రీ మహాప్రస్థానం అన్నాడు. ఇహపరాలని వేదాంతులు పెట్టిన పేర్లకు ప్రతిగా శ్రీశ్రీ ప్రపంచం, మరోప్రపంచం అంటూ వ్యవహరించాడు. కవిత్వంద్వారా శ్రీశ్రీ

ఆ మరోప్రపంచాన్ని చూడగల్గాడంటే తానుంటున్న ప్రపంచంలో తాను అన్యాయాలకు గురి అవుతున్న వాస్తవాలను గ్రహించి, అలాంటి అన్యాయాలు లేని ప్రపంచాన్ని స్వప్నలోకాలలో దర్శించి దాన్ని నిజంగా భూలోకంలో స్థాపించే అవకాశమున్నదని తెలుసుకున్నాడు కనుక నే. ప్రపంచంలో దుర్లభమైన సౌందర్యాన్ని కలలలో దర్శించి కవిత్వంలో దాన్ని వర్ణించడం భావ కవుల, భావుకకవుల అలవాటు. దాన్ని ఆ మిథ్యాజగత్తులోనే అనుభవించడం రసవాదుల, ఆదర్శ వాదుల అలవాటు. ప్రపంచంలో దుర్లభమవుతున్న సౌఖ్యాలను కలగని వాస్తవంగా వాటిని అనుభవించడానికి అవకాశం ఉన్నదని సూచించడం విప్లవకవుల అలవాటు. దాన్ని ఆచరణలోకి అనువదించడం శ్రామికుల కర్తవ్యం ఈ రెండు ప్రపంచాలనూ ఒకేకవి తన జీవిత వివిధదశలలో చూడటం తెలుగుకవిత్వంలో శ్రీశ్రీతో మొదలయింది. 1933కు ముందు శ్రీశ్రీ భావకవి. 33 తరవాత శ్రీశ్రీ విప్లవకవి.

కవిత్వం కవిత్వానుభూతికే మాత్రమే అనుకోవడం ఆంతరప్రపంచంలో తిరుగాడే భావకవికి సహజమే కానీ ఆవిధంగా అనుకుని తృప్తిపడిపోవడం విప్లవకవి ధ్యేయానికి భంగం అవుతుంది. తాను కవిత్వానుభూతిని పొందుతూనే సమాజాన్ని నిద్రాణస్థితినుంచి మేలుకొల్పి దానికికూడా ఆ కవిత్వానుభూతిని కలిగిస్తూ కర్తవ్యాచరణకు శ్రామికుల్ని ఉద్యుక్తుల్ని చేయడంతోగానీ విప్లవకవి ధ్యేయం నెరవేరదు. అందువల్ల భావకవి ప్రయోజనాలకన్నా విప్లవకవి ప్రయోజనాలు విస్తారాలు. ఇంత విస్తృత ప్రయోజనాలను సాధించేందుకు పనిముట్లు మాత్రమే కాక పనితనం కూడా ఎక్కువగా అవసరం అవుతుంది. ఈ పనిముట్లను, పనితనాన్ని శ్రీశ్రీ ప్రపంచకవులనుంచి అభ్యసించి తెలుగు దేశానికీ తెలుగుభాషకూ పరిచయంచేశాడు.

మహాప్రస్థానం గీతంలో మరోప్రపంచపు రూపరేఖలను సింబాలిస్టుల 'సూచ్యశిల్పం'తో వ్యక్తంచేయడంవల్ల ఆ గీతమే ఒక మహాకావ్యపువిశిష్టతను సంపాదించుకుంది. త్యాగాలు చేస్తూ అంతరాయాలను అధిగమిస్తూ శ్రామికులు మహాప్రస్థానం సాగిస్తూఉంటే వచ్చే అనేక పరిణామాలనూ అల్లకల్లోలాలనూ భౌగోళికపరిణామాలలో ప్రతిబింబింపజేశాడు.

జీవితంలో కవిత్వాన్నీ కవిత్వంలో జీవితాన్నీ వెదుక్కునే అలవాటుగల శ్రీశ్రీ ప్రపంచంతో తనవంటి సామాన్యుడి జీవితం, కవిత్వం ముడిపడి ఉన్నాయని గ్రహించాడు. సామాన్యుల జీవితాలలో అల్లకల్లోలాలనూ అశాంతినీ సృష్టిస్తున్న వివిధ దేశాల రాజకీయార్థికవిధానాలు 1934 నాటికే రెండవ ప్రపంచయుద్ధంవైపు నడుస్తూ ఉన్నాయి. విశ్వవ్యాప్తంగా ఏర్పడిన ఆర్థికసంక్షోభం, ఇండియాలో నిరుద్యోగం, పరపీడన, దారిద్ర్యాది భీకరపరిస్థితులు, జర్మనీలో ఫాసిస్టునియంతృత్వం, ఇంపీరియలిస్టుల దోపిడీలు వీటన్నిటినుంచి ప్రపంచమానవులు విముక్తిపొందడానికి సామ్యవాదవిప్లవం ఒక్కటే శరణ్యమని మేధావులు, కళాకారులు భావిస్తున్న తరుణంలోనే శ్రీశ్రీ మహా

ప్రస్థానగీతం రాశాడు. నిజజీవితంలో తా ననుభవిస్తున్న నిరుద్యోగ, దారిద్ర్యాలకు కారణాన్ని ఊహించుకోవడంలోనే శ్రీశ్రీ కవితావిప్లవం వికసించింది.

"Today the natural trend of progress for all mankind is towards the building of classless society. Communism is nothing but the endeavour to help this natural trend onwards in conscious manner"[3]

మానవజాతి అభ్యుదయానికి విభాతగీతంగా కమ్యూనిజాన్ని శ్రీశ్రీ భావించాడు.

## శ్రీశ్రీ ప్రగతిశీలభావాలు

ఫ్యూడల్, బూర్జువావ్యవస్థల్లో కష్టాలకు, బానిసతనాలకు, దోపిడికి గురి అవుతున్న కర్షక కార్మిక శ్రామికవర్గాన్ని అంతటినీ మరోప్రపంచం పిలిచింది అంటూ ఆహ్వానాన్ని అందిస్తూ మొదలుపెట్టి అందరితోపాటు తానుకూడా పాల్గొని, దారి చూపిస్తున్నట్లు కవి ఈపాటను మొదలు పెట్టి శ్రామికసమాజనాయకుడయ్యాడు. మరోప్రపంచం అనే సామాజికవ్యవస్థ మానవీకరణం పొంది 'పిలిచింది' అనడంలోనే ఉంది వైచిత్రి. 'పదండి ముందుకు పదండి త్రోసుకు పోదాం పోదాం పైపైకి' అంటూ సమయం దాటిపోకుండా పరుగెత్తాలని తొందరపెడుతూ చూపుతున్న ఉత్సాహావేశాలు ఆ నూతనప్రపంచంపట్ల కుతూహలాన్ని రగులుగొల్పుతాయి,

కదిలించడం, మార్పించడం, పాడించడం, పెనునిద్దుర వదిలించడం, మునుముందుకు సాగించడం, పరిపూర్ణపుబ్రతుకిప్పించడం కవిత్వధర్మాలుగా భావించుతున్న శ్రీశ్రీ మహాప్రస్థానపు మొదటిగీతంలోనే పీడితులనందరినీ కదిలించి, పాడించి చివరిగీతంలో మరోప్రపంచాన్ని చూపించి 'ఈ లోకం మీదేనండి మీరాజ్యం మీరేలండి' అని ముగించాడు. రాజ్యాధికారాన్ని వ్యక్తుల నుంచి తప్పించి సమాజానికిప్పించడమే ప్రొలిటేరియన్ కవిత్వపు తుదిలక్ష్యం

'పదండి ముందుకు' అని మొదట చెప్పిన ఈ మాటే రూపాంతరం పొందుతూ పదండి త్రోసుకు, కోటలన్నిటని దాటండి, రారండి, కదలండి, ప్రభంజనంవలె హోరెత్తండి, భావవేగమున ప్రసరించండి, పెళపెళపెళపెళ విరుచుకుపడండి, ఉరకండీ ఉరకండీ ముందుకు, త్రాచులవలెనూ రేచులవలెనూ ధనంజయునిలా సాగండి అంటూ గీతం పొడుగునా ఆవృత్తమవుతూ ఉంటుంది.

సామ్యవాదం సాధించడం కేవలం కవిత్వంతో జరిగేదికాదు. రాజకీయార్థికవిధానాలలో మార్పుద్వారా వచ్చే సామ్యవాదానికి ప్రజల తిరుగుబాటే మార్గమవుతుంది. ఆ తిరుగుబాటును ప్రేరేపించడమే కవిత్వం చేయగలిగేది.

కదం త్రొక్కుతూ/పదం పాడుతూ హృదంతరాళం గర్జిస్తూ ప్రజలను ముందుకు నడవవల సిందిగా చెప్పిన శ్రీశ్రీ మొదటి క్రియతో గుర్రంవలె బరువునుమోస్తూ ఉత్సాహంగా పరుగు తీయ వలసిందనీ రెండవక్రియతో యాంత్రికంగాకాక ఆవేశపూరితంగా సమష్టిగా కదలవలసిందనీ మూడవ

3 A marxian Glimpse of History 1 P.

క్రియతో సింహాలవలె శత్రువులపై విరుచుకుపడవలసిందని సూచించాడు. ఈ ప్రేరణను కలిగించడంలో శ్రీశ్రీ ఈగీతంలో ఇంకా ఎన్నో పోలికలను చెప్పాడు. ప్రభంజనంవలె హోరెత్తండన్నాడు. భావవేగమున ప్రసరించండన్నాడు. శివసముద్రమూ నయాగరావలె ఉరకండన్నాడు. త్రాచులవలెనూ రేచులవలెనూ ధనంజయునిలా సాగండన్నాడు. శ్రామికులతో ముఖాముఖిగా ఇలా చెప్పిన శ్రీశ్రీయే మరికొన్నాళ్లు పోయాకా బూర్జువాలతో అనాథులంతా అశాంతులంతా దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో విప్లవశంఖం వినిపిస్తారోయ్ అని చెప్పడమేకాదు; బూర్జువాలకూ శ్రామికులకూ ముఖాముఖి నూహించి శ్రామికులచేత 'తిరుగుబాటు మా వేదాంతం' అనిపించాడు,

'మరోప్రపంచం' రష్యాలో మొట్టమొదటగా ఏర్పడింది కనుక అది 'యుటోపియా' కాదు; అందుకే 'వినబడలేదా మరోప్రపంచపు జలపాతం ?' అని ప్రశ్నించాడు. నిత్యప్రవాహశీలమూ స్వచ్ఛందమూ ధ్వనిబంధురమూ శక్తిమంతమూ అయిన జలపాతాన్ని జనచైతన్యానికి ప్రతీకగా తీసుకున్నాడు. ఇండియాలోని శివసముద్రజలపాతం, అమెరికాలోని నయాగరా జలపాతం శ్రీశ్రీకి గుర్తురాక మానలేదు. అందుకే ఈగీతంలో శివసముద్రమూ నయాగరావలె ఉరకండీ ఉరకండీ ముందుకు అంటూ జనావళిని తొందరపెట్టాడు. ఇండియా అమెరికాలలో సామ్యవాదం రావాలనే అభిప్రాయం వ్యంగ్యంగా గోచరించకమానదిక్కడ. ఈ జలపాత సంకేతం శ్రీశ్రీ విన్న కవిత్వ ఘోషల్లోకి వెళ్ళి 'ఒకకోటి జలపాతాల పాటలుగా మారింది-'కవితా ఓ కవితా'లో.

మరోప్రపంచపుజలపాతంలాగే శ్రీశ్రీ మరోప్రపంచంతో కలిపి మరికొన్ని భావచిత్రాలను ఈగీతంలో జనంముందుంచాడు. మరోప్రపంచపు కణకణమండే త్రేతాగ్నిని చూడండన్నాడు. విరామమెరుగక మ్రోగే మరోప్రపంచపు కంచునగారా వినండన్నాడు. మరోప్రపంచపు అగ్ని కిరీటపుధగధగల్నీ మరోప్రపంచపు ఎఱ్ఱబావుటా నిగనిగల్నీ మరోప్రపంచపు హోమజ్వాలల భుగభుగల్నీ చూపిస్తూ గీతాన్ని ముగించి సామ్యవాదప్రపంచపు చైతన్యాన్ని స్ఫురింపజేశాడు.

జనపురోగమనానికి ఎన్నో అవరోధాలను కల్పిస్తూ వర్గాల సుస్థిరతకై వ్యూహాలుపన్నే బూర్జువారాజకీయాధికారాన్ని కూలదన్నడంలో విప్లవవీరులు ప్రాణాలు వదలకతప్పదు. 'దారి పొడుగునా గుండెనెత్తురులు తర్పణచేస్తూ 'పదండి ముందుకు; బాటలు నడచీ పేటలు కడచీ కోట లన్నిటిని దాటండి; నదీనదాలూ అడవులు కొండలు ఎడారులా మన కడ్డంకి ?' అంటూ ప్రాణ త్యాగాలనూ వీరమరణాలనూ రక్తతర్పణాలనూ ప్రోత్సహించాడంటే అశాంతినీ అల్లకల్లోలాన్నీ అభిమానిస్తున్నాడని అర్థంకాదు. ఒక వ్యవస్థను త్రోసివేయడానికి ఇవి తప్పవు. కులాల మతాల ప్రాతిపదికమీద ఏర్పడే పేటలూ, రాజులూ జమీందారులూ కట్టిన కోటలూ సంప్రదాయాలవల్ల ఏర్పడిన బాటలూ సామ్యవాదజగత్తులో ఉండవు. మంచికీ చెడ్డకీ మధ్య కంచుగోడలు కట్టేవి ఇవన్నీ. ఇలాంటి గోడలను పగులగొట్టక తప్పదు శ్రామికులకు. బూర్జువావ్యవస్థ ఉదయించి

పారిశ్రామికవిప్లవం తీసుకువచ్చి, కోటలను ఎలాగూ నిర్మూలించింది; నదీనదాలను వంతెనలతోను అడవులనూ ఎడారులనూ కొండలనూ యంత్రాలతోనూ లొంగదీసుకుంది. అయితే శ్రామికులు దాటవలసిన అడ్డంకులు కేవలం ప్రకృతి విభాగాలు కావు. బూర్జువాలు సమాజంలో కృత్రిమమైన నదీనదాలనూ ఎడారులనూ కొండలనూ అడవులనూ సృష్టించారు. వాటిని ఛిన్నాభిన్నం చేయాలి శ్రామికులు.

## శ్రీశ్రీ యథాస్థితివాదతిరస్కారం

ఉత్పత్తి సాధనాలను తమవశం చేసుకుని, శ్రామికుల శ్రమను దోచుకుని ధనసంపదలు పెంచుకునే బూర్జువావర్గంవారు శ్రమపడలేని సోమరులవుతూ ఉండగా, వారి వ్యవస్థనే సమర్థిస్తూ ఆచారసంప్రదాయాలలో మార్పును సహించలేకుండా యథాస్థితివాదానికి మొగ్గుచూపేవారు శ్రామికవర్గపురోగమనానికి శత్రుపక్షంవారే. వీరిని శ్రామికవర్గపక్షపాతి అయిన శ్రీశ్రీ శపించాడు 'ఏముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులారా చావండి' అంటూ. తెలివిమీరిన పెద్దమనుషులు, దురన్యాయాలు చేసే బుద్ధిమంతులు అంటే వీరే. శ్రామికుల కష్టాలను చూచి 'అనుభవించాలి మీ కర్మం' అనీ 'ఆచారం అడుగుదాటరా'దనీ 'దార్జన్యానికి దార్జన్యం మం'దనీ వక్రంగా మాటాడేదీ వీరే. నడతా, నాణ్యం, విలువల విషయంలో సరిహద్దులు నిర్ణయించుకుని హద్దు మీరిన వారిని శిక్షించడానికి న్యాయస్థానాలను, రక్షకభటవర్గాలను, చెరసాలలను, ఉరికొయ్యలను ఏర్పరిచి, రాజకీయాధికారం చెలాయిస్తూ ఉంటారు. వీరిది 'వడ్డించిన విస్తరి' కనుక సోమరులు వీరే.ఉన్న చోటుతో సరిపెట్టుకుంటూ ఇంకా వెనక్కి పోవడానికి కూడా ప్రయత్నిస్తూంటారు వీరే. ఇలాంటి వారిమీదనే శ్రీశ్రీ ఆగ్రహం ప్రదర్శిస్తూ చావండి అనేదాకా వెళ్ళాడు.

## శ్రీశ్రీ విప్లవభావాలు

సోమరులకు ప్రతికూలవర్గంలో ఉండి సమాజాన్ని ముందుకు తీసుకుపోవడంలో నిమగ్నులైన వారిని 'నెత్తురుమండే-శక్తులు నిండే-సైనికులారా రారండి' అని ఆహ్వానించాడు. యౌవనపు జవసత్వాలూ ఉద్రేకాలూ ఆవేశాలూ "నెత్తురుమండే శక్తులు నిండే" అనే విశేషణాలతో సూచించాడు. రష్యాలోని 1917 అక్టోబరు విప్లవంలో శ్రామికులు, సైనికులు, నావికులు మొదలైనవారంతా కలిసిపోయినట్లే ఏ దేశంలోనయినా పీడితవర్గం అంతా కలిసిపోయినపుడే సంకెళ్ళను ఛేదించడం జరుగుతుంది.

తన కవిత్వపు తొలిదశలోనే 'జగద్వినాశనమతిన్ నర్తింపుమా శంకరా' అని ప్రార్థించిన శ్రీశ్రీ శివుణ్ని ప్రళయకారకశక్తికి ప్రతీకగానే వాడుకుంటూ 'హరోం హరోం హర హర హర హర హర హరోం హరా అని కదలండి' అంటూ పీడితులకు విప్లవనినాదం ఇచ్చాడు. మహాప్రస్థానం లోని ఆఖరిగీతంలో కూడా 'నటధూర్జటి నిటాలాక్షి పగిలింది,' అంటూ విప్లవసూచన చేశాడు.

రుద్రాలికనయనజ్వాలిక నవకవితకు కావాలన్నాడు. పెట్టుబడిదారీవ్యవస్థకు విలయం సంభవిస్తే సామ్యవాదం అవతరిస్తుంది.

రానున్న సామ్యవాదవ్యవస్థ వచ్చేసిందని చెప్పడం అతిశయించిన ఆశావాదం; కనిపించిన స్వప్నసత్యం. 'మరోప్రపంచం మహాప్రపంచం ధరిత్రినిండా నిండింది' అంటూ ధరిత్రిలో మరో ప్రపంచం నిండటం అనే పదచిత్రంద్వారా సామ్యవాదజీవితపుటానందం భూగోళమంతా వ్యాపించిందని వ్యక్తంచేశాడు. భవిష్యత్తును గురించి కలలు కనడం ఒక కవితాతత్త్వంగాభావించే శ్రీశ్రీ 'ఈ స్వప్నం నిజమవుతుంది' అంటూనే జగన్నాథరథచక్రాలు వచ్చేశాయని చెప్పాడు. మరోప్రపంచపు కంచునగారా మ్రోగిందనీ మరోప్రపంచపు త్రేతాగ్ని కనిపించిందనీ శ్రీశ్రీ తెలిపాడు–భూతార్థకంగానే,

ఆధునికమారణాయుధాలను సృష్టించిన బూర్జువాప్రభుత్వం ఎలాంటి విప్లవాలనయినా అణచివేయడానికే యత్నిస్తుంది కాని ప్రజావాంఛలను అణచివేయడం దాని తరంకాదు. సామ్యవాదులైన ప్రజలంతా తిరగబడినపుడు పెట్టుబడిదారీవ్యవస్థ గజగజలాడుతుంది. కనుకనే 'ప్రభంజనంవలె హోరెత్తండీ భావవేగమున ప్రసరించండీ వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె పెళపెళ పెళపెళ విరుచుకుపడండి' అన్నాడు శ్రీశ్రీ. చెట్లను విసరివేసే గాలినే ప్రభంజనం అంటారు. దానికన్నా వేగంగలది భావవేగం; ప్రభంజనం తరువాత వచ్చేది వర్షమేఘాల ప్రళయఘోష. తుపానులూ, ప్రళయాలూ మరఫిరంగులవల్ల ఆగిపోయేవి కావుకనుకనే ప్రకృతి సహజమైన ఉద్రేకాలతో తిరగబడండని సూచించాడు. పయోధరప్రచండఘోషం కవిత్వానికి కావాలన్న శ్రీశ్రీ నడిరేయాకస మావర్తించిన మేఘాలావర్షించిన ప్రచండ ఝంఝూప్రభంజనం గజగజలాడించిన నడిసంద్రపు కెరటాల్లో మ్రోగిన శంఖారావాన్ని ఢంకాధ్వానాన్నీ భూకంపాలనూ ప్రభుత్వపతనాలనూ విప్లవాలనూ యుద్ధాలనూ కవితాచైతన్యంగా కవితావిశ్వరూపంగా దర్శించాడు.

సామాజికపరిణామాలు ఎదురుగా కనిపిస్తూఉన్నా కొంతమంది గతానుగతికంగా సంప్రదాయాలను అనుసరిస్తూ వెనకపడిపోతారు. అలాంటివారిని శ్రీశ్రీ హెచ్చరించాడు–కనబడలేదా మరోప్రపంచపు కణకణమండే త్రేతాగ్ని ? అంటూ. అజ్ఞానాంధకారాన్నే గాక ఆకలినీ దారిద్ర్యాన్నీ చీకటినీ పారద్రోలే కాంతులు సామ్యవాద జగత్తులోనే అందరికీ లభ్యమవుతాయి కనుక అది కణకణమండే త్రేతాగ్నివంటిదయింది. శ్రీశ్రీ తాను ఉద్దేశించినా లేకున్నా త్రేతాగ్ని అనే మూడగ్నుల (ఆహవనీయం, గార్హపత్యం, దక్షిణాగ్ని) సమాహారాన్ని ప్రాచీన వైదికపరిభాషలో గాక సంకేతార్థంలోనే వాడినట్లు గోచరిస్తుంది. సామ్యవాదసిద్ధాంతాలను ప్రవచించిన ముగ్గురు మార్క్సు, ఎంగిల్సు, లెనిన్‌లు ఈ త్రేతాగ్నివల్ల స్ఫురిస్తారు. బూర్జువా

ప్రపంచంలోని 'అగ్ని' యంత్రాలను నడిపించటంతోపాటు ప్రపంచమహాయుద్ధాలలో హింసనచణ ధ్వంసరచనకూ ఇంధనం అయితే,మరోప్రపంచంలో 'అగ్ని'అభ్యుదయానికి ఆధారభూత మవుతుంది.

మహాప్రస్థానానికి అడ్డంకిగాఉన్న కొండలను శ్రామికులు దాటినా బంగారుకొండలైన ధన స్వాములు వారిమీద కోపం ప్రకటిస్తూనే ఉంటారు. శ్రామికులు తిరిగి ధనస్వాములమీద విరుచుకుపడుతూనూ ఉంటారు. ఇది సంఘర్షణ కనుక పరస్పర వ్యతిరేకమైన ఈ రెండువర్గాలూ కొన్నాళ్ళు పోరాడక తప్పదు. ప్రపంచంలో ఈ పోరాటం మొదలైందనే శ్రీశ్రీ సూచించాడు.

"ఎగిరి ఎగిరి ఎగిరి పడుతున్నవి ఎనభైలక్షల మేరువులు
తిరిగి తిరిగి తిరిగి సముద్రాల్ జలప్రళయనాట్యం చేస్తున్నవి"

ఎనభైలక్షల మేరువులు అసంఖ్యాక ధనస్వాములకూ జలప్రళయనాట్యంచేసే సముద్రాలు ఘర్మసముద్రాలైన శ్రామికులకూ ప్రతీకలు. రత్నకాంచనాలతో బాంకు డిపాజిట్లతో కర్మాగార యాజమాన్యాలతో కులుకుతున్న బూర్జువాలకే ఈప్రళయం. సింహాచలం కదిలిందనీ హిమాచలం కరిగిందనీ వింధ్యాచలం పగిలిందనీ సంధ్యాచలం ఎగిరిందనీ గిరిశిఖరాలు గిరగిరగిర తిరుగుతున్నాయనీ మహాప్రస్థానచరమగీతంలో శ్రీశ్రీ మళ్ళీ చెప్పాడు, కర్షకులు, కార్మికులు, తాడితులు, పీడితులు కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారని 'గర్జించురష్యా'లో ఈ ప్రతీకనే వాచ్యంచేశాడు. శతకోటి సముద్రతరంగాల మ్రోతలను కార్మికఘోషలోనే విన్నాడు. నడిసంద్రపు కెరటాల్లో శంఖారావ ఢంకాధ్వానాలూ విన్నాడు.

దారి పొడుగునా గుండెనెత్తురులు తర్పణచేస్తూ నడిచిన శ్రామికులవల్ల మార్గమధ్యంలో ఉష్ణరక్తకాసారాలు ఏర్పడ్డాయి. ఈ ఉష్ణరక్తం నెత్తురుమండే శక్తులు నిండే సైనికులదే. ఈ విప్లవంలోని రక్తపాతాన్ని బూర్జువాలు సలసలక్రాగే చమురుగా భావిస్తారు. కానీ అది కాద న్నాడు శ్రీశ్రీ—'సలసల క్రాగే చమురా? కాదిది ఉష్ణరక్తకాసారం' అంటూ శ్రామికమరణాలను గురించి వక్రంగా చిత్రించే బూర్జువాకవులను తిరస్కరించి వాస్తవికతను గుర్తుచేయడమే ఈ ఉపమానతిరస్కారానికి కారణం. నెత్తురుక్రక్కుకుంటూ నేలకు రాలిపోయిన శ్రామికవిప్లవ వీరుడ్ని చూసి బూర్జువాలు చూపే నిర్దాక్షిణ్యాన్ని శ్రీశ్రీ 'ఆః'లో లోకం ముందుంచాడు.

శ్రామికుల ఉత్సాహోద్రేకాలను ద్విగుణీకృతంచేసే వాద్యధ్వనులను తన కవిత్వంలో సూచించిన శ్రీశ్రీ 'మరోప్రపంచపు కంచునగారా విరామ మెరుగక మ్రోగింది' అన్నాడు. ఇది విప్లవధ్వని. శంఖారావాలు, ఢంకాధ్వానాలు, విప్లవశంఖ, కదనశంఖాలు, మరఫిరంగులధ్వానాలు, ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదాలు, ప్రళయఘోషలు, రాబందుల రెక్కలచప్పుళ్లు, పొగగొట్టపు భూంకారధ్వనులు, అరణ్యమున హరీంద్రగర్జనలు, పయోధరప్రచండఘోషలు, ఖడ్గమృగోదగ్రవిరావాలు, ఝంఝానిలషడ్జధ్వానాలు, పర్జన్యశంఖాలు, జగన్నాథరథచక్ర

ప్రళయఘోషలు వంటివి పారిశ్రామిక విప్లవాన్నీ, ఆ తరువాతవచ్చే సామ్యవాదవిప్లవాన్నీ సూచిస్తాయి.

శ్రామికపురోగమనం అంటే కేవలం దూరాన్ని అధిగమించే నడకా పరుగూ కాదు; అది దోపిడీవ్యవస్థను నాశనంచేసి సామ్యవాదవ్యవస్థలోకి ప్రవేశించడం. ఈ గమనం రెండు విరుద్ధ శక్తుల సంఘర్షణవల్ల, సమ్మేళనంవల్ల సిద్ధిస్తుంది. 'త్రాచులవలెనూ రేచులవలెనూ ధనంజయునిలా సాగండి' అని శ్రీశ్రీ చెప్పిన ఆదేశంలో వ్యంగ్యం గంభీరమైనది. త్రాచులు ప్రతీకారానికీ పగలకూ ప్రతీకలు. ఆ ప్రతీకార్థంలోనే ఉపమానం కానీ సాగడం అనే క్రియార్థంలో కాదు శ్రమ సంపదను దోచుకునే బూర్జువాలమీద పగ వహింపకతప్పదు శ్రామికులకు. ఈ పగఉన్న పాము కాటువేయకనూ తప్పదు కనుక బూర్జువావ్యవస్థలో శాంతియుతసహజీవనంవంటి సందేశాలు పనికిరావు. రేచులు పట్టుదలకూ, క్రౌర్యానికీ ప్రతీకలు. నేరగాడ్ని పట్టుకోవడానికి శ్రామికులు వెనుదీయరు. త్రాచులు, రేచులు బహువచనంలో ఉండగా ధనంజయునిలా అని ఏకవచనంలోనే మూడవప్రతీకను చెప్పడంలో శిల్పం ఉంది. అర్జునునికీ అగ్నికీ వర్తించే శబ్దం ఇది. రాజసూయ యాగసందర్భంగా రాజులసందరిసీ జయించి ధనంజయు డయ్యాడు అర్జునుడు. అలాగే ధన స్వాముల ఆస్తినంతటినీ సమాజపరం చేస్తేకానీ సామ్యవాదరాజసూయం నెరవేరదు. అప్పుడే విప్లవం పూర్తిఅయి, శ్రామికరాజ్యం ఏర్పడుతుంది. ఆ రాజ్యానికి రాజు ఉండడు. శ్రామిక నియంతృత్వం ఉంటుంది. ఈ నియంతృత్వాన్ని శ్రీశ్రీ 'కనబడలేదా మరోప్రపంచపు అగ్నికిరీటపు ధగధగలు ఎర్రబావుటా నిగనిగలు హోమజ్వాలల భుగభుగలు' అంటూ సూచించాడు. మరోప్రపంచపు స్వరూపస్వభావాలే ఇవి. పూర్వరాజన్యులు రత్నకిరీటాలు ధరించేవారైతే శ్రామికనియంత అగ్నికిరీటం ధరించడానికి కారణం పారిశ్రామిక విప్లవం అగ్నిమీద ఆధారపడి ఉండడమే. శ్రామికసామ్రాజ్యంలో కూడా పారిశ్రామిక విప్లవం నిరంతరం కొనసాగుతూ ఉంటుంది. 'Dictatorship of the proletariat' అనే పరిభాషతో వ్యవహరించే శ్రామికనియంతృత్వం కేపిటలిస్టు వ్యవస్థనూ బూర్జువారాజ్యాంగాన్నీ నాశనం చేశాకా ఏర్పడుతుంది. సామ్యవాద విప్లవంలో ప్రధానాంశం శ్రామికనియంతృత్వం. దీనివల్లనే శ్రామికవిజయం లభించి అరుణ పతాకం ఎగురుతుంది అందుకే వెంటనే ఎర్రబావుటా నిగనిగలు అంటాడు. సామ్యవాద ప్రభుత్వం ఏర్పడినతరువాతకూడా మానవపురోగమనం స్తంభించదు. విప్లవయజ్ఞం ఉజ్వలంగా సాగిపోతూ హోమజ్వాలలు లేస్తూనేఉంటాయి ఈ మూడూ ఎర్రటివే. ధనంజయుడైన శ్రామికుడే వీటిని నెరవేరుస్తాడు.

## శ్రీశ్రీ ప్రతీకవాదసంవిధానం

మరోప్రపంచం, మహాప్రస్థానం, హరోంహర, త్రేతాగ్ని, మేరువులు, ధనంజయుడు, హోమజ్వాలలు మొదలయినవి పురాణవాతావరణంనుంచి శ్రీశ్రీ గ్రహించడం మీద నజురుల్

ఇస్లాం పరిభావం పనిచేస్తోంది. ఈ గీతంలోనే కాదు; మహాప్రస్థానగీతాలలో విస్తృతంగానే ఈప్రతీకలున్నాయి. యజ్ఞోపవీతం, అసృనైవేద్యం, పరమేష్ఠి, స్వర్గం, బలివితర్ది, అవతారం, యముని మహిషం, సూర్యుని సప్తహయాలు, కనకదుర్గ, ఇంద్రదేవుడు, నందికేశుడు, ఆదిసూకరవేదవేద్యుడు, జ్వాలాతోరణం, హిరణ్యనేత్రుడు, వృకోదరుడు, మఘవధనుస్సు, రుద్రాలికనయనజ్వాలిక, కాళిక, పద్మవ్యూహం, త్రిలోకాలు, ప్రణవం, కర్కాటకకర్కోటకులు, ఖండపరశుగళకపాలగణములు, పరమాత్మ, జగన్నాథుడు, శనిదేవత, నటధూర్జటి మొదలైనవి సామాజికస్పృహగల ఒక కవి వాడినప్రతీకలే గానీ పురాణార్థకాలు కావు. వాటికున్న పాత అర్థాలు పోయి, వ్యంగ్యార్థాలువచ్చాయి.

కవికొండల వేంకటరావుగారు 'కాలకంఠుని నాగసర్పము కుబుసమూడ్చి పడగ బుస్సంది' అన్నపుడు కాలకంఠుడు కేవలం పురాణశివుడే; శ్రీశ్రీ నటధూర్జటి నిటాలాక్షి పగిలిందన్నపుడు సామ్రాజ్యవాదానికి వినాశం కలుగుతున్నదనీ వారు మారణాస్త్రాలు ప్రయోగించారనీ స్ఫురిస్తుంది. విశ్వనాథవారు రాసిన 'మా స్వామి' పద్యాలలో విశ్వేశ్వరుడు ఆయన ఇష్టదైవమే. శ్రీశ్రీ చెప్పిన ఆదిసూకర వేదవేద్యుడు సామ్రాజ్యవాది నెదిరించే శ్రామికనాయకుడికి ప్రతీక.

"అన్యాయాలు, అధికారాలు, ఏడుపులు హోమాలు, యాచకాలు, క్షుద్రకవిత్వాలు, శిక్షలు, Scandals" లేనిదే శ్రీశ్రీ "dream చేస్తున్న" మరోప్రపంచం.4 తాను కలలు కంటున్న ఆ మరోప్రపంచాన్ని శ్రీశ్రీ వాచ్యం చేయకుండా సూచ్యమే చేయగలగడానికి 'సింబాలిజం' ఉపకరించింది. సామాజిక విప్లవాలతో నిమిత్తంలేని సింబాలిస్టుల శిల్పాన్ని శ్రీశ్రీ సామాజిక విప్లవం కోసం వాడుకోగల్గాడంటే అందుకు ప్రతిభయే కారణం. Symbolism can therefore be defined as the act of expressing ideas, and emotions not by describing them directly, nor by defining them through overt comparisions, with concrete images, but by suggesting what these ideas and emotions are, by re-creating them in the mind of the reader through the use of unexplained symbols.5

ప్రతీకలతోనే శ్రీశ్రీ రెండు ప్రపంచాలనూ వాటి స్వరూపస్వభావాలనూ ధ్వనింపగల్గాడు. మొదటిప్రపంచం బాటలు, పేటలు, కోటలు, అడవులు, కొండలు, ఎడారులు, నదీనదాలు మొదలైనవాటితో నిమ్నోన్నతాలూ అంతరాయాలూ గల ప్రకృతి వంటిది. అంతేకాదు; ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులూ, ఎనభైలక్షల మేరువులూ గలది. రెండోప్రపంచం కదంత్రొక్కుతూ పదంపాడుతూ హృదంతరాళం గర్జిస్తూ దారిపొడుగునా గుండెనెత్తురులు తర్పణ చేస్తూ త్రోసుకుపోయే నెత్తురు మండిన శక్తులు నిండిన శ్రామికులతో కూడినది. అంతేకాదు;

4 చెలం యోగ్యతాపత్రం

5 Charles Chadwick: Symbolism 3 P.

జలపాతాలతో త్రేతాగ్నులతో నగారాలతో సముద్రాలతో అగ్నికిరీటంతో ఎర్రబావుటాతో హేరామజ్వాలతో కూడిన చైతన్యపర్యాయం ఈ మరోప్రపంచానికే శ్రామికుల మహాప్రస్థానం.

## శ్రీశ్రీ మరోప్రపంచం ఛందస్సు

రగడలలోంచీ జానపద గేయాలలోంచీ ముత్యాలసరాన్ని తీసుకున్నట్లే గురజాడ చతురశ్ర గతిలో నడిచే ఎనిమిది మాత్రల ఛందస్సునుకూడా తీసుకుని పుత్తడిబొమ్మా పూర్ణమ్మా గేయాన్ని రచించాడు. బొబ్బిలిపాటలో కొయ్యోడిపాటలో స్త్రీలపాటలలో జానపదగేయాలలో కనిపించే ఈ ఛందస్సుకు గురజాడవల్ల ఆధునికత కలిగింది. ఆనాటినుంచీ భావకవులు కొందరు-బసవరాజు అప్పారావు, కవికొండల వేంకటరావు, దువ్వూరి రామిరెడ్డి, దీక్షితులు మొదలైనవారీ గేయచ్ఛందస్సును అనుసరించారు. అయితే ఈ ఛందస్సులో శ్రీశ్రీ వైవిధ్యం సాధించ నారంభించాడు, ప్రభవలోని 'అంతిమయాత్ర'', స్వర్గదేవతలులోని 'అహర్ముఖము'లో ఆద్యంతగీతాలూ మహాప్రస్థానంలోని గంటలు ఇదివరకే ఈ ఛందస్సులో రచింపబడ్డాయి. అహర్ముఖములో గతివైచిత్రిని సాధించాడు శ్రీశ్రీ.

అహర్ముఖాంచిత హర్షవీచికల
జాండభాండమున నిండినవి

అంటూ ఆదిజగణంతో ఎనిమిది మాత్రల విరుపులతో నడుస్తుంది.

భయంకరముగా పరిహాసముగా
ఉద్రేకముతో ఉల్లాసముతో

అంటూ 'గంటలు'లోని కొన్ని పంక్తులు నాలుగు మాత్రల విరుపులతో నడుస్తాయి. మహాప్రస్థానంలో మహాప్రస్థానం, జ్వాలాతోరణం, నవకవిత, ప్రతిజ్ఞ, శైశవగీతి, అభ్యుదయం, సాహసి, కళారవి, సంధ్యాసమస్యలు, కేక, అవతలిగట్టు, పరాజితులు, అద్వైతం, దేశచరిత్రలు, మిథ్యావాది మొదలైనవి ఈ ఛందస్సులో వైవిధ్యం సాధించాయి. శ్రీశ్రీ వచనగీతాలలోకూడా ఈ ఛందస్సుదే పైచేయిగా కనిపిస్తుంది. ఈ ఛందస్సులో శ్రీశ్రీ అంతఃప్రాసలూ, అంత్యప్రాసలూ పునరుక్తులూ ప్రవేశపెట్టడానికి ప్రేరణలు సంస్కృతంలోని గీతగోవింద, భజగోవిందశ్లోకాలు. గీతగోవిందంలోని

ముఖర మధీరం త్యజమంజీరం
రిపుమివ కేళిషు లోలం
చలసఖి కుంజం సతిమిరపుంజం
శీలయ నీల నిచోళం

అన్న పదాన్ని అనుసరిస్తూ

ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి
నెత్తురు మండే శక్తులు నిండే
సైనికులారా రారండి

అనే పద్ధతిలో రాశానని స్వయంగా శ్రీశ్రీ చెప్పాడు.. శంకరభగవత్పాదులు రచించిన

భజగోవిందం భజగోవిందం
గోవిందంభజ మూఢమతే

అనే శ్లోకాన్ని అనుసరిస్తూ

మరోప్రపంచం మరోప్రపంచం
మరోప్రపంచం పిలిచింది

అంటూ వ్రాశానని చెప్పుకుంటూ తాను శంకరులవలె రెండోపాదంలో భజగోవిందం–గోవిందం భజ అన్నట్లు మార్చలేకపోయానని ఒప్పుకున్నాడు. అయినా శంకరులు భక్తిగీతానికి తగినట్లు ఆదిసగణం వాడితే శ్రీశ్రీ వీరగీతాన్ని ఆదిజగణంతో ప్రారంభించి గొప్పవేగాన్ని సాధించాడు. శిష్ట్లా ఉమామహేశ రాసిన

మారోమారో మారోమారో
ఒకటీ రెండూ మూడూ నాలుగు
మారో మారో మారో మారో

అనే గీతాన్ని బరంపురంలో శివశంకరశాస్త్రిగారు చదవగా విన్న శ్రీశ్రీ ఆ చతురస్రగతిని మెచ్చుకున్నా అంతకన్నా భావవేగం గల పద్ధతిలోనే తన గేయాన్ని రచించాడు.

శ్రీశ్రీ 'మహాప్రస్థానం' గీతంలో స్వేచ్ఛగా పాదవిభజన సాగుతూ అష్టమాత్రలమీద సాధారణంగా పదవిరామం ఉంటుంది. అష్టమాత్రలమీద మాత్రలసంఖ్య యథేచ్ఛగా పెరుగుతూ ఉంటుంది.

| | |
|---|---|
| మరోప్రపంచం | (8) |
| మరోప్రపంచం | (8) |
| మరోప్రపంచం పిలిచింది | (8+5) |
| హృదంతరాళం గర్జిస్తూ | (8+6) |
| పదండి | (4) |
| ఎగిరి ఎగిరి ఎగిరి పడుతున్నవి | (8+7) |
| శివసముద్రమూ | (8) |
| నయాగరావలె | (8) |
| ఉరకండీ ఉరకండీ ముందుకు | (8+8) |

పాదప్రమాణాలు రకరకాలుగా ఉన్నాయి పై విధంగా, గతిమాత్రం చతురస్రలోనే నడుస్తుంది.

రకరకాల ప్రాసలకు వాడి సైనికుల పదవిన్యాసంలోని చప్పుళ్ళనూ వేగాన్నీ విజృంభణనీ ధ్వనింపజేయడమేగాక శబ్దాలను భావోచితంగా ధ్వనింపజేయడంలో పరాకాష్ఠనుసాధించాడు శ్రీశ్రీ.

మేరువులు ఎగిరిపడుతున్నాయని చెబుతూ ముమ్మారు ఎగిరిపడినట్లు చెప్పడంలో ఎగిరి అనే క్రియలో గిరి శబ్దం మేరువుల గిరిత్వాన్ని సూచిస్తూంటే వెంటనే సముద్రాలు తిరిగినట్లు చెబుతూ ఆ అభినయానికి అనుగుణంగా తిరిగి తిరిగి తిరిగి అని శబ్దావృత్తి చేయడంలో శ్రీశ్రీ చిత్రకవితాధోరణి చూపించాడు. ఎగిరి లోని 'గిరి' తిరగబడి 'తిరిగి'లో చేరి మేరువులను అపహాసిస్తోంది.

ఎగిరి ఎగిరి ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు
తిరిగి తిరిగి తిరిగి సముద్రాల్
జలప్రళయనాట్యం చేస్తున్నవి

జనసందోహం ముందు ఒక మహావక్త వేదికనెక్కి ప్రసంగిస్తూంటే ఒక లయలో వాక్యాలూ పదాలూ పరుగెడుతున్నట్లు శ్రీశ్రీ మహాప్రస్థానం గీతంలో 'వక్తృత్వలయ' గోచరిస్తుంది. ఈ సావేశోపన్యాసభాషాప్రవాహం సామ్యవాద విప్లవం కోరే నాయకుడికి అవసరం కనుకనే శ్రీశ్రీ ఈ సంవిధానాన్ని ప్రయోగించాడు. మహాప్రస్థానంలోని ప్రతిజ్ఞ, జగన్నాథుని రథచక్రాలు, కవితా ఓ కవితా వంటి గీతాలు వక్తృత్వలయకు ఉదాహరణలే.

## ప్రపంచ మొక పద్మవ్యూహం! కవిత్వ మొక తీరని దాహం!

1934 ఏప్రిల్ 14

20వ శతాబ్ది ఆరంభందాకా తెలుగు కవిత్వం మతంతో కలిసిపోయి, మతచైతన్యమే కవితాచైతన్యానికి దారిచూపిస్తూ ఉండేది. సాంప్రదాయికమైన ఆలోచనాస్రవంతికి అడ్డుకట్టలువేసి గురజాడ 'మతము లన్నియు మాసిపోవును జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును అంత స్వర్గ సుఖంబులన్నవి యవని విలసిల్లున్' అనీ 'మనిషి చేసిన రాయిరప్పకి మహిమ కలదని సాగి మొక్కుతు మనుషులంటే రాయిరప్పలకన్న కనిష్టంగాను చూస్తావేల బేలా' అనీ నూత్న సందేశాన్ని కవిత్వంద్వారా అందించాడు. మానవతాచైతన్యమే కవితా చైతన్యంగా మారడం ఆనాడే ఆరంభమయింది. ఆర్థికరాజకీయ సాంఘిక రంగాలలో ఉన్న మానవుడి జీవితం కవులకు కవితావస్తువు కాసాగింది. మానవజీవితం సామాజిక వ్యవస్థతో ముడిపడి ఉన్నదనే వాస్తవాన్ని గ్రహించలేక భావకవులు మానవుడి వ్యక్తిగతస్వేచ్ఛను కళాప్రపంచంలో వ్యక్తంచేస్తూ వచ్చారు. కవిత్వానికీ సమాజానికీ సంబంధం తెగిపోవడంవల్ల సమాజపురోగమనంలో కవిత్వపాత్ర స్తంభించిపోయింది. సుందరమైన వస్తువునే కవిత్వానికి అర్హమైనదిగా భావించిన భావకవులు వాస్తవ ప్రపంచంలో తమచుట్టూ ఉన్న వాతావరణపు కాలుష్యాన్నీ సామాజిక దురన్యాయాల్నీ, ఆర్థికతారతమ్యాల్నీ హీనంగా బ్రతుకుతున్న జానిసలనూ, పీడితులనూ చూడలేకపోయారు. ఇందుకు లక్షణగ్రంథాల అనుశాసనాలనూ, సంప్రదాయాల సంకెళ్ళనూ రీతిప్రియత్వాన్నీ వైచిత్రుల్నీ అలంకారాల ఆడంబరాన్నీ వదలలేకపోవడం ఒక పాక్షికకారణం. రెండవ కారణం కవులు మధ్యతరగతికి చెందినవారై కవిత్వం అందరికోసమూ కాదనీ సమాజంలోని ఉన్నతవర్గం వారికోసమే అనీ భావిస్తూ కవిత్వం సహృదయుడికోసం అనే భ్రమను పొందిఉండటం. ఈ విధంగా కవిత్వం ప్రజలకు దూరమైపోయింది. కవితావస్తువు ప్రజాజీవితంనుంచి వేరుపడి ప్రకృతినీ వ్యక్తిగతానుభవాలనూ ఆశ్రయించింది. 'ఆమె కన్నులలో ననంతాంబరంపు నీలినీడలు కలవు! వినిర్మలాంబుపూర గంభీర శాంతకాసార చిత్ర హృదయములలోని గాటంపు నిమర చాయలందు నెడనెడగ్రమ్ము! సంధ్యావసాన సమయమున నీపపాదప శాఖకాగ్రి పత్రి కుటిల మార్గముల లోపల వసించు ఇరుల గుసగుసల్ వానిలో నిపుడు నపుడు వినబడుచునుండు!' అంటూ రాసిన 'ఆమె కన్నులు' లోని అనుభూతిని కృష్ణశాస్త్రిగారివలె హృదయవాది అయిన

పాఠకుడే తిరిగి పొందగలడు. ఈ అనుభూతి కేవలం వ్యక్తిగతం. 'కొత్త కొత్త సామాజిక సమస్యలుత్పన్నమవుతున్న కొద్దీ' కవులు ప్రజాబాహుళ్యానికి దూరమైపోయారు.

కొత్త కొత్త సామాజిక సమస్యలుత్పన్నం కావడానికి కారణం భౌతికాభ్యుదయంవల్ల సమాజ సంబంధాలలో వస్తున్న మార్పులే. ఫ్యూడల్ వ్యవస్థలోని సమాజం బూర్జువావ్యవస్థలోకి మారగానే వ్యక్తులకు మధ్య ఉన్న సంబంధాలలోకూడా మార్పువస్తుంది. యంత్రాలవల్ల ఉత్పన్నమైన నూతన వస్తువులు అందరి అందుబాటులోకి వస్తాయి. వీటివల్ల ఆలోచనావిధానం మారుతుంది. ఈ మార్పు కవిత్వంలోకూడా ప్రవేశిస్తుంది. సంప్రదాయాల అనుసరణంవల్ల ఈమార్పును అంగీకరించలేని కవులు పాతవస్తువునే పట్టుకు వేలాడుతూంటారు. సాహసం గలవారు ముందడుగు వేస్తారు. ఈ సాహసమే శ్రీశ్రీ కవితావస్తువులోని మార్పుకు కారణం.

కావ్యాత్మనూ కావ్యప్రయోజనాన్నీ కావ్యహేతువులనూ ఔచిత్యాన్నీ రసపోషణనీ గురించి నిర్దిష్టంగా చెప్పిన భారతీయాలంకారికులు కావ్యవస్తువును గురించి నిర్దిష్టంగా శాసించలేదు. వారికి కావ్యవస్తువంటే కథావస్తువే. అందులోవే తక్కినవస్తువులన్నీ. నవరసాలను పేర్కొని అన్నింటినీ నిర్వహించవచ్చునన్నారు. అందమైనవీ అసహ్యమైనవీ గొప్పవీ నీచమైనవీ భయంకరమైనవీ ప్రశాంతమైనవీ చూపుకందనివీ వికృతమైనవీ ఎన్నో వస్తువులు సృష్టిలో ఉన్నాయనీ వాటి నన్నింటినీ కవితావస్తువులుగా స్వీకరించవచ్చుననీ ధనంజయునివంటి ఆలంకారికుడన్నాడు.[1] మహాప్రబంధాల్లోనూ కావ్యాల్లోనూ నాటకాల్లోనూ ఈ వైవిధ్యమూ కనిపిస్తుంది. 'No subject need be excluded from the realm of art so long as the artist has sufficient power'[2] అని పాశ్చాత్యులూ అన్నారు.

పాలకవర్గంవారి అభిరుచులను అనుసరిస్తూనే శ్రీనాథుడు కానీ పెద్దన కానీ తమ కావ్యవస్తువును స్వీకరిస్తే కవిత్వాన్ని భగవదర్పణంచేసిన పోతన పాలకవర్గాన్ని తిరస్కరించినా దేవుడే తనను భాగవతం రాయవలసిందిగా ఆదేశించాడని చెప్పుకోవలసివచ్చింది. ఏమైనా ఆనాటి కావ్యవస్తువు సామాజికజీవితాలలోని భోగలాలసను ప్రతిబింబిస్తూ శృంగారాన్ని మాత్రమే ప్రధానరసంగా పరిగణించింది. ఏకవీ అన్ని వస్తువులనూ కావ్యవస్తువులుగా స్వీకరించడం జరగదు. తాను జీవించిన యుగంలో ఏ వస్తువు అవసరమో దానినే స్వీకరించి తక్కినవాటిని వదిలివేస్తాడు. భావకవులు కూడా ఇంతే. పూలు, తుమ్మెదలు, చుక్కలు, చందమామ, రాత్రి, పల్లకి, మురళి, మబ్బు, తీగలు, చీకటి వంటి వాటిని కావ్యవస్తువులుగా తీసుకుని సమాజజీవితంలోని సజీవవస్తువులను వదిలివేయడానికి కారణం వ్యక్తిగతాభిరుచికి ప్రాధాన్యం ఇవ్వడమే.

---

1 దశరూపకంలో రమ్యం జుగుప్సితం అనే శ్లోకం.

2 W. H. Marshal : The Major Victorian Poets 634 P.

కొన్ని వస్తువులలోనే కవిత్వం ఉంటుందని భావించే గతానుగతికత్వంమీదనే శ్రీశ్రీ తిరుగుబాటు చేయడానికి కారణం మారిన సమాజవ్యవస్థలో పాలితవర్గంవైపునుంచి కవిత్వాన్ని దర్శించడమే. ప్రపంచమంతటా కవిత్వాన్ని దర్శించిన శ్రీశ్రీ 'గంటలు' అనే ఖండికలో ఆ విషయాన్ని వ్యక్తం చేశాడు. 'ఋక్కులు' ఖండికలో దానిని వాచ్యంచేశాడు. సాహిత్యచరిత్రను గాని, సాహిత్య విమర్శను గాని, సాహిత్యశాస్త్రాన్ని గాని వ్రాసే విమర్శకులు ఒక యుగంలో ఏవి కావ్యవస్తువులుగా ఉన్నాయో, అందుకు సామాజికకారణాలేమిటో చెప్పవలసివస్తుంది. కవులు తీసుకున్న కావ్యవస్తువులను పరిశీలించి ఆ వివరాలను చెబుతారు వారు. కవి చేయవలసింది వస్తువును కవితారూపంలోకి మార్చడమేకానీ కావ్యవస్తువులను నిర్దేశిస్తూ వాటిని గురించి కవిత్వం రాయడం కాదు. కవి ఆలంకారికుడూ లాక్షణికుడూ యుగనేతా అయినపుడు కావ్యవస్తువులను గురించి కూడా కవిత్వం చెబుతాడు. తన కాలంలోని కవిత్వం సమాజచైతన్యాన్ని రగులుగొల్పలేక పోవడానికి కారణాన్ని గ్రహించిన శ్రీశ్రీ నూతనకవితావస్తువులను స్వీకరిస్తూ వాటిని కొన్నింటిని నిర్దేశించాడు 'ఋక్కులు'లో. 'కాదేదీ కవిత కనర్హం' అంటూ-భావకవులు నిరాదరించిన-కొన్ని వస్తువులను పేర్కొని వాటి లోతు కనుక్కోమని శాసించాడు. 'అన్నీ కవితామయమే నోయ్' అని చెప్పిన శ్రీశ్రీ కవితామయమైన ప్రపంచాన్నీ, సమాజజీవితాన్నీ 'కవితా ఓ కవితా'లో ఇంకా స్పష్టంగా చెప్పాడు.

పీడకపీడితవర్గాలున్న సమాజం గురించి వాస్తవస్పృహ గల శ్రీశ్రీ పీడితవర్గంపట్ల సానుభూతినీ పీడకవర్గంపట్ల ఆగ్రహాన్నీ ఏర్పరచుకునే, ప్రపంచాన్ని దర్శిస్తాడు కానీ సౌందర్యాన్ని ఏవర్గంలో ఉన్నా చూసి అనుభూతిని పొందడు. అందువల్ల ఈ సమాజం ఎంత తొందరగా తల క్రిందులైతే అంత బాగుంటుందని శ్రీశ్రీ అభిప్రాయం. పీడితవర్గాధిక్యం రావడమే సమాజాభ్యుదయం అయినపుడు ఆ పనికే తన కవిత్వాన్ని అంకితం చేశాడు శ్రీశ్రీ. సామాజికవిప్లవం కేవలం తన కవిత్వమే కొనితేదు; భావవిప్లవాన్ని తెస్తుందది. ఈ భావవిప్లవానికే ప్రపంచాన్ని మరో కోణంనుంచి చూడండంటూ కవుల్ని హెచ్చరించాడు శ్రీశ్రీ.

ఉత్తమ పురుషుణ్నే కథానాయకుడుగా గ్రహించి ఆదర్శాన్ని లోకం ముందు ప్రతిష్ఠించే పాతకాలపు విలువలు తారుమారై ఈ ప్రపంచంలో దోపిడి చేస్తున్నవాడు పెద్దమనిషిగా చెలామణి అవుతూంటే అతణ్ని కథానాయకుడుగా స్వీకరించడం అనుచితమే అవుతుంది కనుక దోపిడి చేయబడేవాడే కథానాయకుడు కావడం ఈ యుగౌచిత్యం. ఈ ఔచిత్యాన్ని బాటసారి, ఉన్మాది భిక్షువర్షీయసి వంటి కథల్లో పాటించిన శ్రీశ్రీ 'ఋక్కులు' లో వారినే కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల వంటి ప్రతీకలతో ధ్వనింపజేశాడు.

## శ్రీశ్రీ కవితావస్తువులు

యజమాని సంపదను కావలికాసే కుక్కపిల్ల, కాంతినిస్తూ తన సంపదను వదులుకునే అగ్గిపుల్ల, పరిశుభ్రంచేస్తూ క్షీణించే సబ్బుబిళ్ళ వంటి వాటిని కవితావస్తువులుగా స్వీకరించాలని శ్రీశ్రీ అంటే అచ్చంగా వాటిమీదనే కవిత్వం రాయాలని చెప్పడం కాదు. వస్తువు నిచ్చి కవిత్వం రాయమనడం కళాశీలి స్వేచ్ఛ హరించడమే. అందువల్లనే శ్రీశ్రీ తానే వీటిని గురించి కవితలు రాయలేదు. కాని రోగార్తులు, త్రాగుబోతులు, పడుపుకత్తె, ఉన్మాది, కూలీ, కమ్మరి, కుమ్మరి, జాలరి, సాలె, బాటసారి, భిక్షువర్షీయసి, బానిసలు, పరాజితులు, రిక్షావాలా, గనిపనిమనిషి, ఓడకళాసీ, పల్లకిబోయీలు, అభాగ్యులు, ఖైదీ, రౌడీ, ఖూనీకోరు, పతితులు, భ్రష్టులు మొదలైన పదజాలం శ్రీశ్రీ కవితలలో ప్రత్యక్షం అవుతుంది. పీడితసమాజాన్ని ఇంత విస్తృతంగా దర్శించిన కవి తెలుగుదేశంలో శ్రీశ్రీకి ముందు మరొకడు లేడు.

హీనంగా చూడదగని వస్తువులూ కవితామయమైన వస్తువులూ కవితకు అనర్హం కాని వస్తువులూ లోతైన వసువులూ అంటూ శ్రీశ్రీ ఇచ్చిన జాబితాలో ఒక కుక్కపిల్ల తప్ప అన్నీ అచేతనమైన భౌతికవస్తువులే అయినా వాటిచుట్టూ ఉండే వాతావరణంవల్ల, వాటి ఉపయోగిత్వ వినియోగిత్వాలవల్ల ఎన్నో విషయాలు జ్ఞాపకానికి వస్తాయి. కుక్కపిల్ల (ఆకలి) అగ్గిపుల్ల (పరిశ్రమ) సబ్బుబిళ్ల (ఫ్యాక్టరీ) రొట్టెముక్క (బేకరీ) అరటితొక్క (కర్షకుడు) బల్లచెక్క (కార్మికుడు) తలుపుగొళ్లెం (స్వాతంత్ర్యం) హారతిపళ్ళెం (విజయం) గుర్రపుకళ్ళెం (వేగం) మొదలైనవి.

ప్రేమానికి గొళ్లెం తీస్తాం అనీ కాలానికి కళ్లెం వేస్తాం అనీ ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను అనీ నరకలోకపు జాగిలమ్ములు గొలుసు త్రెంచుకు ఉరికిపడ్డాయి అనీ నా గీతం నైవేద్యంగా హృద్యంగా సమర్పిస్తాననీ ఎముకముక్క కొరుక్కుంటు ఏమీ అనలేదు కుక్క అనీ ఇది నా పాపం కాదనె ఎగిరివచ్చి ఎంగిలాకు అనీ కూటికోసం కూలికోసం' అనీ 'కర్మాగారము కళాయతనమూ కార్యాలయమూ కారాగృహముల దేవుని గుడిలో బడిలో మడిలో' అనీ రకరకాల ప్రయోగాలుచేసినశ్రీశ్రీ పై వస్తువులన్నిటిలో కవిత్వాన్ని చూడగలిగాడు. నా కుహూరుత శీకరాలు అన్నప్పుడు కోకిలలోనూ లక్షనక్షత్రాలమాటలు అన్నప్పుడు చుక్కలలోనూ విశ్వవీణకు తంత్రిని అన్నప్పుడు వీణలలోనూ కవిత్వాన్ని చూడలేకపోలేదు. అందుకే కాదేదీ కవితకనర్హం అనగల్గాడు. సృష్టి మొదలైనప్పటినుంచీ ఉంటున్న నక్షత్రాలవంటి వస్తువులలో కవిత్వం దర్శించడంవేరు; కుక్కపిల్లవంటి అతి సామాన్యవస్తువులలో కవిత్వం దర్శించగల్గడం వేరు.

రొట్టెముక్కా అరటితొక్కా బల్లచెక్కా కవివేపే చూస్తూ ఉంటాయనీ తమలోతు కనుక్కోమంటాయనీ చెప్పడంతో అచేతనమైన వస్తువులకు చేతనధర్మాన్ని ఆరోపించడం జరిగింది.

రొట్టెముక్క చూస్తుంది - మాటాడుతుంది శ్రీశ్రీ సృజనలో. రొట్టెముక్కకు లోతుకూడా ఉంది. ఈ లోతు దాని చరిత్రకు సంకేతం. రొట్టెముక్క ఎలా తయారైంది? దాన్ని తయారుచేసిన శ్రామికుడి ఉత్పత్తిసాధనాలెవరిదగ్గర ఉన్నాయి? అది దొరకక ఎంతమంది తల్లడిల్లుతున్నారు? ఇవన్నీ లోతులే. అరటితొక్క లోతు ఆపండ్లనందించిన కర్షకుడిదాకా తీసుకుపోతుంది. బల్లచెక్క లోతు దాన్ని కోసిన కార్మికుడి జీవితంవైపు చూపిస్తుంది.

## శ్రీశ్రీ కవితాసూత్రాలు

కవి వస్తువులను హీనంగా చూడకుండాఉంటే ఆ వస్తువులు అతనివైపే చూస్తూ తమ లోతులను చూపిస్తాయి.

హీనంగా చూడకు దేన్నీ
నీవేపే చూస్తూఉంటాయ్
తమలోతు కనుక్కోమంటాయ్.

ఇవి విచిత్రార్థస్ఫూర్తినిచ్చే కవితాసూత్రాలు. ఇలా సూత్రప్రాయంగా చెప్పడం ఋక్కుల లక్షణం.

కవితామయమేనోయ్ అన్నీ
కాదేదీ కవితకనర్హం
ఉండాలోయ్ కవితావేశం
కవిత్వ మొక తీరని దాహం

కవిత్వం గురించి జ్ఞాపకానికి నిలిచే సూత్రాలివి. ఈపద్ధతే శ్రీశ్రీచేత కదిలేదీ కదిలించేదీ మారేదీ మార్పించేదీ పాడేదీ పాడించేదీ పెనునిద్దుర వదిలించేదీ మునుముందుకు సాగించేదీ పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ కావాలోయ్ నవకవనానికి అని రాయించింది. ఇంత సులువుగా చెప్పడానికి గురజాడ దారిచూపించాడు శ్రీశ్రీకి.

ఆకులందున అణగి మణగీ కవిత కోయిల పలకవలెనోయి
పలుకులను విని దేశమం దభిమానములు మొలకెత్తవలెనోయి

ఏదేశంలోని ఆలంకారికులైనా కవిత్వంగురించి చెప్పే ప్రాథమికసూత్రం కవి ముందు తాను దర్శిస్తాడనీ తరవాత ప్రదర్శిస్తాడనీ. ఈ విషయాన్ని ప్రాచ్యులు దర్శనం, వర్ణనం అంటే పాశ్చాత్యులు దర్శన ప్రదర్శనాలన్నారు. దర్శనానికి 'gifted eye' కావాలన్నారు పాశ్చాత్యులు. దర్శనానికి ఋషి అయిఉండాలన్నారు ప్రాచ్యులు. ద్రష్ట అయినవాడే స్రష్ట అవుతాడు. ఈ సృష్టియే రచన. ఈ రచనకు భాష కావాలి. ఈ సూత్రాన్నే శ్రీశ్రీ తేలిక మాటల్లో చెప్పాడు.

ఉండాలోయ్ కవితావేశం
కానీవోయ్ రసనిర్దేశం
దొరకదటోయ్ శోభాలేశం
కళ్లంటూ ఉంటే చూసీ
వాక్కుంటే వ్రాసీ

చిరదీక్షా శిక్షాతపస్సమీక్షణలో నిశ్చలసమాధిలో సర్గద్వారపు తోరణమై వ్రేలిన తన మస్తిష్కంలో తోచిన ఘోషలు, భాషలు, దృశ్యాలు విన్నవించడానికై మాటలకై శ్రీశ్రీ వెదుకాడగవలసివచ్చింది. ప్రతి చిన్న వస్తువులోనూ కవిత్వం చూడవచ్చును కానీ దాన్ని చెప్పడానికి ఎంతో సాధనా శోధనా కావాలని శ్రీశ్రీయే ఒప్పుకున్నాడు. 'వాక్కుంటే' అనేమాటలో అభ్యాసావశ్యకాన్ని నిర్దేశించాడు. ఔనౌను శిల్ప మనర్ఘం అంటూ పనితనాన్ని అభిమానించాడు. ముందు కవితావేశం కావాలనడంలోనే శుద్ధ కవిత్వం (Pure poetry) యొక్క ప్రాధాన్యాన్నీ తరవాత 'రసనిర్దేశం' కానీవోయ్ అనడంలో సామాజికదృక్పథంయొక్క ప్రాధాన్యాన్నీ చెప్పాడు శ్రీశ్రీ. కరుణరసం శృంగారం వాడిన పూరేకులనీ వీరరసం బీభత్సం ఈనాటి తుపాకులనీ సుదూరభవిష్యత్తులో రసనిర్దేశం చేయబోతున్నాడు శ్రీశ్రీ. రసప్రాధాన్యానికి ఈ తారుమారు కలిగించడానికి కారణం అణగారిన ఆర్తుల ప్రతినిధియై కవి రసమీమాంసను చేయగలగడమే. అందుకే బల్లచెక్కా అరటితొక్కా వంటివి కవితావస్తువులయ్యాయి.

అందని వస్తువును అందమైనదిగా భావించడం మానవలక్షణం. సుందరవస్తువునయినా వికృత వస్తువునైనా కవితావేశం గలవాడైతే తన సంవిధానంవల్ల సుందరంగానే పునస్సృష్టిస్తాడు. దొరకదటోయ్ శోభాలేశం అంటా డందుకే శ్రీశ్రీ. అకవులు దేనినీ సుందరంగా సృష్టించలేరు. వారికి ప్రతిభ, అభ్యాసంకూడా ఉండవు. పాలకవర్గపు కవులు వాస్తవాలను వదలి ఆదర్శ సౌందర్యాన్ని సృష్టించారు. పీడితవర్గపు కవి అయిన శ్రీశ్రీ శ్రమైకజీవనసౌందర్యాన్ని త్వరలోనే దర్శించబోతున్నాడు. శ్రమశక్తి లేనిదే తాజమహాలువంటి సౌందర్యం సృష్టింపబడలేదు శ్రామికుని చేతులే దాన్ని సృష్టించాయి కానీ 'మహారాజు మనీపర్సు' కాదు. ఈ జీవిత యథార్థ దృశ్యాన్ని దర్శించడమే కళ్ళంటూ ఉంటే చూడటమంటే.

మరోప్రపంచాన్ని స్వప్నంలో దర్శించిన శ్రీశ్రీ ప్రపంచాన్ని వాస్తవంగానే దర్శించాడు. ఈ దర్శనంలో ప్రపంచం ఒక 'పద్మవ్యూహం'వలె కనిపించింది. అధర్మపక్షంవారు ఒక బాల వీరుణ్ని నిర్బంధించడానికి చాకచక్యంతో నిర్మించిన సేనావ్యూహం పద్మవ్యూహం. ఆ పద్మవ్యూహంలో ప్రవేశించడమూ కష్టమే. ప్రవేశించాక యుద్ధం చేయడమూ కష్టమే. ఈ బూర్జువా-సామ్రాజ్యవాద-ఫాసిస్టుప్రపంచం పద్మవ్యూహం లాంటిదిగానే శ్రీశ్రీకి కనిపించిందంటే ఆతని కవితాచైతన్యంలోని సామాజికబోధ ఎటువంటిదో అర్థంఅవుతుంది పీడితజనుల జీవితాలు

యుద్ధరంగాలై వాళ్ళచుట్టూ శత్రువులు ఉన్నారని పద్మవ్యూహం వ్యక్తంచేస్తోంది. ఈ ప్రపంచంలోనే బాటలూ పేటలూ కోటలూ నదీనదాలూ అడవులూ కొండలూ ఎడారులూ సింహాలూ సివంగులూ ఫిరంగులూ సృగాలాలూ బిడాలాలూ ఇసుక తుపానులూ గడుసుదయ్యాలూ వగైరాలను శ్రీశ్రీ చూశాడు. భూకంపాలూ ప్రభుత్వపతనాలూ విప్లవాలూ యుద్ధాలూ చూడబోతున్నాడు. ఇవేవీ లేని మరోప్రపంచాన్ని చూడాలనుకుంటున్నాడు. జలపాతాలు, నగారాలు ఎర్రబావుటాలు గల మహాప్రపంచం అది.

రసస్వరూపమైన కవిత్వం శ్రీశ్రీకీ శ్రీశ్రీవంటి పీడితులకూ తీరనిదాహం. పీడకులకు కవిత్వం కన్నా ధనం ఒక తీరనిదాహం. వారికి కవిత్వం విరామసమయవినోదమే కానీ తీరనిదాహం కాదు. మరి పీడితులకు సామ్యవాదవిప్లవచైతన్యాన్ని అందిచ్చేది కవిత్వం.

### శ్రీశ్రీ రచనాసౌలభ్యం

1937-38 ప్రాంతాల్లో అంటే బుక్కులు రాసినతరువాత 4 ఏళ్ళకి భీమవరంలో జరిగిన ఒక సాహిత్యసభలో తలుపుగొళ్ళెం హారతిపళ్లెం గుర్రపుకళ్లెం అంటూ శ్రీశ్రీ చదవడం విని ఎవరో కుర్రాడు 'ఓస్ ఇలాంటి కవిత్వాలు నేనూ రాయగలను' అన్నప్పుడు శ్రీశ్రీ తనధ్యేయం నెరవేరిందనుకున్నాడంటే కవితారచన సామాన్యుల స్థాయికి రావాలనుకున్నందువల్లనే. దీర్ఘసమాసాలూ నిఘంటుగతశబ్దాలూ వాడి పండితులకు కూడా అర్థంకానట్లు కవిత్వం రాయడం ఫ్యూడల్ సమాజంలో అయితే చెల్లింది కానీ చదువుకున్నవా రెక్కువయ్యే బూర్జువా సమాజంలో సగటు మానవుడికి కవిత్వం అందుబాటులోకి రాకతప్పదు. కవిత్వం చెప్పడం కష్టమైన పని కాకూడదనీ కష్టమైన పనులే ఘనమైనపనులనుకునే మనస్తత్వమే కష్టాలన్నింటికీ కారణమనీ జీవితంలోనూ కవిత్వంలోనూ కూడా సౌలభ్యం సాధించడమే పురోగమనానికి లక్షణమనీ శ్రీశ్రీ వివరించాడు. శ్రీశ్రీ కవిత్వానికి యోగ్యతాపత్రం రాస్తూ చెలం- "కవిత్వాన్ని, ముఖ్యంగా తెలుగుకవిత్వకన్యల్ని చూస్తే చెలానికి Impatience అనుమానం- శబ్దసౌందర్యంతో తృప్తిపడి సంతోషించవలసిందే కాని, చెప్పేదానికి అర్థం వెతకడం అవివేకం అని. కాని నీరసపు కళాచతురులమల్లే అందాన్ని దూరంనుంచి చూచి సంతోషించీ విచారించీ తప్పుకోడం చెలానికి చేతకాదు. తాను చెప్పదలచుకున్న సంగతి తనకే స్పష్టంగా తెలీనప్పుడు తన చాతకానితనాన్ని అర్థ అస్పష్టతనీ ఛందస్సు చీరల వెనకా అలంకారాల మధ్యా కఠినపదాల బురఖాలలోనూ దాచి మోసగించాలని చూస్తాడు కవి-ముఖ్యం, సహజసౌందర్యం తక్కువైనప్పుడు ......కవిత్వంలోనూ జీవితంలోనూ Economy of words and thoughts లేకపోవడం దేశభక్తికన్న హీనమైన పాపం" అన్నాడు. ఈ మాటల్లో శ్రీశ్రీకి ముందుకవులు సాధించలేకపోయిందేమిటో శ్రీశ్రీ సాధించిందేమిటో చాలా స్పష్టంగా మొహమాటం లేకుండా వెల్లడిచేయబడింది. వేమన, గురజాడ ఆచరణలోకి తెచ్చిన కవితాసౌలభ్యాన్ని శ్రీశ్రీ ఆధునిక వాతావరణానికి అందజేశాడు.

# 57/అవతారం

## పుడమితల్లికి పురుటినొప్పులు కొత్తసృష్టిని స్ఫురింపించాయి !

1934 ఏప్రిల్ 14

తెలుగుకవిత్వం భారతంవంటి ఒక లౌకికకథతోనే ఆరంభమైనా తరవాత పురాణకథలతో మలుపు తిరిగి మహాభాగవతంతో పురాణశిఖరాన్ని అధిరోహించింది. మానవుడు సమష్టికుటుంబవ్యవస్థలో జీవించే కాలంలో ఊహకందిన ప్రకృతిసత్యాలను వెల్లడించడానికి వాడుకున్న ప్రతీకలతో పురాణాల రచన ఆరంభమై చరిత్ర ఆవిర్భావంతో నిలిచిపోయింది. చరిత్రకు ముందుకాలంనాటి మానవుడి విశ్వాసాలు, అవగాహనలు, సమాజపరిస్థితులు, ధర్మ రక్షణయత్నాలు పురాణాలలో ప్రతిబింబించాయి. ఒకనాటి కవిత్వం పురాణమే. దేవతలకూ రాక్షసులకూ జరిగిన పోరాటాల్లో ఒకనాటి సామాజికపరిస్థితులుకూడా ప్రతిబింబించాయి. ఈ పురాణాలనే తెలుగుకవులు ముడిసరుకుగా వాడుకుని తమకాలంనాటి జీవితాన్ని వాటిలో చొప్పిస్తూ కావ్యాలను రచించారు. ఆధునిక విజ్ఞానశాస్త్రంవల్లరుజువవుతున్న ప్రకృతివాస్తవాలు పురాణగాధలలోని కాల్పనికతను నిరూపించి హేతువాదాన్ని మానవుడికి కలిగించాయి. సూర్య గ్రహణాన్ని గురించిన భాగవతగాధ విజ్ఞానశాస్త్రివాస్తవంముందు కల్పనగానే మిగిలిపోయింది. చంద్రలోకాన్నిగురించిన ఊహలు నిన్నమొన్నటి చంద్రలోకయాత్రవల్ల మిథ్యలైపోయాయి. మార్క్సు ఎంగిల్సుల చారిత్రక భౌతికవాదం చరిత్రకు నూతనభాష్యాన్ని సమకూర్చి పురాణ విశ్వాసాలను తూర్పారపట్టింది. విజ్ఞానశాస్త్రిమూ చరిత్రా సాహిత్యపురోగమనాన్ని మరింత అర్థవంతం చేయడానికి సహకరిస్తున్న దశ తెలుగుకవిత్వంలో గురజాడతోనే మొదలయింది. తోకచుక్క లోకానికి అరిష్టదాయకమనుకుంటూ ఉండగా

అరుదుగా మిను చప్పరంబున చొప్పుతెలియని వింత పొడమగ
చన్నకాలపు చిన్నబుద్ధులు బెదరి యెంచిరి కీడుగా
అంతెకాని రవంతయైనను వంత నేగతి కూర్చనేర్చునె ?—
కవుల కల్పన కలిమినెన్నో వన్నెచిన్నెలు గాంచువస్తువు
లందు వెఱ్ఱిపురాణగాథలు నమ్మ జెల్లునె పండితుల్
కన్ను కానని వస్తుతత్త్వము కాంచ నేర్పరు లింగిరీజులు
కల్లనొల్లరు; వారివిద్యల కరచి సత్యము నరసితిన్.

అంటూ పురాణాలను విమర్శించాడు గురజాడ. పురాణగాథలను వదలి కన్యక, పూర్ణమ్మవంటి సాంఘిక కథలను కావ్యవస్తువులుగా స్వీకరించాడు. హేతువాదంవల్ల ఆర్షమతం విధ్వస్తమవుతోందని భావించిన విశ్వనాథ పురాణగాథలను కూడా ఖండకావ్యపరిధిలో రాయకపోలేదు. పురాణకథలను రసవంతంగా తిరిగి చెప్పి రసానందాన్ని కలిగించడమే వారి పరమావధి 'రంభ' అనే ఖండికలో "మాట్లాడకుండావూరుకున్న శుకుణ్ణి రెచ్చగొడదామనుకున్న" రంభ మాటలను విశ్వనాథ కల్పించారు.1 రసవంతంగా చెప్పడమే కవిత్వపరమావధిగా భావించక, సామాజిక విప్లవ చైతన్యాన్ని కలిగించాలని తలపెట్టి పురాణగాథను ఒక పరికరంగా వాడుకున్న కవి శ్రీశ్రీ. 1934 ఏప్రిల్ 14న రచించిన 'అవతారం' అందుకు నిదర్శనం. విజ్ఞానశాస్త్రం, చరిత్ర, సామాజికశాస్త్రం అభ్యుదయానికీ ఆధునికతకూ వేసిన పునాదులపై శ్రీశ్రీ లేపుతున్న కవితా నిర్మాణంలో 'అవతారం' ఒక శిల్పం. 'అవతారం'లో చెప్పింది హిరణ్యాక్షసంహారకథయే అయినా అందులో ప్రతిబింబించేది సామ్రాజ్యవాది సంహారకథ కావడంవల్ల పురాణకథకు ఆధునికభాష్యం అయింది. సంప్రదాయాలను నూతనావసరాలకు అనుగుణంగా మార్చుకోవాలనే తాత్త్వికావగాహనే శ్రీశ్రీ అవతారం రచించడానికి ప్రేరణ అయింది. గురజాడవలె పురాణగాథలను వదిలివేయక, విశ్వనాథవలె పురాణగాథలను పునరుద్ధరింపక, ఒక పాతపరికరాన్ని నూతనవస్తునిర్మాణానికి పనికివచ్చేటట్లు రూపొందించాడు శ్రీశ్రీ.

## శ్రీశ్రీ కల్పించిన పురాణవాస్తవికత

ఒక వస్తువును సూచించడానికి మరోవస్తువును వాడుకోవడం అనేది ప్రతీకవాదం (సింబాలిజం)గా 19వ శతాబ్దిలో ఫ్రాన్సులో బయలుదేరినా ఆ విధానం పురాణాలలోనే పురుడు పోసుకుంది. దేవతలను ధర్మరక్షకులుగా రాక్షసులను ప్రజాపీడకులుగా దేవుణ్ని శిష్టవర్గ రక్షకుడుగా దుష్టవర్గ శిక్షకుడుగా పురాణాలు సంకేతించాయి. ప్రజలను పీడిస్తూ సామ్రాజ్యాన్ని విస్తరింపజేసుకునే పీడకవర్గాధిపతిని నాశనంచేసి, పీడితవర్గ పక్షపాతం చూపించడం కోసం దేవుడు అవతరించాడని చెప్పడం పురాణవిరుద్ధంకాదు కనుక, ఆ తత్త్వాన్ని సామ్యవాద విప్లవానికి అన్వయింపజేసుకోవడంలోనే శ్రీశ్రీ ప్రతిభ ఉంది. మానవుడు ఏభావనాశక్తివల్ల పురాణాలను కల్పించాడో ఆ భావనాశక్తివల్లనే శ్రీశ్రీ పురాణాన్ని పునఃకల్పించాడు. శ్రీశ్రీ భావన వాస్తవికత పునాదిమీద ఆధారపడి ఉంది.

ఒక వస్తువును సూచించడానికి దానితో సమానలక్షణాలు, ధర్మాలు గల మరోవస్తువును వాడుకోవడం కళాశిలి లక్షణం. ఎంత వాస్తవికతావాది అయినా సూచన, ధ్వని, ప్రతిబింబనం

---

1 వైతాళికులు 32 పే.

వంటి ప్రక్రియలను వదిలిపెట్టి కవి కాలేడు. బసవరాజు అప్పారావు తాజమహల్ గొప్పతనాన్ని సూచించడానికి వస్తుప్రతివస్తుభావనను వాడుకున్నాడు. అప్రస్తుతవస్తువు ప్రస్తుతవస్తువును ప్రతిబింబిస్తే అది Allegory అవుతుంది.

మామిడిచెట్టును అల్లుకొన్నదీ/మాధవీ లతొకటి
యేమారెండిటి ప్రేమసంపదా/ఇంతింతన లేమూ
చూడలేని పాపిష్టితుపానూ/ఊడబీకె లతనూ
మోడైపోయీ మామిడిచెట్టూ/మొగము వేలవేసె
ముచ్చటైన ఆకులు కాయలనే/వెచ్చని కన్నీళ్ళోడ్చి
పచ్చనాకులా బొమ్మరింటిలో/పండొక్కటి రాల్చి
మామిడిచెట్టూ మాధవిలతతో/మాయలో కలిసింది
కామితమిచ్చే మామిడిపండూ/కవులకు మిగిలింది

మామిడిచెట్టూ మాధవీలత షాజహాన్ ముంతాజమహల్‌లనీ మామిడిపండు తాజమహాలనీ స్ఫురిస్తుంది. ఒకటి ప్రకృతిపరమైన అర్థమూ రెండోది తాజమహాల్‌పరమైన అర్థమూ రెండూ సమాంతరంగా ధ్వనించాయి. ఒక కథలో మరొకథ ప్రతిబింబించింది. పైకి చెబుతున్న కథ అప్రస్తుతం; లోని కథ ప్రస్తుతం. దీన్ని తాజమహాల్ అనే శీర్షికద్వారా కవి సూచించాడు. పురాణకథలలో కూడా ఈ అల్లెగొరీని సృష్టించే అవకాశాన్నే శ్రీశ్రీ 'అవతారం' ఖండికద్వారా నిరూపించాడు. యముని మహిషం, నరకలోకపు జాగిలాలు, ఉదయసూర్యుని సప్తహయాలు, కనకదుర్గా చండసింహం, ఇంద్రదేవుని మదపుటేనుగు, శివుడి నందికేశుడు వరాహావతారకథలో వచ్చినట్లు నిర్దిష్టంగా ఏ పురాణకథలోనూ లేకపోయినా అలా రావడంలోని ఔచిత్యాన్ని శ్రీశ్రీ గ్రహించి వీరంతా వచ్చినపుడే ఆదిసూకర వేదవేద్యుడు కోరసాచి భూగోళాన్ని ఉద్ధరించాడని కల్పించాడు. పుడమితల్లికి పురుటినొప్పులు రావడం అనేది పురాణకథానుకరణమే కానీ పురాణ వాస్తవంకాదు. వాస్తవికతనాధారంగా చేసుకుని పురాణకథవంటి కథను శ్రీశ్రీ కల్పించి ఆఖరి పాదంద్వారా ప్రకరణాన్ని సూచించాడు.

మరోప్రపంచానికి నదీనదాలూ అడవులు కొండలు ఎడారులూ అడ్డంకిగా ఉన్నాయని సాంకేతికంగా సూచించిన శ్రీశ్రీ ప్రపంచరాజకీయ రంగంలో సామ్రాజ్యవాదం, ఫాసిజం, కేపిటలిజం మొదలైనవి అడ్డంగా ఉండి మరోప్రపంచంలోకి మహాప్రస్థానం సాగనీయడం లేదని తెలుసుకోగల్గాడు. తన స్వదేశంలోనే బ్రిటిషు ఇంపీరియలిస్టులు మరోప్రపంచానికి అవరోధాలు నిర్మించారు. ప్రపంచమంతటా నిండిపోతున్న ఈ శక్తి దుష్టశక్తి కనుకనే హిరణ్యాక్షునివలె భూగోళాన్ని సాగరంలో ముంచివేయడానికి యత్నించి ప్రజాపీడన చేస్తోంది. సాగరమగ్నమవు

తున్న భూగోళాన్ని ఉద్ధరించడానికి పురాణాలలో విష్ణువు వరాహావతారమెత్తినకథనే ప్రాతిపదికగా శ్రీశ్రీ గ్రహించి దానిని శిల్పవంతంచేశాడు.

## శ్రీశ్రీ కవిత్వంలో అర్థవైవిధ్యం

A great work of art is like a dream అంటూ Carl Jung చెప్పినట్లు 'అవతారం' శ్రీశ్రీ కన్న స్వప్నం కనుకనే కథ అంతా జరిగిపోయినట్లే చెప్పి రాబోయే సామ్యవాద విప్లవాన్ని సూచించాడు. స్వప్నంలో మనిషి చూసిన దృశ్యాలకు వాస్తవికత ఆధారరేఖగా ఉంటుంది. వాస్తవానికి ప్రతిబింబంగానే స్వప్నం ఉన్నా దాన్ని వ్యాఖ్యానించడంలో గందరగోళం కలుగుతుంది. 'Like the dream, the poem requires us to make our own interpretation for the poem presents an image in much the same way as nature allows a plant to grow, and we must draw our own conclusions'.[2] ఒక స్వప్నానికి అర్థం ఏమిటి ? అంటే ఎవరి బుద్ధికుశలతను బట్టి వారు వ్యాఖ్యానిస్తారు. అవతారం ఖండికకు ముగ్గురు వ్యాఖ్యాతలు మూడు భిన్నార్థాలను చెప్పారు. కనకదుర్గమీద సింహం, ఇంద్రుడిమీద ఐరావతం, యముడిమీద మహిషం, సూర్యుడిమీద గుర్రాలు, శివుడి మీద నంది తిరగబడ్డాయనీ ఇది పాలకులమీద పాలితులుచేసిన తిరుగుబాటనీ డా॥ సి. నారాయణరెడ్డి వ్యాఖ్యానించేరంటే వారికి ఆ ఖండికలో ఆ అర్థమే గోచరించింది. పాతవ్యవస్థ శిథిలమైతేగానీ కొత్తవ్యవస్థ పుట్టదనే సిద్ధాంతాన్ని ముందుంచుకుని వారు ఆ గేయాన్ని పరిశీలించారు. పుడమి తల్లికి పురుటినొప్పులు కొత్తసృష్టిని స్ఫురింపించాయి అనే చరణాన్ని పైచరణాలతో ఉన్న సంబంధంనుంచి విడదీసి "పెట్టుబడిదారీవ్యవస్థ విధ్వంసమై దాని స్థానే శ్రామికవర్గము తలమెత్తు" ననే మార్క్సిస్టు సూత్రార్థాన్ని భావించారు. యముడు, సూర్యుడు, ఇంద్రుడు, కనకదుర్గ-వీరంతా నిరంకుశులైతే అధర్మమూర్తులైతే వీరి వాహనాలైన మహిషం, గుర్రాలు, ఏనుగు, సింహం వీరిమీద తిరగబడవచ్చు. కానీ ఈ దేవతలు పీడకులుగా పురాణాల్లో వర్ణించబడలేదు. ఆదిసూకరం ఎవరికీ వాహనం కానేకాదు. అతడు దేవుడి అవతారరూపం. అతడు దుష్టుడైన హిరణ్యాక్షుడిమీద తిరగబడ్డాడు. అందువల్ల నారాయణరెడ్డిగారి వ్యాఖ్యానం శ్రీశ్రీ స్వప్నానికి అపార్థం కలిగిస్తోందంటే అందుకు శ్రీశ్రీ రచనాసంవిధానంలోని లోపం కూడా కారణమే. మానవసమాజంలోలాగే పురాణగాథల్లోకూడా పీడకపీడితవర్గాలు రెండూ ఉన్నాయి. రాక్షసుల్ని పీడకవర్గంగానూ దేవతల్ని పీడితవర్గంగానూ పురాణాలు చిత్రించాయి. హిరణ్యాక్షుడు పీడకవర్గ ప్రతినిధికాగా అతడిమీద పీడితవర్గనాయకుడైన విష్ణువు తిరుగుబాటుచేయగా యమాది దేవతలంతా అతడికి సాయపడ్డారు. హిరణ్యాక్షుడ్ని చంపి, భూదేవిని విష్ణువు స్వీకరించగా ఆమె

2 Literary Criticism : A Short HIstory 717 P.

గర్భవతియై పురుటినొప్పులు పడడంతో ఈ గీతాన్ని పూర్తి చేశాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ రాసింది కూడా పురాణకథే కనుక దీనికి సమాజపరమైన అర్థం స్ఫటికస్వచ్ఛంగా భాసించడం లేదు.

హిరణ్యాక్షుడు పీడకుడనీ భూమి పీడిత అనీ పీడకసంహారానికి ఆదిసూకరం విజృంభించిందనీ ఆదిసూకరం ప్రజాశక్తికి ప్రతీక అనీ ఈ తిరుగుబాటుకు ప్రపంచమంతా సహకరించిందనీ డా॥ యస్వీ జోగారావుగారు మరో వ్యాఖ్యానం ప్రతిపాదించారు. యముడు సామ్యవాద మహోద్యమానికి సంకేతం అనీ అతని రాకను సూచించేవి మహిషపులోహఘంటలనీ మబ్బుచాటున అంటే అచిర భావిలో అనీ ప్రథమపాదానికి అర్థం చెప్పారు. సామ్యవాదనాయకుడైన యముని రాకను చూడగానే రష్యాలో జారుప్రభుత్వాన్ని కాపాడుతున్న సేనలు (జాగిలాలు) బానిసతనపు సంకెళ్ళను త్రెంచుకుని ఉత్సాహంతో ముందుకు వచ్చాయనీ జారుల పరిపాలనలో ఉన్న దేశమే నరకలోకమనీ దాన్ని కాపాడే సైనికులే జాగిలాలనీ రెండవపాదానికి వివరణ చెప్పారు. ఉదయ సూర్యుడంటే విప్లవమూర్తి అయిన లెనిన్ అనీ సప్తహయములు ఆ విప్లవకారుడి నాయకత్వంలోని అనుచరులనీ మూడవపాదాన్ని సమన్వయించారు. లెనిన్ లేవనెత్తిన విప్లవాన్ని అణగదొక్కడానికి ప్రయత్నించిన జారినా అలెగ్జాండ్రా (Czarina Alexandra జార్ నికోలస్ II భార్య), మత గురువు రేస్పూటిన్ (Rasputin)ల నిద్దరినీ కనకదుర్గాచండసింహం అనే పదబంధంలో శ్రీశ్రీ సంకేతించాడన్నారు. వీరిద్దరి ప్రయత్నాలు విఫలమైపోవడాన్ని జూలు దులిపి ఆవులించడంలో సూచించాడని చెప్పారు. ఇంద్రదేవుడు జార్ నికోలస్ II కు సంకేతం అనీ జార్ నికోలస్, అతని అనుచరులూ కలిసి విప్లవకారులబలాన్ని సవాల్ చేశారనీ ఐదవపాదాన్ని వివరించారు. ప్రమథ నాథుడైన నందికేశుడి ఆజ్ఞకు ప్రకృతిఅంతా స్తంభించిపోయినట్లు రష్యన్ విప్లవవీరుడూ అతివాదీ అయిన ట్రాట్స్కీ, రష్యన్ మార్షల్ ఝుకోవ్‌ల విజృంభణం ఆరవపాదంలో సూచింపబడిందన్నారు. శ్రామికవర్గానికి ఆదిసూకరవేదవేద్యుడు ప్రతీక అనీ ఇలాంటివారివల్లనే రాజ్యాలూ సామ్రాజ్యాలూ కూలద్రోయబడ్డాయనీ ఏడవపాదానికి అర్థం చెప్పారు. "All the images are drawn from mythology. It shows the pre-eminent strength of the people and the age-old nature of the problem. The fact that most of them are drawn from Indian Mythology, clearly indicates the wish of the poet to see that the revolution spreads in India and the entire world as well."[3] రష్యాలో వచ్చిన సామ్యవాద విప్లవవాస్తవాలను ముందుంచుకుని 'అవతారం' గీతంలో వాటిని అన్వయించారు జోగారావుగారు. ఎవరేదృష్టితో చూస్తారో దానికి తగిన విస్తృతిలో శ్రీశ్రీ రచన ఉండటమే విచిత్రం.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు శ్రీశ్రీ 'అవతారం' రచించిననాటి కవితారంగ వాతావరణాన్నే 'అవతారం' గీతికలో చూశారు. పుడమితల్లికి పురుటినొప్పులు అనే పదచిత్రంలో

3 యస్వీ జోగారావుగారి నోట్సు.

అభ్యుదయ కవిత్వజననానికి ప్రసవవేదన ఉందన్నారు. మహాప్రస్థానకవిత్వయుగపురుషుడు పుట్టబోతూఉండగా తోచిన శకునాల వంటివే అవతారం గీతంలో సూచింపబడిన కదలికలన్నారు. కొత్తసృష్టి జరుగుతున్న సమయంలో వినవచ్చిన వింత సప్తస్వరాలను అవతారం గేయంలో ప్రతీకాత్మకంగా ప్రతిధ్వనింపజేశాడంటూ ఆ యేడింటినీ వరుసగా వివరించారు. తరతరాల బూర్జువా వ్యవస్థకు కలిగే ప్రళయాన్ని సూచించే ప్రతీక యముని మహిషపు లోహఘంటల నాదం అన్నారు. పీడితవర్గపురోగతికి అవరోధాలు తొలగిపోవడం నరకలోకపుజాగిలమ్ములు గొలుసు త్రెంచుకోవడంలో సూచింపబడిందన్నారు. ప్రపంచకార్మిక విప్లవోదయవికాసాలకు అరుణోదయ తపనోదయాలు ప్రతీక అన్నారు. బరువుమోసే వాహనాలు స్వారీచేసే యజమానులపై చేసే తిరుగుబాటులను కనకదుర్గాచండసింహం, ఇంద్రదేవుని మదపుటేనుగు సూచిస్తున్నాయన్నారు. జమీందారీవిధానంపై కర్షకుల తిరుగుబాటుకు నందికేశునిరంకె ప్రతీక అన్నారు. సామ్యవాద వేదవేద్యుడయిన జగదుద్ధారకుడికి వరాహమూర్తి ప్రతీక అన్నారు. అభ్యుదయకవితావిర్భావం అంతా శ్రీశ్రీ ఈ గేయంలో గుప్పించి విడిచాడని ప్రశంసించారు.4

## శ్రీశ్రీకి నచ్చిన పురాణశక్తులు

స్వర్గదేవతల దివ్యదర్శనాన్ని ఊహించుకుంటూ తన అనుభూతిని 'స్వర్గదేవతలు' అనే ఖండికలో 1931లోనే వర్ణించుకున్న శ్రీశ్రీ వారంతా భూగోళరక్షణకై వస్తున్నట్లు 'అవతారం ఖండికలో వర్ణించడం సహజపరిణామమే. ఆ స్వర్గదేవతలు సామ్యవాదవ్యవస్థానిర్మాణంలో సహకరిస్తారనుకోవడం మాత్రం శాస్త్రీయహేతువాదానికి విరుద్ధమే. మరోప్రపంచాన్ని నిర్మించగల శక్తి కార్మికమానవులకు మాత్రమే ఉంది కానీ దేవతల వరాలవల్ల నిర్మించుకునే విచిత్ర లోకం మాత్రం కాదిది. కనుక శ్రీశ్రీ కేవలం వైచిత్రికోసమే పురాణప్రతీకలను తీసుకున్నాడు కాని మూఢవిశ్వాసంవల్ల కాదు. సమవర్తి అనే సార్థకనామధేయంగల యముడు, కర్మసాక్షి, తేజోమూర్తి అయిన సూర్యుడు, దుష్టరాక్షస శిక్షణకుపక్రమించే కనకదుర్గ, వర్గాలులేని స్వర్గాన్ని పాలించే ఇంద్రుడు, ప్రళయకారకుడైన శివుడు, ధర్మపక్షంలో ఉండే విష్ణువు సామ్యవాదోద్యమం పట్ల అభిమానం గల శ్రీశ్రీకి నచ్చిన పురాణశక్తులు. ఎందరో పురాణదేవతలుండగా వీరిని మాత్రమే తన కథకు తీసుకోవడం వారి స్వభావాలను బట్టే. ఒక్కొక్క పురాణవ్యక్తి చుట్టూ ఉన్న ఎన్నో కథలను ఆ వ్యక్తినామం మనకు జ్ఞాపకం చేస్తుంది. యముడు, సూర్యుడు, ఇంద్రుడు,

4 శ్రీశ్రీ కవిత్వంలో పురాణప్రతీకలు (వ్యాసం) విమర్శిని 1976 జనవరి. 126-127 పేజీలలోని వివరణకు సంక్షేపం.

దుర్గ, శివుడు క్రోధమూర్తులై భూప్రళయాన్ని సృష్టించిన హిరణ్యాక్షుడిమీదకు వచ్చారని మనం పూర్వకథను ఊహించుకోవాలి. వీరి క్రోధాన్ని వీరి వాహనాలూ సేవకులూ అయిన మహిషం, జాగిలాలు, గుర్రాలు, ఏనుగు, సింహం, నంది మొదలైనవాటి ఉద్రేకాదులద్వారా సూచిస్తున్నాడనుకోవలసి ఉంటుంది. ఇలా జంతువుల ఉద్రేకాదులను ఎందుకు చెప్పడం? దేవతల క్రోధాన్నే చెప్పవచ్చుకదా ? అంటే హిరణ్యాక్షుడ్ని సంహరించడానికి విష్ణువు జంతువుగా మారి రావడమే కారణం. ఆ జంతువు (నాయకుడు) చేసే శత్రుసంహారాన్ని చూడటానికి దేవతలంతా వస్తూంటే వీరి వాహనాలైన జంతువుల ఉద్రేకాదులనే వర్ణించడంలో ఔచిత్యం ఉంది. అసలు ఈ అప్రస్తుత కథ అంతా పుడమితల్లికి పురుటినొప్పులు అనే వాక్యంతో ప్రస్తుతకథను వ్యక్తంచేస్తూ తనను తాను మరుగుపరుచుకుంటోంది. దిక్పాలకులు, దేవతలు, వారి వాహనాలు, సేవకులు అంతా కలిసి శ్రామికవర్గంవారూ, విష్ణువు శ్రామికనియంతా అని స్ఫురింపజేయగలిగితే ఈ గీతం పరమార్థం సిద్ధించినట్లే.

శ్రీశ్రీకి నచ్చిన పురాణశకుల్లో నటధూర్జటి ఒకడు. జగన్నాథరథచక్రాలు వస్తున్నాయని నటధూర్జటినిటాలాక్షి పగిలిందనీ ప్రకటించి రెండవప్రపంచయుద్ధం ఆగమనాన్ని సూచించాడు. హరోంహరోంహర అంటూ మరోప్రపంచానికి నడవమనడంతో మహాప్రస్థానం ఆరంభమై నట ధూర్జటి నిటాలాక్షి పగిలిందని చెప్పడంతో పూర్తికావడం విచిత్రం. నవకవనానికి రుద్రాలిక నయనజ్వాలిక కావాలనడంలో కూడా శ్రీశ్రీ పురాణశక్తిమమత్వం కనిపిస్తుంది.

### శ్రీశ్రీ ఆశించే సామ్యవాదవిప్లవం

అవతారం గీతంలో మూడు భాగాలూ మూడువిషయాలూ కనిపిస్తాయి. మొదటి మూడు చరణాలూ సామ్యవాదవిప్లవంలోని మొదటిదశ అంటే కదలికను సూచిస్తాయి. మబ్బు చాటున ఖణేల్మనడం, గొలుసు త్రెంచుకు ఉరికిపడటం, నురుగులెత్తేపరుగుపెట్టడం అనే క్రియలు ఆ కదలికను సూచిస్తాయి. ఈ కదలిక లేనిదే ఉద్యమం ఆరంభం కాదు. ఈ చరణాలు అవరోహణక్రమంలో నడుస్తాయి. తరువాతి రెండు చరణాలూ సామ్యవాదవిప్లవంలోని రెండో దశ అంటే అల్లకల్లోలాన్ని సూచిస్తాయి. జూలు దులిపి ఆవులించడం, ఘీంకరిస్తూ సవాల్ చేయడం ఆ అల్లకల్లోలాన్ని చెబుతాయి. ఈ చరణాలు సమాంతరంగా నడుస్తాయి. తరువాతి మూడు చరణాలూ సామ్యవాదవిప్లవంలోని మూడవదశను అంటే మార్పును సూచిస్తాయి. నూత్న ప్రపంచావతరణం కాకుండానే గీతం ముగుస్తుంది కానీ అవతరణం సూచింపబడుతుంది. రంకెవేస్తూ గంగడోలును కదిపిగెంతడం, ఘుర్ఘురిస్తూ కోరసాచడం, పురుటినొప్పులు పడటం మార్పును చెబుతాయి. ఈ చరణాలు ఆరోహణక్రమంలో నడుస్తాయి. ఈ మూడుభాగాల పాదప్రమా

ణాలూ వేరు; లయలు వేరు; భాషాసంవిధానాలు వేరు. వస్తువుకీ సంవిధానానికీ అవిభాజ్యమైన సంబంధాన్ని ఈ సందర్భం సాధించుకుంది.

<u>పాదాల అవరోహణ</u> (కదలిక)

యముని మహిషపులోహఘంటలు
మబ్బుచాటున
ఖణేల్మన్నాయి !

<u>పాదాల సమాంతరం</u> (అల్లకల్లోలం)

కనకదుర్గాచండసింహం జూలుదులిపి ఆవులించింది
ఇంద్రదేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది

<u>పాదాల ఆరోహణ</u> (మార్పు)

నంది కేశుడు
రంకె వేస్తూ
గంగడోలును కదిపిగంతేడు

అవరోహణలోని పాదలేఖనక్రమాన్ని ఆరోహణలో వ్యత్యస్తం చేయడంద్వారా సమాజంలో పాతకొత్తల వ్యత్యాసాన్ని సూచించాడు. 'ఉత్తరమందూ దక్షిణమందూ ఉదయమునందూ ప్రదోషమందూ వెన్నెలలోనూ చీకటిలోనూ మండుటెండలో జడిలో చలిలో ఇపుడూ అపుడూ ఎపుడూ మ్రోగే గంటలను' విన్న శ్రీశ్రీ సామ్యవాద విప్లవం దక్షిణంనుంచి మొదలై సర్వదిక్కులకూ వ్యాపిస్తుందని సూచించడానికో అన్నట్లు దిక్కుదిక్కులా ఉన్న దేవతలను కదిలించాడు.

'అవతారం' ఖండికను మహాప్రస్థానంలో ముద్రించిన పద్ధతిని పాఠకు లొకమారు పరిశీలిస్తే అందులో ఒక వాస్తుశిల్పం కనిపిస్తుంది. శ్రామికుడి శ్రమవల్ల రూపొందే వాస్తుశిల్పాన్ని అభిమానించడమే ఇందుకు కారణం. ఏ శ్రామికుల సంఘటనచే విప్లవం బయలు దేరిందో ఆ శ్రామికుల నిర్మాణాలచేతనే ప్రపంచం ముందుకు పోతుంది. వారి శ్రమనుంచే లయవిన్యాసం మొదలై కవిత్వం రూపొందుతుంది.

### శ్రీశ్రీ క్రియాశిల్పం

'అవతారం'లో ప్రతిపాదమూ క్రియాపదంతోనే పూర్తిచేసి సామ్యవాదవిప్లవం క్రియల మీద ఎలా ఆధారపడి ఉంటుందో సూచించాడు శ్రీశ్రీ. ఈ క్రియాపదాలను వాడటంలో శ్రీశ్రీ ఆలోచనా ఆవేశమూ జతగూడాయి. మొదటి మూడు క్రియలూ అమహద్వాచక బహువచనాంతాలు.

లోహఘంటలు ఖణేల్మన్నాయి

జాగిలమ్ములు ఉరికిపడ్డాయి

సప్తహయములు పరువుపెట్టేయి

బూర్జువావ్యవస్థలో చైతన్యం లేకుండా పడిఉన్న కార్మికుల సమష్టి జాగృతిని ఇవి సూచిస్తాయి. ఇదే కదలిక — విప్లవారంభం.

తరువాతి రెండు క్రియలూ మహతీవాచకపు ఏకవచనాంతాలు.

చండసింహం ఆవులించింది

మదపుటేనుగు సవాల్ చేసింది

నియంతృత్వపు ప్రతిచర్యను ఇవి సూచిస్తాయి. ఇది కల్లోలం.

తరువాతి రెండూ మహద్వాచక ఏకవచనాంతాలు.

నందికేశుడు గంతేడు

వేదవేద్యుడు కోరసాచాడు

ఆఖరిక్రియ మొదటి మూడురకాల వంటిది కాక ప్రేరణార్థకం. దీనికి కర్త పురుటినొప్పులు అనే ప్రకృతిపరిణామం.

పురుటినొప్పులు కొత్తసృష్టిని స్ఫురింపించాయి

మొదటి ఆరుక్రియలూ దేశ్యాలు కాగా చివరిక్రియ తత్సమం కావడంవల్ల విప్లవానంతర పరిష్కారానికి సూచకమవుతోంది.

జగమంతా బలివితర్దియై నరజాతికి పరివర్తన వచ్చి నవజీవనశుభసమయం రాబోతున్నదని ఈ పురిటినొప్పులు సూచిస్తాయి.

### శ్రీశ్రీ జంతుప్రతీకలు

కవిత్వాన్వేషణలో "కారడవులలో లయాతీతమై విరుతించిన నానాజంతుధ్వనుల్నీ" విన్న శ్రీశ్రీకి జంతుశాస్త్రమే ఒక వ్యుత్పత్తిగా పరిణమించింది. జంతువుల అరుపులు, ఆకారాలు మహాప్రస్థానంలో వినిపించినంతగా కనిపించినంతగా ప్రభవ, స్వర్గదేవతలులో లేవు. ఇందుకు జంతుశాస్త్రాధ్యయనమే ప్రధానకారణంగా కనిపిస్తుంది. 'వేటకాని కోలలకు కూలి వేదనల తూలు హరిణాల కండ్లు' అంటూ విద్యున్మాలికలలో ఆరంభించిన ఈ జంతుసంతతి 'ఒకరాత్రి'లో 'కాళ్ళుతెగిన ఒంటరిఒంటె'గా గంటలులో సింహముగా, సివంగిగా, కురంగిగా ఆకాశదీపంలో సింహంగా బుక్కులులో కుక్కపిల్లగా మహాప్రస్థానంలో రేచులుగా, కదంత్రొక్కే గుర్రాలుగా, గర్జించే సింహాలుగా కనిపిస్తూ అవతారంలో యముని మహిషంగా, సూర్యుడి హయాలుగా కనకదుర్గ చండసింహంగా ఇంద్రుడి మదపుటేనుగుగా శివుడి నందిగా ఆదివరాహంగా రూపు

దిద్దుకుంది. హిందూపురాణాలలోని జంతువులే గాక గ్రీకురోమన్ పురాణాలలోని జంతువులు కూడా శ్రీశ్రీని ఆకర్షించాయి కనుకనే నరకలోకపు జాగిలాలు తెలుగుకవిత్వంలోకి ప్రవేశించాయి. గ్రీకుపురాణంలోని నరకం మన పాతాళం ఒకటే. గ్రీకుల పాతాళంవద్ద కావలికాచే జాగిలం ఒక్కటే అయినా శ్రీశ్రీ స్వతంత్రంగా ఎన్నోజాగిలాలను ఊహించాడు. మానవరూపంలో కొంత, జంతురూపంలో కొంతా ఉండే ఈ మూడుతలల కుక్కలు హిరణ్యాక్షుడిమీాది దండయాత్రకు వచ్చాయంటే అవి నరకద్వారరక్షణ వదిలివేశాయన్నమాట. నరకంలో ఉంచబడిన దోషులకన్నా మహాదోషి హిరణ్యాక్షుడనే అర్థాన్ని స్ఫురింపజేశాడు శ్రీశ్రీ. హిరణ్యాక్షుడివంటి పరపీడనపరాయణుల్ని నరకానికి తీసుకురావడానికే జాగిలాలు గొలుసుత్రెంచుకు ఉరికిపడ్డాయి.

నరకలోకపు జాగిలాలవంటివే 'కంచువృషభాలు' శైశవగీతిలో మనకు కనిపిస్తాయి. శ్రీశ్రీ కవిత్వాన్ని చదువుకోవడానికి ఇతరదేశాలవారికి హైందవసంస్కృతి ఎలా తెలిసిఉండాలో తెలుగుదేశంవారికి పరదేశాల సంస్కృతి అలా తెలిసిఉండాలి. రెండు సంస్కృతుల సమ్మేళనం 'అవతారం' గీతం.

## శ్రీశ్రీ శబ్దసంఘటన

'ఈ యుషఃప్రస్ఫురద్రమణీయవేళ నవవికస్వర మృదులతాంతములయందు
నాకుఁ దోఁచెను ప్రకృతికాంతాశరీరసౌరభాకృష్ట మధురసంస్పర్శసుఖము'

అని 'ప్రభవ'నాడు శ్రీశ్రీ రాసిన గీతం చదివితే అందులోని శబ్దవిన్యాసం మన ఇంద్రియాలకు ఒక అనుభవాన్ని కలిగించేమాట నిజమే. కానీ మహాప్రస్థానగీతాలలో శ్రీశ్రీ ఇంద్రియానుభవం కలిగించడంతోనే తృప్తిపడలేదు. ఇంద్రియాల కదలికను శబ్దవిన్యాసంద్వారా కలిగిస్తూ భావవ్యంజనకు ఉలికిపడేలా చేశాడు ప్రభవనాటి శబ్దసంఘటన పిల్లతెమ్మెర అయితే మహాప్రస్థానంనాటి శబ్దవిన్యాసం మహాప్రభంజనం. ప్రభవనాటి శైలి నడక కాగా మహాప్రస్థానంనాటి శైలి పరుగు. ఈ రెండు తేడాలే భావకవిత్వ విప్లవకవిత్వాలకు కూడా ఉన్నాయి.

లోహఘంటలు ఖణేల్మన్నాయి

అన్నప్పుడు చెవిని తాకేది ఖణేల్మనే ధ్వని. గణగణమన్నాయని శ్రీశ్రీ రాసిఉంటే అది మృత్యుసూచకమై ఉండేదికాదు. ఇదే వ్యంజకత్వం. పెళపెళ పెళపెళ విరుచుకుపడండి – గళగళన్మంగళకళాకాహళహళాహళి – నా వినుతించే నా విరుతించే నా వినిపించే నవీనగీతి – కలగాపులగపువిలయావర్తపుబలవత్ఘురవత్పరివర్తన – ఉన్మాది మనస్సినీవాలిలో ఘూకంకేకాభేకం బాకా – ఖడ్గమృగోదగ్రవిరావం – జాతిజాతినిర్ఘాతపాతసంఘాతహేతువు – ఫేరవభైరవభీకర ఘోషలు – చూర్ణమాన ఘూర్ణమాన దీర్ణమాన గిరిశిఖరాలు – హింసనచణధ్వంసరచన

వంటివి. శ్రవణేంద్రియాన్ని అదరగొట్టే శబ్దవిన్యాసం కలిగిఉన్నాయంటే ఆ శబ్దవిన్యాసం ఆ భావానికికూడా అవసరమైన పరికరం కనుకనే.

కమలమంజులమందిరాంగణములందు
సమదబంభరగానఘోషలు నదించె

అనే శ్రీశ్రీ చిన్నప్పటి రచనలో ఈ ఉద్ధృతి ఉండవలసిన అవసరం లేకపోవడానికి వస్తువులోని మార్దవమే కారణం. తుమ్మెదల పాటలు వదిలి శ్రీశ్రీ మదపుటేనుగు ఘీంకారాలదగ్గరకూ ఆది సూకరవేదవేద్యుడి ఘుర్ఘురారవాలదగ్గరకూ వచ్చేశాడు.

## భావాలతో శ్రీశ్రీ ఇంద్రజాలం

చండసింహం ఆవులించడం, మదపుటేనుగు సవాల్ చేయడం ఇంద్రియాల కదలికనుచూపే భావచిత్రాలు మాత్రమేగాక జంతువులకు మానవచేష్టలను ఆరోపించే పదచిత్రాలుకూడా. ఎగిరి పడుతున్న మేరువులూ జలప్రళయనాట్యం చేస్తున్న సముద్రాలూ భూదివమ్ముల మధ్య ఈదు లాడే దయ్యాలూ నోరెత్తి హోరెత్తే సాగరమూ మూలనక్కి మూలిగే దీపమూ ఆహ్వానగానం చేసే ఆకాశతారా నీవేపే చూసే రొట్టెముక్కా వెక్కిరించే వేగుజుక్కా, ఆడుకునే శీతవాయువు, దాగుడుమూతలాడే ఋతువులూ ప్రశ్నించే వెర్రిగాలీ రెక్కవిప్పిన రివల్యూషన్, మాటలాడే నక్షత్రాలూ పాటలుపాడే జలపాతాలూ పడగెత్తి బుసగొట్టే ప్రపంచం, మేలుకునే కంకాళాలూ వంటి మహాప్రస్థానంలో కనిపించే విచిత్రపదచిత్రాలలో మానవీకరణాలు మాత్రమేకాక జాంతవీ కరణాలూ విహంగీకరణాలూ సరీసృపీకరణాలూ కూడా ఉన్నాయి. అచేతనాలలో ప్రాణశక్తిని చూడటం, ప్రాణికోటిలో మానవోద్రేకాలను చూడటం, పశుపక్ష్యాదిలక్షణాలను అన్నింటికీ ఆరోపించగల్గడం శ్రీశ్రీ దర్శనంలోని గాంభీర్యానికి నిదర్శనం.

## శ్రీశ్రీ సంప్రదాయ పరిజ్ఞానం

రంకెవేస్తూ గంగడోలును కదిపి గెంతినది మామూలు ఆబోతు కాక శివుడి వాహనమైన నందికేశుడనగల్గడం సంప్రదాయం తెలిసిన కవికి, కానీ స్ఫురించదు. అలాగే అందులోని ఔచిత్యం తెలుసుకోవడానికీ సంప్రదాయజ్ఞత పాఠకుడి కుండాలి. నాట్యశాస్త్రానికి ఆచార్యుడుగా అభి వర్ణించబడుతున్న నందికేశుడు రంకెవేసి గంగడోలును కదిపి గెంతడంలో ఉద్ధతాభినయం ఉంది. నరకలోకపు జాగిలాలు – జగన్నాథుని రథచక్రాలు – మహానగాలెగరడం – నటధూర్జటినిటా లాక్షి – పరపీడనాపరుల ప్రాణాలభైరవి – క్రూరఘోరకర్కోటకులు – నాలుకచీలిన నాగులు– జ్వాలాతోరణం – మహాప్రస్థానం – ఆకాశదీపం – ఋక్కులు – హిరణ్యనేత్రుడు – కృద్ధవృకో దరుడు – సమవాకారం – కలకత్తా కాళిక – సప్తసముద్రాలు – షడ్జధ్వానం – బ్రహ్మానుభవం– గాంధర్వం – శ్యమంతరోచిర్నివహం – స్వస్తివాక్యాలు – మిథ్యావాదం – అద్వైతం – హల్లీసకం–

కాహళ - భిక్షువర్షీయసి - భవభూతి శ్లోకాలు - యజ్ఞోపవీతం - అనలవేదిక - స్వర్గం - పద్మవ్యూహం - శిల్పం - రసం - ఖండపరశుగళకపాలాలు - ధనంజయుడు - హోమజ్వాలలు - మేరువులు - త్రేతాగ్ని వంటి వెన్నో సంప్రదాయం తెలియనిదే తెలియని విషయాలు మహాప్రస్థానంలో ఉన్నాయి. ఇవి శ్రీశ్రీ సంప్రదాయజ్ఞతకూ వ్యుత్పత్తికీ నిదర్శనాలే కానీ మరో దేశంవారికీ సంప్రదాయం తెలియనివారికీ కావ్యాస్వాదనంలో అవరోధాలే అవుతూ వీటిని తెలుసుకోవలసిన అవసరాన్ని కల్పిస్తాయి.

## శ్రీశ్రీ మిశ్రభావచిత్రాలు

చెవితో వినే ధ్వనినీ కంటితో చూసే దృశ్యాన్నీ ఒకేపదచిత్రంలో కలపడంలో సింబాలిస్టుల ప్రేరణను శ్రీశ్రీ స్వీకరించాడు.

ఆదిసూకరవేదవేద్యుడు
ఘుర్ఘురిస్తూ కోరసాచాడు.

ముక్కుతో చేసే ఘుర్ఘురధ్వనిని మనం చెవితో వింటే కోరచాచడాన్ని కంటితో చూస్తాం. ధ్వనులూ దృశ్యాలూ కవిత్వానికి ప్రధానాలుగానే శ్రీశ్రీ భావించాడని 'గంటలు', 'కవితా ఓ కవితా' నిరూపిస్తాయి. ధ్వనినీ దృశ్యాన్నీ కలిపి మిశ్రభావచిత్రాన్ని తయారుచేయడం శ్రీశ్రీ కిష్టం. కొన్నిచోట్ల వినడం, చూడటం, పనిచేయడం వంటి వివిధక్రియలు తారుమారు కావడం, కలిసిపోవడం జరుగుతూ ఉంటాయి. ఈపదచిత్రాలలో చూపులు మెలమెల్లగా విసరడం, గదిని తలపోతతో కౌగిలించుకోవడం, ఆదరపుచూపులు చాపడం, ప్రోవులప్రోవుల రణన్నినాదాలు, నక్షత్రాంతర్నిబిడనిఖిలగానం, కన్నులుమూసిన రోగార్తుని రక్తనాళసంస్పందన, త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, పడుపుకత్తె అర్ధనిమీలితనేత్రాల బాధల పాటలపల్లవి, ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం, ఉన్మాదిమనస్సినీవాలిలో ఘూకంకేకా భేకంబాకా, నక్షత్రాలమాటలు, జలపాతాలపాటలు, తరంగాల స్రోతలు, రాబందుల రెక్కల చప్పుడు, పొగగొట్టపుభూంకార ధ్వని, అరణ్యమున హరీంద్రగర్జన, పయోధరప్రచండఘోషం, ఖడ్గమృగోదగ్రవిరావం, ఝంఝానిలషడ్జధ్వానం, ఫేరవభైరవభీకరఘోషలు మొదలైనవాటిలో దృశ్యధ్వనులు, భిన్నక్రియలు కలిసిపోవడం, తారుమారుకావడం కనిపిస్తుంది. చిత్రలేఖనంలోని ఆకారాలు, సంగీతంలోని ధ్వనులూ కవిత్వంలోనే కలిసిపోయి ఉండగలవు కనుక ఈ ప్రయత్నంమీద చూపు ఏర్పడింది. రూపమూ ధ్వనీ క్రియా (అభినయం) కలగలిపి యంత్రం ద్వారా రూపొందించిన 'సినిమా' పారిశ్రామిక విప్లవానంతరం మానవుడికి లభించిన వరం. సినిమాటెక్నిక్‌ను శ్రీశ్రీ కవిత్వంలో వాడుకున్నాడు. ఆదరపు చూపులు చాపడం వంటి విచిత్రదృశ్యాన్ని సినిమాలో చూపడం ఇంకా సాధ్యం కాలేదు. దాన్ని కవిత్వంలో చూపాడు శ్రీశ్రీ.

చిమ్మచీకటి క్రమ్ముకొస్తే దారితప్పిన బాటసారికి ఎంత కష్టం ?

1934 మే 18

మూఢవిశ్వాసాలు, స్త్రీ బాల్యవివాహాలు, కన్యాశుల్క దురాచారం, వేశ్యావృత్తి, హేతువాద నిరాకరణ, మతాచారాల అంధానుసరణం, వర్ణభేదాలు వంటి ఫ్యూడల్ సమాజపు అవలక్షణాలను తొలగించి, సంఘాన్ని సంస్కరించడానికి గురజాడ అప్పారావుగారు సాహిత్య రచనను అంకితంచేశారు. సమాజవాస్తవికతను ప్రతిబింబించేందుకు కన్యక, పూర్ణమ్మ వంటి విషాదాంత కథలను కావ్యకథానికలుగా రాశారు. తండ్రికి సొమ్మిచ్చి పూర్ణమ్మను ఒక ముసలివాడు కొనుక్కోగా, పూర్ణమ్మ ఆత్మాహుతి చేసుకుని చనిపోవడం పూర్ణమ్మ కథలోని వస్తువు. పూర్ణమ్మ తండ్రి కనకదుర్గ అమ్మవారి పూజారి అయినా అమ్మవారు ఈ అన్యాయాన్ని చూస్తూ ఊరుకుండంటే కారణాన్ని పాఠకుల ఊహాకే గురజాడ వదిలివేశారు. పూర్ణమ్మ దుర్గమ్మలోనే కలిసిపోయిందని కథను ముగించారు. మనిషిచేసిన రాయిరప్పకు మహిమకలదను కోవడం మూర్ఖత్వమని మరోచోట గురజాడ స్పష్టంచేశారు. ప్రతికథనూ మంగళాంతంగానే ముగించాలనే భారతీయాలంకారికానుశాసనాన్ని తిరస్కరించి సంఘవాస్తవికతను గురజాడ ధ్వనిస్తూ విషాదాంతకథను రాయడానికి సమాజపరిస్థితులే ప్రేరకాలు. సమాజమూ సమాజంలోని అవలక్షణాలూ దురన్యాయాలూ గురజాడనాటి కున్నట్లే శ్రీశ్రీ నాటికి లేవు. ఫ్యూడల్ వ్యవస్థ స్థానే బ్రిటిష్ ఇంపీరియలిజంద్వారా బూర్జువావ్యవస్థ వచ్చి సమాజస్వరూపాన్ని మారుస్తోంది పాతసమాజం మారి కొత్తసమాజం వచ్చినట్లే పాతదురాచారాల స్థానంలో కొత్త దురాచారాలూ కొత్త దురన్యాయాలూ కొత్త సమస్యలూ వచ్చిపడ్డాయి. శ్రీశ్రీనాటి సమాజ సమస్యలు దారిద్ర్యం, నిరుద్యోగం, ఆర్థికతారతమ్యాలు, దోపిడి, నిరక్షరాస్యత, రోగాలు మొదలైనవి. ఈ సమస్యల నివారణకు కావలసింది సంఘసంస్కరణంకాక సామాజికవిప్లవం అని శ్రీశ్రీ గుర్తించాడు. గురజాడ సంఘసంస్కరణకు సాహిత్యాన్ని అంకితంచేస్తే శ్రీశ్రీ సామాజిక విప్లవానికి సాహిత్యాన్ని అంకితంచేశాడు. గురజాడకులాగే శ్రీశ్రీకి కూడా సమాజవాస్తవికతే ఆదర్శాలకన్నా మిన్న. అందుకే నిరుద్యోగసమస్యకు బలిఅయిపోయిన ఒక యువకుడి కథను విషాదాంతంగా శ్రీశ్రీ 'బాటసారి' అనే శీర్షికతో రచించాడు.

పారిశ్రామికవిప్లవం అంటే ఏమిటో తెలియని కవిత్వపు తొలిరోజుల్లో శ్రీశ్రీ 'మతస్వీకృతి' వంటి చారిత్రకేతివృత్తాన్ని గీతపద్యాల్లో రచించి హింసానివారణానికై అన్యమతాన్ని కూడా

స్వీకరించిన యదునాథవసువు పాత్రను ఉదాత్తంగా చిత్రించారు. కానీ విశాఖపట్నంనుంచి మద్రాసుకు వెళ్ళి డిగ్రీ తీసుకుని, తిరిగి విశాఖ వచ్చిన శ్రీశ్రీకి ఆ రెండు నగరాలూ సరికొత్త సమాజాన్నీ పారిశ్రామికవిప్లవాన్నీ పరిచయంచేశాయి. పెట్టుబడిదారీవ్యవస్థవల్ల వచ్చిన నిరుద్యోగాది సమస్యలు శ్రీశ్రీ నిజజీవితాన్ని కూడా చుట్టుకోవడంవల్ల సమాజసమస్యలు అర్థమయ్యాయి. పల్లెలలో పనులులేని యువకులు నగరాల్లో కొత్తగా ఏర్పడుతున్న పరిశ్రమల్లో కర్మాగారాల్లో పనులు దొరుకుతాయని పరుగెట్టడం చూసి, శ్రీశ్రీ బాటసారికథను ఎత్తుకున్నాడు. అప్పటికే శ్రీశ్రీ హేతువాది అయినందువల్ల మతాన్నీ దేవుణ్నీ బాటసారి కథలోకి తీసుకురాలేదు. బాటసారి మరణానికి ప్రకృతి దుఃఖించిందనీ అతడేమైపోయాడో తెలియక పల్లెటూళ్ళో తల్లి కలవరపడిందనీ చెబుతాడే తప్ప వీరి కష్టాలకు విధివిలాసం కారణంఅనే భావాన్ని దరికి రానీయకపోవడంలోనే శ్రీశ్రీ భౌతికవాదతత్పరత్వం వ్యక్తం అవుతుంది.

ఫ్యూడల్ వ్యవస్థలో ఉత్పత్తిసాధనాలూ, శ్రామికులూ పల్లెలలో ఉంటే పెట్టుబడిదారీవ్యవస్థలో ఉత్పత్తిసాధనాలూ, కార్మికులూ పట్టణాలకు మారతారు. పెట్టుబడి పెట్టేవాడు సొంత ఆస్తిని పెంచుకుంటూ ఉంటే శ్రమపడేవాడు కడుపునిండక బాధపడతాడు. సంపదలు ఎంతగా పెరుగుతాయో దారిద్ర్యం కూడా అంతగా పెరుగుతుంది. అందువల్ల పీడకపీడితవర్గాలేర్పడతాయి. పీడితవర్గంలోని వ్యక్తిఅయిన బాటసారిని కథానాయకుడుగా గ్రహించి అతడి మృతికి కారణాలను పాఠకుల ఊహకే శ్రీశ్రీ వదలివేశాడు. పల్లెనుంచి బయలుదేరిన బాటసారి ఇంకా నగరంలో అడుగుపెట్టకుండానే ఆకలివల్ల మరణించాడు.

## శ్రీశ్రీ మహాకావ్యశిల్పం

మహాకావ్యాలు అంటే పరిమాణంలో బహుళాశ్వాసదీర్ఘాలుగా నానావర్ణనాన్వితంగా ఉండాలనుకునే కాలం కనుమరుగైపోతోందని గురజాడయే గుర్తించి ఖండకావ్యాన్నే మహాకావ్యశిల్పంతో పూర్తిచేయడం మొదలుపెట్టాడు. కావ్యమహత్త్వం పరిమాణంమీద ఆధారపడి ఉండదని A long poem is a contradictory in terms అనే అల్లన్‌పో వాక్యాన్ని సమర్థించే శ్రీశ్రీ ఖండకావ్యంలోనే హ్రస్వలిపిసంవిధానాన్ని ప్రవేశపెట్టి లోతులూ ఎత్తులూ ప్రదర్శించాడు. దీర్ఘకవితలంటే విముఖత్వం కలగడానికి సామాజికకారణాలు కూడా ఉన్నాయి. కొద్దిమందికే సాహిత్యం అవసరమైన కాలంలోనూ సాహిత్యమే జీవితపరమార్థంగా భావించబడినకాలంలోనూ దీర్ఘకావ్యాలు పుట్టి ధనసంపాదనే జీవితపరమావధి అయిన కాలంలో పెట్టుబడిదారీవ్యవస్థలో ఖండకావ్యాలు వచ్చాయి. అప్పుడు మహాకావ్యశిల్పాన్నే ఖండకావ్యంలో చూపడానికి మహాకవులు ప్రయత్నిస్తారు. శ్రీశ్రీ ఖండకావ్యాలలాంటివే. నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే

నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే - అని శ్రీశ్రీ ఒకచోట అనే ఉన్నాడు. నేటికవులు ఒకటి రెండు మాటల్లో తాము చెప్పగలిగింది చెబుతున్నారంటే బండెడు గ్రంథం రాయలేకకాదనీ ఈ విధంగా చెప్పడానికి సామాజికంగానూ మనోవైజ్ఞానికంగానూ తగినన్ని కారణాలున్నాయనీ శ్రీశ్రీ భావించి ఉన్నాడు

'బాటసారి'ని ఫ్యూడల్‌వ్యవస్థనుంచి బూర్జువావ్యవస్థలోకి పయనించే సాంఘికవ్యక్తికి ప్రతినిధిగానే శ్రీశ్రీ భావించి ఉంటాడనడానికి పల్లెటూరినుంచి అతడు కూటికోసం కూలికోసం పట్టణానికి బయలుదేరినట్లు చెప్పడమే నిదర్శనం. దున్నుకోవడానికి పొలం లేనివాడూ పనిచేసుకోవడానికి కూలిపని దొరకనివాడూ ఈ యువకుడు తండ్రిపోయిన తరవాత తల్లి అనాథకాగా ఆమెకు బువ్వ పెట్టలేక, తాను తిండికి లేక దారిద్ర్యం అనుభవిస్తూ నగరానికి బయలుదేరాడు. బాటసారి కథ మొదలుపెట్టడంలోనే శ్రీశ్రీ మన ఊహకు ఎంతో పూర్వకథను వదిలివేశాడు. మనకు కలిగే సందేహాలకు సమాధానాలు మనమే చెప్పుకోగల్గినట్లు వాతావరణాన్ని సృష్టించడమే శ్రీశ్రీ శిల్పం "తల్లిమాటలు చెవినిపెట్టక బయలుదేరిన బాటసారికి" అంటూ శ్రీశ్రీ అన్నప్పుడు పాఠకుడికి తల్లి ఏమని చెప్పిందో ? అనే ప్రశ్న వస్తుంది. దానికి సమాధానం ఈయడు. పట్టణానికి పోవద్దనీ తనకు దిక్కులేదనీ ఆమె చెప్పిఉంటుందని మనం ఊహించుకోవలసిందే. బాటసారి తల్లిమాటల్ని చెవినిపెట్టలేదంటే అతని పట్టుదల, సాహసమూ మాత్రమే గాక దారిద్ర్యంవల్ల కలిగిన విసుగు, నిర్వేదం, తండ్రిమరణంవంటివన్నీ ధ్వనించాయి. ఏ ఒక్కమాట చెబితే దాని పూర్వకథ అంతా గోచరిస్తుందో దానిని చెప్పడమే కథనశిల్పం.

"మూడురోజులు ఒక్కతీరుగ నడుస్తున్నా దిక్కు తెలియని" బాటసారి తిండి తినలేదనీ ఎక్కడా ఆగలేదనీ నగరానికి దారి తెలుసుకోలేకపోయాడనీ తెలుస్తూనేఉంది. అందువల్లనే అతడు దారి తప్పిపోయినా, పల్లెటూరివాడు కావడంవల్ల ఎవరినీ దారి గురించి అడగకుండానే తిరుగుతూఉంటాడు. ఈ తిరుగుడును ఎన్నో క్రియలద్వారా శ్రీశ్రీ చెప్పాడు.

నడిసముద్రపు నావరీతిగ
సంచరిస్తూ సంచలిస్తూ
దిగులుపడుతూ దీనుడవుతూ
తిరుగుతుంటే-

ఈ క్రియలన్నింటికీ చెప్పబడిన ఉపమానం పారిశ్రామికవిప్లవంలో అతిముఖ్యమైన ఘట్టం. ఆ క్రియలన్నీ బాటసారికీ నావకీ సామాన్యధర్మాలై ప్రమాదాలనూ ఉత్పాతాలనూ సూచిస్తున్నాయి ఈ క్రియల లయ ద్వారా సుడిగుండపు వేగాన్ని సూచించాడు శ్రీశ్రీ.

దారితెలియని బాటసారికి జ్వరం వచ్చిందనీ భయంవేసిందనీ ఇంతలో వానకురిసిందనీ రాత్రి అయిందనీ చెబుతూ శ్రీశ్రీ నడిసముద్రపు నావ పరిస్థితినీ బాటసారి పరిస్థితినీ సమ్మిళితం చేశాడు. "చండ చండం తీవ్రతీవ్రం జ్వరం కాస్తే భయం వేస్తే ప్రలాపిస్తే—మబ్బు పట్టీ గాలికొట్టీ వానవస్తే వరదవస్తే చిమ్మచీకటి క్రమ్ముకొస్తే దారితప్పిన బాటసారికి ఎంతకష్టం!" అని ప్రశ్నిస్తూ ఊపిరిసలపకుండాచేసి ఊరుకున్నాడు. ఒకదాని తరవాత ఒక కష్టం ఎలా తరుముకుని వచ్చిందో చెప్పడంతో ఊరుకోకుండా ఎంతకష్టం? అంటూ సానుభూతిని చూపించడానికి పాఠకుల్ని ప్రేరేపించాడు.

బాటసారి పరిస్థితి మార్గమధ్యంలో ఇలా ఉంటే అతనిమీదనే ఆశలుపెట్టుకున్న అతనితల్లి పల్లెటూళ్ళో ఇంటివాకిట ఎలా ఉందో ఆ దృశ్యాన్ని చూపించడానికి శ్రీశ్రీ 'సినిమా' పద్ధతిని అనుసరించాడు. భిన్నస్థలాల్లో సంఘటనలను సమాంతరంగా ప్రదర్శించడం అనేది పారిశ్రామిక యుగపులక్షణం. అందుకే శ్రీశ్రీ 'కళ్ళు వాకిట నిలిపిచూచే పల్లెటూళ్ళో తల్లి ఏమని పలవరిస్తోందో?' అంటూ ప్రశ్నించి పాఠకుల్ని వెనకకు మళ్ళించాడు. తల్లి కళ్ళనూ పలవరింపునూ సమ్మేళనం చేశాడు. పల్లెటూరి దృశ్యంనుంచి తిరిగి కథను మార్గమధ్యంలోకి దూకిస్తూ బాటసారి ఆవేదనను చిత్రించాడు. దారి తప్పిన బాటసారికి నిద్రలేకపోవడంవల్ల కళ్ళు మండటం, జ్వరం రావడంవల్ల తలనొప్పి రావడం, తల్లిని ఒంటరిగా వదలిరావడంవల్ల ఆ స్మృతులు రావడం సహజమైనవే. వాటిని చెప్పడంలో కవి తన సానుభూతిని మేళవించాడు—ఎంత కష్టం అంటూ.

బాటసారి బయలుదేరి, మూడు రోజులు గడిచిపోయిన తరవాతనే కథ అంతా ఆరంభమయింది. ఇంకా ఎన్నాళ్ళు దారిలో గడిచిందో మనకు తెలియదు. చింతనిప్పులలాగ మంటలు చెరిగిపోసే కళ్ళు, గుండుసూదులు గ్రుచ్చినట్లు నొప్పివస్తున్న తల, నల్లని రాతిలా రాత్రి కూర్చున్నందువల్ల బరువెక్కిన గుండె అతడి శరీరవాస్తవికతనీ మనోవాస్తవికతనీ చెబుతాయి. ఈ మూడు పోలికలూ చెప్పిన తరవాత గేయాన్ని పరుగెత్తిస్తూ

తల్లి పిల్చే కల్లదృశ్యం
కళ్ళముందట గంతులేయగ
చెవులు సోకని పిలుపులేవో
తలచుకుంటూ కలతకంటూ
తల్లడిల్లే / కెళ్ళగిల్లే / పల్లటిల్లే
బాటసారికి ఎంతకష్టం ?

అని ఒక నిట్టూర్పు విడిచాడు శ్రీశ్రీ. ఎంతకష్టం అనే మాట ఇప్పటికే రెండవసారి ఆవృత్తమయింది. ఇదే మాటను ఎన్నిసార్లు ఆవృత్తంచేస్తే అంత దుఃఖమూ కలుగుతుంది. బాటసారికి

మూడు విశేషణాలు వేసి ఆవృత్తిని సూచించాడు తల్లడిల్లే బాటసారికి ఎంతకష్టం ? కళ్ళగిల్లే బాటసారికి ఎంతకష్టం ? పల్లటిల్లే బాటసారికి ఎంత కష్టం ? అంటూ రకరకాలుగా చదవడంవల్ల ఆ కష్టం అనుభవానికి వస్తుంది. ఈ కష్టపరంపరే బాటసారి మరణానికి కారణమయింది. 'అతని బ్రతుకున కదే ఆఖరు' అంటూ ఒక్కముక్కలో మరణాన్ని సూచించిన శ్రీశ్రీ మొట్టమొదటనే చెప్పాడు 'పట్టణంలో బ్రదుకుదామని' ఆతడు బయలుదేరినట్లు. ఈ సంకల్పం పట్టణం చేరకుండానే విఫలమయిపోయింది,

ఇంతవరకూ చెప్పిన కథ ఒక ఎత్తు; మరణానంతర కథ మరొక ఎత్తు. మరణించాకా కథ ఏమిటి ? ఇందులోనే శ్రీశ్రీ ప్రతిభ ఉంది. తల్లిని వదిలి వచ్చిన బాటసారి మరణానికి ప్రకృతి దుఃఖించిందని చెప్పాడు శ్రీశ్రీ. బాటసారి మరణించిన సమయం రాత్రి కాగా గ్రుడ్లగూబ కూతతో తొలిజామునూ వాన వెలిసి మబ్బులోనుంచి మెరుపు మెరియడంతో రెండో జామునూ కోడి కూతతో వేగుజామునూ వేగుజుక్కతో ఉషస్సునూ శీతవాయువుతో సూర్యోదయాన్నీ తెలిపి బాటసారి కళేబరాన్ని పాఠకులకు ఆ వెలుగులో చూపించాడు. కథ యింతటితో పూర్తికావలసిందే కానీ అలా పూర్తి చేయకుండా కథ మొదలైన పల్లెటూరికే కథను తీసుకుపోయి, 'తల్లికేదో పాడుకలలో పేగు కదిలింది' అంటూ ముగించాడు. ప్రకృతివర్ణనలో సమయవర్ణనను సమ్మిళితం చేయడం శ్రీశ్రీ శిల్పమర్మం. ఈ రెండు వర్ణనలను తిరిగి పరిశీలిస్తూ స్వారస్యాలను చెప్పుకుందాం! 'గ్రుడ్డిచీకటిలోన గూబలు ఘూకరించాయి' అన్న మొదటి ధ్వనిచిత్రంలో గ్రుడ్లగూబల సహజ ఘూకారవాన్ని బాటసారి మరణపరామర్శగా ఉత్ప్రేక్షించి ప్రకృతిశోకానికి ఘూకరావాన్ని సంకేతం చేశాడు. బాటసారి దారిలో ఉండగానే వాన వచ్చిందంటూ సూచించి అతని కష్టాలకు ఆ వానను ప్రతీకగా తోపించి అతని మరణంతో తీరిపోయిన ఆ కష్టాలను వర్షాంతంలో సూచిస్తూ 'వాన వెలిసీ మబ్బులో ఒక మెరుపు మెరిసింది' అన్నాడు. ఈ దృశ్యచిత్రంలో మెరుపు శాంతికి సూచకం. 'వేగుజామును తెలియజేస్తూ కోడి కూసింది' అన్న ధ్వనిచిత్రంలో కోడికూత ప్రయోజనాన్ని కవియే చెప్పివేశాడు. వానవెలిసి, మబ్బులు విడి, మెరుపులు మెరిసి, కోడి కూసేసరికి రాత్రి అంచెలంచెలుగా వెళ్ళిపోయింది. 'విడిన మబ్బుల నడుమనుండీ వేగుజుక్కా వెక్కిరించింది.' అనే దృశ్యచిత్రంలో వేగుజుక్క మేధావికీ వెక్కిరింత అతడు సమాజాన్ని చేసే పరిహాసానికీ సంకేతాలు. దేశంలో వేలాదిమంది యువకులు కూలికీ కూటికీ కరువాచి పట్టణాలకు చేరుకునే లోగానే మరణించడాని కేదికారణమో దానినే వేగుజుక్క వెక్కిరిస్తుంది. బాటసారి శవం దారిలో పడిపోయి ఉండగా అతని "కళేబరంతో శీతవాయువు ఆడుకుంటోంది" అంటూ ఆ కళేబరం ఒక ఆటవస్తువుగా ప్రకృతికి మిగిలిపోయిందని సూచించాడు.

బాటసారిని మొదటే వెళ్ళవద్దన్న తల్లి. - అతడు వెళ్ళిన తరవాత గృహాంగణంలో నిలబడి కొడుకుకోసమే చూస్తూఉన్న తల్లి- కొడుకు చనిపోయాడని ఎలా తెలుసుకోగలదు ? ఆమెకు 'పాడుకలలో పేగుకదిలింది' అని చెప్పిన కవి ఆ కల ఏమిటో చెప్పకుండానే కొడుకు మరణాన్ని ఆమె చూసిందని సూచించాడు. మరి ఆ తల్లి ఏమయిపోయిందో శ్రీశ్రీ చెప్పడు. తల్లి మరణించిందన్న విషయాన్ని ఊహించుకోవలసిందే. బాటసారి బయలుదేరింది లగాయతు తల్లిపాత్రను శ్రీశ్రీ పాఠకులకు జ్ఞాపకంచేస్తూనే ఉన్నాడు.

దుఃఖభూయిష్ఠమైన సమాజవ్యవస్థను బాటసారికథలో శ్రీశ్రీ సూచించాడు. కొడుకు గురించి తల్లి దుఃఖం, తల్లి గురించి కొడుకు దుఃఖం, ఈ యిద్దరిని గురించి కవి ఆవేదన పాఠకులను కరిగిస్తాయి; కలచివేస్తాయి. ప్రకృతికూడా ఈ దుఃఖాన్ని చూసి దుఃఖించడమేగాక పీడకవర్గాన్ని అవహేళనకూడా చేస్తుంది. రాత్రి, వర్షం, గాలి, చీకటి, గ్రుడ్లగూబ, మెరుపు, మబ్బు, వేగుజుక్క, కోడి, శీతవాయువు, ప్రాణం గల వ్యక్తులవలె వ్యవహరించాయి. బాటసారి, క్షుద్బాధ, దారిద్ర్యం, దిగులు, భయం, ప్రలాపం, కళ్ళమంటలు, శిరోవేదన, గుండె బరువు, భ్రమ, కలత, ఆవేదన కళ్ళకు కడతాయి. తల్లి నిరీక్షణ, పలవరింత, పాడుకల పాఠకుల గుండెలను కదిలిస్తాయి.

కవిత్వానికి కావలసింది కథావస్తువు కాదనీ 'కావ్యవస్తువు' అనీ ఒక సందర్భంలో నిర్దిష్టంగా ఉద్ఘాటించిన శ్రీశ్రీ మహాప్రస్థానకావ్యకథానికలలో ఆ సూత్రాన్ని విధిగానే పాటించాడు. ఆకాశదీపం, బాటసారి, భిక్షువర్షీయసి, అవతారం, ఉన్మాది, సంధ్యాసమస్యలు అనేవాటిలో కథావస్తువనిపించే కావ్యవస్తువు మాత్రమే ఉంది. బాటసారిలో రెండు భిన్నస్థలాల్లో రెండు భిన్నపాత్రల దుఃస్థితిని సూచిస్తూ సమాంతరంగా సంఘటనలను నడిపించాడు. మూడవస్థలం (నగరం) రాకుండానే సంఘటనలు ముగిశాయి. కావ్యవస్తువును మూడు రంగాలుగా విభజించుకుని మొదటిరంగంలో బాటసారి ఇంటినుంచి బయలుదేరి మూడురోజులు నడిచాకా జ్వరపీడితుడయ్యాడనీ రెండవరంగంలో దారిలో అతను కష్టాలూ ప్రయాసలూ పడ్డాడనీ మూడవరంగంలో బాటసారి చనిపోయాడనీ చెప్పాడు. బాటసారి మార్గమధ్యంలో చిక్కుకుపోయాకా తల్లి హృదయావేదనను గుర్తు చేశాడు.

కళ్ల వాకిట నిలిపిచూచే
పల్లెటూళ్లో తల్లి ఏమని పలవరిస్తోందో
పల్లెటూళ్లో తల్లికేదో
పాడుకలలో పేగుకదిలింది

తల్లిపేరుకానీ బాటసారి పేరుకానీ శ్రీశ్రీ చెప్పకపోవడానికి కారణం సమాజంలో అలాంటి వ్యక్తులెందరో ఉన్నారని సూచించడానికే. ఆకాశదీపంలో దురదృష్టజీవి, భిక్షువర్షీయసిలో ముసిల్ది, ఉన్మాదిలో కుర్రవాడు, సంధ్యాసమస్యలులో విద్యార్థి, ఉద్యోగి, సంసారి వీరెవరూ పేరున్నవారుకారు.

## శ్రీశ్రీ అచేతన చేతనీకరణశిల్పం

బాటసారి చనిపోయాకా అతని చుట్టూ ఉన్న ప్రకృతిలో గుడ్లగూబనీ మెరుపునీ కోడినీ వేగుజుక్కనీ శీతవాయువునీ శ్రీశ్రీ చూసిన తీరు అసామాన్యమే. వేగుజుక్క వెక్కిరించడం అంటే ప్రకృతికి కూడా ద్వేషాన్ని ఆరోపించడమే. శీతవాయువు ఆడుకోవడం అంటే ప్రకృతికి శైశవామాయికతను భావించడం. తల్లి పిల్చే కల్ల దృశ్యం గంతులేసిందనీ రాత్రి గుండెలమీద కూర్చుందనీ చిమ్మచీకటి క్రమ్ముకొచ్చిందనీ బాటసారిలోనే కొన్ని భావచిత్రాలు మనకి వింతగా కనిపిస్తాయి. అచేతనాలకు చేతనత్వాన్ని ఆరోపించాడు వీటిలో. మరోప్రపంచం పిలిచింది - మహాప్రపంచం ధరిత్రినిండా నిండింది - మేరువులు ఎగిరిపడుతున్నవి - సముద్రాలు నాట్యం చేస్తున్నవి - తొంగిచూచే చుక్కలు నెత్తురుకక్కుకున్నాయి - పగళ్ళు పగిలిపోయాయి - నిశీథాలు విశీర్ణిల్లాయి - బల్లచెక్క చూస్తోంది - వెర్రిగాలి ప్రశ్నిస్తోంది - గది చూస్తోంది - దీపం మూలుగుతోంది - దీపం అలిసిపోయింది - సంసారాలు చల్లారాయి - కంకాళం మేలుకుంటోంది - ప్రపంచం బుసగొట్టింది - వంటివి మహాప్రస్థానంలో శ్రీశ్రీ చేసిన అచేతనచేతనీకరణాలు.

## శ్రీశ్రీ ప్రజాకవిత్వసిద్ధాంతం

కొన్ని సామాజికపరిస్థితుల ప్రభావంతో ప్రాచీనకవులు రాసిన మహాకావ్యాలలోని ప్రయోగాల ఆధారంగా తెలుగు వ్యాకరణం రచింపబడినా ఆ సామాజికపరిస్థితులు మారిపోయి నప్పుడుకూడా కవులు ఆ వ్యాకరణానికే కట్టుబడి రచనలు చేయడంవల్ల వ్యాకరణమూ కవిత్వమూ కూడా స్తంభించిపోయాయి. ఇందువల్లనే గ్రాంథికమనీ వ్యావహారికమనీ రెండు భేదాలు ఏర్పడ్డాయి. సజీవమైనభాష గ్రంథంలోకి ప్రవేశించడానికీ ఆ భాష మాటాడే వ్యక్తులు (ప్రజలు) గ్రంథంలోని పాత్రలు కావడానికీ ఉన్న సంబంధమే వ్యావహారికభాష ఉద్యమం కావడానికి హేతువయింది. వాడుకభాషను గురజాడ కవితావాహికగా వాడాడంటే పూర్వవ్యాకరణాన్ని వదిలి నూతనవ్యాకరణానికి లక్ష్యాలు తయారుచేశాడన్నమాట. అంటే కవిత్వంతోపాటు వ్యాకరణమూ కదలడం ప్రారంభించిందన్నమాట. రాజు తలచిందేను ధర్మం - తల్లులు గన్నా పిల్లల్లారా - పూజకు పువ్వులు కోసేది-కానుకులోనై తల్లీతండ్రి - ముదుసలి మొగుడుకు ముడివేసి - మహిమ కలదని సాగి మ్రొక్కుతు - చూస్తావేల బేలా మొదలైన గురజాడ స్వేచ్ఛాప్రయోగాలు వ్యాకరణాన్ని విస్తృతంచేసి సజీవభాషను కవిత్వంలో పాదుకొల్పాయి. భాషను గ్రంథాలనుంచి మాత్రమే కాకుండా ప్రజలనుంచి కూడా గ్రహించవచ్చుననీ, వాడవచ్చుననీ సామాజికవిప్లవం కవిత్వలక్ష్యంగాగల కవి సమాజం భాషను వాడకతప్పదనీ గ్రహించాడు శ్రీశ్రీ.

సంచరిస్తూ - తిరుగుతుంటే - జ్వరంకాస్తే - మబ్బుపట్టి గాలికొట్టి - పల్లెటూళ్ళో - గంతులేయగ - ఘూంకరించాయి - మెరిసింది - కోడి కూసింది మొదలైన వాటిని పాతవ్యాకరణం

తిరస్కరిస్తే ఇవే కొత్త వ్యాకరణానికి లక్ష్యాలవుతున్నాయి. ఈ స్వేచ్ఛవల్లనే పోదాం పోదాం - ధనంజయునిలా - మరో ప్రపంచం - యజ్ఞోపవీతాన్ని - ఆహుతిచ్చాను - కొరడుకట్టి ఆకలేసి - నేనొకణ్ణే - వినబడుతున్నాయ్ - పరువుపెట్టేయి - కదిపి గెంతేశు - పాడేదీ పాడించేదీ-వస్తే రానీ - చూడకు దేన్నీ - చూస్తూ ఉంటాయ్ - వాక్యంటే - కళ్ళంటూ ఉంటే - నేనేం విన్నానా - ముసిల్దొకతె - వెళిపోయింది - ఇటు చూస్తే - ఒంటెలాగుంది - చిమ్ముకుంటూ-అగడ్తలంటా - ఎవడైతేనేం - ఇంకానా-మాయంటావా - విస్తరే దొరకదు - వస్తున్నాయొస్తున్నాయి - వంటి బాలవ్యాకరణం అంగీకరించని ప్రయోగాలను చేశాడు. ప్రభవ, స్వర్గదేవతలు రాసిన రోజుల్లో శ్రీశ్రీకి ఈ స్వేచ్ఛ లేదు కనకనే - గానరావముల్ మ్రోగినచో ధ్వనింతును - గొంతెత్తి పాడుకొంటి - నర్తనమొనర్చినాడ - నిలువున జలదరించితిని - తృప్తి వహింతు - తరలియరిగెడు నా కవాంతరములగునె వంటి గ్రాంథికానుకరణం కనిపించింది. ప్రజా వ్యవహారంనుంచి భాషాశైలిని తీసుకోవడంవల్లనే సౌలభ్యం సిద్ధించలేదు; తత్సమపదాలనూ దీర్ఘసమాసాలనూ మితంగా వాడటంవల్ల సౌలభ్యం సిద్ధించింది శ్రీశ్రీకి. తేటతెలుగులో నుడికారపు సొంపుతోనే బాటసారి గీతమంతా సాగిపోయింది. చండచండం, తీవ్రతీవ్రం, శిరోవేదన, శీతవాయువు వంటివి తప్పితే సమాసాలే లేవు. భిక్షువర్షీయసి, ఉన్మాది, చేదుపాట, దేనికొరకు, జయభేరి, అవతారం, కళారవి, ఋక్కులు, సంధ్యాసమస్యలు, ఆకాశదీపం, వాడు, వ్యత్యాసం వంటి ఖండికలు తేటతెనుగు నిరాడంబరత్వానికి ఉదాహరణలైతే మహాప్రస్థానం, ఐ, జ్వాలాతోరణం, నవకవిత, సాహసి, కవితా ఓ కవితా, ప్రతిజ్ఞ, కేక, శైశవగీతి, అద్వైతం, స్విన్‌బర్న్ కవికి, దేశచరిత్రలు, ఆశాదూతలు, గర్జించు రష్యా, జగన్నాథుని రథచక్రాలు వంటివి సంస్కృతాంధ్రాల ప్రౌఢికి ఉదాహరణాలు. కవిత్వంలో పండితపామరాభిరుచిని మేళవించాలనుకున్న శ్రీశ్రీ కొన్ని ఖండికలను సామాన్యులకోసమూ, కొన్ని ఖండికలు సామాన్యులగురించీ రాశాడు. శైలిలో ఈ వైవిధ్యమే శ్రీశ్రీని అన్నివర్గాలవారూ అభిమానించేందుకు ఒక కారణమయింది.

'బాటసారి'లో శ్రీశ్రీ వాడిన జాతీయపదబంధాలు ప్రజల సొత్తులే. ప్రజలు వాడుకుంటున్న భాషాపరికరాలను కవిత్వంలో వాడుకుని ప్రజల సాన్నిహిత్యాన్ని సంపాదించాడు శ్రీశ్రీ. బాటసారి, నడిసముద్రం, చిమ్మచీకటి, పల్లెటూరు, చింతనిప్పులు, గుండుసూదులు, గ్రుడ్డిచీకటి, వేగుజాము, వేగుజుక్క, పాదుకల వంటివి అతిసామాన్యాలూ అసామాన్యాలూకూడాను. ఎఱ్ఱ బావుటా, ఎండకాలం, వానకాలం, శీతకాలం, చంద్రగాడ్పులు, వానమబ్బులు, మహాప్రళయం, గంగడోలు, పురుటినొప్పులు, స్వర్గనరకాలు, చావుపుట్టుకలు, తుపానుమేఘం, పుట్టినరోజు, రాకాసిబొగ్గు, బుక్కాగుండ, జనసమ్మర్దం, ముళ్ళదారి, కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ, రొట్టెముక్క, అరటితొక్క, బల్లచెక్క, తలుపుగొళ్ళెం, హారతిపళ్ళెం, త్రాగుబోతు, పడుపుకత్తె,

కమ్మరికొలిమి, కుమ్మరిచక్రం, ఆరినకుంపటి, ముగ్గుబుట్ట, బండరాయి, వెర్రిగాలి, ఎముకముక్క, ఎంగిలాకు, వెర్రివాడు, కుర్రవాడు, దిష్టిబొమ్మ, వెక్కిరింత, వెకిలిచూపు, కూనిరాగం, చిక్కుదారి, పెద్దమనుషులు, బుద్ధిమంతులు, చేదుపిషం, అప్పులవాళ్లు, హోరుగాలి, నాలుగుదిక్కులు, ఇనుకతుపాను, వెలిబూది, ఆరున్నర, నెత్తుటిబొట్టు, అవతలిగట్టు, చెరసాల, తెరచాటు, హరివిల్లు, తామరపూవులు, పంటచేలు, బొమ్మరిల్లు, పాలబుగ్గలు, విశ్వరూపం, దాగుడుమూతలు, సెలయేళ్లు, బట్టబయలు, మండుటెండ, గర్వకారణం, పేకమేడలు, కత్తులవంతెన, ఠీవాలా, పాలికాపు, తిరుగుబాటు, కంచుగోడలు, వడ్డించినవిస్తరి, న్యాయస్థానం, రక్షకభటులు, ఉరికొయ్యలు, ముందుదారి, గంజినీళ్ళు, ఖూనీకోరు, గొడుగునీడ, ఆత్మహత్య, చెట్టునీడ, భూకంపం, లంజకొడుకు, సముద్రతీరం, పిచికగూళ్లు, ఊపిరితిత్తులు, బ్రహ్మచెముడుడొంకలు, సారాదుకాణం వంటివి శ్రీశ్రీ సొంతంగా సృష్టించినవి కాక ప్రజావ్యవహారంలో నాటుకుపోయినవి కనుక వాటి చలామణీని కనిపెట్టి కవిత్వంలో తనవిగా చేసుకుని పునఃసృష్టించి ప్రజల కవి అయ్యాడు. పదబంధాల చిరపరిచయంవల్ల శ్రీశ్రీ కవిత్వం తిక్కన, వేమన, గురజాడల కవిత్వంవలె తెలుగువారికి నాడుల లోకి దూసుకునివెళ్ళి 'ఇదీ మన కవిత్వం' అనిపిస్తుంది. (చూ. మానవుడా సమీక్షలో జాతీయాలు.)

ప్రజాభాషలో జాతీయపదబంధాలు కాక మరోరెండు సజీవమైన అంశాలున్నాయి. మొదటిది యాసలూ ఊనికలూ సముచ్చయార్థక దీర్ఘాలూ అర్థవిశేషస్ఫూర్తినిచ్చే పదాంత దీర్ఘాలూ – వీటికి సంబంధించిందీ; రెండోది వాక్యసంవిధానమూ. వాడుకభాష సహజమూ సజీవమూ నాటకీయమూ కూడాను.

వాన వెలిసీ మబ్బులో ఒక మెరుపు మెరిసింది అన్నప్పుడు వెలిసీ అంటే వెలిసిన తరువాత అనే అర్థం వస్తోంది. విడిన మబ్బుల నడుమ నుండీ వేగుజుక్కా వెక్కిరించింది అన్నప్పుడు నుండీ అనే దీర్ఘం ఆశ్చర్యాన్నీ చుక్కా అనే దీర్ఘం అద్భుతాన్నీ సూచిస్తున్నాయి. ఇలాటివి గణపూరణం కోసం వచ్చినవి కావు. దారి పొడుగునా, కొరడు కట్టీ ఆకలేసీ కేకలేశానే, పగళ్ళన్నీ పగిలిపోయీ, నిశీథాలూ విశీర్ణల్లీ, జూలు దులిపీ ఆవులించింది, వాక్కుంటే ప్రాస్తీ, విప్లవశంఖం వినిపిస్తారోయ్, ఆ అవ్వే మరణిస్తే ఆ పాపం ఎవ్వరిదని. క్రమ్మో చిమ్మ చీకట్లూ మనదీ ఒకబ్రతుకేనా, ఇంకానా ఇకపై చెల్లవు మొదలైన ప్రయోగాలలో ప్రజాగళం వినిపిస్తుంది.

## శ్రీశ్రీ వాక్య భేదాలు

చతుష్పాదపరిమాణం గల వృత్తంలోగానీ ముత్యాలసరంలోగానీ సుదీర్ఘవాక్యం ఇమిడించడం సాధ్యంకాదు. సుదీర్ఘ సమాసాలకు స్వస్తి చెప్పిన శ్రీశ్రీ సుదీర్ఘవాక్యాలను ముత్యాల సరపు మాలికలో ప్రయోగించాడు.

'బాటసారి' లోని ముత్యాలసరవు మాలికలో ఈ సుదీర్ఘ వాక్యాలు రెండున్నాయి. ప్రాచీన కవులు ఇలాంటి సుదీర్ఘ వాక్యం పట్టించడానికి మాలికా వృత్తాన్నో సీసాన్నో వచనాన్నో వాడవలసి వచ్చేది. బాటసారి మూడురోజుల ప్రయాణాన్ని చెబుతూ 19 పాదాల మాలికను ఏకవాక్యంలో రాశాడు శ్రీశ్రీ. ఇలాంటి వాక్యాలు కవితా ఓ కవితా, ప్రతిజ్ఞ, శైశవగీతి, కొంపెల్ల జనార్దనరావు కోసం లలో ఉన్నాయి.

శ్రీశ్రీ హ్రస్వవాక్యాలలో వైవిధ్యం ఉంది. కథకుడుగా చెప్పేవాక్యాలు, ఇతరులతో ముఖాముఖిగా కవి పలికే వాక్యాలు, తనలో తాను భాషించేవాక్యాలు, భవిష్యత్తు గురించిన ఊహలు, ప్రతిజ్ఞలు, సంబోధనలు, ప్రశ్నార్థకాలు, సమాధానాలు, అందరితోగానీ మరొకరితో గానీ కలిపి పలికేవాక్యాలు, చరిత్రను విమర్శించే వాక్యాలు, ఎవరిచేతనో పలికించే వాక్యాలు, — ఇలా రకరకాలుగా ఉన్నాయి. బాటసారిలో కథకుడుగా చెప్పే వాక్యాలున్నాయి. దారితప్పిన బాటసారికి ఎంత కష్టం? తల్లి ఏమని పలవరిస్తోందో ? అతని బ్రతుకునకదే ఆఖరు; గుడ్డిచీకటిలోన గూబలు ఘూకరించాయి; వాన వెలిసీ మబ్బులో ఒక మెరుపు మెరిసింది; వేగుజామును తెలియజేసూ కోడికూసింది; విడిన మబ్బుల నడుమనుండీ వేగుజుక్కా వెక్కిరించింది; బాటసారి కళేబరంతో శీతవాయువు ఆడుకుంటోంది; పల్లెటూళ్లో తల్లి కేదో పాడుకలలో పేగు కదిలింది - ఈ వాక్యాలలోని వైవిధ్యం పఠితను కదిలిస్తూ నడుస్తుంది.

భిక్షువర్షీయసి, అభ్యుదయం, అవతారం, జ్వాలాతోరణం, సంధ్యాసమస్యలు, ఆకాశదీపం, ఒక్క క్షణంలో, ఆశాదూతలు ఖండికల్లో శ్రీశ్రీ కేవలం కథకుడుగా ప్రయోక్తగా కనిపిస్తాడు. అంటే వీటిలో మధ్యమపురుషగానీ ఉత్తమ పురుషగానీ ఉండవు. అందువల్ల వీటిలోని వాక్యాలు కూడా బాటసారిలోని వాక్యాల్లాగే కవి ప్రయుక్తాలుగా నడిచాయి.

ఒక ఈగను పడవేసుకు తొందరగా తొలగె తొండ - ఈనాడే జగమంతా బలివితర్ది - నందికేశుడు రంకెవేస్తూ గంగడోలును కదిపి గెంతేడు - చావు పుట్టుకల పొలిమేరలలో ఆవులించె నొక చితాగ్నికుండం - ఎటకేగుటో సమస్యతగిలిందొక విద్యార్థికి - గదిలో ఎవరూ లేరు - పిమ్మట నిశ్శబ్దం - ఒకడు తూరుపు దిక్కునకు - ఇలా ఉన్నాయి వాక్యాలు. క్రియాపదం లేకుండా తెలుగువాక్యాన్ని నిర్మించడం ద్వారా వ్యావహారిక భాషా జీవలక్షణాన్ని కవిత్వంలో చూపించాడు శ్రీశ్రీ. వైప్లవ్యగీతాన్ని నేను - నా ఊహ చాంపేయమాల - ఋతువులు నా సోదరులు - నేనొక దుర్గం - అనితరసాధ్యం నా మార్గం - నా ఊళ కేదారగౌళ - ఈ నాడే జగమంతా బలివితర్ది - పుడమికి నేడే పుట్టిన రోజట - ముళ్ళదారినా నీ సంచారం - కవిత్వ

మొక తీరని దాహం - తనకన్నా శవం నయం - గదినిండా నిశ్శబ్దం - ఆందోళన మా ఊపిరి వంటివి క్రియారహితాలే (చూ. శైశవగీతి సమీక్షలో వాక్యశిల్పం)

## శ్రీశ్రీ లయ విన్యాసం

పాతఛందస్సులను వదిలివేసినప్పుడు పాతలయలు కూడా పోయి, కొత్త ఛందస్సులతో కొత్త లయలు ఏర్పడతాయి; కాని కవి అలాంటి లయ సృష్టికి ఉపక్రమించాలంటే అతనికి సంగీత చైతన్యం ఉండాలి. 'లయ'ను సంవిధాన వైచిత్రికోసం సృష్టించడం శుద్ధకళావాది లక్షణమైతే సామాజిక కవిత్వవాది అయిన శ్రీశ్రీ, లయను సందర్భోద్దీపనం కోసమే సృష్టించాడు. 'A man who devises new rhythms is a man who extends and refines our sensibility, and that is not merely a matter of technique'[1] అంటూ సామాజికవాది కాకున్నా ఇలియట్ అన్న మాటలు శ్రీశ్రీ లయ సృష్టికి అన్వయిస్తాయి.

పల్లెటూళ్ళో తల్లికేదో పాడుకలలో పేగు కదిలింది అన్న పాదంలో నిర్దిష్టమైన పదవిరామం ముందు ఓకారం రావడం విషాదోద్దీపనం కోసమే. ఓకారం దగ్గర తగినంత విరామం ఇస్తూ చదివితే దుఃఖావేశం కలుగుతుంది. సంచరిస్తూసంచలిస్తూ - దిగులు పడుతూ దీనులౌతూ-చండచండం తీవ్రతీవ్రం - జ్వరం కాస్తే భయం వేసే ప్రలాపిస్తే - మబ్బు పట్టే గాలికొట్టే-వాన వస్తే వరద వస్తే చిమ్మచీకటి క్రమ్ముకొస్తే - తల్లడిల్లే కెళ్ళగిల్లే పల్లటిల్లే - తలచుకుంటూ కలత కంటూ వంటివన్నీ చదివినపుడు రసోద్దీపనం కలిగించే స్వరలయలే.

బాటలు నడచీ పేటలు కడచీ - ఎముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన - స్మరిస్తే పద్యం అరిస్తే వాద్యం - నేనొకదుర్గం నాదొక స్వర్గం - నిశీధాలూ విశీర్ణిల్లీ - నగ్నంగా నర్తిస్తున్నారు భయోద్విగ్నంగా వర్తిస్తున్నారు-ప్రదీప్తకీలాప్రవాళమాలా ప్రపంచవేలా - అంతరాళభయంకర ప్రాంతరాలనా - కుక్కపిల్లా అగ్గిపుల్లా సబ్బుబిళ్ళా - కలగావులగపు విలయావర్తపు బలవత్ ఝురవత్ పరివర్తన - హేలాల నన్నీ హాలాల దున్నీ - పరిక్లమిస్తూ పరిప్లవిస్తూ - కణకణమండే గలగలతొణకే-బాటలు తీస్తూ పాటలు వ్రాస్తూ - సమర్పణంగా సమర్చనంగా-త్రిలోకాలలో త్రికాలాలలో - జాలరిపగ్గం సాలెలమగ్గం-నావినుతించే నా విరుతించే నా వినిపించే నావిరచించే-క్షమిస్తావా సహిస్తావా - జీవఫలం చేదువిషం చేదువిషం చేదువిషం - జానిసలం గానుగలం పీనుగులం - బ్రతుకు ఛాయ చదువుమాయ కవితకరక్కాయ - నోరెత్తి హోరెత్తి - తొణకిన స్వప్నం తొలగిన స్వర్గం - దుర్హతి దుర్గతి దుర్మతి దుర్మృతి-వగదూరిన పొగచూరిన - బక్క

1 New Bearings in English Poetry : Quoted by F. R. Leavis 133 P.

చిక్కి బిక్కచచ్చి-నరనరాల వేదనలో తరతరాల రోదనలో - ఏళ్ళు బయళ్ళూ ఊళ్ళూ బీళ్ళూ-ఉడుతల్లారా బుడుతల్లారా - దేవుని గుడిలో బడిలో మడిలో - వలయములై చలించినపుడే విలయమై జ్వలించినపుడే - విషంక్రక్కే భుజంగాలో కదంత్రొక్కే తురంగాలో - సీగళ గళన్మంగళకళాకాహాళ - కలసిపోతిని కరగిపోతిని కానరాకే కదలిపోతిని - స్వర్గాలు కరిగించి స్వప్నాలు పగిలించి రగిలించి రక్తాలు-సాధుసత్త్వపు సోదరత్వపు స్వాదుతత్త్వం - జడలు విచ్చిన సుడులు రెచ్చిన కడలి నృత్యం - బ్రతుకుకాలి పనికిమాలి - కూడులేని గూడులేని - పక్షులార భిక్షులార - మీ రక్తం కలగి కలగి మీ నాడులు కదలి కదలి మీ ప్రేవులు కనలి కనలి - ఓ వ్యథానివిష్టులార ఓ కథావశిష్టులార - భ్రష్టులార బాధాసర్పదష్టులార - మొయిల్దారిని బయలుదేరిన - సింహాచలం కదిలింది హిమాచలం కరిగింది వింధ్యాచలం పగిలింది - చూర్ణమాన ఘూర్ణమాన దీర్ణమాన గిరిశిఖరాల్ - వడలో కడు జడిలో పెను చలిలో - మీబాధలు మీ గాధలు-నిటాలాక్షి పగిలిందట నిటాలాగ్ని రగిలిందట - నిటాలాగ్ని నిటాలాక్షి నిటాలార్చి - హింసనచణ ధ్వంసరచన ధ్వంసనచణహింసరచన - హాలాహలం పొగచూరింది కోలాహలం చెలరేగింది - ఇది సవనం ఇది సమరం - ద్రోహాలను తూలగొట్టి దోషాలను తుడిచిపెట్టి - ఈ స్వప్నం నిజమవుతుంది ఈ స్వర్గం ఋజువవుతుంది మొదలైనవన్నీ లయకోసం చేసిన గారడీలే అయినా అవన్నీ భావాన్ని పెడదారి పట్టించకపోవడంలోనే శ్రీశ్రీ సామర్థ్యం వేయిరేకుల వికసించింది. పాడేదీ పాడించేదీ నవకవనానికి కావాలని ఊరికే చెప్పలేదు శ్రీశ్రీ. లయ, శబ్దమూ ఆవేశమూ ఆలోచన పెనవేసుకున్నాయి శ్రీశ్రీ కవిత్వంలో. (చూ. ఒక క్షణంలో సమీక్షలో లయప్రాస వైవిధ్యం.)

59/ఐ

# అనర్గళం అనితరసాధ్యం నా మార్గం !

1934 జూన్ 1

కవి తనను గురించి తానే 'నేను, నా' అనే ధోరణిలో చెప్పుకోవడానికి కారణం వ్యక్తిగతంగా తనకు కలుగుతున్న అనుభూతులూ ఆవేశాలూ ఆశనిరాశలూ కవిత్వరూపంలో వ్యక్తం చేసి మొదట తాను ఆనందం పొందాలనే కాంక్షయే. ఈ అభివ్యక్తివల్ల సమానధర్ములైన సహృదయవ్యక్తులుకూడా ఆనందం పొందితే అతని కవిత్వపరమార్థం నెరవేరినట్లే. తెలుగులో వచ్చిన భావకవిత్వానికి ప్రయోజనం ఇంతవరకే.

నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధురసుషమాసుధాగానమంజువాటి !
ఏనొక వియోగగీతిక !
నేను నిదురవెన్నెలలదారి నొకరేయి వెడలిపోతి
నొక విపంచి విరహాకంఠమొరసిమొగసి
ఏనొకవియోగశాలిసీహృదయరాగ వేదనారేఖ
నాకలికి వేగు నామె యంగుళీకిసలయచంచలాంచలముల
విడివడి యనంతవిశ్వానఁ బడితి నాడు !
అదియె మొదలేను సకలదిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తి పోవ !
ఆసమయ మాదిగా
నప్సరోంగనానురాగవీథుల
కిన్నరీరమ్యకంఠసీమలో
శ్రావణాంబుదాశ్లేషపాళి
తారకాలోకపంక్తుల
మారుతోరుపక్షముల
తిరుగాడుదు పవలురేలు
కన్నుమోడుపు, మెయివాల్పుగాని లేక,

ఇది ముగియబోని ఏయర్థమెఱుఁగరాని
వేసటే లేని వెఱ్ఱియన్వేషణమ్ము!
ఈ ప్రవాసయాత్రారతి
నిటులె నేను కదలిపోవుదు నాశావకాశములను
ఒక్క నిట్టూర్పువోలిక
ఒక్క మౌన బాష్పకణ మటు
ఒక గాఢ వాంఛ పగిది.1

ఈ గీతంలో కృష్ణశాస్త్రిగారు తన సంగీతానుభవం, తాను వదలిపెట్టిన గంధర్వలోకాలకు తిరిగి పోవాలనే ఆశ, అది సాధ్యంకానందువల్ల కలిగిన నిరాశ వ్యక్తంచేసుకుని ఆవేదనావిమోచనంతో ఆనందం పొందారు. తానూహించుకున్న సౌందర్యసీమనుంచి ఈ లోకానికి జారిపడి ప్రవాస మనుభవిస్తున్నట్లు భావించుకున్నారు. ఈ అనుభవం అంతా కృష్ణశాస్త్రిగారి వ్యక్తిగతమే.

### శ్రీశ్రీ ప్రాపంచికదృష్టి

భావకవిత్వపునమూనాలతోనే రాసినా తొలిదశలోనే శ్రీశ్రీ అన్యుల అనుభవాలను తనలో ఆరోపించుకోవడం కనిపించింది.

దివ్యతేజస్సముజ్జ్వల త్రిభువనాంతరాళతలమె మదీయనాట్యాలయమ్ము
నా ప్రళయతాండవమున జీవప్రకాండ హృదయతంత్రులె నినదించు నుదితగీతి
నా కనులబొల్చు సుప్రసన్న ప్రశాంత హాసకాంతులె కురియించు నగ్నివృష్టి
నా గళమునందు మేఘగర్జాగభీరభయదనిర్ఘోషములు వినంబడుచునుండు
నా గతులయందు చరమసంధ్యాప్రదీప్త శోణవర్ణాభరక్తరోచులు స్ఫురించు
నా ప్రభావ ప్రతాప విన్యాసగరిమ సర్వలోకైక చండశాసనచణమ్ము
నా మహాద్భుతశక్తి నింతగ నెఱింగి తావకస్వార్థదుర్గుణధ్వాంతపటలిఁ
దొలఁగఁద్రోయుచు నిఁకనైనఁ దెలివి గనుము.2

ఈ గీతంలోని 'నేను' శ్రీశ్రీ అనే వ్యక్తి కాడు. మృత్యువు మాటాడే మాటల్ని ఉత్తమపురుషలో శ్రీశ్రీ వ్యక్తంచేశాడు. ఇలా చెప్పడానికి కవి తన ఆవేశంతోపాటు ఆలోచనను కూడా వాడు కోవాలి. కాల్పనికతతోపాటు వాస్తవికతను కూడా గుర్తించాలి. కృష్ణశాస్త్రిలోని వ్యక్తి ప్రాధాన్యం నేను, నా అనిపించగా శ్రీశ్రీలోని ప్రాపంచికదృష్టి నేను, నా అనిపించింది. కృష్ణశాస్త్రి

---

1 ప్రవాసము

2 మృత్యుప్రబోధము-ప్రభవ.

తననుంచి ప్రపంచంలోకి వెడితే శ్రీశ్రీ ప్రపంచాన్నే తనలోకి తీసుకున్నాడు. మహాప్రస్థానగీతాలు మొదలుపెడుతూ 'నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను' అన్నప్పుడు 'నేను' లోని శ్రీశ్రీ శ్రామికప్రతినిధిగా మారిపోవడం గమనించే ఉన్నాం. అలౌకికానుభవాలు కలగక దుఃఖించేవాడు భావకవి అయితే లౌకికసుఖాల లేమివల్ల దుఃఖం అనుభవించేవాడు అభ్యుదయకవి. 'గగనమంతానిండి పొగలాగుక్రమ్మి బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టునన్ను' అంటూ 'ఒకరాత్రి' దుఃఖించిన శ్రీశ్రీ, సమాజంలోని భౌతికసమస్యలకు గురిఅయిన వ్యక్తికి ప్రతినిధియే. ఈ సమాజస్పృహాయే శ్రీశ్రీ, ఎక్కడ 'నేను' అంటూ కవిత్వం రాసినా గోచరిస్తూ ఉంటుంది. గతంలోని సమాజవ్యవస్థను అవగాహనచేసుకుని వర్తమాన సమాజవ్యవస్థనుంచి భవిష్యత్ సమాజవ్యవస్థలోకి పురోగమనం సాగించే సామాజికవ్యక్తిని శ్రీశ్రీలోని 'నేను' సూచిస్తుంది.

'ఐ' అనే గీతంలో శ్రీశ్రీ చెప్పిన 'నేను' వేదకాలంనాటి ఆదిమకుటుంబవ్యవస్థలో-మధ్యయుగంనాటి ఫ్యూడల్‌వ్యవస్థలో-ఆధునికయుగంలోని బూర్జువావ్యవస్థలో-కావ్యస్రష్ట అయిన కవికి ప్రతినిధి. వివిధసామాజికవ్యవస్థలలో 'కవి' తన బాధ్యతనూ శిల్పాన్నీ విస్తరించుకుంటూ పురోగమించాడు. అతని ప్రయోగాలు భవిష్యత్తులో సంప్రదాయాలుగా మారుతూ ఆసంప్రదాయాలమీద తిరుగుబాటు జరిగి కొత్తప్రయోగాలు జరిగినప్పుడల్లా కవితాయుగాలు మారిపోయాయి. ఒక సంప్రదాయంమీద తిరుగుబాటు జరిపే కవి ఆ సంప్రదాయాన్ని క్షుణ్ణంగా తెలుసుకోక తప్పదు. తొలినాటి వేదమంత్రాల సంప్రదాయం తెలిసిన కవులే రసవత్తరమైన ఊహలతో నాటకంవంటి ప్రక్రియను సృష్టించి విచిత్రలోకాలనూ శ్లోకాలనూ రచించారు. వీటి సౌందర్యం తెలుసుకున్నవాడే వాస్తవప్రపంచాన్ని మార్చడానికి కవిత్వాన్ని అంకితంచేశాడు. నిజానికి ఈ మూడుయుగాల్లోనూ ఉన్న కవి సామాజికాభ్యుదయాన్ని కోరుతున్నవాడే. అప్పటి సమాజం ఉన్న దశను బట్టి అతడు కోరే అభ్యుదయం భిన్నస్థాయుల్లో ఉంటుంది.

ప్రపంచాగ్నికి సమిధ నాహుతిచ్చాననీ విశ్వవృష్టికి అశ్రువు ధారవోశాననీ భువనఘోషకు వెర్రిగొంతుక విచ్చిమోశాననీ చెప్పుకున్న శ్రీశ్రీ, వేదకాలంనాటి సమాజాన్ని స్మరించాడు. అందుకే భూతాన్ని యజ్ఞోపవీతాన్ని వైప్లవ్యగీతాన్ని అన్నాడు. భూతం, యజ్ఞోపవీతం అనే మాటలతో తిరిగి వర్ణాశ్రమ ధర్మాలను గుర్తుకు తెస్తున్నాడా అని సందేహించినవారు ప్రశ్నించగా శ్రీశ్రీయే భూతం స్పిరిట్‌కూ యజ్ఞోపవీతం పవిత్రతకూ సంకేతాలుగా గ్రహించానని చెప్పుకున్నాడొకచోట.[3] మానవుడికి సమస్తచైతన్యాన్నీ కలిగిస్తున్న పదార్థమే భూతం. వస్తుగతవాస్తవికతే మానవుడికి కలుగుతున్న మనోభావాలకు మూలం అన్న భౌతికవాదమే శ్రీశ్రీ తాను భూతాన్ని

---

3 సృజన 14 పే. 114.

(matter) అని చెప్పుకోడానికి ప్రేరణ. మన భావాలకన్న భౌతికప్రపంచమే ముందున్నది కనుక భూతంతోనే గీతాన్ని మొదలుపెట్టాడు శ్రీశ్రీ. కర్మకరణయోగ్యతనీ అధ్యయనార్హతనీ ఆలోచనావికాసాన్నీ చిహ్నించే యజ్ఞోపవీతం పవిత్రతకేకాక జ్ఞానానికీ ప్రతీకే. శ్రీశ్రీ వంటి భౌతికవాది దృష్టిలో యథార్థ-వాస్తవిక జ్ఞానమే జ్ఞానంకానీ ఊహాజ్ఞానంకాదు ఇది అంధవిశ్వాసాలకు అతీతమైనది.

ప్రాచీనపరిభాషలను నూతనచైతన్యసంకేతాలుగా వాడుకోవడం శ్రీశ్రీ ఒక 'టెక్నిక్'గా భావించడంవల్లనే యజ్ఞోపవీతం, ఋక్కులు, మహాప్రస్థానం, జ్వాలాతోరణం, ఆకాశదీపంవంటి పరిభాషలను వాడాడు.

వేదకాలపువాఙ్మయమంతా ఛందోవిశిష్టమైన గీతమే కానీ వచనం కాదు. వేదంలోని బావాలన్నీ 'భువనఘోషకు వెర్రిగొంతుకలే' కానీ ఉబుసుపోకకు విలాసంగా ఆలాపించినవికావు. ఆనాడే మొదలయింది విప్లవగీతం. అయితే అది భౌతికవిప్లవం కాకపోవచ్చు. తమస్సునుంచి జ్యోతిస్సుకు పోవడమే ఆనాటి భావవిప్లవం. ఆనాటి సమాజం సమష్టికుటుంబవ్యవస్థే కనుక ఆ సమస్యలు వేరు.

'విస్మృతానేకచరితగతపురాతనసమయభారతధరిత్రి'ని బావస్వప్నంలో దర్శించి 'ఋష్యాశ్రమమనోజ్ఞదివిజసదనాలనూ మౌనిప్రకాండులనూ దిక్కటాహములు నిండిన ఋగ్వేదమంజురవళులనూ కనివిని ఆనందించిన శ్రీశ్రీ ఆ సంస్కారాన్నే కావ్యసామగ్రిగా మల్చుకున్నాడు 4 ఆదినాకరవేదవేద్యుడు, భావవేదముల జీవనాదములు, ప్రపంచాగ్నికి సమిధల ఆహుతి వంటివన్నీ ఆ సంస్కారపు ప్రతిబింబాలైన పదచిత్రాలే.

నేను భూతాన్ని నేను యజ్ఞోపవీతాన్ని నేను వైప్లవ్యగీతాన్ని అంటూ విజృంభించిన శ్రీశ్రీ, నేను స్మరిస్తే పద్యం నేను అరిస్తే వాద్యం నేను అనలవేదికముందు అస్రనైవేద్యం అని చెప్పుకోవడంలో గాంభీర్యం ఉంది. భారతీయుడు చరిత్రకందిన కాలంనుంచీ సృష్టిస్తూవస్తున్న వాఙ్మయంలో క్రమంగా శ్రుతులు, స్మృతులు, శాస్త్రాలు ఉన్నాయి కనుక 'స్మరిస్తే పద్యం' అన్న ఉద్ఘాటనలో శ్రుతులనుంచి స్మృతుల (ధర్మశాస్త్రాలు) వరకూ గీతంనుంచి పద్యంవరకూ పరిణతిచెందడం కనిపిస్తుంది. 'అరిస్తే వాద్యం' అన్నమాటలో వాచికంనుంచి వాద్యంలోకి పరిణామంచెందిన నాట్యసంగీతకళల ఆవిర్భావం స్ఫురిస్తుంది. ప్రకృతిశక్తుల వాస్తవాల నెరుగలేని కాలంలో ఏదో ఒక అజ్ఞేయశక్తి ఉందని ఊహించుతూ ఆ శక్తినే ఆరాధించే విధానంగా ఆగమాలను సృష్టించుకున్న భారతీయుడు అగ్నికుండాలలో రక్తనైవేద్యాలు సమర్పించాడు. ఈ

4 అహర్ముఖము - స్వర్గదేవతలు.

విధానం అప్పటికి విప్లవమే. ఇదే అనలవేదికముందు అస్త్రనైవేద్యం అయింది. మరోప్రపంచానికి సాగించే మహాప్రస్థానంలోకూడా దారిపొడుగునా గుండెనెత్తురులు తర్పణచేయడం తప్పదు. కణకణమండే త్రేతాగ్ని, హోమజ్వాలల భుగభుగలు ఆ మరోప్రపంచంలోనూ ఉన్నాయని శ్రీశ్రీ భావించాడు.

హరోంహరోం హరహరహరహరహర, తర్పణ, మరోప్రపంచపుత్రేతాగ్ని, కంచు నగారా, హోమజ్వాలలు, బలివితర్ది, స్వర్గనరకములు, వేదవేద్యుడు, హారతిపళ్ళెం, విశ్వరూప సాక్షాత్కారం, ప్రాచీనస్మృతులు, నిర్వికల్పసమాధి, నిర్వాణం, నాదబ్రహ్మం, ద్వంద్వాతీతం, దివ్యానుభవం, పరివ్రాజకుడు, మంత్రంగా ప్రయోగించడం, గీతం నైవేద్యం, ధర్మజలం, దీర్ఘశ్రుతి, కల్యాణం, సమర్చనం, సమర్పణం, త్రిలోకాలు, త్రికాలాలు, నిత్యమంగళం, స్వస్తివాక్యాలు, స్వర్ణవాద్యాలు, భావివేదముల జీవనాదములు, ప్రాణం, ప్రణవం, మాయ, అద్వైతం, సాంఘిక ధర్మం, ప్రస్థానం, మిథ్యావాది, వేదాంతి, యజ్ఞాశ్వం, బ్రహ్మాండగోళాలు, ఊర్ధ్వదృష్టి, తపస్వి, సవనరంగం, శనిదేవత, ఖండపరశుగళకపాలగణములు, జగన్నాథుడు, నటధూర్జటి, హాలాహలం, మొదలైన మహాప్రస్థానంలోని ఎంతోపదజాలం శ్రీశ్రీకి శ్రుతిస్మృతిశాస్త్రపురాణేతిహాసాదుల పరిచయాన్నీ భారతీయ సంస్కృతి పరిశీలననీ నిరూపిస్తుంది.

## శ్రీశ్రీ సంస్కృత నాటకాభిమానం

కవిత్వం రసప్రాధాన్యాన్ని పొందుతూ మహాశిల్పాన్ని సంతరించుకుని కాళిదాసభవభూతుల చేతులలో పరాకాష్ఠనొందిన కాలం మధ్యయుగం. శ్రీశ్రీ తనకు మధ్యయుగంలోని కవితో తాదాత్మ్యం భావించుకుంటూ తన మహోద్రేకాలు లోకాలనీ భవభూతిశ్లోకాలనీ పరమేష్ఠి జూకాలనీ చెప్పుకున్నాడు. తన ఊహ చాంపేయమాల అనీ రసరాజ్యడోల అనీ అన్నాడు. తన ఊళ కేదారగౌళ అనికూడా చెప్పాడు.

భవభూతి శ్లోకాలు అనేమాట సాహిత్యసంస్కారం గల పాఠకుడిలో భావోద్దీపనం కలిగించగల్గుతుంది. శృంగారరసానికి ప్రాధాన్యం ఇచ్చే భోగలాలసమనస్తత్త్వం మీద తిరుగుబాటు చేసి హృదయవాదియై ఏకోరసఃకరుణఏవ అంటూ శోకభావాన్ని మానవజీవితంలో గుర్తించి సమకాలికాభిరుచిని మార్చడానికి యత్నించిన భవభూతి, మధ్యయుగంలోని విప్లవకారుడుగా శ్రీశ్రీకి కనిపించాడు. ఈ శోకభావనే ఆదికవి వాల్మీకిని కదలించినా దానినొక రసంగా చూసి తన ఉత్తరరామచరితంలో లక్ష్యంగా చూపిన భవభూతి, శ్రీశ్రీకి ముందున్న భావకవులకు గురుప్రాయుడయ్యాడు. భావకవులు భవభూతిలాగే హృదయవాదులయ్యారు. శ్రీశ్రీ భౌతికవాది అయినా హృదయశూన్యుడు కాడు కనకనే 'శ్రీనివాసరావు చెబుతున్నది మా నిషాదలో ఉన్నది' అని ఒకచోట పేర్కొన్నాడు. అంతేకాదు; బాటసారి కథలోనూ భిక్షువర్షీయసి కథలోనూ

శ్రీశ్రీ హృదయమూ మేధా సమాంతరంగా పనిచేసి వ్యక్తిశోకాన్ని సామాజికశోకంగా మార్చి వేశాయి. అణగారిన ఆర్తులపట్లా బాధాసర్పదష్టులపట్లా శ్రీశ్రీ చూపించిన జాలి కేవలం మానవతాస్పందనతోకూడింది కనుక కరుణరసానికే ఒక నూతనత్వాన్ని కలిగించింది. ఈ జాలికి మరోవైపున పీడకులపట్ల ఆగ్రహం కూడా ఉంది. కరుణరసమూ వీరరసమూ శ్రీశ్రీ కవిత్వానికి రెండు కొసలయ్యాయి. ఈ రెండు రసాలనూ భవభూతి కూడా అభిమానించాడు.

అయం శైలాఘాతక్షుభితబడబావక్త్రహుతభుక్
ప్రచండక్రోధార్చిర్నిచయకబలత్వం వ్రజతు మే
సమంతాదుత్సర్పద్ఘన తుముల సేనాకలకలః
పయోరాశేరోఘః ప్రళయపవనాస్ఫాలిత ఇవ.5

అన్నప్పుడు లవుని క్రోధావతారం స్పష్టమవుతుంది. ఇలాంటి క్రోధాన్నే శ్రీశ్రీ జగన్నాథుని రథచక్రాలులోనూ ప్రతిజ్ఞలోనూ చూపించాడు.

సాంప్రదాయిక సంస్కృతసాహిత్యాధ్యయనంలో భవభూతి ఉత్తరరామచరితకు తెలుగు దేశంలో అద్వితీయస్థానం ఉంటూవచ్చింది. భవభూతి ప్రణయతత్త్వం అమలిన శృంగారసిద్ధాంతానికి మార్గదర్శకమైనవాటిలో ఒకటి. కిమపి కిమపి మందం - వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా - మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని - ఇయం గేహే లక్ష్మీరియ మమృతవర్తి ర్నయనయోః - అద్వైతం సుఖదుఃఖయో రనుగతం - వజ్రాదపి కఠోరాని - త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం - ఏకో రసః కరుణ ఏవ - వ్యతిషజతిపదార్థానాంతరః కోపి హేతుః - వంటి శ్లోకాలను తరచుగా పండితకవుల, భావుకుల నోట వినవచ్చు. జ్ఞాపకానికి నిలిచే గుణమేగాక, హృదయాన్ని ఊపే గుణం కూడా భవభూతి శ్లోకాలకు ఉంది. ఈ గుణాలను శ్రీశ్రీ తన మహాప్రస్థానంగీతాలలోకూడా చవిచూపించాడు. నిజంగానే నిఖిలలోకం నిండుహర్షం వహిస్తుందా? నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను వంటి గీతాలను భవభూతి శ్లోకాల గమనాలతో పోల్చి చూడవచ్చును.

సంస్కృతం తాను చదువుకోలేదని శ్రీశ్రీ చెప్పినా సంస్కృతసాహిత్యంలో శ్రీశ్రీకి ప్రవేశం ఉందనడానికే సాక్ష్యా లెక్కువ. భవభూతిశ్లోకాలనే కాదు; జయదేవుడి గీతాల్నీ కాళిదాసు కవిత్వాన్నీ శూద్రకుడి మృచ్ఛకటికాన్నీ శంకరుల శ్లోకాల్నీ శ్రీశ్రీ తెగమెచ్చుకున్న సందర్భాలున్నాయి. సంస్కృతశ్లోకాలలోని పదవిరతిని (యతిమైత్రికి బదులు) తన గీతాలలోకి అనువ

5 ఉత్తరరామచరిత నాటకమ్; పంచమాంకం

క్త్రింపజేసుకోవడంగానీ సంస్కృతశ్లోకాల గమనాన్ని తన గీతాలకు తీసుకురావడంగానీ శ్రీశ్రీకి సంస్కృత సాహిత్యపరిచయం లేకుంటే జరిగేది కాదు.

### శ్రీశ్రీ ఉదాత్తాభిరుచులు

తన మహోద్రేకాలు పరమేష్ఠిజూకాలన్న భావాన్ని గురించి సమాలోచించడం అవసరమే. వాఙ్మయాధిదేవతకు భర్తయై నాలుగువేదాలే ముఖాలుగా గల బ్రహ్మదేవుడి శ్రవణాలంకారాలయ్యే మహోద్రేకాలు ఛందోమయాలుగానే ఉంటాయనే భావనే ఈ భావానికి మూలం. మనుచరిత్రలో బ్రహ్మదేవుడి రూపాన్ని వర్ణిస్తూ

నాలుగుమోములన్ నిగమనాదము లుప్పతిలన్
ప్రచండవాతూలహతిన్ జనించు రొదతోడి
గుహావళి నొప్పు మేరువున్ బోలి
పయోజపీఠి మునిముఖ్యులు గొల్వగ
వాణిగూడి పేరోలగమున్న ధాత
విభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్

అంటాడు పెద్దన. పరమేష్ఠిని పండితుడికి ప్రతీకగా తీసుకుని తన కవిత్వం పండితులు విఎదగిందని సూచిస్తున్నాడు శ్రీశ్రీ. అంతేగాక తన మహోద్రేకాలు లోకాలే అనడం ద్వారా పామరులూ దాన్ని మెచ్చుకుంటారనే ఒక అభిప్రాయాన్ని వ్యక్తంచేశాడు. ఏకకాలంలోనే పండితపామరులుభయులినీ రంజింపజేసేదే గొప్పకవిత్వం అంటూ కంఠోక్తిగానే శ్రీశ్రీ చెప్పకున్నా డొకచోట. మహాప్రస్థానగీతాలస్థాయిని అలాగే నిలబెట్టుకుంటూ రచించాడు శ్రీశ్రీ.

తన ఊహ సంపెంగ పూలదండ అనడం ఆ ఊహల పరిమళగుణాన్ని స్ఫురింపజేయడానికే. మధ్యయుగాల కవుల ఊహలు భౌతికసుఖాలవల్ల సంతృప్తిపొందిన జీవితంనుంచి పొటమరించినవే కనుక పరిమళవంతంగానే ఉండేవి. కాని మహాప్రస్థానంలో శ్రీశ్రీ ఊహలు చాంపేయాలు కావు. పీడితజనజీవితంలోని ఊహలు ఆకలినిగురించీ విప్లవం గురించీనే. కాళిదాసకవిత్వంలో శ్రీనాథవాణిలో పెద్దన బాణిలో కృష్ణశాస్త్రి కలంలో ఉన్న పరిమళాలు శ్రీశ్రీలో ఉండేందుకు వీలూ లేదు; అవసరమూ లేదు.

తవ ఊహ రసరాజ్యడోల అనే మాటకూడా శ్రీశ్రీకి అన్వయించేది కాదు; ఇది మధ్యయుగకవికే బాగా సరిపోతుంది శృంగారాన్ని రసరాజంగా భావించి, ఆ రసాన్ని పరిపాలించిన కవులే రసరాట్టులుగా వారి ఊహలే రసరాజ్యడోలలుగా పరిగణింపబడ్డాయి–రాచరికంవారి అభిరుచికోసం కవిత్వం రచింపబడిన యుగంలో. 'నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడె మాత్మకింపయిన భోజనమూ యొల మంచమొప్పు తప్పరయు రసజ్ఞు లూహ

తెలియంగల లేఖక పాఠకోత్తముల్ దొరకినగాక యూరక కృతుల్ రచియించుటన్న శక్యమే' అని సవాలు పలికిన పెద్దన ఊహ రసరాజ్యడోలయే. తెలుగు కవిత్వంలో పెద్దనగారిది మధ్య యుగమే. రసానందాన్నే ప్రయోజనంగా భావించిన శుద్ధ కళావాదంనుంచి సమాజాభ్యుదయమే కావ్యప్రయోజనంగా భావించిన సోషలిస్టు కళావాదంలోకి పురోగమించిన శ్రీశ్రీ. రసాన్ని ఒక కావ్యావసరంగానే భావించాడు కానీ అదే కావ్యప్రాణం అనుకోలేదు. కానీవోయ్ రసనిర్దేశం దొరకదటోయ్ శోభాలేశం' అన్నపుడు ఈ రసం పీడితజనచైతన్యంకోసం ఉద్దిష్టమైనదే. పరిపాలకుల రసాలు మధురమైనవయితే పరిపాలితుల రసాలు ఉద్ధతమైనవి.

తన ఊళ కేదారగౌళ ఎలాగవుతుంది? ఇది స్వవచోవ్యాఘాతంలా లేదా? భయంకరంగానూ వికృతంగానూ ఉండే 'ఊళ' భయానక రౌద్ర బీభత్సరసాలకు సంకేతమై పర్యవసానంలో జగత్కళ్యాణాన్ని సాధించే కేదారగౌళ రాగంగా మారుతుందనా దీని అర్థం?' 'ఊళ కేదారగౌళ' అనే మాటను మధ్యయుగకవికి అనువర్తింపజేయడం క్లిష్టమే. ఈ మాట శ్రీశ్రీకే బాగా వర్తిస్తుంది. అనాథులంతా అభాగ్యులంతా పూరించే విప్లవశంఖం శ్రీమంతులపాలిటి ఊళయే అయినా సమసమాజానికి అది కేదారగౌళగా మారుతుంది.

## శ్రీశ్రీ ప్రకృతి ప్రతీకల తత్త్వం

కొండలు, సముద్రాలు, అశోకపుష్పగుచ్ఛాలు, సెలయేళ్ళు తన సోదరులే అన గలిగినవాడు స్థూలంగా ప్రకృతిసౌందర్యంలో లీనమైపోదలచిన భావకవియే కావచ్చు. ఆకులో ఆకుగా పూవులో పూవుగా కొమ్మలో కొమ్మగా మారిపోవాలనీ జలజలని పారే సెలపాటలో తేటగా అయిపోవాలనీ నీలగిరినెక్కాలనీ భావిస్తూనే భావకవి ఆవిర్భవించాడు. భావకవి వాడుకున్న కొండలు, సముద్రాలు, అడవులు, సెలయేళ్ళు శ్రీశ్రీకి చైతన్యమయాలుగా కనిపించాయి. వాటిని ప్రతీకలుగా వాడాడు. గిరులు, సాగరులు, మంజరులు, ఝరులు పురుషరూపాలెత్తాయి. వీరంతా తన సోదరు లయినపుడు వీరి గుణాలే తనలోనూ ఉన్నాయనేసూచన ఇచ్చాడు. దృఢత్వానికీ నిశ్చలత్వానికీ ఔన్నత్యానికీ గిరులూ అనంతత్వానికీ అగాధత్వానికీ సంపూర్ణత్వానికీ సాగరులూ వసంతనూతనత్వానికీ ఎర్రదనానికీ విప్లవానికీ కంకేళికామంజరులూ ప్రవాహశీలత్వానికీ ఉపకారగుణానికీ జీవనప్రదత్వానికీ ఝరులూ ప్రతీకలయిపోయాయి. భావకవిత్వంలో లేని ప్రతీకత్వాన్ని శ్రీశ్రీ కల్పించుకుని తన మహాప్రస్థానగీతాలలో వాడుకున్నాడు.

> పక్షినయ్యెద చిన్ని ఋక్షమయ్యెదను/మధుపమయ్యెద చందమామనయ్యెదను
> మేఘమయ్యెద వింతమెఱుపునయ్యెదను/అలరునయ్యెద చిగురాకునయ్యెదను
> పాటనయ్యెద కొండవాగునయ్యెదను/పవనమయ్యెద వార్ధిభంగమయ్యెదను[6]

అన్న కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానానికీ

---

6 కృష్ణపక్షము.

గిరులు సాగరులు కంకేళికామంజరులు / ఝరులు నా సోదరులు

అన్న శ్రీశ్రీ నిజస్వరూపావిష్కారానికీ తారతమ్యం పురోగమనానికి సంబంధించినది. శ్రీశ్రీ 'గిరులు' ఎగిరి ఎగిరి ఎగిరిపడే ఎనభైలక్షల మేరువులు; కదిలే సింహాచలాలు, కరిగే హిమాచలాలు, పగిలే వింధ్యాచలాలు. అతని సాగరులు జలప్రళయ నాట్యం చేస్తాయి. పొంగెత్తి పొంగుతాయి. తరంగాలతో మ్రోగుతాయి. నోరెత్తి హోరెత్తి నొగులుతాయి. అనురాగపు టంచులలో ఆనందమై పొంగుతాయి. జడలు విప్పుకుని, నుడులు రేపుకుని నృత్యంచేస్తాయి. కార్మికులు, కర్షకులు, తాడితులు, పీడితులు కెరటాలుగా పొంగి తిరగబడతాయి.

## శ్రీశ్రీ ప్రగల్భాలు

తానే ఒక దుర్గం అనీ తనది ఒక స్వర్గం అనీ చెప్పుకోగలిగిన కవి పూర్తిగా శ్రీశ్రీయే. ఎవ్వని మొంతురో నన్ను ఏననంత శోకభీకరతిమిర లోకైకపతిని అని చెప్పుకున్న భావకవిని స్మరింపజేసే ఈ మాటల్లో శ్రీశ్రీ తన నూతనత్వాన్ని బాగా స్ఫురింపజేశాడు. తన శక్తిమీద తనకున్న విశ్వాసాన్ని ప్రతిధ్వనించేంత వరకే దుర్గం అనే మాట పనికివస్తుంది. వర్గాలులేని మరో ప్రపంచాన్నే స్వర్గం అన్నాడు. పీడితవర్గప్రయోజనం కోసం కవిత్వం రాసే కవి తానొక 'దుర్గం' కాకూడదు. అందరూ ప్రవేశించకుండా హద్దులు గల కోటగా కవిత్వం అయిపోకూడదనే కదా శ్రీశ్రీ ఆశ. మరి ఈ దుర్గం అని చెప్పుకోవడం ప్రగల్భం మాత్రమే అని శ్రీశ్రీ కూడా గ్రహించి ఒప్పుకున్నాడొకచోట. దుర్గప్రాయమైన భావాలు శ్రీశ్రీ కవిత్వంలో కూడా ఉండటం వల్ల ఈ మాట సార్థకమే.

తన మార్గం అనర్గళం అనీ అనితరసాధ్యం అనీ శ్రీశ్రీ చెప్పుకోవడంలో కూడా ఆత్మ విశ్వాసాతిశయం ఉంది. గర్వరేఖ కూడా ఉంది. శ్రీనాథుడు, పెద్దన, తెనాలి రామకృష్ణుడు తమ కవిత్వాన్ని గురించి కృతిపతులమాటల్లో తామే చెప్పుకున్నారు. ఆ మాటలు అతిశయోక్తులు కావని తమ కవితావైభవప్రదర్శనంద్వారా నిరూపించుకున్నారు. శ్రీశ్రీ ఆవిధంగా మరొకరిమాటల్లోకాకుండా తనమాటల్లోనే తన కవిత్వాన్ని గురించి చెప్పుకుని వాటిని రుజువు చేసుకున్నాడు. శ్రీశ్రీ మార్గం అనర్గళం అనేది తిరుగులేని మాటే. అనితరసాధ్యం అనేది నిత్య ప్రవర్ధమానమయ్యే కావ్యకళవిషయంలో సాధ్యం కానిది. 'పేరడీలు' చేయగల జరుక్‌శాస్త్రి, మాచిరాజు దేవీప్రసాద్‌వంటి వారికి శ్రీశ్రీ మార్గం సుసాధ్యమే అయింది. కవిత్వంద్వారా సామాజికవిప్లవం కోరే శ్రీశ్రీవంటి కవి తన మార్గం అనితరసాధ్యంగా ఉండాలని అనుకోవడానికి వీలులేదు. తన మార్గాన్ని ఎందరో అనుసరిస్తేనే తన ఆశయం సఫలీకృతం అవుతుంది. అయితే ఎందరో అనుసరించారు కానీ శ్రీశ్రీ మార్గాన్ని సాధించుకోలేకపోయారంటే శ్రీశ్రీకి ఉన్న ప్రతిభా భ్యాసవ్యుత్పత్తులు వాల్మీకినుంచి తన దాకా అనుస్యూతంగా వస్తున్నవాటి వారసత్వంవల్ల

సంక్రమించినవి కావడమే కారణం. శ్రీశ్రీ కవిత్వం పెక్కుమార్గాల సమ్మేళనంవల్ల రూపొందింపబడిన స్వతంత్రమార్గమే కానీ దేనికీ ప్రతిధ్వనికాదు. అందుకే అనితరసాధ్యం అవుతోంది. చిరదీక్షాశిక్షాతపస్సమీక్షణలో నిశ్చలసమాధిలో సర్గద్వారపుతోరణంగా తన మస్తిష్కాన్ని వ్రేలాడదీసుకున్న శ్రీశ్రీ కవిత్వం అనితరసాధ్యంగానే ఉండటానికి కారణం అలాంటి తపస్సు మరొకరు చేయలేకపోవడంవల్లనే.

## శ్రీశ్రీకి తెలిసిన సంగీత సంప్రదాయాలు

శ్రీశ్రీ వ్యుత్పత్తిలో సంగీతశాస్త్ర సంప్రదాయపరిజ్ఞానం ఒకటి ప్రత్యేకంగా చెప్పుకోదగింది. నా ఊళ కేదారగౌళ - ప్రమాదవీణలు కమాచి పాడగ - విశ్వవీణకు తంత్రి - తెగిపోయిన విపంచికలు - ఝుంఝూనిలషడ్జధ్వానం - పాడేదీ పాడించేదీ - పలికించకు మౌనమృదంగాలను - ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగరావం - భయంకరబాధల పాటలపల్లవి - జలపాతాల పాటలు - సమ్ముగ్ధంగావించిన గాంధర్వం - తారానివహాపుప్రేమ సమాగమంలో జన్మించిన సంగీతం - నాడుల తీగలపై సాగిన నాదబ్రహ్మపుపరిచుంబన - నానాగానానూనస్వానం - బ్రదుకును ప్రచండభేరుండగరుత్పరిరంభంలో పట్టిన గానం- గుండెలలో ఘూర్ణిల్లే గీతం - పాడుకొనే మంత్రం - దీర్ఘ శ్రుతి, తీవ్రధ్వని - భావివేదముల జీవనాదములు - కూనిరాగం - హోరుగాలి ఉపశ్రుతి - ఆహ్వానగానం - తెగినతీగ - అపస్వరాలు - రాగమాలికల ప్రతిధ్వానులు - యుద్ధగుంజన్మృదంగాలు - మోహినీగంధర్వగానం - కాహళహళాహళి - విలయలయ - మొదలైన ప్రయోగాలలో శ్రీశ్రీకి తెలిసిన సంగీతపు లోతులు ప్రత్యక్షమయ్యాయి. సంగీతంతో ఇంత తాదాత్మ్యం పొందిన శ్రీశ్రీ, ఛందస్సులను సర్పపరిష్వంగాలుగా భావించి వాటిని వదలించుకుని విముక్తుడైనా ఛందస్సుల అశ్వహృదయాలెరిగినవాడు కనుక వాటిని లొంగించుకుని అనర్గళంగానూ అనితరసాధ్యంగానూ తన గీతాలను రచించగల్గాడు.

## శ్రీశ్రీకి తెలిసిన ఛందస్సంప్రదాయాలు

శ్రీశ్రీగారి ఛందశ్శాస్త్ర విశారదత్వం నూతనప్రయోగాలకు ఆయనను ఉన్ముఖుణ్ని చేసింది. ఛందస్సులను శ్రీశ్రీ తిరస్కరించాడనేకన్నా వాటిని సంస్కరించాడనడమే సమంజసం. ఆధునికత్వం ఆకాశంనుంచి ఊడిపడదు. మానవుడు కొత్త సంవిధానాలను నిర్మించే ప్రయత్నంలో పాతసంవిధానాలను పరిశీలించి వాటినే నవీనావసరాలకు తగినట్లుగా మార్చుకుంటాడు. ఈ మార్పులోనే పురోగమనం లభిస్తుంది. నన్నయ భారతంలోనే కనిపించే దండకం శ్రీనాథాదుల చేత కూడా ఆదరింపబడుతూనే వచ్చి భావకవితాయుగంలో అదృశ్యమై పోతే, దాని మేలి నడకను పునరుద్ధరించుకుని 'ఐ' లో చూపించాడు శ్రీశ్రీ. 'శ్రీకంఠలోకేశలోకోద్భవస్థాన సంహారకారీ పురారీ మురారి ప్రియా చంద్రధారీ' అంటూ తగణాల పరంపరతో పాద విభాగం లేకుండా

నడుస్తుంది నన్నయగారి దండకం. ఈ నడకనే 'భూతాన్ని యజ్ఞోపవీతాన్ని వైప్లవ్యగీతాన్ని' అనే పంక్తుల్లో చూపించిన శ్రీశ్రీ, పాదవిభజనను భావానుగుణంగానూ అనుప్రాసయుతంగానూ చేశాడు. ఐదుతగణాలను వరుసగా వాడిన శ్రీశ్రీ, మొదటిపాదంలో ఒక తగణాన్ని రెండో పాదంలో రెండు తగణాలనూ మూడో పాదంలో రెండుతగణాలమీద ఒక గలంను వేసి ఆరోహణ క్రమంలో ప్రయోగించాడు.

భూతాన్ని/యజ్ఞోపవీతాన్ని/వైప్లవ్యగీతాన్ని నేను!

దండకాల్లో పెక్కు నడకలను సాధించిన లాక్షణికులు యగణ, తగణ, రగణాలనే ప్రధానంగా స్వీకరించారు. తగణాన్ని తిరగవేస్తే వచ్చేది యగణం కనుక 'భూతాన్ని యజ్ఞోపవీతాన్ని వైప్లవ్య గీతాన్ని' అన్న వెంటనే ఆ నడకను తిరగవేసి 'స్మరిస్తే పద్యం అరిస్తే వాద్యం' అంటూ యగణం, గగం, యగణం, గగం ల విన్యాసంతో విచిత్రమైన లయను సాధించాడు.

లోకాలు । భవభూతి । శ్లోకాలు । పరమేష్ఠి । జూకాలు । నామహో । ద్రేకాలు।నాఊహ। చాంపేయి। మాల । రసరాజ్య।డోల । నా ఊళ। కేదార। గౌళ అనే పాదాల్లోని విచిత్రలయకు మూలం తగణాలనూ సలములనూ అధికసంఖ్యలో వాడటమే

'గిరులు। సా । గరులు । కం । కేళికా । మం । జరులు।ఝరులు । నా । సో । దరులు' అనే పంక్తుల నడకలోని కదం నగణాల బాహుళ్యం మీద ఆధారపడి ఏర్పడిందే.

ఒకే గణాన్ని పరిమిత స్థలంలో ఆవృత్తం చేయడం వల్ల వచ్చే పరుగు, పదును, ఆవేశం, ఆవేగం మహాప్రస్థానంలో పెక్కుచోట్ల కనిపిస్తాయి. కదం త్రొక్కుతూ పదం పాడుతూ హృదంతరాళం (లగం) ఎండ కాలం మండినప్పుడు గబ్బిలంవలె క్రాగి (గలం) పగళ్లన్నీ పగిలి పోయీ నిశీథాలూ విశీర్ణిల్లీ (గగం) ప్రదీప్త కీలా ప్రవాళమాలా ప్రపంచవేలా ప్రసార ములలో (జగణం) ఎగిరించకు లోహవిహంగాలను కదిలించకు సుప్తభుజంగాలను (సగణం) కుక్కపిల్లా అగ్గిపుల్లా సబ్బుబిళ్లా (గలం, గగం) ఇంకానేనేం విన్నానా (గురువులు) నానాగా నానూన స్వానావళితం (మగణం) నా విసరిన రసవిస్మృమరకుసుమపరాగం (నగణం) కమ్మరి కొలిమీ కుమ్మరిచక్రం జాలరిపగ్గం సాలెల మగ్గం (భగణం) లేదు సుఖం లేదురసం చేదువిషం జీవఫలం (గలం లగం) దారుణ మారణదానవభాషలు ఘోరవ భైరవభీకరఘోషలు (భగణం) సిందూరభస్మాలు మందారహారాలు (తగణం) వంటివెన్నో కనిపిస్తాయి.

అబ్బూరి రామకృష్ణారావు భుజంగప్రయాతం అనే చతుష్మాత్రను 6 పాదాలలోనూ 2 పాదాలలోనూ రాసి సంప్రదాయాన్ని స్వేచ్ఛగా వాడుకున్నారు.7 ఛందఃప్రస్తారంవల్ల పుట్టే అనేక వృత్తాలను నాలుగుపాదాలుగానే కాక రెండుపాదాలుగా కూడా రాయవచ్చునని గ్రహించిన శ్రీశ్రీ, మహాప్రస్థానగీతాలలో అలాంటి ద్విపాదివృత్తాలను గేయాలలో కలిపివేసి రాశాడు.

నేనొక దుర్గం
నాదొక స్వర్గం

ఈరెండు పాదాల్లోనూ భగగ అనే గణాలు నియతంగా వాడి ఆదిప్రాసకు బదులు అంత్యప్రాసను పాటించినట్లు స్పష్టమవుతుంది.

స్మరిస్తే పద్యం
అరిస్తే వాద్యం

ఇలాంటి సమద్విపాదులు మహాప్రస్థానంలో కొల్లలుగా కనిపిస్తాయి.

| | |
|---|---|
| పలికించకు మౌనమృదంగాలను<br>కెరలించకు శాంతతరంగాలను | సససభ |
| ఇలాతలంలో హేమంపిండగ<br>జగాని కంతా సౌఖ్యం నిండగ | జమతల |
| కార్మికలోకపు కల్యాణానికి<br>శ్రామికలోకపు సౌభాగ్యానికి | భభమలల |
| శ్రమైకజీవన సౌందర్యానికి<br>సమానమైనది లేనేలేదని | జభమలల |
| దారుణమారణదానవభాషలు<br>ఘోరవభైరవభీకరఘోషలు | భభభభ |
| నీ కంకణ నిక్వాణంలో<br>నా జీవన నిర్వాణంలో | తయగగ |
| హాసనానికి రాణివి నీవై<br>వ్యసనానికి బానిస నేనై | సససగ |
| విషం క్రక్కే భుజంగాలో<br>కదం త్రొక్కే తురంగాలో | యరగగ |
| నిటాలాక్షి పగిలిందట<br>నిటాలాగ్ని రగిలిందట | యనభ |

7 సాధుగీతి - వైతాళికులు.

వీటినన్నిటినీ ద్విపాదివృత్తాలకు లక్ష్యాలుగా స్వీకరించవచ్చు; కానీ శ్రీశ్రీ మాఱుమూల వృత్తాలకు లక్ష్యాలు తయారుచేయాలని కాక నూతనలయలను సృష్టించాలనే వీటిని రాశాడు. వృత్తౌచిత్యం దృష్టితో ప్రాచీనకవులు రచించిన అనేక వృత్తాలలోని ధారాశుద్ధి శ్రీశ్రీలో కూడా కనిపిస్తుంది.

(నన్నయ) స్నాతకుండును ఋత్విజుండును
సద్గురుండును నిష్టుడున్ (మత్తకోకిల)

(తిక్కన) ధనమంతయుం బొలియ దారుణంబుగా
తనయవ్రజంబు దెగ దైన్యమారగా (మంజుభాషిణి)

(శ్రీనాథుడు) కులప్రదీపా! యలఘుప్రతాపా!
విలాసశక్రా! జితవీరచక్రా! (ఉపేంద్రవజ్ర)

(తిమ్మన) త్వరితాధరితానిలవాజినట
త్ఖురజోదరజోభరగూఢరవి। స్ఫురణా... (తోటక)

(భట్టుమూర్తి) పరిచితకరహాటీ ప్రాప్తకర్పూరవీటీ
విరుతకటకలాటీ విశ్రుతస్వర్ణశాటీ (మాలిని)

ప్రాచీన కవులు ఆశ్వాసాంతాల్లో తప్పనిసరిగా ఒకటి రెండు కొత్తవృత్తాలను రాసినా అవన్నీ కృతిపతి సంబోధనాంతాలుగా ఉంటాయి. వాటి నడకలలోని వైచిత్రిని వ్యావహారిక భాషలోకి తెచ్చాడు శ్రీశ్రీ.

ప్రాకారములు దాటి ఆకాశములు తాకి లోకాలు ఘూకాల బాకాలతో నించి-

1934 జూన్ 1

ఎవరో కొందరు తప్ప ఆదికవి నన్నయనుంచి 19వ శతాబ్దాంతందాకా తెలుగుకవులు తమ కృతులను రాజులకే అంకితంచేశారంటే తెలుగు కవిత్వం ఫ్యూడల్ వ్యవస్థలో వర్ధిల్లుతూ రావడమే అందుకు కారణం. తమ కృతిపతుల ఘనతను వర్ణిస్తూ శృంగారవీరరసాలలో వారి నైపుణ్యాన్ని చాటారు కవులు. ఆ కృతిపతులు యుద్ధాలు చేసి పరరాజులను ఓడించినట్లు ఆ కృతుల అవతారికలలో వర్ణింపబడ్డారు. భారతకృతిపతి అయిన రాజరాజనరేంద్రుడు నిజభుజవిక్రమవిజితారాతి రాజనివహుడు! విశుద్ధయశశ్శరదిందుచంద్రికారాజితసర్వలోకుడు! అపరాజిత భూరిభుజాకృపాణధారాజలశాంతశాత్రవపరాగుడు! పరమండలంబుల ధరణీపతుల నదిమి కప్పంబుల ముదముతో గొనుచును బలిమినీయని భూమివలయపతుల నుక్కడగించుచు దిక్కులం దన యాజ్ఞ వెలిగిస్తూ ఉండేవాడు! మహేంద్రమహిమతో పరమానందంబున ననవరతమహామహీరాజ్యసుఖంబు లనుభవించుచు సకలభువనలక్ష్మీవిలాసనివాసంబయిన రమ్యహర్మ్యతలాలలో నివసిస్తూ ఉండేవాడు!

నిర్వచనోత్తరరామాయణావతారికలో తిక్కనగారు రఘువు దిగ్విజయయాత్ర చేశాడని వర్ణించారు. కరికాలచోళుడు జలధిపరమితోర్వీవలయంబు తనకు బంటుపోలముగ చేసుకున్నాడట! అతడు హేలాసాధ్యాఖిలదిఙ్ముఖుడట! తిక్కనృపతి ఆశామండలశాసనుండట! శైశవలీలనాడే పటుశౌర్యధురంధరబాహుడై పృథ్వీశనరేంద్రమస్తకము నేడ్తెర కందుకకేళి సల్పెడట! శ్రీనాథుడు ప్రెగ్గడను శుంభద్ద్విషన్నగరద్వారకవాటపాటనవిధానప్రౌఢబాహార్గళయుగళుండనీ ఆహవసవ్యసాచి అనీ పేర్కొన్నాడు. అల్లాడవిభుడ్ని రిపుహృద్భల్లాడంబరుడనీ భామలమనముల్ గొల్లాడగ మదనుడనీ స్తుతించాడు. పోలయయన్నశౌరిని ఆంధ్రభూమండలాధ్యక్షసింహాసనసంప్రతిష్ఠాచార్యుడని కొనియాడాడు. అరివేమటిలింగవిభుడ్ని నిష్ఠురాటోపవిస్ఫూర్తి నృహరికరణి నతికఠోర కుఠారధారాంచలమున వైరివక్షస్థలము వ్రచ్చివైవ నేర్చుసంగరార్జునుడని సంస్తుతించాడు. బెండపూడన్నయను పంచారామవధూటీ పంచాస్త్రవిహారకేళిపాంచాలుడని మెచ్చుకున్నాడు. పెద్దనగారు కృష్ణరాయలను రాజాధిరాజ వీరప్రతాప రాజపరమేశబిరుదవిభ్రాజి అన్నాడు. తిమ్మభూపతిని వనజేక్షణామనోధనపశ్యతోహరుడ మెచ్చుకున్నాడు. నరసభూపతిని హరిచందనమందారకుంద

చంద్రాంశువిభాస్పందయశస్తుందిలదిక్కుండరుడనీ అతిశితకృపాణకృత్తమత్తారి వీరమండలేశసకుండల మకుట నూత్నమస్తమాల్యపరంపరామండనార్చితేశ్వరుడనీ స్తుతించాడు. వీరనృసింహుడ్ని నిజ భుజదారుణకరవాలపరుషధారాహతవీరారి అన్నాడు. రామరాజభూషణుడు తిరుమలరాయల్ని ప్రచండరుచిపిచండల మార్తాండమండలపాండిత్యభూషితభుజార్గళనిరర్గళ ప్రతాపదీపితప్రకాశకాశికీభూతకదనభూతలభీతాభీతవిమతక్ష్మాధీశ్వరుడని సన్నుతించాడు. ఈ మహారాజులంతా రాజ్య విస్తరణకాంక్షతో దిగ్విజయాలుచేసి కొందరినైనా చంపినవారే. అది ఆనాటి రాజధర్మంగా భావించబడిందే.

బ్రిటిషువారి పరిపాలన వచ్చాకా శిక్షించే అధికారం వారి అధీనమైపోయింది. రాజులు జమీందారులయ్యారు. జమీందారులూ కృతిపతులైనా వారిని కవులు యుద్ధవిశారదులుగా వర్ణించలేదు. పిఠాపురం జమీందారుకు కృతినిచ్చిన కృష్ణశాస్త్రి ఆ జమీందారును తరుణ శృంగారమధురమాధవుడని స్తుతించారు. స్వచ్ఛకీర్తి అనీ మన'జ్ఞవసంతమూర్తి అనీ పేర్కొన్నారు. సూర్యారాయబహదూరు లలితసుమనోజ్ఞకావ్యసుమజాలలతాంతమాలికాభరణుడూ వినిర్మల విశేషసుగుణమాణిక్యదివ్యతేజోవిరాజుడూ దీనజనహృదయాంతరస్థిరవిహారుడూ మాత్రమే నట! రాజరాజనరేంద్రుడినుంచి సూర్యారావు బహదూరువరకూ గల రాజుల మనస్తత్వాలను కవుల వర్ణనలనుంచి కనిపెట్టగలిగినపుడు రాజవ్యవస్థ ఏవిధంగా పరిణామాలను పొంది క్షీణదశకు వచ్చిందో తెలుస్తుంది. రాజస్వామ్యం భూస్వామ్యం కాగా దాన్ని పడగొట్టి ధనస్వామ్యం అధికారంలోకి రావడాన్నే చారిత్రకభౌతికవాదంలో మార్క్సు ఎంగిల్సులు నిరూపించారు. దిగ్విజయ యాత్రచేసి కవులను ఆస్థానంలో ఉంచుకున్న రాయలకూ భోగాలనుమాత్రమే అనుభవిస్తూ కవిత్వాన్ని పోషించిన సూర్యారావుకూ ఉన్న తేడా సామాజిక వ్యవస్థపరిణామానికే సంబంధించి ఉంది. రాజ్యవిస్తరణకాంక్ష భూస్వామ్యంనుంచి ధనస్వామ్యానికి మారింది 20వ శతాబ్దంలోనే.

పైన నేనుచెప్పింది ఆంధ్రదేశంలోని ఫ్యూడల్‌వ్యవస్థాపరిణామాన్నే. ప్రపంచమంతటా ఇలాంటిపరిణామమే జరిగింది.

## శ్రీశ్రీ చారిత్రక భౌతికదృష్టి

భౌతికదృష్టితో దేశచరిత్రలను పరిశీలిస్తే 'పరపీడన' ప్రధానంగా కనిపిస్తుంది. రణరక్త ప్రవాహాలు ప్రతిదేశంలోనూ కనిపిస్తాయి. ఎవడు బలవంతుడైతే వాడిదే రాజ్యం. దుర్బలుడు సామంతుడవుతాడు; లేదా బానిసగా మారతాడు. మరొకడ్ని చంపగల్గడం హీనంగా పరిగణింప బడలేదు హంతకులే రాజులయ్యారు. కానీ రాజులను హంతకులుగా గాక ధర్మరక్షకులుగా కీర్తించారు కవులు, చారిత్రకులు. ఫ్యూడల్ వ్యవస్థలోని రాజుల సామ్రాజ్యవిస్తరణకాంక్షనే శ్రీశ్రీ 'దేశచరిత్రలు' అనే ఖండికలో విమర్శించాడు.

వైషమ్యం స్వార్థపరత్వం/కౌటిల్యం ఈర్ష్యలు స్పర్థలు
మాయలతో మారుపేర్లతో/చరిత్రగతి నిరూపించినవి!
జెంఘిజ్‌ఖాన్ తామర్లేనూ/నాదిర్షా ఘజ్నీ ఘోరీ
సికందరో ఎవడైతేనేం/ఒకొక్కడూ మహాహంతకుడు!
వైకింగులు శ్వేతహూణులూ/సిథియనులూ పారశీకులూ
పిండారులు థగ్గులు కట్టిరి/కాలానికి కత్తులవంతెన
అజ్ఞానపుటంధయుగంలో/ఆకలిలో ఆవేశంలో
తెలియని ఏ తీవ్రశక్తులో/నడిపిస్తే నడిచి మనుష్యులు
అంతా తమ ప్రయోజకత్వం/తామే భువి కధినాథులమని
స్థాపించిన సామ్రాజ్యాలూ/నిర్మించిన కృత్రిమచట్టాల్
ఇతరేతరశక్తులు లేస్తే/పడిపోయెను పేకమేడలై
పరస్పరం సంఘర్షించిన/శక్తులలో చరిత్రపుట్టెను!

ఈవిధంగా చారిత్రకయథార్థతత్త్వాన్ని పరిశీలించిన శ్రీశ్రీ తన చారిత్రకదృష్టిని మొట్టమొదటిసారి ప్రదర్శించిన ఖండిక 'ఆశాదూతలు'.

ఈ ఆశాదూతలు ఇరుగుపొరుగుదేశాలమీద దండెత్తిన సామాన్యరాజులు కాక, మానవకోటి సామ్రాజ్యదూతలు. వీరి పేర్లేవయితేనేం, వీరు నలుగురూ నాలుగు దిక్కులకూ సాగిపోయారు. రాజ్యాలు కదిపారు; రక్తాలు రగిలించారు; ప్రాకారాలు దాటారు; రాజసూయాలూ అశ్వమేధాలూ చేశారు. వీరి భోగైకజీవితదృక్పథమూ శృంగారలాలస విపరీతమైనవే. ప్రపంచంలో తామే బలవంతులు; తామే పెట్టి పుట్టినవారు. తామే పాలకులు. లోకాలు ఘూకాల బాకాలతోనిండినా వీరి కక్కరలేదు. వీరికి కావలసినవి సిందూరభస్మాలు, మందారహారాలు, సాంద్రచందనచర్చలూను. స్వర్గాలను కరిగించారు వీరు. స్వప్నాలను పగిలించారు. వీరి చేష్టలు జుగుప్సావహంగా ఉన్నాయని వీరికి తెలియదు. పాపాలు వండించారు వీరు. వాటిని వండించడానికి భావాలనే మండించారు. వాటిని మండించటానికి కొలిమినిప్పులు రువ్వారు. తమ ఘనకార్యాన్ని తలచుకుని విలయులయతో నవ్వారు. చివరికి వీరంతా గాలులై, కెరటాలై, పరిమళాలై పుష్పాలై కుంకుమలై పొగలై సాగిపోయారు.

'రణరంగం కానిచోటు భూస్థలమంతా వెదికిన దొరకదు; గతమంతా తడిసె రక్తమున కాకుంటే కన్నీళులతో' అని దేశచరిత్రలను వ్యాఖ్యానించిన శ్రీశ్రీ, సమ్రాట్టులూ సార్వభౌములూ తూర్పును జయించబోయినపుడు స్వర్గాలను కరిగించారనీ స్వప్నాలను పగిలించారనీ రక్తాలను రగిలించారనీ రాజ్యాలను కదిపారనీ చెప్పడంలో వాస్తవాలను వక్రోక్తులతో వ్యక్తం

చేశాడు. ఈ సామ్రాజ్యదూతలు చివరికి 'కళాయజ్ఞాశ్వముల్ గాలులై' సాగిపోయారంటే అశ్వమేధయజ్ఞాలు నిర్వహించి, తూర్పుదిక్కుగా స్వర్గానికి చేరుకున్నారని వ్యాజస్తుతియే.

దేశచరిత్రలన్నీ పరపీడనతో నిండి ఉన్నాయని గమనించిన శ్రీశ్రీ, అలాంటి పీడకులే పాపాలను వండించారన్నాడు. పరపీడనకన్నా పాపం ఏముంటుంది ? బీభత్సరసప్రధానంగా పిశాచగణ సమవాకారంగా దరిద్రులను కాల్చుకుతినడంగా నరజాతిచరిత్ర నంతటినీ దర్శించిన శ్రీశ్రీ, అలాంటి పిశాచగణాలుగా సామ్రాజ్యదూతలనే భావించాడు. అందుకే వారు పాపాలను వండించి భావాలను మండించి కొలిమినిప్పులు రువ్వి విలయులయ నవ్వినవారుగా దక్షిణదిక్కుకు కదిలిపోయినవారుగా కనిపించారు. ఆదర్శవాదులు పాపాలు చేసినవారికి రౌరవాదినరకాలు తప్పవంటే భౌతికవాది అయిన శ్రీశ్రీ సామ్రాజ్యవాదులే పాపాలుచేసి అలాంటి రౌరవాది నరకాలను సృష్టించారని ధ్వనింపించాడు. వైషమ్యం, స్వార్థపరత్వం, కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలూ ఈ సామ్రాజ్య దూతల భావాలే. ఈ భావాలనే వారు మండించుకున్నారు. అంతా తమ ప్రయోజకత్వం తామే భువి కధినాథులమని వీరు సామ్రాజ్యాలు స్థాపించారు. కానీ చివరికి వీరు కూడా తరగలై కరిగిపోయారు అలా కరిగిపోవడానికి కారణం ఇతరేతరశక్తులు విజృంభించడమే.

హిరణ్యనేత్రుడి పదాఘాతంతో లోకం ప్రతిధ్వనించిందనీ పీడకులు కాలానికి కత్తులవంతెన కట్టారనీ చల్లారిన సంసారాలూ అసహాయుల హాహాకారం చరిత్రలో మూలుగుతున్నాయనీ చాటిన శ్రీశ్రీ, కొందరు సామ్రాజ్యదూతలు ప్రాకారములు దాటి ఆకాశములు తాకి లోకాలు ఘూకాల బాకాలతో నించి ఉత్తరదిక్కుకు తావులై సాగిపోయారన్నాడు. ఉదీచికి సాగిపోయినవారు కుబేరతుల్యులే. వీరి దండయాత్రవల్ల లోకాలకు కలిగే దుఃఖాన్ని ఘూకాల బాకాలతో శ్రీశ్రీ సూచించాడు.

ప్రేమపురాణాలను సృష్టించుకున్నవారూ తాజమహాళ్ళను కట్టించినవారూ పల్లకీలెక్కి ఊరేగినవారూ ప్రభువులే. వీరే సిందూరభస్మాలనూ సాంద్రచందనాలనూ పూసుకుని మందార హారాలను ధరించి, భోగైకజీవితాలను గడిపివేశారు. ఇలాంటి సామ్రాజ్యదూతలు పడమటికి పుష్పాళ్ళు, కుంకుమలు, పొగలు అయి సాగిపోయారట ! పడమటికి పోయినవారంతా వరుణతుల్యులే. ఈవిధంగా తూర్పుకు పోయినవారిని ఇంద్రునితోనూ దక్షిణానికి పోయినవారిని యమునితోనూ ఉత్తరానికి పోయినవారిని కుబేరునితోనూ పడమటికి పోయినవారిని వరుణునితోనూ పోల్చుకోవడానికి ఆశాదూతలు అనే శీర్షిక దోహదంచేస్తోంది.

### శ్రీశ్రీః సింబాలిజం

నేషనల్ హెరాల్డ్ ఎడిటర్ శ్రీ ఎమ్. చలపతిరావు, త్రివేణి పత్రికలో Modern Trends మీద రాసిన ఒక వ్యాసం తనను influence చేయగా తాను కొత్త బాణీలలో కవితలను రాయడం

ప్రారంభించానని శ్రీశ్రీ ఒకచోట చెప్పుకున్నాడు. తన అభినవధోరణులను ఐ, ఆశాదూతలు అనే ఖండికలలో మొదట ఆవిష్కరించానన్నాడు. ఈ రెండు ఖండికలూ రచించిన తేదీ ఒక్కటే-1934 జూన్ 1వ తేదీ. ఆంగ్లభాష ద్వారా విదేశీయసాహితీవినూత్నరీతులను అవగాహన చేసుకున్న శ్రీశ్రీ, కుబుసం విడిచిన నాగులా వడిగా పరుగెడుతూ కొత్తఉత్సాహం తెచ్చుకుని కొత్తరీతులలో రాయడం ప్రారంభించినా ఈ రచన కేవలసంవిధానానికే పరిమితం కాకుండా వస్తువును కూడా విస్తరించినందువల్లనే ఐ, ఆశాదూతలులో చారిత్రకదృష్టి కనిపించింది.

ఆశాదూతలులోని వస్తువేమిటో అంతుపట్టనంత గూఢంగా ఉందని శ్రీ కె. వి. రమణారెడ్డి వంటి మార్క్సిస్టు విమర్శకులే అభిప్రాయపడటం నిజంగా ఆ గూఢత ఉంది కనకనే. మానవకోటి సామ్రాజ్యదూతలు అనే మాట తప్ప తక్కిన పదజాలం అంతా సంకేతప్రాయమై గూఢతనే చుట్టుకుని ఉంది. శ్రీశ్రీ 'దేశచరిత్రలు' వంటి ఖండిక ఆధారంతో కొంత అర్థం సాధించగలిగాము కానీ 'ఆశాదూత'లను ఏ ఖండికతోనూ సంబంధంలేకుండా విడిగా చూస్తే అయోమయంగా కనిపిస్తారు. అందుకే శ్రీ రమణారెడ్డి ఇలా రాశారు: "అప్పటికే ఫ్రెంచి సింబాలిస్టుల ప్రభావం శ్రీశ్రీపై ప్రసరించసాగిందనే విషయాన్ని మరిచిపోగూడదు. ఈ ఆశాదూతలు అనే గేయంలో ఈ సింబాలిస్టుధోరణి మరింత స్పష్టంగా రూపుతాల్చింది. ఈ దూతలు ఎవరూ ఏమిటి అనే ప్రశ్నలకు కవినుంచికూడా సమాధానం లభించదు. వీళ్ళు దిక్పతులకు సంకేత ప్రాయులు కారు. చివరివాడు తప్ప తక్కినవాళ్ళంతా భయంకరులూ లయంకరులూ కూడా. మానవకోటి సామ్రాజ్యదూతలు కళాయజ్ఞాశ్వములూ గాలులూ తరగలూ తావులూ పుష్పాళ్లు కుంకుమలు పొగలుగా రూపాంతరం పొందుతున్నారు. శబ్దఇంద్రజాలానికి భావం పూర్తిగా లోబడిపోతున్నది"1 ఏ కవి అయినా సంవిధానానికి ప్రథమస్థానం ఇచ్చి వస్తువుకు రెండవస్థానం ఇవ్వడంవల్ల వచ్చే అనర్థకత్వాన్నే రమణారెడ్డిగారు విచారించారు. సంవిధానప్రాధాన్యం శబ్దం వైపుకు కవిని లాక్కుపోతుంది. 'ఆశాదూతలు'లో శ్రీశ్రీ శబ్దానికి విపరీత ప్రాధాన్యం ఇచ్చిన మాట నిజమే అయినా వస్తువును సన్న్యసించలేదు. Modern Trendsలో సింబాలిజం తప్పకుండా ఉండే ఉంటుంది. ఆ వ్యాసాన్ని నేను చూడలేకపోయాను కానీ సింబాలిజంతోపాటు అందులో క్యూబిజం, ఇంప్రెషనిజంల ప్రస్తావన ఉండి ఉంటుంది. ఈ ఇజమ్‌లు ఏవీకూడా వస్తుప్రాధాన్య వాదాలూ కావు; సామాజిక చారిత్రకభౌతికవాదాలూ కావు. ఇవన్నీ వ్యక్తిప్రాధాన్యవాదాలే. అందువల్ల వాటికి సంవిధానప్రియత్వమే ప్రాణం. ఆదర్శవాదాన్ని శిరసావహించి ప్రపంచాన్ని మిథ్యగా భావిస్తూ మార్మికధోరణిలో ప్రతీకలను సృష్టించుకుంటూ ఇంద్రియానుభూతికి సహకరించే శబ్దసంగీతానికి లొంగిపోతూ వ్యక్తియొక్క ఆత్మసమున్నతి తప్ప కళకు ప్రయోజనమే

1 సృజన 14 సం, 12 పే

లేదనుకునే సింబాలిస్టులను శ్రీశ్రీ తన గురుపీఠానికెక్కించినా వారి దృక్పథంతో రాజీపడనేలేదు. వారి సంవిధానమే శ్రీశ్రీకి నూతనగవాక్షాలను తెరిచి చూపించింది. The symbolists preached mystic-idealism and the anarcho-individualist freedom of the artist and the idea of the self-value of art and denied the social mission of art."[2] సింబాలిస్టులు తిరస్కరించిన Social mission of art నే శ్రీశ్రీ పురస్కరించుకున్నాడు. సింబాలిస్టుల శబ్దసంగీతాన్నే శ్రీశ్రీ అభిమానించాడు. ఈవిధంగా శ్రీశ్రీ సింబాలిజాన్ని సప్రయోజనంగా వాడుకోవడం ఆరంభించాడు. పదాలూ సంగీతమూ అవిభాజ్యాలుగా భావించి వాటి సంయోగాన్ని ఛందస్సుద్వారా సాధించి ఇంద్రజాలంచేసి దివ్యానుభూతి నందుకోవడం సింబాలిజం ధ్యేయం. Poetry joins music by a prosody whose roots plunge deeper into the human soul than any classical theory indicates అంటూ బాద్లెయిర్ చెప్పిన కవిత్వసంగీతాన్ని సృష్టించడానికి శ్రీశ్రీ మహాప్రస్థానంలో ప్రయత్నించాడు కానీ దివ్యానుభూతితోనే ఆగిపోలేదు. కనుక అది సంగీతకవిత్వమే అయింది. శ్రీశ్రీ సామాజికవిప్లవదృక్పథమే సింబాలిస్టులనుంచి శ్రీశ్రీని పృథక్కరిస్తోంది. 'లలనాజనాపాంగ వలనావసదనంగ తులనాభికాభంగ దోఃప్రసంగ' అంటూ చేసిన రామరాజభూషణుని ప్రబంధసంగీతసాధన కానీ 'పగడాల చిగురాకు తెరచాటు తేటినై పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గునై ఈయడవి దాగిపోనా ఎట్లైన నిచటనే యాగిపోనా' అంటూ కృష్ణశాస్త్రి చేసిన భావసంగీతసాధన కానీ శ్రీశ్రీ కవిత్వంవంటివి కావు. ఆ యిద్దరిదీ కవితాసంగీతమేకానీ సంగీతకవిత్వం కాదు. స్వర్గాలు కరిగించి, స్వప్నాలు పగిలించి, రగిలించి రక్తాలు రాజ్యాలు కదిపి - పాపాలు వండించి భావాలు మండించి - కొలిమినిప్పులు రువ్వి విలయులయనవ్వి-ప్రాకారములు దాటి ఆకాశములు తాకి లోకాలు ఘూకాల బాకాలతోనించి - సిందూరభస్మాలు మందారహారాలువంటివి చలం అన్నట్లు లక్షణాలనూ రాగాలనూ మీరి చెవి కీర్రుమనేట్లు అరిచినట్లుంటాయి. శ్రీశ్రీ అరుపుల్లో "చీకట్లో మొహాలు తోకలూ కనపడక వెతుక్కునే ప్రజలరొద, గాలిదెబ్బలకింద ఎగిరిపడే సముద్రపుతుపాను గర్జనం, మరఫిరంగుల మరణధ్వానం గింగురుమంటాయి". దిక్కులేని దీనుల మూగవేదన, కాలికింద నలిగిన చీమల కాళ్ళు విరిగిన చప్పుడు, నీళ్ళులేక ఎండుతున్న గడ్డిపోచ ఆర్తనాదం, శ్రీశ్రీ సంగీతకవిత్వంలో వినిపించడానికి కారణం అతనిలోని సామాజికచైతన్యమే. బాటలు నడచీ పేటలు కడచీ కోటలన్నిటిని దాటండి- ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులారా చావండి - సలసలక్రాగే చమురా కాదిది ఉష్ణరక్తకాసారం - నేనొక దుర్గం నాదొక స్వర్గం - శీతకాలం కోతపెట్టగ కొరడుకట్టీ ఆకలేసీ కేకలేశానే - పొలాలనన్నీ హలాలదున్నీ ఇలాతలంలో హేమంపిండగ జగానికంతా సౌఖ్యం నిండగ - దారుణమారణదానవభాషలు భైరవభైరవభీకరఘోషలు - అలసిన కన్నులు కాంచేదేమిటి ? తొణికిన స్వప్నం, తొలగిన స్వర్గం - ఆనందం అర్ణవమైతే, అనురాగం అంబరమైతే

2 A Dictionary of Philosophy.

అనురాగపుటంచులు చూస్తాం ఆనందపు లోతులు తీస్తాం – కవీ నీ గళగళన్మంగళకళాకాహళ హళాహళిలో కలసిపోతిని కరగిపోతిని కానరాకే కదలిపోతిని – జడలువిచ్చిన నుడులు రెచ్చిన కడలినృత్యం శమిస్తుందా నడుమతడబడి. సడలి ముడుగక పడవతీరం క్రమిస్తుందా? – జగన్నాథ జగన్నాథ జగన్నాథ రథచక్రాల్వంటి పాదాల్లో వినిపించే రాగాలు, నాదాలు ఫ్యూడల్ కవిత్వంలోని శ్రుతులకన్నా భిన్నమైనవే. బ్రతుకును ప్రచండ భేరుండగరుత్పరిరంభంలో పట్టినగానం శ్రీశ్రీది.

ప్రతీకలనేవి కవిత్వం పుట్టిననాటినుంచీ ఉంటున్నవే అయినా సింబాలిస్టులు ప్రతీకలకు ప్రత్యేకప్రతిపత్తినిచ్చి ఉద్యమరూపం కల్పించారు. కానీ వారు ప్రతీకలను ఎంత అస్పష్టంగా ఎంత అనిర్దిష్టంగా వాడితే అంత పనితనంగా భావించారు. It is something which stands for or represents or denotes something (not by exact resemblance) but by vague suggestion or by accidental or conventional relation[3] అన్న తీరులో వర్ణ్యవస్తువుకూ ప్రతీకకూ సంబంధం అస్పష్టంగా ఉండటం సింబాలిస్టుల ధోరణిలోని లోపం ఆలంకారికులు సూచించినట్లు ఉపమేయం లేకుండా ఉపమానం చెప్పడం అనేది ఒకవిధమైన ప్రతీకాశిల్పమే కానీ పావురం శాంతికి ప్రతీక అన్నప్పుడు ఆ రెండింటికీ ఉపమేయోపమానభావాని కతీతమైన సంబంధం ఉంది. ఖాళీగదిని మనస్సుకు ప్రతీకగా తీసుకున్నాడు మల్లార్మే. ఇది ప్రసిద్ధం కాదు. స్వర్గాలు, స్వప్నాలు, ప్రాకారములు, ఆకాశాలు, ఘూకాలు వంటివి శ్రీశ్రీచేత ప్రతీకలుగానే వాడబడ్డాయి. మహాప్రస్థానం, మరోప్రపంచం, జలపాతం, బాటలు, పేటలు, కోటలు, నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, త్రేతాగ్ని, మేరువులు, సముద్రాలు, నగారా, యజ్ఞోపవీతం, గిరులు, ఝరులు, దుర్గం, చుక్కలు, అవతారం, జ్వాలాతోరణం, హిరణ్యనేత్రుడు, సిందూరం, బంధూకం, సంధ్యారాగం, గంధకం, రాక్షసిబొగ్గు, బుక్కాగుండ, విద్యుత్తు, రాంబందులు, ఖడ్గమృగం, ఝంఝానిలం, లోహవిహంగం, సుప్తభుజంగం, ముళ్ళదారి, మౌనమృదంగం, శాంతతరంగం, దీపం, సరిహద్దులు, ఋక్కులు, పద్మవ్యూహం, వినువీధులు, గుహ, కుటి, చీకటి, శంఖారావం, ఢంకాధ్వానం, అగ్నిసరస్సు, వజ్రం, లోహశ్యేనం, మృదంగనాదం, సంకెళ్ళు, సర్పపరిష్వంగం, వీథులు, చంక్రమణం, నిర్వాణం, పరిచుంబన, మంత్రం, గుడి, నైవేద్యం, హోమం, త్రిలోకాలు, ప్రణవం, వేగుజుక్క, వెర్రిగాలి, ఎంగిలాకు, ఈగ, తొండ, కుక్క, దిష్టిబొమ్మ, పెద్దమనుషులు, బుద్ధిమంతులు, గానుగలు, పీనుగులు, కరక్కాయ, సంధ్య, ఆకలి, గది, కుంపటి, బాకులు, నాగులు, కర్కోటకులు, ఇసుకతుపాను, గడుసుదయ్యాలు, ఆకాశదీపం, ఆవిరులు, ఆకాశతార, కేకలు, అవతలిగట్టు, అపస్వరాలు, తీగ, రంగులనీడలు, పరాజితులు, నీడలు, గోడలు, చెరసాలలు, తెరచాటులు, ఓడలు, సూదులు, మెరుపు, బొమ్మరిళ్ళు, విశ్వరూపం, పరమాత్మ, దాగుడుమూతలు,

3 Critics and Criticism.

కబళం, సెలయేళ్ళు, లేళ్ళు, ఉడుతలు, అద్వైతం, బానిస, కల్లోం, సమవాకారం, హాల్లీసకం, పేక ముక్కలు, పురాణం, కంచుగోడలు, విస్తరి, సరళరేఖ, మిణుగురులు, సందులు, వేదాంతం, ముందు దారి, నవనరంగం, గొడుగునీడలు, సుప్తకంకాళాలు, పతులు, రథచక్రాలు, ఆకాశపుదారులు, విలయం, హాలాహలం, ఇనుపడేగ, పునాదులు, పరిషేచన, పిచికగూళ్లు, పొగలు, కాటుకలు, విషవాగుర, గుగ్గిలపుధూమం, గంధకజ్వాలలు, ప్రశ్నార్థచిహ్నాలు, బ్రహ్మచెముడుడొంకలు, బలి, బురద, రెక్కలు, కొమ్ములువంటివన్నీ అభిధేయార్థంలో కాక ప్రతీకార్థంలో వాడబడి ఒక్కొక్కమాటే ఒక కావ్యమన్నంత లోతుతో కనిపిస్తాయి. వీటిని శ్రీశ్రీ ప్రయోగించిన సందర్భం ఎటువంటిదో అనుశీలించినప్పుడు ఆ ప్రతీకలు స్పష్టంగానే అర్థమవుతాయి. శ్రీశ్రీ ప్రతీకలను గురించి ముందుముందెవరైనా ఒక సిద్ధాంతగ్రంథం రాసే అవకాశం ఉంది కనుక వారికా వివరణను వదిలివేస్తాను.

### శ్రీశ్రీ: క్యూబిజం

రెండుపదాలు ఒకదాన్ని ఒకటి ప్రభావితంచేయడంవల్ల నూతనభావం సిద్ధించడం క్యూబిజం నుంచి శ్రీశ్రీ సాధించినట్లు కనిపిస్తుంది. 'స్వర్గాలు కరిగించి' అనే భావంలో స్వర్గాలను కరిగించడం ఎలా ప్రభావితం చేస్తోందో కరిగించడం అనేక్రియను స్వర్గాలూ అలాగే ప్రభావితంచేస్తున్నాయి. స్వప్నాలను పగిలించడం, రక్తాలను రగిలించడం, రాజ్యాలను కదపడం, పాపాలను వండించడం, భావాలను మండించడం, పగళ్లు పగిలిపోవడం, అగ్నికుండం ఆవులించడం, సమాధులు ఘోషించడం, ఘూకంకేక, భేకంబాకా, వేగుజుక్క వెక్కిరించడం, వెర్రిగాలి ప్రశ్నించడం, దీపం మూలుగు, స్వప్నం తొణకడం, స్వర్గం తొలగడం వంటివి ఈ కోవకు చెందుతాయి. Cubism is an art entirely concerned with interac tion; the interaction between different aspects, the interaction between structure and movement".[4] కదిలేదీ కదిలించేదీ నవకవితకు కావాలన్న శ్రీశ్రీ తన భావచిత్రాలలో కదలికగల క్రియలనే వాడుకోవడం గమనించదగినదే.

### శ్రీశ్రీ: ఇంప్రెషనిజం

క్యూబిజం కన్నా ముందే-చిత్రలేఖనంలో ముందు వచ్చి కవిత్వంలోకి తరువాత ప్రవేశించిన ఇంప్రెషనిజం శ్రీశ్రీని ఆకర్షించిన మరొక (modern trend) అభినవధోరణి. పెక్కు విశేషణాలతో ఒకవస్తువును వర్ణించడమూ, సంపూర్ణ వివరాలనివ్వడమూ విరమించి మనోముద్రితమైన ఒక స్పందనను, అనుభూతిని సూచించడంద్వారా పాఠకుణ్ని ప్రభావితుణ్ని చేయడమే ఇంప్రెషనిజం. 'నీ మనోజ్ఞ కాంచన కాంచీమణిఘంటాగళములు ఏకాంతము కరగమ్రోయగా విన నలచే బ్రతుకుదాల్చి యెడదమ్రోత కెంతయేడ్తునో'అనే కృష్ణశాస్త్రిగారి గీతంలో విశేషణాలతో

4 The Success and Failure of Piccasso.

కూడిన వర్ణన కనిపిస్తే 'మానవకోటి సామ్రాజ్య దూతలు కళాయజ్ఞాశ్వముల్ గాలులై తరగలై తావులై పుష్పాళ్లకుంకుమల్ పొగలై సాగిరి' అనే శ్రీశ్రీ రచనలో అనుభూతి రేఖలే కనిపిస్తాయి. వస్తువులను చిత్రించడం మాని వస్తువులమీద పడిన కాంతినే చిత్రించి ఇంప్రెషనిస్టులు నూతనత్వం తెచ్చారు. తలుపులను చిత్రించాలంటే ఇంప్రెషనిస్టులు పెద్ద తాళంకప్పనూ, ముదురురంగులనూ చిత్రిస్తారు. ఈ పద్ధతినే శ్రీశ్రీ కవిత్వంలో 'ఒక క్షణంలో' అనే ఖండికలో చూడగలం.

కనబడలేదా మరోప్రపంచపు అగ్నికిరీటపుధగధగలు, ఎర్రబావుటా నిగనిగలు, హోమజ్వాలల భుగభుగలు - ఎవరెవరో తలవిరబోసుకు నగ్నంగా నర్తిస్తున్నారు-ప్రదీప్తకీలా ప్రవాళమాలా ప్రపంచవేలా ప్రసారములలో మిహిరవాజితతి మఘవ ధనుర్ద్యుతి-తటిస్స్రగ్మణిమణీఘృణి ఎదో మతి వికాసించి - సూర్యునిలో సూదులతో క్రీడలాడు నీడలు మొదలైనవి ఇంప్రెషనిజం ప్రభావంతో ధగధగలాడే భావచిత్రాలే. (Impressionism is) an attitude that believes in conveying to the receptor the impression something has made upon the author rather than an exact description from which the receptor can give his own impression. It therefore is less concerned with particulars and details than with words, that will directly induce a state of mind or mood'.[5]

కవిత్వాన్ని

నీ సొంతఉపయోగాలకు వాడుకుంటే

కవిత్వానికి

నువ్వు ద్రోహంచేస్తున్నావన్నమాట !

— శ్రీశ్రీ

# 1934 కవితలు (2)

## 61/శైశవగీతి

### మీదే మీదే సమస్తవిశ్వం! మీరే లోకపు భాగ్యవిధాతలు!

1934 జూన్ 9

ప్రకృతిసౌందర్యాన్ని చూసి ముగ్ధుడై తన అనుభూతిని వ్యక్తంచేశాడు భావకవి.

రంగురంగుల సొగసుచీరలుధరించి నవ్వు వెన్నెల గాయు క్రొన్ననల నడుమ
వాడివాడని యీ విరిచేడె తాల్చు మంచుముత్తియములఁ గన మదిగరంగు!

ప్రకృతిలో రంగురంగులపువ్వులు, తెల్లని వెన్నెల, ముత్యాలవంటి మంచుబొట్లు చూసినప్పుడు కలిగిన ఆనందం ఒక భావచిత్రంగా రూపొందింది-కృష్ణశాస్త్రిగారికి.

వివిధనూనవితానశోభితకుజప్రశస్తసుప్రమదావనస్థలము సాంద్ర
చంద్రికాసముజ్జ్వలదివ్యశర్వరీప్రశాంతవేళ సముంచితసౌఖ్యమొసగ.
మైమరచిపోతినంత సమస్తభువనసముదయమలర్చెనపుడె విస్తారమధుర
గాననిస్వనకల్లోలకలితలలితభావకవితావియద్వాహినీవిధాన

అంటూ శ్రీశ్రీ కూడా కవిగా తన తొలిదశలో ప్రకృతి సౌందర్యాన్ని చూసి మైమరచినవాడే! ప్రకృతి సుందరమైనదే కాదు; మానవజాతికి తన సంపదలను అందిస్తూ వారి మనుగడకే ఆధారభూతమైనది కూడా. ప్రకృతియొక్క సౌందర్యంతోపాటు ఉపయోగాన్ని కూడా గ్రహించడానికి కవి హృదయవాది మాత్రమే కాక భౌతికవాది కూడా అయిఉండాలి. ప్రకృతి ఒక దేవత అనుకుని ఆమెకు 'సాష్టాంగప్రణతులు' అర్పించడం నుంచి ప్రకృతి ఒక శక్తి అనుకుని ఆశక్తిలో తానొక భాగంగా భావించుకుని 'నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను' అని తలపోసేవరకూ శ్రీశ్రీ పరిణతిచెంది మహాప్రస్థానం రచించాడు. ప్రకృతిశక్తులను వాడుకోవడం బూర్జువావిప్లవంతో పరిణతి చెందుతుంది కానీ ఆశక్తులను ఎవరో కొందరు సంపన్నులు మాత్రమే వినియోగించుకోవడం, తక్కినవారికి అవి అందుబాటులోకి రానీయకపోవడం ధనస్వామ్యసామాజికవ్యవస్థలోని లోపం. ప్రకృతి శక్తులను వాడుకోవడానికి మానవులందరికీ సమానమైన హక్కులే ఉండగా సామాజికవ్యవస్థమాత్రం ఆహక్కులకు భంగంకలిగిస్తూఉంటే అది సామాజికమైన అన్యాయమే అవుతుంది. ఫ్యూడల్‌వ్యవస్థలో కూడా ఇలాంటి అన్యాయమే ఉంటుంది. భూస్వాములు ప్రకృతిని తమ సొంతఆస్తిగా మార్చుకుని పైరుపంటలను అనుభవిస్తూ సామాన్యులకు

కడుపునిండకుండా చేస్తారు. బూర్జువావ్యవస్థలో ఆస్తిహక్కులు పెరగడమే కాక ప్రకృతి వనరులను పారిశ్రామికరంగంలో ధనసంపదగా మారుస్తారు. ఇందువల్ల సమాజంలో ఒకవర్గం మరో వర్గాన్ని పీడిస్తూ ప్రకృతిసంపదలను పీడితవర్గంవారి అనుభవానికి రానీయకుండాచేస్తుంది. 'లోకపు టన్యాయాలూ, కాల్చేఆకలి, కూల్చేవేదన, దారిద్ర్యాలూ, దౌర్జన్యాలూ' దీనివల్ల మొదలవుతాయి. ఈ సామాజికమైన అన్యాయాలకు ఎక్కువగా గురిఅయ్యేవారు శిశువులే !

## శ్రీశ్రీ శిశువాత్సల్యం

సమ్మెకట్టిన కూలీల భార్యల ప్రక్కన వారి బిడ్డలూ వారి ఆకటిచీకటి చిచ్చుల హాహాకారాలూ ఆర్తారావాలూ శ్రీశ్రీకి వినిపించాయి. ఇటుచూస్తే అప్పులవాళ్ళు, అటుచూస్తే బిడ్డల ఆకలి వేధించగా ఉరిపోసుకుచనిపోయే సంసారులను చూశాడుశ్రీశ్రీ. న్యాయాన్యాయాలూ పాపం పుణ్యం కష్టం సౌఖ్యం శ్లేషార్థాలూ ఏమీ ఎరుగని పూవుల్లాంటి శిశువుల్ని చూసి కరిగిపోయాడుశ్రీశ్రీ. ప్రకృతిలో ఏ సౌందర్యం కనిపించినా అవి తమకే అని ఆనందించే కూనలకు జరుగబోతున్న అసమానతను గురించి ఆందోళన చెందాడు శ్రీశ్రీ. గరిక పచ్చమైదానాల్లో తామరపూవుల కోనేరుల్లో పంటచేలలో ఇంతవరకూ కవులు చూస్తూ వచ్చిన సౌందర్యానికి బదులు శ్రీశ్రీకి శిశువులే కనిపించారు. సామ్యవాదం అవతరిస్తుందనీ ఈ సామాజికాన్యాయాలు తొలగిపోతాయనీ ఊహిస్తూ శిశువులదే ఈ సమస్తవిశ్వం అనీ శిశువులే లోకపుభాగ్యవిధాతలనీ వారి చిరునవ్వుల్లోనే వచ్చేనాళ్ళ విభాప్రభాతాలు మెరుగులు తీరతాయనీ విశ్వసించాడు శ్రీశ్రీ. ఋతువులన్నీ సౌందర్యాలవాలాలుగా పురాణకవులకు కనిపిస్తే, ఋతువులన్నీ మన్మథోద్దీపకాలుగా ప్రబంధకవులకు కనిపిస్తే ఋతువులన్నీ దివ్యలోకాలుగా భావకవులకు కనిపిస్తే — శ్రీశ్రీకి మాత్రం ఋతువులన్నీ శిశువులకోసం దాగుడు మూతలాడుతున్నట్లుగా కపినించాయి. ప్రకృతిలో తనకు కనిపించే నక్షత్రాలూ రంగులు, కాంతులు, ధ్వనులూ వీటికి వారసులు శిశువులే అని నిర్ణయించుకున్నాడు శ్రీశ్రీ.

అమాయికతకూ సౌందర్యానికీ స్వేచ్ఛకూ ఆలవాలమైన శైశవాన్నికూడా సామాజికమైన అన్యాయాలకు గురిచేయడం మానవత్వానికే కళంకం అని శ్రీశ్రీ భావించాడు. కుక్కపిల్లను కూడా కవితావస్తువుగా చూసిన శ్రీశ్రీ— అపుడే ప్రసవించిన శిశువు చిత్రనిద్రలో ప్రాచీన స్మృతులూచే చప్పుడుని కవితాసమాధిలో విన్న శ్రీశ్రీ-మానవుడిలోని 'శిశువు'ను చూడగల్గిన శ్రీశ్రీ-శైశవగీతిని రాయకుండా ఎలా ఉండగలడు ? శిశుదశలోనే మాతృమూర్తిని కోల్పోయిన శ్రీశ్రీ తన పినతల్లి పెంపకంలో పెరిగి 14వ ఏట తన శైశవాన్ని తలచుకుంటూ 'శిశుత్వాజ్ఞాన వేళా నష్టమాతృచరిత్ర'ను గురించి విచారించాడు. మహాప్రస్థానగీతాలలోకి ప్రవేశించేముందు

డేనిష్‌కవి బౌగెసన్ రాసిన బాల్యం అనే గీతాన్ని అనువదించాడు. చిన్నపిల్లల గురించి ఎంతో శ్రద్ధచూపించిన చెలం, దీక్షితులూ శ్రీశ్రీని శైశవంవైపు మళ్ళించారు. తన శైశవరాగమాలికల ప్రతిధ్వనులకోసం చెరిగిన బాల్యపదచిహ్నాలకోసం నిట్టూర్చే తత్వంనుంచి శ్రీశ్రీ ప్రపంచంలోని అనంతకోటి శిశువులను చూడగల్గాడు.

పిల్లలంటే శ్రీశ్రీకి గల ప్రేమాభిమానాలూ వాత్సల్యగరిమా ఎంత అవ్యాజమైనవో శైశవ గీతిలోనే కాక అది రచించిన 20 ఏళ్ల తరవాత రష్యా వెళ్ళివచ్చిన సందర్భంలో చెప్పిన వాక్యాలలో కూడా వ్యక్తంఅయ్యాయి. "రష్యాదేశపు సిరిసంపదలు నిజంగా ఈ పసిపాపలే. బాలబాలికలను ఎంత శ్రద్ధగా చూస్తున్నారో మానవత్వసమధర్మసిద్ధాంతాల ననుసరించి యెలా పెంచుతున్నారో నేను కళ్ళారా చూసి సంతోషించాను" అంటూ పిల్లలను ఒక దేశపు నిజమైన సంపదగా చూడగల్గడం శ్రీశ్రీవంటి సామ్యవాదికే కానీ ఫ్యాక్టరీలనూ బంగారాన్నీ సంపదగా భావించే వారికి సాధ్యం కాదు.

మతవ్యవస్థవల్ల ఏర్పడిన పాపపుణ్యాలూ సమాజవ్యవస్థవల్ల ఏర్పడిన కష్టసుఖాలూ శుద్ధ కళావాదంవల్ల ఏర్పడిన శ్లేషార్థాలూ ధనస్వామ్యంవల్ల ఏర్పడిన ప్రపంచమార్గం తెలియనివారుగా శిశువులే కనిపించారు శ్రీశ్రీకి. 'ఏమీ ఎరుగని పూవుల్లారా అయిదారేడుల పాపల్లారా' అంటూ శ్రీశ్రీ చేసిన సంబోధనలో లోకం పోకడను గురించిన నిట్టూర్పు ధ్వనించింది. అన్నీ తెలిసిన పెద్దమనుషులూ బుద్ధిమంతులూ ఘర్మజలానికి ఖరీదుకట్టేవారూ యంత్రభూతముల కోరలు తోమిస్తూ దాస్యం చేయించుకునేవారూ ఇది నా పాపం కాదనే ఎంగిలాకులూ దుర్బలజాతిని బానిసలను కావించే బలవంతులూ ధరాధిపతులయిన నరహంతలూ, స్వార్థపరులూ ఈర్ష్యాళువులూ మాయావులూ దౌర్జన్యాలు చేసే బలవంతులూ పన్నాగాలుపన్నే ధనవంతులూ ఇతర వ్యక్తినీ పరజాతినీ పీడించే అధర్మశాలులూ శ్రమజీవి తయారుచేసిన వస్తువులను ఎత్తుకుపోయి అదే న్యాయం అనే యజమానులూ, కనబడినది కనబడదని వినబడినది వినబడదని వాదించే వేదాంతులూ మంచికీ చెడ్డకీ నడుమ కంచుగోడలు కట్టుకునే అదృష్టవంతులూ వడ్డించిన విస్తరిగా జీవితాన్ని అనుభవించేవారూ న్యాయస్థానాలు, రక్షకభటవర్గాలు, చెరసాలలు, ఉరికొయ్యలు మొదలైనవాటితో ఏలుబడిసాగించేవారూ ఇంకా వెనక్కిపోతామనే ప్రగతినిరోధకులూ తృప్తిగా చచ్చిపోయేవారూ అభిప్రాయాలు మార్చుకుని సుఖాలు కామించేవారూ పాపాలు వండించేవారూ దారుణద్వేషం పెంచే దానవులు, స్వాతంత్ర్యశత్రువులు, పరపీడనాపరులు, అసత్యప్రచారకులు, రాజకీయాలలో రంకువేషాలు వేసేవారు, దొంగలంజకొడుకులు, ప్రతికూలశక్తులు – వీరంతా శ్రీశ్రీ దృష్టిలో ప్రపంచ మార్గ నిర్ణేతలుగా ఉన్నారు. ఈలోకంలోని కష్టం సౌఖ్యం పాపం పుణ్యం నిర్ణయించేదీ వీరే కావడానికి కారణం సమాజవ్యవస్థలో పెత్తనం వీరిది కావడమే. ఇటువంటి రహస్యాలు పిల్లలకు తెలియవని శ్రీశ్రీ చమత్కారం.

మెరుపు మెరిస్తే వానకురిస్తే ఆకసమున హరివిల్లు విరిస్తే అవి తమకోసమే అని ఆనందించే కూనల్ని శ్రీశ్రీ మెచ్చుకున్నాడంటే పరదేశపు సౌందర్యసౌభాగ్యాలను చూసి ఈర్ష్యపడేవారిని మెచ్చుకోలేకనే. మెరుపునుంచి వాననుంచి హరివిల్లునుంచి పిల్లలు సౌందర్యరసజ్ఞత నలవరించు కుంటారు. ప్రకృతియే వారికి మొదటిపాఠాలు చెప్పే గురువు. 'ఏళ్ళు బయళ్ళూ ఊళ్ళూ బీళ్ళూ ఏకంచేసే వర్షాకాలం' కూడా పిల్లలకోసమే వస్తూపోతూ ఉంటుందని బాలల భావనలోనే శ్రీశ్రీ చెప్పాడు. ఇది పిల్లల కోసం తమాషాగా చెప్పిందే. కాకుంటే వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె ఫెళఫెళఫెళ ఫెళవిరుచుకు పడండి అని పీడిత సమాజానికి శ్రీశ్రీ చెప్పలేదు. వానకాలం ముసిరిరాగా శ్రామికుడు నిలువునిలువున నీరు కాకతప్పదనీ శ్రామికుడు ధారపోసిన అశ్రువులే విశ్వవృష్టికి హూపమిస్తాయనీ మబ్బుపట్టీ గాలికొట్టీ వానవస్తే వరదవస్తే చిమ్మచీకటి క్రమ్ముకొస్తే దారితప్పిన బాటసారికి ఎంతోకష్టమనీ శ్రీశ్రీయే చెప్పాడు.

అచ్చటికిచ్చటి కనుకోకుండా ఎచ్చటెచటికో ఎగురుతుపోయే పిట్టలుగా పిల్లలు శ్రీశ్రీకి కనిపించారంటే తాము కల్పించుకున్న నీతులవల్ల నియమాలవల్ల ఎక్కడికిపడితేఅక్కడికి పెద్దలు వెళ్ళలేకపోతున్నారనే అభిప్రాయంవల్లనే స్వేచ్ఛాప్రియుడైన మానవుడు తనకు తానే సంకెళ్ళు తగిలించుకుంటున్నాడు – మూఢవిశ్వాసాలవల్లనో, మతాచారాలవల్లనో, రాజకీయశాసనాల వల్లనో, మరోప్రపంచం పిలుస్తున్నా ముందుకు పోలేకపోతున్నాడు. నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు అన్నీ మానవుడికి అడ్డంకులే. ఎముకలు క్రుళ్ళడంవల్ల వయస్సుమళ్ళడంవల్ల సోమరులై పోతున్నారు. అందువల్లనే యువకులు జలపాతాలవలె త్రాచుల్లా రేచుల్లా ధనం జయునిలా ఉరకాలనీ సాగాలనీ శ్రీశ్రీ చెప్పవలసివచ్చింది. కదిలేదీ కదిలించేదీ మునుముందుకు సాగించేదీ అయిన చైతన్యం నవకవిత్వానికి కావాలనడం ఇందువల్లనే. సాహసి యైనవాడు లోహవిహంగాలను ఎగిరించకతప్పదు. ఎగిరే లోహశ్యేనాన్ని కవితాసమాధిలో శ్రీశ్రీ దర్శిం చాడు. వడిగా వెలువడి, పరుగిడే మాటలను అందుకున్నాడు. నిప్పులు చిమ్ముకుంటూ నింగికెగిరి పోయాడు. వలయవిచలద్విహంగాలనదగిన స్విన్‌బర్న్ పాటలను పాడుకోగలిగాడు. మంచిని గురించి మర్యాద, మప్పితం గురించి నడతానాణ్యాం విలువలవిషయం నిశ్చలనిశ్చితాలు గల బూర్జువాలను మెచ్చుకోలేక పోయాడు. ముళ్ళూరాళ్ళూ అవాంతరాలెన్ని ఉన్నా ముందుదారినే ప్రేమించాడు అనేకస్థలాలలో తిరిగే – సముద్రాలు దాటే – ఎడారులూ పర్వతాలూ గడిచే – ఆకాశాలను వెదికే – నక్షత్రాలను శోధించే – దూరదృష్టి దూరశ్రవణ శక్తులు సాధించే – మానవుణ్ని అభినందించాడు

అచ్చటికిచ్చటి కనుకోకుండా ఎచ్చటెచటికో ఎగురుతు పోయే పిల్లలు ఎక్కడ చూస్తే అక్కడే విశ్వరూపంతో విహరించె పరమాత్మలుగా కనిపించారనడంలో విశ్వమంతా శిశురూపం

తోనూ శిశువులంతా విశ్వరూపంతోను గోచరించారు. గరికపచ్చమైదానాల్లో ఆడుకునే పిల్లలు తామరపూవుల కోనేరులలో దిగడం ప్రమాదకరం కాదా? కనుక ఇది అతిశయోక్తిఅయి, గంగాయాంఘోషః అన్నట్లుగా లక్షణాశక్తి ప్రసరించి కోనేటిగట్లమీద ఆడుకునే పిల్లలనే శ్రీశ్రీ చూశాడని చెప్పుకోవాలి. మైదానాలు, కోనేరులు, పంటచేలు, బొమ్మరిళ్ళు పల్లెటూరి ప్రకృతివాతావరణాన్ని గుర్తుకుతెస్తాయి. అయిదారేళ్ల పిల్లలు తండ్రిసందిటా తల్లికౌగిటా కనిపిస్తారనేవాస్తవంలో పిల్లల మోహనరూపాలూ ఆకర్షణశక్తి గోచరిస్తాయి. ఆ మోహనత్వమే దేహధూళితో కచభారంతో నోళులవ్రేళులతో పాలబుగ్గలతో కనిపించే శైశవవాస్తవికతలో ఉంది. ఇంత చిన్న పిల్లలు మైదానాల్లో కోనేరుల్లో పంటచేలలో విహరించడం అవాస్తవికమే అయినా కవి కన్న స్వప్నంలోని వాస్తవం అది. ఈ స్వప్నవాస్తవానికి పరమార్థం ప్రకృతినిండా వ్యాపించిన శైశవమే. మైదానాల్లోని గరికలూ కోనేరుల్లోని తామరపూలూ పంటచేలలోని వరివెన్నులూ బొమ్మరిళ్ళలోని బొమ్మలూ కవికి పిల్లలులాగే కనిపించారు.

శ్రీశ్రీ ప్రకృతికవి కాకపోయినా ప్రకృతిదృశ్యాలు ప్రతీకలై ఆయన కవితలలో అడుగడుగునా కనిపించాయి. జలపాతం, నదీనదాలూ, అడవులు, కొండలు, ఎడారులు, ప్రభంజనం, వర్షకాభ్రాలు, మేరువులు, సముద్రాలు, కాసారం, గిరులు, సాగరులు, కంకేళికామంజరులు, ఝరులు, ఎండకాలం, వానకాలం, శీతకాలం, చంద్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు, చుక్కలు, ప్రళయం, పగళ్లు, నిశీథాలు, ఉదయసూర్యుడు, తుపానుమేఘం, పయోధరప్రచండఘోషం, ఝంఝానిల షడ్జధ్వానం, ప్రచండఝంఝాప్రభంజనం, భూకంపాలు, నక్షత్రాలు, పొలాలు, గ్రుడ్డిచీకటి, వేగుజాము, వేగుజుక్క, శీతవాయువు, వెర్రిగాలి, చిమ్మచీకటి, హోరుగాలి, నడిరాతిరి, జ్యోత్స్న, ఏళ్ళు, బయళ్ళు, బీళ్ళు, ఇనబింబం, సెలయేళ్లు, లేళ్లు, బట్టబయలు, పర్వతగుహలు, హేమంతతుషారం, వాసంతసమీరం, చిగురించినతోటలు, వెలుగులోనిచీకట్లు, ఇరులలోని మిణుగురులు, ముళ్ళు, రాళ్ళు, చెట్టు, చెరువు, గుట్ట, పుట్ట, బ్రహ్మచెముడు డొంకలు, మొదలైన కావ్యసామగ్రి అంతా ప్రకృతిలోనిదే. శిశువులనే కాదు కవిత్వాన్ని కూడా విశ్వరూపంగానే శ్రీశ్రీ దర్శించాడు. అన్ని నీచైతన్యం నీవిశ్వరూపసాక్షాత్కారం అంటూ కవితకు నివాళు లర్పించిన శ్రీశ్రీయే విశ్వరూపమున విహరిస్తుండే పరమాత్మలు ఓ చిరుతల్లారా అన్నాడు. "To those who believe that children and poetry are the loveliest things in the world it seems natural that they should belong together"[2] అన్నమాటకు లక్ష్యప్రాయుడే శ్రీశ్రీ.

'మీదే మీదే సమస్తవిశ్వం మీరే లోకపు భాగ్యవిధాతలు మీ హాసంలో మెరుగులు తీరును వచ్చేనాళ్ళ విభాప్రభాతములు - నాకు కనంబడు నానా తారకలనేకవర్ణాలనంతరోచులు

2 M. Wilkinson: New Voices.

దిక్కు దిక్కులా దివ్యగీతములు మీరూ మీరూ వీటికి వారసులే ఇవి మీలో కూడా మిలమిలలాడును' అనే పంక్తులు శ్రీశ్రీ సృష్టించిన పిల్లల మాగ్నా కార్టా వంటివి. నేటిపిల్లలే రేపటి పెద్దలనీ వారిమీదనే ఈ ప్రపంచాభ్యుదయం ఆధారపడి ఉందనీ శిశువులు లేకపోతే మానవ ప్రపంచానికి మనుగడే లేదనీ భౌతికప్రపంచమంతా వారి సుఖంకోసమే అని శ్రీశ్రీ భావించాడంటే శిశువులను వినోద వస్తువులుగా చూడలేదన్నమాట. సమస్తవిశ్వం బాలలదే అనీ లోకపుభాగ్యవిధాతలు బాలలే అనీ అనడంలో శ్రీశ్రీ అంతర్జాతీయదృక్పథం మెరిసింది. భవిష్యదభ్యుదయమంతా పిల్లల అభ్యుదయంమీదనే ఆధారపడి ఉందని నమ్మాడు శ్రీశ్రీ.

మహాప్రస్థాన గీతాలలో ప్రాంతీయత కాక అంతర్జాతీయతే పెక్కు సందర్భాలలో కనిపిస్తుంది. ధరిత్రినిండా నిండిన మరోప్రపంచం, ప్రపంచాగ్ని, విశ్వవృష్టి, భువనఘోష, ప్రపంచాబ్జం, విశ్వవీణ, భువనభవనం, జగమంతా బలివితర్ది కావడం, పురిటినొప్పులు పడే పుడమితల్లి, పుట్టిన రోజు జరుపుకునే పుడమి, పద్మవ్యూహం వంటి ప్రపంచం, విశ్వరూపంతో కనిపించిన కవిత్వం, ప్రపంచపరిణాహంలో ప్రయాణం, సోదరులంతా పంచుకునే ఆదర్శాలు, వర్ధిల్లే ప్రపంచభాగ్యం, జగత్తుకంతా చవులిచ్చే భావివేదాల జీవనాదాలు, ప్రపంచపుమహారణ్యం, సుఖంలేని జగత్తు, జగమంతా నిదురమునిగినరాత్రి, విశ్వమంతా నిండిన బహుళపంచమిజ్యోత్స్న, నరజాతిచరిత్ర సమస్తం, ఖండాంతర నానాజాతులు, మానవకోటిసామ్రాజ్య దూతలు, ఆసియా అమెరికా యూరప్ ఆఫ్రికా ఆస్ట్రేలియా ధ్రువప్రాంతాలలోని మానవుడు, నిండుహర్షంకోసం ఎదురుచూసే నిఖిలలోకం, సామ్యవాదం కోసం పరిపక్వంగా ఉన్నప్రపంచం, ప్రపంచాన్ని భయపెట్టిన నిటాలాగ్ని, మొదలైనవన్నీ శ్రీశ్రీ అంతర్జాతీయతాదృష్టినే నిరూపిస్తాయి అందుకే శ్రీశ్రీ శిశువులు కానీ కవితలు కానీ ఒక ప్రాంతానికి చెందినవి కాకపోవడం!

ప్రకృతిలో వస్తూపోతూ ఉండే ఋతువులన్నీ శిశుక్రీడలుగా కనిపించాయి శ్రీశ్రీకి. వసంతం, గ్రీష్మం, వర్షం, శరత్తు, హేమంతం, శిశిరం అనే ఆరుఋతువులు పిల్లలకోసం దాగుడుమూతలాడుతున్నాయంటే అవి ఒకటి కనిపించినపుడు మరొకటి అదృశ్యం కావడం వల్లనే. కవికూడా శిశువైతే కానీ ఇలా ఊహించలేడు. "a child's thinking is always associative; he thinks in comparisions, in images, that are often so fanciful and unexpected that grownups, alas, fail to understand them"3 అన్నట్లు శిశుముగ్ధమైన చిత్తప్రవృత్తి ఉన్న కవియే శిశువులవలె ఊహించగల్గుతాడు. వసంతకాలం ఋతువుల రాణీ అనీ మంత్రకవాటం తెరుచుకుని వస్తుందనీ గ్రీష్మ

---

3 Marxist Leninist Aesthetics and Life 226 P.

కాలం కంచువృషభం అనీ అది అగ్నిశ్వాసం క్రక్కుతుందనీ వర్షాకాలం భిన్నభిన్నంగాఉండే వీళ్ళనూ బయళ్ళనూ ఊళ్ళనూ బీళ్ళనూ ఏకంచేస్తుందనీ శరత్కాలం వెన్నెలరాత్రులను తెస్తుందనీ హేమంతకాలం మంచుముద్దలాగ వస్తుందనీ శిశిరకాలం చలిలో వణకిస్తుందనీ ఇవి ఆరూ వస్తూపోతూ దాగుడుమూతలాడే పిల్లలవలె ఉన్నాయనీ ఉత్ప్రేక్షించాడు శ్రీశ్రీ. ఈ ఆరింటిలో మొదటి మూడింటికీ కట్టిన బొమ్మలవలె తరువాతి మూడూ లేవు. జీవితంలోని వివిధదశలకే ఈ ఆరూ సంకేతాలు కావడం అరిషడ్వర్గాలఛాయలను వీటిలో చూపించడం శ్రీశ్రీలో శిశుప్రవృత్తి, ప్రౌఢచిత్తవృత్తి కలగలిసి ఉంటాయనడానికి నిదర్శనం. ఋతువులరాణి అన్నప్పుడు కామం, అగ్నిశ్వాసం అన్నప్పుడు క్రోధం, వర్షాకాలంలో లోభం, శరన్నిశీథినులలో మోహం, హిమానీనిబిడహేమంతాలలో మదం, చలివణికించే శైశిరంలో మాత్సర్యం పొంచి చూస్తాయి.

ఎముకలుక్రుళ్ళిన వయస్సుమళ్ళిన సోమరులను చావమన్నప్పుడు, ఎనభైలక్షల మేరువులు ఎగిరిపడుతున్నాయన్నప్పుడు, రంగురంగుల చుక్కలన్నీ నెత్తురు కక్కుకుంటూ పేలిపోతాయన్నప్పుడూ సింహం ఆవులించిందన్నప్పుడూ ఏనుగు సవాల్ చేసిందన్నప్పుడూ ఘూకం కేకా భేకం బాకా అన్నప్పుడూ వేగుజుక్క వెక్కిరించిందన్నప్పుడూ వెర్రిగాలి ప్రశ్నించిందన్నప్పుడూ జాబిల్లి ఒంటెలాగుందన్నప్పుడూ దీపం ప్రమిదలో చమురు త్రాగుతోందన్నప్పుడూ కాలానికి కళ్ళెం స్వర్గానికి నిచ్చెనా వేస్తామన్నప్పుడూ సామ్రాజ్యాలు పేకమేడలై పడిపోయాయన్నప్పుడూ సింహాచలం కదిలిందన్నప్పుడూ భూకంపం పుట్టిస్తానన్నప్పుడూ కాళ్ళకు డెక్కలు మొలిచాయన్నప్పుడూ శ్రీశ్రీ ఊహాలలో ఒకప్రక్క శిశుప్రవృత్తి, మరొకప్రక్క ప్రౌఢచిత్తవృత్తి రెండూ కలిసి పనిచేశాయి. శిశుముగ్ధ చిత్తంలేనివా డెవడూ ఈ విధంగా ఊహించలేడు.

అనంతమైన కాలంలో మారేది మానవుడి జీవితమూ అతని వయఃపరిమాణమూను. కానీ ఇనబింబం నింగిపై పయనించడం, గాలులు వీయడం, పూలు పూయడం, చుక్కలు తళతళలాడటం, రంగులు కలకలలాడటం, కాంతులు మిలమిలలాడటం, పక్షులు కూయడం వంటి ప్రకృతి సహజమైనవేవీ మారవు. ఈ ప్రకృతిసౌందర్యాల ననుభవించడానికి ఆయా ఋతువులూ కాలాలూ సహకరిస్తాయి. మానవుడు శిశుదశనుంచి యౌవనదశకు చేరుకునేసరికి ప్రకృతి అతని కింకా సంపూర్ణరూపంతో గోచరిస్తుంది. 24 ఏళ్ళవయస్సులో తా ననుభవిస్తున్న ప్రకృతిసంపద లన్నింటికీ శిశువులు కూడా వారసులే అన్నాడు శ్రీశ్రీ.

గతశైశవరాగమాలికల ప్రతిధ్వనులకోసమూ పోయిన బాల్యపు చెరిగిన పదాల చిహ్నాల కోసమూ అన్వేషించడం మృగతృష్ణవంటిదే అయినా ఆ అన్వేషణ ఊహాలలోనో సుప్తచైతన్యం లోనో స్వప్నంలోనో మాత్రమే సాధ్యమవుతుంది. అసాధ్యమైనవాటిని స్వప్నాలలో సాధ్యం చేసుకోవడం శ్రీశ్రీ మన స్తత్త్వంలోకి ప్రవేశించడానికి కారణం అధివాస్తవికతావాదమే. అవతారం,

జ్వాలాతోరణం, ఆకాశదీపం, ఆః, జగన్నాథుని రథచక్రాలు వంటి ఖండికల్లో శ్రీశ్రీ స్వప్నాలే కనిపించాయి. శైశవగీతిలో కవి గతశైశవం కోసం చేసిన అన్వేషణ కూడా స్వప్నంలోనిదే. వాస్తవంలో సాధ్యంకాని సెలయేళ్ళనూ లేళ్ళనూ లాలించడం, పాతాళానికి పల్టీ కొట్టడం, వైతరణీనది లోతులు చూడటం, ఊర్పులను గాలికి కబళంగా ఇవ్వడం శ్రీశ్రీకి స్వప్నంలో సాధ్యమైపోయాయి. ఈ పనులను ఉన్మాదివలె శ్రీశ్రీ సాధించాడు. ఒంటరిగా కూర్చున్నప్పుడు శ్రీశ్రీ చేయగలిగిన ఈ విచిత్రక్రియాకలాపం అంతా అధివాస్తవికం. ఇది సుప్తచైతన్యంలోని ఊహ పరంపర. ఈ సుప్తచైతన్యంలోనే శ్రీశ్రీ శైశవానుభూతిని తిరిగి సంపాదించగల్గాడు. లాలించడం, పల్టీకొట్టడం, లోతులు చూడటం, గుటకలు వేయడం వంటి క్రియలన్నీ శైశవక్రీడలు. శైశవం కోసం శైశవాభినయం చేస్తూంటే శిశువులు నవ్వుతారు కనుక నే నను చూస్తూంటే నవ్వొస్తోందా అని ప్రశ్నించాడు శిశువుల్ని శ్రీశ్రీ.

ఈ శైశవాభినయంలో ప్రౌఢమైన భావాలను ధ్వనింపజేశాడు శ్రీశ్రీ. సెలయేళ్ళను ఆలోచనలకూ లేళ్ళను ఆవేశాలకూ పాతాళాన్ని అవ్యక్తమానసానికీ వైతరణీనదిని దుఃఖాలకూ ప్రతీకలుగా గ్రహించాడు.

## శ్రీశ్రీ పదబంధాలు

ఒకపదబంధంలోని రెండుపదాలనూ ప్రతీకార్థంలోనే వాడటం శ్రీశ్రీ చేసిన నూత్నప్రయోగాల్లో ఒకటి. ప్రమాదవీణలు అనే పదబంధంలో ప్రమాదం ప్రమత్తతకీ వీణలు పారవశ్యానికీ ప్రతీకలవుతూ పారవశ్యాతిశయాన్ని ధ్వనిస్తున్నాయి

మంత్రకవాటం, అగ్నిశ్వాసం, ఋతువులరాణి, కంచువృషభములు వంటి పదబంధాలు అర్థంచేత విదేశీయమైన ఊహాలనే తెలుగువారికి పరిచయం చేశాయి. రక్తకాసారం, అగ్నికిరీటం, భువనఘోష, ప్రపంచాగ్ని, విశ్వవృష్టి, ప్రపంచాబ్జం, విశ్వవీణ, లోహవిహంగం, సుప్తభుజంగం, మస్తిష్కనిలాయం, మౌనమృదంగం, అగ్నిసరస్సు, లోహశ్యేనం, రాక్షసరతి, మనస్సినీవాలి, సర్పపరిష్వంగం, విలయావర్తం, యంత్రభూతం, విమానబాహువు, లోహరాక్షసులు, జీవవిహంగం, మరణమృదంగం, విషవాగుర, గంధకధూమం, గంధకజ్వాల, కదనశంఖం, విప్లవశంఖం, పర్జన్యశంఖం వంటివి శ్రీశ్రీ సొంతంగా సృష్టించుకున్న పదబంధాలే. ఊహలో కొత్తదనం లేకపోయినా పదసంఘటనలో కొత్తదనం తీసుకురావడంలో శ్రీశ్రీ నిపుణుడే. దేహధూళి, కచభారం, లోహఘంటలు, ప్రదీప్తకీల, ప్రవాళమాల, ప్రపంచవేల, మిహిరవాజి, విద్యుత్తేజం, హరీంద్రగర్జన, షడ్జధ్వానం, రోచిర్నివహం, ప్రాణస్పందన, రణన్నినాదం, ఝంఝాప్రభంజనం, శంఖారావం, ఢంకాధ్వానం, ప్రభుత్వపతనం, మృదంగనాదం, రుచిరస్వప్నం, మనఃప్రపంచం, చిత్రనిద్ర, విలయావర్తం, కుసుమపరాగం, ఘర్మజలం, ధర్మజలం, ధనికస్వామి, విలాపాగ్ని, కార్మికలోకం,

స్వర్ణ వాద్యం, భావివేదం, శీతవాయువు, జీవఫలం, దానవభాషలు, కపాలగణాలు, ఆహ్వానగానం, నిబిడాశ్చర్యం, తటిన్మణి, మణీఘృణి, రథనాదం, సరభసగమనం, ఆశావర్షం, కళాయతనం, కారాగృహం, కంకణనిక్వాణం, జీవననిర్వాణం, విషవాయువు, వాసంతసమీరం, హేమంతతుషారం, గంధర్వగానం, ఇనోదయం, కళాకాహాళి పరస్పరాహరణ, పిశాచగణం, నరహంత, జనసందోహం, చరిత్రగతి, యథార్థతత్త్వం, చరిత్రసారం, విభాతసంధ్యలు, వస్తుసముదాయం, సంధ్యాజీవులు, సంధ్యాసమస్యలు, సందేహభావి, ఆశాదూత, భావధుని, ప్రపంచత్రాత, శిల్పాచార్య, శిల్పసమ్రాట్టు, పాపపంకం, కార్మికస్వర్గం, మానవపురోగమనం, స్వాతంత్ర్య శత్రువు, అగ్నివర్షం, రక్తపాతం, సవనరంగం, అసత్యప్రచారం, బాధాసర్పం, వ్యధానివిష్టులు, కధావశిష్టులు, నిటాలార్చి, ధ్వంసరచన, ధూర్తలోకం, దుస్తరవిఘ్నం, సానుభూతిసభ, సాశ్రునేత్రం, ప్రతికూలశక్తి వంటి పదబంధాలు శ్రీశ్రీ శైలిలోని ఆకర్షణ రేఖలు.

పైన ఉదాహరించినవన్నీ సంస్కృతపదాలతో కూర్చబడిన పదబంధాలే. తెలుగు పదాలతో కూర్చబడిన పదబంధాలూ, సుప్రసిద్ధ జాతీయాలూ కూడా శ్రీశ్రీ శైలిలో తరచు కనిపిస్తాయి. హరివిల్లు, పంటచేలు, బొమ్మరిళ్ళు, పాలబుగ్గలు, దాగుడుమూతలు, కంచునగారా, ఎర్రబావుటా, చంద్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు, తెల్లరేకు, క్రొన్నెత్తురు, పురిటినొప్పులు, తెలినలితలుపులు, నడిసంద్రపుకెరటాలు, కారడవులు, త్రాగుబోతు, పడుపుకత్తె, ఆకటిచీకటి చిచ్చులు, చెరసాల, బాటసారి, చిమ్మచీకటి, పల్లెటూరు, చింతనిప్పులు, గుండుసూదులు, గ్రుడ్డిచీకటి, వేగుజాము, వేగుచుక్క, పాడుకల, ముగ్గుబుట్ట, గాజుకళ్ళు, బండరాయి, వెర్రిగాలి, ఎముకముక్క, ఎంగిలాకు, దిష్టిబొమ్మ, వెకిలిచూపు, ఇసుకతుపాను, గడుసుదయ్యాలు, వెలిబూది, మిణుకుచూపులు, చీకటిబోను, కత్తిగంటు, నెత్తుటిబొట్టు, అవతలిగట్టు, పొగమేడలు, బతుకుగోడలు, తెరచాటులు, విరితేనియ, కడలివలపు, కత్తులవంతెన, పేకమేడలు, గనిపనిమనిషి, ఓడకళాసీ, నుదుటిచెమట, గుండెచెరువు, కంచుగోడలు, ఉరికొయ్యలు, ముందుదారి, కొలిమినిప్పులు, గంజినీళ్ళు, గొడుగునీడలు, కోటిగొంతులు, మొయిల్దారి, ఇనుపడేగ, మంటపంట, పిచికగూళ్ళు, ఊపిరితిత్తులు, కొలిమితిత్తులు, సారాదుకాణం మొదలైనవి. (చూ. కవితా ఓకవితా సమీక్షలో పదబంధరచన)

## శ్రీశ్రీ భావాకృతికల్పనాశిల్పం

భావాలకు పదరీతి తగిన ఆకారాన్ని కల్పించడం శ్రీశ్రీ శైలిలోని మరో ఆకర్షణ. మెరుపు మెరిస్తే వానకురిస్తే ఆకసమున హరివిల్లువిరిస్తే అన్నప్పుడు వ్యావహారికభాషలోని చేదర్థకం ముమ్మారు తిరిగి ఆశ్చర్యాన్ని రూపుకట్టించింది. ఏళ్ళు బయళ్ళూ ఊళ్ళూ బీళ్ళూ ఏకంచేసే వర్షాకాలం అన్నప్పుడు ద్విత్వలకారం ఆవృత్తమై వర్షాకాలపు వరదకు రూపం కల్పించింది. బాటలు నడచీ పేటలు కడచీ – ఎముకలుక్రుళ్ళిన వయస్సుమళ్ళిన – నెత్తురుమండే శక్తులునిండే – స్మరిస్తే

పద్యం అరిస్తేవాద్యం - నేనొకదుర్గం నాదొక స్వర్గం - పోనీ పోనీ పోతే పోనీ - వెలువడినై పరుగిడినై నాయెద నడుగిడినై - పరిక్లమిస్తూ పరిప్లవిస్తూ - కణకణమండే గలగల తొణకే - బాటలు తీస్తూ పాటలు వ్రాస్తూ - సమర్పణంగా సమర్చనంగా - నావినుతించే నావిరుతించే నావినిపించే నవీనగీతికి - జ్వరంకాస్తే భయంవేస్తే ప్రలాపిస్తే - తల్లడిల్లే కెళ్ళగిల్లే పల్లటిల్లే బాటసారికి - వెనుకదగా ముందుదగా కుడియెడమల దగాదగా-మీరక్తం కలగికలగి మీనాడులు కదలికదలి మీప్రేవులు కనలికనలి - చూర్ణమాన ఘూర్ణమాన దీర్ణమాన గిరిశిఖరాల్ - వడలో కడుజడిలో పెనుచలిలో మొదలైన వెన్నో అనుప్రాసలతో పరుగెత్తి భావాకృతిని సృష్టించాయి.

## శ్రీశ్రీ మాండలికత్వం

సాంప్రదాయికవ్యాకరణాన్ని త్రోసిరాజని భావవ్యంజనకు పట్టంకట్టి శ్రీశ్రీ చేసిన కొత్త ప్రయోగాలలో మాండలికరూపాలు కూడా ఉన్నాయి. ఋతువుల రాణీ వసంతకాలం అన్నప్పుడు రాణీలోని దీర్ఘత్వాన్నీ, 'క్రీడలాడుతవి' అన్నప్పుడు మాండలికమైన ఏసనీ 'ఇవాళ' అన్నప్పుడు పదరూపవికారాన్నీ నవ్వొస్తోందా అన్నప్పుడు సంధి విలక్షణతనీ భావివ్యాకరణకారులకు శ్రీశ్రీ బహూకరించాడు. గంగడోలును కదిపి గెంతేడు - వాక్కుంటేవ్రాసీ - వెలువడినై పరుగిడినై - ముసిల్దొకతె - వెళిపోయింది - రథచక్రాలొస్తునాయొస్తున్నాయి - కదులుతున్నాది- మొదలైనవి విలక్షణప్రయోగాలు. వ్యావహారికంలోని ఊనికలెన్నో శ్రీశ్రీ కవిత్వంలోకి ప్రవేశించాయి. ఏమీ ఎరుగని - మీదేమీదే - ఇవాళలాగే - మీరూ వాటికి - మీరేమీరే - మీలో కూడా - అవి మీకే అని ఆనందించే - దారిపొడుగునా - కేకలేశానే - భూమిమీదా భగ్నమౌతాయి - ధాత్రినిండా నిండిపోయీ - జూలుదులిపి ఆవులించింది - పాడేదీపాడించేదీ - వస్తే రానీ - చూడకుదేన్నీ - కళ్ళంటూఉంటే - నేనేం విన్నానా? - నేడో - నిట్టూర్పులు వినిపిస్తాయా - ఖరీదులేదోయ్ - విప్లవశంఖం వినిపిస్తాోయ్ - విడిన మబ్బుల నడుమనుండీ - ఇనేమిటీ వింతభయాలు - ఇంకానా ఇకపై చెల్లవు - మాయంటావూ అంతా మిథ్యంటావూ? - ఏం ఏమంటావు? - నిజంగానే నిజంగానే? - ఎలాగూ వచ్చాయి ఏమయితే కానీ - ఈలోకం మీదేనండి - ఏమయిపోతేనేం నువ్వు - వంటి ప్రయోగాలు సజీవమైనవి; నాటకీయమైనవి.

## శ్రీశ్రీ వాక్యశిల్పం

పదక్రమంలో మార్పుచేస్తూ ఒకేవాక్యాన్ని రెండుమార్లు వాడటంద్వారా శ్రీశ్రీ లయవైచిత్రినీ నూతనత్వాన్నీ సృష్టించి భావోద్దీపనం కలిగించడమేగాక పాఠకుడికి విసుగులేకుండా చేశాడు- ఇవాళలాగే ఎప్పుడుకూడా ఇనబింబం పయనించు నింగిపై - ఎప్పుడుకూడా ఇవాళలాగే గాలులు వీచును, పూవులు పూచును. జయభేరి ఖండికలో తొలి మూడువాక్యాలూ ఇంచుక

మార్పుతో చివరి మూడు వాక్యాలుగా మారాయి. నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను - నేనుసైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను. చేదుపాట ఖండికలో తొలి గీతమే తుదిగీతంగా మారింది. సంధ్యాసమస్యలు ఖండికలో అటుచూస్తే బాదంహల్వా ఇటు చూస్తే సేమ్యాఇడ్లీ - ఇటుచూస్తే అప్పులవాళ్లూ అటుచూస్తే బిడ్డల ఆకలి అంటూ వాక్య సామ్యం కనిపించింది. కేక ఖండికలో నాగదిలోపలి చీకటిలో - చీకటిలోపల నాగదిలో; కన్నుల నిండిన కావిరితో - కావిరి నిండిన కన్నులతో; గుండెల కప్పిన కుంపటితో - కుంపటి కప్పిన గుండెలతో వంటి వాక్యాలున్నాయి. ఒకరాత్రి ఖండికలో గగనమంతానిండి పొగలాగుక్రమ్మి బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టు నన్ను అనేది మొదటివాక్యం కాగా విశ్వమంతా నిండి వెలి బూదివోలె బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టు నన్ను అనేది తుదివాక్యం. అవతలిగట్టు ఖండికలో ఇవేమిటీ వింతభయాలు అనే వాక్యంలాగే ఇవేమిటీ అపస్వరాలు అనే వాక్యం నడిచింది. ఇంకానా ఇకపై చెల్లవు - ఇంకానా ఇకపై సాగదు. ఇవికావోయ్ చరిత్ర కర్థం - ఇవి కావోయ్ చరిత్ర సారం; మాయంటావూ లోకం మిథ్యంటావూ - మాయంటావూ అంతా మిథ్యంటావూ; నిజంగానే నిఖిలలోకం నిండుహర్షం వహిస్తుందా? నిజంగానే నిజంగానే నిఖిల లోకం హసిస్తుందా? ఈవిధంగా వాక్యసారూప్యం పాటించడం శ్రీశ్రీ శైలివిశేషం.

శ్రీశ్రీకి సుదీర్ఘ వాక్యనిర్మాణంపట్ల మోజు ఉండటం కనిపిస్తుంది. శైశవగీతిలో బుతువుల రాణీ.........మీనిమిత్తమే' అనే 11 పాదాలూ ఒకేవాక్యం. 'నా గత శైశవరాగ మాలికల.........నను చూస్తూంటే నవ్వొస్తోందా' అనే 14 పాదాలూ ఏకవాక్యమే. కవితా ఓకవితాలో 'ఇంకా నేనేం విన్నానా.........విన్నా నెన్నో విన్నాను' అనే 31 పాదాలూ ఏకవాక్యమే. ప్రతిజ్ఞలోనివన్నీ దీర్ఘవాక్యాలే. బాటసారిలో మొదటి 19 పాదాలూ ఒకే వాక్యంగా సాగాయి. వాడు ఖండిక అంతా నాలుగు వాక్యాల్లో ముగిసింది. ఆశాదూతలు అంతా ఒకేవాక్యం! ఈ దీర్ఘవాక్యనిర్మాణం ఆవేశంవల్ల వచ్చిందే కాని కృతకమైంది కాదు.

శైశవగీతి సంబోధనాత్మక భావగీతిక (ode) గా రాయడంవల్ల సంబోధనలతో వాక్యాలు ముగిశాయి. ఏమీ ఎరుగని పూవుల్లారా! అయిదారేడుల పాపల్లారా! ఆనందించే కూనల్లారా! పిట్టల్లారా పిల్లల్లారా పరమాత్ములు ఓ చిరుతల్లారా! ఉడుతల్లారా బుడుతల్లారా! ఇలా సంబోధ నలు కదిలిపోయాయి. కవితా ఓ కవితా - దేనికొరకు - స్విన్‌బర్న్‌కవికి - మిథ్యావాది - మానవుడా - గర్జించు రష్యా - జగన్నాథునిరథచక్రాలు - కొంపెల్ల జనార్దనరావుకోసం అనే గీతాలన్నీ సంబోధనాత్మక భావగీతాలుగానే శ్రీశ్రీ రచించాడు.

శ్రీశ్రీ వాక్యాలు వైవిధ్యంతో కూడినవి. ఆశ్చర్యార్థకాలూ ప్రశ్నార్థకాలూ ఎక్కువ. నను చూస్తూంటే నవ్వొస్తోందా? ఇది నా గీతం వింటారా? ఎడారులా మన కడ్డంకి? కనబడ

లేవా... త్రేతాగ్ని? సలసల క్రాగే చమురా? గబ్బిలంవలె క్రాగిపోలేదా? ఆకలేసి కేకలేశానే? ద్వారకవాటోయ్ శోభాలేశం? ఒక్కడనై స్రుక్కిన రోజులు లేవా? నా కగుపించే దృశ్యాలా? నా నిట్టూర్పులు వినిపిస్తాయా? మనదీ ఒక బ్రతుకేనా? దేనికోరకు పదేపదే దేవులాడుతావ్? ఇవేమిటీ వింతభయాలు? అలసిన కన్నులు – కాంచేదేమిటి? రాళ్ళెత్తిన కూలీలెవ్వరు? మోసిన బోయీలెవ్వరు? సాధించినదే పరమార్థం? అంతా మిథ్యంటావా? మంచికాలం రహిస్తుందా? నిజంగానే? ఇలా ఉన్నాయి ప్రశ్నార్థకాలు.

నేనొక దుర్గం! మహాప్రళయం జగంనిండా ప్రగల్భిస్తుంది! ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను! ఈ నాడే జగమంతా బలివితర్ది! మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది! పుడమికి నేడేపుట్టిన రోజట! నీవేపే చూస్తూ ఉంటాయ్! కాదేదీ కవిత కనర్హం! ప్రపంచమొక పద్మవ్యూహం! ఘర్మజలానికి ఖరీదు లేదోయ్! విప్లవశంఖం వినిపిస్తారోయ్! దారితప్పిన బాటసారికి ఎంతకష్టం! వెర్రిగాలి ప్రశ్నిస్తూ వెళిపోయింది! నీవన్నది నిజంనిజం! ఒంటరి ఒంటెలా గుంది జాబిల్లి! మీదేమీదే సమస్తవిశ్వం! కానరాకే కదలిపోతిని! పడిపోయెను పేకమేడలై! ఈ స్వప్నం నిజమవుతుంది! వంటివి ఆశ్చర్యార్థక వాక్యాలు.

మహాప్రస్థానగీతాలలో ఆజ్ఞార్థక వాక్యాలూ నిషేధార్థక వాక్యాలూ భవిష్యదర్థక వాక్యాలూ కూడా పాఠకుడ్ని చకితుడ్ని చేస్తూ ఉన్నాయి. పదండి ముందుకు! హరోంహర అని కదలండి! పెళపెళ పెళపెళ విరుచుకు పదండి! ధనంజయునిలా సాగండి! వంటివి ఆజ్ఞాపిస్తాయి. హీనంగా చూడకు దేన్నీ; ఇంకానా ఇకపై చెల్లవు ఇవి కావోయ్ చరిత్రకర్థం! ఈ సమరం తుదిచూడక ఇక నిలిచిపోరాదు! వంటివి నిషేధార్థకవాక్యాలు. ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను. భువనభవనపు బావుటానై పైకి లేస్తాను. విప్లవశంఖం వినిపిస్తారోయ్, జగత్తుకంతా చవులిస్తానోయ్; మరణానికి ప్రాణం పోస్తాం; కాలానికి కళ్ళెం వేస్తాం; చారిత్రకయథార్థతత్త్వం చాటిస్తారొక గొంతుకతో; ముందుకు పోతాం మేము; భూమార్గం పట్టిస్తాను; భూకంపం పుట్టిస్తాను. ఈ స్వప్నం నిజమవుతుంది; వంటివి భవిష్యదాశార్థకాలు. ఈ వాక్యశిల్పం గురించి ప్రత్యేకగ్రంథమే వ్రాయవచ్చు. (చూ. 'బాటసారి' సమీక్షలో వాక్యభేదాలు)

శ్రీశ్రీ వాక్యసంవిధానం ఆవేశానుభూతుల కొక సాధనం. తలవంచుకు వెళిపోయావా నేస్తం సెలవంటూ ఈ లోకాన్ని వదలి... వంటి వాక్యాలను మననం చేసినకొద్దీ దుఃఖోద్రేకం అర్థంఅవుతుంది. క్రియతో వాక్యం మొదలుపెట్టడం, మధ్యను సంబోధన రావడం, అసమాపక క్రియతో పాదం ముగియడం, వాక్యపరిసమాప్తి కాలేదనడానికి చుక్క లుంచడం ఇదంతా వాక్య శిల్పమే.

శ్రీశ్రీ వాక్యాలు నాటకీయ సంవిధానంతో సాగుతాయి. ఒకపాత్ర మరొక పాత్రతో మాటాడుతున్నట్లే వాక్యా లుంటాయి. ఎన్ని ఆశలు నీ మీద పెట్టుకుని ఎన్నికలలు నీచుట్టూ పోగుచేసుకుని...అన్నీ తిన్నివేశావా నేస్తం ఎంతదారుణం చేశావయ్యా నేస్తం వంటివి.

శ్రీశ్రీ వాక్యాలు ఉత్తరప్రత్యుత్తరాల్లో (Letters) వలె స్వేచ్ఛగా ప్రవహిస్తాయి. 'బరంపురంలో మనం ఇంకా నిన్నగాక మొన్న మాట్లాడుతున్నట్లే ఉంది' వంటివి.

శ్రీశ్రీ వాక్యాలు కొన్ని చిన్నచిన్నవికాగా, మరికొన్ని విరామంలేని నడక నడిచి ఎక్కడో ఆగుతాయి. వీటికి 'కొంపెల్ల జనార్దనరావుకోసం' అనే గీతంలో ఉదాహరణలు పుష్కలంగా ఉన్నాయి.

### శ్రీశ్రీ విదేశీయ భావచిత్రాలు

శ్రీశ్రీ భావచిత్రాలలో కొన్ని విదేశీయమైనవి. విస్తారమైన భావాన్ని వీలయినంత తక్కువ పరిధిలో కుదించి చెప్పడం ఈ భావచిత్రాల ప్రత్యేకత. ఋతువులరాణీ మంత్రకవాటం తెరుచుకు రాక పూర్వం కాలమనే అంతఃపురంలో ఉందని ఊహించుకుంటే మరింత రమ్యంగా ఉంటుంది. కంచువృషభములు గ్రీకుపురాణగాథల్లోంచి వచ్చిపడ్డాయి. ఇలాంటివే నరకలోకపు జాగీరాలు. గ్రీష్మకాలం కంచువృషభముల అగ్ని శ్వాసం క్రక్కుతుందన్నప్పుడు వేసవి ఎండలతీవ్రత వ్యక్తం అవుతుంది. శ్వాస వదలడం కాకుండా క్రక్కడంవల్ల భయంకరత్వం వ్యక్తమవుతుంది. క్రక్కడం నోటిద్వారా జరుగుతుంది. శ్వాసం ముక్కుద్వారా జరుగుతుంది. ఈ రెండు ఇంద్రియక్రియలను కలిపివేశాడు శ్రీశ్రీ. శ్వాసకు అగ్ని రూపం కల్పించాడు. నిజానికి శ్వాస వాయురూపంలో ఉంటుంది. ఇంద్రియక్రియలను మిశ్రమంచేయడం సింబాలిస్టుల పనితనం. నింగిపై ఇనబింబం పయనిస్తుందన్నప్పుడు ఇనబింబానికి పాంథధర్మాన్నీ నింగికి జీవనమార్గాన్నీ ఆరోపించాడు.

### శ్రీశ్రీ ఛందోవేగం

గేయంలోని పాదాల నన్నింటినీ ఒకేప్రమాణంలో రాయకుండా భిన్నప్రమాణాలలో రాయడంవల్ల ఛందోవేగాన్ని శ్రీశ్రీ సాధించాడు.

ఋతువులరాణీ వసంతకాలం
మంత్రకవాటం తెరుచుకునీ

అన్నప్పుడు మొదటిపాదంలో 16 మాత్రలుంటే రెండోపాదంలో 14 మాత్రలే ఉన్నాయి.

నా గతశైశవరాగమాలికల
ప్రతిధ్వనులకై

మొదటిపాదంలో 16 మాత్రలయితే రెండోపాదంలో 8 మాత్రలే.

శైశవగీతి చతురస్రగతిలో నడిచే గేయం. మహాప్రస్థానం, అభ్యుదయం, జ్వాలాతోరణం, నవకవిత, సాహసి, కళారవి, కవితా ఓకవితా, ప్రతిజ్ఞ, సంధ్యాసమస్యలు, కేక, ఆకాశదీపం, అవతలిగట్టు, పరాజితులు, గంటలు, అద్వైతం, దేశచరిత్రలు, మిథ్యావాది మొదలైన ఎన్నో ఖండికలు చతుర్మాత్రాగణాలతోనే నిర్మింపబడినా దేని గమనం దానికే ఉండటం శ్రీశ్రీ సాధించిన గమన వైవిధ్యానికి నిదర్శనం. ఈ ఛందస్సుల పాదసంఖ్యకు నిర్దిష్టత లేకుండా నడిపించాడు శ్రీశ్రీ. శైశవగీతిలో 1, 3 గీతాలు చతుష్పాదులు. 2వ గీతం పంచపాది. 4వ గీతం దశపాది. 6వ గీతం 17 పాదాలు. 5వ గీతం 24 పాదాలు.

గుర్వక్షరాల బాహుళ్యం శ్రీశ్రీ ఛందోధారలో తరచుగా కనిపిస్తుంది. కష్టం సౌఖ్యం శ్లేషార్థాలూ–బంధూకం సంధ్యారాగం – పోనీపోనీ పోతేపోనీ – రానీరానీ వస్తేరానీ కష్టాల్ నష్టాల్ కోపాల్ తాపాల్ శాపాల్ రానీ వస్తేరానీ తిట్లూ రాట్లూ పాట్లూ రానీ రానీరానీ–నీవేపేచూస్తూ ఉంటాయ్ – కళ్ళంటూ ఉంటే చూసి వాక్కుంటే వ్రాసీ – శంఖారావం ఢంకాధ్వానం– ఇంకా నేనేంవిన్నానా – విన్నానమ్మా విన్నానెన్నో విన్నాను – నా ప్రాణం నిర్వాణం పొందిందో – నానాగానానూనస్వానావళితం – ఏ శిల్పం ఏ సాహిత్యం ఏ శాస్త్రం ఏ గాంధర్వం – ఏ దేశం ఏ కాలంలో – మాయంటావా అంతా మిథ్యంటావా – వ్యత్యాసాలూ వ్యాఘాతాలే – ఖైదీ రాడీ ఖూనీకోర్ జేబీ–ఈ గురు బాహుళ్యం శ్రీశ్రీ ఆవేశం నుంచి జలపాతంలా చిమ్ముకు వచ్చింది; కృతకం కాదు.

పాదాంతాలలో గురువు రావడంతోపాటు పదం పూర్తికావడం కూడా జరిగితే చదవడంలో లయ ఏర్పడుతుంది. తెలుగు వృత్తాలలో గురువు వస్తుంది కానీ పదం ముగియదు.

అమలిన తారకాసముదయంబులనెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను బుద్ధి బాహువి/క్రమ-

పదం ముగియకపోవడమే ఘనంగా భావించారు ప్రాచీనకవులు. సంస్కృతశ్లోకాలలో పదం పాదాంతంలో ముగుస్తుంది:- ముక్తా కలాపీ కృతసింధువారం / యుం సర్వశైలాఃపరికల్ప్య వత్సం- ఇలాంటి పదవిరతిని గురజాడ ముత్యాలసరాలలో చూస్తాం:- ఈసురో మని మనుషులుంటే/ దేశమేగతి బాగుపడునోయ్- ఈ పాదాంతపదవిరతి, వర్ణదీర్ఘతలవల్ల శ్లోకానికుండే సొగసు, వేగం వస్తాయని గుర్తించిన శ్రీశ్రీ తన గీతాలలో చాలావరకు ఈ లక్షణాన్ని పాటించాడు.

ఏళ్ళు బయళ్ళూ ఊళ్ళూ బీళ్ళూ / ఏకంచేసే వర్షాకాలం! ఇలా గుర్వంతతనే నియతంగా పాటించలేదు శ్రీశ్రీ. కొన్నిచోట్ల లఘ్వంతత కూడా ఉంటుంది:- స్వచ్ఛకౌముదుల శరన్నిశీథులు/ హిమానీ నిబిడ హేమంతములు- అంత్యాక్షరం గురువైనా లఘువైనా పదం మాత్రం పాదాంతంలో ముగుస్తుంది.

## 62. అవతలిగట్టు

### ఎచటికి పోతావీరాత్రి? అవతలిగట్టుకు!

1934 జూన్ 16

తమసో మా జ్యోతిర్గమయ, అసతో మా సద్గమయ, మృత్యోర్మా అమృతం గమయ అనేవి ఆదిమకుటుంబవ్యవస్థ (Primitive Communal System) లో మానవుడు భగవంతుడికి తన ప్రధానసమస్యలను గురించి చెప్పుకున్న మాటలు. తమస్సు, అసత్తు, మృత్యువు - ఈ మూడే ఆనాటి మానవుడి సమస్యలు కనుక అతడు కోరేవి జ్యోతిస్సు, సత్తు, అమృతం అనే ఆధ్యాత్మిక కాంక్షలే అయ్యాయి. ఇహంనుంచి పరానికి ప్రస్థానం సాగించడమే అతని మహోన్నతలక్ష్యం అయింది. ఇదే అతడి దృష్టిలో అభ్యుదయమైనా పురోగమనమైనా. వాస్తవప్రపంచమంతా మిథ్య. మానవజీవితం క్షణభంగురం. భగవత్ సాన్నిధ్యం యథార్థం - శాశ్వతం. ఈ లక్ష్యాలే అతడ్ని ప్రాపంచికాభ్యుదయం పట్ల పరాఙ్ముఖుడ్ని చేశాయి. కానీ సామాజికవ్యవస్థల పరిణామం సంభవించిన కొద్దీ బలవంతులు బలహీనుల్ని పీడించి సుఖించడమూ ధనవంతులు దరిద్రుల్ని కాల్చుకు తింటూ భౌతికాభ్యుదయాన్ని సాధించుకోవడమూ ప్రబలం కాసాగాయి. బలవంతులూ ధనవంతులూ పరలోకం గురించి కలలు కంటూనే ఇహలోకసౌఖ్యాలనన్నింటినీ కొల్లగొట్టుకో సాగారు. ఆధ్యాత్మికవాదానికి సవాలుగా భౌతికవాదం మొదలయింది. పరలోకం మిథ్య; ఇహలోకం వాస్తవం. మానవుడు ప్రపంచాన్ని వర్గరహితంగా రూపొందించడమే అభ్యుదయం. ఒక సామాజికవ్యవస్థనుంచి అంతకన్నా ఉన్నతసామాజికవ్యవస్థలోకి మారడమే పురోగమనం. ఈ భౌతికవాదమే శ్రీశ్రీ నూతనకవిత్వానికి మూలాధారం. ఈ నాడు మానవుడు కోరుకుంటున్నది బ్రతికిన నూరేళ్ళూ తిండికీ గుడ్డకీ గూటికీ లోటులేకుండా బ్రతకడం అయితే ఇలా బ్రతకడానికి వస్తున్న అంతరాయాలు విధికల్పితాలు కావనీ సమాజకల్పితాలే అనీ తెలుసుకుని ఆ దోపిడీ సమాజాన్ని నిర్మూలించడానికి పీడితవర్గం అంతా కలిసి ఉద్యమించడమే శ్రీశ్రీ కవిత్వానికి లక్ష్యం. ఈ ప్రపంచం భ్రాంతి అని ఆదర్శవాదులు తలపోస్తే- ఈ ప్రపంచం వాస్తవమని భౌతికవాదులు నిరూపించి వాస్తవప్రపంచానికి గతి, పరిణామం (motion and change) ప్రధానధర్మాలన్నారు. ఈ పరిణామాన్ని మానవుడు తన ఉద్యమాలద్వారా శ్రమశక్తిద్వారా చురుకుగా తీసుకురాగలడనీ ఈ ప్రక్రియలోనే సామ్యవాదసమాజం - మరోప్రపంచం - అవతరిస్తుందనీ భౌతికవాదుల అభిప్రాయం కేవలం ఊహగా మిగిలిపోలేదు; అది కొన్ని దేశాలలో నిజంగా నిరూపితమయింది. అందుకే శ్రీశ్రీ 'పదండి ముందుకు పదండి త్రోసుకు పోదాం పోదాం పైపైకి' -

'బాటలు నడచీ పేటలు కడచీ కోటలన్నిటిని దాటండి' – మరోప్రపంచం పిలిచింది – జగమంతా బలివితర్ది నరజాతికి పరివర్తన నవజీవన శుభసమయం అభ్యుదయం ఈ నాడే – పుడమితల్లికి పురుటినొప్పులు కొత్తసృష్టిని స్ఫురింపించాయి – కదిలేదీ కదిలించేదీ మునుముందుకు సాగించేదీ పరిపూర్ణపుబ్రతుకిచ్చేదీ కావాలోయ్ నవకవనానికి – అభాగ్యులంతా విప్లవశంఖం వినిపిస్తారోయ్ – చిరకాలం జరిగిన మోసం, బలవంతుల దౌర్జన్యాలూ ధనవంతుల పన్నాగాలూ ఇంకానా ఇకపై చెల్లవు – ఒక వ్యక్తిని మరొక్కవ్యక్తీ ఒకజాతిని వేరొకజాతీ పీడించే సాంఘికధర్మం ఇంకానా ఇకపై సాగదు - అలజడీ మా జీవితం ఆందోళన మా ఊపిరి తిరుగుబాటు మా వేదాంతం – స్వాతంత్ర్యం సమభావం సౌభ్రాత్రం సౌహార్దం పునాదులై ఇళ్ళు లేచి జనావళికి శుభంపూచి శాంతి శాంతి కాంతి శాంతి జగమంతా జయిస్తుంది అంటూ పీడితుల పక్షంలో నిలబడి ధర్మసంగ్రామానికి సిద్ధమయ్యాడు.

## శ్రీశ్రీ అతివాద వైఖరి

ఈ భౌతిక పురోగమనమే శ్రీశ్రీ సమస్తకవితాభావనలోనూ అంతర్లీనమై వివిధరూపాలను ధరిస్తూ ఉంటుంది. ఫ్యూడల్ బూర్జువా వ్యవస్థలలో ఉన్న పీడితుడు సామ్యవాద వ్యవస్థలోకి ప్రయాణించడం శ్రీశ్రీకి ఈ ప్రపంచం నుంచి మరోప్రపంచంలోకి మహాప్రస్థానం సాగించడంగా కనిపించింది. అలాగే ఒకనదికి ఇవతలి ఒడ్డునుంచి సంజచీకటిలో అవతలిఒడ్డుకు ప్రయాణం చేయడంగా కూడా కనిపించింది. ఆధునికమానవుడంటే శ్రీశ్రీ దృష్టిలో పీడితమానవుడే. భయంకరమైన దోపిడీవాతావరణంలో చావుబ్రతుకుల మధ్య ఉన్నవాడు ఈ పీడితుడే. ఇతడే ఇవతలిగట్టున ఉన్న యాత్రికుడు. ఆశావాదాన్ని వదలకుండా ఇతడే ఈ రాత్రియే అవతలిగట్టుకు ప్రయాణం చేయదలచుకున్నాడు. 'అవతలిగట్టు' అనే ఖండికకు నేపథ్యవృత్తాంతం ఇదే పీడితులలో కూడా కొందరు మితవాదులూ మరికొందరూ అతివాదులూ ఉన్నారు. ఈ రెండురకాల మనస్తత్త్వాలవారిలో అతివాదులే సాహసంతో తిరుగుబాటు తెస్తారు. వీరే ప్రపంచాన్ని ముందుకు నడిపిస్తారు. మితవాది, అతివాది ప్రయత్నాలను శంకించి ప్రతిదాన్నీ ప్రశ్నిస్తూండగా అతివాది మితవాదికి సమాధానం చెబుతూ చొరవ తీసుకుంటాడు. ఈ దృష్టితోనే శ్రీశ్రీ తన ఖండికలలో ప్రశ్నోత్తర సంవిధానం కొన్నిచోట్ల అవలంబించాడు. ఇవేమిటీ వింతభయాలు ? ఇవేమిటీ అపస్వరాలు? అవేమిటా రంగులసీడలు? ఎచటికి పోతావీరాత్రి? అనే ప్రశ్నలే కాకుండా పరాజితులు అనే ఖండికలో అలసిన కన్నులు కాంచే దేమిటి? చెదరిన గుండెలనదిమే దేమిటి? విసిగిన ప్రాణుల పిలిచేదెవ్వరు? అనేప్రశ్నలున్నాయి. దేనికొరకు పదేపదే దేవులాడుతావ్? దేనికోసమోయ్ నీలోనే నీవేదో ఆలపించుతావ్ ? నిజంగానే నిఖిలలోకం నిండుహర్షం వహిస్తుందా? మొదలైన ప్రశ్నలు ఈ మితవాద ధోరణిలోనివే.

అతివాదులు కూడా కొన్ని ప్రశ్నలు వేస్తారు. వీరు వేసే ప్రశ్నలు పీడకుల్ని. 'ప్రశ్నలే ప్రశ్నలే జవాబులు సంతృప్తి పరచవు' అతివాదుల్ని. 'ముళ్ళూ రాళ్ళూ అవాంతరాలెన్ని ఉన్నా ముందు దారి' వీరిదే. ముందుకు వీరు పోతూంటే ప్రపంచం వీరి వెంట వస్తుంది. మితవాదులలాగ తృప్తిగా చచ్చిపోయేవారు కారు అతివాదులు. వీరి ప్రశ్నలు 'దేశచరిత్రలు'లో శ్రీశ్రీ వినిపించాడు:—నైలునదీ నాగరికతలో సామాన్యుని జీవన మెట్టిది? తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీ లెవ్వరు? సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుల సాహస మెట్టిది? ప్రభు వెక్కిన పల్లకి కాదోయ్ అది మోసిన బోయీలెవ్వరు? చారిత్రక విభాతసంధ్యల మానవకథ వికాసమెట్టిది? ఏ దేశం ఏకాలంలో సాధించిన దే పరమార్థం?–ఇటువంటి ప్రశ్నలు వేయడానికి కారణం వీరి చారిత్రకభౌతికవాదపరిజ్ఞానమే! సమాజాన్ని ఆజ్ఞాపించేంత సాహసం వీరికే ఉంటుంది. పదండి ముందుకు! వినబడలేదా మరోప్రపంచపు జలపాతం? కనబడలేదా మరోప్రపంచపు కణకణమండే త్రేతాగ్ని? హీనంగా చూడకు దేన్నీ! ఆజ్ఞాపించడమే కాదు సత్యాన్ని, వాస్తవాన్ని ఉద్ఘాటిస్తారు కూడా:– ఘర్మజలానికి ఖరీదు లేదోయ్ – విప్లవశంఖం వినిపిస్తారోయ్ – తారీఖులు దస్తావేజులు ఇవి కావోయ్ చరిత్రకర్థం అంటూ, మాయంటావా అంతా మిథ్యంటావా అని తిరగబడతారు వీరే.

ఇవేమిటీ వింతభయాలు? అపస్వరాలు? అని ప్రశ్నించేవారు మితవాదులే. వేటిని భయాలుగా పీడితులు భావిస్తున్నారో వాటిని వింతభయా లన్నారు మితవాదులు. దారిద్ర్యం, రోగం, దోపిడి, క్షుద్బాధ, నిరక్షరాస్యత, యుద్ధం వంటివన్నీ సమాజంలో ఉన్న వాస్తవభయాలే! ఏవేవో ఘోషలు వినబడుతున్నాయ్ గుండెలు పిడిపోతున్నాయ్ ఎవరెవరో తలపిరబోసుకు నగ్నంగా నర్తిస్తున్నారు భయోద్విగ్నంగా వర్తిస్తున్నారు అవిగవిగో ఇంకిన తెగిపోయిన మరణించిన క్రొన్నెత్తురు విపంచికలు యువయోధులు అంటూ శ్రీశ్రీ అభివర్ణించిన భయాలవే. హిరణ్యనేత్రుని పదాఘాతమున ప్రతిధ్వనించిన లోకం ఇది. కష్టాలు, నష్టాలు, తాపాలు, శాపాలు, తిట్లు, రాట్లు, పాట్లు ఈ సమాజవ్యవస్థలో వస్తూనే ఉన్నాయి. త్రాగుబోతులు, వేడుపుకత్తెలు, ఉన్మాదులు, కూలీలు మొదలైనవారిని ఈ సమాజవ్యవస్థ తయారుచేసింది. ఆకటిచీకటి చిచ్చుల హాహాకారాలు, ఆర్తారావాలు, మూకంకేకలు, భేకంబాకాలు, భయంకర బాధల పాటల పల్లవులు, వ్యక్తావ్యక్తాలాపనలు, ప్రేలాపనలు ఈ సమాజం నిండా వినిపిస్తున్నాయి. విరామ మెరుగక పరిశ్రమించే కర్షకుడు, ధనికస్వామికి దాస్యంచేసె కార్మికుడు విలపిస్తున్నారే కానీ సుఖించడం లేదు. నిరపరాధులు కూడా చెరసాలల పాలవుతున్నారు. శ్రమనిష్ఫలమై, జని నిష్ఠురమై కొందరు ఆత్మహత్యలకు దిగుతున్నారు. అన్యాయం, ఆకలి, ఆవేదన, దారిద్ర్యం, దౌర్జన్యం ఇవి సమాజవాస్తవాలు. ఈ భయాలకూ, ఆ అపస్వరాలకూ కారణం అతివాది దృష్టిలో ఇంట్లో చీకటి వ్యాపించడం – వీణకు తీగ తెగడం ఈ సమాధానాలు సాంకేతికంగా ఉన్నాయి. ఇల్లు ప్రాంత, రాష్ట్ర,

దేశ, ఖండాదులకు సంకేతం. చీకటి దారిద్ర్యాదులకు సంకేతం, అపస్వరాలు దుఃఖాదులకు సంకేతం. తీగ తెగడం అపజయాలకు సంకేతం.

తీగ తెగడంవల్ల వినిపించిన అపస్వరాలు మహాప్రస్థానగీతాలలో శ్రీశ్రీచేత వ్యక్తంచేయబడిన సందర్భాలున్నాయి. దారుణమారణదానవభాషలు, ఫేరవభైరవభీకరఘోషలు, ఘోషల భాషల ఘంటల మంటల కంటక కంఠపు గణగణలూ చిటికెల మెటికల చిటపటలూ అలాంటివే. ఆకాశదీపం వేసిన రాకాసికేకలు, గోణగోణ గణగణ గణగణ గోణగోణ గంటలు, ఘూకాల భాకాలు వంటివి అపస్వరాలే !

చావూబ్రతుకూ మితవాదికి రంగుసీడలలా కనిపించాయంటే అతడి అవాస్తవికదృక్పథమే కారణం. జననం ఎర్రగా మరణం నల్లగా ఉందని మితవాది భావన. శస్త్రకారుని మహేంద్రజాలంలో చావుబ్రతుకుల సంధ్యాకాలాన్ని రోగార్తుడు చూస్తాడని భావించిన శ్రీశ్రీకి చావుబ్రతుకులు వాస్తవాలే కానీ రంగుల నీడలు కావు. అతివాది దారిపొడుగునా గుండెనెత్తురులు తర్పణచేస్తూ ముందుకు సాగాలంటాడు. ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులను చావండంటాడు. యువయోధులు మరణించినా జగమంతా బలివితర్దిగా మారినా నరజాతికి పరివర్తనయే ముఖ్యం అంటాడు. ప్రళయానంతర నవజీవనశుభసమయాభ్యుదయాన్నే ఆహ్వానిస్తాడు. స్వర్గనరకముల ఛాయా దేహాళి తెలినలితలుపులు తెరచి మూసుకుంటాయనీ సర్గవిలయహేమంతవసంతధ్వాంతికాంతి విక్రాంతివేళలో చావుపుట్టుకల పొలిమేరలలో చితాగ్నికుండం ఆవులిస్తుందనీ భావిస్తాడు. హిరణ్యాక్షవధానంతరం కొత్తసృష్టి ఆరంభమవుతుందని భావిస్తాడు. పీడకవ్యవస్థ చావనిదే సామ్యవాదవ్యవస్థ పుట్టదని అతివాది అభిప్రాయం. పీడకవ్యవస్థలో పీడితులకు చావు తప్పదు ఈ చావు అనేకవిధాలు. ఉరితీయడం–హత్య అయితే; తనను తాను చంపుకోవడం ఆత్మహత్య ఈ రెండురకాల మరణాలనూ శ్రీశ్రీ మహాప్రస్థానంలో ప్రస్తావించాడు. హత్య, ఆత్మహత్య కాక విప్లవం కోసం ఆత్మార్పణం చేసుకోవడం మూడోరకపు చావు. ఈ చావులన్నీ పీడకవ్యవస్థ చావులో పర్యవసించి శ్రామికవ్యవస్థ ఉదయిస్తుంది.

ఈ సామాజికవ్యవస్థలో శ్రీశ్రీ, చావులనే ఎక్కువగా గమనించి తన కవిత్వంలో వాటిని చూపించాడు. స్పెయిన్‌యుద్ధంలో మరణించిన యువయోధులను గురించి ప్రస్తావించాడు. భారతస్వాతంత్ర్యయుద్ధంలో ఉరితీయబడ్డ శిరస్సుల రహస్యాలను విన్నాడు. కర్మాగారాలలో శ్రమనిష్ఫలమై జని నిష్ఠురమై నూతిని గోతిని వెదికే వాళ్ళను గమనించాడు. లోహరాక్షసుల పదఘట్టనచే కొనప్రాణంతో కనలేవాళ్ళను చూశాడు. కూటికోసం కూలికోసం పట్టణంలో బ్రతుకుదామని వెళ్ళి తుపానులో మరణించిన బాటసారి కథను కావ్యస్థం చేశాడు. దారిప్రక్క చెట్టుక్రింద జబ్బుచేసి తిండిలేక గుడ్డలేక చనిపోయిన ముసల్దాని గాథను రచించాడు అప్పుల

వాళ్ళనూ బిడ్డల ఆకలినీ ఎదుర్కొనలేక ఉరిపోసుకు చనిపోవడమో సముద్రమున పడిపోవడమో సమాప్త్యగా తీసుకున్న సంసారిని నగరంలో చూశాడు. ఉదయం ఆరున్నరకు గదిలో ఆరిపోయిన దురదృష్టజీవి రాకాసికేకలు విన్నాడు. విసిగిన ప్రాణుల దుర్మృతినీ నెత్తురు క్రక్కుకుంటూ నేలకు రాలిపోయే సాహసి మరణాన్నీ చూశాడు. రక్తంతో కన్నీళ్ళతో తడిసిన గతాన్ని చదివాడు. మహాహంతకుల్ని పసిగట్టాడు. కాలువలో ఆత్మహత్యలు చేసుకున్న దగాపడినతమ్ముల బాధలు, గాథలు అవగాహన చేసుకున్నాడు. ధూర్తలోకానికి బలిఅయిపోయిన సాహితీవేత్తలను చూసి బాధపడ్డాడు.

విరుద్ధవర్గాలు గల ప్రపంచంనుంచి వర్గాలేలేని మరోప్రపంచానికి చేసే ప్రయాణం నది ఇవతలి ఒడ్డునుంచి అవతలిగట్టుకు చేసే ప్రయాణంతో పోల్చబడింది. ఎచటికి పోతావీరాత్రి అనే మితవాది ప్రశ్నకు అతివాది చెప్పే సమాధానం అవతలిగట్టుకు అని! ఈ సమాధానమే ప్రాశ్నికుడ్నీ యాత్రికుడ్నీ నిజస్వరూపాలతో మనముందు ఉంచుతోంది. మరోప్రపంచం, అవతలిగట్టు, రెండూ సామ్యవాదప్రపంచానికి ప్రతీకలే. మహాప్రపంచం, జలపాతం, త్రేతాగ్ని, కంచునగారా, అగ్నికిరీటం, ఎర్రబావుటా, హోమజ్వాల, స్వర్గం, ఆకాశతార, ముందుదారి, కార్మికస్వర్గం, స్వప్నం మొదలైనవన్నీ ఇంచుమించు ఆ సామ్యవాదవ్యవస్థకే ప్రతీకలుగా వాడబడ్డాయి.

ఎచటికి పోతావీరాత్రి? అనే ప్రశ్నకు సమాధానం ఒకటే అయినా దాన్ని రకరకాలుగా మహాప్రస్థానంలో చెప్పాడు శ్రీశ్రీ. పదండి ముందుకు పదండి త్రోసుకు పోదాం పోదాం పైపైకి- మునుముందుకు సాగించేది కావాలోయ్ నవకవనానికి - ముందుకు పోతాంమేము ప్రపంచం మావెంట వస్తుంది - మహానగా లెగురుతున్నాయి మహారథం కదులుతున్నాది - వీటన్నింటిలోనూ పురోగమనమే వ్యక్తం చేయబడింది.

అవతలిగట్టు ఖండికలో అప్రస్తుతమైన సాయంకాలవర్ణన ధ్వనిస్తుంది. చీకటి, భయం, అపస్వరాలు, నీడలు, రాత్రి అనే పదాలు ఆ వర్ణనను అభివ్యక్తంచేస్తాయి. ఇంట్లోచీకటి జగత్తులోని చీకటికి సూచన; తీగతెగడం కాంతివిచ్ఛేదం; అపస్వరాలు ఘూకారావాలు; చావుబ్రతుకులు సూర్యాస్తమయ తిమిరజననాలకు సూచనలు. అవతలిగట్టు మళ్ళీవచ్చే సూర్యోదయానికి ప్రతీక.

## శ్రీశ్రీ విషాదసామగ్రి

వర్తమాన సమాజ విషాదమే శ్రీశ్రీ కావ్యవస్తువు కావడం వల్ల మహాప్రస్థానం నిండా విషాదసామగ్రియే ఎక్కువగా కనిపిస్తుంది. వర్షుకాభ్రముల ప్రళయఘోష, సముద్రాల జలప్రళయం, అశ్రుధార, వెర్రిగొంతుక, ఆకలేసిన కేకలు, రాలినెత్తురు క్రక్కుకునే చుక్కలు, పగిలిన పగళ్ళు, విశీర్ణిల్లిన నిశీథాలు, తలవిరబోసుకు నగ్నంగా నర్తించేవాళ్ళు, ఇంకిన క్రొన్నెత్తురు,

తెగిపోయిన విపంచికలు, మరణించిన యువయోధులు, అనాథజీవుల సమాధుల ఘోష, పులి చంపిన లేడినెత్తురు, భూకంపాలు, వైద్యశాలలో రోగార్తులు, కాలువనీళ్ళలో త్రాగుబోతు, పసుపుకత్తె, ఉరికొయ్య, ఉన్మాది, ఆకలిచీకటి చిచ్చులు, చెరసాలలు, సమ్మెలు, అభాగ్యులు, శిరోవేదన, పాడుకల, గూబలు, కళేబరం, ఎముకముక్క, మూలుగులు, వెకిలిచూపు, పీనుగులు, సందులలో పందులు, కేక, నెత్తురు, నిప్పులు, పిశాచగణం, దరిద్రులు, కన్నీళ్ళు, హాహాకారం, కష్టాలు, ప్రేగులు, ఏడ్పులు, ఆత్మహత్యలు, మొదలైనవి జుగుప్సనీ దుఃఖాన్నీ భయాన్నీ కలిగించే కావ్యసామగ్రి. "నెత్తురూ కన్నీళ్ళూ తడిపి కొత్త Tonic తయారుచేశాడు శ్రీశ్రీ యీ వృద్ధ ప్రపంచానికి" అంటూ చెలం చెప్పిన మాటలు ఈ సందర్భంలో గుర్తుకు వస్తాయి.

### శ్రీశ్రీ ప్రతీకలలోపం

'అవతలిగట్టు' ఖండిక బహుళార్థద్యోతకమైన ప్రతీకలతో కూర్చబడి ఉండటంవల్ల కవి తాత్త్వికపరిజ్ఞానం తెలుసుకోనివారికి విపరీతార్థాలు కూడా స్ఫురిస్తాయి 'The poem is a mystery to which the reader must hunt the key'[1] అని ప్రతీకవాదప్రవర్తకుల్లో ఒకడైన మల్లార్మే చెప్పుకున్న సూక్తి శ్రీశ్రీ కవితల పట్లకూడా వర్తిస్తుంది. Abandoning the hope of single interpretation, he (Reader) must discover the main images, observe the effect upon them of peripheral images and guess the idea generated by their interaction.[2] ప్రతీకవాది అయిన కవి సృష్టించే ప్రతీకల అర్థాన్ని గ్రహించడానికి పాఠకుడు కొంత అన్వేషణ సాగించాలి.

### శ్రీశ్రీ మాటలు

సామాన్యమైనమాటలు కవిత్వానికి పనికివస్తాయా పనికిరావా అనే మీమాంస కవిత్వం ఎవరికోసం అనే ప్రశ్నకు రూపాంతరమైనప్రశ్నే. రంగు, రుచి, వాసన గల పదాలు కవిత్వానికి అవసరం అని కృష్ణశాస్త్రి అంటే కవిత్వం భావుకుడైన వ్యక్తికోసమే అని చెప్పడమే. శ్రేష్ఠమైన మాటలు, జానపదచ్ఛందస్సులు కవిత్వానికి కావాలని గురజాడ చెప్పడానికి కారణం కవిత్వం ప్రజలకోసం అనే ఉద్దేశమే. కుక్కపిల్లా అగ్గిపుల్లా సబ్బుబిళ్ళా అన్నీ కవితామయమే అనీ శబ్దశాస్త్రాలవంటి నిఘంటువులు దాటి పదాలు తన మెదలో అడుగిడినాయనీ తన గీతం తనజాతిజనులు పాడుకునే మంత్రంగా ప్రయోగించాలనుకుంటున్నాననీ తన కవిత్వం కార్మికలోకపు కల్యాణానికీ శ్రామికలోకపు సౌభాగ్యానికీ అనీ శ్రీశ్రీ చెప్పడానికి కారణం కవిత్వం పీడితజనుల సముద్ధరణ కోసం అనే ఉద్దేశమే. కవితాప్రయోజనాన్ని బట్టి కవిపదజాలం ఉంటుందే తప్ప సామాన్యమైన భాష, ఉదాత్తమైన భాష ఏదో ఒకటే కవిత్వానికి పనికివస్తుందనేది నిజం కాదు. 'Poetry, then

---

1 Critics and Criticism
2 IBID

vital, fresh and surprising language. Stale language will be ineffective; common place language will have no impact'[3] అంటూ ఒక ఆంగ్ల విమర్శకుడు అభిప్రాయపడ్డాడంటే కవిత్వాన్ని చదివే సమాజం ధనస్వామికంలోనిదిగా భావించడంవల్లనే. నిజానికి కవి ఏపదాలు వాడాడన్నది కాదు అతని కవితాగౌరవాన్ని నిర్ణయించేది; వాటిని ఎలా వాడుకోగల్గాడన్నదే. ఉదాత్తభాషవాడిన మనుచరిత్ర, సామాన్యభాషవాడిన ఎంకిపాటలు కవిత్వభావనలో సమానమైనవే. మొదటిది పండితుల నలరిస్తే రెండవది పామరుల నలరిస్తుంది. ఈ రెండు స్థాయిలను కలపాలనే శ్రీశ్రీ అభిప్రాయ పడ్డాడు. శ్రీశ్రీ శైలిలో ఒకానొక మార్మికత ఉంది. అది పదాల అంతర్జీవిత ప్రతిష్ఠకు సంబంధించినదే. The mastery of the secret inner life of words (then), is the real mystery of style.[4] అన్నట్లు అతిసామాన్యవాక్యాల్లో అసామాన్యభావాలను వ్యక్తంచేయగలిగాడు శ్రీశ్రీ. అత్యున్నతభావవ్యక్తీకరణకు సామాన్యభాష కూడా శ్రీశ్రీకి ఉపయోగించింది. ఇది శ్రీశ్రీ నేర్పరితనమే - ప్రతిభే - కానీ పరికరాల గొప్పతనం కాదు. ఇవేమిటీ వింతభయాలు, ఇవేమిటీ అపస్వరాలు, అవేమిటా రంగుల నీడలు, ఎచటికీ పోతావీరాత్రి-ఇంట్లో చీకటి - తెగింది తీగ - చావూ బ్రతుకూ - అవతలిగట్టుకు అనే వాక్యాలూ పదాలూ కూడా అతిసామాన్యాలే అయినా కవి కల్పించిన ప్రకరణాన్ని బట్టి అసామాన్యార్థాలను ద్యోతకంచేశాయి

నదీనదాలూ అడవులు కొండలు ఎడారులా మన కడ్డంకి ? - మరోప్రపంచం పిలిచింది - వానకాలం ముసిరి రాగా నిలువునిలువున నీరు కాలేదా - విడిన మబ్బులనడుమనుండీ వేగుజుక్కా వెక్కిరించింది - ఎముకముక్క కొరుక్కుంటు ఏమీ అనలేదు కుక్క - ఒక ఈగరు పడవేసుకు తొందరగా తొలగె తొండ - ప్రభువెక్కిన పల్లకి కాదోయ్ అది మోసిన బోయీ లెవ్వరు ?- మా వంట మేమే వండుకోవాలి- ఒక్కొక్కమారు విస్తరే దొరకదు - వంటి వాక్యాలు సామాన్యమైనవి. భావాలు అసామాన్యమైనవి.

కవిత్వంలో శ్రీశ్రీ మాట్లాడినంతగా శ్రీశ్రీ పాత్రలు మాటాడవు. మాట్లాడిన పాత్రలైనా మితభాషులే. అవతలిగట్టులోనూ పరాజితులులోనూ ప్రశ్నించేవాడూ జవాబిచ్చేవాడూ మితంగానే మాటాడతారు. ఆ మితభాషణంలో అనేక వ్యంగ్యాలు వినిపిస్తాయి. 'వాడు' ఖండికలో శ్రామికులకూ యజమానికీ జరిగే సంభాషణలు చిన్నచిన్నవే. వ్యత్యాసంలో శ్రామికులే కానీ బూర్జువాలు మాటాడరు. ఒక పాత్రతరఫున న్యాయవాదిగా శ్రీశ్రీ వాదించటమే మహాప్రస్థానంలో ఎక్కువగా కనిపిస్తుంది. మరోప్రపంచం అని మొదలుపెట్టి ఇలా చూడు నీకోసం ఇదే నా మహాప్రస్థానం అని ముగించేవరకూ శ్రీశ్రీ ఒక మహావక్తగా భాసించాడు. వక్తకు కావలసిన ఆలోచన, ఆవేశం సమ్మిళితమై లయతో పరుగెత్తడమే శ్రీశ్రీ విశిష్టతల్లో ప్రముఖమైనది.

3 Understanding Poetry 4 Lectures on style and composition.

## 63/సాహసి

## ఎగిరించకు లోహవిహంగాలను ! కదిలించకు సుప్తభుజంగాలను !

1934 జూలై 9

సమాజాన్ని మార్చడానికి ప్రయత్నించే అతివాదులకూ సమాజాన్ని ఉన్నది ఉన్నట్లు భద్రంగా ఉంచడానికి ప్రయత్నించే మితవాదులకూ అనంతంగా జరుగుతున్న సంఘర్షణలో అతివాదులకుండే సాహసం, కార్యదీక్ష అమానుషాలుగా కనిపిస్తాయి. తాత్కాలికంగా అతి వాదుల విప్లవధోరణుల్ని అపార్థం చేసుకుంటుంది సమాజం. వీళ్ళు సమాజానికీ సంప్రదాయానికీ ద్రోహం తలపెడుతున్నారని మితవాదులు భావించినా, ఆ విద్రోహంవల్లనే ప్రపంచం పురోగమనంసాగిస్తుంది.

అతివాదులైన విప్లవకారులు సామాజికమైన అన్యాయాలమీద తిరుగుబాటు చేయడానికి వారిలోని రజోగుణం సహకరిస్తే; మితవాదులు చేసే 'హితబోధల'కు వారిలో ఉండే సాత్త్విక ప్రవృత్తి, సంయమనం కారణమవుతూ ఉంటాయి. ఈ విపరీతసంయమనం మానవుడి పురోగమ నాన్ని- వక్రమార్గాలకూ పట్టించవచ్చు; ఆలస్యమూ చేయవచ్చు. విప్లవవాదులు కాలంకన్నా ముందుకు ఊహలను సారించి, క్రియారూపంలోకి వాటిని సాధ్యమైనంత త్వరగా పరివర్తిస్తారు. ఇందువల్ల సమాజవిప్లవం అతివేగంగా సాధ్యమవుతుంది.

సామ్యవాదావతరణానికి రష్యాలో లెనిన్ జరిపించిన తిరుగుబాటు అతివాదానికీ; పరపీడనా విముక్తికి ఇండియాలో గాంధీ జరిపిస్తున్న (1934 నాటికి) సత్యాగ్రహం, అహింసావిధానం మితవాదానికీ ఉదాహరణలుగా స్వీకరించవచ్చు. గాంధీ అవలంబించిన విధానం స్వాతంత్ర్యసాధ నకు వేగం సమకూర్చలేకపోయింది; సామ్యవాదాన్ని సాధించలేకపోయింది.

గ్రాంథికభాష యథాతథంగా వర్ధిల్లడానికి జయంతి రామయ్యపంతులు ప్రభృతులు చేసిన సన్నాహాలు యథాస్థితివాదానికి ఉదాహరణలు కాగా వ్యావహారికభాష వికసించడానికి గిడుగు రామమూర్తి తెచ్చిన విప్లవం అతివాదానికి ఉదాహరణ. గ్రాంథికభాషావాదులు వాడుక భాషలో కవిత్వం రాసేవాళ్ళకు నిషేధరూపంలో హితబోధచేశారు. అది వారి సంప్రదాయ పరత్వానికి మాత్రమే కాదు; చరిత్రపరిణామక్రమం తెలుసుకోలేని అజ్ఞానానికికూడా నిదర్శనం.

సంప్రదాయవాదుల, సనాతనుల నిషేధాలకు చరిత్ర తలఒగ్గే కాలం చెల్లిపోయిందంటే సమాజవ్యవస్థలో ఎంత వేగంగామార్పు వస్తున్నదో తెలుస్తుంది. ఈ మార్పును బాగా గుర్తించాడు శ్రీశ్రీ. అందువల్లనే గ్రాంథికపు కట్టుబాట్లనీ, ఛందస్సుల సంకెళ్ళనీ వ్యాకరణాల అవరోధాల్నీ త్వరగా ఛేదించుకోగలిగాడు; సమాజవిప్లవాన్ని గౌరవించగలిగాడు. అతివాదిగా మారి 'తిట్లు తినడానికి' కూడా సిద్ధం అయ్యాడు. "భవిష్యత్తులో తానే జయించితీరతాననే" విశ్వాసం పొందాడు. "విప్లవకారులే ప్రపంచోద్ధారకులు" అనీ "అతివాది కావడం, విప్లవకారుడు కావడం, మానవచరిత్రను మార్చడం ప్రతివ్యక్తిలోనూ లేదు. ఈ అల్పసంఖ్యాకులే చరిత్రక్రమం మార్చేది" అనీ "అతివాదికి వెంటనే బోధపడ్డది మితవాదికి చాలాకాలానికి కాని బోధపడదు. బోధపడినా ఆచరించడానికి దూకే సాహసం ఉండదు" అనీ "అనాదినుండీ సనాతనుల సంప్రదాయపరత్వానికీ అతివాదుల సంస్కారప్రియత్వానికీ సంఘర్షణ వస్తూనే ఉన్నది" అనీ అంటూ శ్రీశ్రీ ఒక సందర్భంలో రాసిన వాక్యాలు[1] ఈ సందర్భంలో జ్ఞాపకానికి వస్తాయి.

ఈ అవగాహనతో శ్రీశ్రీ 1934 జూలై 9వ తేదీన 'సాహసి' ఖండికను రచించి, మితవాదుల విపరీతసంయమనాన్నీ హితబోధనీ ఎత్తిపొడిచాడు. కవితావస్తుసంవిధానాలలో 'సాహసి' అవుతున్న శ్రీశ్రీనే సంప్రదాయవాదులు ఎలా మందలిస్తారో ఆ మందలింపుకు అద్దంపట్టిన ఖండిక "సాహసి". ఎగిరించకు లోహవిహంగాలను! కదిలించకు సుప్తభుజంగాలను! పలికించకు మౌనమృదంగాలను! హృదయంలో దీపం పెట్టకు! మంత్రనగరి సరిహద్దులు ముట్టకు! వంటి నిషేధవాక్యాలన్నీ మితవాదులవే కానీ వాటిని అతివాది అనుకరించి చెప్పినప్పుడు వ్యతిరేకార్థం స్ఫురిస్తుంది.

## శ్రీశ్రీ సాహసమనస్తత్త్వం

మహాప్రస్థానంలో శ్రీశ్రీ అతివాదిగానే కనిపిస్తాడు కానీ ఎక్కడా మితవాదిగా యథాస్థితివాదిగా కనిపించడు. శ్రీశ్రీలోని సాహసమనస్తత్త్వం ఏ ముసుగూ లేకుండా అనేకపాదాల్లో గోచరిస్తుంది. "పాతపదాలు, డిక్షన్, వర్ణనలు, అలంకారాలు, ఛందస్సు, ఉపమానాలు, పద్ధతులు, ఆచారాలు కవిత్వంలోవీ జీవితంలోవీ ఇంక మళ్ళీ లేవకుండా వాటి నడ్డి విరక్కొట్టాడు శ్రీశ్రీ. ధ్వంసంచేసి రోడ్డు వేశాడు. పదండి ముందుకు పడండి త్రోసుకు అంటున్నాడు. తాము వేటని ఎదిరించలేక ప్రతిదినమూ లొంగిపోతున్నారో ఆ నిరంకుశాధికారుల నెత్తిమీద నాలుగు దెబ్బలు కొట్టాడని యువకులు చెలంమీద చూపే అభిమానం చాలదు శ్రీశ్రీకి; తామూ యింకో నాలుగు దెబ్బలు కొట్టగల శక్తిని తెచ్చుకోమంటున్నాడు మనుష్యుల్ని" అంటూ చెలం రాసిన యోగ్యతాపత్రంలో శ్రీశ్రీగారి అతివాదాన్నే మెచ్చుకోవడం జరిగింది.

---

1 చూ. శ్రీశ్రీసా ఒకటి. కావ్య. 217 పే.

'అవతలిగట్టు' ఖండికలో మితవాది వేసే ప్రశ్నలకు అతివాది ఇచ్చే జవాబుల్ని రాసిన శ్రీశ్రీ, 'సాహసి' ఖండికలో మితవాది హితబోధలను అతివాది తిరస్కరించడాన్ని చిత్రించాడు. తీవ్రమైన విప్లవభావాలను మెదడులో దాచుకోలేని సాహసి వాటిని ప్రపంచంలోకి వదులుతూనే ఉంటాడు. అతడ్ని మితవాది: ఎగిరించకు లోహవిహంగాలను ఉండనీ మస్తిష్కకులాయంలో అని మందలిస్తాడు. ఈ మందలింపును అతివాది వెక్కిరిస్తే ఎగిరించు లోహవిహంగాలను ఉండనీయకు మస్తిష్క కులాయంలో అని ధ్వని స్ఫురిస్తుంది. రెక్కలతో ఆకాశంలోకి ఎగిరిపోవడం పక్షికి గల స్వేచ్ఛాసహజాతం. ఇక్కడ పక్షి జీవజాలంలోనిది కాదనడానికి లోహవిహంగం (విమానం) అనేమాట ఆధారం. ఈ లోహవిహంగం మానవుడు విప్లవవాది అయి, సృష్టించే యుద్ధాన్ని జ్ఞాపకం (evoke) చేస్తుంది. అది అతని మస్తిష్కకులాయం (మెదడు గూడు) లో ఉంది. అలా ఉండిపోవడం అసహజం. కానీ దాన్నే సమంజసంగా భావిస్తాడు మితవాది. అది అసహజమనీ దాన్ని ప్రపంచంలోకి వదిలిపెట్టడమే చారిత్రకకర్తవ్యం అనీ అంటాడు అతివాది.

పారిశ్రామికయుగంలో కవిగా కళ్ళు తెరిచిన శ్రీశ్రీని 'లోహవిహంగాలు' ఆకర్షించాయి. కవితాదర్శనంలో శ్రీశ్రీ కనుగొన్న దృశ్యాలలో ఎగిరే లోహశ్యేనం ఒకటి. రెండవప్రపంచ యుద్ధంలో రష్యా విమానబాహువులు విసరడాన్ని శ్రీశ్రీ సమర్థించాడు. ఎగిరిన ఇనుప డేగగా విమానాన్ని ఉత్ప్రేక్షించి, అది ద్రోహాలను తూలగొట్టి, శాంతిని తెస్తుందని భావించాడు. అందువల్లనే లోహవిహంగాలను ఎగిరించవద్దనడం శ్రీశ్రీ ఆశయానికి విరుద్ధమవుతోంది.

చిరదీక్షాశిక్షాతపస్సమీక్షణలో నిశ్చలసమాధిలో సర్గద్వారపుతోరణమై వ్రేలిన మస్తిష్కం శ్రీశ్రీది. ఈ మస్తిష్కంలోనే అతనికి ఘోషలు, భాషలు, దృశ్యాలెన్నో తోచాయి. కవిత్వానికి ఆలోచననూ దృక్పథాన్నీ ప్రధానంగా భావించిన శ్రీశ్రీ, మస్తిష్కాన్ని కులాయంగా భావించడం; అందులో నివసించే భావాలను లోహవిహంగాలుగా భావించడం; వాటిని ఎగిరించబూనుకోవడం అతివేలమైన అతివాదానికి నిదర్శనాలే.

సామ్యవాదాన్ని కోరే అతివాది పీడకవర్గాన్ని ద్వేషించకమానడు. ఈ ద్వేషాన్ని తిరస్కరించే మితవాది సుప్తభుజంగాలను కదిలించవద్దంటాడు. ఈ హితబోధను అనుకరించి వెక్కిరించడమే అతివాది చేస్తున్నది. మనోవల్మీకంలో నిద్రించే భుజంగాలను కదిలించమంటాడు అతివాది. భుజంగాలకు కదలడమే సహజచైతన్యం. కానీ కుబుసంతో ఉన్న భుజంగాలు వల్మీకంలో నిద్రిస్తూ ఉంటాయి. వాటిని కదిలించడం అపాయకరమే. ఈ భుజంగాలు మనోవల్మీకంలోనివి కావడంవల్ల వాటిని కదిలించడమే కర్తవ్యంగా అతివాది భావిస్తాడు.

మరోప్రపంచానికి త్రాచులవలె సాగాలని శ్రీశ్రీ చెప్పాడు. నవకవనం పెనునిద్దుర వదిలించాలన్నాడు. ఇరవై కోరల అరవై కొమ్ముల క్రూరఘోరకర్కోటకులను ప్రపంచంలో

శ్రీశ్రీ చూశాడు. స్విన్‌బర్న్‌కవి పాటలు శ్రీశ్రీకి విషంగ్రక్కే భుజంగాలవలె తోచాయి. రెండవ ప్రపంచయుద్ధంలో ఫాసిస్టుల మీద ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచిందన్నాడు శ్రీశ్రీ.

ఆధునిక చైతన్యం ఇద్దరు అంతర్జాతీయ తాత్త్వికులవల్ల ప్రచారానికి వచ్చింది. మొదటివాడైన మార్క్సు చరిత్రకు, ప్రపంచానికి నూతనభాష్యం రచించి మానవుడి మస్తిష్కంమీద ప్రభావం చూపిస్తే రెండవవాడైన ఫ్రాయిడ్ మానవుడి ప్రవర్తనకు నూతన వ్యాఖ్యానం చేసి మానవుడి మనస్సుపై ప్రభావం చూపించాడు. ఈ యిద్దరినీ తనకు మార్గదర్శకులుగా తీసుకున్న శ్రీశ్రీ, మస్తిష్కాన్నీ మనస్సునీ ఆలోచనసీ ఆవేశాన్నీ సమంగా, తనకవిత్వంలో ప్రదర్శించాడు. మస్తిష్కకులాయంలోని లోహవిహంగాలను ఎగిరించాలని చెప్పుతున్న శ్రీశ్రీయే మనోవల్మీకంలోని సుప్తభుజంగాలను కదిలించాలని చెప్పాడు. సుప్తభుజంగాలు సుప్తవాంఛలే. మనోవల్మీకం అంటే మనస్తత్త్వశాస్త్రంలోని ID.[2] ఫ్రాయిడ్ సైకోఎనాలిసిస్‌ను చదువుతున్న శ్రీశ్రీ వర్గచైతన్యంతో రాసిన కవితయే సాహసి.

మార్క్సునూ ఫ్రాయిడ్‌నూ మేళవించుకున్న మేధావీ ఆవేశపరుడూ శ్రీశ్రీ కావడంవల్లనే మహాప్రస్థానంలో ఆలోచనా ఆవేశం కలగాపులగం అవుతూ ఉంటాయి. శ్రీశ్రీ మాటలలోనే అతని కవిత్వం 'చెలరేగిన కలగాపులగపు విలయావర్తపు బలవత్ ఘురవత్ పరివర్తన'మే. మనోవల్మీకంలోని సుప్తభుజంగాల కదలికను శ్రీశ్రీ మహాప్రస్థానంలోని కొన్ని భావచిత్రాలలో చూపించి ఉన్నాడు. ఉన్మాది మనస్సినీవాలిలో ఘూకం కేకా భేకం బాకా—ఉన్మాది మనఃప్రపంచపు మహారణ్యపు చిక్కుదారులు—అపుడే ప్రసవించిన శిశువు నెడదనిడుకొని రుచిర స్వప్నాలను కాంచే జవరాలి మనఃప్రపంచపుటావర్తాలు – ఒక క్షణంలో మనస్సులో ఏదో స్మృతి – మొదలైనవి.

విహారం విహంగాల చైతన్యం; సంచారం భుజంగాల చైతన్యం! ఈ విహారసంచారాలను సహించలేని మితవాదులు : అంతరాళభయంకర ప్రాంతరాలనా నీ విహారం ? ముళ్ళదారినా నీ సంచారం ? అని అతివాదిని ప్రశ్నిస్తే, అతివాది ఆ మాటలనే అనుకరించి అంతరాళభయంకరప్రాంతరాలనే విహారం అనీ ముళ్ళదారినే సంచారం అనీ రూఢిపరుస్తాడు. ఆధారం లేని అంతరాళంలో భయంకరప్రాంతరాల్లో రెక్కలు విప్పుకు ఎగరగల శక్తి పక్షికి ఉన్నా పడిపోతావు సుమా అని హెచ్చరించేవారు మితవాదులు. లోహవిహంగం ఎలా పడిపోతుంది? ముళ్ళదారిలో సంచరించగల ధీమా భుజంగానికున్నా ముళ్ళు గుచ్చుకుంటాయని మితవాదులు హెచ్చరిస్తారు.

---

2 ID=the part of the psyche that is the source of instinctive energy. It's impulses are modified by the ego and super ego. —R. H. D.

కానీ కుబుసం ఊడ్చిన పాము వీరి హెచ్చరికను లెక్క చేయదు. ఈ విహారసంచారాలు అతివాదివే. నదీనదాలూ అడవులు కొండలు ఎడారులా మనకడ్డంకి ? అనేవాడు అతివాదియే_ నెత్తురు మండే శక్తులు నిండే సైనికులు అతివాదులే. నే నొకదుర్గం! నా దొకస్వర్గం! అనర్గళం, అనితరసాధ్యం, నా మార్గం! అని చాటుకునేవాడు అతివాదియే. 'తిట్లూ రాట్లూ పాట్లూ వస్తే రానీ' అనగలిగే వాడు అతివాదియే. రాత్రి అయినా లెక్కచేయక అవతలిగట్టుకు పోతాననేవాడు అతివాదియే. నిప్పులు చిమ్ముకుంటూ నింగికెగిరిపోయేవాడు అతివాదియే. ముళ్ళూ రాళ్ళూ అవాంతరా లెన్ని ఉన్నా ముందుదారి మాది అని చెప్పుకోగలవారు అతివాదులే.

మౌనమృదంగాలను పలికించకు అని చెప్పే మితవాది అలా చెప్పడానికి కారణం ఉద్రేకాలూ వీరసంరంభాలూ సహించలేని సాత్త్వికప్రవృత్తియే. మౌనం వహించడం మితవాది లక్షణం. మౌనమృదంగాలను పలికించు అని సాహసి సూచన. "బాధ, మరణం, దరిద్రం, అవిశ్వాసం, అశాంతి ఇవన్నీ అర్థంకాక సృష్టినే ప్రశ్నిస్తున్న యువకుల లక్షకంఠాన్ని ఏకంచేసి పలుకుతున్న" శ్రీశ్రీ-మౌనమృదంగాలను మెచ్చుకోలేడు.

శ్రీశ్రీ కవిత్వంనిండా అల్లకల్లోలపు ఘోషలే కానీ మౌనాలు లేవు. కదం త్రొక్కుతూ పదం పాడుతూ హృదంతరాళం గర్జిస్తూ ముందుకు పోవాలన్నాడు శ్రీశ్రీ. ప్రళయఘోషలూ కంచునగారాలూ వాద్యాలూ ఊళలూ వెర్రిగొంతుకలూ కేకలూ తుపానుమేఘపు గర్జనలూ ఝంఝానిలషడ్జధ్వానాలూ రణన్నినాదాలూ శంఖారావఢంకాధ్వానాలూ ఫిరంగుల మృదంగాలూ ఘూకం కేకలూ భేకం బాకాలూ జలపాతాల పాటలూ విప్లవశంఖాలూ సాగరఘోషలూ రథనాదాలూ గంటల గణగణలూ కమాచిరాగాలూ కంకణనిక్వాణాలూ యుద్ధగుంజన్మృదంగాలూ శ్రీశ్రీ కవిత్వంలో ఉన్నాయి. ఇవన్నీ మౌనమృదంగాలకు విరుద్ధాలే. అతివాది దోపిడీసమాజాన్ని చూస్తూ మనకెందుకులే అని మౌనం వహించలేడు.

శ్రీశ్రీ కవిత్వాన్ని పాల్ రోబ్సన్ వంటి నీగ్రోగాయకుడి సంగీతంతో పోల్చి ఆ సంగీతకవిత్వానికి హద్దులూ ఆజ్ఞలూ లేవనీ లక్షణాతీతంగా రాగాతీతంగా అది చెవులు కీర్రుమనేటట్లు ఉంటుందనీ చెప్పిన చెలం: మౌనమృదంగాన్ని శ్రీశ్రీ మెచ్చుకోలేడని తెలుసుకున్నాడు.

కదలికలేని ప్రజాసముద్రం శాంతతరంగాలవల్ల గోచరించే విషయం. ఉద్రేకరహితంగా చైతన్యవిరహితంగా పడిఉన్న ప్రజాసముద్రాన్ని కెరలించడమే అతివాది లక్ష్యం. అలా చేయవద్దంటాడు మితవాది. మహాప్రస్థానం అనే గీతంలో శ్రీశ్రీ ప్రజలను కెరలించడానికే ఆవేశం ప్రదర్శించాడు. 'నెత్తురు మండే శక్తులు నిండే సైనికులారా రారండి అనడం ఉద్రేకపరచడానికే.

హృదయంలో దీపం పెట్టగలిగినవాడు విప్లవకారుడు కాగా ఆ దీపం హృదయాన్ని దహిస్తుందేమో అని భయపడేవాడు మితవాది. దీపం పెట్టవలసిన అవసరం వచ్చిందంటే ఆ స్థలం

చీకటితో నిండిఉందన్నమాటే. హృదయాలు వాస్తవజ్ఞానం లేకపోవడంవల్ల భ్రాంతిలో ఉన్నాయి. ఈ భ్రాంతియే జడత్వానికి కారణం.

దీపం- శ్రీశ్రీ భావనలో సామాజిక చైతన్యమే. ఈ చైతన్యాన్ని శ్రీశ్రీ అగ్నిప్రతీకతో వ్యక్తంచేశాడు. మరోప్రపంచపు త్రేతాగ్ని, అగ్నికిరీటం, హోమజ్వాలలు, అనలవేదిక, ప్రపంచాగ్ని, జ్వాలాతోరణం, రుద్రాలిక నయనజ్వాలిక, వికసించిన విద్యుత్తేజం, అగ్గిపుల్ల, శ్యమంతరోచిర్నివహం, అగ్నిసరస్సు, వెలుగుల రవ్వలజడి, ఆకాశదీపం, హృదిలో జ్వాలలు, నిటాలాగ్ని మొదలైనవి మహాప్రస్థానంలో కనిపిస్తాయి.

అతివాది రహస్యాలోచనలు సాగించే సంకేతస్థలం మంత్రనగరి. అక్కడికి పోతూఉంటే మితవాది అతడ్ని ఆపి 'మంత్రనగరి సరిహద్దులు ముట్టకు' అని ఆంక్షవిధిస్తూ ఉంటాడు. దీన్నే అతివాది వేళాకోళం చేస్తాడు.

వేదఋక్కుల్ని మంత్రాలుగా వ్యవహరిస్తారు. మంత్రం రహస్యమైన ఒక విద్య. భౌతికవాది దృష్టిలో రహస్యవిద్య ఉండదు. హరోంహరోం హరహరహరహరహర అనేది విప్లవవాది తన అనుయాయులకు ఉపదేశించిన మంత్రమే. 'అటు నను మంత్రించిన సమ్ముగ్ధం గావించిన ఆ గాంధర్వానికి' అనీ 'నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ నా జాతిజనులు పాడుకొనే మంత్రంగా ప్రయోగించాలని' అనీ మంత్రకవాటం అనీ శ్రీశ్రీ మంత్రశబ్దాన్ని ప్రతీకాత్మకంగా వాడాడు.

### శ్రీశ్రీ పదచిత్రాలలో ఆధునికచైతన్యం

శ్రీశ్రీ పదచిత్రాలలో 20వ శతాబ్దపు వైజ్ఞానిక పారిశ్రామిక చైతన్యం ప్రతిబింబించే సందర్భాలు కనిపిస్తాయి. పరిమళవిలాసాలు, వలపుకౌగిలి, పాతాళలోకంపుటిరుకుసందులు, ఆకాశమంటపము, అశ్రురుఝరులు, నిట్టూర్పుదొంతరలు, సుప్త పత్రాలు, నిదురబరువు మొదలైనవి భావకవుల పదచిత్రాలు. లోహవిహంగం, మౌనమృదంగం, లోహశ్యేనం, అగ్నిసరస్సు, లోహరాక్షసులు, విషవాయువులు, మరణమృదంగం, యుద్ధగుంజన్మృదంగాలు, రెక్కవిప్పిన రివల్యూషన్, పేకమేడలు, ప్రేమపురాణం, రేడియో బాకా, విమానబాహువులు, సుప్తకంకాళం, ఇనుపడేగ, మంటపంట వంటివి శ్రీశ్రీ విమాత్న పదచిత్రాలు.

మానవసహజాలయిన అనుభవాలను, చేష్టలను నిర్జీవవస్తువులకు, భావాలకు ఆరోపించి కొన్ని పదచిత్రాలు తయారుచేశాడు శ్రీశ్రీ. ప్రయోగింపబడని మృదంగాలను మౌనమృదంగాలనడం ఈ శిల్పమే. కదలని తరంగాలను శాంతతరంగాలనడం, వ్యాపించిన విప్లవాన్ని రెక్కవిప్పిన రివల్యూషన్ అనడం విచిత్రమైనవి.

## శ్రీశ్రీ ఛందోవచనగీతం

ఛందోగమనం రైలుబండినడక వంటిదనీ వచనగమనం విమానవిహారం వంటిదనీ శ్రీశ్రీ ఛందోగీతానికీ వచనగీతానికీ గలతేడాను చర్చిస్తూ ఒకమాటు అన్నాడు. ఛందోగీతంయొక్క వేగాన్నీ వచనగీతం యొక్క వేగాన్నీ గుర్తించిన శ్రీశ్రీ, ఆ రెండింటి వేగాలనూ ఒకే కవితలో ప్రదర్శించడానికి 'సాహసి' ఖండికలో ప్రయత్నించడం కూడా శ్రీశ్రీ సాహసాన్ని సూచిస్తోంది. ఛందోగీతానికీ వచనగీతానికీ మధ్యస్థంగా నిలిచే గీతంగా 'సాహసి'ని శ్రీశ్రీయే స్వయంగా పేర్కొన్నాడు. జంతుపరిణామనిశ్రేణిలో సరీసృపానికీ పక్షికీ నడుమ Archaeopteryx అనే ప్రాచీన పక్షి ఒకటి ఉండేదనీ దానికి సరీసృపలక్షణాలు కొన్నీ పక్షిలక్షణాలు కొన్నీ ఉండేవనీ తన జంతుశాస్త్ర పరిజ్ఞానం నిరూపించుకుంటూ సాహసి గీతాన్ని Archaeopteryx తో పోల్చడంలోని చమత్కారం ఆ గీతంలోని లోహవిహంగ, సుప్తభుజంగాల ప్రస్తావననుబట్టి అర్థమవుతుంది. ఎగిరించకు లోహవిహంగాలను/కదిలించకు సుప్తభుజంగాలను/ఉండనీ/మస్తిష్కకులాయంలో/మనోవల్మీకంలో అనే 5 పాదాల గీతంలో మొదటి రెండు పాదాలూ అక్షరగణసామ్యం కలవి కావడంచేత ఛందోగీతమూ 'ఉండనీ' అనే మాటా తరువాతి రెండూ పాదాలూ విషమ పాదాలు కావడంచేత వచనగీతమూ వెరసి ఛందోవచనగీతం అయిందని శ్రీశ్రీ అభిప్రాయం.

పై ఉదాహరణంలోని మొదటిరెండుపాదాలూ ఒక చతుష్పాదివృత్తాన్ని ద్విపాది వృత్తంగా మార్చుకుంటే లభించే ఛందోగీతం అవుతున్నాయి. ఈ రెండుపాదాలలో ససభ అనే అక్షరగణాలుండటంవల్ల వచ్చిన నడక కొంచెం దగ్గరగా తోటకవృత్తంలోది. తోటకంలో ససస అనే గణాలుండటమే కాక అది చతురస్రగతిలో నడుస్తుంది. ఈ పాదాలనే కొద్ది మార్పుతో తోటకంగా మార్చివేయవచ్చు.

ఎగిరించకు లోహవిహంగాలను=ఎగిరించకు లోహవిహంగములన్

కదిలించకు సుప్తభుజంగాలను=కదిలించకు సుప్తభుజంగములన్.

ఇటువంటి ఛందోగమనాన్ని శ్రీశ్రీ తన మహాప్రస్థానగీతాల్లో కొన్నిచోట్ల చూపించాడు:—ఎగరేసిన ఎర్రని జెండా (ససగగ) - పలికించకు మౌనమృదంగాలను (ససభ) - కెరలించకు శాంతతరంగాలను (ససభ) - శ్రమనిష్ఫలమై జనినిష్ఠురమై (ససస) - పరమాత్ములు ఓ చిరుతల్లారా (ససగగ) - సెలయేళ్ళను లేళ్ళను లాలిస్తూ (ససగగ) - ఒకమారిచటా ఒకమారచటా (ససస) - ఇపుడూ అపుడూ ఎపుడూ మోగెడు (ససభ) - హసనానికి రాణివినీవై (ససగ) - వ్యసనానికి బానిసనేనై (ససగ) - విషవాయువులై ప్రసరిస్తే (ససగ) - విరితేనియలై ప్రవహిస్తే (ససగ) - చిగురించిన తోటలలోనో (ససగ) - చితులుంచిన చోటులలోనో (ససగ)- నరజాతిచరిత్ర సమస్తం (సరసగ) - బలవంతులు దుర్బలజాతిని (సససలల) - ఇతరేతరశక్తులు లేస్తే (ససగ) - ఒకజాతిని వేరొక జాతీ (ససగ) - ఇతిహాసపుచీకటి కోణం (సససగ) - ప్రభు

వెక్కిసపల్లకి కాదోయ్ (ససనగ) - బలవంతుడివో బలహీనుడివో (సససస) - అవగాహన నాకవ్వు తాయి (సససల) తలవంచుకునే వెళిపోయావా (సససగగ) చిరునవ్వులనే పరిషేచన చేస్తూ (సససగగ) మొదలైన పాదాల నడకలు భావాలకు పోషకాలుగా కనిపిస్తాయి. పెక్కు పాదాల్ని సగణంతో మొదలుపెట్టడం శ్రీశ్రీ గమనమర్మం.

## శ్రీశ్రీ పాదానుప్రాసలు

రెండేసి పాదాలకు అనేక శబ్దసాదృశ్యాలను కూర్చి పాఠకుడి శ్రవణరసనేంద్రియాలను సంతృప్తిపరచడం తోపాటు భావోద్దీపనం కలిగించడం శ్రీశ్రీ కవిత్వంలోని ఒక విశిష్టలక్షణం. ఈ లక్షణం వల్లనే శ్రీశ్రీ శబ్దాలంకారప్రియుడనిపిస్తుంది. ముఖరమధీరం త్యజమంజీరం చలసఖి కుంజం సతిమిరపుంజం వంటి జయదేవుడి శబ్దశిల్పమే ఇందుకు మార్గదర్శకంఅయి ఉండవచ్చు. ఉదాహరణకావ్యాలలోని కళికలు, ఉత్కళికలల్లో ఇదే శబ్దవైచిత్రి విధిగా ఉంటుంది. అబ్బూరి రామకృష్ణారావుగారి శైలిలో ఇలాంటి శబ్దవైచిత్రి ఉంది. 'పృథివీప్రశంస'లో ఓవిశాలావనీ శోభాతిపావనీ - ప్రాభాతగానమ్ములా నీ యస్తమానమ్ములా - త్వాత్కాయమానమ్ములై శ్యామాయమానమ్ములై; 'తిక్కన సోమయాజి'లో మడుగుసన్ననిపాట పొడుచు వెన్నెలతేట- అలరు మల్లియపువ్వునందు పిన్ననినవ్వు వంటి పాదసాదృశ్యాలున్నాయి. పలికించకు మౌనమృదంగాలను కెరలించకు శాంతతరంగాలను అనేరెండుపాదాలలోనూ ఇలాంటిసాదృశ్యాలు వాక్యాలలో గణాలలో పదాల్లో అక్షరాల్లో పదవిరామాల్లో క్రియల్లో వాక్యారంభాల్లో వాక్యాంతాల్లో విభక్తులలో ప్రాసల్లో విశేషణాల్లో ధ్వనుల్లో కనిపిస్తాయి. ఈ పోలికలేకాక రెండుపాదాల్లోనూ ఇటు నుంచీ అటునుంచీ మూడవఅక్షరం ప్రక్కను పూర్ణానుస్వారం రావడం మరోపోలిక. ఎగిరించకు లోహవిహంగాలను/కదిలించకు సుప్తభుజంగాలను - కదంత్రొక్కుతూ/పదం పాడుతూ - బాటలునడచీ/పేటలు కడచీ - నెత్తురుమండే/శక్తులునిండే - త్రాచులవలెనూ/రేచులవలెనూ- స్మరిస్తే పద్యం/అరిస్తేవాద్యం - నేనొకదుర్గం/నాదొక స్వర్గం - అనుపమితా/అపరిమితా-హాలాలనన్నీ/హాలాల దున్నీ - ఘర్మజలానికి/ధర్మజలానికి - పరిక్లమిస్తూ/పరిప్లవిస్తూ - కణకణమండే/గలగల తొణకే - కార్మికలోకపుకల్యాణానికి / శ్రామికలోకపుసౌభాగ్యానికి - సమర్పణంగా/సమర్చనంగా - త్రిలోకాలలో/త్రికాలాలలో - తొణకిన స్వప్నం/తొలగిన స్వర్గం - నీకంకణనిక్వాణంలో/నాజీవననిర్యాణంలో - హసనానికి రాణివి నీవై/వ్యసనానికి బానిస నేనై-వాసంత సమీరం నీవై/హేమంతతుషారం నేనై - వలయమ్ములై చలించినపుడే/విలయమ్ములై జ్వలించినపుడే - సఖులవలన పరిచ్యుతులు/జనులవలన తిరస్కృతులు - ఓ వ్యథానివిష్టులార/ఓ కథావశిష్టులార - నిటాలాక్షి పగిలిందట/నిటాలాగ్ని రగిలిందట - హాలాహలం పొగచూరింది/కోలాహలం చెలరేగింది - మొదలైన వనేకంగా కనిపిస్తాయి. ఈ పాదానుప్రాసలే శ్రీశ్రీ కవిత్వం జ్ఞాపకానికి నిలిచిపోవడానికి కారణాల్లో ఒకటి. వీటివల్ల అద్భుతమైన లయ ఏర్పడి ఈమార్గం అనితరసాధ్యం అనర్గళం అయిపోయింది.

## 64/కళారవి

## కానీ! కానీ! గానం, ధ్యానం, హాసం, లాసం!

1934 జూలై 11

కళాప్రయోజనం గురించి ఆదర్శవాదులకీ భౌతికవాదులకీ భిన్నాభిప్రాయా లున్నాయి. ఆ రెండు తెగలవారికీ ఉండే ప్రాపంచికదృక్పథం భిన్నమయినది కావడమే అందుకు కారణం. కళ లోకోత్తరమైన ఆనందం కలిగిస్తే చాలనీ ఉపదేశం దాని ఆనుషంగికప్రయోజనమనీ ఆదర్శవాదుల అభిప్రాయం అయితే కళ సమాజవ్యవస్థ మారడాని కొక పరికరంగా ఉపయోగపడాలని భౌతికవాదుల అభిప్రాయం! భౌతికవాదులకు భౌతికాభ్యుదయమే పరమలక్ష్యం కాగా ఆదర్శవాదులకు సద్యఃపరనిర్వృతి పరమలక్ష్యం! ఈ సద్యఃపరనిర్వృతికి సౌందర్యసృష్టిని సాధనంగా భావించి ఆదర్శవాదులు రసవాదులయ్యారు. 19శతాబ్దిలో ఆస్కార్ వైల్డు Aesthetic movementకు అధినేత అయి కళ వ్యక్తియొక్క ఆహ్లాదానికి సహకరించాలన్నాడు. ఇదే శుద్ధకళావాదం. Art for Art's sake అనే నినాదం ఈ ఉద్యమంనుంచే బయలుదేరి వాస్తవికతనూ ప్రబోధకత్వాన్నీ భావప్రచారాన్నీ ఒక యుగంయొక్క ప్రత్యేకావసరాల్నీ తిరస్కరించి కళాకారుడు యథేచ్ఛగా కళను సృష్టించాలనీ సామాజికబాధ్యత అతనికేమీ లేదనీ అభిప్రాయపడింది. భౌతికవాదులు ఈ అభిప్రాయాలను తిరస్కరించి Art for Society's sake అన్నారు. ఫ్యూడల్‌వ్యవస్థలో మొదలైన తెలుగుకవిత్వం విశ్వశ్రేయస్సుకోసం, 'జగద్ధితం' కోసం రచింపబడుతూ వచ్చినా క్రమంగా దాని పరమప్రయోజనం మాత్రం రసానందమే అయింది. సంస్కృతకావ్యశాస్త్రాలలో ప్రతిపాదింపబడిన రససిద్ధాంతమే ప్రబంధకవుల ఆదర్శం. సహృదయుడే కావ్యపాఠకుడు. యశస్సు, అర్థము కవి పొందుతాడనీ వ్యవహారజ్ఞానాన్నీ సద్యఃపరనిర్వృతినీ పాఠకుడు పొందుతాడనీ శివేతరక్షతినీ కాంతాసమ్మితోపదేశాన్నీ లోకం పొందుతుందనీ మమ్మటుడు కావ్యప్రయోజనాలను నిర్దేశించాడు. కాని రమణీయార్థప్రతిపాదకశబ్దమే కావ్యమని పండితరాయలు ప్రతిపాదించి చమత్కారానికి ప్రాధాన్యం కల్పించాడు. రమణీయమైన అర్థాన్ని ప్రతిపాదించే శబ్దమే కావ్యం. ఆ అర్థాన్ని అనుభవించినపుడు లోకోత్తరమైన ఆహ్లాదం కలుగుతుంది. ఆ అర్థాన్నే 'రమణీయం' అన్నాడు పండితరాయలు. ఈ రామణీయకత అనుభవంవల్లనే సహృదయుడికి తెలుస్తుంది. ఆహ్లాదాన్నే చమత్కారం అంటారు. ఈ సిద్ధాంతమంతా అనుభవంమీద ఆధారపడి ఉంది.

ఇది వ్యక్తివాదమే. ఇందులో కవి సంవిధానచాతుర్యానికే ప్రాధాన్యం ఉంది. పాశ్చాత్యుల Aesthetic movement వంటిదే ఇది కూడాను.

ఈ వ్యక్తివాదంలో 'శుద్ధకళ' (Pure Art) గర్భితమై ఉంది. ఈ శుద్ధ కళలోని అనుభవానికి ద్వితీయస్థానం ఇచ్చి సమాజాభివృద్ధిభావనకి ప్రథమస్థానం ఇచ్చారు భౌతికవాదులు. కళ సమాజం కోసం అనే వాదం బూర్జువావ్యవస్థమీద తిరుగుబాటుధోరణి నుంచి ఉద్భవించింది. బూర్జువా వ్యవస్థ సంపన్నవ్యక్తికి ప్రాధాన్యం ఇచ్చి అతని భద్రతనూ ఆనందాన్నీ కాపాడుతుంది. దరిద్ర నారాయణులతో దానికి నిమిత్తంలేదు. సమసమాజవ్యవస్థ సామాన్యవ్యక్తికీ, సమాజానికీ కూడా సమప్రాధాన్యమే ఇవ్వడంలో సంపన్న వ్యక్తికి బూర్జువావ్యవస్థలో ఉండే అనవసరప్రాధాన్యాన్ని తొలగిస్తుంది. ఈ సూక్ష్మాంశమే కళాదృక్పథంలో కూడా ఉంది.

గురజాడ కవి 'ఆకులందున అణగి మణగీ కవితకోయిల పలకవలెనోయ్! పలుకులను విని దేశమం దభిమానములు మొలకెత్తవలెనోయ్!' అని చెప్పడంలో రమణీయతావాదంమీద తిరుగుబాటున్నది. కానీ 'జగమునిండ స్వేచ్ఛాగానఝురుల నింతు! నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు? నా యిచ్ఛయే కాక నాకేటి వెరపు?' అనే కృష్ణశాస్త్రి ఘోషలో వ్యక్తివాదంమీది ప్రీతి ఉన్నది. కృష్ణశాస్త్రిది శుద్ధకవిత కాగా గురజాడది ఉపయోగకవిత్వం. కృష్ణశాస్త్రి ఆదర్శవాది! గురజాడ భౌతికవాది!

శుద్ధకవిత్వానికి కృష్ణశాస్త్రిగారి ఖండికలను ఉదాహరించవచ్చు. "ఆమె కన్నులలో ననంతాంబరంపు నీలినీడలు కలవు! వినిర్మలాంబుపూర గంభీర శాంత కాసార చిత్ర హృదయము లలోని గాటంపు నిదురచాయలందు నెడనెడగ్రమ్ము........." అనేది రమణీయార్థప్రతిపాదక శబ్దమే! ఆహ్లాదమే - అనుభవమే దీని పరమప్రయోజనం. భౌతికవాది ఈ ఆహ్లాదాన్నీ అనుభవాన్నీ కలిగించడం తోపాటు సమాజస్పృహను కూడా పాఠకుడిలో రేకెత్తించవలసి ఉంది కనుక శుద్ధకళావాది కన్నా అభ్యుదయకళావాది ఎక్కువ బాధ్యత కలవాడవుతాడు. దానితో నేర్పు, వ్యుత్పత్తి కూడా శుద్ధకళావాది కన్నా ఎక్కువగా ఉన్నవాడై ఉండాలి. ఎవడూ శుద్ధకళను అభ్యసించకుండా అభ్యుయకళను సమీపించలేడు. శ్రీశ్రీ విశిష్టత ఎక్కడుందీ అంటే మొదట ఆయన శుద్ధకళావాది - తరువాత అభ్యుదయ కళావాది. ప్రభవ, స్వర్గదేవతలు ఆయన శుద్ధకళానైపుణ్యానికి గీటురాళ్ళు కాగా దానిని అధిగమించిన అభ్యుదయ కళానైపుణ్యానికి మహాప్రస్థానం లక్ష్యభూతమయి నిలబడింది. శుద్ధకళ నుంచి అభ్యుదయకళకు పరివర్తన చెందడంలోనే శ్రీశ్రీ సాహిత్యవ్యాయామం ఎంతో చేశాడు; వ్యుత్పత్తిని నిండించు కున్నాడు; ప్రతిభకు సానపెట్టుకున్నాడు. శుద్ధకళావాది శిల్పానికి అత్యంతప్రాధాన్యం ఇస్తే

అభ్యుదయకళావాది వస్తుసంవిధానాలకు సమప్రాధాన్యం ఇస్తాడు. కృష్ణశాస్త్రికీ శ్రీశ్రీకి ఇది ప్రధానమైన తారతమ్యం.

### శ్రీశ్రీ ఔపయోగిక కవితావాదం

గణితశాస్త్రం, పదార్థశాస్త్రం, రసాయనశాస్త్రం మొదలైన భౌతికశాస్త్రాలను Pure Sciences and Applied Sciences అని రెండేసిగా విభజించి కేవలం లక్షణాలను చెప్పేది శుద్ధశాస్త్రమనీ ఆ లక్షణాల సాయంతో నూతనప్రయోగాలు చేసి జీవితోపయోగానికి తెచ్చేది ప్రయోగశాస్త్రమనీ అన్నారు. శుద్ధగణితం Theoritical గా ఉంటే ప్రయోగగణితం Practical గా ఉంటుంది. ఈ విభాగాన్నే కళలలో కూడా చేయవచ్చునంటూ భౌతికవాది అయిన శ్రీశ్రీ ఒకవాదాన్ని లేవనెత్తాడు. ఈ వాదం లేవనెత్తడంలోనే గతానుగతికత్వాన్ని నిరసించి, తనకు ముందున్న కవిత్వం ఏమిటో తాను సృష్టించవలసిన కవిత్వం ఏమిటో నిర్ణయించుకోవడం ఉంది. ఇలాంటి దృక్పథానికి శ్రీశ్రీలోని వాస్తవికతా జ్ఞానమే ప్రధానప్రేరణ.

శ్రీశ్రీ తన శుద్ధకవితాప్రయోగకవితావాదాల్ని ప్రవచించిన తీరును పరిశీలిద్దాం: "నా మట్టుకు కవిత్వం ఒక ఎడతెగని అన్వేషణ! నా జీవితం కూడా అంతే. కవిత్వంలో జీవితాన్నీ జీవితంలో కవిత్వాన్నీ వెదుక్కుంటూ ఉంటాను. ఒక్కోసారి ఏదో కనిపెట్టినట్లు సంతృప్తి కలుగుతుంది. కాని అది తాత్కాలికం మాత్రమే. ఆ సంతృప్తిని దాచుకుని, నేను ఆగిపోలేను. అది నాది కానేకాదని కూడా నా నమ్మకం. దాన్ని అందరిసమక్షంలో వదిలిపెట్టి, మళ్ళీ నా గవేషణమార్గం అందుకొంటాను. ఒక్కొక్కప్పుడు నా పరిశీలనఫలితాలు నాకిచ్చినంత ఆనందాన్ని నలుగురికీ ఇవ్వకపోవచ్చును. అయినా ఆ ఫలితాలను అందరియెదుటా ఉంచవలసిందే! ఈ సందర్భంలో నేనొక సంగతి స్పష్టం చెయ్యాలి. ఇది ఇంకా స్పష్టం చేయాలంటే - కవిత్వం ఉంది - దీనిలో Pure poetry శుద్ధకవిత్వం, కేవలకవిత్వం, అకల్మష కవిత్వం - కవిత్వం తప్ప మరేదీకాని, మరిదేనితోనూ కలుషితం కాని కవిత్వం ఒకటి. Applied poetry ఇంకొకటి - అనగా ఉపయోగ కవిత్వం - వ్యవహార కవిత్వం!" అంటూ తనకు మాత్రమే ఆనందాన్ని ఇచ్చే కవిత్వమనీ, అందరికీ ఉపయోగపడే కవిత్వమనీ రెండురకాల కవిత్వాన్ని స్థూలంగా వివరించాడు శ్రీశ్రీ. అందరికీ ఉపయోగపడటం అంటే శ్రీశ్రీ దృష్టిలో కార్మిక లోకపు కళ్యాణానికీ శ్రామికలోకపు సౌభాగ్యానికీ ఉపయోగపడుతూ వారి విప్లవంద్వారా అందరికీ పరిపూర్ణ పుబ్రతుకిస్తూ మునుముందుకు కదిలించే కవిత్వమేకానీ వినోదమాత్రపర్యవసితమైనది కానేకాదు. శుద్ధకవిత్వాన్ని ఉపయోగకవిత్వానికి ముందుమెట్టుగా మాత్రమే శ్రీశ్రీ భావించాడు. అయితే శుద్ధకవిత్వంకోసం అన్వేషించే దశలో శ్రీశ్రీ యువకాళల నవపేశల సుమగీతావరణంలో ఒక సుముహూర్తంలో అతిసుందరసుస్యందనంలో దూరంగా వినువీథుల్లో విహ

రించే అందనిఅందంగా కవితను భావించిన రోజుల్లో బ్రతుకే ఒక తపమై వెదుకాడాడు. కాని ఎటువైపు చూచినా శ్రీశ్రీకి చటులాలంకారపుమటుమాయలనటనలలో కవితారూపం కనిపించలేదు! గుహాలో కుటిలో చీకటిలో ఒక్కడై స్రుక్కినరోజులవి! అది శుద్ధకవితరాసిన దశ. తాను తప్ప మరేదీకాని కవిత్వం బ్రహ్మపదార్థం వంటిదనీ అది కవుల అన్వేషణకు లక్ష్యం అనీ అది ఎన్నడూ ఎక్కడా దొరకకపోయినా, దాన్ని వెదకడాన్ని మానడానికి వీలులేదనీ శ్రీశ్రీ నిష్కర్షగా చెప్పుకున్నాడు. ఈ నిరంతర కవితాసంవిధానాల అన్వేషణతత్పరత్వమే శ్రీశ్రీచేత ఎన్నో ఇజాలను చదివించింది. వ్యక్తివాదాలయిన సింబాలిజం, ఇమేజిజం, ఇంప్రెషనిజం, సర్రియలిజం వంటివాటిని శుద్ధకవిత్వంకోసం అన్వేషించి, వాటిని ప్రజలకు ఉపయోగపడేపద్ధతికి శ్రీశ్రీ మార్చుకున్నాడు. ఇలాంటి అన్వేషణలో సాధనలో శ్రీశ్రీ వ్యక్తిగతంగా ఒక్కొకమాటు నిరాశకు లోనవుతూ కూడా తనకు తానే ధైర్యం చెప్పుకుంటూ 'సాహసి'గా ప్రకాశించాడు. ఈ సాహస యాత్రనే 'కళారవి' ఖండికలో వ్యక్తంచేశాడు.

శుద్ధకవిత్వాన్ని అన్వేషించడం సాహిత్యసంప్రదాయాల చారిత్రకావగాహనకు తోడ్పడి, భౌతికవాదికి అవసరమయ్యే మూఢవిశ్వాసతిరస్కారగుణాన్ని ప్రోదిచేస్తుంది. గతంలోని లోపాలనూ గతంలోని అనుభవాలనూ సమగ్రంగా అవగాహన చేసుకుని, సహానంతో అర్థంచేసుకుని, తాను ముందుదారి త్రొక్కడానికి భౌతికవాదికి ఈ అన్వేషణ అవసరం అయితీరుతుంది. సంప్రదాయాలను గ్రుడ్డిగా అనుసరించే ఆదర్శవాదినీ శుద్ధకళావాదినీ అతిక్రమించి నూతనప్రయోగాలను ప్రగతివాది చేయగల్గుతాడు. ఈ సాహసి ప్రయోగాలే సమాజపురోగమనానికి దారి చూపిస్తాయి. శుద్ధకవితావాది కళకళకోసమేఅనీ - కళ రసానందం కోసమేఅనీ అనుకుంటూ ఉండగా - ఈ సాహసి అవతలిగట్టుకు చేరుకుని కళ సమాజపురోగమనం కోసంఅని నిరూపించి శుద్ధకవిత్వపుసౌందర్యాలను ఉపయోగకవిత్వపుహంగులుగా మారుస్తాడు. శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు ఇలాంటి ఉపయోగకవిత్వానికి ఉదాహరణలే! ఇటువంటి ప్రయోగశాలినీ సాహసినీ శ్రీశ్రీ 'కళారవి'గా భావించాడు. కళారవి అతివాదియే.

తాను తన మస్తిష్కకులాయంలో ఉన్న లోహవిహంగాలను ఎగిరించదలుస్తూ ఉంటే మితవాది అడ్డువచ్చి ఎగిరించకు! అంటే అతివాది 'పోసి.పోసి పోతే పోసి సతుల్ సుతుల్ హితుల్ పోతే పోనీ' అని చొరవ చేస్తాడు. ఈ చొరవనే 'కళారవి' ఖండికలో శ్రీశ్రీ వ్యక్తం చేశాడు. సంప్రదాయాంధమైన లోకం నూతనప్రయోగాలను అభిశంసిస్తూ అంతరాయాలుకల్పిస్తూ ఉంటే-సమాజవాతావరణం ప్రయోగ శీలికి మనశ్శాంతినీ ఏకాగ్రతనీ లభించనీయక పోతూంటే-కళారవి నిరాశ పడాలా? ఈ ప్రశ్నకే 'కళారవి' ఖండిక సమాధానం! "నీ ఫలితాలు నీ ఒక్కడివీ కావు. వాటికి సాంఘికప్రయోజనం ఉంది. వాటిని ఉపయోగించుకునే హక్కు సంఘానిది.

సంఘంచేతిలో అది Applied Poetry అవుతుంది! కవిత్వాన్ని నీ సొంత ఉపయోగాలకు వాడుకుంటే కవిత్వానికి నువ్వు ద్రోహం చేస్తున్నావన్నమాట!' అంటూ శ్రీశ్రీ శుద్ధ కవితావాదుల్ని మందలించడంలో సమకాలిక బూర్జువావ్యవస్థలోని కవులను మందలించడమే ఉంది. ఉదరపోషణార్థమో కీర్తికోసమో పదవులకోసమో పలుకుబళ్లకోసమో బూర్జువావ్యవస్థలోని కవులు తమ శుద్ధకవిత్వాన్ని సంపన్నులైన, అధికారులైన వ్యక్తులకు అంకితం చేస్తారు.[1] శ్రీశ్రీ తన కవిత్వాన్ని అలాంటి వ్యక్తులకుకాక, సమాజపుదోపిడికారుల నిర్మూలన కుపక్రమించే కార్మికవర్గానికి అంకితం చేస్తానన్నాడు. సంఘం చేతిలో తన కవిత్వం Applied Poetry కావాలనే శ్రీశ్రీ కోరుకున్నాడు. తన కళాకౌశలాన్ని తనయుగంలోని సామాజికావసరాలకు తగినట్లు ప్రయోగించడమే శ్రీశ్రీ Applied Poetry. 'కళారవి' ఖండిక తరువాత రచింపబడిన భిక్షువర్షీయసి అనే ఖండిక ఈ ఉపయోగకవిత్వానికి మచ్చుతునకే! కృష్ణశాస్త్రిగారి ఊర్వశి శుద్ధకవిత్వానికి నిదర్శనమైతే శ్రీశ్రీ భిక్షువర్షీయసి అంతకన్నా ఉన్నతమైన అభ్యుదయకవిత్వానికి నిదర్శనం! ఊర్వశిలోని కాల్పనికత పరిమితోపయోగం కలది. భిక్షువర్షీయసిలోని వాస్తవికత సామాజికోపయోగి.

తనపరిశోధనలలో మునిగిపోయి ఫలితాలు లభించక నిరాశపడి పరిశోధనలు విరమించి సమాజంలోకి నిస్తేజంగా ప్రవేశించిన 'కళారవి'కి ఉత్తేజనం కలిగించాడు శ్రీశ్రీ:—'పోనీపోనీ పోతే పోనీ సతుల్ సుతుల్ హితుల్ పోనీ పోతేపోనీ' అంటూ. సతీవియోగాన్ని గురించి దుఃఖించిన కవులు - శుద్ధకవులే! ఈ వియోగగీతాలు సమాజపురోగమనంతో సంబంధంలేనివి. "రానీ రానీ వస్తేరానీ కష్టాల్ నష్టాల్ కోపాల్ తాపాల్ శాపాల్ రానీ వస్తే రానీ తిట్లూ రాట్లూ పాట్లూ రానీ రానీ రానీ" అనేమాటలు అభ్యుదయనిరోధకులూ యథాస్థితివాదులూ సనాతనులూ చేసే విమర్శలనూ తిరస్కారాలనూ అభ్యుదయకళాకారుడు లక్ష్యపెట్టనక్కరలేదని సూచిస్తాయి. అభ్యుదయకళాకారుడు తన గానాన్నీ ధ్యానాన్నీ నిరంతరం కొనసాగించవలసిందే కానీ దుఃఖానికీ జడత్వానికీ లొంగిపోకూడదు. "కాని కాని గానంధ్యానం హాసంలాసం కానీ కానీ కళారవీ కవీ పవీ!" అనే మాటలు కళాకారుడు సాగించవలసిన నిరంతరాన్వేషణను, నిరంతరసాధనను స్ఫురింపిస్తాయి. 'గానం' శ్రీశ్రీకి ప్రత్యేకంగా ఇష్టమైనది. 'ధ్యానం' కవి పొందే "నిశ్చల సమాధి"యే! ఆ ధ్యానంలోనే శ్రీశ్రీ ఘోషలు, భావలు, దృశ్యాలు వినగలిగాడు; చూడగలిగాడు. ఆ ధ్యానంలోనే శ్రీశ్రీ మేలుకొనిన సకలేంద్రియములతో కవిత్వం రచించి నిర్వికల్ప సమాధిలో నిర్వాణం

---

1 ఇలాంటి వారిని గురించే రాశాడు చెలం:— "ఈ కవికి ఆకలివేస్తే రా - గారి యింటికెళ్లి శ్లాఘించి ఠత్యఖర్చు తెచ్చుకుని భోజనంచేసి ప్రియురాలిమీద గీతం రాశాడు. అబద్ధాలతో అనుకూల మద్దతుప్రచారంతో ఆత్మ శ్లాఘనంతో దేశంమీద పడి బతుకుతున్న యీ Parasite కవిపరేణ్యులు శ్రీశ్రీని విమర్శించడానికి సాహసిస్తున్నారు."

పొందగలిగాడు. శ్రీశ్రీ శబ్దప్రయోగ చణత్వం నిశ్చంచలమైన స్వభావంలోనిదే! కవితాసృష్టిలో అతడు పరాకుపడడు! అన్యాక్రాంత మనస్సుతో ఉండడు! అందువల్ల ఔచిత్యం సిద్ధిస్తుంది. హాసం, లాసం శబ్దాల గుణాలు. లయ, వేగం ఈ గుణాలవల్లనే శైలికి లభిస్తాయి. పవీ అనే సంబోధన కవికి ఆత్మస్థైర్యం కలిగిస్తూ కొండలరెక్కలను తెగగొట్టగలిగిన ఇంద్రుడితో ఔపమ్యాన్ని కలిగించి దుష్టశక్తుల ఖండనంలో కవి వజ్రంలాపనిచేయాలని స్ఫురింపజేస్తుంది. ఎవడు నిద్రిస్తే కళలు అన్నీ నిస్తేజాలై లోకమే నిద్రిస్తుందో అతడే కళారవి!

## శ్రీశ్రీ కందపద్యసంవిధానం

నియమాలూ నిబంధనలూ ఎక్కువగా ఉండేకందపద్యం చేయితిరిగిన కవికి అత్యంతసుకరమైనది కావడానికి గలకారణం అందులోనివన్నీ చతుర్మాత్రాగణాలే కావడం! మహాప్రస్థానంలో చతురస్రగతిగీతాల నెక్కువగారచించిన శ్రీశ్రీ కందపద్యాన్ని వేషం మార్చి, పేరుతీసివేసి, నియమాలను వదలివేసి, యథేచ్ఛగా రచించిన సందర్భాలెక్కువగా ఉన్నాయి. చిన్నిచిన్నిపాదాలుగా విభజించిరాసిన కళారవిగీతంలో కందపద్యాన్ని పట్టుకోవచ్చు.

"రానీ రానీ వస్తే/రానీ కష్టాల్ నష్టాల్ కోపాల్ తాపాల్
శాపాల్ రానీ వస్తే/రానీ తిట్లూ రాట్లూ పాట్లూ రానీ."

"వస్తే రానీ తిట్లూ/రాట్లూ పాట్లూ రానీ రానీ రానీ
కానీ కానీ గానం/ధ్యానం హాసం లాసం కానీకానీ"

యతిప్రాసలు, తతిమ్మా నియమాలు తీసివేసిన కందాలివి. వీటిని పదైకపాదాలుగా బహుపదపాదాలుగా విభజించిరాశాడు శ్రీశ్రీ. సామాన్యకందాన్ని కూడా శ్రీశ్రీ రాసినట్లు రాయవచ్చు.

తలిరాకు
జొంపముల
సందుల త్రోవల
నేలవ్రాలు
తుహినకిరణ కోమలరేఖవో!
పువుదీవవో!
వెలదీ!
యెవ్వతెవు
నీపవిటపీవనిలోన్.

అనేది కృష్ణశాస్త్రి కందానికి పాదరూపాంతరీకరణం.

"కవితా-ఓ కవితా నా / యువకా-శలనవ-పేశల-సుమగీ-తావర / ణంలో-నిను నే-నొక సుము/హూర్తం-లో అతి-సుందర-సుస్యం-దనమున్- ఈ విధంగా శ్రీశ్రీ వచనగీతం ఎక్కడా అడ్డ కుండా చతుర్మాత్రాగణాలుగా విరిగి కందపద్యపు సౌలభ్యాన్ని తీసుకుంటుంది.

పౌలాల-నన్నీ-హాలాల-
మున్నీ-ఇలాత-లంలో-హేమం-పిండగ-
జగాని-కంతా-సౌఖ్యం-
పిండగ-విరామ-మెరుగక-పరిశ్ర-మించే-

సంప్రదాయాన్ని నూతనావసరాలకు తగినట్లు మల్చుకోవడమే ఇక్కడ శ్రీశ్రీ ప్రతిభలో గమనించ వలసిన అంశం.

## శ్రీశ్రీ అనుష్టుప్పు నడకలు

అష్టాక్షర పాదప్రమాణంగల అనుష్టుప్పు నడకను కూడా శ్రీశ్రీ తన ఛందోవ్యవస్థలోకి తీసుకున్నాడు.

రానీ రానీ వస్తే రానీ
కష్టాల్ నష్టాల్ కోపాల్ తాపాల్
శాపాల్ రానీ వస్తే రానీ
తిట్లూ రాట్లూ పాట్లూ రానీ

8 అక్షరాలకు పాదం తెగిపోవడంవల్లనే అనుష్టుప్పు నడక వస్తుంది.

వాల్మీకి గిరిసంభూతా
రామసాగర గామినీ
పునాతి భువనం పుణ్యా
రామాయణ మహానదీ

ఈ అనుష్టుప్పులో 6వ అక్షరం గురువై ప్రతిపాదానికీ 8 అక్షరరాలతో నడక సిద్ధించింది. ఆ గుర్వక్షరనియమాన్నే శ్రీశ్రీ సడలించుకున్నాడు. వైప్లవ్యగీతాన్ని 'నేను - నా ఊహ చాంపేయమాల - సిందూరం రక్తచందనం - ఝంఝానిల షడ్జధ్వానం - హీనంగా చూడకు దేన్నీ - ఉంఛాలోయ్ కవితావేశం - దారిద్ర్యాలూ దౌర్జన్యాలూ - చండచండం తీవ్రతీవ్రం- కష్టం సౌఖ్యం శ్లేషార్థాలూ - వాసంతసమీరం నీవై- హేమంత తుషారం నేనై - విషంక్రక్కే భుజంగాలో/కదంత్రొక్కే తురంగాలో/యుద్ధగుంజన్మృదంగాలో మొదలైన పాదాలెన్నో అష్టాక్షరపరిమాణంతో నడుస్తాయి. (చూ. నవకవిత సమీక్షలో అనుష్టుప్పులు)

## శ్రీశ్రీ కవిత్వంలో పఠనగానముద్రణవైచిత్రులు

కృష్ణశాస్త్రి కవిత్వం పాడవలసిందే! చదవవలసిందికాదు! నన్నయది పాడవలసింది; తిక్కనది చదవవలసింది. శ్రీశ్రీ కవిత్వం పాడటానికీ చదవటానికీ కూడా అనువైనది. ఇందుకు కారణం వాడుకభాష; మాత్రాచ్ఛందస్సు అనే మాధ్యమాలద్వారా ఆవేశమూ ఆలోచనమూ కలసిపోవడం. రకరకాల లయలద్వారా శ్రీశ్రీ ఈ విద్యను ప్రదర్శించాడు. 'కళారవి' గీతంలో మొత్తం ఉన్నవి 84 అక్షరాలు కాగా అందులో 78 అక్షరాలు దీర్ఘాలే! పెక్కు గీతాల్లో దీర్ఘాక్షరాల బాహుళ్యమే కనిపిస్తుంది. ఇదొకవిధమైన లయకు కారణం.

పాదాలను ఆరోహణావరోహణాలతో వ్రాయడం, ముద్రించడం మహాప్రస్థాన గీతాల లోని వైచిత్రి. ఇది భావోచితంగా ఉంటుందే కానీ కృతకంగా ఉండదు. అచ్చుయంత్రం తెచ్చిన వింతలను సప్రయోజనంగా వాడుకుంటాడు మార్క్సిస్టు కవి.

పోనీ
పోనీ
పోతేపోనీ
సతుల్ సుతుల్ హితుల్ పోనీ

ఇది ఆరోహణపద్ధతి – మెట్లు మెట్లుగా దీని లేఖనం.

కానీ కానీ
కళారవీ
పవీ
కవీ

ఇది అవరోహణపద్ధతి. ఈ పద్ధతులలోని వైవిధ్యాన్ని ఐ, జయభేరి, అభ్యుదయం, అవతారం, బుక్కులు, బాటసారి, కేక, పరాజితులు, ఒకక్షణంలో, జగన్నాథుని రథచక్రాలు మొదలైన ఖండికలలో చూడగలం!

# 65/భిక్షువర్షీయసి

## ఆ అవ్వే మరణిస్తే ఆ పాపం ఎవ్వరిదని వెర్రిగాలి ప్రశ్నిస్తూ వెళిపోయింది!

1934 ఆగస్టు 13

ఉత్పత్తిసాధనాలు ఒకవర్గంవారి స్వాధీనమై ఉన్నప్పుడు పీడితవర్గంలోని శరీరబలహీనులూ శ్రమపడలేని వృద్ధులూ బ్రతకడానికి మరోమార్గం లేక బిచ్చమెత్తుకుని కాలంగడపక తప్పదు. ఈ సాంఘికదురన్యాయం ఫ్యూడల్‌వ్యవస్థలోనే మొదలైఉన్నా ఆ వ్యవస్థ అంతరించిన తరువాత కూడా ఒక వృత్తిగా భిక్షుకత్వం మిగిలిపోవడం, అది వంశపారంపర్యంగా కొనసాగుతూ ఉండడం ఎందువల్ల? ఆ సమాజవ్యవస్థ దాని పరిష్కారానికి మార్గం ఆలోచించకపోవడంవల్లనే! దోపిడీ సమాజంలో భిక్షుకవృత్తి నిర్మూలనకు అవకాశాలు లేవు. భిక్షుకవృత్తి దారిద్ర్యానికి ఒక సంకేతం. శ్రమశక్తి నశించడంవల్ల, సోమరితనంవల్ల, దుర్వ్యసనాలవల్ల, అంగవికలత్వంవల్ల, వార్ధక్యంవల్ల, రోగాలవల్ల భిక్షుకవృత్తి వృద్ధిపొందుతూనే ఉంటుంది. ఈ కళంకంలేని సమాజాన్ని సమసమాజవాది ఊహించుకోవడం సహజమే! అటువంటి నిష్కళంకసమాజం ఏర్పడటానికి మార్గం మరోప్రపంచమే! మరోప్రపంచాన్ని కోరే కవి మాత్రమే సమాజవాస్తవికతను సమాజం ముందుంచి, ఈ జుగుప్సనూ దుఃఖాన్నీ దోపిడినీ తొలగించే కార్యాచరణకు ప్రేరేపిస్తాడు. భిక్షుకవృత్తికి భౌతికకారణాలున్నాయని స్ఫురింపజేస్తాడు. కానీ ఆదర్శవాదులైన కవులు భిక్షుకవృత్తికి పురాజన్మకృతపాపం కారణంఅని నమ్మి భిక్షువుకు ముష్టివేయడంద్వారా తమకు పుణ్యం కలుగుతుందని భావిస్తూ కారుణ్యవాదులవుతారు. ఈ రెండువిధాలైన వాదాలకూ ప్రతినిధులుగా తెలుగుకవిత్వంలో శ్రీశ్రీనీ విశ్వనాథ సత్యనారాయణగారినీ తీసుకోవచ్చు.

విశ్వనాథవారు "అంధభిక్షువు"అనే ఒక ఖండికలో ఒక గ్రుడ్డివాడు పూర్వజన్మలో ఏ నూతిలోనోపడి ఆత్మహత్య చేసుకుని పాపి అయిఉంటాడనీ ఆ నూతిలోపడిపోయినపుడు అతని ఆర్తనాదమే తిరిగి ఈ జన్మలోకూడా అతనికంఠధ్వనిలో వినిపిస్తోందనీ పూర్వజన్మలో చనిపోతూ చనిపోతూ అతడు చూసిన దీనవీక్షణమే ఈ జన్మలోనూ కనిపిస్తోందనీ ఈ జన్మలో అంధుడై దాశరథీశతకం పఠిస్తూ తన కూతురు దారి చూపుతూఉండగా రైలులో బిచ్చమెత్తుకుంటున్నాడనీ అతణ్ని తాను చూసి ద్రవించిపోయాననీ కానీ అతడి కేసహాయమూ చేయలేకపోయాననీ

వ్యక్తంచేశారు.[1] విశ్వనాథవారు కార్యకారణాలను వ్యక్తిదృష్టినుంచే చూశారు. ఒక వ్యక్తి అనుభవించే కష్టాలకు ఆ వ్యక్తి పూర్వజన్మంలో చేసుకున్న కర్మాలే కారణంఅని అభిప్రాయపడ్డారు. ఇటువంటి కర్మసిద్ధాంతాన్ని సవాలుచేయడం శ్రీశ్రీవంటి సమాజవాది సహజలక్షణం.

### శ్రీశ్రీ దర్శించిన భిక్షావృత్తి వాస్తవికత

భారతదేశంలో భిక్షుకవృత్తి ఎంతవృద్ధమయిందో వ్యక్తంచేయడానికి శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి' అనే శీర్షికతో కవిత రచించాడు. The Struggle for bread is the struggle for Socialism అన్న లెనిన్‌వాక్యం ఆకలితో అలమటించి బిచ్చమెత్తుకునే దరిద్రుల బాధనీ ఆబాధ సామ్యవాద విప్లవానికి చూపేమార్గాన్నీ వ్యక్తంచేస్తుంది. శ్రీశ్రీ భిక్షువర్షీయసి లోని వృద్ధభిక్షురాలి మరణావస్థ సమాజంలోని విషమన్యాయాన్నీ ప్రకృతిలోని సమన్యాయాన్నీ బేరీజువేసి చూపిస్తుంది. ప్రకృతిలో సమస్తజంతువులు ఆహారాన్ని సంపాదించుకుని హాయిగా బ్రతుకుతూండగా మానవుడు వర్గవ్యవస్థలో చిక్కుకుని కొందరి పెత్తనం వల్ల కల్పించబడే కరువులో ఎలా మరణిస్తున్నాడో సూచిస్తుంది.

సమాజవ్యవస్థలో శ్రీశ్రీ చూసిన నికృష్టవాస్తవజీవితానికి భిక్షువర్షీయసి ఒకప్రతినిధి! దారిప్రక్క చెట్టుక్రింద కనిపించిన ఆ భిక్షువుకు కనీసపుజీవితావసరాలైన తిండి, బట్ట, గూడు లేకపోవడమేకాక జబ్బుచేసి పడిపోయి బ్రతుకంటే కోర్కెసడలి శవంకన్నా హీనంగా పడిపోయింది. పారిశ్రామికవిప్లవాన్ని సాధించిన సంపన్నసమాజంలో ఇలాంటి నికృష్టజీవితాలు కూడా ఉండటం ఆ సంపన్నసమాజానికే సిగ్గుచేటుకాదా? కానీ సంపన్నసమాజంలో కొందరు సంపన్నవ్యక్తులే సౌఖ్యాలనుభవిస్తూ ఉండటం, తక్కినవారు వారిసంపత్తికి తమ శ్రమచేతదోహదం చేస్తూ బీదవారుగా మిగిలిపోవడం జరుగుతుంది. ఈ వాస్తవాన్ని స్ఫురింపజేయడమే శ్రీశ్రీ కవితాలక్ష్యం.

అనాథజీవుల్ని, త్రాగుబోతుల్ని, పడుపుకత్తెల్ని, ఉన్మాదుల్ని, కూలీల్ని, అభాగ్యుల్ని, అశాంతుల్ని, బాటసారుల్ని, దురదృష్టజీవుల్ని, విసిగిన ప్రాణుల్ని, రిక్షావాలానీ గనిపనిమనిషినీ ఓడకళాసినీ కష్టజీవుల్నీ గుడిసెలలోబ్రతికేవాళ్ళనీ గంజినీళ్ళు త్రాగి కాలంగడిపేవాళ్ళనీ ఖైదీల్నీ పతితుల్నీ భ్రష్టుల్నీ బాధాసర్పదష్టుల్నీ బ్రతుకుకాలి పనికిమాలి శనిదేవత రథచక్రపుటిరుసులలో పడినలిగినదీనుల్నీ హీనుల్నీ కూడులేనిభిక్షుల్నీ గూడులేని పక్షుల్నీ సఖులవలన పరిచ్యుతుల్నీ జనులవలన తిరస్కృతుల్నీ జితాసువుల్నీ చ్యుతాశయుల్నీ హృతాశ్రయుల్నీ వ్యథానివిష్టుల్నీ ఊరవతల నీరింకిన చెరువుపక్క చెట్టునీడ గోనెలతో కుండలతో చీకటిలో దుఃఖంతో నిరాశతో కుమిలేవారినీ పడలో కడుజడిలో పెనుచలిలో తెగనవసి కుమిలే వారినీ – చివరకు

1 చూ. వైతాళికులు

భిక్షువర్షీయసుల్నీ ఏ సమాజంలో శ్రీశ్రీ చూశాడో ఆ సమాజం దోపిడిసమాజమే! - అంటే సొంతఆస్తిని పెంచుకునే ధనవంతుల, బలవంతుల సమాజమన్న మాట. ఆ దోపిడిని నిర్మూలించడంతోపాటు ఈ బాధాసర్పదష్టుల్నీ భిక్షువర్షీయసుల్నీ లేకుండాచేయడమే సామ్యవాదవిప్లవ లక్ష్యం.

దోపిడిసమాజంలో వాస్తవికతను మరుగుపరిచే ప్రయత్నాలు జరుగుతాయి. వాస్తవికతను గుర్తించలేని కళాకారులు పెరుగుతారు. పెట్టుబడిదారులు సృష్టించే ఆకర్షణలనే కళాకారులు అనుకరిస్తారు. కాల్పనికలోకాలను కవులు కలలుకంటూ ఉంటారు. సౌందర్యారిరంస పెరుగుతుంది. ఇది సమాజంనుంచి కవులు పరారులు కావడానికి సహకరిస్తుంది. పీడితసమాజపువాస్తవాలనూ పీడకసమాజపువాస్తవాలనూ కూడా గ్రహించగలిగినవారు మార్క్సిస్టులు కాకతప్పదు. శ్రీశ్రీ తెలుగుదేశంలో పుట్టిన ఇలాంటికవుల్లో ఆదికవి. సమకాలిక పీడకసమాజవ్యవస్థలోని కాల్పనిక సాహిత్యవాతావరణాన్నీ సౌందర్యారిరంసనీ చీల్చుకుని శ్రీశ్రీ సమాజవాస్తవికతవైపు పరుగుపెట్టాడు. 'హేమంతం' అనే ఒక వ్యాసంలో శ్రీశ్రీ రాసిన కొన్నిభాగాలను చదివితే అతని అవగాహనను పాఠకులు గ్రహించగలరు. కనుక వాటిని పాఠకుల కందిస్తాను.

"పరధ్యానంగా పడుకున్నాను. ఆంధ్రజ్యోతి ఉగాదిసంచిక నా గుండెలమీద నిద్రపోతోంది. నాకుమాత్రం సగం మెలకువ...వ. పా. గీసిన రతీమన్మథుల చిత్రం గుండెల్లో గుచ్చుకుంటోంది. ఒక చిలక విరిగిపోయినగ్రామొఫోనుప్లేటు లాగ చేసిన ప్రకటనే మళ్ళీ మళ్ళీ చేస్తోంది. నేటి సాహిత్యరాజకీయాలకీ రాజకీయసాహిత్యాలకీ ఈ చిలక చేస్తున్న పునః పునః ప్రకటనకీ ఏదో సంబంధం ఉందని మాత్రం గుర్తించేపాటిది నా మెలకువ. పరధ్యానంగా కళ్ళు మూసుకున్నాను. హఠాత్తుగా మా భిక్షువర్షీయసి ప్రత్యక్షమయింది. ...'అవ్వా! విశాఖపట్టణంనుంచి ఎప్పుడు వచ్చావ్?' ముసిల్ది మాట్లాడలేదు. ...మాట్లాడలేని ముసిల్ది ఏడుపులాంటి నవ్వు నవ్వింది. ఆంధ్రజ్యోతి ఉగాదిసంచికను లాక్కుని భయంకరంగా అరుస్తూ ఒక్కొక్క కాగితాన్నే చింపడం మొదలుపెట్టింది."

ఈవిధంగా మొదలుపెట్టిన ఈ కథనంలో ముసలి అవ్వ చేత శ్రీశ్రీ పెట్టుబడిదారీనాగరికతను విమర్శింపజేశాడు: "మేమూ మా దారిద్ర్యమూ మా వార్ధక్యమూ మా అనారోగ్యమూ అపస్వరాలయితే వాటిని తొలగించడాని కెందుకు ప్రయత్నించకూడదు?" అని ప్రశ్నిస్తుంది. "మీరందరూ సౌందర్యాన్ని సందర్శించినవాళ్లే! ఎక్కడుందయ్యా, మీ సౌందర్యం? కాఫీక్లబ్బు గోడలమీద రాజకీయనాయకుల పటాల్లోనా? ఆ పటాలముందు నాట్యంచేసే సినీమాతారల భంగిమల్లోనా? ఆ భంగిమల పోస్టర్లను చూపించే నాలుగురోడ్లు కలిసే చోట్లలోనా? మీ ఇళ్ళలో పోగుచేసుకునే సామాన్లలోనా? మీ వక్రమైన అభిరుచిలోనా? మీ శిథిలమైన జీవితాలలోనా? రూపాయిఅణాపైసలను దాటలేని మీ ఆలోచనల్లోనా? ఎక్కడుంది సౌందర్యం?

అసలు మీరు సౌందర్యాన్ని కనిపెట్టగలుగుతున్నారా ? కనిపెడితే గౌరవిస్తారా ? ఇటుచూడు నన్ను. ముగ్గుబుట్టవంటి తలా ! ముడుతలు తేరిన దేహం ! కాంతిలేని గాజుకళ్ళు ! ఇవి నాకు ఇటీవల వచ్చినవే! పుట్టుకతోనే వచ్చినవి కావు! నన్నూ ఒక అమ్మ కంది. నా బాల్యంలో నేనూ నవ్వినదాన్నే. ఆడినదాన్నే. పాడినదాన్నే. నా యౌవనపురోజులు ఊహించగలవా ? అప్పుడు నేనెలా వుండేదాన్నో ఒక్కసారి స్మరిస్తావా ? చిన్నకథ చెబుతా విను. నా జీవితంలో జరిగిన కథ. అప్పుడు నాది ముగ్గుబుట్టవంటి తల కాదు. ఎటువంటి శిరోజాలకోసం మీ పత్రికలన్నీ తలనూనె ప్రకటనలు చేస్తాయో అవి సహజంగా నా శిరస్సును అలంకరించాయి. నాది ముడుతలు తేరిన దేహం కాదు. ఎటువంటి చర్మం ఇస్తామని మీ వాసనసబ్బులన్నీ వాగ్దానం చేస్తాయో ఆ నునుపైన సొగసైన చర్మం. ఆనాటి నాకళ్ళు కాంతిలేని గాజుకళ్లు కావు. కొత్తగా నాకు పెళ్ళి అయి అప్పుడే నా మొగాడి ప్రేమవైపుగా వికసిస్తూన్న కళ్ళు." ఈవిధంగా అవ్వ పూర్వజీవితాన్ని వాస్తవ దృష్టితోనే చెప్పించాడు శ్రీశ్రీ. ఈ కథనంలో పెట్టుబడిదారీ నాగరికత విమర్శింపబడింది కూడా. ముసలి అవ్వను శ్రీశ్రీ ఊహించి చిత్రించలేదు. అలాంటి భిక్షువర్షీయసిని విశాఖపట్టణంలో అతడు స్వయంగా చూశాడట! ఆ విషయాన్నికూడా భిక్షువుచేత చెప్పించాడు: "నువ్వు నన్ను విశాఖపట్టణంలో నీళ్ళెండిపోయిన కటకంవారి కోనేటి ప్రక్క ఆకులు రాలిపోయిన మోడుచెట్టుకింద చూశావో, భావించావో, అప్పటికే నాకు డెబ్బయ్యేళ్ళు దాటాయి. పల్లెటూళ్ళో చిన్నతనం లగాయతు పట్నవాసంలో ముసలితనందాకా నా జీవితయాత్రంతా నువ్వు స్మరించుకుని ఉండాలి. మోడుచెట్టు కింద బండరాతి ప్రక్క చిట్టచివరికి చేరుకున్నానంటే ఎన్నెన్ని దశలు గడిచానో ? ఈలోపున నన్నాస్థితికి తెచ్చిన బహిఃప్రపంచంలో ఎన్నెన్ని మార్పు లొచ్చి ఉంటాయో, నువ్వూహించుకుని ఉంటావు. డెబ్బయి ఆశ్వాసాల నా మహాకావ్యాన్ని ఒక చిన్నగీతంలోకి ఆవిరిపట్టి నాకొక శాశ్వతత్వం ప్రసాదించావు. సంఘ దురన్యాయానికి యజ్ఞపశువునైన నన్ను పరపీడితుల, పరాజితుల సమూహానికొక చిహ్నంగా నిలబెట్టావు. జరామరణదుఃఖాలను స్మరించేవాళ్ళందరికీ నన్నే జ్ఞాపకంతెస్తున్నావు ..."

సమాజంలో కనిపించని సౌందర్యాన్ని ఆదర్శలోకాలలో దర్శించి దానితోడి విరహాన్ని ఊహించుకుని దుఃఖించిన కృష్ణశాస్త్రిగారు 'ఊర్వశిని' సృష్టిస్తే, సమాజంలో కనిపించిన వికృతత్వాన్ని దర్శించి ఆ దౌర్భాగ్యానికి దుఃఖించిన శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి'ని సృష్టించాడు.

"నీవు తొలిప్రొద్దునునుమంచు తీవపూవవు ! నీవు వర్షాశరత్తుల నిబిడసంగమమునఁ బొడమిన సంధ్యాకుమారి ! నీవు తిమిరనిశ్వాసముల మాసి కుములు శర్వరీవియోగకపోలపాళికవు ! నీవె నీవె నిట్టూర్పు ! నీవె కన్నీరు ! విశ్వవేదనామూల్య భాగ్యమీవే నిజమ్ము ! నే గళమ్మార పాడుకొనిన యజ్ఞాతశోకగీతమ్ములందీవె శోకగీతివి ! ఊర్వశీ ! ప్రేయసీ" అంటూ కాల్పనికస్త్రీని

కృష్ణశాస్త్రి వర్ణిస్తే దారిప్రక్క చెట్టుక్రింద ఆరినకుంపటి విధాన కూర్చున్నది ముసిల్దొకతె మూలుగుతూ ముసురుతున్న ఈగలతో వేగలేక - ముగ్గుబుట్టవంటితలా ముడుతలు తేరిన దేహం కాంతిలేని గాజుకళ్లు తనకన్నా శవంనయం'' అంటూ వాస్తవస్త్రీని శ్రీశ్రీ వర్ణించాడు. ఊర్వశి భౌతికచక్షువులకు కనిపించదు. భిక్షువర్షీయసి ప్రస్తుతసమాజంలో ప్రత్యక్షమవుతుంది. ప్రస్తుత సమాజాన్ని చూసి, మరోప్రపంచానికి కదలమని శ్రీశ్రీ చెబుతాడు. ప్రస్తుతప్రపంచాన్ని విస్మరించి, కాల్పనికప్రపంచాలలో సంచరించమని కృష్ణశాస్త్రి చెబుతాడు.

## శ్రీశ్రీ సృష్టించిన సజీవపాత్రలు

భిక్షువర్షీయసి అనీ ముసిల్దిఅనీ అవ్వ అనీ వ్యవహరించబడిన ఈ పాత్ర దారిపక్క చెట్టు క్రింద కూర్చున్నదంటే బాటసారుల కెదురుగానే ఉంది! శ్రీశ్రీ పాత్రలన్నీ సమాజమధ్యంలోనే ఉన్నాయి. కూటికోసం, కూలికోసం పట్టణంలో బ్రతుకుదామని బయల్దేరిన బాటసారి, వీధికంతా వెక్కిరింతగ ఊరికంతా దిష్టిబొమ్మగ తూముప్రక్కన ధూళిలోనే తూలే ఉన్మాది, కాలువ నీళ్ళలో జారిపడి ప్రేలాపనచేసే త్రాగుబోతు, సమ్మెలుకట్టే కూలీలు, ఊరవతల నీరింకిన చెరువు పక్క చెట్టునీడ గోనెలతో కుండలతో చీకటితో దుఃఖంతో నిరాశతో పడిఉన్న దగాపడిన తమ్ములూ ఒక వాతావరణంలోనివారే!

## శ్రీశ్రీ చూసిన జుగుప్సావహదృశ్యాలు

పీడితసమాజాన్ని చూసి ద్రవించే కవి వ్యథార్తజీవితయథార్థదృశ్యాలు చెప్పదలచినప్పుడు జుగుప్సావహదృశ్యాలను కూడా చూపక తప్పదు. కావ్యంలో వికృతత్వాన్ని చూపకూడదని నిషేధించే సౌందర్యవాదులు జుగుప్సను సహించలేరేమో! వారికి సమాజవాస్తవికత అక్కరలేదు! రాబందులరెక్కల చప్పుడునూ త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపననూ పడుపుకత్తె రాక్షసరతినీ సందులలో పందులనూ కరికళేబరాన్నీ కాళ్ళుతెగిన ఒంటెనూ కపాలగణాలనూ నెత్తురు క్రక్కుకునే సాహసినీ కాలువలో ఆత్మహత్యలనూ సౌందర్యవాదులు జుగుప్సావహాలనీ కావ్యంలో వర్ణించరాని సామగ్రిఅనీ అంటారు. కానీ శ్రీశ్రీ ఇలాంటి సామగ్రితోనే సమాజవాస్తవికతను చిత్రించాడంటే మార్గాంతరం లేకనే! మూలుగుతూ ముసురుతున్న ఈగలతో వేగలేక కూర్చుంది ముసల్ది. ఆమె శరీరం పుళ్ళతో కుళ్ళిపోయిఉంది కనుకనే ఈగలు ముసురుతున్నాయి. వాటిని తోలుకోవడానికి ఆమెకు ఓపికాలేదు; కప్పుకోవడానికి గుడ్డలూలేవు. ముడుతలు తేరినదేహం, కాంతిలేని గాజుకళ్ళు, తనకన్నాశవంనయం - ఇవన్నీ జుగుప్సనూ భయాన్నీ కలిగించేవే! ఉన్మాది కూడా ఇలాంటిరూపం గలవాడే! అలకలన్నీ అట్టకట్టిన బొమికలన్నీ ప్రోవుపట్టిన ఉన్మాది వీధికంతా వెక్కిరింతగ ఊరికంతా దిష్టిబొమ్మగ తూముప్రక్కన ధూళిలో తూలుతూ కనిపిస్తాడు. అభ్యుదయం అనే ఖండికలో ఫాసిస్టుల ప్రవర్తన కూడా జుగుప్సావహం

గానే ఉంది. ఎవరెవరో తలవిరబోసుకు నగ్నంగా వర్తిస్తూ భయోద్విగ్నంగా వర్తిస్తారు. మరణావస్థలోఉన్న ముసల్దాని పరిస్థితిచూసి ఆ అవ్వేమరణిస్తే ఆ పాపం ఎవ్వరిదని వెర్రిగాలి ప్రశ్నించినపుడు-ఎముకముక్క కొరుక్కునే కుక్క, ఈగను పడవేసుకునేతొండ కూడా జుగుప్సావహాలే. ముసల్దానిమీద పడిన ఎంగిలాకూ అలాంటిదే !

## శ్రీశ్రీ కర్మవాదతిరస్కారం

ఈ లోకంలోని కష్టసుఖాలకు పూర్వజన్మలోని పాపపుణ్యాలు కారణాలని కర్మవాదం వివరిస్తూంటే సమాజంలోని దోపిడిదారులే కారణం అని భౌతికవాదం వాదిస్తోంది. ఈ రెండు వాదాలనూ స్పృశించి భౌతికవాదంవైపుకు సమాజాన్ని నడిపించడమే శ్రీశ్రీ దృక్పథం. ఈ దృక్పథంతోనే శ్రీశ్రీ విశ్వనాథవారిమార్గానికి భిన్నమైపోయాడు. భిక్షువర్షీయసి జబ్బుచేసి పడిపోగా ఆ అవ్వే మరణిస్తే ఆ పాపం ఎవ్వరిదని ప్రశ్నించే వెర్రిగాలి భౌతికవాదికి ప్రతీకయే. ఇది నా పాపం కాదని జవాబు చెప్పిన ఎంగిలాకు కర్మవాదికే ప్రతీక. ఆ ఎంగిలాకు సమాజశ్రమను దోచుకుని సుఖంగా భుజించిన పెట్టుబడిదారుడి ఎంగిలాకే! అతడే హేతువాదాన్ని తిరస్కరించి మతసిద్ధాంతాలను ఆశ్రయిస్తాడు. అవ్వ బిచ్చకత్తె కావడం, జబ్బుపడడం, తిండి దొరకక చనిపోవడం వీటి కన్నింటికీ ఆమె పాపకర్మయే కారణమంటాడు పెట్టుబడిదారు. తాను సుఖంగా బ్రతకడానికి తాను చేసుకున్న పుణ్యకర్మలే కారణమంటాడు. సామ్యవాది ఈ పాపపుణ్యాలను లెక్కించక ప్రకృతిసంపదలను అనుభవించడానికి అందరికీ సమానమైన హక్కు లున్నాయనీ ఎవరి శక్తికి తగినట్లు వారు పనిచేసి, ఎవరి అవసరానికి తగినట్లు వారు అనుభవించాలనీ సొంత ఆస్తి అనేది ఎవరికీ ఉండరాదనీ సమష్టియాజమాన్యం రావాలనీ వాదిస్తాడు. ఈ సామ్యవాదాన్నే శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి' ద్వారా స్ఫురింపజేశాడు. 'పరిపూర్ణపు బ్రతుకు' అంటే శ్రీశ్రీ దృష్టిలో సామ్యవాదమే! భిక్షువర్షీయసికి అలాంటి పరిపూర్ణపు బ్రతుకు లభించలేదు. 'భిక్షువర్షీయసి' తిరుగుబాటుదారు కాదు; సమాజవాస్తవికతకు ఒక ప్రతినిధిమాత్రమే ! బాటసారి, ఉన్మాది, దురదృష్టజీవి వీరంతా అలాంటిపాత్రలే. ఇటువంటి మూగజీవులను చూపించి శ్రీశ్రీ పీడితజనుల నందరినీ విప్లవశంఖం పూరించవలసిందిగా అర్థించాడు. తానే కనదశంఖం పూరిస్తాననీ భూకంపం పుట్టిస్తాననీ మహాప్రస్థానం సాగిస్తాననీ ముందుకు వచ్చాడు. కార్మికులు, కర్షకులు, అణగారిన ఆర్తులు తిరగబడతారని భవిష్యత్తును గురించి ఆశావాక్యాలు పలికాడు. తిరుగుబాటుకు లేవవలసిందిగా ఉద్బోధించాడు.

## శ్రీశ్రీ కథాసూచకప్రతీకలు

'భిక్షువర్షీయసి'లో కథావస్తువు లేకపోయినా కావ్యవస్తువుగా ఆ చిన్నసంఘటననే శ్రీశ్రీ పరిణాతం చేసుకున్నాడు. శ్రీశ్రీ నిర్వహణను తొలగిస్తే, భిక్షువర్షీయసి ఒక సంఘటనగానే మిగులుతుంది. 70 ఏళ్ళముసలిగ్రుడ్డి బిచ్చగత్తె కూడు, గూడు, గుడ్డలేక జబ్బుచేసి ఒక హేమంత

సాయంకాలం చెట్టుక్రింద చచ్చిపోయిందనేదే ఆ సంఘటన. ఈ చిన్నవార్తనే కావ్యఖండంగా చేయగలగడానికి శ్రీశ్రీకి సహకరించినది సమాజవాస్తవికతా స్పృహయే! ఈ దృక్పథంవల్లనే అతిసామాన్యసంఘటనను కూడా శ్రీశ్రీ కావ్యంగా చేయగలడు. బాటసారి, ఆకాశదీపం ఉన్మాది, సంధ్యాసమస్యలు అటువంటి సంఘటనలే !

కావ్యపరిపుష్టికి ప్రకృతివాతావరణాన్ని సాధనంగా వాడుకున్నాడు శ్రీశ్రీ. భిక్షువర్షీయసిలో వెర్రిగాలి, కుక్క, తొండ, ఈగ, ఎంగిలాకు వంటివి ప్రకృతినుంచి తీసుకున్న ప్రతీకలే ! వీటికి ప్రతీకధర్మాన్ని ఆరోపించకపోయినా అవి కథను ఉద్దీపిస్తూనే ఉంటాయి. కానీ కుక్కనూ తొండనూ ఎంగిలాకునూ పెట్టుబడిదారులకు ప్రతీకలుగా తీసుకున్నాడు శ్రీశ్రీ.

వెర్రిగాలివేసినప్రశ్నకు సమాధానం ఇవ్వడానికి కుక్కకు కానీ తొండకు కానీ ఖాళీలేక పోవడాన్ని శ్రీశ్రీ సూచించాడు. ఆ ఖాళీ ఎంగిలాకుకు మాత్రమే ఉందనడంలో వ్యంగ్యం ఉంది. ఎముకముక్క కొరుక్కునే కుక్క మాంసాహార మత్తుడైన ఒక బలవంతుడిని ప్రతిబింబిస్తుంది. బలవంతులు బలహీనులను ఏవిధంగా కొరుక్కుతింటారో ఈ పదచిత్రం సూచిస్తుంది. ఒక ఈగను పడవేసుకు తొందరగా తొలగిపోయే తొండ అన్నంతినడంకన్నా అత్యవసరమైన వ్యాపారపు తొందరలున్న సంపన్నుడ్ని ప్రతిబింబిస్తుంది. ఎగిరివచ్చిన ఎంగిలాకుకు అటువంటి తొందర లేవీ లేవు. చిమ్మచీకటి క్రమ్మటం, దుమ్ము రేగడం నాటకీయమైన సంకేతాలుగా ముసల్దాని చావును సూచించాయి.

'భిక్షువర్షీయసి' ఖండికనిండా ప్రకృతిదృశ్యా లనేకం ఉన్నాయి. దారిపక్క - చెట్టుకింద-ముసురుతున్న ఈగలు - ప్రక్కనున్న బండరాయి - వెర్రిగాలి - ఎముకముక్క కొరుక్కునే కుక్క - ఈగను పడవేసుకు తొలగే తొండ - క్రమ్మే చిమ్మచీకట్లు - రేగే దుమ్ము - ఎగిరి వచ్చిన ఎంగిలాకు - ఈ ప్రకృతి దృశ్యాలను కథాపరిపోషకాలుగా వాడుకున్నాడు శ్రీశ్రీ. బాటసారిలో మబ్బు, గాలి, వాన, వరద, చిమ్మచీకటి, గ్రుడ్డిచీకటి, గూబలు, మెరుపు, వేగుజాము, కోడికూత, వేగుజుక్క, శీతవాయువు వంటివి ఉన్నాయి. భిక్షువర్షీయసి కథ పూర్తిఅయ్యేసరికి గాలివాన వచ్చి రాత్రి అయితే, బాటసారి కథ పూర్తి అయ్యేసరికి వాన వెలిసి తెల్లవారుతుంది. ఈవిధంగా వైవిధ్యం చూపించడంలో శ్రీశ్రీ నిపుణుడు.

ప్రకృతిప్రతీకలు మహాప్రస్థానం, జయభేరి, ఒకరాత్రి, ఒకక్షణంలో, శైశవగీతి, అద్వైతం, ఖండికలలో పుష్కలంగా కనిపిస్తాయి కానీ శ్రీశ్రీ మాత్రం ప్రకృతికవిగా మహాప్రస్థానంలో కనిపించడు. అతడు సమాజకవియే !

## శ్రీశ్రీ ఉపమానాలు

శ్రీశ్రీ ఉపమానాలు భారతీయసంప్రదాయంలోని కవిసమయాలవల్ల సిద్ధించినవి కావు. ఉపమానం ప్రసిద్ధమైనదై ఉండాలని ఆలంకారికులన్నారంటే పూర్వకవుల ఉపమానాలను దృష్టిలో ఉంచుకునే! ప్రపంచకవుల ఉపమానాలను తెలుసుకున్న శ్రీశ్రీ మౌలికంగానే వాటిని ఏరుకున్నాడు. ఆరినకుంపటివిధాన ముసిల్ది కూర్చున్నదన్నప్పుడు ఆమె పూర్వజీవితమంతా స్ఫురిస్తుంది. ముసల్దాని తేజోవిహీనతనీ నిశ్చేతనత్వాన్నీ వ్యక్తంచేయడానికి ఆరినకుంపటిఅనే ఉపమానాన్ని చెప్పి ఆమె యౌవనలావణ్యాలతో ప్రకాశించిన దశలో మండినకుంపటి అని స్ఫురింపజేస్తాడు. ముగ్గుబుట్టవంటి తల అన్నప్పుడు నల్లనికేశమొకటి కూడా లేకపోవడం స్ఫురిస్తుంది. ప్రక్కనున్న బండరాతిపగిదిగనే ముసిల్ది పడిఉన్నది – అన్నప్పుడు జడత్వం, మరణం సూచింపబడ్డాయి.

ప్రభంజనంవలె హోరెత్తండీ – వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె పెళపెళపెళపెళ విరుచుకుపడండి – శివసముద్రమూ నయాగరావలె ఉరకండి – ఉత్తాచులవలెనూ రేచులవలెనూ ధనంజయునిలాసాగండి – బాటసారి నడిసముద్రపునావరీతిగ సంచరిస్తూ సంచలిస్తూ – గుండుసూదులు గ్రుచ్చినట్లే శిరోవేదన అతిశయించింది – రాత్రి నల్లనిరాతిపోలిక గుండెమీదనె కూర్చుంది – మనదీ ఒక బ్రతుకేనా కుక్కలవలె నక్కలవలె – మనదీ ఒక బ్రదుకేనా సందులలో పందులవలె – గగనమంతా నిండి బహుళపంచమిజ్యోత్స్న పొగలాగు క్రమ్మి భయపెట్టింది – కరికళేబరములా కదలదు కొండ – కాళ్ళుతెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి – విశ్వమంతా నిండి బహుళపంచమిజ్యోత్స్న వెలిబూది పోలె భయపెట్టింది – గదిలోపల చినుకులవలె చీకట్లు – ఖండపరశుగళకపాలగణముల కనుకొలకులలో ఒకటివలె గది చూస్తోంది – దీపం కత్తిగంటుమీద నెత్తుటిబొట్టులా గున్నది – సింహములాగూ సివంగిలాగూ ఫిరంగులాగూ కురంగిలాగూ శంఖములాగూ సర్పములాగూ సృగాలమట్లూ పండితులట్లూ బాలకులట్లూ గణగణమనే గంటలు – ఎద్దుల్లాగు పనిచేసే కార్మికులు – వంటి శ్రీశ్రీ ఉపమాలంకారాలు అర్థవైశాల్యానికీ అర్థోద్దీపనానికీ సహకరిస్తాయి కాని కేవల సాదృశ్యం తెలిపి అదృశ్యం అయిపోయేవి కావు! శ్రీశ్రీ ఉపమాలంకారంకన్నా రూపకాలంకారాన్నే ఎక్కువగా ప్రయోగించి భావచిత్రంగా తయారుచేస్తాడు.

## శ్రీశ్రీ పదాద్యక్షరసాదృశ్యసంవిధానం

ఒక వాక్యంలో పదాదివర్ణాల సాదృశ్యం పాటించి భావోద్దీపనం కలిగిస్తాడు శ్రీశ్రీ. ముసిల్దొకతె మూల్గుతూ ముసురుతున్న ఈగలతో వేగలేక – ముగ్గుబుట్టవంటి తలా ముడుతలు తేరిన దేహం అన్నపుడు మువర్ణపునరావృత్తి పదాదినుంచి వచ్చి మూల్గును వ్యక్తంచేస్తోంది! ముసలితనాన్ని ధ్వనిస్తోంది ।

పుడమితల్లికి పురుటినొప్పులు కొత్తసృష్టిని స్ఫురింపించాయి - ప్రదీప్తకీలా ప్రవాళమాలా ప్రపంచవేలా ప్రసారములలో-అమోఘ మగాధ మచింత్య మమేయం - అనేకు లింకా అభాగ్యు లంతా అనాథులంతా అశాంతులంతా - స్వస్తివాక్యములు సంధానిస్తూ స్వర్ణవాద్యములు సంరావిస్తూ - నా వినుతించే నా విరుతించే నా వినిపించే నవీనగీతికి నా విరచించే నవీనరీతికి - భావం భాగ్యం ప్రాణం ప్రణవం - గ్రుడ్డిచీకటిలోన గూబలు ఘూకరించాయి - విడిన మబ్బుల నడుమనుండీ వేగుజుక్కా వెక్కిరించింది - కరికళేబరములా కదలదు కొండ - దుర్హతి దుర్గతి దుర్మతి దుర్స్మృతి - నిప్పులుచిమ్ముకుంటూ నింగికి నే నెగిరిపోతే నిబిడాశ్చర్యంతో వీరు-నెత్తురు క్రక్కుకుంటూ నేలకు నే రాలిపోతే నిర్దాక్షిణ్యంగా వీరె - ఆకసమున హరివిల్లు విరిస్తే అవి మీకే అని ఆనందించే కూనల్లారా - కర్మాగారము కళాయతనమూ కార్యాలయమూ కారాగృహ ముల - ఆనందం ఆర్ణవమైతే అనురాగం అంబరమైతే అనురాగపుటంచులు చూస్తాం ఆనందపు లోతులు తీస్తాం - కలసిపోతిని కరగిపోతిని కానరాకే కదలిపోతిని - అజ్ఞానపు టంధయుగంలో ఆకలిలో ఆవేశంలో - ఒక వ్యక్తిని మరొక్కవ్యక్తీ ఒకజాతిని వేరొకజాతీ - ఏ యుద్ధం ఎందుకు జరిగెనొ ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో - కాన్పించని కథలన్నీ కావాలిప్పుడు - సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుని సాహస మెట్టిది - ఏదేశం ఏ కాలంలో సాధించిన దే పరమార్థం ఏ శిల్పం ఏ సాహిత్యం ఏ శాస్త్రం ఏ గాంధర్వం ఏ వెల్గులకీప్రస్థానం ఏ స్వప్నం ఏ దిగ్విజయం - మొద్దుల్నీ మొరటుల్నీ చేసి ముద్దకి కూడా - మహారాజు మనీపర్సు మాయంటావూ - సరిహద్దులు దొరకని సంధ్యలలో మా సంచారం - రగిలించి రక్తాలు రాజ్యాలు కదిపి - సహృదయా సదయా సన్మార్గగామీ - చీమను చంపడానికి కూడా చేతులు రానివాడా - నిజంగానే నిఖిల లోకం నిండుహర్షం వహిస్తుందా ? - సాధుసత్వపు సోదరత్వపు స్వాదుతత్త్వం జయిస్తుందా - మార్క్సుఎంగిల్సు మహాప్రవక్తలై మానవపురోగమనమార్గాలు తెరువగా - కోటి గొంతులు నిన్నుకోరి రమ్మన్నాయి కోటిచేతులు నిన్ను కౌగిలిస్తున్నాయి-నిటాలాక్షి పగిలిందట నిటాలాగ్ని రగిలిందట నిటాలాగ్ని నిటాలార్చి నిటాలాక్షి-అది విలయం అది సమరం అటో ఇటో-సంరంభం సంక్షోభం సమ్మర్దన సంఘర్షణ - స్వాతంత్ర్యం సమభావం సౌభ్రాత్రం సౌహార్దం - సారా దుకాణాల వ్యవహారం సజావుగానే సాగింది సానుభూతి సభలలో ఎవరూ సాశ్రునేత్రాలు-ఎవరి పనులలో వాళ్ళు ఎవరితొందరలో వాళ్ళు ఎవరికి కావాలి నేస్తం ఏమయిపోతేనేం నువ్వు ఎవ్వరూ నిన్ను స్మరించడం లేదులే - మొదలైన ఉదాహరణల్లో Alliteration కేవలాలంకారం కోసం కాక భావోద్దీపనానికే అలంకార మయింది. సవర్ణాది పదవిన్యాసంలో స్విన్‌బర్న్ శ్రీశ్రీకి గురువు.

## శ్రీశ్రీ పదాంతస్వరసాదృశ్యశిల్పం

ఒకవాక్యంలో పదాంతాల స్వరాల సాదృశ్యం (Assonance) పాటించి భావోద్దీపనం కలిగిస్తాడు శ్రీశ్రీ. వళ్ళు ముదిరి కీళ్ళు కదిలి బంతుకంతే కోర్కి సడలి ప్రక్కనున్న బండరాతి పగిదిగనే పడియున్నది అనే వాక్యంలోని ఇకారాంతాలు ముసలితనానికి సూచకంగా ఉన్నాయి. అనర్గళం అనితరసాధ్యం నామార్గం - సిందూరం రక్తచందనం బంధూకం సంధ్యారాగం - పయోధర ప్రచండఘోషం ఖడ్గమృగోదగ్రవిరావం ఝుంఝూనిలషడ్జధ్వానం-కణకణమండే గలగలతొణకే - దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో - భావం భాగ్యం ప్రాణం ప్రణవం-చండచండం తీవ్రతీవ్రం - పల్లెటూళ్ళో తల్లి ఏమని పలవరిస్తోందో - పల్లెటూళ్ళో తల్లికేదో పాడుకలలో - లేదు సుఖం లేదు రసం చేదు విషం జీవఫలం - బక్కచిక్కి బిక్కచచ్చి - సూర్యునిలో సూదులతో - ఏ శిల్పం ఏ సాహిత్యం ఏ శాస్త్రం ఏ గాంధర్వం - నటధూర్జటి నిటాలాక్షి పగిలిందట నిటాలాగ్ని నిటాలార్చి నిటాలాక్షి పటాలుమని - ఈ యెగిరిన ఇనుపడేగ ఈ పండిన మంటపంట - మొదలైనవి స్వరానుప్రాసల కుదాహరణాలు. ఫ్రెంచిగీతుల మంచిరీతులలో ఇదొకటి.

## శ్రీశ్రీ అంతఃప్రాసశిల్పం

ఎముక ముక్క కొరుక్కుంటు ఏమీ అనలేదు కుక్క అనే వాక్యంలో అంతఃప్రాస పాటించి భావవ్యంజన చేశాడు శ్రీశ్రీ. కకారద్విత్వాలు కర్కశధ్వనిని అనుభూతం చేస్తాయి.

ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన - నెత్తురు మండే శక్తులు నిండే - స్మరిస్తే పద్యం అరిస్తే వాద్యం - లోకాలు భవభూతి శ్లోకాలు పరమేష్ఠిజూకాలు - నేనొకదుర్గం నాదొకస్వర్గం-గిరులు సాగరులు కంకేళికామంజరులు ఝరులు నా సోదరులు - నగ్నంగా నర్తిస్తున్నారు భయోద్విగ్నంగా వర్తిస్తున్నారు - ప్రదీప్తకీలాప్రవాళమాలాప్రపంచావేలా - అంతరాళభయంకర ప్రాంతరాలనా - దీపం ఆరిపోయింది తారగా మారిపోయింది - నవ్వులతో రంగుల పువ్వులతో-మెరుపుమెరిస్తే వాన కురిస్తే ఆకసమున హరివిల్లు విరిస్తే - సీతలపున రేకులు పూస్తే నా వలపున బాకులు దూస్తే - విషంక్రక్కే భుజంగాలో కదం త్రొక్కే తురంగాలో - పాపాలు వండించి భావాలు మండించి - మొదలైనవి అంతఃప్రాసలే! అమెరికన్‌కవి ఎడ్గార్ అల్లన్ పో శ్రీశ్రీకి అంతఃప్రాసల విన్యాసంలో గురుప్రాయుడు. అల్లన్ పో అంతఃప్రాసలు (Internal rhymes) శబ్దలోలత అనిపించేటంత అతిశయస్థాయిలో ఉంటాయి. Poetry is the rhythmic creation of beauty అని కవితానిర్వచనం చెప్పిన పో లయనూ శబ్దాలనూ ఛందస్సునూ మేళవించాడు.

And the silken sad *uncertain* rustling of each purple *curtain*.
*Thrilled* me *filled* me with fantastic terrors never felt before.
So that now, to still the *beating* of my heart, I stood *repeating*.[2]

---

2 The Raven.

ఈవిధంగా నడుస్తుంది పో రాసిన ప్రతిపాదం. ఈ పనితనం శ్రీశ్రీ అద్వైతంలో పరాకాష్ఠ నందుకుంది.

## శ్రీశ్రీ వాడుకమెలకువలు

గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం వ్యావహారికభాషలోని జీవశక్తిని ఆవిష్కరించి ఆధునికజీవితానికి సాహిత్యాన్ని సన్నిహితంచేయగా శ్రీశ్రీ ఆ భాషాజీవశక్తిని సామాజికచైతన్యానికి పరికరంగా వాడుకున్నాడు. వాక్యసంవిధానాలలో గురజాడ చూపిన జీవితవాస్తవికతను శ్రీశ్రీ సమాజవాస్తవికతకు అన్వయించాడు. ఉదాహరణకు గురజాడవారి కొన్నివాక్యాలు: "అతనుచెప్పేదంతా తప్పుల తడక. అది నేను న్యూస్ పేపర్లో యేకేశాను. అప్పట్నుంచి నేనంటే వాడిక్కడుపుడుకు. మీవల్లనాకు ఒచ్చిందల్లా చుట్టకాల్చడం ఒక్కటే. పాఠంచెప్పమంటే యెప్పుడూ కబుర్లుచెప్పడమేకాని ఒక్కమారయినా ఒక ముక్కచెప్పిన పాపాన్ని పోయినారూ? చుట్టకాల్చబట్టేకదా దొర్లంత గొప్పవాళ్ళయినారు. చుట్టకాల్చని ఇంగ్లీషువాణ్ణి చూశావూ? చుట్టపంపిణీమీదనే స్టీముయంత్రం వగయిరా తెల్లవాడు కనిపెట్టాడు. లేకపోతే వాడికి పట్టుబ్ణా?" ఇలా అతిసహజంగా నాటకీయంగా శ్రోతమనస్సుకందేటట్లుగా ఉంటుంది వాక్యశైలి. శ్రీశ్రీ వాక్యాలు కూడా వాడుకభాషనుంచి ఊడిపడ్డవే! ముగ్గుబుట్టవంటితలా ముడుతలు తేరిన దేహం కాంతిలేనిగాజుకళ్ళు తనకన్నా శవంనయం. పడిపోయెను జబ్బుచేసి అడుక్కునే శక్తి లేదు. రానున్నది చలికాలం దిక్కులేని దీనురాలు వెర్రిగాలిప్రశ్నిస్తూ వెళిపోయింది. ఏమీఅనలేదు కుక్క-ఇలా భిక్షువర్షీయసిలోని వాక్యాలు వాడుకకు సాధ్యమైనంత దగ్గరగా ఉన్నాయి.

మరోప్రపంచం పిలిచింది! పదండిముందుకు! పోదాంపైపైకి! పదండిపోదాం! సోమరులారా చావండి! గొలుసుల్తెంచుకు ఉరికిపడ్డాయి! సింహం జూలుదులిపి ఆవులించింది! కావాలోయ్ నవకవనానికి! ముళ్ళదారినా నీ సంచారం? పోతేపోనీ వస్తేరానీ! హీనంగా చూడకు దేన్నీ! నీవేపే చూస్తూఉంటాయ్! ఇంకా నేనేంవిన్నానా? నా నిట్టూర్పులు వినిపిస్తాయా ? ఏమని పలవరిస్తోందో? మెరుపుమెరిసింది! కోడికూసింది! పేగుకదిలింది! తూలుతున్నావా? క్షమిస్తావా? వేళాకోళమాడకు! ఔనునిజం! మనదీఒకబ్రదుకేనా? అటుచూస్తే ఇటుచూస్తే! గదిలో ఎవరూ లేరు! రాకాసికేకలు వేసింది. ఎచటికిపోతావీరాత్రి? ననుచూస్తూంటే నవ్వొస్తోందా? దరిద్రులను కాల్చుకుతినడం. ఇంకానా ఇకపై చెల్లవు! అనుభవించాలి మీ కర్మం. ముద్దకే కూడా దూరంచేశాడు! ఘోరంఇది దారుణంఇది. చెయ్యెత్తేంచస్తున్నాం మేము! మాయంటావా అంతా మిథ్యంటావా? అదృష్టవంతులు మీరు. వెలుగును ప్రేమిస్తారు. వడ్డించిన విస్తరి మీజీవితం. అభాగ్యులం మేము. అన్నీ సమస్యలే! మావంట మేమే వండుకోవాలి. విస్తరేదొరకదు. మాకు గోడలు లేవు. అలజడి మా జీవితం. ముందుకు పోతాం మేము. నిజంగానే నిజంగానే? ఏడవకండేడవకండి. రథచక్రాలొస్తున్నాయి. అటో ఇటో తెగిపోతుంది. ఈ లోకం మీ దేనండి. తలవంచుకు వెళిపోయావా! దేన్ని వెదుక్కుంటూ వెళ్ళావోయ్?

ఎంత అన్యాయం చేశావోయ్! జ్ఞాపకం ఉందా! ఎవరిపనులలో వాళ్ళు! ఎవరితొందరలో వాళ్ళు ఎవరికి కావాలి ఏమయిపోతేనేం ఇలా చూడు నీకోసం మొదలైన ప్రయోగాల్లో ప్రజావ్యవహారం తొణికిసలాడుతుంది.

## విశేషణవిశేష్యాలతో శ్రీశ్రీ పదబంధాలు

మహాప్రస్థానశైలిలో విశేషణవిశేష్యాల పదబంధాలు ప్రత్యేకంగా కనిపిస్తాయి. ఆరిన కుంపటి, ముసురుతున్న ఈగలు, ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులు, నెత్తురు మండే శక్తులు నిండే సైనికులు, సలసల క్రాగే చమురు, ఇంకిన క్రొన్నెత్తురు, తెగిపోయిన విపంచికలు, మరణించిన యువయోధులు, తొలిగర్జించిన తూర్యవిరావం, పులిచంపిన లేడినెత్తురు, ఘాటెక్కిన గంధకధూమం, పోటెత్తిన సప్తసముద్రాలు, రగులుకొనే రాక్షసిబొగ్గు, బుగులుకొనే బుక్కాగుండ, వికసించిన విద్యుత్తేజం, చెలరేగిన జనసమ్మర్దం, వెదకిన ప్రోవుల ప్రోవుల రణన్నినాదాలు, ఆవర్తించిన ప్రచండఝంఝూప్రభంజనం, మ్రోగిన శంఖారావం, ఢంకాధ్వానం, విరుతించిన నానా జంతుధ్వనులు, వికసించిన వజ్రం, ఎగిరే లోహశ్యేనం, ప్రసవించిన శిశువు, స్వప్నాలను కాంచే జవరాలు, ప్రాచీనస్మృతులూచే చప్పుడు, కడుపు దహించుకుపోయే పడుపుకత్తె, ఉరితీయబడ్డ శిరస్సు, సమ్మూర్ఛంగావించిన గాంధర్వం, నిద్రిస్తూన్న అహంకారం, జాతిజనులు పాడుకునే మంత్రం, సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వల జడి, అందీఅందకపోయే చేలాంచలములు, విసరిన రసవిస్మృమర కుసుమపరాగం, కాలువకట్టే ఘర్మజలం, ధనికస్వామికి దాస్యంచేసే కార్మికులు, యంత్రభూతముల కోరలుతోమే కార్మికులు, కణకణమండే విలాపాగ్నులు, గలగల తొణకే విషాదాశ్రులు, ఖరీదుకట్టే షరాబు, కాల్చే ఆకలి, కూల్చే వేదన, దారితప్పిన బాటసారి, తల్లడిల్లే కెళ్లగిల్లే పల్లటిల్లే బాటసారి, కన్నుల నిండిన కావిరి, గుండెల కప్పిన కుంపటి, తొణికిన స్వప్నం, తొలగిన స్వర్గం, అలసిన కన్నులు, చెదరిన గుండెలు, బక్కచిక్కి బిక్కచచ్చి పడిన బ్రతుకు గోడలు, సూర్యునిలో సూదులతో క్రీడలాడు నీడలు, ఏమీ ఎరుగని పూవులు, పోయిన బాల్యం, చెరిగిన పదముల చిహ్నాలు, విషమించిన ఖేదం, కుసుమించిన మోదం, ఎగిరిన జీవవిహంగం, పగిలిన మరణమృదంగం, చిగురించిన తోటలు, చితులుంచిన చోటులు, విషంక్రక్కే భుజంగాలు, కదంత్రొక్కే తురంగాలు, మదంపట్టిన మాతంగాలు, రెక్కవిప్పిన రివల్యూషన్, చల్లారిన సంసారాలు, పరస్పరం సంఘర్షించిన శక్తులు, రాళ్ళెత్తిన కూలీలు, ప్రభువెక్కిన పల్లకి, సరిహద్దులు దొరకని సంధ్యలు, దారుణ ద్వేషాగ్ని పెంచే దానవత్వం, బానిసల సంకెళ్లుబిగిసే పాడుకాలం, జడలు విచ్చిన సుడులు రెచ్చిన కడలినృత్యం, రథచక్రపుటిరుసులలో పడి నలిగిన దీనులు, హీనులు, దగాపడిన తమ్ములు, ఎగిరిన ఇనుపడేగ, పండిన మంటపంట, కనబడని ఊహ, అందని రెక్క, వదలినపోరాటం ఇలా అనేకంగా క్రియాజన్యవిశేషణాలతో చెప్పదలచిన భావాన్ని కుదించడం శ్రీశ్రీ సంవిధానవిశేషం. శ్రీశ్రీయ శైలి కిదొక ఆనవాలు!

## శ్రీశ్రీ త్ర్యస్రగతిగేయం

'భిక్షువర్షీయసి' గేయాన్ని త్ర్యస్రగతిలో త్రిమాత్రాగణాలతో రచించాడు శ్రీశ్రీ. పాదానికి పన్నెండు మాత్రలుగల ఈ గేయంలో కొన్ని పాదాలు చతురస్రగతిలోకూడా నడుస్తాయి. దారిపక్క చెట్టుకింద అనే పాదంలో త్రిమాత్రాగణాలు విరుగుతూంటే ఆరినకుంపటివిధాన అనే పాదం చతుర్మాత్రాగణాలుగాకూడా విరిగి కందపద్యగమనాన్ని జ్ఞాపకం తెస్తుంది. కూర్చున్నది ముసిల్దొకతె అన్న పాదం త్రిమాత్రాగణాల్లో కానీ చతుర్మాత్రాగణాల్లో కానీ విరగక షణ్మాత్రాగణాల్లో విరుగుతోంది. మొత్తం గేయమంతటినీ షణ్మాత్రాగణాలుగానే విభజించ వీలవుతుంది. చేదుపాట, దేనికొరకు, నీడలు, మిథ్యావాది, జగన్నాథుని రథచక్రాలు త్ర్యస్రగతిలోనివే అయినా షణ్మాత్రాగణాలుగానే విరుగుతాయి. చతురస్రగతిలో రాసిన కొన్ని గేయాలుకూడా షణ్మాత్రాగణద్వయాలుగానే విరుగుతాయి. ఘోషలు విన-బడుతున్నాయ్, గుండెలు విడి-పోతున్నాయ్, జగమంతా-బలివితర్ది, సాయంత్రం-ఆరున్నర మొదలైనవి.

## శ్రీశ్రీ పాదాల కత్తిరింపులు

ముత్యాలసరంలో చివరిపాదాన్ని యథేచ్ఛగా కత్తిరించడం అనేది గురజాడవారు ఆంగ్ల సంప్రదాయాన్ని బట్టే చేశారు. ఇది CAESURA అనే పేరుతో సంప్రదాయంగా ఉంది. "A perceptible break in the metrical line, properly described as an expressional pause...... The artistic use of Caesura is one of the surest tests of an artistic skill"[3] ఈ కత్తిరింపులు శ్రీశ్రీ ఎన్నో చేశాడు.

'వెర్రిగాలి ప్రశ్నిస్తూ/వెళిపోయింది' అన్నపుడు చివరిపాదాన్ని 12 మాత్రలనుంచి 7 మాత్రలకు కుదించాడు. ఈ కత్తిరింపు నిష్క్రమణకు వ్యంజకమయింది. రాలి నెత్తురు క్రక్కుకుంటూ/పేలిపోతాయి- మహాప్రళయం జగంనిండా/ప్రగల్భిస్తుంది- కళ్ళంటూ ఉంటే చూసీ/వాక్కుంటే వ్రాసి- దారితప్పిన బాటసారికి/ఎంతకష్టం?- పల్లెటూళ్లో తల్లి ఏమని/పలవరిస్తోందో?- వేగుజామును తెలియజేస్తూ/కోడికూసింది !- వెర్రివాడా కుర్రవాడా/వేడుకుంటాము !- తెలివిమీరిన పెద్దమనుషులు/తొలగిపోతారు-వంటివన్నీ సముచితమైన పాదఖండనాలు.

## శ్రీశ్రీ భావసూచకపరిమాణశిల్పం

విషాదగాథ అయిన భిక్షువర్షీయసిని 7 గేయాలలో రాయడం విషాదసూచకపరిమాణ దృష్టియే! అవతారం ఖండికనుకూడా 7 గేయాలలోనే రాశాడు. ఇది అద్భుతభావసూచకం. చేదుపాట 7 గేయాలలోనే ఉంది. ఇది బాధాసూచకం. జగన్నాథునిరథచక్రాలు 7 గేయాలలో నడుస్తుంది. ఇది విప్లవసూచకం.

3 An Introduction to the Study of English Literature—Soares,

మనస్సులో ఎదోస్మృతి! తటిన్మణి మణీఘృణి!

1934 అక్టోబరు 30

ప్రకృతిసౌందర్యాన్ని చూసి చకితుడైన ఒక భావకవి తన స్పందనను వ్యక్తం చేయడానికి మానవజీవితసౌందర్యాన్ని ప్రకృతిసౌందర్యంలో ఆరోపించి మనోహరభావచిత్రాన్ని సృష్టించాడు.

రంగురంగుల సొగసుచీరల ధరించి/నవ్వువెన్నెలఁ గాయు క్రొన్ననల నడుమ
వాడివాడని యీ విరిచేడె తాల్చు/మంచు ముత్తియములఁగన మది కరంగు

తాను చూసిందొక పువ్వుని! చూపింది ఆ పువ్వుకన్నా భిన్నమైన స్త్రీప్రకృతిని! చీరలు, నవ్వులు, నగలు కాల్పనిక సౌందర్యాన్ని వ్యక్తంచేశాయి. ఇలా చెప్పడానికి కవి తన అనుభూతిని మననం చేసుకుని అందమైన మాటలలో కళ్ళకు కట్టే రూపంలోకి మార్చవలసి ఉంటుంది.

మరొకకవి మెరుపుల్ని చూసి ఆటలాడు వేలుపుబాలికల పావడాఅంచుల బంగారు తీగ లేమో అని భావించి అంత అందమైన ఊహను తిరస్కరించి, వేటకాని, కోలలకు కూలి వేదనల తూలు హరిణాలకళ్లు (జాలికి పురుటిళ్లు) దిక్కుదిక్కులకంపిన దీనంపుచూడ్కులే ఆనాటి ప్రళయ తాండవభయంకరసౌదామినులు' అంటూ పీడకపీడిత సమాజాన్ని ప్రకృతిలో చూపించాడు.

పై రెండు ఉదాహరణల్లోనూ మొదటిది రచించినవాడు కృష్ణశాస్త్రి; రెండవది రచించిన వాడు శ్రీశ్రీ కవి దృక్పథమే కావ్యంలో ప్రతిబింబించిం దనడానికి ఇవి రెండూ తార్కాణాలు. కృష్ణశాస్త్రిగారి దృక్పథానికి రొమాంటిసిజమూ శ్రీశ్రీగారి దృక్పథానికి రియలిజమూ ప్రేరకాలు. సమాజవాస్తవికతను శ్రీశ్రీ తన కవితల్లో ప్రతిబింబిస్తూ బాటసారి, భిక్షువర్షీయసి, ఆకాశదీపం, ఉన్మాది, చేదుపాట, సంధ్యాసమస్యలు, వాడు, వ్యత్యాసం వంటివి రాశాడు. సమాజవాస్తవి కతను మార్క్సిజం కళ్ళతోనే శ్రీశ్రీ దర్శించాడు. పీడకపీడితవర్గాలతో కూడిన సమాజవ్యవస్థను చూసి పీడితవర్గాన్ని మరోప్రపంచంవైపు నడవవలసిందిగా ఉద్బోధించాడు. శ్రీశ్రీ మరో లక్ష్యం కాలంతోపాటు కవిత్వాన్ని కూడా మార్చడం! సౌందర్యారిరంసతో శుద్ధప్రకృతివైపుచూసి వ్యక్తి గతంగా తాను పొందిన అనుభూతిని కృష్ణశాస్త్రి చెబితే సామాజికచైతన్యంతో ప్రకృతిని చూసి సమాజప్రతినిధిగా తాను పొందిన ఆవేదనను శ్రీశ్రీ చెప్పాడు. ఆ శ్రీశ్రీయే సమాజప్రతినిధిగా కాక ఒక వ్యక్తిగా ప్రకృతిని చూసి దాని భౌతికస్వరూపాన్ని ఒక క్షణంలో అనే ఖండికలో చిత్రించాడు.

## శ్రీశ్రీ అనుభూతికవిత్వం

ఇలాంటి చిత్రణచేయడానికి శుద్ధకవిత్వంమీద శ్రీశ్రీకి ఉండేప్రత్యేకాభిరుచియే కారణం.[1] సామాజికాభ్యుదయంతో సాహిత్యాన్ని ముడివేయకుండా కేవలం నాగరికతకు చిహ్నంగానే సాహిత్యాభ్యుదయాన్ని భావించే పాశ్చాత్యుల 'ఇజాల' మీద శ్రీశ్రీకి అభిమానం కలగడానికి కారణం శుద్ధకవిత్వంయొక్క వికాసంమీదనే అభ్యుదయకవిత్వవికాసం ఆధారపడి ఉందనేభావనే. ఫ్రాన్సులో చిత్రకళాసంప్రదాయాలమీద తిరుగుబాటుగా వచ్చిన ఇంప్రెషనిజం సామాజికదృక్పథంతోగానీ వాస్తవికతావాదంతోగానీ సంబంధంలేని ఆత్మాశ్రయవాదమే అయినా సంప్రదాయాల్లోని కృతకత్వంమీద తిరుగుబాటు చేయడంవల్ల శ్రీశ్రీకి ప్రీతిపాత్రమయింది. ఆ ఇంప్రెషనిస్టు (స్మృతివాది) లెక్కన్నక్కలోనే 'ఒక క్షణంలో' శ్రీశ్రీ రాశాడు.

శ్రీశ్రీ చూసిన ప్రకృతిదృశ్యం ఒకక్షణం మాత్రమే కనిపించి మాయమైపోయే మెరుపు కావడంవల్ల అతనికి కలిగిన అనుభూతి కూడా క్షణికమైనదే! కాని ఆ క్షణానుభూతిని జ్ఞాపకంచేసుకుంటూ దానికి శాశ్వతత్వం కల్పించడంకోసం శ్రీశ్రీ చేసిన ప్రయత్నానికి 'ఇంప్రెషనిజం' మూలం. Impressionism brings in a new attitude to time. To arrest a moment of experience in time and give it permanence through the medium of art is their aim2. క్షణంలో కంటికి కనిపించిన మెరుపు మనస్సులో ఒక అనుభవాన్ని రేకెత్తించి మాయమైపోయిన తరవాత ప్రకృతిలో మిగిలే వెలుగునీడలనూ, వానమబ్బులనూ, ఉరుములనూ తన స్మృతులకు అవలంబనాలుగా తీసుకుని తన అనుభూతిని శ్రీశ్రీ చిత్రించాడు. ఈ అనుభూతి అస్పష్టంగా ఉంటుందికనుక చిత్రణ కూడా అస్పష్టంగానే ఉంది.

ఒక క్షణంలో మనస్సులో ఏ స్మృతి కలిగిందో పోల్చుకోలేనంత వేగంగా ధగధగలాడుతూ మెరుపు మెరసింది. ఆ స్మృతి తటిన్మణి – మణీఘృణి. ఆ స్మృతి మరపుల మడతల్లో పడిపోవడానికి క్షణకాలమే పట్టింది. ఆ జ్ఞాపకం మెరుపు ఎలా ఆకుల్లో చీకటిలో ఇరుల ఇరుకుల్లో చినుకుల్లో పరుగెత్తి మాయమవుతుందో అలా మాయమైంది. కాని ఒకక్షణంలో మళ్ళీ ఆ జ్ఞాపకం వచ్చింది. వర్షర్తువాతావరణంలో మేఘచ్ఛన్నమైన చందమామవంటి పూర్వసఖుని ముఖం నవ్వులతో రంగులపువ్వులతో కలకలమని కళలు కురిసి హర్షంతో ఆశావర్షంతో కనుల వెనుక తెరముందర కనిపించింది. కానీ మరుక్షణమే అది విడివడి మరేడకో వడివడి మరేడకో పోయింది. కనిపించే మెరుపు మాయమైపోగానే ఒకక్షణంలో సకలజగమూ సరభసగమనంతో పరుగెత్తినట్లయింది. ఆ పిమ్మట మరోక్షణం నిశ్శబ్దం అలముకుంది. దీనితో కంటికి కనిపించిన

---

1 చూ. కళారవి ఖండిక సమీక్ష.

2 Critics and criticism 179 P.

మెరుపువల్ల మనస్సులో కలిగిన స్మృతులు అదృశ్యమైపోయాయి. తరువాతిక్షణంలో చెవికి వినిపించిన ఉరుమువల్ల కూడా కొన్నిస్మృతులు వచ్చాయి. గుండెల కొండలలో హుటాహుటి పరుగెత్తే యుగాల రథనాదం మారుమ్రోగడమే ఆ స్మృతి! క్షణస్మృతిని యుగస్మృతిగా మార్చుకున్నాడు శ్రీశ్రీ.

నయనేంద్రియానుభూతినీ శ్రవణేంద్రియానుభూతినీ మేళవించుకోవడం శ్రీశ్రీ కవిత్వంలో పెక్కు పదచిత్రాలలో కనిపిస్తుంది. వినబడలేదా మరోప్రపంచపు జలపాతం – వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె పెళపెళపెళపెళ విరుచుకుపడండి – మరోప్రపంచపు కంచునగారా విరామ మెరుగక మ్రోగింది – యముని మహిషపు లోహఘంటలు మబ్బుచాటున ఖణేల్మన్నాయి – ఇంద్రదేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది – నందికేశుడు రంకెవేస్తూ గంగడోలును కదిపి గంతేడు – ఆదిసూకర వేదవేద్యుడు ఘుర్ఘురిస్తూ కోరసాచాడు – రాబందుల రెక్కల చప్పుడు– పొగగొట్టపు భూంకారధ్వని – ఖడ్గమృగోదగ్రవిరావం – పయోధరప్రచండ ఘోషం – వ్యథార్త జీవిత యథార్థదృశ్యం పునాదిగా జనించబోయే భావివేదముల జీవనాదములు – నిటాలాక్షీ పటాలుమని ప్రపంచాన్ని భయపెట్టింది మొదలైనవి.

## శ్రీశ్రీ స్మృతిచిత్రాలు

ఇంప్రెషనిజం స్మృతిచిత్రాలకు ప్రాధాన్యం ఇస్తుంది. 'గుండెలకొండలలో మ్రోగే మార్మ్రోగే యుగాలరథనాదం' స్మృతిచిత్రమే! కనుల వెనుక తెరముందర కనిపించే పూర్వపు సఖుని ముఖం స్మృతిచిత్రమే. అసలువస్తువును కాక ఆ వస్తువుపై పడే వెలుగునీడలను చిత్రించారు ఇంప్రెషనిస్టు చిత్రకారులు. శ్రీశ్రీకూడా అగ్నికిరీటపు ధగధగలు, ఎర్రబావుటా నిగనిగలు, హోమజ్వాలల భుగభుగలు కనబడలేదా అని ప్రశ్నించడం ఇలాంటి స్మృతివాదమే. ఎండకాలం మండినప్పుడు గబ్బిలంవలె క్రాగిపోలేదా! వానకాలం ముసిరిరాగా నిలువునిలువున నీరుకాలేదా? శీతకాలం కోతపెట్టగ కొరడుకట్టీ ఆకలేసీ కేకలేశావే? అనే ప్రశ్నలు శ్రామికుని గుండెల కొండలలో మారుమ్రోగిన యుగాలరథనాదాలే. ఏవేవో ఘోషలు వినబడుతున్నాయనీ గుండెలు విడిపోతున్నాయనీ ఎవరెవరో తలవిరబోసుకు నగ్నంగా నర్తిస్తున్నారనీ భయోద్విగ్నంగా వర్తిస్తున్నారనీ చెప్పడం స్మృతివాదమే. అవతారంలోని పురాణగాథ అంతా శ్రీశ్రీ స్మృతిగానే భూతార్థకంలో సాగుతుంది. గదిలోపల చినుకులవలె చీకట్లు – గదిలోపల ఏవేవో ఆవిరులు – సూర్యునిలో సూదులతో క్రీడలాడు నీడలు – సెలయేళ్ళను లేళ్ళను లాలిస్తూ– పాతాళానికి పట్టికొట్టే వైతరణీనదిలోతులు చూస్తూ – గాలులై తరగలై తావులై పుష్పాళ్ళ కుంకుమల్ పొగలై సాగిరి – సింహాచలం కదిలింది హిమాచలం కరిగింది వింధ్యాచలం పగిలింది– గిరిశిఖరాల్ గిరగిరగిరతిరుగుతున్నాయి – ఎగిరి పడుతున్నవి ఎనభైలక్షలమేరువులు వంటివన్నీ శ్రీశ్రీ ఇంప్రెషనిజం ప్రభావంతో తయారుచేసిన భావచిత్రాలే! తెలుగులో తొలి ఇంప్రెషనిస్టు

కవి శ్రీశ్రీయే! సింబాలిస్టు, ఇమేజిస్టు, స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్ రచయితలనందరినీ ఇంప్రెషనిస్టులు గానే పరిగణించారు విమర్శకులు. రేంబో, వెర్లాన్, మల్లార్మే, వేలరీ, హాప్కిన్స్, ఇలియట్, జేమ్సు జాయిస్, వర్జీనియావుల్ఫ్‌లు ఇందుకు ప్రతినిధులు. 'Their method is to present through vivid peripheral details of immediate impression of experience derived from the senses without analysis or synthesis, the impression as it is seen or felt subjectively in a single fleeting movement. They donot wish to explain the essential central thought or to organize all the details explicitly into a conventional formal relationship to the central idea.'[3]

ఇంప్రెషనిస్టు కవి ఒకదృశ్యాన్ని ఇంద్రియాలతో అనుభవించి తనకు కలిగిన మానసికానుభవాన్ని వివరాలతో విశ్లేషణలతో నిమిత్తంలేకుండా స్మృతిచిత్రాలతో సూచిస్తాడు. శ్రీశ్రీ ఇలాంటి స్మృతివాదాన్ని శుద్ధ కళావాదంగా గుర్తించి దాన్ని సామాజికకళకు సాధనంగా పరివర్తించుకున్నాడు.

## శ్రీశ్రీ పాదపౌనఃపున్య శిల్పం

శ్రీశ్రీ తన గీతాలలో ఏదైనా ఒక పాదాన్ని తిరిగితిరిగి ప్రయోగించడం ద్వారా పాఠకుడి మనస్సులో ప్రతిధ్వనులు సృష్టిస్తాడు. ఒక క్షణంలో అనే పాదం 6 మార్లు పునః పునః ప్రయుక్తమయింది.

మరోప్రపంచం - పదండి ముందుకు - నేనుసైతం - కావాలోయ్ నవకవనానికి - కవితా ఓ కవితా - శాటసారికి ఎంతకష్టం - వేశ్రివాడా కుఠ్రవాడా - ఔను నిజం నీవన్నది - ఆ సాయంత్రం-నీలోనే నీవేదో ఆలపించుతావ్ - నే నొంటరినై నిద్రకు వెలియై - నాగదిలోపల చీకటిలో-చీకటిలోపల నాగదిలో-బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టు నన్ను - చూడుచూడు నీడలు! నీడలు! పొగమేడలు - గంటలు! గంటలు! - ఆనందం అర్ణవమైతే - అనురాగం అంబరమైతే - ప్రపంచమును పరిహసిస్తాం భవిష్యమును పరిపాలిస్తాం - కవీ నీపాటల్ - నరజాతి చరిత్ర సమస్తం - మాయంటావా అంతా మిథ్యంటావా - నిజంగానే నిజంగానే - రష్యారష్యా- పతితులార భ్రష్టులార బాధాసర్పదష్టులార - ఏడవకం డేడవకండి - వస్తున్నాయొస్తున్నాయి - రారండో రండో రండి - రథచక్రాల్ రథచక్రాల్ - తలవంచుకువెళిపోయావా నేస్తం వంటివి ఆయాగీతాల్లో ఒకటికన్నా ఎక్కువమార్లే ప్రయుక్తమయ్యాయి.

---

3 The Reader's Companion to World Literature 267 P.

### శ్రీశ్రీ ఏకవిభక్త్యంతప్రయోగం

వేగాన్నీ లయనూ సాధించేందుకు శ్రీశ్రీ ఏకవిభక్త్యంతాలను తోరణాలుగా వాడు తుంటాడు. ఆకులలో చీకటిలో ఇరులలో ఇరుకులలో ఏడనో మరపులలో మరపుల మడతలలో- ఇదంతా షష్ఠీవిభక్తితోనే సాగింది. నవ్వులతో రంగుల పువ్వులతో కలకలమని కళలు కురిసి హర్షంతో ఆశావర్షంతో - ఇదంతా తృతీయావిభక్తి.

భూతాన్ని యజ్ఞోపవీతాన్ని వైప్లవ్యగీతాన్ని - లోకాలు భవభూతిశ్లోకాలు పరమేష్ఠి జూకాలు - గిరులు సాగరులు కంకేళికామంజరులు ఝరులు - చంద్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు - క్రొన్నెత్తురు, విపంచికలు, యువయోధులు-సిందూరం రక్తచందనం బంధూకం సంధ్యారాగం - పయోధరప్రచండఘోషం ఖడ్గమృగోదగ్రవిరావం ఝంఝానిలషడ్జధ్వానం - కదిలేదీ కదిలించేదీ మారేదీ మార్పించేదీ పాడేదీ పాడించేదీ - కష్టాల్ నష్టాల్ కోపాల్ తాపాల్ శాపాల్ - కుక్కపిల్లా అగ్గిపుల్లా సబ్బుబిళ్లా - తలుపుగొళ్లెం హారతిపళ్లెం గుర్రపుకళ్లెం - ఘర్మ ఘర్మజలానికి ధర్మజలానికి ఘర్మజలానికి - గనిలో వనిలో కార్ఖానాలో - విలాపాగ్నులకు విషాదాశ్రులకు - కూటికోసం కూలికోసం - గరిక పచ్చమైదానాల్లోనూ తామరపూవుల కోనే రులలో పంటచేలలో బొమ్మరిళ్ళలో-ఉత్తరమందూ దక్షిణమందూ ఉదయమునందూ ప్రదోష మందూ - వెన్నెలలోనూ చీకటిలోనూ మండుటెండలో జడిలో చలిలో - అజ్ఞానపు టంధ యుగంలో ఆకలిలో ఆవేశంలో - మానవుడా మానవుడా రసైకజీవీ కవీ నటుడా శిల్పా చార్యా గానకళాకోవిదుడా వేదాంతీ విజ్ఞానధనీ భావధునీ దుఃఖమయా దయాళూ పరదుఃఖా సహనశీలీ ! - మొదలైనవెన్నో ఇందుకు ఉదాహరణలుగా చూపవచ్చు.

### శ్రీశ్రీ లయప్రాసవైవిధ్యం

లయప్రాసల వైవిధ్యంతో ఛందస్సులో అవలంబించిన స్వాతంత్ర్యం రాణించింది 'ఒక క్షణంలో' ఖండికలో ! "ఒక క్షణంలో/మానస్సులో ఎదో స్మృతి/తటిన్మణి/మణీఘృణి/ఎదో మతి వికాసించి" అన్నప్పుడు నడకలోని వైచిత్రి ఇకారస్వరంవల్ల కలుగుతోంది. "క్షణంలో/అదేపరుగు/మరేడకో/ఆకులలో చీకటిలో/ఇరుల ఇరుకులలో/చినుకులలో/ఏడనో మరపులలో/మరపుల మడతలలో/కనబడక" అన్నప్పుడు ఏకవిభక్త్యంతాల విన్యాసం లయకు ప్రధాన మయింది. "ఒక క్షణంలో/పూర్వపు సఖుని ముఖం/నవ్వులతో/రంగుల పువ్వులతో/కలకల మని కళలు కురిసి/హర్షంతో/ఆశావర్షంతో/కనులవెనుక తెరముందర/కనిపించి" అన్నప్పుడు అంతఃప్రాసలవల్ల లయ లభించింది. "మరుక్షణం/విడివడి మరేడకో/వడివడి మరేడకో" అన్న

ప్పుడు పాదపాగ్రిస వల్ల లయ లభించింది. "ఒకక్షణంలో/సకలజగం/సరభసగమనంతో......"
అన్నప్పుడు పదాదియతి (Alliteration) వల్ల, అకార బాహుళ్యం వల్ల లయ ఏర్పడింది.

శ్రీశ్రీ గీతమేదీ నియమాలనుంచి పారిపోదు; కొత్తనియమాలను పెట్టుకుంటుంది. 'No verse is free for the man who wants to do a good Job'.[4]

గణబద్ధతను శ్రీశ్రీ ఎన్నడూ వదలడు; కానీ గణశృంఖలాలను వదిలివేశాడు. లయబద్ధత నభిమానించాడు. 'there is never any escape from metre in poetry but only mastery of it.'[5]

తటిన్మణి–మణీఘృణి–క్షణంలో–విడివడిమ రేడకో - వడివడిమ రేడకో - సరభసగమనంతో యుగాలరథనాదం వంటిపాదాలు పంచమాత్రగణాలతో నడిస్తే మధ్యమధ్య అదేపరుగు–మ రేడకో –ఆకులలో చీకటిలో - నవ్వులతో - కలకలమని కళలు కురిసి - హర్షంతో - కనులవెనుక తెరముందర వంటిపాదాలు షణ్మాత్రాగణాలతో నడుస్తాయి. (చూ. బాటసారి సమీక్షలో లయ విన్యాసం)

సత్యాన్ని

ఉజ్జ్వలంగా చూపించడంలోనే

ఉపదేశం ఉంది!

—శ్రీశ్రీ.

సమాజవిపంచి అపశ్రుతులు

1935 కవితలు

పరాజితులు ఆః ఉన్మాది

## తొణికిన స్వప్నం! తొలగిన స్వర్గం!

1935 జనవరి 27

భౌతికవాదాన్ని అంగీకరించని కవి తన వ్యక్తిగతనైరాశ్యాలకీ ప్రణయవైఫల్యాలకీ సామాజిక కారణాలున్నాయని అంగీకరించడు. తన దుఃఖాలకూ పరాజయాలకూ తనపాపమో విధివిలాసమో కారణం అని భావిస్తాడు. భగవదైక్యమే జీవితానికి చరమలక్ష్యంగా తలుస్తాడు. 'ఆ పరాత్పర దివ్యపాదారవిందసేవకం బెను నా కన్యచింతలేదు! ఆ సనాతను గానమ్ముఁ జేసికొనుచుఁ బాపుకొనెద మదీయజీవన భరమ్ము' అనీ "ఏ విధాన సౌందర్యరసైకజీవి నిలువనేరుతు నిట నొక్కనిముసమేని; మామకీన జీవిత శుష్కమార్గముల త్వదీయపాదమంజీరముల్ మ్రోయకున్న? ఆటతో పాటతో నేర్పినట్లు దేవ! ఏనుకూడ నీవలె నటియింపనిమ్ము! ఎడతెగనియాత్ర నెట్లొ సాగించువాడను, ఎట్లొ నీ దర్శనము సాధించువాడను!" అనీ గానంచేసిన కవులిద్దరూ (శ్రీరంగం శ్రీనివాసరావు, కృష్ణశాస్త్రి) ఈ ప్రపంచంతో విసుగెత్తినవారే! ఈ లోకంలో వీరు పరాజితులే! ఇలాంటి పరాజయం కవిత్వంలో పలాయనవాదానికి కూడా ప్రాతిపదిక అవుతూ ఉంటుంది. పలాయనం ఎక్కడికి? అందమైన ఊహాలోకాల్లోకి - స్వప్న ప్రపంచాల్లోకి! 'పగడాల చిగురాకు తెరచాటు తేటినై పరువంపు విరిచేడి చిన్నారి సిగ్గునై ఈ యడవి దాగిపోనా? ఎట్లైన నిచటనే యాగిపోనా?' "తెలిమబ్బు తెరచాటు చెలిచందమామ జతఁగూడి దోబూచి సరసాలనాడి దిగిరాను దిగిరాను దివినుండి భువికి"(కృశా) "ఈదుకొనిపోతి మామకహృదయకుహర జనిత భావనాకాధిరోహణమొనర్చి కంధరతరంగ నివహసంకలిత మహిత గగనసాగర గంభీర గర్భమందు" (శ్రీశ్రీ) వంటిపద్యాలలో కవులు వాస్తవవిరుద్ధంగా ఎలాంటి కాల్పనికలోకాలను - స్వర్గాలను - సృష్టించుకోగలరో అర్థమవుతుంది. ఈ ఉదాహరణలవల్ల కవుల ఊహాలలో రెండు విధాలైన మరో ప్రపంచాలున్నాయనీ అవి మొదటిది పరలోకం; రెండవది భావలోకం అనీ తేలుతోంది. ఈ రెండింటికన్నా భిన్నమైన మరోప్రపంచాన్ని శ్రీశ్రీ భావించాడు. అది వర్గరహితస్వర్గం! అది ఈ ప్రపంచంలోనే భవిష్యత్తులో ఏర్పడుతుంది. ఈసామాజిక వ్యవస్థలోని పరాజితులు ఆ మరో ప్రపంచంలో విజేతలు అవుతారు. ఇప్పటి విజేతలైన ధనికవర్గంవారు పరాజితులై అందరితో సమానులవుతారు. మొదటి మరో ప్రపంచం మతంవల్ల, రెండవ మరో ప్రపంచం రొమాంటిసిజంవల్ల, మూడవ మరోప్రపంచం మార్క్సిజంవల్ల రూపొందాయి. మూడవ మరో ప్రపంచం వాస్తవం! మొదటి రెండూ భ్రమలు! శ్రీశ్రీ స్వర్గం మూడో మరోప్రపంచమే! నాదొక స్వర్గం

అనుకోవడం ఆ అర్థంలోనే. స్వర్గానికి నిచ్చెనవేస్తాం, కార్మికస్వర్గాన్ని కలగనడం, ఈ స్వర్గం ఋజువవుతుంది వంటిప్రయోగాలు ఆ అర్థంలోనే. ఈ స్వర్గమే శ్రీశ్రీ స్వప్నం. ఇది నిజమయ్యే స్వప్నం. భావకవుల స్వప్నంవలె అబద్ధంకాదు.

## కృష్ణశాస్త్రి : శ్రీశ్రీ

కృష్ణశాస్త్రి మరోప్రపంచం మొదట కాల్పనికజగత్తే అయినా తరువాత ఆధ్యాత్మికజగత్తు లోకే ఆయన పయనంచేశారు. పరమేశ్వరసాక్షాత్కారాన్నే జీవితపరమావధిగా భావించారు. శివశంకర శాస్త్రిగారు కృష్ణపక్షానికి పీఠికరాస్తూ అన్నమాటలు చూడండి – "స్వతంత్రబుద్ధితో లోకములో సంచరించి దుఃఖములపాలై ప్రేమవలనను సంపూర్ణ శాంతి పొందలేని మనుష్యులకు ఒక్కటేశరణము. అది ఈశ్వరారాధన. దుఃఖితాత్ములు ఆత్మనిరసనము చేసుకొని భక్తిపరాయణులయి భగవానుని యనుగ్రహముచే పవిత్రులగుదురు. అట్టిచాయలు ఈ కావ్యసందోహములో అచ్చటచ్చట పొడకట్టుచున్నవి". శ్రీశ్రీ మరోప్రపంచం కాల్పనికజగత్తూకాదు; ఆధ్యాత్మిక జగత్తూకాదు. పరమేశ్వరసాక్షాత్కారానికి బదులు కవితావిశ్వరూపసాక్షాత్కారాన్నే పరమావధిగా భావించాడు. అదీగాక సకలకష్టాలకు మూలకారణమైన వర్గసమాజవ్యవస్థనుంచి మానవజాతికి విముక్తిని కోరాడు. అందువల్ల శ్రీశ్రీ మరోప్రపంచం కేవలభౌతికప్రపంచమే. మహాప్రస్థానానికి పీఠికరాస్తూ చెలంగారన్నమాటలు చూడండి; "తనకీ ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవి చేసే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వమంటాడుచెలం. అందువల్లనే దిక్కుల్నీ, దేవుల్నీ, అధికారుల్నీ వూగించి ప్రశ్నించే శ్రీశ్రీ పద్యాలు అంతఅభిమానం చెలానికి. నెత్తురూ కన్నీళ్ళూ తడిపి కొత్త Tonic తయారుచేశాడు శ్రీశ్రీ ఈ వృద్ధప్రపంచానికి." శ్రీశ్రీకి కావలసింది వ్యక్తిసౌఖ్యమూ కాదు; భగవంతుడి దయా కాదు; మానవసమాజశ్రేయస్సు మాత్రమే!

## శ్రీశ్రీ దృష్టిలో పరాజితులు-విజేతలు

మానవసమాజంలో కొందరు విజేతలూ కొందరు పరాజితులూ ఉండకూడదనేదే శ్రీశ్రీ ఆశయం. ఒకప్పుడు బలవంతులు దుర్బలజాతిని బానిసలను కావించారు. చల్లారిన సంసారాలూ మరణించిన జనసందోహం, అసహాయుల హాహాకారం చరిత్రలో మూలిగాయి. జెంఘిజ్ ఖాన్, తామర్లేన్, నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ వంటి హంతకులు విజేతలయ్యారు. వైకింగులు, శ్వేతహూణులూ సిథియన్లూ పారశీకులూ పిండారులూ థగ్గులూ కాలానికి కత్తులవంతెన కట్టినా విజేతలమే అనిపించుకున్నారు. వైషమ్యం, స్వార్థపరత్వం, కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు, మోసం, దౌర్జన్యం, పన్నాగం వంటివి విజయాలకు కారణాలయ్యాయి. పీడితులు పరాజితులయ్యారు. పీడకులు విజేతలయ్యారు. ఉత్పత్తిసాధనాలను తమ గుప్పిట్లో ఉంచుకుని శ్రమశక్తినిదోచుకునే పెట్టుబడిదారులు విజేతలయ్యారు. తమ శ్రమశక్తిని దోచుకుని తమకు భౌతికసుఖాలు లేకుండా

చేసి, సుఖపడే పెదకళత్రులమీద తిరగబడలేక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నవారంతా పరాజితులే అయ్యారు. ఇటువంటి పరాజితులను శ్రీశ్రీ సమాజంలో ఎందరినో చూశాడు. మహాప్రస్థాన కావ్యమంతా వారిగాథే. చీనాలో రిక్షావాలా, చెక్ దేశపు గనిపనిమనిషీ, ఐర్లాండున ఓడ కళాసీ, హాటెన్‌టాట్, జూలూ, నీగ్రో జాతులూ పరాజితులుగానే శ్రీశ్రీకి కనిపించారు. తిండికి లేకపోవడంవల్ల త్రాగుడుకు అలవాటుపడి కాలువనీళ్ళలో జారిపడే త్రాగుబోతు, కడుపుదహిం చుకుపోవడంవల్ల పడుపువృత్తికి దిగిన యువతి, రాజద్రోహం చేశాడని ఉరితీయబడిన విప్లవకా రుడు, సామాజికదురన్యాయాలకు గురిఅయి పిచ్చివాడైన యువకుడు, కుటుంబాలను పోషించుకో లేని ధరవరలకు జడిసి, హక్కులకోసం సమ్మెచేసే కూలీలు, తనబలాన్ని ధరిత్రికి బలిచేసి పం టలుపండించినా కడుపునిండని కర్షకుడు, యంత్రాలను నడుపుతూ యజమాని సంపదలను పెంచి దుఃఖాలకు మాత్రం గురిఅయ్యే కార్మికుడు, అపరాధం చేయకుండానే చెరసాలల్లో చిక్కే సామా న్యుడూ, కర్మాగారాల్లో అపాయాలకు లోనైనా పరిహారంపొందలేని పనివాళ్ళూ, బ్రతకడమే బరువై ఆత్మహత్యలకు సిద్ధమయ్యే సంసారులూ కూటికోసం కూలికోసం పట్నానికి బయలుదేరి క్షుద్బాధతో దారిలో చనిపోయే బాటసారీ, దారిపక్క చెట్టుకింద ఆకలితో చలితో కళ్ళుమూసే బిచ్చగాళ్ళూ, పరపీడనలో బానిసలుగా మారిపోయిన పౌరులూ, నగరజీవితంలో పెట్టబడివారుల ఆకర్షణలకు లొంగిపోయిన విద్యార్థులూ ఉద్యోగులూ అప్పులవాళ్ళవడ్డీలను తట్టుకోలేని సంసా రులూ పొద్దుపొడిచి పొద్దుగడిచేదాకా ఎద్దుల్లా పనిచేయడమేకానీ చదువుకునేందుకు అవకాశాలు లేని శ్రామికులూ హక్కులకోసమని ప్రశ్నిస్తే యజమాని దౌర్జన్యానికి గురిఅయ్యే పనివాళ్ళూ పతితులూ భ్రష్టులూ ప్రాపంచిక బాధాసర్పాల కాట్లు తిన్నవారూ ఎందుకూ పనికిరాడని భార్య చేత విడిచిపెట్టబడిన మగవాడూ, ఆచారవిరుద్ధంగా ప్రవర్తించాడని సమాజంచేత బహిష్కరింప బడిన సాహసికుడూ, ఊరవతల నీరింకిన చెరువుపక్క చెట్టునీడ చీకట్లో నివసించే అనాథులూ, ఎండలో వానలో చలిలో బాధలు పడుతున్న దిక్కులేని దీనులూ శ్రీశ్రీ దృష్టిలో ఉన్నఅసంఖ్యాక పరాజితులు.

పరాజితులైనవారంతా కలిసి విప్లవశంఖం పూరించడమే సామ్యవాద విప్లవం. ఈవిప్లవం సామాజికమైన న్యాయాలను అందరికీ సమానంగా అందజేస్తుందని శ్రీశ్రీ ఆశయం. స్వప్నాల కోసం, స్వర్గాలకోసం నిరీక్షించి అలసిపోయినవారు చూడగల్గినవి తొణికిన స్వప్నం, తొలగిన స్వర్గం మాత్రమే నిరీక్షించడంకాక నిర్మించుకోవడమే భౌతికవాదానికి గమ్యం. శత్రువుల నెదుర్కోలేక చెదిరిపోయినవారిని అవతలా శత్రువులే చుట్టుకుంటారు. చెదిరిపోవడం కాదు కర్తవ్యం; ఐక్యం కావడమే ముఖ్యం! జీవితసమస్యలను తట్టుకోలేక విసిగిపోయినవారిని దుర్గతి, దుర్మతి, దుర్మృతి పిలుస్తాయి. విసిగిపోయి, విరాగులు కావడం కాదు కర్తవ్యం; ధైర్యసాహసా లనే ప్రదర్శించి పోరాడాలి పీడితులు! తిరుగుబాటు చేయువలసిందని శుష్కమైన మాటలతో

చెప్పకుండా రాబోయే ఆపదలను పరాజితులకు తెల్పుతున్న నాయకుడే ఈ గీతంలో ప్రశ్నలు వేసింది సమాధానాలు చెప్పిందీకూడా! ఇలాంటి పరాజితులను ఓదార్చిన సందర్భం జగన్నాథుని రథచక్రాలు" లో ఉంది. "మీరక్తం కలగి కలగి మీనాడులు కదలికదలి మీ ప్రేవులు కనలికనలి ఏడవకండేడవకండి - మీ బాధలు నెనెరుగుదును వడలో కడుజడిలో పెనుచలిలో తెగనవసికుములు మీ బాధలు మీ గాధలు అవగాహన నాకవుతాయి' అంటాడు ఆ నాయకుడే! విగిసిన ప్రాణులను పిలిచే దుర్హతికీ దుర్గతికీ దుర్మతికీ దుర్మృతికీ ఉదాహరణగా 'సంధ్యాసమస్యలు' ఖండికలో "ఇటుచూస్తే అప్పులవాళ్ళూ అటుచూస్తే బిడ్డల ఆకలి ఉరిపోసుకు చనిపోవడమో సముద్రిమున పడిపోవడమో సమస్యగా ఘనీభవించిందొక సంసారికి" అనేది స్వీకరించవచ్చు. వెళ్ళుముదిరి కీళ్లుకదిలి బతుకంటే కోర్కె సడలి చనిపోయిన భిక్షువర్షీయసి కూడా విసిగిన ప్రాణియే! చెదరిన గుండెలకు ఉదాహరణగా బాటసారిని అతని తల్లిని గ్రహించవచ్చు. అలసిన కళ్ళకు ఉదాహరణగా చావుబ్రతుకుల సంధ్యాకాలంలోని రోగార్తుడ్నీ కడుపు దహించుకుపోయే పడుపుకత్తెనీ గ్రిహించవచ్చు. ఈ యిద్దరికీ లభించేవి తోణకిన స్వప్నం, తొలగిన స్వర్గం.

అలసిన కళ్ళనూ చెదరిన గుండెలనూ పరాజితుల రూపాలకు ప్రితీకలుగా తీసికోవడంలో ఇంప్రెషనిజంప్రభావం ఉంది. అలసిన కళ్ళు ఆ కళ్ళు గల వాడ్ని సూచిస్తాయి. తోణకిన స్వప్నం, తొలగిన స్వర్గం పరాజితుడి నిరాశకు సంకేతాలు. చెదరినగుండెలు గుండెలుచెదరిన పరాజితుడికి ప్రతీక. చెదరు అనే క్రియద్వారా భయపడి ఎగిరిపోయె పక్షులవంటి గుండెలని సూచన. విసిగిన ప్రాణులను పిలిచేవారు సమాజంలో ఎవరూలేరు. దుర్హతి హఠాత్తుగా తగిలిన దెబ్బల్నీ దుర్గతి దారిద్ర్యాన్ని దుర్మతి ఉన్మాదాన్నీ దుర్మృతి ఆత్మహత్యనీ సూచించే పదాలు.

## శ్రీశ్రీ కవితలో ప్రచ్ఛన్న వృత్తపాదాలు

ఎనిమిదవయేటనే కందపద్యరచన చేయడానికుపక్రమించిన శ్రీశ్రీ సులక్షణసారాన్ని అప్పకవీయాన్నీ చదువుకుని, ఛందస్సుల అంతస్తత్వాన్ని ఆకళించుకున్నాడు కనుక ఛందస్సంప్రదాయాలను తన అవసరాలకు తగినట్లు మార్చుకోగలిగాడు. 26 ఛందస్సులలో పదమూడు కోట్ల నలభైరెండులక్షల పదిహేడువేల ఏడువందల ఇరవైఆరు సమవృత్తాలు నిష్పన్నం అవుతాయి. ఇవిగాక ఉద్ధురమాలావృత్తాలు, స్వస్థానార్ధసమవృత్తాలు, పరస్థానార్ధసమవృత్తాలు, స్వస్థాన విషమవృత్తాలు, పరస్థాన విషమవృత్తాలు, సర్వపరస్థాన విషమవృత్తాలు, దండకాలు వంటివన్నీ శ్రీశ్రీ ఛందఃపరిజ్ఞానాన్ని సమగ్రితరం చేశాయి. శ్రీశ్రీ ఛందోవ్యుత్పత్తి పాశ్చాత్యుల ఛందస్సులను కూడా ఆకళించుకుని సులభతరంగా లయను సాధించే మార్గాన్ని కనుగొన్నది. అందువల్ల

ఛందస్సుల సర్పపరిష్వంగాన్ని వదిలించుకుని అపారమైన స్వాతంత్ర్యాన్ని సాధించుకున్నాడు. కేవలం సమవృత్తాలలో కొన్నిటిని మాత్రమే వాడుకున్న పూర్వకవులకన్నా, ముత్యాలసరం వంటి జానపదచ్ఛందస్సుని సొంతంచేసుకున్న గురజాడకన్నా రగడలలో కవిత్వం అల్లిన యక్ష గానాల ప్రజాకవులకన్నా శ్రీశ్రీ ఛందస్సులు విస్తృతమైనవి. అన్నింటి లక్షణాలను ఆకళించు కున్నందువల్లనే స్మరిస్తేపద్యం అని చెప్పుకుని అనర్గళం అనితరసాధ్యం నా మార్గం అని చాటుకోగల్గాడు.

శ్రీశ్రీ గేయాలలో ప్రచ్ఛన్నవృత్తపాదాలు వచ్చి కూర్చుంటూఉంటాయి. వృత్త పాదాల అక్షర గణాలను మాత్రాగణాలుగా విరిగేటట్లు చేసుకున్నాడు శ్రీశ్రీ. ఉదాహరణకు 12వ ఛందస్సులో నజజయ అనే గణాలుగల వృత్తాన్ని తోదకం అంటారు. ఇందులో మాత్రల సంఖ్య 16 అవుతుంది. ఈ పదహారుమాత్రల కొలత తీసుకుని అక్షరగణాలను మారిస్తే నడకలో వైచిత్రి వస్తుంది. చతురస్రగతి శ్రీశ్రీ కిష్టంకదా! అలసిన కన్నులు కాంచినదేమీ' అనే పాదం అచ్చంగా తోదకవృత్తపాదమే ! కానీ అలసిన కన్నులు కాంచునదేమిటి ? అని మారిస్తే అక్షరగణాలు నజయభ అని మారి 16 మాత్రలవుతాయి. 'తొణకిన స్వప్నం/ తొలగిన స్వర్గం' అనే రెండు పాదాలలోనూ నయనయ అనే గణాలున్నాయి. ఇది చతురస్రగతి లోనే నడుస్తుంది. ఇది కుసుమవిచిత్రం అనే వృత్తపాదమే! లాక్షణికులు అన్ని వృత్తాలకూ పేర్లు పెట్టలేదు కనుక శ్రీశ్రీ గేయపాదాలను అక్షరగణాలుగా విడదీసి ఏఛందస్సుకు చెందుతుందో చెప్పగలంకానీ వృత్తనామం చెప్పలేము. వృత్తనామాలు కూడా నిర్ణయించగల పాదాలు శ్రీశ్రీ గేయాలలో ఎక్కువగానే ఉన్నాయి. అవతల ఇవతల/ అరులై ఇరులే (నననజవ) అనే పాదాలు కమలవిలసితం (నననన గగ) అనే వృత్తానికి సన్నిహితంగా ఉన్నాయి. కమలవిలసి తంలో 14 అక్షరాలు, 16 మాత్రలు ఉంటాయి. పై రెండు పాదాల్లో మొత్తం అక్షరాలు 14, మాత్రలు 16. దుర్హతిదుర్గతి/దుర్మతిదుర్మృతి అనే రెండుపాదాలనూ ఒక పాదంగా రాస్తే భభభభ అనే గణాలుంటాయి. ఇది 'అంగరుచి' (భభభభగ) అనే వృత్తానికి సన్నిహితం.

హాసనానికి రాణివిసీవై/వ్యసనానికి బానిస నేనై

విషవాయువులై ప్రసరిస్తే/విరితేనియలై ప్రవహిస్తే

చిగురించిన తోటలలోనో/చితులుంచిన చోటులలోనో

ఈ పాదాల్లో మేఘవితానం అనే వృత్తం నడక ఉంది. స - స - స - గ అనే గణాలుగల 10వ ఛందస్సులోది మేఘవితానం.

విషమించిన మదీయఖేదం/కుసుమించిన త్వదీయమోదం

అనే పాదాల్లో స - న - ర - గ అనే గణాలుండటంవల్ల నడక మేఘవితానానికి దగ్గరదే.

వలయములై చలించినపుడే/విలయములై జ్వలించినపుడే

ఈ ద్విపాదివృత్తం 11వ చందస్సు (త్రిష్టుప్) లోని సుముఖివృత్తం నడకకి (నజజలగ) సన్నిహితంగా ఉంది. ఇందులో నజభలగ అనే గణాలున్నాయి. కానీ మాత్రలు పధ్నాలుగే.

అక్షరగణాల నింతగా మన్నించినా శ్రీశ్రీ చూపు గతివైచిత్రికే అంకితమవుతుంది.

శ్రీశ్రీ శబ్దక్రీడలు

ఒకఅచ్చుగానీ హల్లుగానీ మార్చడంవల్ల అర్థమే మారిపోయి నూతనరూపం సంతరించుకునే పదాలనూ పదబంధాలనూ వాక్యాలనూ పాదాలనూ జంటలుగా గుంపులుగా వాడటంలో శ్రీశ్రీ అభిరుచి సాటిలేనిది. ఇది శబ్దక్రీడయే అయినా భావోద్దీపనానికి పనికివచ్చేలా చేశాడు శ్రీశ్రీ.

తొణికిన స్వప్నం<br>తొలగిన స్వర్గం } మూడక్షరాలే భిన్నం.

దుర్గాతి, దుర్గతి, దుర్మతి, దుర్స్మృతి - అవతల ఇవతల - అరులై ఇరులే - బాటలు నడచీ పేటలు కడచీ - స్మరిస్తే పద్యం అరిస్తే వాద్యం - ఘూకం కేకా భేకం బాకా - హాలాలనన్నీ హాలాలదున్నీ-పరిక్లమిస్తూ పరిప్లవిస్తూ-వలయములై చలించినపుడే విలయములై జ్వలించినపుడే-కూడులేని గూడులేని పక్షులార భిక్షులార - చూర్ణమాన ఘూర్ణమాన దీర్ణమాన - నిటాలాగ్ని నిటాలార్చి నిటాలాక్షి - హింసనచణధ్వంసరచన ధ్వంసనచణ హింసరచన - వంటివి విచిత్ర వినూత్నశబ్దాలంకారాలు.

## నిప్పులు చిమ్ముకుంటూ నింగికి నేనెగిరిపోతే...

1935 ఫిబ్రవరి 2

సనాతనసంప్రదాయాలమీదా ఆచారాలమీదా కవిత్వపద్ధతులమీదా కొద్దిపాటి తిరుగుబాటు చేసి సంస్కరణం కోరినందుకే భావకవులు అవహేళనకూ ఆక్షేపణకూ గురిఅయ్యారు. అందువల్ల కలిగిన ఆవేదనలనూ బాధలనూ భావకవులు తమ కవిత్వంద్వారానే వ్యక్తంచేశారు. "హృదయవనజాతసుమమృదుమనోహరదళములదయతను ద్రుంచినారే! పెంధూళిఁ జిదిమి వెద జల్లినారే! హృదయశోణితధార నెదుగుజీవితవల్లి మొదలంటఁ దూల్చినారే! భయదాగ్ని కీలలను వ్రేల్చినారే!" అంటూ కృష్ణశాస్త్రి రాసిన "అబ్బ!" అనే చిన్నిగీతంలో కనిపించే శత్రువర్గం నవీనాశయాలతో రాజీపడని సనాతనులే! వీరు నవీనుడైన కవిమీద సాధించిన ప్రతీకారం కేవలం వ్యక్తిగతద్వేషానికి ప్రతిఫలమే! పద్మదళాన్నిత్రుంచి ధూళిలో వెదజల్లడం ఏనుగు చేసే అవివేకపుపని. తీగను విరగగొట్టి నిప్పులలో పారవేయడం అరసికులుచేసే అవివేకకృత్యం. వీరికి సౌందర్యరసజ్ఞత లేదని కవి ఎత్తిపొడుపు; ఆవేదన - ఇది కూడా వ్యక్తిగతమే! ఈ సనాతనులూ ఆధునికులూ ఒక సమాజంలో ఆర్థికంగా ఒక్క వర్గానికి చెందినవారే కాని భిన్నవర్గాల వారుకారు. కనుక ఇది వర్గసంఘర్షణ కాదు. కేవలం ఆశయాల సంఘర్షణమాత్రమే! ఇలాంటి సంఘర్షణను మరి కొందరు భావకవుల రచనలలో కూడా చూడవచ్చు. "తరతరమ్ముల ప్రేమ స్వతంత్రులరుగు దారిఁబోయెడు నూతనాధ్వగుల మనలఁ బరిహసించెడు పాడు ప్రపంచము", "వలపుతీపి యెఱుంగని వట్టి రాతిగుండె లోకమ్ము నిప్పులు గురియనిమ్ము", "మొక్కిన కొలందిఁ గాలితోఁ ద్రొక్కివేయు నీ కఠినలోక మెల్ల బహిష్కృతమ్ము" అన్నవి వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి మాటలు. బావకవులు వ్యక్తి స్వేచ్ఛకోసం తపించారే గానీ ఆ స్వేచ్ఛ సమాజంలో అందరికీ ఎప్పుడు, ఎలా లభిస్తుందో తెలుసుకోలేదు.

సమాజవ్యవస్థలో ఆర్థికప్రాతిపదిక మీద ఏర్పడిన రెండు భిన్నవర్గాలున్నాయి. డబ్బున్నవర్గంవారే రాజకీయసాంస్కృతికరంగాలలో ప్రాతినిధ్యంవహించి డబ్బులేనివర్గంవారి స్వేచ్ఛకు, సంస్కృతికి అంతరాయాలు కల్పిస్తారు. పీడితవర్గంవారు పీడకవర్గంమీద తిరుగుబాటు చేసి, మొత్తం సమాజమంతా సుఖశాంతులతో మనేటట్లు చేస్తారు. ఇదే సామ్యవాద విప్లవం. పీడితవర్గంలో సాహసవాదులు, పరాజితులు ఉన్నారు. పీడకవర్గంలో సోమరులూ వినోద

పరాయణాలూ భోగలాలసులూ ఉన్నారు. ఈ రెండు వర్గాల సంఘర్షణనూ కవిత్వంలో వస్తువుగా గ్రహించిన తొలి తెలుగు కవి శ్రీశ్రీయే!

అరసికుల ప్రవర్తన భావకవికి బాధకలిగిస్తే ధనస్వాముల ప్రవర్తన శ్రీశ్రీకి బాధ కలిగించింది. వారనే శ్రీశ్రీ మహాప్రస్థానంలో ఎగతాళి చేశాడు; ఎత్తిపొడిచాడు.

## శ్రీశ్రీ కవిత్వంలో బూర్జువాసమాజవాస్తవికత

చిత్తశుద్ధిని వదిలివేసి కేవలనటనకు ప్రాధాన్యం ఇచ్చే ధనస్వాములు కేవలం ఆస్తిపరులు మాత్రమే కారు. వారి చేతిలో ఉత్పత్తిసాధనాలూ ఉన్నాయి; సమాజాన్ని తమ ఇచ్ఛవచ్చినట్లు నడిపించేశాసనాలూ ఉన్నాయి; అసంఖ్యాకపీడితజనుల జీవితాలూఉన్నాయి. శ్రీమంతుల ఇష్టప్రకారమే సమాజం నడుస్తూంటుంది. వారు చెప్పిందే నీతి; వారి స్వార్థమే ధర్మం; వారి స్తుతియే కవిత్వం! పెట్టుబడి పెట్టగల వీరి కర్మాగారాలలో చెమటోడ్చి పనిచేసే కార్మికులు తమ ఘర్మజలాన్నే వీరికి ధారపోస్తారు. అందువల్ల వీరి పెట్టుబడి పెరిగి భోగైక జీవనం లభిస్తుంది. వీరినే మార్క్సియ పరిభాషలో బూర్జువాలు అంటారు. వీరు సమాజంలో పీడకవర్గం. వీరి దోపిడికి తమ శ్రమశక్తిని అర్పిస్తూ, తాము మాత్రం పతితులై, భ్రష్టులై, బాధాసర్పదష్టులై, కూడులేని గూడులేని పక్షులై, భిక్షులై ఉండిపోయే శ్రామికులను మార్క్సియపరిభాషలో ప్రొలిటేరియట్ అంటారు. వీరు సమాజంలో పీడితవర్గం. వీరే అద్భుతకార్యాలను సాధిస్తారు. అందమైన వస్తు సముదాయాన్ని తయారు చేస్తారు. సముద్రాలు దాటడం, ఎడారులు, పర్వతాలు గడవడం, ఆకాశాలను వెదకడం, నక్షత్రాలను శోధించడం, వంతెనలు నిర్మించడం, వైద్యశాలలు, వస్తుప్రదర్శనశాలలు, గ్రంథాగారాలు, పరిశ్రమాలయాలు, ధూమశకటాలు, నౌకలు, విమానాలు నిర్మించడం, దూరదృష్టి దూరశ్రవణశక్తులు సాధించడం వీరివల్లనే జరిగాయి; ఒక్కమాటలో మానవుడి అభ్యుదయం అంతా శ్రమశక్తి మీదనే ఆధారపడి ఉంది; కానీ ఆ శక్తి గలవాడు ధనస్వామ్యం చేతిలో కీలుబొమ్మగా ఉండటం మీదనే శ్రీశ్రీ వ్యతిరేకిస్తున్నది.

పీడితవర్గంలోని సాహసినీ పరాజితుడ్నీ శ్రీశ్రీ సమానంగా అభిమానించాడు. పరాజితుల్ని తిరిగి సాహసాలకు పరుగెత్తమనడం శ్రీశ్రీ కవితాసందేశం. ధనస్వామ్యసమాజంలోని అసంఖ్యాక పరాజితుల్ని శ్రీశ్రీ మహాప్రస్థానంలో పేర్కొనడం జరిగింది. వీరందరూ సాహసులై విప్లవశంఖం పూరిస్తారనీ అందుకే తన కవిత్వం అంకితం చేస్తున్నాననీ చెప్పుకున్నాడు శ్రీశ్రీ. మస్తిష్కకులాయంలోని లోహవిహంగాలను ఎగిరించేవాడు సాహసి. మనోవల్మీకంలోని సుప్తభుజంగాలను కదిలించేవాడు సాహసి. అంతరాళ భయంకరప్రాంతరాలలోనే సాహసి విహారం. ముళ్ళదారి

హృదయంలో దీపం పెడతాడు. మంత్రనగరి సరిహద్దులు ముడతాడు సాహసి. సతుల్ సుతుల్ హితుల్ పోయినా లెక్కచెయ్యడు. కష్టాలు, నష్టాలు, తాపాలు, కోపాలు, శాపాలు, తిట్లూ, రాట్లూ, పాట్లూ వచ్చినా లెక్కచెయ్యడు లోకంలోని అన్యాయాలనూ ఆకలినీ వేదననూ దారిద్ర్యాన్నీ దౌర్జన్యాల్నీ పరిష్కరించి బహిష్కరించడానికి కలం ఎత్తుతాడు సాహసి. శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనేలేదని భోగైకజీవనసౌందర్యాన్ని ఎదిరించగల్గుతాడు సాహసి. వాస్తవికతను ఎవరి మెప్పుకోసమూ ఏ ప్రలోభం కోసమూ మరుగుపరచడు సాహసి. అర్ధరాత్రి అవతలిగట్టుకు ప్రయాణమవుతాడు. చరిత్రయాథార్థ్యాలను బైటకీడుస్తాడు. వేదాంతాన్ని తిరస్కరిస్తాడు. భూకంపం పుట్టిస్తానంటాడు. నదీనదాలూ అడవులు కొండలు ఎడారులు మహాప్రస్థానానికి అడ్డంకులు కావంటాడు. ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులను చావండని శపిస్తాడు. చివరికి రేపు తనదే అంటాడు. నేనుసైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాననీ విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలు పోతాననీ భువనభవనపు బావుటానై పైకిలేస్తాననీ విస్మయం కలిగిస్తాడు. ఇలాంటి సాహసి చేసిన ఒకపనినే ఆః ఖండికలో శ్రీశ్రీ చెప్పాడు. నిప్పులు చిమ్ముకుంటూ నింగి కెగిరిపోయాడు ఆ సాహసి.

కాని ఈ సాహసం ఫలించకపోతే, అతడు పరాభూతుడవుతాడు- పరాజితుడవుతాడు. నెత్తురుక్రక్కుకుంటూ నేలకు రాలిపోవడమే ఆ పరాజయం. పీడితులుపొందే పరాజయా లనేకం ఉన్నాయి. అన్నింటికీ వారికి జరిగే సామాజికమైన అన్యాయమే కారణం. ఈ అన్యాయాన్ని చేస్తున్నవారు మరోవర్గంవారు. అలసిన కళ్ళు, చెదరిన గుండెలు, విసిగిన ప్రాణాలు పరాజితులవి. తొణకిన స్వప్నం, తొలగిన స్వర్గం, అరుదైన ఇరులు. దుర్గతులు, దుర్మృతులు ఆ పరాజయాల ఫలితాలు. రోగం, త్రాగుడు, పడుపువృత్తి, ఉన్మాదం, సమ్మె, ఆకలి, చీకటి, దాస్యం, శ్రమ, విలాపం, విషాదం, చెరసాల, ఆత్మహత్య, వేదన, దారిద్ర్యం, శిరోవేదన, దిగులు, జ్వరం, భయం, ప్రలాపం, పలవరింత, కష్టం, పాడుకల, భిక్షుకత్వం, వెకిలిచూపు, కూనిరాగం, సమస్య, కేక, కన్నీరు, నెత్తురు, రోదన, ఆర్తి, నిరాశ, బాధ వంటి వన్నీ పరాజయాల అనుభావాలే.

పీడితుల విజృంభణను గానీ తిరుగుబాటునుగానీ బూర్జువాలు సహించలేరు. తమకుండే సౌకర్యాలూ సౌఖ్యాలూ నశిస్తాయని సామ్యవాదాన్ని హర్షించలేరు. కర్షకుల ఘర్మజలానికి కార్మికుల విలాపాగ్నులకూ విషాదాశ్రువులకూ ఖరీదులు కట్టి తప్పుకుంటారు. భిక్షువులు అనాథులై దారి పక్క మరణిస్తే అది తమ పాపం కాదంటారు. తాము చేసిన దురన్యాయానికి పిచ్చివాడైన యువకుడ్ని చూసి తమకేమీ పట్టనట్లుగా తొలగిపోతారు. శ్రామికులు నిర్మించిన వస్తువులను స్వాధీనపరచుకుని అది దోపిడి కాదనీ శ్రామికుల కర్మం వల్ల వారి కలా జరుగుతున్న

దనీ వాదిస్తారు. రోజుకు పన్నెండు గంటలు పనిచేయించుకుంటూ అలా పనిచేయడం ఆచారం అని దబాయిస్తారు. కూలీ సరిపోక సమ్మెకడితే ఆ సమ్మెను దౌర్జన్యచర్యగా ఆరోపించి, దౌర్జన్యం చేస్తారు. ప్రపంచం వాస్తవం కాదనీ, మాయ అనీ అందువల్ల వైరాగ్యం అలవరచుకోవలసిందనీ మతం ద్వారా బోధనలు చేయిస్తూ తాము మాత్రం సుఖాలు అనుభవిస్తారు. కార్లు, మనీపర్సులు, మరఫిరంగులు, విషవాయువులు, తుపానులు, భూకంపాలు, జిరుగుబాట్లు, యుద్ధాలు, ఆఖరుకు ఈ ప్రపంచం అంతా మాయ అంటారు. తామే అదృష్టవంతులమనీ వెలుగును ప్రేమించడం, ఇరులను ద్వేషించడం తమకే చేతనవుననీ మంచిచెడ్డలను తామే విడదీయగలమనీ తమ జీవితం వడ్డించిన విస్తరివంటిదనీ తమ నిశ్చితాలు నిశ్చలమైనవనీ చెబుతారు. తాము తప్ప అంతా నేరగాళ్ళనీ, వాళ్ళను శిక్షించేందుకే న్యాయస్థానాలనూ, రక్షకభట వర్గాలనూ చెరసాలలనూ ఉరికొయ్యలనూ ఏర్పాటు చేశామనీ వాదిస్తారు. రేడియోలద్వారా అసత్యప్రచారాలు చేయిస్తారు. రాజకీయాలలో రంకువేషాలు వేస్తారు. సంఘం నుంచి కొందరిని బహిష్కరిస్తారు. పీడితులు తిరగబడితే, యుద్ధానికి సిద్ధమై ఫాసిస్టులుగా మారతారు. విష వాయువులు, మరఫిరంగులు ప్రయోగిస్తారు. హింసనచణధ్వంసరచనకు ప్లానువేస్తారు. మంచిప్రయత్నాలకు దుస్తరవిఘ్నాలు కల్పిస్తారు.

ఇటువంటి బూర్జువాలే ఒక సాహసి నిప్పులు చిమ్ముకుంటూ నింగికి ఎగిరిపోతే "నిబిడాశ్చర్యం" పొందినవారు. సాహసి అపూర్వ చైతన్యాన్ని చూసి అద్భుతానుభవాన్ని పొందడం వల్ల, ఆ శ్రామికుడి ఉన్నతశిఖరాధిరోహణం అంటే కిట్టకపోయినా తాత్కాలికంగా అతడ్ని అభినందించుతూ నటిస్తారు. కానీ అతడు నెత్తురు క్రక్కుకుంటూ నేలకు రాలిపోతేమాత్రం, అతడికి కలిగిన ఆపదను చూసి, బాధపడరు. నిర్దాక్షిణ్యంగా అతడ్ని ఆః అలాగా పడిపోయాడా! ఆః బాగాపడ్డాడు! నింగికెందుకు ఎగరడం? భూమిమీద పడి ఉండక? అని అధిక్షేపిస్తారు. ఇక్కడే సాహసి పరాజితుడయ్యేది! బూర్జువాల కర్కశహృదయతత్త్వం ఈ సంఘటనలో వెల్లడి అయింది. సాహసి విజయం, బూర్జువాలకు నిబిడాశ్చర్యకరం కాగా, సాహసి పరాజయం బూర్జువాలకు నిర్దాక్షిణ్యం కలిగించింది. ఈ నిర్దాక్షిణ్యంలో కూడా వారికి వినోదమే.

## శ్రీశ్రీ అలంకార వ్యంగ్యం

సాహసి ఆకాశానికెగరడంలోనూ నేలకురాలడంలోనూ శ్రీశ్రీ రెండు పోలికలను స్ఫురింపజేశాడు. ఈ పోలికలు వాచ్యంగా లేవు. అదే శ్రీశ్రీ అనితరసాధ్యమార్గం. నిప్పులు చిమ్ముకుంటూ నింగికెగరడం తారాజువ్వపని. నెత్తురు క్రక్కుకుంటూ నేలకు రాలడం పక్షి పని. ఈ రెండింటిలో మొదటిది స్వయంచోదిత క్రియ; కానీ రెండవదారుణం జరగడానికి పక్షి కారణం కాదు; వేటగాడు కారణం! వేటగాడు బాణం విసరకపోతే, పక్షికి గాయంకాదు.

ఉపమానాన్ని స్ఫురింపజేయడం అలంకార వ్యంగం. ఇది ఉత్తమకావ్యలక్షణం అని ధ్వని కారుడు చెప్పాడు. మహాప్రస్థానంలో మరికొన్నింటిని చూద్దాం :— కదం తొక్కుతూ (గుర్రం) - హృదంతరాళం గర్జిస్తూ (సింహం) - నోరెత్తి హోరెత్తి నోగులు సాగరను (సింహం) - గాలిలో కనరాని గజుసుదయ్యాలు భూదనమ్ముల మధ్య ఈదుతున్నాయి (తిమింగిలాలు) - ఆ గదిలోనే ఆరిపోయాడు (దీపం) - ఆ గదిలో మూలనక్కి మూలుగు తున్నది (కుక్కపిల్ల) - చమురు తాగుతూ పలుదిక్కులు చూస్తున్నది (పిల్లి) - ఇనబింబం పయనించు నింగిపై (బాటసారి) - అనురాగపుటంచులు చూస్తాం (ఆకాశం) - ఆనందపు లోతులు తీస్తాం (సముద్రం) - భవిష్యమును పరిపాలిస్తాం (రాజ్యం) - కాలానికి కళ్లెం వేస్తాం (గుర్రం) - ప్రేమానికి గొళ్లెం తీస్తాం (భవనం) - రెక్కవిప్పిన రివల్యూషన్ (పక్షి) - కడలివలపు (నాయకుడు) - ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగున పడి కాన్పించని కథలు (వస్తువులు) - ప్రపంచం మా వెంటవస్తుంది (అనుచరుడు) - స్వర్గాలు కరిగించి (బంగారం) - స్వప్నాలు పగిలించి (అద్దాలు)-పాపాలు వండించి (ఆహారం) - భావాలు మండించి (సమిధలు) - తొణికిన స్వప్నం (భాండం) - తొలగిన స్వర్గం - (భాగ్యం) - చెదరిన గుండెలు (పక్షులు) - నిటాలాక్షి పగిలింది (అద్దం) - వింధ్యాచలం పగిలింది (బాంబు) - సింహాచలం కదిలింది (రథం) - మొదలైనవి విశిష్టప్రయోగాలు.

## శ్రీశ్రీ గేయాలలో సారూప్యం

ఆః లో త్రిపాదిగీతాలు రెండున్నాయి. ఈరెండు గీతాలకు సారూప్యం ఉంది. రెండింటా పదాల సంఖ్య సమానం. ఈ రెండు గీతాలలోని పాదాల మాత్రల కొలతలూ ఒకటే! ఏ పాదమూ 10 అక్షరాలకు మించదు. 13 మాత్రలకూ మించదు. రెండు గీతాలలోనూ వాక్యాలు ఒక మాదిరివే. మొదటిపాదం 11 మాత్రలు; రెండుమూడు పాదాలు 13 మాత్రలు. A B B అనే పద్ధతి ఇది. రెండోపాదంలో మాత్రలు 4+ 5+4 గా విరిగితే, మూడోపాదంలో మాత్రలు 4+4+5 గా విరుగుతాయి. మొదటిపాదంలో 4+3+4 గా విరుగుతాయి.

(1) నిప్పులు చిమ్ముకుంటూ 11 (4+3+4)
(1) నెత్తురు క్రక్కుకుంటూ 11 (4+3+4)
(2) నింగికి నేనెగిరిపోతే 13 (4+5+4)
(2) నేలకు నే రాలిపోతే 13 (4+5+4)
(3) నిబిడాశ్చర్యంతో వీరు 13 (4+4+5)
(3) నిర్దాక్షిణ్యంగా వీరె 13 (4+4+5)

సాహసమూ పరాజయమూ శ్రామికుడికొక లాంటివే అనే భావాన్ని ఇది స్ఫురింప జేయవచ్చు.

ఇలాంటి సారూప్యం జయభేరిలోని తొలిమూడుగీతాలకు ఉంది. అవతారంలో మొదటిమూడూ తరువాతిరెండూ తరువాతిమూడూ ఒకలాగే ఉన్నాయి. బుక్కులులో మొదటిరెండూ సరూపమైనవే! పరాజితులులో మూడుగీతాలూ ఒకరూపంగలవే! నీడలులో మొదటి మూడుగీతాల స్వరూపం ఒకటే. అద్వైతంలో మొదటిరెండుగీతాల స్వరూపం సమానమే. నిజంగానే లో నాలుగుగీతాల మాత్రాప్రణాళిక ఒక్కటే.

## శ్రీశ్రీ త్రిపాదిగీతాలు

ఆః త్రిపాదిగీతం. ముత్యాలసరాన్ని ముక్కలుచేసి విషమత్రిపాదిగీతంగా రాసినవి జయభేరిలోనూ అవతారంలోనూ ఉన్నాయి. సాహసిలో ఒక త్రిపాదిగీతం ఉంది.

> అంతరాళ భయంకర
> ప్రాంతరాలనా నీ విహారం!
> ముళ్లదారినా నీ సంచారం!

పరాజితులులోవి త్రిపాదులే!

> అలసిన కన్నులు కాంచేదేమిటి?
> తోణకిన స్వప్నం!
> తొలగిన స్వర్గం!

శైశవగీతి త్రిపాదిలో ముగుస్తుంది. వచనగీతాలలో కూడా శ్రీశ్రీ ఈ త్రిపాదిసంప్రదాయం నెలకొల్పాడు.

> అలజడి మా జీవితం!
> ఆందోళన మా ఊపిరి!
> తిరుగుబాటు మా వేదాంతం!

వ్యత్యాసంలోనే ఇంకా మూడుత్రిపాదులున్నాయి. ఆశాదూతలులో చివరివచనం త్రిపాదిగా ముగిసింది. మానవుడా లోని సంబోధనలు త్రిపాదులుగా ఉంటాయి కొన్ని.

# 69/ఉన్మాది

## ...నీ ప్రపంచపు మహారణ్యపు చిక్కుదారులు !

1935

విప్రలంభశృంగారాన్నీ కరుణవిప్రలంభాన్నీ కవితాభావనకు ఆలంబనాలుగా గ్రహించిన భావకవులు కాల్పనికమైన ఉన్మాదావస్థను తమకు ఆరోపించుకున్నారు. నిరాఘాటమూ నిరంకుశమూ అయిన వ్యక్తి స్వేచ్ఛను కోరుకున్నందువల్ల కూడా భావకవులు ఆ వ్యక్తిస్వేచ్ఛను ఉన్మాదస్థితిలోనే పొందగలిగారు. "ఆకలా దాహమా చింతలా వంతలా ఈ కరణి వెర్రినైయేఁ తమ తిరుగాడ, ఈ యడవి దాగిపోనా? ఎట్లైన ఇచటనే యాగిపోనా ?" అని అడుగుతూ తాను వెర్రివాడినే అన్నాడు కవి. "నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు? నా యిచ్ఛయే గాక నాకేటి వెఱపు?" అనగల్గడం ఉన్మాదికే సాధ్యం. "నావలెనె యాతడున్మత్తభావశాలి ఆగి కోలేడు రేగునూహలనొకింత - ఇంత చిరుగీతి యెద వేగిరించునేని పాడుకొనును తాండవమాడుకొనును – ఏనెఱుంగుదు నావలెనే యతండు పాటపదములకై నిత్య పథికుడయ్యె – అమల మోహన సంగీతమందు హృదయదళనదారుణరోదనధ్వనులు విందు - వెదకివేసారి నా వెర్రిబ్రదుకెపుడేని తుదిరేయి కనుమూయునా ? - నాకుగాదులు లేవు! నాకుషస్సులు లేవు! నేను హేమంతకృష్ణానంతశర్వరిని ! – నాకు నిశ్వాసతాళవృంతాలు గలవు ! నాకు కన్నీటిసరుల దొంతరలు గలవు ! నాకమూల్య మపూర్వ మానంద మొసగు నిరుపమనితాంతదుఃఖంపు నిధులు గలవు ! ఎవ్వరని యెంతురో నన్ను! – జగమునిండ స్వేచ్ఛాగానఝురులు నింతు! మీరు మనసారగా నేడ్వనీరు నన్ను ! – అపుడు గొంతెత్తి ఏడ్చినాను ! – వెదకి వేసారి నా వెర్రిబ్రదుకెపుడేని తుదిరేయి కనుమూయునా! - ఇది మఱగియబోని ఏ యర్థ మెరుగరాని వేసటేలేని వెర్రియన్వేషణమ్ము ! – ఏను తొలుత నే గూడేని లేని పులుగురాయడ – నా విషాదమ్ములో దాగినాడ నేనె ! – ఏను మరణించుచున్నాను! – ఎవరో హా ఇపుడానను పలుకరింతురు ! - ఏను రుజనైతి జరనైతి మృత్యువైతి ! - అంత నే వెర్రినైపోదునయ్య నిన్నుబోలి పాడఁబోవుదు నిన్నుఁబోలి నాట్యమాడఁబోవుదు లజ్జఁబోనాడి" మొదలైన అనేకపంక్తులలో వాచ్యంగానూ వ్యంగ్యంగానూ భావకవి తన ఉన్మాదధోరణిని తెల్పుకున్నాడు. The lunatic the lover and the poet are of imagination all compact అనే షేక్సుపియర్ సూక్తికి లక్ష్యభూతుడు భావకవి. భావకవిది ఆత్మాశ్రయమైన ఉన్మాదభావన. భావకవిత్వం భావోన్మాదం లేనివాడు రాయనేలేడు. భావకవి, దుఃఖంతోనే ఆనందం అనుభవించగల్గాడంటే, ఉన్మాదాభి

నయం వల్లనే. వాస్తవానికి లోకంలో ఎవరూ దుఃఖంవల్ల ఆనందం పొందలేరు. ఏ అపూర్వ రమణీ సౌందర్యాన్నో కలగని, ఊహించుకుని ఆమె తనకు లభించకపోవడం వల్ల దుఃఖించడం భావకవిత్వం ఆ దుఃఖమే ఉన్మాదంగా మారుతుంది. ఈ ఉన్మాదం నిజమైనదికాదు.

## శ్రీశ్రీ కవితలో ఉన్మాదవాస్తవికత

నిజమైన ఉన్మాదానికి యథార్థమైన - భౌతికమైన సామాజికపరిస్థితులు, సామాజికదురన్యాయాలు కారణాలవుతాయి. పీడకవర్గంవారి దౌర్జన్యానికి గురిఅయి, పరాజితుడైన పీడితుడు ఉన్మాది అవుతాడు. ఈ ఉన్మాదిని చూసి, వాస్తవికతావాది అయిన శ్రీశ్రీ జాలిపడ్డాడు. అలసినకళ్ళతో తొణకినస్వప్నాన్నీ తొలగినస్వర్గాన్నీ చూడగల్గిన పరాజితుడు ఉన్మాదిగానే అవుతాడు. చెదరిన గుండెలతో మిగిలిన ఆ ఉన్మాదిని అవతలఖవిజల అరులై ఇరులే అదుముతాయి. విసిగినఉన్మాదికి దుర్వ్యాప్తి, దుర్గతి, దుర్మతి, దుర్మృతి సంభవిస్తాయి. నెత్తురుక్రక్కుకుంటూ నేలకు రాలిపోయిన శ్రామికుడు బూర్జువాల ఉపేక్షకు గురిఅయినపుడు ఉన్మాదియే అవుతాడు. సమాజంలో పెత్తనం వహించే పెద్దమనుషులు, బుద్ధిమంతులు తమపదవులకోసం, పలుకుబళ్ళకోసం, ఐశ్వర్యంకోసం కుట్రలను పన్నుతూ ఎంతనీచమైనపని అయినా చేస్తూ తమకుమాత్రం అపకీర్తిరాకుండా చూసుకుంటే వారుచేసిన దురన్యాయాలకు బలిఅయిన యువకుడు ఉన్మాది అయిపోతాడు. ఇలా ఉన్మాది కావడం ఏ ప్రతీకారం చేయలేకపోవడం వల్లనే. దేహసంస్కారాదులు లేక అలకలన్నీ అట్టకట్టి, తిండిలేక బొమికలన్నీ ప్రోవుపట్టి, కాగితం వలె పలచబారిన వెర్రివాణ్ని శ్రీశ్రీ విషమసమాజవ్యవస్థలో చూశాడు. ఆ వెర్రివాడు వీధికంతా వెక్కిరింతగా ఊరికంతా దిష్టిబొమ్మగా ఉన్నాడంటే అతణ్ని వెక్కిరిస్తున్నవారు ఆ ఊళ్ళోవారే. అందుకు కారణం అతడి వికృతాకారం; చినిగినబట్టలు. తూముప్రక్కన ధూళిలో తూలుతున్నాడంటే అతనికి ఉచితానుచితజ్ఞానం లోపించిందన్నమాట. అతడు చూసేది వెకిలిచూపు; తీసేది కూనిరాగం. ఆ రెండింటినీ ఉన్మాదంయొక్క బాహ్యచేష్టలుగా కవి గుర్తించాడు కనుకనే, 'కవితా ఓ కవితా' గీతంలో 'ఉన్మాది మనస్సినీవాలిలో ఘూకంకేకా భేకంబాకా' విన్నాననీ, 'పరాజితులు' గీతంలో అలసినకన్నులు తొణకిన స్వప్నాన్నీ తొలగిన స్వర్గాన్నీ చూస్తాయనీ చెప్పాడు. ఉన్మాది వెకిలిచూపు, కూనిరాగం ఉన్మాదికి తప్ప మరెవరికీ తెలియని ఉన్మాదప్రపంచపు మహారణ్యపు చిక్కుదారులు!

సమాజంలో పెత్తనం చెలాయించేవారిని పెద్దమనుషులుగా బుద్ధిమంతులుగా శ్రీశ్రీ పేర్కొన్నాడంటే వారిని అవహేళనచేసే దృష్టితోనే. వెర్రివాడా! కుర్రవాడా! నిన్నుచూసీ చూడనట్లే తెలివిమీరిన పెద్దమనుషులు తొలగిపోతారు! అనీ వెర్రివాడా కుర్రవాడా క్షమిస్తావా సహిస్తావా బుద్ధిమంతులు నీకుచేసిన దురన్యాయాన్ని? అనీ ఉన్మాదిని పలకరించి ప్రశ్నించడంలో

ఉన్మాదిపూర్వకథని పరామర్శించి, ప్రస్తుతకర్తవ్యాన్ని రేకెత్తించాడు కవి. యువకుడికి దుర న్యాయంచేసినవారు బుద్ధిమంతులెలా అవుతారు? చూసీచూడనట్లే తొలగిపోయేవారు పెద్దమనుషులెలా అవుతారు? వీరిని క్షమించకూడదనీ, సహించకూడదనీ వీరిమీద తిరగబడాలనీ కవి ఉద్దేశం!

ఇటువంటి పెద్దమనుషులనే శ్రీశ్రీ ఎముకలుక్రుళ్ళిన వయస్సుమళ్ళిన సోమరులన్నాడు. వీరు చావనిదే మరోప్రపంచం రాదు. ఇటువంటివారే "ఇది నా పాపం కాదు" అనే తీరుగా మాటాడి తప్పించుకుంటారు. ఎదురుగా ముసల్ది చనిపోయినా ఎముకముక్క కొరుక్కుంటూ ఏమీ అనని కుక్కలూ ఒక ఈగను పడవేసుకు తొందరగా తొలగే తొండలూ ఈ పెద్దమనుషులకు ప్రతీకలే. వెనుకదగా ముందుదగా కుడియెడమల దగాదగా కావడానికి కారణం వీరి చేష్టలే. భూదివమ్ముల మధ్య ఈదులాడే గడుసుదయ్యాలు వీరే. విపంచికకు తీగసు తెంపి, ఇంట్లో దీపం ఆర్పి అపస్వరాలనూ చీకట్లనూ సృష్టించేది వీరే. చెదరిన గుండెలనదిమే అరులు వీరే. నెత్తురు కక్కుకుంటూ నేలకు రాలిపోయిన వ్యక్తిని చూసి, నిర్దాక్షిణ్యంగా తొలగిపోయేవారు వీరే. దరిద్రులను కాల్చుకు తినడం వీరిప్రవృత్తి. వైషమ్యం, స్వార్థపరత్వం, కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్ధలు, మాయలు వీరి గుణాలు. వీరిలో ఒకొక్కడూ మహాహంతకుడు. కాలానికి కత్తులవంతెన నిర్మిస్తారు వీరే. సమాజంలోని బలవంతులు, ధనవంతులు వీరు. అన్యాయాన్ని గురించి ప్రశ్నిస్తే కర్మానుభవం తప్పదనీ ఘోరాలను గురించి ప్రశ్నిస్తే ఆచారం తప్పరాదనీ సహాయంకోరితే దౌర్జన్యం చేస్తున్నావనీ చెబుతారు వీరు. న్యాయస్థానాలు, రక్షకభటవర్గాలు, చెరసాలలు, ఉరికొయ్యలు వీరి చెప్పినట్లు వింటాయి.

## శ్రీశ్రీ సామాజిక దృశ్యచిత్రాలు

సమాజవాస్తవికతను దృశ్యచిత్రాల్లో చూపించడం శ్రీశ్రీ కవితాశిల్పంలో పతాకప్రాయమైనది. ఈ బొమ్మలు ఛాయాచిత్రాలవలె భాసిస్తాయి. ఉన్మాదినీ అతనిచుట్టూఉన్న వాతావరణాన్నీ మాటబొమ్మలలో గీశాడు శ్రీశ్రీ :- తూముపక్కనధూళిలో తూలేకుర్రవాడు – చూసీచూడనట్లు తొలగిపోయే పెద్దమనుషులు – వెకిలిచూపుచూసే కూనిరాగంతీసే వెర్రివాడు-అట్టకట్టిన అలకలతో ప్రోవుపట్టిన బొమికలతో కాగితంలా పలచబారిన కుర్రవాడు – వీధికంతా వెక్కిరింత – ఊరికంతా దిష్టిబొమ్మ మొదలయినవి.

"వ్యథార్తజీవితయథార్థదృశ్యాలు" భావివేదాల జీవనాదాలకు పునాదులన్న శ్రీశ్రీ, పీడక సమాజంలోని పీడితజనజీవనదృశ్యాలను హృదయవిదారకంగా చిత్రించాడు. కొన్ని ఉదాహర

ణలు చూడండి :— ఎండకాలం మండినప్పుడు గబ్బిలంవలె క్రాగిపోవడం - వానకాలం ముసిరి రాగా నిలువునిలువున నీరుకావడం - శీతకాలం కోతపెట్టగ కొరడుకట్టీ ఆకలేసీ కేకలేయడం - కాలువనీళులలోజారిపడి కదలగనైనాచాలని త్రాగుబోతు-కడుపుదహించుకుపోయే పడుపుకత్తెకు రాక్షసరతి - ఉరితీయబడ్డ శిరస్సు - సమ్మెకట్టిన కూలీలు, భార్యలు, బిడ్డలు - హాలాలనన్నీ హలాలదున్నడం - కాలువకట్టే ఘర్మజలం - గనిలో వనిలో కార్ఖానాలో పరిక్లమం - యంత్రభూతముల కోరలు తోమడం - లోహరాక్షసుల పదఘట్టన - కళ్ళు వాకిట నిలిపిచూచే పల్లెటూళ్ళోతల్లి - దారిపక్క చెట్టుకింది ముసల్ది - ముసురుతున్న ఈగలు - ముగ్గుబుట్టవంటితల, ముడుతలు తేరిన దేహాంగల భిక్షువర్షీయసి-నెత్తురుక్రక్కుకుంటూ నేలకు రాలిపోవడం-చెరువుపక్క చెట్టునీడ గోనెలతో కుండలతో ఎటుచూస్తే అటుచీకటి, అటుదుఃఖం, పటునిరాశ - వంటివి ఫోటోలుతీసి చూపించదగినంత వాస్తవాలు.

## శ్రీశ్రీ సమాసవిశ్లేషణ శిల్పం

కావ్యభాషకు సౌలభ్యం కలిగించే ప్రయత్నంలో శ్రీశ్రీ అనుసరించిన సంప్రదాయం సమాసాలను పుంపులతో విశ్లేషించి రాస్తూఉండటం. ఇది కృష్ణశాస్త్రి శైలిలోనూ ఉన్నా శ్రీశ్రీ శైలి కిదొక ఆనవాలుగా మారిపోయిన విశిష్టగుణం. నీ ప్రపంచపుమహారణ్యాపు చిక్కదారులు అనే ప్రయోగంలో సంస్కృతసమాసాన్ని విడదీశాడు; మిశ్రసమాసాన్ని వాడాడు. స్నేహంపుం బూలతీవ, ప్రాయంపుంగోరికలు వంటి ప్రయోగాల్లో కృష్ణశాస్త్రి నుగాగమాన్ని సరశాదేశాన్ని పాటిస్తే వ్యావహారిక సాహసంతో వాటిని శ్రీశ్రీ తొలగించుకున్నాడు. పరువంపువిరిచేడె, జలదంపు నీలంపుసిగ్గు, జీవితంపు నిరాశ, హృదయంపుస్వేచ్ఛ, గాటంపు నిట్టూర్పు, జీవనంపు భారమువంటి వాటిలో కృష్ణశాస్త్రి 'ంపు'ప్రయోగాన్నే అభిమానించితే శ్రీశ్రీ ఆ బిందువును తొలగించుకున్నాడు. ఉదాహరణలు చూడండి:— మరోప్రపంచపు అగ్నికిరీటపుధగధగలు - మరోప్రపంచపు కంచునగారా - మరోప్రపంచపుకణకణమండేత్రేతాగ్ని - మరోప్రపంచపుజలపాతం - ప్రపంచాబ్జపుతెల్లరేకు - భువనభవనపుబావుటా - యమునిమహిషపులోహఘంటలు - నరకలోకపు జాగిలమ్ములు - సంవర్తపుతుపానుమేఘం - పొగగొట్టపు భూంకారధ్వని - స్వర్గద్వారపుతోరణము - నడిసంద్రపుకెరటాలు - మనఃప్రపంచపుటావర్తాలు - కలగాపులగపువిలయావర్తపు బలవత్ ఝరవత్ పరివరన - తారానివహపు ప్రేమసమాగమం - నాదబ్రహ్మపు పరిచుంబన - కార్మికలోకపు కల్యాణం - శ్రామికలోకపు సౌభాగ్యం - పూర్వపుసఖుని ముఖం - లోకపు భాగ్యవిధాతలు - బాల్యపుచెరిగినపదములు - అనురాగపుటంచులు - ఆనందపు లోతులు - షెల్లీకవనపుహల్లీసకము - ఇతిహాసపు చీకటికోణం - అసత్యప్రచారపురేడియో వంటివి.

## శ్రీశ్రీ విశేషణమాలికావిన్యాసం

విశేషణాలను మాలికలుగాకట్టి, ఉదాత్తతనూ స్పష్టతనూ సౌలభ్యాన్నీ వేగాన్నీ సాధించడం శ్రీశ్రీ శైలికొక ఆనవాలుగామారిన విశిష్టగుణం. వెర్రివాడికి విశేషణాలు మూడు ఉన్నాయి- (1) అలకలన్నీ అట్టకట్టిన (2) బొమికలన్నీ ప్రోవుపట్టిన (3) కాగితం వలె పలచబారిన (వాడు) వెర్రివాడట! ఇటువంటివింకా ఎన్నో.

ఎముకలుక్రుళ్ళిన వయస్సుమళ్ళిన సోమరులు - నెత్తురుమండే శక్తులునిండే సైనికులు - నడిరేయాకసమావర్తించిన మేఘాలావర్షించిన ప్రచండఝంఝాప్రభంజనం గజగజలాడించిన నడిసంద్రపుకెరటాల్లో ప్రమోగిన శంఖారావం ఢంకాధ్వానం-అటునను మంత్రించిన సమ్ముగ్ధం గావించిన ఆగాంధర్వం - విరామమెరుగక పరిశ్రమించే బలంధరిత్రికిబలికావించే కర్షకవీరులు - ధనికస్వామికి దాస్యంచేసే యంత్రభూతములకోరలుతోమే కార్మికధీరులు - నా వినుతించే నా విరుతించే నా వినిపించే నవీనగీతి - తల్లడిల్లే కెళ్ళగిల్లే పల్లటిల్లే బాటసారి వంటివి- విశేషణమాలికలతోకూడిన వాక్యబంధాలే! ప్రబంధకవిత్వంలోనూ భావకవిత్వంలోనూ కనిపించే దీర్ఘసమాసాలలోని విశేషణమాలికలవంటివికా వీ విశేషణమాలికలు!

కావ్యం చిరస్థాయికావడానికి
అందలి రసాధిక్యం కారణమవుతుంది ;
కాని దాని నిర్మాణసౌష్ఠవం కాదు !
అయినా ఆకృతివివక్షచెయ్యడం వ్యర్థకృత్యము కాదు !
కళాశీలి ఛందోరహస్యవేత్త కూడాను.

సుందరభావమైనా పాడుగా చెప్పబడినయెడల
రసభంగము కలిగినదన్నమాటే !

సంవిధానము (Technique)

వ్యాకరణచ్ఛందస్సులే కాక
తదతీతమైన ఒక విపులవ్యవస్థ!
కవి తనలో అంతర్గతమయిన రసాన్ని
పాఠకునిలో బహిర్గతముచేయగలుగుతున్న కార్యమే
సంవిధానము !
దీనికి ఆఘాతం తగిలితే
రసానికే విప్రతిపత్తి సంఘటిల్లినట్లు!
కావున తుట్టతుదకు
రీతినదాలు రససముద్రంలోనికే చేరుకుంటాయి !

—శ్రీశ్రీ.

# 70/స్విన్‌బర్న్ కవికి

కవీ! నీ గళ గళన్మంగళ కళాకాహళ హళాహళిలో
కలసిపోతిని! కరగిపోతిని! కానరాకే కదలిపోతిని!

1936 జూన్

ప్రాచీనకవులు తమ కావ్యాల అవతారికలలో 'పూర్వకవిస్తుతి'ని ఒక సంప్రదాయంగా పాటించారు. తమపై ఏకవుల ప్రభావం అపారంగా ఉందో వారినే స్తుతించారు. ఇది కృతజ్ఞతా నివేదనమే. తమకన్నా పూర్వకవుల సంవిధానాలను దక్షతతో ప్రయోగించారు కూడా. 20వ శతాబ్దందాకా ఈ సంప్రదాయిం అప్రతిహతంగా సాగిపోయింది. ఈ శతాబ్దంలో, జాతీయ సంస్కృతి పునరుజ్జీవనం ఒక ఉద్యమంగా తలెత్తినపుడు, ఆధునిక కవులు (పాశ్చాత్యకవులను అనుకరించడంతోపాటు) ప్రాచ్యకవులను స్తుతించడం కూడా ఒక గర్వంగా భావించారు. బృహత్కావ్యరచన అడుగంటిపోయింది కనక, ఖండకావ్యప్రక్రియలోనే పూర్వకవిస్తుతి మొదలయింది. శ్రీశ్రీ తాను శ్రీరంగం శ్రీనివాసరావుగా ఉన్నప్పుడు, అల్లసాని పెద్దన కవిత్వం చదివి ప్రభావితుడై ఆయనను స్తుతిస్తూ ముత్యాలసరాలలో ఒక కావ్యం రాశాడు.[1] ఆ గీతంలో పెద్దన కవిత్వం పట్ల తనకు గల అపారగౌరవాభిమానాలను వ్యక్తంచేయడం జరిగింది. భావకవితాయుగంలో శ్రీనివాసరావుకు ముందే ఇలా పూర్వకవులపై స్తుతిగీతాలు రాసినవారున్నారు. దువ్వూరి రామిరెడ్డి, వాల్మీకిని మంజరీద్విపదలో మనోహరంగా స్తుతించారు.[2] ఆగీతంలోని భావచిత్రాలు వాల్మీకికే కాక ఏ మహాకవికైనా అనువర్తింపజేయడానికి తగినంత విశాలపరిధిలో ఉన్నాయి. అబ్బూరి రామకృష్ణారావు మంజరీద్విపదనూ ఖండగతినీ మేళవించి కొత్తరీతిలో పల్లవితో తిక్కనను స్తుతించారు.[3] ఆ గీతంలో అబ్బూరి అభిరుచి తిక్కన తెలుగుపలుకులను మెచ్చుకోవడం మీదనే నిలిచింది. తెలుగుమాటల రంగులు, రుచులు, ఆవేశాలు, రాగాలు, నాదాలు, లోతులు వగైరాలను భారతకథతో అన్వయించి స్ఫురింపజేశారు. ఈ కవితను తిక్కననుంచి వేరుచేసి, మరోకవికి అన్వయించలేము. కృష్ణశాస్త్రిగారు గురజాడమీద ముత్యాలసరాలలో ప్రశంసా

1 చూ. స్వర్గదేవతలు లో ఆంధ్రకవితాపితామహుడు ఖండిక.

2 చూ. వైతాళికులు లో వాల్మీకి ఖండిక.

3 చూ. వైతాళికులు లో తిక్కనసోమయాజి ఖండిక.

గీతం రాశారు.4 ఆ గీతం ఒక సాంకేతిక సృష్టి. ప్రకృతిపరమైన సంకేతాలతో గురజాడ మహాకవి చారిత్రకప్రాధాన్యాన్ని స్ఫురింపజేశారు కృష్ణశాస్త్రిగారు. ఆ మహాకవిని భావకవులు కొన్నాళ్లు గుర్తించలేకపోవడం, తరువాత ఆయన వైతాళికత్వాన్ని తెలుసుకుని ఆయన ననుసరించడం జరిగినప్పుడు రచింపబడిందీ గీతం.

## స్విన్‌బర్న్‌కు శ్రీశ్రీ నీరాజనం

దువ్వూరి, అబ్బూరి, దేవులపల్లి తమ దేశంలో తమను ప్రభావితులను చేసిన కవులకే నివాళులర్పిస్తే, శ్రీశ్రీ పర దేశంలోపుట్టి పరభాషలో కవితలు రచించి, తనను ప్రభావితుడ్ని చేసిన ఎ. సి. స్విన్‌బర్న్‌కు నీరాజనం అర్పించడంలో రెండువిశేషా లున్నాయి. మొదటిది : శ్రీశ్రీ అంతర్జాతీయ దృష్టి. ప్రపంచంలో ఏ భాషలోరాసిన మహాకవి కవిత్వంలోనయినా శిల్పసంపదనూ కవితాభావననూ తెలుసుకుని ఆనందించగల్గడం ఈ అంతర్జాతీయదృష్టిఫలితమే ! అమెరికా, ఫ్రాన్సు, బ్రిటన్, ఇటలీ, జర్మనీ, బెల్జియం, స్పెయిన్, రష్యా వంటి దేశాల కవిత్వాలను శ్రీశ్రీ అధ్యయనం చేయగలిగింది ఈ అంతర్జాతీయతాభావనవల్లనే. రెండవది : తన తెలుగుకవుల్లో ఎవరివద్దాకనిపించని ఏదో ఒక అపూర్వశిల్పం ఒక అంతర్జాతీయకవిలో కనిపిస్తే దాన్ని ఆరాధించాలనే గుణైకపక్షపాతం. ఈ గుణంవల్లనే సామాజికదృక్పథమైనా కనిపించని ఎన్నో ఇజాలనూ ఆ ఇజాలప్రవర్తకులనూ తరచిచూచి, తన దృక్పథానికి వారి గుణాలను అనువర్తింపజేసుకోగల్గాడు శ్రీశ్రీ.

స్విన్‌బర్న్ గురించి శ్రీశ్రీరచించిన గీతంలో దువ్వూరి ఇత్యాదుల గీతాలలోకన్నా కొత్తదనమూ శిల్పపరిణతి ఉన్నాయి. స్విన్‌బర్న్ శైలీవిశేషాలతోనే శ్రీశ్రీ స్విన్‌బర్న్‌ను స్తుతించాడు. ఛందస్సులచేత చాకిరీ చేయించుకోవడం, మాటలతో గారడీచేయడం, లయ-ప్రాస-గతి-తాళం మొదలైనవాటిని జిగిబిగిగా అల్లివేయడం, విప్లవభావాలను లోకంమీదికి విసరడంవంటివి స్విన్‌బర్న్‌నుంచి శ్రీశ్రీ వారసత్వంలా అందుకున్నాడు. ఆ వారసత్వంతోనే స్విన్‌బర్న్‌ను స్తుతించాడు శ్రీశ్రీ. శ్రీశ్రీచేసింది కేవలం స్తుతిమాత్రమేకాక, తాను స్విన్‌బర్న్ కవితాకాహళీహళాహళిలో కదలి, కరగి, కలసిపోయానంటూ తాను ఎలాగ అతడిమానసపుత్రుడైపోయిందీ ఋజుత్వంతో చాటుకున్నాడు కూడా. 1837 ఏప్రిల్ 5వ తేదీన లండన్‌లో జనించి, విక్టోరియన్‌యుగమహాకవిగా పేరొందిన స్విన్‌బర్న్ 1910 జనవరి 2వ తేదీన శ్రీశ్రీ విశాఖపట్టణంలో కళ్ళువిప్పేనాటికి ఒకఏడాదిముందే మరణించాడు - 1909 లో. అమెరికన్‌కవి ఎడ్గార్ అల్లన్ పో కవిత్వం చదివి, ఫ్రెంచికవి బాడ్లెయిర్ కవిత్వంవైపునడచి, బ్రిటిష్‌కవి స్విన్‌బర్న్‌కవిత్వందగ్గరకు చేరడంతోనే కవిత్వంలో శిల్పశిఖరం అధిరోహించాడు - శ్రీశ్రీ ! పో, బాడ్లెయిర్, మపాసాలు ముగ్గురూ తనకు ఋషిత్రయంఅంటూ సాహిత్యప్రవరను చెప్పుకున్న శ్రీశ్రీ స్విన్‌బర్న్‌నుమాత్రం ఋషిగా

---

4 చూ. కృష్ణపక్షము లో గురజాడ అప్పారావు ఖండిక.

స్వీకరించకపోవడంవల్ల తేలేది ఏమిటంటే: స్విన్‌బర్న్‌తో తనకు తాదాత్మ్యం ఉందన్నమాటే! ఆ ఋషులు ముగ్గురికీ సమర్పించని కవితానీరాజనాన్ని శ్రీశ్రీ స్విన్‌బర్న్‌కే సమర్పించి కృతార్థుడయ్యాడు. బాద్లెయిర్, మపాసాలను ఆంగ్లచక్షువుతోమాత్రమే చూడగల్గాడు శ్రీశ్రీ. స్విన్‌బర్న్ సృష్టిని ప్రత్యక్షరం అనుభవించాడు. ఫ్రెంచిగీతుల మంచిరీతులన్నీ స్విన్‌బర్న్‌లోనే గోచరించాయి శ్రీశ్రీకి.

### శ్రీశ్రీపై స్విన్‌బర్న్ ప్రభావం

శ్రీశ్రీ తనపై స్విన్‌బర్న్ ప్రభావాన్ని తనగేయంలోని చివరిగీతంలోనే కాక, 'ఒక సంభాషణశకలము' అనే వ్యాసంలోకూడా వర్ణించుకున్నాడు. ఆ భాగాలను ఉదాహరిస్తాను:-"నిజమే! సంగీతపుహాయి చెప్పవలసినప్పుడు Swinburne నే స్మరిస్తాను. ఇది నువ్వు కొట్టిపారేస్తున్నట్లు కేవలం Verbal music కాదు. భావసౌందర్యములేని కృతకపదాల కూర్పు కాదు. అతనిసంగీతం పదాలలోంచి బయలుదేరేభావాలగానం. నిజానికి నాఋషుల్లో Baudelaire ను మాని Swinburneనే చెప్పిఉందును. కాని వేద్యంకంటె అవేద్యపుసుఖం నన్నాకర్షిస్తుంది. Baudelaire ని తర్జుమాలో చదవడంచేత, వ్యక్తావ్యక్తంగా అవగాహనమయ్యే అతనిప్రతిభ, దానివల్ల జనించే ఉత్సవం (?) ఒక వేళ తెరసడలితే పోతుందేమో! Swinburne గురించి ఎంతో తెలుసు! Too much కూడానేమో! (టూమచ్ అనేది నా తత్వంలోనే లేదు కాని) అతని ఆకారం స్పష్టప్రతిమ". స్విన్‌బర్న్‌ది కృతకపదాల కూర్పువల్ల జనించేపదసంగీతమా? పదాలలోంచి బయలుదేరి భావగానమా? అనే మీమాంస వరకూ శ్రీశ్రీ వెళ్ళి ఆంగ్లవిమర్శకుల వాదోపవాదాలకు పరిష్కారంగా తుదిమాటనే చెప్పాడు. స్విన్‌బర్న్‌గురించి తనకు సమగ్రంగా తెలుసునని శ్రీశ్రీ చెప్పుకోవడంలో అతిశయోక్తి లేదు. 1964 లో జనశక్తిపత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ :—"స్విన్‌బర్న్ మహాకవి 90 ఏండ్లు (Sic) (70 ఏళ్ళని ఉండాలి.) బ్రతికాడు. అతడు రాసిందంతా 30–40 సంవత్సరాల మధ్యనే. ఫ్రెంచివిప్లవసమయంలో ఆయనొక అరిస్టోక్రాట్. ఆయనకు ఆహారసమస్యలేదు. ఇక 40-70 సంవత్సరాల మధ్య ఆయన రాసిందేమీ లేదు. ఇప్పుడు మనిద్దరం చర్చించుకుంటున్నట్లు ఆయన థియోడర్‌వాట్స్‌డంటన్ ఇంట్లో కూర్చుని చర్చిస్తున్నాడు. స్విన్‌బర్న్ నాటికీ నేటికీ కూడా మహాకవే! ఆయన కవిత మానవాళికి ఉషోగీతిక" అన్నాడు శ్రీశ్రీ. స్విన్‌బర్న్‌మీద ఉన్న ఈ అభిమానం శ్రీశ్రీచేత స్తుతిగీతం రాయించి ఊరుకోలేదు; స్విన్‌బర్న్ రచించిన A Match అనే గేయాన్ని అనుసరిస్తూ అద్వైతం అనే గేయాన్ని రచించేలా చేసింది.

### శ్రీశ్రీ దృష్టిలో కవిత్వం : సంవిధానం

స్విన్‌బర్న్ కవిత్వంలో కవిత్వమూ సంవిధానమూ సమానమైన తూకంతో ఉంటాయని విమర్శకుడుగా శ్రీశ్రీ 1935 లోనే ఒక తీర్పుచెప్పాడు. ఉత్తమోత్తమకవి అంటే ఎవరు ? అనే ప్రశ్నకు శ్రీశ్రీ తీసుకున్న కొలమానంప్రకారం స్విన్‌బర్న్ మహాకవి అయ్యాడు. 'ముత్యాల

సరం-ఒక కృషి' అనే వ్యాసానికి రాసిన ఉపసంహారంలో ఈ విషయాన్ని ఇలా ప్రతిపాదించాడు శ్రీశ్రీ:—"కవి తనలో అంతర్గతమైన రసాన్ని పాఠకునిలో బహిర్గతము చేయగలుగుతున్న కార్యమే సంవిధానము. దీనికి ఆఘాతం తగిలితే రసానికే విప్రతిపత్తి సంఘటిల్లినట్లు. కావున తుట్టతుదకు కీలినదాలు రససముద్రంలోనికే చేరుకుంటాయి. కవిత్వాన్నీ సంవిధానాన్నీ తీసుకొని కూర్పులు చేస్తే నాలుగువిధములైన జంటలు ఏర్పడుతవి. వీటిలో నాలుగోవిధమే సర్వోత్కృష్టమైనది.

(1) — కవిత్వము
— సంవిధానము } అభావకవిత్వమేగాక అనేకదోషభూయిష్ఠమైన రచన.

(2) — కవిత్వము
+ సంవిధానము } సలక్షణమైన కన్య! కాని, నిర్జీవ.

(3) + కవిత్వము
— సంవిధానము } ఉదా:—
ప్రీతిపాత్రమైన పెండ్లాము నచ్చిన యింటిపాడుసూచి యోర్వలేక
చనకుపొలమువిడిచి పనిలేకయున్నను పామరుండు కాపువాడుకంటె.
—గాథాసప్తశతి: రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి అనువాదము.

(4) + కవిత్వము
+ సంవిధానము } ఉదా:— Between the green bud and the red
Youth sat and sang by Time and shed
From eyes and tresses flowers and tears
From heart and spirit hopes and fears.
—A. C. Swinburne's Songs before Sunrise.

ఇందలి మూడోవిధానాన్ని తీసుకొని కొందరు రసవాదులు భావముంటేచాలును; ఎట్లు చెప్పినను సరే అనవచ్చును. కాని, వారు సర్వసమగ్రతను కోరలేదనే చెప్పాలి. ఏవిషయంలో కొరవడినా కవిత్వము ఉత్కృష్టము కానేరదు. కావున మహత్తరభావాలను మహత్తరవిధంగా ప్రతిపాదించినదే ఉత్కృష్టకవిత్వము."

ఈ వ్యాసంలో + కవిత్వము + సంవిధానము అనే ఫార్ములాకు శ్రీశ్రీ ఇచ్చిన 4వ ఉదాహరణ స్విన్‌బర్న్ కవితాఖండమే! 3వ ఉదాహరణనుబట్టిచూస్తే ఉక్తివైచిత్రి కవిత్వంఅనీ దాన్ని వెలువరించిన బాహ్యరూపం సంవిధానంఅనీ తేలుతుంది. "సుందరభావమైనా పాడుగా చెప్పబడినయెడల రసభంగము కలిగినదన్నమాటే" అనీ "సంవిధానము (Technique) వ్యాకరణ చ్ఛందస్సులే కాక తదతీతమైన ఒక విపులవ్యవస్థ" అనీ శ్రీశ్రీ వివరించాడు. కవిత్వము (భావం) సంవిధానము అనే రెండంశాలుగా సమస్తకవిత్వాన్నీ విశ్లేషించిన శ్రీశ్రీ అప్పటికింకా శుద్ధ కవిత్వాన్ని (Pure Poetry) గురించే ఈ మాటలు చెప్పాడన్నమాట. కవిత్వంలో వస్తువు (విషయం) సమాజపురోగమనానికి పనికివచ్చేదే కావాలన్న సిద్ధాంతం శుద్ధకవిత్వానికి సంబంధించినది కాదు; అది అభ్యుదయకవిత్వవిషయం. స్విన్‌బర్న్ శుద్ధకవియే అయినా అతని విప్లవ

భావాలు కొన్ని (క్రిస్టియానిటీని వ్యతిరేకించడం, ఇటాలియన్ స్వాతంత్ర్యంకోసం ఆందోళన చెందడం) శుద్ధకవిత్వంనుంచి అతణ్ని ఉన్నతీకరించాయి. శ్రీశ్రీ తనబుషులుగా, మార్గదర్శకులుగా చెప్పుకున్నవారంతా నిజానికి శుద్ధకవులే! కవిత్వం నైతికసూత్రాలను కాపాడాలా? లేదా? అన్నదే వారి మీమాంసకానీ సమాజాన్ని అభ్యుదయపథంలో నడిపించాలా లేదా అన్నది వారి సమస్యకాదు. వీరంతా శుద్ధసౌందర్యవాదులు. మరి శ్రీశ్రీయో, సామాజిక సౌందర్యవాది! కనుక శ్రీశ్రీకి కవిత్వం అంటే+కవిత్వం + సంవిధానం మాత్రమే కాదు;+అభ్యుదయ, విప్లవవాదం+ కవిత్వం + సంవిధానం అవుతుంది. శుద్ధకవిత్వంలోకన్నా ఒక అంశం ఇందులో పెరిగింది. మహాప్రస్థానగీతాలు ఈ ఫార్ములాకే లక్ష్యాలు. స్విన్‌బర్న్ గీతాలుమాత్రం + కవిత్వం+ సంవిధానం అనే ఫార్ములాకు లక్ష్యాలు. ఉక్తివైచిత్రి, ఛందస్సు, లయ, పదసంగీతం వంటివి శుద్ధకవిగాగానీ అభ్యుదయకవిగాగానీ శ్రీశ్రీ చేత తిరస్కరింపబడేవికావు. వాటికోసమే శుద్ధకవిత్వాన్ని శ్రీశ్రీ పరిశోధించాడు. శుద్ధకవిత్వానికి ఇంద్రియప్రీతి, సత్యేతరనిర్వృతి, రసానందం వంటివి ప్రయోజనాలయితే, అభ్యుదయకవిత్వానికి వాటన్నింటితోపాటు సామాజికవిప్లవం కూడా ప్రయోజనం. శుద్ధకవిత్వం నిర్మాణసౌష్ఠవంమీదా రూపసౌందర్యంమీదా ఎక్కువగా ఆధారపడకతప్పదు. "కవి తనలో అంతర్గతమైన రసాన్ని పాఠకుడిలో బహిర్గతం" చేయాలంటే సంవిధానం అతిముఖ్యం. సంవిధానాన్ని విడిచిన అనంతకృష్ణశర్మగారి గాథాసప్తశతి పద్యం ఎలాంటిదో, సంవిధానాన్ని విడిచిన అభ్యుదయకవిత్వం కూడా అలాంటిదే అవుతుందని శ్రీశ్రీకి తెలుసు కనుకనే మహాప్రస్థానగీతాలలో సంవిధానాన్ని విడిచిపెట్టలేదు. శుద్ధకవిత్వంలోని కళామౌలికలక్షణాలకు అభ్యుదయకవిత్వం విరుద్ధంకాదు కనుకనే శ్రీశ్రీకి స్విన్‌బర్న్ ఆరాధ్యుడయ్యాడు.

1933 నుంచి మొదలైన మహాప్రస్థానపుశ్రీశ్రీ పాశ్చాత్యకవుల సంవిధానాను ఒకవరుసలో ఆరాధిస్తూ అనుసరిస్తూ వస్తున్నాడు. 'గంటలు' రాసినపుడు - ఎడ్గార్ అల్లన్‌పో నూ, 'ఆకాశదీపం' రాసినపుడు - బాద్లెయిర్‌నూ, అద్వైతం రాసినపుడు - స్విన్‌బర్న్‌నూ అనుసరించాడు. ఈముగ్గురిలో బాద్లెయిర్ అల్లన్ పో నూ, స్విన్‌బర్న్ బాద్లెయిర్‌నూ ఆరాధించిఉండటం ఒక క్రమం.

| | | | |
|---|---|---|---|
| అల్లన్ పో → | బాద్లెయిర్ → | స్విన్‌బర్న్ → | శ్రీశ్రీ |
| (1809) | (1829) | (1837) | (1910) |

### స్విన్‌బర్న్ కవితాసంవిధానం : శ్రీశ్రీ అవగాహన

రసోద్వేగం. భావోద్రేకం పొందిన జంతువులు జ్ఞాపకం వచ్చాయి శ్రీశ్రీకి : స్విన్‌బర్న్ పాటలు విన్నప్పుడు! పాములు, గుర్రాలు, ఏనుగులు వాటివాటి ఉద్రిక్తస్థితిలో ఎలాగుంటాయో అలాంటివి స్విన్‌బర్న్ గేయాలు. ఇంగ్లీషుకవి/ఇంప్రెషనిజం ధోరణిలో శ్రీశ్రీ స్విన్‌బర్న్‌ను స్తుతించాడు -

'విషంక్రక్కే భుజంగాలో! కదంతొక్కే తురంగాలో! మదంపట్టిన మాతంగాలో! కవీ సీపాటల్' అంటూ.

విషంక్రక్కడం కోపాన్నీ (రౌద్రం) కదం తొక్కడం వేగాన్నీ (వీరం), మదంపట్టడం గర్వాన్నీ (భయానకం) వ్యక్తంచేస్తున్న విశేషణాలు. స్విన్‌బర్న్ గేయాలు మహోద్ధతినీ ఓజో గుణాన్నీ ఆరభటీవృత్తినీ గౌడీరీతినీ కలిగి ఉంటాయనే సూచన ఇందులో ధ్వనిస్తుంది. భుజంగ, తురంగ, మాతంగ గమనాలు ఛందశ్శాస్త్రంలోకూడా ప్రసిద్ధమై ఉండటంవల్ల ఇవి స్విన్‌బర్న్ ఛందోగమనాలకు శ్రీశ్రీ చెప్పిన పోలికలుగా కనిపిస్తాయి. 'భుజంగ ప్రయాతం' అనే వృత్తం శ్రీశ్రీకి అభిమానవృత్తం. స్విన్‌బర్న్ తన కవితల్లో విషంక్రక్కే భుజంగాలను 'or poisonous foam on the tender tongue of the little snakes that eat my heart — Small serpants with soft stretching throats caressed Faustine?' వంటి పంక్తుల్లో చూపించాడు. త్రాచులు-సుప్తభుజంగాలు - ఇరవై కోరల అరవై కొమ్ముల క్రూరఘోరకర్కోటకులు - సర్పములు - విషవాయువులు - పడగెత్తి బుసగొట్టేప్రపంచం - బాధాసర్పాలు - విషవాగురలు - శ్రీశ్రీ కవిత్వంలోనూ కనిపిస్తాయి.

తురంగగమనం మన దేశిచ్ఛందస్సులలో అశ్వగతిరగడ అనేపేరుతో ప్రసిద్ధం. ఛందస్సు గుర్రంవంటిదనీ అది లాగుకుపోయినట్లల్లా పోయేవాడు సంవిధానజ్ఞుడు కాడనీ దానిచేత చిత్ర విచిత్రమైన నడకలు నడిపించాలనీ శ్రీశ్రీ ఒకచోట తనఅభిప్రాయం వెల్లడించాడు.

మాతంగగమనం అక్షరచ్ఛందస్సులలో ప్రసిద్ధమైనది కనుకనే మత్తేభవృత్తం ఉంది. శ్రీశ్రీ వాక్యాలలో ఇటువంటి మత్తేభగమనం (ముఖ్యంగా కవితా ఓ కవితాలో) కనిపిస్తుంది.

ఛందస్స్వాతంత్ర్యం స్విన్‌బర్న్ కవితారహస్యాలలో ఒకటి:—"He does not like another poet have to think in his metre; his mastery compels the metre to think for him" అని ఎడ్వర్డుథామస్ అనే విమర్శకుడు స్విన్‌బర్న్‌ను గురించి రాశాడు. ఛందస్సులు శ్రీశ్రీకి కూడా చెప్పినట్లుగా వింటాయనడానికి ముత్యాలసరాలలో అతడు తీసిన కొత్త తెన్నులూ, త్ర్యస్ర చతురస్ర ఖండగతుల గేయాలలో అతని గమనాలూ, అక్షరచ్ఛందస్సుల కతడు చేసిన సంస్కరణాలూ, ప్రాసలద్వారా లయవిన్యాసం, వచనపద్యంలోని ప్రయోగాలు నిదర్శనాలు. స్విన్‌బర్న్ ఛందోగమనాలకు కొన్ని ఉదాహరణలు:—

I am that which began
    Out of me the years roll;
Out of me God and man
    I am equal and whole;
God changes, and man, and the
Form of them bodily; I am the soul-
× × ×
The sea one pearl, the shore one rose,
All round him all the flower-month flamed
And lightened, laughing off repose.

వలయవిచలద్విహంగాలు - స్విన్‌బర్న్ పాటలు. ఆకాశంలో వలయాకారంలో తిరుగుతున్న పక్షులలా అతనిపాటలు ? ఈ ఉత్ప్రేక్షవల్ల స్విన్‌బర్న్ కవితలోని పదాలపరస్పరమైత్రి, శబ్దాలబాహ్యసౌందర్యం, దృశ్యాల సాక్షాత్కారం వంటిగుణాలు వ్యక్తంఅవుతున్నాయి. ఆకాశంలో ఎత్తున కదిలే పక్షులు వలయంగా కదులుతాయనడంలోనే లయ ఉంది. స్విన్‌బర్న్ భావాలు ఉన్నతాలు; చలనశీలాలు. "All his verse is written with amazing technical skill and a great richness of sound, with complex rhythms, intricate patterns of alliteration and assonance and rich riming. Sometimes, the sound is so enthralling that it becomes cloying or hypnotic, and the reader suddenly realizes that he is reading along happily without the least notion of what is being said. He may even go back and find that nothing is being said"[5] ఈమాటల్లో స్విన్‌బర్న్ శైలిలోని విహంగవలయవిచలనం బాగా స్ఫురిస్తుంది. అది పాఠకుడికి పరమాహ్లాదం కలిగిస్తుంది. స్విన్‌బర్న్ కవిత్వం చదువుతూ, ముగ్ధులయ్యేవారంతా అతడేమి చెబుతున్నాడనే జిజ్ఞాస లేకుండానే అతణ్ని మెచ్చుకుంటారంటే అతని సంవిధానం ఎంత గొప్పదో తెలుస్తుంది.

విలయసాగరతరంగాలు - స్విన్‌బర్న్ పాటలు ! శబ్దాల పౌనఃపున్యం, భావాల ఉద్ధృత వేగం ఈ ఉత్ప్రేక్షనుంచి స్ఫురిస్తాయి. స్వరపునరుక్తి, హల్‌పునరుక్తి, పదపునరుక్తి, పదసమూహపునరుక్తి స్విన్‌బర్న్ శైలిలో ఉన్నాయి. విలయంలోకూడా లయసహితత్వం, లయరహితత్వం ఉన్నాయి. ఇక్కడ సాగరతరంగాలతో స్విన్‌బర్న్ పాటలను పోల్చడంలో స్విన్‌బర్న్ సముద్రతీరంలో పుట్టడం, ఈతమీద అతనికుండే అభిమానం, సముద్రంమీద అతనికుండే మమకారం జ్ఞాపకంవస్తాయి. శ్రీశ్రీకీ స్విన్‌బర్న్‌కూ ఉండే జీవితసాదృశ్యాల్లో ఇది ఒకటి.

యుద్ధగుంజన్మృదంగాలు - స్విన్‌బర్న్ పాటలు ! వీరభయానకబీభత్సాదులు ఈ ఉత్ప్రేక్ష వల్ల వ్యక్తం అవుతాయి.

స్విన్‌బర్న్ శబ్దవిన్యాసంగురించి వివరిస్తూ W. H. Marshall వ్రాసిన వాక్యాలను చూద్దాం:- "In his review, 'The Poems of Dante Gabriel Rossetti (1870)' Swinburne pointed to the Qualities distinguishing great poetry from that which is merely good; and though his language is excessively florid. the description may usefully serve to indicate the qualities which Swinburne strove to achieve in his own work: "strength, sweetness, affluence. simplicity, depth, light, harmony, variety, bodily grace and range of mind and force of soul and ease of flight, the scope and sweep of wing to impel the might and weight of thought through the air and light of speech with a motion as of mere musical impulse; and not less the live bloom of perfect words,......the rare and ineffable mark of a supreme singing power, an element too subtle for solution in any crucible analysis"[6]

---

5 The Reader's Companion to World Literature.

6 The Major Victorian Poets.

మంచికవిత్వానికీ గొప్పకవిత్వానికీ తేడా ఏమిటో స్విన్‌బర్న్ రొజెట్టి కవిత్వాన్నిగురించి విశ్లేషిస్తూ అన్నమాటలివి. రొజెట్టిలో ఉన్నవని చెప్పిన గుణసమ్మేళనమంతా తనలోకూడా ప్రదర్శించాడు స్విన్‌బర్న్. స్విన్‌బర్న్ కవితాకళాకాహళీహాళాహళిలో శ్రీశ్రీ కలిసిపోయాననే చెప్పుకున్నాడుకదామరి !

స్విన్‌బర్న్ కవిత్వంలో సంగీతగుణాన్నీ నాట్యగుణాన్నీ కూడా శ్రీశ్రీ గమనించాడుకనుకనే షెల్లీకవనపుహల్లీసకమూ ఫ్రెంచిగీతుల మంచిరీతులు మోహినీగంధర్వగానం అతని పాటలన్నాడు

'Shelly is supposed to be the master of Swinburne'[7] అని ఇలియట్ వంటి విద్వద్విమర్శకుడు చెప్పనే చెప్పాడు. షెల్లీ శబ్దసంగీతానికి పేరుపొందిన కాల్పనిక కవి. "Shelly's command of the sound effects of his verse is nothing short of marvelous. To this melody, he brought other qualities of greatness — a sense of form intensity and sensuousness"[8] ఇది షెల్లీ గురించి అంతర్జాతీయాభిప్రాయం అయిఉండగా షెల్లీ కవనంలో శ్రీశ్రీ చూసిన గుణం నాట్యగుణం. దాన్ని స్విన్‌బర్న్ కవితలలో కూడా చూశాడు శ్రీశ్రీ. హల్లీసకం అంటే వలయాకారంలో చేసే దండరాసక (కోలాట) నాట్యం. హల్లీసకం చక్కని అమరికకూ పదవిన్యాసానికీ కదలికకు ప్రతీక. షెల్లీకవనపుహల్లీసకము స్విన్‌బర్న్‌లో "I lean my cheek to the cold grey pillow / The deep soft swell of the full broad bellow" వంటి అనుప్రాసల్లో కనిపిస్తుంది. 'నీ కంకణనిక్వాణంలో నా జీవన నిర్వాణంలో నీ మదిలో డోలలు తూగీ నా హృదిలో జ్వాలలు రేగీ నీ తలపున రేకులుపూస్తే నా వలపున బాకులు దూస్తే మరణానికి ప్రాణం పోస్తాం స్వర్గానికి నిచ్చెన వేస్తాం" వంటి పాదాల్లో షెల్లీస్విన్‌బర్న్‌ల హల్లీసకగుణాన్ని శ్రీశ్రీ చవిచూపించారు.

'From my wings are shaken
the dews that waken
The sweet buds every one,
When rocked to rest
on their mother's breast
As she dances about the sun.'

ఇటువంటిది షెల్లీ శబ్దనృత్యం.

ఫ్రెంచిగీతులమంచిరీతులను స్విన్‌బర్న్ బాద్లెయిర్ (1821-67) విల్లన్ (1431-62) ప్రభృతులనుంచి స్వీకరించాడు. బాద్లెయిర్ కవితాసిద్ధాంతాలను సమర్థించాడు. అంతేకాదు; "A poet's business is presumably to write good verses, and by no means to redeem the age and remould society" అంటూ విక్టోరియన్‌యుగకవివిమర్శకులకే ఎదురుతిరిగాడు.

7 The Sacred Wood.

8 The Reader's Companion to World Literature.

ఫ్రెంచిగీతుల మంచిరీతులు మంచిమంచి పద్యాలురాయడం వరకే! అందుకే వారు గంధర్వ విద్యావరాయణులయ్యారు. కవితాసంగీతం సృష్టించారు. శ్రీశ్రీ స్విన్‌బర్న్‌లాగే ఫ్రెంచి సింబాలిస్టుల నారాధించాడు. వారి ప్రభావానికి ముగ్ధుడయ్యాడు. ఫ్రెంచికవుల్ని మన సిద్ధాంతాలతో కొలిస్తే రీతివాదులే! అందుకే మంచిరీతు లన్నాడు శ్రీశ్రీ.

సాహిత్యజగన్మోహిని అయిన సరస్వతి కచ్ఛపీనాదాలతో సృష్టించే గంధర్వగానాన్ని స్విన్‌బర్న్ పాటల్లో విన్నాడు శ్రీశ్రీ! "అటు నను మంత్రించిన సమ్మోగ్ధం గావించిన ఆ గాంధర్వానికి తారానివహాపుష్పవిమనసమాగమంలో జన్మించిన సంగీతానికి ... నా నాడుల తీగలపై సాగిన నాదబ్రహ్మోపపరిచుంబనలో ప్రాణావసానవేళాజనితం నానాగానానూనస్వానావళితం బ్రదుకును ప్రచండభేరుండగరుత్పరిరంభంలో పట్టిన గానం" స్విన్‌బర్న్‌లో శ్రీశ్రీకి కనిపించిన మోహినీ గంధర్వగానం.

స్విన్‌బర్న్ కవిత్వం కేవలం కవిత్వం కాదు; అది నాట్యసంగీతకవిత్వాల సమ్మిశ్రణరూపం. అందుకే శ్రీశ్రీ మొదట హల్లీసకం, తరువాతరీతి (విశిష్టపదరచన) తరవాత గంధర్వగానం పేర్కొన్నాడనిపిస్తోంది. నాట్యగుణాలు వృత్తులు (ఆంగికాభినయాలు); రచనాగుణాలు రీతులు (వాచికాభినయాలు); గీతిగుణాలు కూడా రచనాగుణాలే (శయ్య)- ఈ మూడు గుణాలూ కలిసినప్పుడు స్విన్‌బర్న్ కవిత్వం వంటి శారదారూపం సాక్షాత్కరిస్తుంది. అది శుద్ధకవిత్వమే!

స్విన్‌బర్న్ గీతాలను మధురమైన గళంతో పాడాలేకాని, మౌనంగా చదవకూడదు. "Read silently alone, it loses the effect of combining and accumulating sound; at most, the words only give occassional transitory impulses to the spirit. In Swinburne's poetry, the large groups of sounds and meanings are what count, and except in a short poem the eye and mind cannot do justice"[9] అన్నాడందుకే ఎడ్వర్డ్ థామస్. స్విన్‌బర్న్ కవిత్వపు గానప్రాధాన్యాన్ని వ్యక్తంచేయడానికి అతని పాటలు విలయసాగరతరంగాలనీ యుద్ధగుంజన్మృదంగాలనీ కళాకాహాళలులనీ శ్రీశ్రీ ప్రశంసించాడు.

నాట్యసంగీతచిత్రలేఖనాదికళల లక్షణాలన్నింటినీ తనలో కలుపుకొనేదే అసలైన కవితాకళ. అలాంటి సమగ్రకళాస్వరూపం స్విన్‌బర్న్‌కు సిద్ధిస్తే, ఆసమగ్రకళను సమాజపరంచేయడానికి శ్రీశ్రీ సంకల్పించాడు: "Ordinary Communication demands only the use of certain techniques, but art requires their fusion in such a way that all contribute to the wholesome of the given poem or painting; the integration of sound and color, the significant ordering of detail, must achieve totality of effect, the intensity of expression, from which the work derives its greatness,"[10] అన్నాడు W. H. MARSHALL స్విన్‌బర్న్ సమగ్రతను

9 A. C. Swinburne: A Critical Study.
10 The Major Victorian Poets.

మెచ్చుకుంటూ నే. స్విన్‌బర్న్ కవిత్వంలో పదచిత్రాలు, భావాలు, సంగీతం కలిసి ఒకటే అంశం అన్నాడు ఇలియట్ : "What we get in Swinburne is an expression by sound could not possibly associate itself with music. For what he gives is not images and ideas and music, it is one thing with a curious mixture of suggestions of all three"[11]

ఎర్రికాంతుల ఇనోదయమూ రెక్కవిప్పిన రివల్యూషన్ కడలివలపూ వలపుకడలీ స్విన్‌బర్న్ పాటలు. ఈ మూడు పదచిత్రాలతో స్విన్‌బర్న్ విప్లవభావాలను శ్రీశ్రీ ధ్వనించాడు.

ఇటాలియన్ స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరుస్తూ ఆవేశపూరితుడై గళమెత్తిన స్విన్‌బర్న్ A Song of Italy (1867) Songs before Sunrise (1871) అనే రెండు కావ్యాలు రచించాడు. వీటినే అరుణోదయం అనీ విప్లవవిహంగం అనీ స్తుతించాడు శ్రీశ్రీ.

లైంగికప్రవృత్తిలో స్వేచ్ఛకోరిన స్విన్‌బర్న్‌ది వలపుకడలియే. సముద్రంమీద అభిమానం చూపిన స్విన్‌బర్న్‌ది కడలివలపే.

రెక్కవిప్పిన రివల్యూషన్ అనేది స్విన్‌బర్న్ ఆశయాలలోని రాజకీయ సాంఘికమతవిప్లవాలకు సూచిక. స్విన్‌బర్న్ భావాలు విప్లవాత్మకాలు. మొదటిది : అతడు క్రిస్టియానిటీని ధిక్కరించాడు. రెండవది : అతడు లైంగికజీవితంపట్ల స్వేచ్ఛవహించాడు. మూడవది : అతడు ఇటాలియన్‌జాతీయోద్యమంపట్ల సానుభూతి చూపించాడు.

రెక్కవిప్పడం వ్యాప్తికీ కదలికకూ సంకేతం. కడలివలపు దక్షిణానాయకత్వాన్నీ విశాలహృదయాన్నీ సూచిస్తూంటే వలపుకడలి ప్రణయగాంభీర్యాన్నీ ప్రణయాతిశయాన్నీ ప్రకటిస్తుంది. స్విన్‌బర్న్‌కు చిన్నప్పటినుంచీ సముద్రంఅంటే ఎంతో ఇష్టం. అతడు ఈత బాగా నేర్చుకున్నాడు. సముద్రమే తనతల్లి అని ఒకచోట చమత్కరించాడు కూడా.

కడలివలపూ వలపుకడలీ అనే ప్రయోగంలోని శబ్దాల తిరుగుబాటు స్విన్‌బర్న్ సంవిధానంలోనూ ఉంది. O Sole desire of my delight / O Sole delight of my desire[12] వంటివి స్విన్‌బర్న్ ప్రయోగాలు. ఇటువంటివే శ్రీశ్రీ మరికొన్ని చేశాడు:— నాగదిలోపల చీకటిలో/చీకటిలోపల నాగదిలో – కన్నుల నిండిన కావిరితో/కావిరి నిండిన కన్నులతో – గుండెల కప్పిన కుంపటితో/కుంపటి కప్పిన గుండెలతో – ఇవాళలాగే ఎప్పుడు కూడా/ఎప్పుడు కూడా ఇవాళలాగే మొదలైనవి !

## స్విన్‌బర్న్‌తో శ్రీశ్రీ తాదాత్మ్యం

ఈ గేయంలో ఆఖరిగీతంద్వారా శ్రీశ్రీ తనకు స్విన్‌బర్న్‌తో కల తాదాత్మ్యాన్ని తెలుపుకున్నాడు. స్విన్‌బర్న్ కళాకాహాళను ఉదగా జనించిన హాళాహాళి (కలకలధ్వని)లో శ్రీశ్రీ కలసి

11 The Sacred Wood.
12 FRAGOLETTA.

పోయాడు! ద్రవించిపోయాడు!! అదృశ్యమైపోయాడు!!! చలించిపోయాడు!!!! స్విన్‌బర్న్‌ది శబ్దనాదసుందరమూ శబ్దసంఘటనావైచిత్రీమధురమూ అయిన కవిత్వం. శబ్దాలాధారంగా ఎంత ఇంద్రజాలప్రదర్శనం చేయవచ్చునో అది అంతా స్విన్‌బర్న్ చేశాడు. దానిచేత శ్రీశ్రీ గాఢంగా ప్రభావితుడయ్యాడు. ఆశాబ్దికధ్వనిలో తాదాత్మ్యం అనుభవించి శబ్దశిల్పిఅయిన స్విన్‌బర్న్‌ను శబ్దశిల్పంతో ప్రాసక్రీడలతో లయవిన్యాసంతో ఛందోనైపుణ్యంతో స్తుతించాడు-శ్రీశ్రీ!

స్విన్‌బర్న్ శబ్దవిన్యాసాన్ని చూసి శబ్దాలు ముందా? భావాలు ముందా? అనే సంశయం పొందిన విమర్శకు లున్నారు. ఈ విమర్శకు ఇలియట్ చెప్పిన జవాబు:- "Now in Swinburne the meaning and the sound are one thing. He is concerned with the meaning of the word in a peculiar way; he employs or rather "works" the word's meaning. And this is connected with an interesting fact about his vocabulary; he uses the most general word because his emotion is never particular, never in direct line of vision, never focussed; it is emotion reinforced, not by intensification, but by expression."[13] శబ్దమూ అర్థమూ వేరు వేరు కావు స్విన్‌బర్న్‌కు! శబ్దం అతనికి నూతనార్థంతో గోచరిస్తుంది. ఆవేశం నిర్దిష్టమైనది కానప్పుడు శబ్దంనిర్దిష్టంగా ఉండదు. శ్రీశ్రీ కూడా తనకు ఎన్నో దృశ్యాలు కనిపించినతరువాత, ఎన్నో ఘోషలు వినిపించినతరవాత మాటలకై వెదుకాడగబోతే అవి నిఘంటువులను, ఛందస్సులను, వ్యాకరణాలను వదలి వచ్చాయన్నాడు. స్విన్‌బర్న్ ఛందస్సులను గురించి చెబుతూ ఎడ్వర్డ్ తామస్ అన్నమాటలు:- There is no other poetry where the substance is so subdued to the musical form of verse. It is not thought set to music, but music which has absorbed thought.[14] ఛందోరూపానికి ఆలోచన ఒదిగిపోవడం స్విన్‌బర్న్ రచనారహస్యం! శబ్దవిన్యాసంలో ఛందస్సంఘటనలో స్విన్‌బర్న్‌ను శ్రీశ్రీ అనుసరించాడనడానికి ఈ స్తుతిగీతాన్నే నిదర్శనంగా తీసుకోవచ్చు.

భుజంగాలు, తురంగాలు, మాతంగాలు, విహంగాలు, తరంగాలు, మృదంగాలు అనే సరూప శబ్దాలు ఒకక్రమంలో తేవడం కేవల శబ్దక్రీడగానే పైకి కనిపించినా ఆలోచించిచూస్తే లోతైన భావన గోచరిస్తుంది. భుజంగాలు పాకుతాయి! తురంగాలు పరుగెడతాయి! మాతంగాలు నడుస్తాయి! విహంగాలు ఎగురుతాయి! తరంగాలు లేస్తాయి! మృదంగాలు మోగుతాయి! స్విన్‌బర్న్ పాటలకు ఈ క్రియలన్నీ ఉన్నాయనీ వీటన్నింటిలోనూ ఒక ఐక్యధర్మం ఉందనీ ఈ ప్రాసక్రీడ అభివ్యక్తం చేస్తుంది.

మొదటిగీతంలో ప్రతిపదాదిని విషం-కదం-మదం అనే మూడుపదాలకు స్వరప్రాసరావడం, మదంపట్టిన మాతంగాలో అనే పాదంలోనూ షెల్లీకవనపుహల్లీసకమూ అనే పాదంలోనూ మిశ్రగతినుంచి చతురస్రగతిలోకి మారడం; విషంక్రక్కే భుజంగాలో/కదంత్రొక్కే తురంగాలో

13 The Sacred Wood.
14 A. C. Swinburne: A Critical Study.

అనే రెండుపాదాలలో అక్షణగణసాదృశ్యం ఉండటం; కరగిపోతిని కలసిపోతిని/కానరాకే కదలి పోతిని అనే పాదాల్లో ప్రతిపదాదియతి కూర్చడం; పోతిని అనే క్రియను త్రిరావృత్తం చేయడం; నీగళ గళన్మంగళ-కాహళహళాహళిలో అనే పాదాలలో ముక్తపదగ్రస్తం కూర్చడం వంటివి ఛందస్సును మించిన అందాలకు నిదర్శనాలు.

## శ్రీశ్రీ పదౌచిత్యశిల్పం

ఒకపదానికి పర్యాయపదాలెన్నో ఉన్నా వాటిలో ఏ మాట సందర్భానికి వెలుగునిస్తుందో దాన్ని ఎంచుకోవడం శ్రీశ్రీ పదౌచిత్యానికి పరాకాష్ఠ.

వలయవిచలద్విహంగాలో
విలయసాగరతరంగాలో
యుద్ధగుంజన్మృదంగాలో

అన్నమూడుపాదాల్లోని చివరిపాదంలో సమరగుంజన్మృదంగాలో అంటే ఇంకా లయ పెరిగేదే కానీ ఇక్కడే శ్రీశ్రీ ఎంపిక భాసిస్తుంది! ఇక్కడ సందర్భానికి కావలసినది మహాప్రాణద్విత్వాక్షరం. ఆ అక్షరం యుద్ధానికి వ్యంజకం. అగ్నికిరీటపుధగధగలు (అనలకిరీటపుధగధగలు) - అనలవేదిక ముందు (అగ్నివేదికముందు) - భువనభవనపుబావుటాలై (భువనభవనపుపతాకాలై) - పుడమి తల్లికి పురుటినొప్పులు కొత్తసృష్టిని (నూత్నసృష్టిని/నవ్యసృష్టిని) - అరణ్యమున హరీంద్రగర్జన (అడవిలోపల సింహగర్జన)-ఘూకంకేకా భేకంబాకా (గూబకేకా కప్పబాకా) - సర్పపరిష్వంగం (భుజగపరిష్వంగం) - వంటివి మారిస్తే కవిత్వగమనం ఏమయిపోతుంది ?

## శ్రీశ్రీ వాడిన అన్యదేశ్యపదాలు

తాను ఒక ఆంగ్లకవిని స్తుతిస్తున్నాడు కనుక కొన్ని ఆంగ్లపదాలను ప్రయోగించాడు. ఇలా ఆరంభమైన ఈ అన్యదేశ్యపదప్రయోగం తక్కినఖండికలలోకికూడా సందర్భోచితంగా ప్రవేశించింది. తెలుగుభాష సంపన్నంకావడానికీ అంతర్జాతీయతాగుణాన్ని అందుకోవడానికీ శ్రీశ్రీ మొదలుపెట్టినపద్ధతి ఇది ! రివల్యూషన్, ఫ్రెంచి, షెల్లీ, స్విన్‌బర్న్ వంటివే కాక మహాప్రస్థాన గీతాలలో నయాగరా, రాక్సీ, నార్మాషేరర్, బ్రాడ్వే, జెంఘిజ్‌ఖాన్, తామర్లేన్, నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ, సికందర్, వైకింగ్, సిథియన్, పిండారీ, థగ్, చీనా, రిక్షావాలా, చెక్, ఐర్లాండ్, కళాసీ, హాటెన్‌టాట్, జూలూ, నీగ్రో, తారీఖు, దస్తావేజు, మతలబు, కైఫీయత్, నైల్, తాజమహల్, క్రో-మాన్యాన్, ఆసియా, అమెరికా, యూరప్, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, జీసస్, ఖైదీ, బేబీ, రష్యా, పుష్కిన్, గొగోల్, షెకోవ్, టాల్‌స్టాయ్, డాస్టాయెవస్కీ, గోర్కీ, కూప్రిన్, ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్, యునైటెడ్‌సోవియట్‌సోషలిస్టు, రేడియో, ఫిరంగి, టార్పిడో, టోర్నాడో, ఆఫీసు వంటివి-తెలుగుకవిత్వంలోకి ప్రవేశించాయి. భావకవిత్వంలో ఇలాంటివి ప్రవేశించకపోవడానికి కాల్పనికత, శ్రీశ్రీ కవిత్వంలో ఇలాంటివి చేరడానికి వాస్తవికత హేతువులు.

## 71/అద్వైతం

### ప్రపంచమును పరిహాసిస్తాం! భవిష్యమును పరిపాలిస్తాం!

1936

11వ శతాబ్దినుంచి 19వ శతాబ్ది అంతందాకా తెలుగుకవిత్వాన్ని విస్తృతంగా ప్రభావితం చేసినది సంస్కృతకవిత్వమే! 20వ శతాబ్ది ఆదినుంచీ ఆ స్థానాన్ని ఆంగ్లకవిత్వం ఆక్రమించింది. తెలుగుకవితారంగంపై బూర్జువావ్యవస్థ ప్రభావానికి ఇది మారురూపమే!

తొలిదశలో ఆంగ్లకావ్యాలను తెలిగించినవారుగా వీరేశలింగంగారినీ రాయప్రోలువారినీ పేర్కొనవచ్చు. బూర్జువారొమాంటిక్‌కవులను అనుసరిస్తూ, (అనువదిస్తూకాదు) అనురణిస్తూ తెలుగులో భావకవులు తలెత్తారు. ఆంగ్లరొమాంటిసిజంకు అనుసృజనం కృష్ణశాస్త్రిలో పురివిప్పుకుంది.

ఆంగ్లరొమాంటిసిజం అది అక్కడ పుట్టిన నూరేళ్ళ తరవాత తెలుగులోకి ప్రవేశించింది. ఉదాహరణకు- షెల్లీ రచనలు 1816 ప్రాంతానివి. కృష్ణశాస్త్రి రచనలు 1920 ప్రాంతానివి. షెల్లీ 1792 లో జనించాడు. కృష్ణశాస్త్రి 1897 లో జనించాడు.

1825 నాటికే బ్రిటన్‌లో రొమాంటిసిజం అస్తమించింది. తరువాత విక్టోరియన్‌కవులు (టెన్నిసన్, బ్రౌనింగ్, ఆర్నాల్డ్, స్విన్‌బర్న్, రోజెట్టీ మొదలైనవారు) తలెత్తారు. వీరియుగం 1900 దాకా సాగింది. శ్రీశ్రీపై ఆంగ్లకవిత్వప్రభావం విక్టోరియన్‌కవులతోనే ఆరంభమయింది. విక్టోరియన్‌యుగకవుల ప్రభావం తెలుగులోకి 70 ఏళ్ళలోనే ప్రవేశించింది. ఉదాహరణకు- స్విన్‌బర్న్ 1837 లో పుట్టాడు. శ్రీశ్రీ 1910 లో పుట్టాడు. స్విన్‌బర్న్‌రచనలు 1865 నాటివి. శ్రీశ్రీ రచనలు 1935 నాటివి.

1928 లోనే శ్రీశ్రీ టెన్నిసన్ కృతిని అనువదించాడు. 1935 నాటికే స్విన్‌బర్న్‌ను గురువుగా స్వీకరించాడు. 1825 తర్వాతనుంచీ ఆంగ్లకవిత్వంలో వస్తున్న మార్పులన్నీ శ్రీశ్రీ ద్వారా తెలుగుభాషకు చుంబితమవుతూ వచ్చాయి. ఆంగ్లంద్వారా ఇతరవిదేశీయభాషల ఆధునిక కవిత్వాలను కూడా శ్రీశ్రీ స్పృశించాడు. ప్రస్తుతం అది అప్రస్తుతం.

తెలుగుకవిత్వంమీద ఆంగ్లకవిత్వప్రభావాన్ని అతివిస్తృతంగా తీసుకుని వచ్చినవాడు శ్రీశ్రీయే! ఈ కార్యక్రమాన్ని శ్రీశ్రీ నిర్వహించిన తీరులు అనేకం! అనువాదం, అనుసరణం, అనుకరణం, అనురణనం, అనుసృజనం అనే ప్రక్రియలు వాటిలో ముఖ్యమైనవి.

స్విన్‌బర్న్ కవితాశిల్పానికి శ్రీశ్రీది అనుసరణమే ! అంతేకాక, ఆ కవి రాసిన ఒక ఖండిక నైనా తెలుగువారికి పరిచయం చేయాలనే తలంపు శ్రీశ్రీకి కలిగింది. అయితే అనువదించడం ఇష్టంకాలేదు. స్విన్‌బర్న్ శిల్పానికి కొన్ని ముఖ్యలక్షణాలున్నాయి. అవి ఫెలీకవనపుహాల్లీసకం, ఫ్రెంచిగీతుల మంచిరీతులు, మోహినీగంధర్వగానం వంటివి. ఇవి ప్రతిబింబించే ఖండిక A match అనేది. దానిలోని మార్గాన్ని శ్రీశ్రీ అనుసరిస్తూ రచించిన ఖండిక "అద్వైతం".

'A match'లోని స్విన్‌బర్న్ దృక్పథానికీ 'అద్వైతం'లోని శ్రీశ్రీ దృక్పథానికీ కొంత భేదం ఉంది. ఈ భేదంలోనే శ్రీశ్రీ వస్తుమౌలికత స్ఫురిస్తుంది. సంవిధానంలోనే స్విన్‌బర్న్‌కు శ్రీశ్రీ ఋణపడ్డాడు. అందుకే కృతజ్ఞతలు తెల్పుకున్నాడు.

## స్విన్‌బర్న్‌మార్గానికి శ్రీశ్రీ అనుసరణం

'A match'లో ఒక ప్రణయపిపాసి ఆశావాదం కనిపిస్తుంది. స్విన్‌బర్న్ రసభావాలూ ఊహాలూ పదసంగీతమూ పనితనమూ ఎంతఉదాత్తమయినవో తెలుసుకునేందుకు ఆ గేయాన్నే ఒకమారు చదువుకుందాం.

If love were what the rose is
    And I were like the leaf
Our lives would grow together
In sad or singing weather
Blown fields or flowerful closes
    Green pleasure or gray grief ;
If love were what the rose is
    And I were like the leaf.

If I were what the words are
    And love were like the tune
With double sound and single
Delight our lips would mingle
With kisses glad as birds are
    That get sweet rain at noon
If I were what the words are
    And love were like the tune.

If you were April's lady
    And I were lord in May
We'd throw with leaves for hours
And draw for days with flowers
Till day like night were shady
    And night were bright like day
If you were April' lady
    And I were lord in May.

If you were Queen of pleasure
    And I were King of pain
We'd hunt down love together
Pluck out his flying feather
And teach his feet a measure
    And find his mouth a rein
If you were Queen of pleasure
    And I were King of pain.[1]

ఈ గేయమార్గాన్ని శ్రీశ్రీ అద్వైతంలో అనుసరించింది మక్కికిమక్కిగా కాదు. స్విన్‌బర్న్ గేయంలో 4 గీతాలకూ దేనివల్లవి దానిదే మొదటా చివరా ఆవృత్తమయ్యాయి. ఉదాహరణకు If love were what the rose is / And I were like the leaf అన్నది తొలిగీతపుపల్లవి. ఇదే ఆ గీతపు చివర మళ్ళీ వస్తుంది. రెండు, మూడు, నాలుగు గీతాల పల్లవులు వేరు. శ్రీశ్రీ గేయంలో

1 The Golden Treasury 396 P.

ఇలాంటి ఆవృత్తి లేదు. కాని ఆ గేయం ఆనందం అర్ణవమైతే అనురాగం అంబరమైతే అనురాగపుటంచులు చూస్తాం ఆనందపులోతులు తీస్తాం అనే నాలుగుపాదాలతో ఆరంభమై ఇందులోని మొదటి రెండుపాదాలూ చివరిగీతంలోకి ఆవృత్తమవుతాయి. అసలు చివరిగీతమంతా ముందుగీతాలలోని పాదాలకూర్పుతోనే కొత్తగీతంగా అవతరిస్తుంది. ఈ సంవిధానం స్విన్‌బర్న్‌ది కానేకాదు; దీనికి ప్రేరకుడు బాద్లెయిర్.

స్విన్‌బర్న్ గేయంలో చివరి రెండుగీతాలలోమాత్రమే "we'd throw with leaves for hours......we'd hunt down love together" అంటూ ప్రియుడు ప్రియురాలితో తన కాంక్షను వెల్లడిస్తాడు. శ్రీ శ్రీ గేయంలో ప్రతి గీతం చివరలోనూ ప్రేయసీప్రియులిద్దరూ అనురాగపుటంచులు చూస్తాం! ఆనందపులోతులుతీస్తాం! మరణానికి ప్రాణంపోస్తాం! స్వర్గానికి నిచ్చెనవేస్తాం! ప్రపంచమును పరిహసిస్తాం! భవిష్యమును పరిపాలిస్తాం! కాలానికి కళ్ళెంవేస్తాం! ప్రేమానికి గొళ్ళెంతీస్తాం! అంటూ అనేక కాంక్షలను వెల్లడిస్తూ నూతనజీవితానికీ మరోప్రపంచానికీ అర్రులు చాస్తారు.

స్విన్‌బర్న్ గేయంలోని sad weather, singing weather, blown fields, flowerful closes, green pleasure, gray grief, double sound, single delight, sweet rain, queen of pleasure, king of pain, flying feather వంటి పదచిత్రాలు శ్రీశ్రీ ఊహాలకు బాగా దోహదంచేశాయి. అనురాగపుటంచులు, ఆనందపులోతులు, కంకణనిక్వాణం, జీవననిర్వాణం, మదిలోఢోలలు, హృదిలోజ్వాలలు, తలపునరేకులు, వలపునబాకులు, మరణానికిప్రాణం, స్వర్గానికినిచ్చెన, హసనానికిరాణి, వ్యసనానికిబానిస, విషమించినఖేదం, కుసుమించినమోదం, విషవాయువులు, విరితేనియలు. వాసంతసమీరం, హేమంతతుషారం, జీవవిహంగం, మరణమృదంగం, చిగురించినతోటలు, చితులుంచినచోటులు, కాలానికికళ్ళెం, ప్రేమానికిగొళ్ళెం, మోవికికావి, భావికిదేవి వంటివి శ్రీశ్రీ కలంనుంచి అవతరించాయి. మార్గదర్శిని మించగలగడం శ్రీశ్రీ అపూర్వప్రతిభకు నిదర్శనం. మార్గదర్శికి కృతజ్ఞత తెల్పుకోవడం శ్రీశ్రీ ఋజుత్వానికి నిదర్శనమాత్రమే కాదు; తాను మార్గదర్శికి అప్రతిష్ఠ తేలేదనీ అంధానుకరణం చేయలేదనీ చెప్పుకోవడంకూడా.

## శ్రీశ్రీ అద్వైతభావన

A Match ని అనుసరిస్తూ రాసిన గేయానికి అద్వైతం అని పేరుపెట్టినా ఇదేమీ వేదాంతంమాత్రంకాదు. ఆదిశంకరుల 'అద్వైతం' అనే పరిభాష జీవాత్మపరమాత్మల తాదాత్మ్యానికి సంబంధించింది. మహాప్రస్థానపుశ్రీశ్రీ భౌతికవాదియేకానీ ఆధ్యాత్మికవాది కాడుకనుక వేదాంతపు జోలికే పోనక్కరలేదు మనం; కానీ వేదాంతపుపరిభాషలనే నూతనార్థంలో వాడుకోవడం శ్రీశ్రీ అలవాటుకనుక ఆలాంటిపదాలను అర్థంచేసుకోవడంలో జాగ్రత్తవహించక తప్పదు. ఏ భౌతిక

భేదాలనూ అంగీకరింపని సామ్యవాది కనుకనే శ్రీశ్రీ అద్వైతం అనేపదంమీద అంతమోజుపడ్డాడు. శ్రీశ్రీ దృష్టిలో సామ్యవాదమే అద్వైతం! ఈ అద్వైతాన్ని భిన్నవిషయాలన్నింటిలోనూ శ్రీశ్రీ కాంక్షిస్తాడు. కాల్పనికత, వాస్తవికత రెండూ భిన్నమైనవే. రెండూ కలిసిపోతే అద్వైతం. శబ్దం, అర్థం రెండూ కలగలిసిపోవడం అద్వైతం. కవిత్వసంగీతాలు, ప్రకృతిపురుషులు, సుఖదుఃఖాలు, ప్రేయసీప్రియులు - అన్నీ కలిసిపోవలసినవే! ఈ భావనే ధనిక దరిద్రభేదాల నిర్మూలనంలో ప్రముఖంగా కనిపించేది. గతితర్కం చెప్పేది రెండు విరుద్ధవస్తువుల సమైక్యాన్నే. వర్గసంఘర్షణద్వారా సామ్యవాదం రావడం అద్వైతమే!

'అద్వైతం' గేయంలోని ప్రేయసీప్రియులు ప్రపంచం మిథ్య అనుకునే 'అద్వైతులు' కారు. ప్రపంచం వాస్తవం అని గ్రహించి దాని అవకతవకలను పరిహసిస్తారు; కాలానికి కళ్ళెం వేస్తారు; ప్రేమానికిగోళ్ళెంతీస్తారు; మరణానికి ప్రాణంపోస్తారు; అనురాగపుటంచులు చూస్తారు; ఆనందపులోతులు తీస్తారు; స్వర్గానికి నిచ్చెన వేస్తారు; భవిష్యమును పరిపాలిస్తారు. ఈ ప్రతిజ్ఞలు చేసే ప్రేయసీప్రియులు కార్యాచరణకు ముందుకు దూకడమే అద్వైతంగేయంలో ధ్వని. అద్వైతంలోని ప్రేయసీప్రియులు నిజానికి భిన్నధర్మాలు గలవారే. అతని హృదయం జ్వాలామయం-ఆమె హృదయం డోలామయం. ఆమె హాసన్ముఖి అయితే అతడు వ్యసనపరుడు. అతడిది ఖేదం - ఆమెది మోదం. అతడు హేమంతతుషారం అయితే ఆమె వాసంతసమీరం. ఆమె జీవం అయితే అతడు మరణం. కానీ వీరిద్దరూ కలిసిపోతారు. భావకవి అతనిప్రేయసీవలె ఒకరు నేలమీదా ఒకరు ఆకాశంలోనూ ఉండిపోరు. అతడు ఆమె మోవికి కావిగా మారిపోతాడు. ఆమె అతని బావికి దేవిగా మారిపోతుంది. వారిద్దరూ కలిసే అనురాగపుటంచులు చూస్తారు; ఆనందపులోతులు తీస్తారు. ఇదే వారు సాధించే ప్రణయాద్వైతం.

వేదాంతపరిభాషప్రకారం అద్వైతం అంటే జీవాత్మపరమాత్మల ఐక్యంవల్ల లభించే భవబంధవిముక్తియే. శ్రీశ్రీ అద్వైతం జననమరణచక్రంనుంచి విడివడే మోక్షంకాక ధనస్వామ్యపీడనుంచి విడివడే సామాజికకష్టమోక్షంమాత్రమే!

"సుఖదుఃఖాదికద్వంద్వాతీతం అమోఘమగాధమచింత్యమమేయం ఏకాంతం వీక్షైకం క్షణికమై శాశ్వతమైన దివ్యానుభవం బ్రహ్మానుభవం" కవిత్వంవల్లనే కలుగుతుందని శ్రీశ్రీ నమ్మకం. అది భవమోక్షంవల్ల కలుగుతుందని భౌతికవాదిఅయిన శ్రీశ్రీ అనుకోలేదు!

'అద్వైతం' గేయంలోని దంపతులు ఈ ప్రపంచాన్ని పరిహసించి మరోప్రపంచానికి ప్రయాణంసాగించాలని తహతహపడేవారే. మరోప్రపంచానికి పదండి పోదాం అని పిలుపు నిచ్చిన శ్రీశ్రీ ఈదంపతుల మహాప్రస్థానవాంఛను వెల్లడించాడు. ప్రతిగీతంలోనూ ఈదంపతులు ఐతే, చూస్తాం అనేపద్ధతిలో ఇలా జరిగితే అలా చేయగలం అనేభావాన్ని వ్యక్తపరిచారు. ఈ

మాటలు ప్రస్తుతం ఆ ప్రేయసీప్రియుల జీవితంలోని ఆనందానురాగాల అసంపూర్ణతనీ భవిష్యత్తులో వారు కాంక్షించే సమగ్రతనీ వ్యాఖ్యానిస్తున్నాయి. ఇప్పుడింకా వారి ఆనందం అర్ణవం కాలేదు; అనురాగం అంబరం కాలేదు. రాబోయే సమాజవ్యవస్థలో ఆనందానురాగాలు విస్తృతంగా లభిస్తాయని వారి ఆశ.

మరణానికి ప్రాణం పోయడంకానీ స్వర్గానికి (ఆకాశానికి) నిచ్చెనవేయడంకానీ శాస్త్రప్రయోగాలద్వారా మానవుడెప్పటికైనా సాధిస్తాడు. ఈ రెండుఅద్భుతాలను తాము సాధించగలమని ఈ దంపతులు నమ్ముతున్నారు. అయితే అందుకు దోహదంచేసే మరోప్రపంచం కావాలి వారికి ముందు. ప్రస్తుతప్రపంచంలో కంకణనిక్వాణం, జీవననిర్వాణం, మదిలో డోలలు, హృదిలో జ్వాలలు, తలపున రేకులు, వలపున బాకులు లేవు. అవన్నీ ఈ దంపతులకు సామ్యవాదంలో గానీ లభించవు. అవి లభిస్తే వీరు చచ్చినవాణ్ని బ్రతికిస్తారు; స్వర్గసుఖాలను సజీవంగానే అందుకుంటారు.

మరోప్రపంచం ఏర్పడినప్పుడు పాతప్రపంచాన్ని వేళాకోళంచేయడం, భవిష్యత్తును తీర్చిదిద్దుకోవడం సాధ్యమవుతాయి. కానీ ఈ రెండుపనులూ చేయడానికి కొన్ని మార్పులు జరగాలి. ఆమె హాసనానికి రాణి కావాలి. అతడప్పుడు వ్యసనానికి బానిస అవుతాడు. ఈ దాస్యంవల్ల అతని ఖేదం విషమిస్తుంది. అప్పుడామె మోదం కుసుమిస్తుంది. అప్పుడతని ఖేదం విషవాయువులై ప్రసరిస్తుంది. అప్పుడామె మోదం విరితేనియలై ప్రవహిస్తుంది. ప్రస్తుతప్రపంచంలో కులమతవైషమ్యాలు, వర్గభేదాలు వారిప్రణయానికి అవాంతరాలవుతూండగా వారు తిరుగుబాటుచేసి ప్రపంచాన్ని పరిహాసిస్తారు; గతాన్ని తిరస్కరించి భవిష్యత్తును పరిపాలిస్తారు. ఈ భవిష్యత్తే వారు కలలుకంటున్న మరోప్రపంచం.

అతివేగంగా సాగిపోయేకాలాన్ని మానవుడింతవరకూ అదుపులో పెట్టలేదు. కాలానికే కళ్లెంవేయగలిగితే ముసలితనం, మృత్యువు కూడా ఆగిపోతాయి. ఈ భౌతికవిజయాన్ని మానవుడు సాధించగలడని భౌతికవాదులు నమ్ముతున్నారు. ప్రేమకు సరిహద్దులనూ, మునుగులనూ తొలగించినప్పుడే అంతర్జాతీయ సౌభ్రాత్రంసిద్ధిస్తుంది. ఈ రెండు కార్యాలూ మరోప్రపంచంలో సాధ్యమవుతాయి. కాలానికి కళ్ళెంవేస్తాం! ప్రేమానికి గొళ్ళెంతీస్తాం! అని ఈ దంపతులుచేసిన ప్రతిజ్ఞకు అనుకూలించవలసిన పరిస్థితులు కొన్నిఉన్నాయి. వాసంతసమీరం, హేమంతతుషారం ఏకమైపోవాలి. ఇవి రెండూ భిన్నఋతుధర్మాలు. మొదటిది శీతత్వసౌరభాదులతోనిండి ఉండేది; రెండోది సస్యసమృద్ధితో కూడినది. ఆమె ఎగిరిన జీవవిహంగం చిగురించిన తోటలలో వలయుములై చలించినప్పుడూ అతని పగిలిన మరణమృదంగం చితులుంచిన చోటులలో విలయములై జ్వలించినప్పుడూ వాసంతసమీరమూ హేమంతతుషారమూ ఏకమైపోతాయి. అప్పుడేవారు కాలానికి కళ్ళెం వేయగలుగుతారు; ప్రేమానికి గొళ్ళెం తీయగలుగుతారు.

ఇద్దరూ కలిసి మరోప్రపంచాన్ని పరిపాలించడానికీ ప్రపంచాన్ని పరిహసించడానికీ ముందు ఆమె పెదవికి అతడు ఎర్రనిరంగుగానూ అతని భావికి ఆమె రాణిగానూ మారిపోవాలని వారి ఆకాంక్ష. ఇదే భౌతికమైన అద్వైతం. ఆనందం అర్ణవమైతే, అనురాగం అంబరమైతే వారిద్దరూ చేయగలిగింది అనురాగపుటంచులు చూడగల్గడం – ఆనందపులోతులు తీయగల్గడం. ఈ పనులు రెండూ పీడకపీడితవర్గాలున్న సమాజవ్యవస్థలో గగనకుసుమాలే! సంపూర్ణకాల్పనికభావన సామ్యవాదంలోనే సాధ్యమవుతుంది. విషమసమాజంలోని కాల్పనికభావన అవాస్తవికమైనదై భ్రాంతిగా మిగిలిపోతుంది.

ఆమె సామ్యవాదానికి ప్రతీకగానూ అతడొక సామాన్యుడుగానూ ఈ గేయంలో కొన్ని చోట్ల స్ఫురిస్తారు. సామ్యవాదప్రియురాలికోసం సామాన్యుడి ప్రణయగీతమే అద్వైతం.

### శ్రీశ్రీ క్రమభంగ సంవిధానం

"From eyes and tresses flowers and tears / From heart and spirit hopes and fears" అనే పాదాల్లో స్విన్‌బర్న్ చేసినక్రమభంగం ఒకఅలంకారంఅని గమనించలేక ఎవరో ఆక్షేపిస్తే శ్రీశ్రీ 1935 మే-జూన్ ఉదయినిలో సమాధానంరాస్తూ "Swinburne ప్రాసకోసం కక్కుర్తిపడినట్లు తేల్చారు. తమజ్ఞానంపై తగనినమ్మకం మరొక వంకకు ఆలోచన పోనియ్యదు కాబోలు. అయినా మరోదేశపుకవిని కొలవడానికి మనం తెలుసుకోవలసిన మరేవో కొలబద్దలుంటే ఉండవచ్చుననైనా తోచకూడదా ఆయనకు ? లేక సిద్ధంగా తమ దగ్గర ఉన్నవాట్లతో (వీటిమంచిచెడ్డలతో ఇక్కడ ప్రసక్తిలేదు) కొలిచివెయ్యడమేనా ? ఎందుకింత తొందరపడ్డారు చెప్మా...... Tears - fears ప్రాసకక్కుర్తి కాదండీ. వ్యతిక్రమాన్ని కూడా ఒప్పుకునే అలంకారం ఒకటి పాశ్చాత్యుల్లో ఉందండీ. కావలిస్తే ఆ సంప్రదాయం మీకు నచ్చలేదనండికాని (తెలిస్తే మీరలాగనరు కాని)" అంటూ మందలించాడు. ఈ వ్యతిక్రమాన్ని శ్రీశ్రీ స్విన్‌బర్న్‌నుంచి అందుకుని మహాప్రస్థానంలో సందర్భోచితంగా కొన్నిచోట్ల ప్రయోగించాడు. ఒక విజాతీయసంప్రదాయాన్ని జాతీయం చేసుకోవాలనే ఉదారభావం శ్రీశ్రీది. అద్వైతం గేయంలోనే ఈ వ్యతిక్రమాలంకారం భిన్నరూపాలతో కనిపిస్తుంది.

(1) ఆనందసముద్రపులోతులుతీయడం, అనురాగాకాశపుఅంచులుచూడటం దంపతుల ఆశయం. ఈ ఆశయాన్ని ఆచరణలోకి మార్చుకోవడంలో వారు పొందుతున్న తహతహను శ్రీశ్రీ వ్యతిక్రమ సంవిధానంతో వ్యక్తంచేయించాడు. ఆనందానురాగాలక్రమాన్ని అనురాగానందాలక్రమంగా మార్చడం వ్యతిక్రమమే. ఆనందార్ణవంలోంచి వారు ఆనందపులోతులు కాక అనురాగపుటంచులను చూస్తారట! అనురాగాంబరంనుంచి అనురాగపుటంచులనుకాక ఆనందపులోతులను తీస్తారట! ఆకాశపుటంచులకు ఎగురుతూ సముద్రపులోతులకు ఈదుతూ రెండుభిన్నమైనలక్ష్యాలను ఒకటిగా మారుస్తారు ఆదంపతులు.

క్రమం
ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే
ఆనందపులోతులుతీస్తాం
అనురాగపుటంచులుచూస్తాం

వ్యతిక్రమం
ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే
అనురాగపుటంచులుచూస్తాం
ఆనందపులోతులుతీస్తాం

(2) హసనానికి రాణివి నీవై వ్యసనానికి బానిస నేనై అని నీ-నా క్రమంలో (యుష్మదస్మత్ క్రమం) చెబుతూనే దాన్ని చటుక్కున తలక్రిందుచేసి విషమించినమదీయఖేదం కుసుమించిన త్వదీయమోదం విషవాయువులై ప్రసరిస్తే విరితేనియలై ప్రవహిస్తే అంటూ క్రమభంగంచేశాడు. అంటే నా-నీ క్రమం పెట్టాడు. ఈ క్రమభంగం హఠాత్తుగా కలిగిన విషమపరిస్థితినీ ఖేదాన్నీ వ్యక్తంచేయడానికి సాధనం అయింది.

## పాతపదాలకు శ్రీశ్రీ నవ్యార్థకల్పనలు

పాతపదాలను నూతనార్థచ్ఛాయల్లోనూ నూతనవాతావరణంలోనూ శ్రీశ్రీ ప్రయోగించ గలడు. సామాన్యపదాలు అనల్పార్థాలను సృజిస్తాయి శ్రీశ్రీ ప్రయోగబలంచేత. కంకణనిక్వాణం నాట్యసంగీతాలను ద్యోతకంచేసే పదబంధం. నిర్వాణం అనే పదానికి ముక్తి, నాశం, సుఖం అని నిఘంటువులోని అర్థాలు. కానీ జీవననిర్వాణం రససిద్ధిని ద్యోతకంచేస్తోంది. మదిలో డోలలు తూగీ అన్నప్పుడు డోలలు ఊయాలలుగాక ఉత్సాహాలు, వాంఛలు, ఆనందాలు, కుతూహలాలు అయ్యాయి. హృదిలోజ్వాలలురేగీ అన్నప్పుడు జ్వాలలు మంటలుగాక ఉద్రేకాలు, కోరికలు అవుతున్నాయి. మదిలోడోలలు వసంతాన్నీ హృదిలోజ్వాలలు గ్రీష్మాన్నీ సూచిస్తున్నాయి. ఈభావనే తరువాతిపాదాల్లో వికసించి తలపున రేకులు పూయడంగా వలపున బాకులు దూయడంగా మారింది. రేకులుపూయడం శృంగారం. బాకులుదూయడం వీరం. మొదటిది స్త్రీస్వభావం. రెండవది పురుషస్వభావం. కాలానికి కళ్ళెం అన్నప్పుడు కాలంగుర్రంతో పోల్చబడింది. ప్రేమానికి గోళ్ళెం అన్నప్పుడు ప్రేమ భవనంగా మారుతోంది. చితులుంచిన చోటులు చలిమంటలు, శ్మశానాలు అవుతున్నాయి. పదప్రపంచాన్నీ వస్తుప్రపంచాన్నీ జతచేయడంలో ఘటికుడని స్విన్‌బర్న్‌ను గురించి ఇలియట్ అభిప్రాయం. అదే శ్రీశ్రీకీ వర్తిస్తుంది. "The bad poet dwells partly in a world of objects and partly in a world of words and he never can get them fit. Only a man of genius could dwell so exclusively and consistently among words as Swinburne. His language is not like the language of bad poetry, dead. It is very much alive with this singular life of its own".[2]

## శ్రీశ్రీ శాబ్దికసాదృశ్యం-ఆర్థికవైషమ్యం

శాబ్దికమైన సాదృశ్యాన్నీ ఆర్థికమైన వైషమ్యాన్నీ శ్రీశ్రీ తన పనితనంలో చూపిస్తాడు. వాసంతసమీరం× హేమంతతుషారం; ఎగిరినజీవవిహంగం× పగిలినమరణమృదంగం: చిగురించిన

2 The Sacred Wood.

తోటలు×చిగురించినచోటులు; వలయాలై చలించడం×విలయాలై జ్వలించడం- ఇది చాలా చోట్ల వ్యతిరేకపదాలమీద ఆధారపడి ఉంటుంది. స్వర్గ×నరకాలు, తెలి×నలితలుపులు, సర్గ×విలయాలు, హేమంతి×వసంతాలు, ధ్వాంత×కాంతులు, చావు×పుట్టుకలు, అవతల×ఇవతల, అర్ణవం×అంబరం, అంచులు×లోతులు, ఖేదం×మోదం, విషవాయువు×విరితేనియ, సమీర×తుషారాలు, చిగురించిన×చితులుంచిన వంటివి-వీటిలో శాబ్దికసాదృశ్యం క్వాచిత్కం.

## బాదిలేయిర్ మార్గంలో శ్రీశ్రీ

అద్వైతంలోని ఆఖరిగీతంలో మొదటి రెండుపాదాలనే కొత్తగాకూర్చి తరువాతి రెండు పాదాలూ రెండోగీతంలోనుంచీ, తరువాతి రెండుపాదాలూ మొదటిగీతంలోనుంచీ ఆఖరి రెండు పాదాలూ మూడవగీతంలోనుంచీ ఎరువుతెచ్చుకుని పూర్తిచేశాడు. ఈ విచిత్రసంవిధానం ఫ్రెంచిగీతపు మంచిరీతి. Harmonie Du Soir[3] అనే ఫ్రెంచిగీతంలో బాద్లేయిర్ తొలిపద్యంలోని రెండవపాదాన్ని రెండవపద్యంలోని మొదటిపాదంగానూ, రెండవపద్యంలోని రెండవపాదాన్ని మూడవపద్యంలోని మొదటిపాదంగానూ, మూడవపద్యంలోని రెండవపాదాన్ని నాల్గవపద్యంలోని మొదటిపాదంగానూ కూర్చుకున్నాడు. ఈ ఖండికను అదే సంవిధానంతో శ్రీశ్రీ అనువదించి సంధ్యాసంగీతము అని పేరుపెట్టాడు కూడాను.4

## శ్రీశ్రీ అద్వైతం ఛందస్సు

'అద్వైతం' గేయంలో కొన్ని అక్షరగణచ్ఛందస్సులు కనిపించినా మొత్తంమీద ఈపాదాలన్నీ 14 మాత్రల పరిమాణం కలవే. ముత్యాలసరంలో పాదానికి 14 మాత్రలే. అది మిశ్రగతి (3+4+3+4). అద్వైతంలో మూడురకాల విరుపులున్నాయి. 6+8, 8+6; 5+9 మాత్రలుగా విరుగుతాయి. ఈ విరుపులే శ్రీశ్రీ గేయాల నడకకు కీలకమైనలక్షణం.

ఆనందం+అర్ణవమైతే 6+8
వాసంత+సమీరంనీవై 5+9
విషవాయువులై+ప్రసరిస్తే 8+6

సిందూరం+రక్తచందనం (6+8) హీనంగా+చూడకుదేన్నీ (6+8) ప్రపంచమొక+పద్మవ్యూహం (6+8), రాక్సీలో+నార్మాషేరర్ (6+8) నాగదిలోపల+చీకటిలో (8+6) ఏదేశ+చరిత్రచూచినా (5+9) నరజాతి+చరిత్రసమస్తం (5+9) చల్లారిన+సంసారాలూ (6+8) ఇతిహాసపు+చీకటికోణం (6+8) వంటివన్నీ 14 మాత్రల ప్రమాణంతో నిర్దిష్టవిరామాలతో వేగంగా నడిచే మాత్రాచ్ఛందస్సులే. 'దేశచరిత్రలు' లోని పాదాలు 5+4+5 మాత్రలుగా కూడా విరుగుతాయి.

---

3 Charles Chadwick : Symbolism,
4 శ్రీశ్రీ సా. రెండు కావ్య. 180-81 పే.

# వ్యర్థజీవిత యథార్థదృశ్యాలు

## 1937 కవితలు (1)

| | |
|---|---|
| అభ్యుదయం | వ్యత్యాసం |
| వాడు | మిథ్యావాది |
| ప్రతిజ్ఞ | చేదుపాట |

నిజంగా

ప్రపంచానికి కవిత్వమే కావలిస్తే

ఇంతకంటే అదును లేదు !

నీ సందేశంకోసం విశ్వం

తన చాతకవదనం తెరుచుకున్నది !........

నువ్వు రావాలి ! రావాలి !

ఆరోహణావరోహణాలతో

మంద్రంనుండి తారందాకా

ఉద్రేకఝంఝ, ఉత్సాహశంప ఉలుకెత్తించి

ఉగ్రూతలూగించి

జీవితాన్ని నక్షత్రగోళాల రాగమాలా ఆలాపనలతో

హోరెత్తించుతావో-

విశ్వప్రవాహంలో వ్రేగిపోతున్న కోటికోటిమానవుల

ఘోటుఘోటుమని కొట్టుకునే విహ్వాలత్వం

బాధలూ విభ్రమత్వం వ్యాధులూ

సకలవికలమనోఽవస్థలనూ Sublimate చేసి

స్ఫటికీకరణచేస్తావో ? నువ్వు ఎప్పుడువస్తావో ?

ఎలాగ వస్తావో ?

నువ్వు Cyclone లాగో

Sulphuric acid లాగో

గంధసింధురంలాగో

గండభేరుండంలాగో

రావోయ్ ! యువకవీ ! నవకవీ !

—శ్రీశ్రీ.

ఈనాడే జగమంతా బలివితర్ది! నరజాతికి పరివర్తన!

1937 ఏప్రిల్

పురాణేతిహాసాల్లో వర్ణించబడిన యుద్ధాలూ చరిత్రలో వివరించబడిన యుద్ధాలూ ఏదో ఒకదేశానికీ ప్రాంతానికీ సంబంధించినవికాగా 20వ శతాబ్ది ద్వితీయదశాబ్దిలో జరిగిన ఒక మహాసంగ్రామం (1914-18) మొత్తం మానవజాతికీ సకలప్రపంచానికీ సంబంధించింది మాత్రమేగాక, ఆధునిక మారణాయుధాలతో జరిగిన మొట్టమొదటి యుద్ధం! అందుకే ప్రపంచయుద్ధం అయింది. ఈ యుద్ధం మానవజాతికి అపారనష్టం కలిగించింది. ఇటువంటి సంగ్రామం తిరిగి ఆవృత్తం కాకూడదని దేశదేశాలమేధావులూ భావించారు. యుద్ధానంతరం మానవజాతి భవిష్యత్తును గురించి కవులు, కళాకారులు కలలు కన నారంభించారు. వసుధైవకుటుంబం అవతరించాలనుకున్నారు. వివిధదేశాలమధ్య వైరాలుపోయి, స్నేహాలు పెరగాలని కాంక్షించారు. ఆధునికమానవేతిహాసం ఆనాటినుంచే ఆరంభమయింది. అంతర్జాతీయమానవుడు ఆనాటినుంచే తలెత్తాడు. ఈ ప్రపంచసంగ్రామం అంతమైనదశలోనే రష్యాలో సామ్యవాదవిప్లవం (1917) వచ్చి, మానవజాతి సుఖశాంతిస్వేచ్ఛాసౌభాగ్యాలకు నూతనలక్ష్యాలను నిర్దేశించింది. అభ్యుదయభావాలు దేశదేశాలలో అలముకున్నాయి. ప్రపంచానికే ప్రళయం తెచ్చే యుద్ధాలు ఇకెప్పుడూ కాకూడదనీ మానవులంతా అన్నదమ్ములవలె మెలగాలనీ, కులవర్ణమతజాతిభేదాలు అంతరించాలనీ కవులు గానంచేయసాగారు. ప్రథమప్రపంచయుద్ధకాలంలోనే గురజాడ అప్పారావుగారు (1915) ఇలాంటి భావాలను తనకవితలలో ప్రబోధించారు. అంతర్జాతీయత గురజాడ దేశభక్తిగీతంలోనే తొంగిచూసింది. ప్రథమప్రపంచయుద్ధం ముగిసినతరవాత, పాశ్చాత్యదేశాలలో అనేక నూతన సాహిత్యోద్యమాలు తలెత్తినా, తెలుగుదేశంలో మాత్రం అప్పుడే రొమాంటిసిజం అడుగు పెట్టింది. భావకవితాయుగంలో కూడా అంతర్జాతీయస్పృహతోనూ సామాజికావేదనతోనూ కవిత్వంరాసిన దువ్వూరి రామిరెడ్డి అభ్యుదయకవిత్వానికి ఒకవెలుగురేఖ నందించాడు. మానవుడి భవిష్యత్తును గురించి కలలు కన్నాడాయన. 'భవిష్యద్దర్శనం'1 అనే ఒక ఖండికలో ఆ కలను వర్ణించాడు.

1 చూ వైతాళికులు

## రామిరెడ్డి : శ్రీశ్రీ

ఒకమామిడితోటలో పర్ణమండపంమీద జనరంజకంగా జరిగిన ఒకసభను కవి కలగన్నాడు. అందులో రారాజు క్రొంబచ్చరాగద్దెడిగ్గి అందరితోపాటే అవనిమీద కూర్చుంటాడు. రాజస్వామ్యం అస్తమించి ప్రజాస్వామ్యం మొదలయింది. యుద్ధాలు ముగిసిపోయాయి. బంటుసిపాయికి పనీపాటూ లేదు. అతనికత్తి తుప్పుపట్టిపోయింది. బుగదచిట్టలువడ్డపుట్టములతో కర్షకుడు రాజపరివారంలో వచ్చి కూర్చున్నాడు. కూలినాలియొనర్చి కుడుచునిరుపేదయైన కార్మికుడు యజమాని సరిబంతిలో కూర్చున్నాడు. సకలమానవజాతిసంతతులూ కులవర్ణభేదాలను పాటించడం మాని ఒకకడుపున పుట్టి ఒకచనుబాలు త్రాగినట్లుగా సోదరత్వంతో అన్యోన్యసాహాయ్యాన్ని అర్థిస్తున్నారు. స్ఫటికపాత్రలో శాంతిరసాన్నిపోసి ధర్మదేవత అందరికీ అందజేసింది. ఈ ప్రపంచం అంతా ఏకకుటుంబం అయిపోయింది. భూమిమీద స్వర్గం స్థాపించబడింది. "అభ్యుదయాంశువులన్నిమూలలను / నవనవోజ్జ్వల జీవనంపుదీపముల / వెలిగించుచుండె – నీ విశ్వమంతయును / మానవకల్యాణమందిరంబయ్యె!". ఈ ఖండికలో 'అభ్యుదయం' అనే శబ్దాన్ని లౌకికభౌతికాభివృద్ధి పరంగానే రామిరెడ్డి వాడారు. గతితార్కికభౌతికవాదంలో శ్రీశ్రీకున్నంతగా అవగాహన రామిరెడ్డిగారికి లేకపోయినా అప్పటికే రష్యాలో సామ్యవాదసమాజం అవతరించడం జరిగింది కనక అభ్యుదయం అంటే ఏమిటో అర్థమయింది. ఆస్తిహక్కు వదులుకుని రాజు, కర్షకుడు, యజమాని, కార్మికుడు అంతా ఒకస్థాయిలో కలసిమెలసి మనగలగడంలోనే అభ్యుదయం, నవజీవనం ఉందని రామిరెడ్డిగారి భావం. వర్గసంఘర్షణ, విప్లవం వంటివి జరగకుండానే మానవజాతిలో ఈ పరిణామం వస్తుందని రామిరెడ్డి తలపోశారు. శాంతియుతసహజీవనం వారి ఆశయం. ఇది వాస్తవికతకు విరుద్ధమే. ఇటువంటి స్వప్నాన్ని శ్రీశ్రీ నమ్మడు. కార్మికులూ, కర్షకులూ పీడితులూ కెరటాలవలె పొంగి తిరగబడుతున్నారనే శ్రీశ్రీ అంటాడు. త్రాచులవలెనూ రేచులవలెనూ ధనంజయునిలా సాగండని శ్రీశ్రీ హెచ్చరిస్తాడు. జగన్నాథరథచక్రప్రళయఘోషను భూమార్గంపట్టించి భూకంపం పుట్టిస్తానంటాడు. సంరంభం, సంక్షోభం, సమ్మర్దన, సంఘర్షణ కనిపిస్తాయి శ్రీశ్రీకి. గోడలను పగులగొట్టిస్తాడు. అలజడినీ, ఆందోళననీ, తిరుగుబాటునీ సమర్థిస్తాడు. కర్మాగారాలలో సమ్మె కడుతున్న కూలీలనూ వారిని బాధించే యజమానులనూ కవిత్వంలో చిత్రిస్తాడు. శ్రీశ్రీ చూసిన భవిష్యత్తు కార్మికస్వర్గం – మరోప్రపంచం. ఇది 'కలకనడం అంత' సులభం కాదు. దారి పొడుగునా గుండెనెత్తురులు సమర్పించవలసిందే! ఇంకిన క్రొన్నెత్తురు, మరణించిన యువయోధులు అభ్యుదయానికి అవశ్యకాలే. జగమంతా బలివితర్ది కాకతప్పదు. ఎందుకంటే చిరకాలంనుంచీ సంపదలను అనుభవిస్తున్నవర్గంవారు తమసంపదలను కాపాడుకోవడానికి యుద్ధాలను సృష్టిస్తారు కానీ తమంతతామై సామ్యవాదాన్ని అంగీకరించరు. రామిరెడ్డిగారి భవిష్యద్దర్శనంలో రాజు, యజమాని తమంతతామే దిగివచ్చినట్లు వ్రాయడం కేవలం ఊహామాత్రమే

## ఫాసిస్టులపై శ్రీశ్రీ కోపం

ప్రథమప్రపంచయుద్ధం 1918 లో అంతమైపోయినా దేశదేశాల్లో ఏదోఒక సంఘర్షణ, యుద్ధం, విప్లవం సాగుతూనే వచ్చాయి కానీ శాంతి నెలకొనలేదు. వీటన్నింటికీ పరపీడనపరాయణత్వం మూలకారణం. ఈ పరపీడన పెట్టుబడిదారీవ్యవస్థలో అధికం! ఈ పెట్టుబడిదారీవ్యవస్థయే ముదిరి సామ్రాజ్యవాదవ్యవస్థఅయింది. ఇందులోనుంచి పుట్టినదే ఫాసిజం. ప్రజలస్వాతంత్ర్యానికి ఇది బద్ధశత్రువు. విధ్వంసనం, నియంతృత్వం, హింస, పీడన, క్రౌర్యం, యుద్ధదాహం, అమానుష వర్తనం దీని లక్షణాలు. "Fascism is an overt terroristic dictatorship of the most reactionary, most chauvinistic and most imperialist elements of finance capital".[2] అభ్యుదయానికి - సామ్యవాదానికి - ఫాసిజంకన్నా అంతరాయం మరొకటిలేదు. మొదటిప్రపంచయుద్ధం ముగిసినతరువాత నాలుగేళ్ళకే (1922) ఇటలీలోనూ మరోపదేళ్ళకు (1933) జర్మనీలోనూ ఫాసిజం మొదలయింది. జాతీయసామ్యవాదం (National Socialism) అనే ముసుగుతో ఫాసిజం జర్మనీలో వెల్లడయింది. రెండవప్రపంచయుద్ధం (1939) రావడానికి ఫాసిజం హేతువయింది. 22-39 మధ్యజరిగిన అనేకరాజకీయయుద్ధాలలో ఫాసిజం పాత్రకనిపిస్తుంది. ఆలాంటి పోరాటాల్లో స్పెయిన్ ప్రజావిప్లవం ప్రధానంగా ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిందే. ఫాసిస్టుల ఉన్మాదం మానవజాతి స్వేచ్ఛను నాశనంచేయడానికీ ముఖ్యంగా కార్మికవర్గాన్ని బానిసలుగా మిగిల్చి సామ్రాజ్యవాదపు అవిచ్ఛిన్నపాలనను రక్షించడానికీ ఉద్దిష్టమయింది.

"The terrible threat of fascism to the peoples of the world lay in the fact that it meant the destruction of all democratic freedoms, all political and social gains that the working class had won in long years of struggle, and that it meant nothing but slavery, spiritual degradation, and cruel suffering under the yoke of tyrrany. Fascism stood for terror and unbridled reaction at home and wars of conquest and plunder abroad, all for the sake of enriching a handful of imperialists. A deadly danger hang over our civilization and indeed, all of mankind"[3] అంటూ సోవియట్‌దేశపు ప్రపంచ చరిత్రలో ఫాసిజంగురించి రాసినవాక్యాలనుబట్టి ఫాసిస్టుల కిరాతకమన స్తత్వం అర్థంఅవుతుంది. ఫాసిస్టుల కిరాతకచర్యలను గర్హించడం అభ్యుదయకవిత్వలక్ష్యాలలో ఒకటి. స్పెయిన్‌లో జరిగిన ఫాసిస్టుఅమానుషాలను మార్క్సిస్టుకవులు గర్హిస్తూ కవితలు రచించారు. శ్రీశ్రీ కూడా అభ్యుదయం అనే ఖండికలో ఫాసిస్టుదురాగతాలను చిత్రించాడు. ఏవోఏవేవోఏవేవోఘోషలు

---

2 A Dictionary of Philosophy

3 A Short History of the World 144 P.

వినబడుతున్నాయనీ గుండెలు విడిపోతున్నాయనీ ఫాసిస్టులహింసలను, ప్రజాజీవితంలోని మృత్యుభయాలను వ్యక్తం చేశాడు. ఎవరో ఎవరెవరో ఎవరెవరో తలవిరబోసుకు నగ్నంగా నర్తిస్తున్నారనీ భయోద్విగ్నంగా వర్తిస్తున్నారనీ అనాగరకమైన అరాజకమైన ఫాసిస్టులఉన్మాద చర్యలను తెల్పాడు.

ఎగిరే లోహశ్యేనాలూ, ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదాలూ ఫాసిస్టులవే. ఇరవై కోరల అరవై కొమ్ముల క్రూరఘోరకర్కోటకులూ కోరకికన్నా కొమ్ముకికన్నా గల కర్కాటక కర్కోటకులూ ఫాసిస్టులే. దారుణమారణదానవభాషలూ ఘోరవభైరవభీకరఘోషలూ ఘోషల భాషల ఘంటల మంటల కంటకకంఠపు గణగణలూ చిటికెల మెటికెల చిటపటలూ ఫాసిస్టుదురాగతాల ప్రతీకలే! దారుణద్వేషాగ్ని పెంచే దానవత్వం ఫాసిస్టులదే! బానిసల సంకెళ్ళను బిగించేది వారే! అగ్నివర్షాలు, రక్తపాతాలు, కుట్రలూ కుహకాలు, అసత్య ప్రచారాలూ, రాజకీయాలలో రంకువేషాలూ ఫాసిస్టుల చర్యలే! హింసనచణధ్వంసరచన, ధ్వంసనచణ హింసరచన చేసేది ఫాసిస్టులే! విషవాయువులు, మరఫిరంగులు, టార్పిడో, టోర్నాడో వారి ఆయుధాలు. మహాప్రస్థానంలో ఫాసిస్టుల భావస్వభావాలను శ్రీశ్రీ రేఖా మాత్రంగా చిత్రించాడు.

## స్పెయిన్ ప్రజావిప్లవంపై శ్రీశ్రీ ఆసక్తి

సామ్యవాదాని కనుకూలంగా స్పెయిన్‌లో కార్మికప్రాతినిధ్యంతో పాప్యులర్ ఫ్రంటు రిపబ్లికన్ ప్రభుత్వం ఏర్పడితే, దాన్ని వ్యతిరేకించిన మిలిటరీ కమాండర్లు తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాటు అక్రమమయింది; అభివృద్ధినిరోధకమయింది దీనికి నాయకుడు జనరల్ ఫ్రాంకో. ఈ మిలిటరీప్రభుత్వపునియంతృత్వంమీద ప్రజలుచేసిన తిరుగుబాటే స్పెయిన్ ప్రజావిప్లవం! 1936 జూలై 18న ప్రారంభమైన ఈ విప్లవాన్ని ఫాసిస్టులొకవైపునా సామ్యవాదులొకవైపునా బలపరచడంతో ఇది వర్గకలహస్వరూపాన్ని ధరించింది. సామ్యవాదాన్ని బలపరిచే కవులు ప్రపంచంలో ఏ దేశంలో ఫాసిస్టులకూ ప్రజాశక్తులకూ పోరాటంజరుగుతున్నా అది పురోగమనానికి దోహదం చేస్తుందని గుర్తిస్తారుకనుకనే శ్రీశ్రీ కూడా స్పెయిన్ ప్రజావిప్లవాన్ని శ్రద్ధగా గమనించాడు. ఫాసిస్టువ్యతిరేకులయినవారంతా International Brigade ను ఏర్పాటుచేసి స్పెయిన్ ప్రజానీకానికి ఎన్నో విధాల సాయపడ్డారు. మరొకవైపున ఇటలీనుంచి, జర్మనీనుంచి ఫాసిస్టుసైన్యాలు జనరల్ ఫ్రాంకోకు సాయపడ్డాయి. రెండున్నరఏళ్ళు జరిగిన ఈ యుద్ధంలో ఫాసిస్టు కిరాతక కృత్యాలకు ఎందరో కవులూ కళాకారులూ కూడా బలిఅయిపోతూండటంచూసి శ్రీశ్రీ "అవిగో అవిగవిగో అవిగవిగో ఇంకిన తెగిపోయిన మరణించిన క్రొన్నెత్తురు, విపంచికలు, యువయోధులు" అని రాశాడు. ఫాసిస్టుశక్తులన్నీ పతనమై పోతాయనీ, సామ్యవాదశక్తులన్నీ కలుస్తాయనీ, స్పెయిన్‌లో మరోప్రపంచం అవతరిస్తుందనీ ఊహించిన శ్రీశ్రీ "నేడే ఈనాడే ఈనాడే జగ

మంతా బలివితర్ది! నరజాతికి పరివర్తన! నవజీవన శుభసమయం! అభ్యుదయం!" అని కీర్తించాడు. 1937 ఏప్రిల్‌లో ఇంకా స్పెయిన్‌యుద్ధం జరుగుతూండగాపొందిన ఊహాస్వప్నం ఇది! ఇలాంటి స్వప్నాలు అభ్యుదయ స్వభావం గలవి. 1939లో రెండవప్రపంచయుద్ధం మొదలైనప్పుడుకూడా శ్రీశ్రీ దాన్ని అంతర్జాతీయవర్గకలహంగానే భావించాడు. 1941 లో జర్మనీకీ రష్యాకూ పోరాటం మొదలైనప్పుడు గర్జించురష్యా అంటూ విప్లవగర్జన వినిపించడానికి కూడా ఇదేకారణం. నాజీ రాజ్యాన్ని 'దౌర్జన్యరాజ్యం' అన్నాడప్పుడు. నాజీలను స్వాతంత్ర్యశత్రువులన్నాడు. అనంత ప్రపంచం అంతటా రష్యా గోడుగునీడలు సాగి, స్వాతంత్ర్యం, సమానత్వం సాధించాలన్నాడు.

రష్యన్‌విప్లవంలా స్పెయిన్‌విప్లవంకూడా సామ్యవాదభువనభవనపుబావుటా అవుతుందని శ్రీశ్రీ భావించడానికి అతని విప్లవచైతన్యమే కారణం. ప్రపంచచరిత్రలో స్పెయిన్‌విప్లవం రెండు ప్రపంచయుద్ధాలకు మధ్యఎగసిన అగ్నిజ్వాల. అది అంతర్జాతీయకార్మికవిప్లవజాగృతిలో ఒక ముఖ్య ఘట్టం. "The revolutionary war of the Spanish people is one of the most glorious episodes in its history and in the annals of proletarian internationalism. Progressive elements all over the world rose to the aid of the Spanish republicans"[4] అని చరిత్రకారులు వ్రాయనేవ్రాశారు.

ఆంధ్రదేశంలోనే ఉండి శ్రీశ్రీ స్పెయిన్‌విప్లవాన్ని వర్గకలహంగా గుర్తించగల్గితే స్పెయిన్‌కు చుట్టుపక్కల ఉన్న దేశాల్లోని కవులూ కళాకారులూ International Brigadeలో చేరిపోవడంలో ఆశ్చర్యమేముంది? ఆడెన్‌వంటి మహాకవి ఆ యుద్ధరంగంలో క్షతగాత్రుల్ని మోయడానికీ స్టీఫెన్‌స్పెండర్ యుద్ధవార్తలు రేడియోలో చదవడానికీ క్రిస్టొఫర్ కాడ్వెల్, Julian Bell, John Cornford, Ralf Fox, Lorca వంటి రచయితలు, కవులు, విమర్శకులు ఆయుధాలుపట్టి పోరాడటానికీ (సాయుధచర్యలకు) తయారయ్యారు. కాడ్వెల్ ప్రభృతులు ఈ ప్రపంచాగ్నికి సమిధలయిపోయారు. "The Spanish War certainly caught the poet's imagination. Many joined the International Brigade. It seemed de rigueur to visit Spain, and to lend one's name, if not always one's armed presence to the cause of workers. Auden and Spender both made visits, the former as stretcher-bearer, the latter as head of English broadcasting in a radio station which he found to be defunct".[5]

స్పెయిన్‌విప్లవంలో ఫాసిస్టుల దమనకాండకు నిదర్శనం 'గుయెర్నికా' నగరవిధ్వంసనం. 1937 ఏప్రిల్ 26న జర్మన్‌ఫాసిస్టులు గుయెర్నికాపై వేసినబాంబు వాళ్ళవిధ్వంసనగుణానికి ప్రబలసాక్ష్యం. ఆ పట్నంలోని ప్రజల భయాందోళనలూ విరూపతావికలతలూ ప్రపంచవిఖ్యాత

---

4 A Short History of the World. Vol. II 150 P.

5 Poetry of the Thirties : Introduction – Robin Skelton.

చిత్రకారుడు పికాసోచేత చిత్రించబడ్డాయి. శ్రీశ్రీ రాసిన గీతంలోని ఇంకిన, తెగిపోయిన, మరణించిన క్రొన్నెత్తురు, విపంచికలు, యువయోధులూ పికాసో వేసిన బొమ్మలోని బీభత్సమూ సమానమైనవే.

రెండున్నరసంవత్సరాల యుద్ధకాలపు స్పెయిన్‌ను వస్తువుగా తీసుకుని కవితలు రచించిన ఆంగ్లకవులెందరో ఉన్నారు. SPAIN - *W. H. Auden;* A Thousand killed - *Bernard Spencer;* The Non-interveners - *Geofferey Grigson;* Two Armies - *Stephen Spender;* A moment of war - *Laurie Lee;* Elegy on Spain-*George Barker;* Autuman Journal - *Louis Macneice* మొదలైనకవితలు ఆంగ్లకవితాప్రపంచానికి స్పెయిన్ విప్లవం సమర్పించిన జ్వాలలు !

ప్రజావిప్లవానికీ సాహిత్యానికీ ఉండే పరస్పరప్రేరణకు స్పెయిన్‌విప్లవం నిదర్శనం. మహాప్రస్థానంగీతాలద్వారా ప్రజావిప్లవాన్ని ప్రేరేపించాలనేదే శ్రీశ్రీ సంకల్పం. స్పెయిన్‌లో ప్రజావిప్లవం 1936 జూలైలో మొదలుకాగానే ఆ సంవత్సరం సెప్టెంబరులో Contemporary Poetry and Prose అనే సాహిత్యపత్రిక అట్టమీద 'Support Spanish People against Fascism' అనే ప్రకటన వెలువడింది. ఫాసిజంకు వ్యతిరేకతను శ్రీశ్రీ ఎక్కడా వాచ్యంచేయకపోవడానికి కారణం తనదేశంలోని ఆనాటి రాజకీయపరిస్థితులే.

'అభ్యుదయం' గేయంలోని మొదటిరెండుగీతాలలో పైశాచికశక్తులనూ తరువాతి రెండు గీతాలలో అభ్యుదయశక్తులనూ సూచించాడు. ఫాసిస్టులకూ ప్రజలకూ ఏర్పడిన ఆ సంఘర్షణలో జగమంతా బలివితర్దిగా మారి నరజాతికి పరివర్తన వచ్చి నవజీవనోదయం జరుగుతుందనేది ఊహ. ఆ ఉషస్సుకుముందు ప్రపంచమంతటినీ చుట్టుకున్న కాళరాత్రిని ఫాసిస్టుల దారుణఘోర ఋల్లో శ్రీశ్రీ చూశాడు. ఆ భయంకరరాత్రిలో ఘోషలను విన్నాడు. ఆ ఘోషలు ఏవేవో అని దాటవేయడం మరింత భయంకరమైనవని చెప్పడానికే! తలవిరబోసుకుని నగ్నంగానర్తిస్తున్న పైశాచికశక్తులను చూశాడు. వారు ఎవరెవరో అని చెప్పడం వారి ముసుగులను వ్యక్తంచేయడానికే! ఈ పైశాచికశక్తులమీద దండెత్తిన అభ్యుదయశక్తులు ఇంకినక్రొన్నెత్తురులో తెగిపోయిన విపంచికలలో మరణించిన యువయోధులలో కనిపించాయి. ఈ త్యాగంలోనే నవజీవనశుభోదయాన్ని ఊహించాడు. మొదటి రెండుగీతాల్లోనూ భయంకరమైనరాత్రి, తరువాతి రెండు గీతాల్లోనూ ఉద్వేగపూరితమైన ఉదయం వ్యక్తమయ్యాయి. ఈ నాలుగుగీతాలూ ఒకేబాణీలో మొదలైనా మొదటిరెండూ క్రియలతోనూ తరువాతిరెండూ విశేషణాలతోనూ ముగుస్తాయి.

## శ్రీశ్రీ వైచిత్రీప్రియత్వం

71వ ప్రకరణంలో పాశ్చాత్యకవిత్వంలో వచ్చిన మార్పులనూ అవి తెలుగుకవిత్వంలో ప్రవేశించిన తీరుతెన్నులనూ గూర్చి తెలుసుకున్నాం. ఇంగ్లాండులో విక్టోరియన్‌కవుల తరువాత వచ్చినపరిణామం శుద్ధకళావాదం. కళ కళకోసమే అనేది ఈ వాదపు నినాదమే! దీనికి నాయకుడే

ఆస్కార్‌వైల్డు (1854-1900). ఇతనినికూడా శ్రీశ్రీ అనుసరించి, సాంకేతికనైపుణ్యాన్ని (Technical skill) మరింత పెంపొందింపజేసుకున్నాడు. ఇందువల్ల వైచిత్రీప్రియుడయ్యాడు.

'Form is everything. It is the secret of life' అన్నవాడు ఆస్కార్‌వైల్డే! వైచిత్రిపట్ల శ్రీశ్రీకి ఎంతో మోజు ఉంది. శ్రీశ్రీ వైచిత్రులు 3 విధాలు. ఇందులో మొదటిది స్వరూపవైచిత్రి. విషయం మారినప్పుడు విధానంకూడా మారితీరుతుంది. విషయమే అభ్యుదయానికి ప్రాతిపదిక. విధానంలో యథాస్థితిని శ్రీశ్రీ తిరస్కరించాడుకనుకనే పాదవిభజనలో రకరకాల పోకడలను చూపించాడు. సాంప్రదాయికచ్ఛందస్సులోలేని ఆరోహణపద్ధతిని పాదవిన్యాసంలో చూపించాడు. ఇదే స్వరూపవైచిత్రి.

అవిగో
అవిగవిగో! అవిగవిగో!
ఇంకిన, తెగిపోయిన, మరణించిన
క్రొన్నెత్తురు! విపంచికలు! యువమోఘులు!

ఇందులో వరుసగా 3, 10, 13, 14 అక్షరా లుండటంవల్ల మెట్లుగా అచ్చవుతుంది. ఈ స్వరూప వైచిత్రిని శ్రీశ్రీ పాదసంఖ్యలో కూడా చూపించాడు. 1, 2 గీతాలు చతుష్పాదులు; 2, 4 పాదాలు పంచపాదులు.

"A poem had an architecture and it was well-built or ill-built. It's shape ought not to be a matter of accident or intuition, but ought to reveal — at least in the ideal case — the precision and rigid consequence of a mathematical problem"[6] అన్నట్లు శ్రీశ్రీ గీతాలలోని స్వరూపవైచిత్రి యాదృచ్ఛికంకాదు; ప్రయత్నసిద్ధమే! ఇలాంటి విచిత్రస్వరూపాలను ఐ, జయభేరి, అవతారం, కళారవి, ఋక్కులు, కేక, అవతలిగట్టు, పరాజితులు, ఒకక్షణంలో, నీడలు, ఆశాదూతలు ఖండికల్లో చూడవచ్చు.

రెండవది: సాదృశ్యవైచిత్రి. ఇది 5 విధాలు. (1) గేయంలోని నాలుగుగీతాలూ ఒకే పద్ధతిలో ఆరంభంకావడం ఆరంభసాదృశ్యం. ఉదా:- ఏవో ఏవేవో ఏవేవో - ఎవరో ఎవరెవరో ఎవరెవరో - అవిగో అవిగవిగో అవిగవిగో - నేడే ఈనాడే ఈనాడే. 'కళారవి' 'నీడలు' 'పరాజితులు' ఖండికల్లో కూడా ఈ ఆరంభసాదృశ్యం పాటింపబడినది. (2) ఘోషలు వినబడుతున్నాయ్/గుండెలు విడిపోతున్నాయ్ - ఇలావాక్యాలన్నీ ఒకేలాగుండటం వాక్య సాదృశ్యం. (3) నగ్నంగా నర్తిస్తున్నారు, భయోద్విగ్నంగా వర్తిస్తున్నారు - ఇది క్రియాసాదృశ్యం. (4) ఇంకిన, తెగిపోయిన, మరణించిన - ఇది విరామసాదృశ్యం. (5) జగమంతా బలివితర్ది/నర

---

6 Literary Criticism 589 P,

జాతికి పరివర్తన/నవజీవన శుభసమయం - ఈ పాదాలు మూడూ సగణంతో మొదలవుతాయి. ఇది గణసాదృశ్యం. ఈ సాదృశ్యాలన్నీ లయను సృష్టించి భావావేశాన్ని మన కందిస్తాయి.

మూడవది : క్రమవైచిత్రి. ఇది మూడురకాలు. (1) విశేషణాలను చెప్పిన క్రమంలోనే విశేష్యాలను కూడా చెప్పి, విషాదాన్ని ఉద్దీపింప జేయడం. ఇది విశేషణవిశేష్యక్రమం.

'ఇంకిన, తెగిపోయిన, మరణించిన
క్రోన్నెత్తురు, విపంచికలు, యువయోధులు'

(2) 'అద్వైతం' గేయంలో మరొకవిధమైన క్రమవైచిత్రి ఉంది.

వాసంతసమీరం నీవై/హేమంతతుషారం నేనై -
నీ ఎగిరిన జీవవిహంగం/నా పగిలిన మరణమృదంగం-
చిగురించిన తోటలలోనో/చితులుంచిన చోటులలోనో-
వలయములై చలించినపుడే/విలయములై జ్వలించినపుడే-

ఈ గీతంలో ఉన్న క్రమాలంకారాన్ని రెండుక్రమాల్లో చెప్పుకుని అనుభవించవలసి ఉంటుంది. రెండు క్రమాలూ రెండు పాయలు. ఇది వాక్యక్రమం.

(3) కవితా ఓ కవితా లోని క్రమవైచిత్రి మరొకవిధమైనది :

(మాటలు) 'శ్మశానాలవంటి నిఘంటువుల దాటి/వ్యాకరణాల సంకెళ్లు విడిచి/ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి-/......... వెలువడినై, పరుగిడినై, నాయెదనడుగిడినై'- ఇది క్రియా క్రమం.

ఇటువంటి క్రమాలనేకం ప్రతిజ్ఞ, నీడలు, శైశవగీతి, గర్జించురష్యా, జగన్నాథుని రథ చక్రాలు అనే ఖండికల్లో ఉన్నాయి. వాటిని పాఠకులు గుర్తుపట్టవచ్చు.

# 73/వ్యత్యాసం

## అలజడి మా జీవితం! ఆందోళన మా ఊపిరి! తిరుగుబాటు మా వేదాంతం!

1937 ఏప్రిల్ 25

దారిద్ర్యానికీ ఐశ్వర్యానికీ వ్యక్తి పాపపుణ్యాలనే కారణాలుగా చెప్పడం మతసంప్రదాయం. ఈ పుణ్యాపాపాలే అదృష్టదురదృష్టాలు. ఇది నమ్మకంమీద ఆధారపడిన సంగతేకాని శాస్త్రీయమైనదికాదు. ఉత్పత్తిసాధనాలు సొంతమై ఉంటే సొమ్ము సంపాదించవచ్చు. అవి సొంతంగా లేనివాడు ధనవంతుడివద్ద పనిచేసి అతడిచ్చిన కూలితో బ్రతకవలసిందే. భూస్వామియొక్క భూమిని దున్ని పంటలు పండించే కర్షకుడు తన ఘర్మజలాన్ని ధారవోయడంవల్ల భూస్వామి ధనవంతుడవుతాడు. కర్మాగారాధిపతియొక్క గనిలోవనిలోకార్ఖానాలో యంత్రాలను నడిపి వస్తువులను నిర్మించే కార్మికుడు కూడా తన శ్రమశక్తిని అమ్ముకుని ధనంతీసుకుంటే, మిగిలినధనమంతా పెట్టుబడిదారుడికి చేరడంవల్ల అతడే ఐశ్వర్యవంతుడవుతాడు. ఇందులో 'దోపిడి' ఉన్నదనే సత్యాన్ని భౌతికవాది బయటపెట్టాడు. ఈ దోపిడిని అరికట్టడానికి సమాజంలో ఎవ్వడికీ సొంత ఆస్తి అనేది ఉండకుండా చేయడం ఒక్కటే మార్గమనీ అప్పుడు దారిద్ర్యం అంతరిస్తుందనీ ఒక పరిష్కారమార్గాన్ని భౌతికవాదులు ప్రతిపాదించారు. ఇదే సామ్యవాదవిప్లవసారాంశం. ఈ విప్లవం రానంతకాలం సమాజంలో ధనవంతులు, దరిద్రులు అనే రెండువర్గా లుంటాయి. ఈ వర్గాలనే పాలకులు, పాలితులు అనీ పీడకులు, పీడితులు అనీ బూర్జువాలు – ప్రొలిటేరియన్లు అనీ అంటారు. ఈ వర్గవిభాగం మార్క్సిజం తెలియనివారికి అస్పష్టమే. తెలుగులో మార్క్సిజం తెలిసిన మొట్టమొదటికవి శ్రీశ్రీయే! అందుకే శ్రీశ్రీతో మరో కవితాయుగం మొదలయింది. శ్రీశ్రీకి ముందరి కవులకూ శ్రీశ్రీకీ ఆలోచనాసరళిలో పెద్దతేడా ఉంది!

గురజాడ : శ్రీశ్రీ

మూఢవిశ్వాసాలమీద తిరుగుబాటుచేసి, భాషాసాహిత్యాలను సమకాలికసమాజశ్రేయస్సుకే అంకితం చేయాలని నిర్ణయించుకున్న గురజాడ అప్పారావుగారి ఆలోచనలు 'మార్క్సిజం' తో సంబంధం లేనివి. ఆయనకు భౌతికదృష్టిఅయితే ఉన్నదికానీ గతితార్కిక భౌతికదృష్టి ఉండే అవకాశంలేదు. ఐశ్వర్య-దారిద్ర్యాలను గురించి ఆయన ఆలోచించడం జరిగింది. శ్రమజీవనప్రాముఖ్యం గుర్తించడం కూడా జరిగింది. దేశభక్తిగీతంలో పాడిపంటలు పొంగిపొర్లే దారిలో పాటుపడవలసినదిగానూ నరులచెమటను తడిపి దేశవృక్షంనుంచి ధనంపంటలు

పండించవలసిందిగానూ ఆయన ప్రబోధించారు. ధనం పెరిగినకొద్దీ దారిద్ర్యం తొలగిపోతుందనేది అశాస్త్రీయమైన నమ్మకం. ధనం పెరగడం ధనస్వామ్యవ్యవస్థకు మూలం. భూస్వామ్యవ్యవస్థను తిరస్కరించి ధనస్వామ్యవ్యవస్థను నిర్మించవలసిందిగా ఆయన ప్రబోధంలో ఒక మెరుపు ఉంది. దేశమంటే మట్టికాదనీ మనుషులే అనీ చెప్పడంలోనూ ఈ గుట్టు ఉంది.

మానవుడి మంచితనంమీద పరోపకారగుణంమీద ఆయన మమకారం. పరుల కలిమికి పొర్లి యేడ్చే పాపికి సుఖంలేనే లేదనీ ఒరుల మేలే తనమేలుగా భావించే నేర్పరికి మేలు కొల్లలుగా కలుగుతుందనీ సొంతలాభం కొంత మానుకుని పొరుగువాడికి తోడ్పడవలసిందనీ ఆయన కొన్ని నీతులు చెప్పారు. ఈ నీతులన్నీ దోచుకునేవర్గానికి వర్తించినట్లు దోచుకోబడే వర్గానికి వర్తించవు. తమశ్రమను ధనంగా మార్చుకుని కలిమిని గుత్తగొంటున్న వర్గాన్ని ఎదిరించడం కార్మికవర్గానికి తప్పనిసరి అవుతుంది. అది "పరులకలిమికి పొర్లి యేడ్చే పాపం" కాజాలదు. యజమానుల మేలే తనమేలుగా కార్మికుడు ఎంతనేర్పరియైనా భావించేఅవసరంలేదు. యజమాని సొంతలాభం కొంత మానుకుని కార్మికుడికి తోడ్పడటంవల్ల సమస్యలు తీరవు!

గురజాడది విశాలమైన మానవతాదృక్పథం. ఆయన నీతులు విషమసమాజంలో చేదు మాత్రలే! మార్క్సిస్టుదృక్పథంతో చూస్తే గురజాడ ఆలోచనలు పాతబడిపోయాయి. చెట్టపట్టాల్ పట్టుకుని దేశస్థులంతా నడవడంకాక మార్క్సిస్టులకు కావలసింది చెట్టపట్టాల్ పట్టుకుని కార్మికులంతా నడవడం! ఈ భావాలనే శ్రీశ్రీ తన కవిత్వంలో ప్రచారంచేసింది. పారిశ్రామిక విప్లవాన్నీ జాతీయదృక్పథాన్నీ గురజాడ కోరితే, శ్రీశ్రీ మరోఅడుగు ముందుకువేసి సామ్యవాద విప్లవాన్నీ, అంతర్జాతీయదృక్పథాన్నీ కోరాడు. అన్నిదేశాలలో దేశిసరుకులను అమ్మాలనీ డబ్బును తెచ్చి కీర్తిసంపదలను వృద్ధిచేయాలనీ మంచి గతంలో కొంచెమేఅనీ ముందుకు అడుగు వేయవలసిందనీ వాణిజ్యంలోనూ విద్యలలోనూ స్పర్థలూ వైరాలూ ఉండాలనీ వ్యర్థకలహాలువద్దనీ కత్తివైరం కాల్చివేయవలసిందనీ గురజాడ ప్రబోధించాడు. ఈ ప్రబోధంలో అభ్యుదయభావాలు లేవని ఎవరూ అనలేరు; కానీ 1915 కు ముందరి దేశపరిస్థితుల ప్రభావంతో గురజాడ భావించిన అభ్యుదయం వేరు; 1930 తరవాతి ప్రపంచపరిస్థితులప్రభావంతో శ్రీశ్రీ భావించిన అభ్యుదయం వేరు! శ్రీశ్రీ ఎర్రబావుటా నిగనిగలను చూడమన్నాడు. కార్మికకర్షకకల్యాణసౌభాగ్యాల కోసం – సామ్యవాదంకోసం – తన కవిత్వం అన్నాడు. పెనునిద్దురవదలాలనీ మునుముందుకు సాగాలనీ పరిపూర్ణ పుబ్రతుకును సాధించాలనీ అన్నాడు. విప్లవశంఖం వినిపిస్తుందని హెచ్చరించాడు. మరోప్రపంచం పిలుస్తోందన్నాడు. శ్రీశ్రీ కవిత్వంలో వర్గకలహం ప్రోత్సహించబడింది. చిరకాలం జరిగిన మోసం బలవంతుల దౌర్జన్యాలూ ధనవంతుల పన్నాగాలూ ఇక చెల్లవని ఎలుగెత్తి చాటాడు. ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తీ ఒక జాతిని వేరొకజాతీ పీడించే 'సాంఘిక

ధర్మాన్ని' తిరస్కరించాడు. పీడకపీడితపక్షాల వ్యత్యాసాన్ని నిరూపించాడు. పీడితులదే తుది విజయంఅనీ వారిదే ఈ రాజ్యంఅనీ తేల్చివేశాడు. అందుకే గురజాడ సాత్త్వికప్రవృత్తి సమాజ సంస్కరణనే కోరితే శ్రీశ్రీ ఆవేశప్రవృత్తి సమాజవిప్లవాన్ని కోరింది. ఈ శతాబ్ది రెండో దశలో గురజాడది ఒకముందడుగైతే నాల్గవదశలో శ్రీశ్రీది ఇంకో ముందడుగు. కవితాసంవిధానాలలోనూ వస్తువులోనూ కూడా శ్రీశ్రీది గురజాడను మించిన ముందడుగే!

గురజాడ గొప్పగొప్ప ఆదర్శాలను గురించి ప్రబోధిస్తే శ్రీశ్రీ వాస్తవాలను గుర్తుచేశాడు. శాస్త్రీయంగా ఏది సాధ్యమవుతుందో ఆ విప్లవాన్ని గురించి ఉత్సుకతను రేకెత్తించడమే శ్రీశ్రీ దృక్పథం. చారిత్రికంగా శ్రీశ్రీ ఉన్నకాలమే అతని దృక్పథానికి దోహదం చేసింది. రష్యాలో మరోప్రపంచం అవతరించడమూ ఒక ప్రపంచయుద్ధం పూర్తికావడమూ, ఆర్థికసంక్షోభం రావడమూ ఫాసిస్టుల విజృంభణమూ స్పెయిన్‌లో ప్రజావిప్లవం సాగడం,వలసవాదుల నిరంకుశత్వమూ ఇండియాలో స్వాతంత్ర్యసమరంజరుగుతూఉండటం శ్రీశ్రీకి కొత్తచూపు నిచ్చాయి. నజురుల్‌ఇస్లాంవిప్లవకవితలూ ప్రపంచకవుల కవితాస్వప్నాలూ లండన్ రచయితల ప్రణాళిక శ్రీశ్రీకి విప్లవచైతన్యాన్ని సమకూర్చాయి. జీవితంలోని నిరుద్యోగం, ఆకలి, దారిద్ర్యం, వ్యక్తిగతనైరాశ్యం శ్రీశ్రీకి తిరుగుబాటును నేర్పాయి.

మహాప్రస్థానంలో శ్రీశ్రీది పూర్తిగా గతితార్కికభౌతికవాదదృక్పథమే కానీ ఆదర్శవాదం కాదు. ఈ దృక్పథం ఏర్పడటానికి శ్రీశ్రీ మార్క్సుఎంగిల్సుల గ్రంథాలు చదివాడా లేదాఅనేది అనవసరచర్చ! ఒక కవికి ఏర్పడే సంస్కారం అనేకగ్రంథాల నిరంతరాధ్యయనం వల్లనూ లోకపరిశీలనవల్లనూ సంఘటనల సమన్వయంవల్లనూ రూపొందుతుంది కనుక శ్రీశ్రీ వ్యుత్పత్తి, సంస్కారాదులలో మార్క్సిస్టుసిద్ధాంతభావధార అంతర్లీనంగా ఉండిఉంటుంది. మహాప్రస్థానంలో శ్రీశ్రీ కేవలం సిద్ధాంతాలను కవిత్వంగా మార్చలేదు. శుద్ధకవిత్వానికుండే అన్నిలక్షణాలతోనూ విప్లవభావాలను వెలువరించగలిగాడు. ఇదే శ్రీశ్రీ ప్రతిభ! శ్రీశ్రీది Applied Poetry అనే సంగతి మరిచిపోకూడదు.

శ్రీశ్రీ కమ్యూనిస్టుభావాలు నిర్దిష్టరేఖలతో కనిపించే ఖండికలు మహాప్రస్థానంలో కొన్నింటినే పేర్కొనగలం. వ్యత్యాసం, వాడు, ప్రతిజ్ఞ, దేశచరిత్రలు, గర్జించురష్యా, జగన్నాథుని రథచక్రాలు అనే ఖండికలు వ్రాసిన శ్రీశ్రీని మార్క్సిస్టుసిద్ధాంతాలు తెలియనివాడని అనే సాహసం ఎవరికీ ఉండదు. వీటి ఆంతర్యం తెలుసుకుని తాదాత్మ్యం చెందడానికి పాఠకుడికి కనీసం "కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక" పరిజ్ఞానం అయినా ఉండాలి. అయితే శ్రీశ్రీ కవిత్వంలో ఉండే శుద్ధ కవితాధర్మాలు కొన్ని పాఠకుడ్ని తన వైపుకు ఆకర్షించుకుంటూ ఏమి చెప్పాడని

కాక ఎలా చెప్పాడని ఆశ్చర్యపడిపోయేటట్లు చేస్తాయి. శ్రీశ్రీ అభ్యుదయకవిత్వం అన్ని వర్గాలనూ ఆకట్టుకోవడానికి ఈ ఆకర్షణ - శ్రవ్యకావ్యధర్మం - ప్రధానకారణం. నిజానికి పీడితవర్గంకోసం రాసిన మహాప్రస్థానం పీడకవర్గానికి గానీ ఆదర్శవాదులకు గానీ సనాతనవాదులకు గానీ నచ్చకూడదు. కానీ మహాప్రస్థానం లోని శుద్ధకవితాస్పర్శ అందరినీ ముగ్ధులను చేస్తుంది. మహాప్రస్థానంలోని కవిత్వపువిలువలు పీడితవర్గానివి కావు; ఉన్నత వర్గానివే! పీడితవర్గంనుంచి వచ్చే బెదిరింపు ఉన్నతవర్గానికే ముందుగా శ్రీశ్రీ ద్వారా అందజేయబడింది. ఇందులో అసహజత్వం ఏమీలేదు. మార్క్సు ఎంగిల్సులు రచించిన సిద్ధాంత గ్రంథాలు ఏవీ కూడా పీడితజనులకు అందుబాటులో ఉండేవి కావు. కానీ వాటిలోని సందేశం, చారిత్రకవాస్తవికత అనేకరూపాలలో వెలువడి కార్మికవర్గ చైతన్యానికి సమిధలుగా చేయబడలేదా ?

### కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక - శ్రీశ్రీ మహాప్రస్థానం

అంతర్జాతీయస్థాయిలో కార్మికవర్గవిప్లవజాగృతిని 'కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక' తీసుకువస్తే తెలుగుదేశంలో కార్మికవర్గవిప్లవభావనని అందించిన తొలికావ్యం శ్రీశ్రీ మహాప్రస్థానమే అందువల్లనే తెలుగుదేశంలో కమ్యూనిస్టుపార్టీవారికి ప్రచారగ్రంథంగానూ అభ్యుదయ రచయితలకు మార్గదర్శిగానూ 'మహాప్రస్థానం' ఒక చరిత్రాత్మక స్థానం వహించింది.

కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక (Manifesto of the Communist Party) అనే చిన్నపుస్తకం సామ్యవాదోద్యమానికి ప్రపంచమంతటా దారి చూపిన గొప్పపుస్తకం. అందలి 'బూర్జువాలూ-కార్మికులూ' అనే మొదటి ప్రకరణంలో సామాజికవ్యవస్థలు ఉత్పత్తివిధానాలను బట్టి ఎలా మారుతూ వస్తున్నాయో వివరించబడింది. ఈ రెండువర్గాల వ్యత్యాసాలనే శ్రీశ్రీ తన 'వ్యత్యాసం' ఖండికలో నాటకీయంగా చిత్రించాడు. ఇందులో కార్మికులు విప్లవచైతన్యంతో బూర్జువాల కెదురుగా నిలబడి సంభాషిస్తారు. ఇంతవరకూ నడిచిన చరిత్ర అంతా వర్గకలహాల చరిత్రే అనే సత్యాన్ని ఈ ప్రకరణంలోనే ప్రతిపాదించారు మార్క్సుఎంగిల్సులు. ఈ సత్యమే శ్రీశ్రీ 'దేశచరిత్రల'కు మూలం. బూర్జువావ్యవస్థ పతనం అనివార్యం అనీ కార్మికుల తిరుగుబాటూ సామ్యవాదావతరణం తప్పవనీ అన్నారు ఆ ప్రవక్తలు. ఆ సంగతినే 'ప్రతిజ్ఞ'లో శ్రీశ్రీ ప్రతిపాదించాడు.

పార్టీ ప్రణాళికలోని రెండవప్రకరణం 'కార్మికులూ కమ్యూనిస్టులూ' అనేది. కమ్యూనిస్టులు ఏవిధంగా బూర్జువాల దౌర్జన్యాలను ఖండించి కార్మికరాజ్యాన్ని స్థాపించడానికి దోహదం చేయగలరో వివరించబడింది. ఇదే 'గర్జించురష్యా'లోనూ 'జగన్నాథుని రథచక్రాలు' లోనూ ధ్వనించే గంభీరవిషయం. కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక ఇచ్చే చరమనినాదం 'Working men of all Countries, Unite' అనేది మహాప్రస్థానంలోనూ జగన్నాథునిరథచక్రాలులోనూ వ్యక్తంఅవుతుంది.

సమాజాన్ని కదిలించగల సందేశాన్ని కళాత్మకంగా చెప్పగలగడం శ్రీశ్రీని ఒక యుగకర్తగా మార్చింది.

కమ్యూనిస్టుపార్టీ ప్రణాళికలో "Society as a whole is more and more splitting up into two great classes directly facing each other: Bourgeoisie and Proletariat" అని సమాజం రెండు వ్యతిరేకవర్గాలుగా చీలిపోవడం గురించి విశ్లేషణ ఉంది. ఈ విశ్లేషణనే 'వ్యత్యాసం'లో శ్రీశ్రీ బూర్జువాలకూ కార్మికులకూ ఉండే వ్యత్యాసంగా చిత్రించాడు. కార్మిక వర్గంవారు తమకూ బూర్జువావర్గానికీ ఉండే తేడా ఏమిటో తెలుసుకుంటేనేగానీ వారొక సమైక్యశక్తిగా విజృంభించలేరు. "మీకూ మాకు ఇదీ వ్యత్యాసం! మీ జీవితం, మీ ఆదర్శాలు అవి! మా జీవితం, మా కష్టాలు ఇవి! అలజడి, ఆందోళన, తిరుగుబాటు ఇవి మాకు తప్పవు. మేము విప్లవశంఖం పూరించేసమయం వస్తోంది" అంటూ బూర్జువాలకిచ్చిన హెచ్చరికను శ్రీశ్రీ చిత్రించాడు. కార్మికుల మానిఫెస్టోయే 'వ్యత్యాసం'

శ్రీశ్రీ కవితలో వర్గవ్యత్యాసాలు

బూర్జువాలకూ కార్మికులకూ బూర్జువావ్యవస్థలో ఎలాంటి వ్యత్యాసాలుంటాయి? వీటికి సమాధానాన్ని సృజనాత్మకంగా వ్యక్తంచేశాడు శ్రీశ్రీ. ఈ వ్యత్యాసాలను శ్రీశ్రీ ఖండికనుంచి 12 రకాలుగా మనం విశ్లేషించవచ్చు.

(1) బూర్జువాలు "అదృష్టవంతులం" కనుకనే భోగభాగ్యాలను అనుభవిస్తున్నాం అనుకుంటారు! కార్మికులు నిజంగానే "అభాగ్యులు". ఈ అభాగ్యానికి కారణం వీరి కృషి లోపం కాదు; నరాల బిగువూ కరాలసత్తువ వరాలవర్షం కురిపించాలని ప్రపంచభాగ్యం వర్ధిల్లాలని గనిలో వనిలో కార్ఖానాలో పరిక్లమిస్తూ పరిప్లవిస్తూ ధనికస్వామికి దాస్యంచేసే యంత్రభూతముల కోరలు తోమే కార్మికులకు మిగిలేవి ఏమిటి? కన్నులనిండా కణకణమండే విలాపాగ్నులూ గలగలతొణకే విషాదాశ్రులూను! అందుకే వీరు అభాగ్యులు! అందమైన వస్తు సముదాయాన్ని వీరు సృష్టిస్తే బూర్జువాయజమాని పెట్టుబడి తనదనే నెపంతో దాన్ని ఎత్తుకు పోయి చాలీచాలని కూలీ ఇస్తాడు. అది శ్రమకు తగినదికాదు కనుక కార్మికులు అభాగ్యులవు తారు. "ఆధునిక కార్మికుడు పరిశ్రమలు అభివృద్ధి అయ్యే కొద్దీ పైకి రాకుండా యింకా క్రిందికి పోతున్నాడు; కార్మికజీవన విధానానికి కూడా అంటిపెట్టుకోలేక దినదినానికీ యింకా అడుక్కు పోతున్నాడు; కార్మికుడు బుక్కాపకీరు అవుతున్నాడు".1 బూర్జువాలు తమ ఐశ్వర్యానికి కారణం అదృష్టమే అనుకోవచ్చు. కానీ భౌతికవాదులైన కార్మికులు - దోపిడి వాస్తవికతను

1 కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక 49 పే.

తెలుసుకున్న కార్మికులు - తమ దారిద్ర్యానికి కారణం 'దురదృష్టం' అనుకోలేరు. అందుకే 'అదృష్టవంతులు మీరు - అభాగ్యులం మేము' అనిపించాడు శ్రీశ్రీ.

(2) బూర్జువావర్గం 'వెలుగును ప్రేమిస్తారు! ఇరులను ద్వేషిస్తారు!' కార్మికవర్గం "వెలుగులోని చీకట్లనూ ఇరులలోని మిణుగురులనూ" చూస్తారు. బూర్జువావర్గంవారి సౌధాలలో వెలుగుకు లోటుండదు. కానీ కార్మికవర్గంవారి ఇళ్ళలో వెలుగే కరువవుతుంది. 'ఆకటిచీకటిచిచ్చులు' వీరివి. 'వికసించిన విద్యుత్తేజం' వారిది. వెలుగును ప్రేమించడం, ఇరులను ద్వేషించడం అనే రెండు గుణాలవల్లనే బూర్జువావర్గంవారు ఫ్యూడల్‌వ్యవస్థను విచ్ఛిన్నంచేసి పారిశ్రామికనాగరికతను సాధించి ప్రకృతిని వశంచేసుకుని చారిత్రకంగా ముందంజ వేశారు. కానీ వీరు సృష్టించే వ్యాపారాభ్యుదయంలో దోపిడియే చీకటి. ఈ చీకటినిచూస్తారు కార్మికవర్గం. ఆ చీకటిలో మిణుగురంత వెలుతురే వారికిలభించేది. కార్మికులు పరాజితులు కనుక వారి అలసిన కన్నులు కాంచేదేమిటి ? తొణికిన స్వప్నం! తొలగిన స్వర్గం! వారి చెదరిన గుండెలను చీకట్లే అదుముతాయి. ఊరవతల నీరింకిన చెరువుపక్క చెట్టునీడ గోనెలతో కుండలతో ఎటుచూస్తే అటు చీకటి అటు దుఃఖం పటునిరాశ' కార్మికులవే !

(3) 'మంచికీ చెడ్డకీ నడుమ కంచుగోడలు' నిర్మించుకుంటుంది బూర్జువావర్గం. నూరు దోషాలలోని ఒక సుగుణాన్నీ నూరు పుణ్యాలలోని ఒక ఘోరాన్నీ చూస్తారు కార్మికవర్గంవారు. ఏది మంచి ? ఏది చెడ్డ ? అనేది లోకవ్యవహారాన్ని బట్టి ఉంటుంది. ఈ రెండింటినీ బూర్జువావర్గంవారు తమ డబ్బువల్ల, అధికారంవల్ల, పలుకుబడివల్ల వేరుచేసుకుంటారు. మంచిచెడ్డలు పరస్పరప్రభావితాలు కాకుండా వారు ఆ రెండింటికీమధ్య కంచుగోడలే పెట్టించగలరు. బూర్జువాల 'మంచి' కార్మికులకు 'చెడు'; కార్మికుల 'చెడు' బూర్జువాలకు 'మంచి'. బూర్జువాల నూరు దోషాలలో కార్మికులు ఒక సుగుణం చూడగలరు. వారు చేసిన నూరుపుణ్యాలలో ఒక ఘోరంకూడా కనిపెట్టగలరు. ఎన్నిదోషాలుచేసినా బూర్జువాలు పెద్దమనుషులు. ఎన్ని దురన్యాయాలుచేసినా వారే బుద్ధిమంతులు. పొద్దుపొడిచి పొద్దుగడిచేదాకా ఎద్దులాగు పనిచేసే కార్మికుల్ని ముద్దకి కూడా దూరంచేయడం బూర్జువాకు ఘోరం, దారుణం కాదు; అది ఆచారం ! అడుగు దాటరానిది ! 'చెయ్యలేం చస్తున్నాం మేము ! జీవనానికి అసరా చూపించ'మని కార్మికులడిగితే అది బూర్జువాకు దౌర్జన్యంచేస్తున్నట్లు అనిపిస్తుంది. కార్మికుల న్యాయమైన కోరికలు బూర్జువాకు దురన్యాయాలు. కార్మికుల శ్రమశక్తిని ధనంగా మార్చుకుని, వారిశ్రమకు తగిన ప్రతిఫలం ఇవ్వకపోవడం బూర్జువాకు న్యాయం. ఇవీ బూర్జువావ్యవస్థలోని మంచిచెడ్డలు; పాపపుణ్యాలు; గుణదోషాలు.

(4) మంచిగదిలోనే సంచరిస్తాయి బూర్జువాల ఊహలు. ఆ మంచిగది ఇదివరకే ఏర్పడినటువంటిది. సరిహద్దులు దొరకని సంధ్యలలో సంచరిస్తారు కార్మికులు. అడుగడుగునా వ్యాఘా

తాలూ వ్యత్యాసాలే వీరికి. బూర్జువాల 'మంచిగది'కి కంచుగోడల సరిహద్దులున్నాయి. బూర్జువాల 'మంచి' నీతి, మతం, న్యాయం, ధర్మం అనేవాటి పర్యాయం. ఒకనాటి ధర్మం మరొకనాటికి అధర్మం అయినా దానిని బూర్జువాలు ఆమోదించరు. పురాతన ధర్మాలే- సనాతనమత సూత్రాలే- వారి ప్రమాణాలు. అందువల్ల బూర్జువాలకు సౌఖ్యాలకు లోపంలేదు. కార్మికులకు మంచిచెడ్డల సరిహద్దులు దొరకవు. కార్మికులకు మంచిగదులూ లేవు; చెడ్డగదులూ లేవు. వెలుగుకూ ఇరులకూ మధ్యభాగమైన సంధ్యలలో వీరు సంచరిస్తారు. అందువల్లనే ఏది మంచి? ఏది చెడ్డ? అనే సందేహం వీరిని బాధిస్తుంది. అడుగడుగునా వ్యత్యాసాలూ వ్యాఘాతాలూ కనిపిస్తాయి. తాజమహాల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవ్వరు? సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుని సాహస మెట్టిది? ప్రభువెక్కిన పల్లకిని మోసిన బోయీ లెవ్వరు? ఇటువంటి ప్రశ్నలు కార్మికులను ఎదుర్కొంటాయి.

(5) బూర్జువావర్గంవారి జీవితం వడ్డించినవిస్తరి అయితే కార్మికవర్గంవారు ఎవరి వంట వారే వండుకోవాలి! ఒక్కొక్కమారు విస్తరే దొరకదు!. శ్రీశ్రీ కార్మికులచేత చెప్పించిన మరో వ్యత్యాసం ఇది.

'వడ్డించిన విస్తరి' శ్రమనెరుగని సుఖజీవితాలకు ప్రతీక. బూర్జువాలకు సైతం వండేవారూ, వడ్డించేవారూ కార్మికులే. కష్టం కార్మికులది! సుఖం బూర్జువాలది! కార్మికులకు వంటా వడ్డనా విస్తరీ అన్నీ సమస్యలే!

(6) మంచి, మర్యాద, మప్పితం, నడత, నాణ్యం విలువలగురించి నిశ్చలనిశ్చితాలు బూర్జువాలవి. అన్నీ సమస్యలే! సందేహాలే! ప్రశ్నలే! కార్మికులవి. ఇది మరో వ్యత్యాసం.

బూర్జువావర్గంవారి నైతికస్థాయి, విలువలు మార్పుల నంగీకరించవు. ఎవరేమైపోయినా అవి నిశ్చలంగా ఉంటాయి. వీరివి గ్రుడ్డినమ్మకాలు. కార్మికులు భౌతికవాదులు కావడంవల్ల కార్యకారణాలను అన్వేషిస్తారు. సంప్రదాయాలను ప్రశ్నించి, అవి కాలదోషం పట్టినవైతే విసర్జిస్తారు. నూతనమైన పద్ధతులను ఆహ్వానిస్తారు. కార్మికులు సమస్యలతో సందేహాలతో ఊరుకోక ప్రశ్నలువేస్తూపోతారు. ఆప్రశ్నలకు బూర్జువాలిచ్చే జవాబులు సంతృప్తిపరచవు. ప్రశ్నించడం హేతువాది లక్షణం. విశ్వసించడం ఆదర్శవాది లక్షణం. గతితార్కిక భౌతికవాదికి నిశ్చలనిశ్చితా లుండవు. విజ్ఞానశాస్త్రాన్నీ చరిత్రనీ ఆధారంగాతీసుకుని తన జ్ఞానాన్ని పెంపొందించుకుంటూ అజ్ఞానాన్ని సవరించుకుంటాడు. తిరుగుబాటు అతని వేదాంతం. కార్మికపక్షపుకవిగా శ్రీశ్రీ మహాప్రస్థానంలో ఎన్నో ప్రశ్నలు వేశాడు. ఈ ప్రశ్నలన్నీ తిరుగుబాటునే సూచిస్తాయి.

(7) బూర్జువాల చూపులు సరళరేఖలో ఉంటాయి. రేఖ చెదిరితే గొల్లుమనిపోతారు. కార్మికుల దృష్టి వర్తులమార్గంలో ఉంటుంది. అది ఆద్యంతరహితం. ఇది మరో వ్యత్యాసం. సరళరేఖ ప్రశాంతికి ప్రతీక బూర్జువాలు ప్రజావిప్లవాలను, కార్మికుల తిరుగుబాట్లను సహించలేరు. అందుచేతనే సరళరేఖ చెదిరితే గొల్లుమంటారు. ఒడుదుడుకులు పనికిరావు. విప్లవాలు లేవనెత్తినవారు సంఘద్రోహులు; రాజద్రోహులు అని వారి అభిప్రాయం. ప్రశాంతపరిస్థితి ఉంటేనే బూర్జువాల ఆటలుసాగుతాయి. కార్మికుల దృక్పథం వర్తులరేఖ- దీనికి ఆదీఅంతం ఉన్నాయి. బూర్జువాల దృక్పథానికి అంతంలేదు. తామే ఆధిక్యంతో ఉండిపోవాలని చూస్తారు. కార్మికులది వర్గరహితదృక్పథం. అది ఆద్యంతరహితం అనడంలో ఒక సత్యం ఉంది. శ్రామిక వర్గం ఆదిమకమ్యూనిస్టువ్యవస్థలో బయలుదేరి ఫ్యూడల్, బూర్జువావ్యవస్థలను అధిగమించి తిరిగి తన కమ్యూనిస్టువ్యవస్థను నిర్మించుకుంటుంది. కమ్యూనిజమే స్థిరమైనది. అందువల్ల దానికి ఆద్యంతాలు లేవు.

(8) తమ సరళరేఖకు అవతలివారి నందరినీ నేరగాళ్ళనుగా చూస్తారు బూర్జువాలు. నూరుదోషాలలో ఒక సుగుణం, నూరుపుణ్యాలలో ఒక ఘోరం చూస్తారు కార్మికులు. సమ్మె చేస్తే నేరంగా, ధిక్కరిస్తే నేరంగా, న్యాయంకోసం ప్రశ్నిస్తే నేరంగా బూర్జువాలు భావిస్తారు. నిజానికి నేరం చేసేది తామే. అయినా అధికారంవల్ల, సంపదవల్ల ఆ నేరాలను నేరాలుగా కనిపించనీయరు. దీనికి వ్యత్యస్తంగా కార్మికులు నూరుదోషాల్లో ఒక సుగుణాన్ని నూరు పుణ్యాల్లో ఒక ఘోరాన్ని మాత్రమే చూస్తారు.

(9) తమ సరళరేఖను రక్షించడానికి బూర్జువాలు న్యాయస్థానాలనూ రక్షకభటవర్గాలనూ చెరసాలలనూ ఉరికొయ్యలనూ ఏర్పాటు చేసుకుంటారు. కార్మికులకు గోడలు లేవు. గోడలను పగులగొట్టడమే వీరి పని. అలజడియే వీరి జీవితం! ఆందోళనయే వీరి ఊపిరి! తిరుగుబాటే వీరి వేదాంతం! వర్గ కలహం తీవ్రమై సామ్యవాదవిప్లవం రావడానికి కావలసిన క్రియావ్యత్యాసమిదే!

అన్యాయాలను భరించలేని అనాథులంతా అభాగ్యులంతా అశాంతులంతా విప్లవశంఖం వినిపించినప్పుడు బూర్జువాప్రభుత్వం ఫాసిస్టు వైఖరిని అవలంబిస్తుంది. చెరసాలల్లో విప్లవకారులను నిర్బంధిస్తుంది. సాహిత్యాన్ని జప్తు చేస్తుంది. ఆయుధాలను వశపరచుకుంటుంది. వాక్ స్వాతంత్ర్యాన్ని రద్దు చేస్తుంది. నేరగాళ్ళను కోర్టులకీడ్చి ఉరిశిక్షలు వేయిస్తుంది.

"Dealing with the workers by legal and extra-legal means, unleashing police reprisals and sending regular troops to put down industrial or student unrest and 'riots', the exploiters' state introduces violence into the struggle, which is, as a rule, armed violence"2

---

2 A B C of Dialectical and Historical Materialism 314 p.

బూర్జువాల మంచిచెడ్డల మధ్య కంచుగోడలుంటే కార్మికులకు ఏవిధమైన గోడలూ లేవు. గోడలు అవతల ఉన్నవాటిని కనిపించకుండా చేస్తాయి. అంటే రహస్యాన్ని దాస్తాయి. గోడలు రెండు భాగాలను వేరుచేస్తాయి. అవి వర్గాలను సృష్టిస్తాయి. గోడలు శీతవాతాతపాలనుంచి రక్షిస్తాయి. అటువంటి గోడలేవీ కార్మికులకు లేవు. పైగా ఉన్న గోడలను పగులగొట్టడమే కార్మికులపని. సమాజపురోగమనానికి ప్రతిష్టంభకాలుగా ఉన్నవాటినన్నింటినీ కార్మికులు పడగొడతారు. "కార్మికులకు భద్రపరచుకోడానికీ పదిలపరచుకోడానికీ ఏమిలేదు. వాళ్ళ జీవిత లక్ష్యం వ్యక్తిగత ఆస్తికి గతంలో వున్న సకలభద్రతలనూ సకలరక్షణలనూ ధ్వంసం చేయడమే!" అన్నారు మార్క్సు ఎంగిల్సులు కమ్యూనిస్టుపార్టీ ప్రణాళికలో. "కమ్యూనిస్టుల సిద్ధాంతం ఒక్క వాక్యంలో చెప్పవచ్చు, వ్యక్తిగత ఆస్తిని రద్దుచేయడం (Abolition of Private Property)"! "కమ్యూనిస్టులకు తమ అభిప్రాయాలూ, లక్ష్యాలు దాచుకోవడమంటే అసహ్యం! సమస్త వర్తమాన సాంఘిక పరిస్థితులనూ బలవంతంగా కూలదోయడం ద్వారానే తమ లక్ష్యాలు సిద్ధించగలవని వాళ్ళు బహిరంగంగానే ప్రకటిస్తారు!" 3 — ఈ వాక్యాలనన్నింటినీ శ్రీశ్రీ "గోడలను పగులగొట్టడం"లో నిక్షేపించాడు.

అలజడి, ఆందోళన అనేవి కార్మికవర్గంవారు తమహక్కులను సాధించుకోవడానికో తాత్కాలికసమస్యల పరిష్కారానికో వేతనాలపెంపుకో పనిగంటల తగ్గింపుకో ధరలతగ్గింపుకో చేసే సమ్మెలు, ప్రదర్శనలు, కరపత్రాలు, కవితలు, ఊరేగింపులు, సభలు, బుర్రకథలు మొదలైనవాటిని సూచిస్తాయి. కార్మికులకు అలజడియే జీవితం. ఆందోళనయే ఊపిరి. తిరుగుబాటే వేదాంతం. కూడు, గూడు, గుడ్డ అనే కనీసపుకోరికలు నెరవేరడానికై కార్మికులు అలజడినీ ఆందోళననూ తిరుగుబాటునూ చేస్తారు. తిరుగుబాటు బూర్జువాలమీదనే! వారి నిరంకుశ పాలననూ దోపిడినీ భరించలేకనే!

"Then the revolutionary proletariat is obliged to spearhead its struggle against the political machinary of the exploitors' power, i.e. against the bourgeois state. The first step in the direction of political struggle is the political strike".[4] "Revolutionary policy ... ... is aimed precisely at overthrowing this system (existing social system) through the proletariat struggle"[5]. "It is only when the "lower classes" donot want to live in the old way that the revolution can triumph"[6]

బూర్జువావ్యవస్థలో సామాజికరాజకీయఆర్థికసాంస్కృతిక వాతావరణాన్ని మార్చడానికి కార్మికులే తగినవారు. విప్లవమే వారి ఉపనిషత్తు. బూర్జువాల వేదాంతం పారలౌకికం.

3 కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక 48, 52, 73 పే.

4. 5. 6. ABC of Dialecttical and Historical Materialism 314, 344 PP.

ఈ లోకంలో సుఖపడుతూ పరలోకంలో కూడా సుఖపడాలన్నదే వారి చూపు మోక్షమే వారి వేదాంతఫలం. కార్మికులకు ఈ లోకంలోనే సుఖంలేదు. పరలోకం అనేది లేనూలేదు. అందువల్ల ఈ లోకంలోనే వారికి కావలసింది జీవనదుఃఖమోక్షం. అందువల్ల వారి వేదాంతం తిరుగుబాటే. తమ కష్టాలకు కారకులు బూర్జువాలు. వారిమీదనే తిరుగుబాటు.

(10) ముళ్ళూరాళ్ళూ అవాంతరాలెన్ని ఉన్నా ముందుదారి కార్మికులది. ఉన్నచోటే చాలునంటారు బూర్జువాలు. ఇంకా వెనక్కి పోతామంటారు కూడా వారిలో కొందరు!

మరోప్రపంచానికి మహాప్రస్థానం సాగించడంలో కార్మికులు ముళ్ళూరాళ్ళూ వంటి అవాంతరాలెన్నింటినో దాటవలసి ఉంటుంది. బాటలు నడచీ పేటలు కడచీ కోటలన్నిటిని దాటండి! నదీనదాలూ అడవులు కొండలు ఎడారులా మనకడ్డంకి? పదండి ముందుకు! అనే ప్రబోధమే 'ముందుదారి'లో ఉన్నది. కార్మికుల చూపు భవిష్యతుమీదనే! బూర్జువాల చూపు వర్తమానం మీద; గతం మీద. ముందుదారి అంటే భవిష్యత్తు. ఉన్నచోటు అంటే వర్తమానం. వెనకదారి అంటే గతం.

బూర్జువాల, పెటీబూర్జువాల యథాస్థితివాదాన్నీ (Conservatism) ప్రగతివ్యతిరేకవాదాన్నీ (reactionism) 'ఉన్నచోటు చాలు' 'వెనక్కిపోతాం' అన్నమాటలు ధ్వనిస్తున్నాయి.

"మధ్యతరగతిలో క్రిందివర్గంవాళ్ళు – చిన్నచిన్నపరిశ్రమల యజమానులూ, చేతిపనులవాళ్ళూ, రైతులూ – వీళ్ళందరూ బూర్జువావర్గంతో పోరాడుతారు; కానీ వీళ్ళ పోరాటం మధ్యతరగతిలో భాగాలుగానే తాము బతుకుతూ వుండడానికి. అనగా వీళ్ళు విప్లవకారులు కాదు; యథాస్థితివాదులు. అంతేకాదు; ప్రగతివ్యతిరేకులు కూడా; ఎందుకంటే వీళ్లు చరిత్రగతిని వెనక్కు త్రిప్పడానికి ప్రయత్నిస్తారు."7 అంటూ మధ్యతరగతిలోని క్రిందివర్గంవారి మన స్తత్త్వాన్ని మార్క్సు ఎంగిల్సులు వివరించారు. ఉన్నచోటు చాలు: ఇంకావెనక్కిపోతాం అనేవారిలో వీరు కూడా ఉన్నారు. అంతేకాదు; పెటీబూర్జువావర్గంవారు కూడా ఉన్నారు. "ఆధునికనాగరికత పూర్తిగా అభివృద్ధిచెందిన దేశాలలో పెటీబూర్జువావర్గం అనే ఒక కొత్తవర్గం యేర్పడింది. యిది కార్మికవర్గానికీ బూర్జువావర్గానికీ మధ్య అటూఇటూ ఊగుతూ వుంటుంది; బూర్జువా సమాజపు అనుబంధభాగంగా నిత్యం పునఃసృష్టి ఔతూ వుంటుంది". ఈ వర్గంవారు ప్రతిపాదించిన 'పెటీబూర్జువాసోషలిజం' కూడా ప్రగతినిరోధకవాదమే. దీన్ని గురించి మార్క్సు ఎంగిల్సు ఏమన్నారో చూడండి — "పాతఉత్పత్తిసాధనాలనూ, పాతమారకపు సాధనాలనూ పునస్థాపించి (sic) వాటితోపాటు పాతఆస్తిసంబంధాలనూ, పాతసమాజాన్ని పునస్థాపించడం (sic);

7 కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక 47 పే.

లేదా ఆధునికఉత్పత్తిసాధనాలచేతా, ఆధునికమారకపు సాధనాలచేతా బ్రద్దలైన, బ్రద్దలు కాక తప్పని, పాత ఆస్తిసంబంధాల చట్రంలోనే యీ సాధనాలను బలవంతంగా యిరికించడం. ఈ రెండూ కూడా ప్రగతినిరోధకాలే; ఊహాస్వర్గపథకాలే."8

ఇలాంటి ప్రగతినిరోధకసోషలిస్టులు ఇంకా రకరకాలవారున్నారని మార్క్సు ఎంగిల్సులు తమ ప్రణాళికలోని మూడవప్రకరణం (సోషలిస్టు కమ్యూనిస్టు సారస్వతం)లో వివరించారు. వారు చెప్పిన రకాలు (1) ఫ్యూడల్ సోషలిజం (క్రైస్తవ సోషలిజం) (2) పెటీబూర్జువా సోషలిజం (3) జర్మన్ సోషలిజం (అసలు సోష.లిజం).

ఇవిగాక యథాస్థితివాదసోషలిజం (బూర్జువాసోషలిజం), విమర్శనాత్మక ఊహాస్వర్గ సోషలిజమూ కమ్యూనిజమూ అనే వాటిని వివరించి విమర్శించారు.

"బూర్జువాసమాజాన్ని చిరస్థాయి చేసే ఉద్దేశంతో, సామాజికయిబ్బందులు తొలగించాలని బూర్జువావర్గంలో ఒక భాగం కోరుతుంది. యీ భాగంలో రకరకాలవాళ్ళు వున్నారు–అర్థశాస్త్రవేత్తలూ, దానశీలురూ, దయాపరులూ, కార్మికవర్గసంక్షేమకారులూ, ధర్మసంస్థా నిర్వాహకులూ, జంతుహింసా నివారణ సంఘసభ్యులూ, మితపానప్రచారపరవశులూ, యింకా అనంతరూపాల కుహనాసంస్కర్తలూ వున్నారు ... సోషలిస్టుబూర్జువాలు ఆధునికసాంఘిక పరిస్థితులు యిచ్చే సౌకర్యాలన్నీ కావాలంటారు – కానీ వాటివెంట తప్పనిసరిగా వచ్చే పోరాటాలూ ప్రమాదాలూ మాత్రం లేకుండా, ప్రస్తుతసమాజంలోని విప్లవాంశాలూ విచ్ఛేదకాంశాలూ లేకుండా యీ సమాజమే వుండాలని వీళ్ళు కోరుకుంటారు"9 "బూర్జువా సోషలిజాన్ని ఒక్కమాటలో క్రోడీకరించి చెప్పవచ్చు; బూర్జువా బూర్జువాగా వుండడం యెందుకంటే కార్మికవర్గశ్రేయస్సు-కొరకు !"10

"కార్మికవర్గానికీ బూర్జువావర్గానికీ పోరాటం అభివృద్ధికాని తొలిదశలో" కొందరు ఊహాస్వర్గసోషలిజం గురించి చెబుతారు. సెంట్‌సైమన్ (1760–1825), ఫోరియర్ (1772–1837), ఓవెన్ (1771-1858) వంటివారు వర్గకలహాన్ని వ్యతిరేకించి సోషలిజాన్ని ఊహించారు.

---

8 కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక 64, 65 పే.

9 69 ,, పే.

10 ,, 70 పే.

(11) బూర్జువాలు తృప్తిగా చచ్చిపోతారు. ప్రపంచం వీరిని మరిచిపోతుంది. కార్మికులు ముందుకు పోతారు. ప్రపంచం కార్మికులవెంట వస్తుంది. ఇది మరో వ్యత్యాసం.

బూర్జువాలను 'చావండి' అనే, శ్రీశ్రీ తనమహాప్రస్థానగీతంలో కార్మికవర్గంచేత అనిపించాడు. కార్మికవర్గాన్ని 'పదండి ముందుకు' అన్నాడు. కార్మికుడే 'నేనుసైతం భువనభవనపుబావుటానై పైకి లేస్తాను' అన్నాడు. మునుముందుకు సాగించడమే కార్మికవర్గపుకవిత్వానికి ప్రధానలక్ష్యం.

(12) అభిప్రాయాలకోసం బాధలు లక్ష్యపెట్టనివాళ్ళు కార్మికులలోకి వస్తారు. అభిప్రాయాలు మార్చుకుని సుఖాలు కామించేవాళ్లు బూర్జువాలలోకి పోతారు. ఇది చిట్టచివరి వ్యత్యాసం.

బూర్జువాల సుఖాలు దోపిడిమీద ఆధారపడిఉంటే కార్మికుల సుఖాలు విప్లవం మీద ఆధారపడిఉన్నాయి. మొదటిది హీనమైనది; రెండవది ఉజ్జ్వలమైనది. సమాజం బూర్జువా వ్యవస్థలో రెండు వర్గాలుగా చీలిపోయి, పరస్పరవిరుద్ధశక్తులుగా ఏర్పడినప్పుడే విప్లవంసాధ్యమై సమసమాజం అవతరిస్తుంది. కనుక కార్మికులు కోరేది వర్గవైరుధ్యాలు పెరగడమే. కార్మికుల పక్షంలో ఉండేది కమ్యూనిస్టులు. వీరిని గురించి మార్క్సుఎంగిల్సులు రాసిన మాటలు—"కమ్యూనిస్టులకు తమ అభిప్రాయాలూ, లక్ష్యాలూ దాచుకోవడ మంటే అసహ్యం. సమస్తవర్తమాన సాంఘికపరిస్థితులనూ బలవంతంగా కూలదోయడం ద్వారానే తమలక్ష్యాలు సిద్ధించగలవని వాళ్లు బహిరంగంగానే ప్రకటిస్తారు. కమ్యూనిస్టు విప్లవమంటే పాలకవర్గాలు గజగజ వణకనీ! కార్మికులు పోగొట్టుకొనేదేమీ లేదు, తమ శృంఖలాలు తప్ప!! వాళ్ళు గెలుచుకోవలసింది ఒక ప్రపంచం వుంది." ఈ అభిప్రాయంకోసం కార్మికులు బాధలకు తట్టుకోకతప్పదు. ఈ అభిప్రాయం నచ్చనివారు బూర్జువాలకు బానిసలుగా బ్రతకకనూ తప్పదు.

పైన వివరించిన పన్నెండురకాల వ్యత్యాసాలూ భిన్నవర్గాల ప్రాపంచికదృక్పథాన్ని సూచిస్తున్నాయి. నైతిక, భౌతిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ, సామాజికదృక్పథాలలో రెండువర్గాలకూ భిన్నత ఉంది. ఈ భిన్నతను తెల్పడానికే శ్రీశ్రీ ఈ ఖండిక రచించాడు.

## శ్రీశ్రీ నాటకీయసంవిధానం

వ్యష్టి చైతన్యం బావకవిత్వానికి ఊపిరి కాగా సమష్టిచైతన్యాన్ని అభ్యుదయకవిత్వానికి ప్రాణంగా మార్చినవాడు శ్రీశ్రీ. 'వ్యత్యాసం'లో కార్మికవర్గమంతా ఏకకంఠంతో మాట్లాడినట్లు కవిత్వం నడిచింది. ఈ మాటలు నాటకీయంగా ఉన్నాయి. వ్యత్యాసం ఖండికను మూడు భాగాలుగా విభజించాలి. మొదటిభాగంలో కార్మికులు బూర్జువాలకు ముఖాముఖిగా నిలబడి 'మీ పీడకవ్యవస్థ ఇలాంటిది' అని చెబుతూ లోపాలను స్ఫురింపజేస్తారు. రెండోభాగంలో కార్మి

కులు 'మా పీడిత జీవితం ఇలాంటిది' అని తమబాధలను వ్యక్తంచేస్తారు. ఈ రెండుభాగాల లోనూ మీరూ మేమూ అనే పద్ధతి విడివిడిగా నడిస్తే మూడోభాగంలో మేమూమీరూ అనే పద్ధతి సమానాంతరంగా నడుస్తుంది. మూడోభాగంలో పీడితుల ఆధిక్యం స్ఫురింపజేయబడింది. మొత్తం ఖండికఅంతా కార్మికుల వాచికాభినయమే తప్ప బూర్జువాల మాట ఉండదు. బూర్జువాలు శ్రోతలుగా మిగిలిపోతారు.

## శ్రీశ్రీ కవిత్వంలో నగ్నపదాల సమూహం

చిరకాలంనుంచీ కవిత్వంలో ఉదాత్తమైన పదజాలానికి అలవాటుపడిపోయిన సాంప్రదాయికులు 'మాకు గోడలు లేవు, గోడలు పగులగొట్టడమే పని' వంటి సామాన్యపదజాలాన్ని కవిత్వంగా అంగీకరించలేరు. అందుకు అలవాటే కారణం తప్ప గుణపక్షపాతం కాదు. కార్మిక పక్షపాతం గలవారికీ బూర్జువాద్వేషం గల వారికీ 'వ్యత్యాసం' లోని ప్రతివాక్యంలోనూ కవిత్వం వినిపిస్తుంది. ఉదాహరణకు: గోడలు అనే పదాన్ని శ్రీశ్రీ అభిధేయార్థంలోనే వాడలేదు. కార్మికులకూ బూర్జువాలకూగల వ్యత్యాసం తెలిసినవారికి కార్మికుల ప్రతివాక్యంలోనూ అర్థ విస్తృతి కనిపిస్తుంది. ప్రతిపదానికీ విశిష్టార్థం గోచరిస్తుంది. వ్యత్యాసం ఖండికలోని శిల్పాన్ని గురించి సందేహించేవారికి శ్రీశ్రీ ఇచ్చిన సంజాయిషీ:– "ఇది కవిత్వంగా అంగీకరించమని అడగడం సాహసంగా కనబడవచ్చును. యతిప్రాసలూ గణాలూ లేకపోతే మానిపోయె! కనీసం ... యమకం, అనుప్రాసల్లాంటివేనా లేవు. దీన్ని కవిత్వం అనగలమా అని చాలామంది ఎదుర్కోవచ్చును. నేనుకూడా లాలిత్యం, మాధుర్యం మొదలైన కవితాద్రవ్యాలను గురించి కలలు గనే రోజులలో ఈ నగ్నపదాల సముదాయాన్ని కవిత్వం అనకపోయి ఉండేవాడిని. ఇటువంటిది కవిత్వం కాజాలదనేవాళ్ళు అలా యెందుకంటారో నేను ఊహించుకోగలను. కాని నా దృష్టినుంచి ఇది ఎందుకు కవిత్వం అనుకోవాలో గ్రహించండి అని అడగవలసింది ఉంది".11 ఈ మాటలు రాసిన శ్రీశ్రీ దీనికి తగినట్లు 'వ్యత్యాసం' ఖండిక నుదాహరించాడు. నగ్నపదాల సముదాయాన్ని కూడా కవిత్వమే అనవచ్చు కానీ ఇందులోని సంవిధానం మైనస్ కూ కవిత్వం ప్లస్ కూ చెందినదిగా భావించవలసివస్తుంది. ముత్యాలసరాలు — ఒక కృషి అనే వ్యాసంలో శ్రీశ్రీయే + కవిత్వం + సంవిధానం అనే ఫార్ములా గల్గినదే ఉత్తమకవిత్వంఅనీ; + కవిత్వం – సంవిధానం గల రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిపద్యం కన్నా స్విన్‌బర్న్ శబ్దచిత్రకవిత్వం ఉత్తమోత్తమ మనీ సూచించి ఉన్నాడు. వ్యత్యాసంలో సంవిధానం స్థానాన్ని సామాజికదృక్పథం ఆక్రమించింది. అద్వైతం, స్విన్‌బర్న్ వంటి ఖండికలలోని ప్రాసలు, యమకాలు, బింకాలు, పొంకాలు, శబ్దసౌష్ఠవం వ్యత్యాసంలో లేవు. శ్రీశ్రీ శుద్ధ కవిత్వం వదలి పూర్తిగా ఉపయోగ్యం

11 శ్రీశ్రీ సా, రెండు. వచన 505

కవిత్వంలో పడినప్పుడు శైలి ఈ పరిణామానికి వచ్చింది. వ్యత్యాసం, వాడు వంటి రెండుఖండిక లలో తప్ప ఈ నగ్నపదశైలి కనిపించదు. మార్క్సిజం నేపథ్యంగాగల ప్రతిజ్ఞ, జగన్నాథుని రథచక్రాలు, వంటివి కూడా పకడ్బందుగా నడిచిన గేయాలే. వాడు, వ్యత్యాసం అనేఖండికలు ఉపయోగ్యకవిత్వంకోసం చేసిన ప్రత్యేకప్రయోగాలు; వచన కవితకు ఉదాహరణలు. వీటిలోని సంవిధానం సరికొత్తది. కొత్తవస్తువుకు తగినది.

గణవిన్యాసం, లయ, ప్రాస, సంగీతమాధురి, వేగం మొదలైన సంవిధానవిశేషాలను ఎంతో ప్రజ్ఞతో ప్రయోగించిన శ్రీశ్రీయే ఒకచోట ఇలా అన్నాడు:- "కవిత్వం చెప్పడం ఒక కష్టమైన పనికాకూడదు.... జీవితంలోనూ కవిత్వంలోనూ సంప్రదాయవాదానికీ విప్లవవాదానికీ మధ్య ఎడతెగనిపోరాటం ఎప్పుడూ సాగిపోతూనే ఉంటుంది ... ఛందస్సుకీ వ్యాకరణానికీ అలంకారాలకీ అన్నింటికీ అవతల స్వచ్ఛమూ స్వచ్ఛందమూ నీరవమూ నీరూపమూ అయిన కవిత్వపదార్థం ఒకటి ఉంది"12 కవిత్వం చెప్పడంలోని సౌలభ్యం వేమనలోనూ గురజాడలోనూ శ్రీశ్రీకి కనిపించింది. ఆ సౌలభ్యం కవి చెప్పడంలోనే కాదు; పాఠకుడు అందుకోవడంలోనూ ఉండాలి. ఉభయపక్షాలలోనూ ఉండవలసిన ఈ సౌలభ్యం ప్రయోజనంమీద ఆధారపడి ఉంటుంది. శుద్ధకవితావాది సౌలభ్యంకన్నా సౌష్ఠవాన్నీ సౌందర్యాన్నీ అపేక్షిస్తాడు. ఉపయోగ్య కవిత్వం వచ్చేసరికి సౌలభ్యం ప్రధానస్థానం పొందుతుంది. వ్యత్యాసం, వాడువంటి కవితలు బూర్జువావ్యవస్థలోని పీడితవర్గపాఠకుడి నుద్దేశింపబడ్డాయి. అందులోనూ కార్మికపాఠకుడు మననం చేసుకోవలసిన కవితలివి. అందువల్లనే శ్రీశ్రీ సంవిధానభారాన్ని తగ్గించవలసి వచ్చింది. నగ్న పదాల్లో రాసినా ఈ కవితలో నాటకీయతాసంవిధానం కవిపనితనాన్ని సూచిస్తూనే ఉంది.

# 74 వాడు

## దౌర్జన్యానికి దౌర్జన్యం మందు!

1937

"క్రౌర్యకౌటిల్యకల్పితకఠినదాస్య/శృంఖలములు తమంతనె చెదరిపోవ/గగనతలము మ్రోగ్రగంగంరమెత్తి/జగమునిండ స్వేచ్ఛాగానఘురుల నింతు" అంటూ కృష్ణశాస్త్రి ఘోషించినప్పుడు ఆ క్రూరులూ కుటిలురూ ఎవరు? వారెందుకు ఎవరికి దాస్యశృంఖలాలు తగిలించారు? అవి చెదరిపోవడానికి చేయవలసిందేమిటి? అనే ప్రశ్నలకు సమాధానాలు లేవు. వ్యక్తిస్వేచ్ఛకు మతాచారాలు, మూఢవిశ్వాసాలు అంతరాయాలను కల్పించవచ్చు. సమాజ స్వేచ్ఛకు రాజకీయాలు, ఆర్థికవ్యవస్థ అంతరాయాలు కల్పించవచ్చు. దేశానికి వలసవచ్చి, ఫ్యూడల్ ప్రభువులను లొంగదీసుకుని బూర్జువావ్యవస్థను స్థాపించిన ఆంగ్లేయులు ప్రజలనే బానిసలుగాచేసుకున్నారు. ఇక్కడ పీడన ప్రజల స్వేచ్ఛను అపహరించింది. పారతంత్ర్యాన్ని తిరస్కరించడం స్వేచ్ఛాప్రియుల లక్షణం. ఈ పారతంత్ర్యం ధనవంతులకూ సామాన్యులకూ సమానసమస్యే. కానీ ధనవంతులు తమ పెట్టుబడితో పరిశ్రమలను నడపడం ప్రారంభించి నప్పుడు కూలిపనికి కుదిరిన సామాన్యులకు మరోరకమైన సమస్య ఎదురవుతుంది. ఈ సమస్య పేరే 'దోపిడి' (exploitation). బూర్జువా తన పెట్టుబడిని పెంచుకోవడానికి కార్మికుల శ్రమ సంపదను దోచుకుంటాడు. ఇందులో కార్మికుడి జీవితం బానిసతనానికీ పేదరికానికీ అన్యాయానికీ గురి అవుతుంది. బూర్జువాలు క్రూరంగా కుటిలంగా ప్రవర్తిస్తారు. వీరి క్రౌర్యకౌటిల్యాలను ఎదిరించడానికే శ్రీశ్రీ తన కవిత్వాన్ని వినియోగించాడు.

అందువల్ల శ్రీశ్రీ కవిత్వం ఒక వర్గానికి అంకితమయింది. ఆ వర్గమే కార్మికవర్గం. కార్మికవర్గానికి శత్రువు బూర్జువావర్గం. కార్మికవర్గపక్షపాతి అయిన శ్రీశ్రీ కార్మికవర్గశత్రువైన బూర్జువాకు శత్రువే. ఎందువల్ల? తనమిత్రుల శత్రువు తనకూ శత్రువే. ఈ శత్రువుయొక్క స్వార్థాన్నీ దోపిడీనీ ఎంతగా బైటపెట్టి వర్గకలహాన్ని ప్రోత్సహిస్తే అంతగా తన కవితాలక్ష్యం నెరవేరినట్లు శ్రీశ్రీ భావిస్తాడు. అయితే మానవజాతి సమష్టిశ్రేయస్సు శ్రీశ్రీకి అక్కరలేదా? అంటే తప్పకుండా కావాలి. కానీ ఆ శ్రేయస్సు బూర్జువాలపై కార్మికులు తిరగబడినప్పుడే లభిస్తుందని శ్రీశ్రీ నమ్ముతాడు. దోపిడి ఉన్న సమాజంలో చిన్న దోపిడిదారును పెద్దదోపిడిదారు దోచుకుంటూ ఉంటాడు. కనుక దోపిడీసమాజంలో బూర్జువాకు కూడా సుఖంలేదు. పైగా

బూర్జువా చేసే పనులు నీతిహీనంగా ఉంటాయి. బూర్జువాప్రవర్తనావాస్తవికతను చిత్రించ డానికి శ్రీశ్రీ 'వాడు' ఖండికలో ప్రయత్నించాడు.

## శ్రీశ్రీ కవిత్వంలో నగరవాతావరణం

పరిశ్రమలు నగరవాతావరణంలో ఉండేవి కనుక బూర్జువాలూ నగరంలోనివారే. వీరిని కవిత్వంలోకి ప్రవేశపెట్టిన శ్రీశ్రీ తెలుగుకవిత్వానికి ఆధునికనగరప్రవేశం కల్పించాడు. కర్మాగారంలో కార్మికులు పడే శ్రమ, ఆ శ్రమవల్ల ఉత్పన్నమయ్యే వస్తువులు, శ్రమకు బూర్జువా చెల్లించే కూలి, వస్తువులకు బూర్జువా నిర్ణయించే ధరలు, వాటివల్ల అతనికి కలిగే లాభం, దాన్ని చూసి కార్మికులు తమ కూలి పెంచవలసిందిగా అడగడం, ధరలుపెంచే బూర్జువా కూలిపెంచక పోగా కార్మికులకు కలిగే నరకయాతన, వారు తిరగబడితే బూర్జువా తీసుకునే చర్యలు, కర్మ వాదాన్ని ప్రబోధించడం వంటి ఒక భౌతికప్రపంచం కవిత్వంలోకి ప్రవేశించింది శ్రీశ్రీవల్ల.

చిరకాలంనుంచీ వస్తున్న ఆదర్శకవితాసంప్రదాయం ఈ భౌతికప్రపంచం వల్ల మాసి పోయింది; మారిపోయింది. ఫ్యూడల్ వ్యవస్థలోని జీవితవిధానాలు, ఉత్పత్తివిధానాలు బూర్జువా వ్యవస్థలో మారిపోవడంవల్లనే కవితాసంప్రదాయాలూ మారిపోయాయి. బూర్జువావ్యవస్థ ఫలితాలే ఆధునికనగరాలు, పరిశ్రమలు, యంత్రాలు, రవాణాసౌకర్యాలు, వార్తాప్రసారం, విదేశవాణిజ్యం వంటివి. ఫ్యూడల్ వ్యవస్థలో జీవితవిధానాలూ, ఉత్పత్తివిధానాలూ పల్లెలకూ ప్రకృతికీ ముడిపడి ఉండేవి. ఇవి నగరాలకు మారడంతో కవిత్వంకూడా నగరాలకు మారింది. కాని ఈ మార్పును పూర్తిగా ప్రతిఘటించినవారు భావకవులు. మార్పును అంగీకరిస్తూనే ఇంకా మార్పును కోరినవారు అభ్యుదయకవులు. ఈ మార్పు తెలుగులో శ్రీశ్రీ ద్వారా జరిగింది.

రగులుకొనే రాక్షసిబొగ్గు - పొగగొట్టపు భూంకారధ్వని - అగ్గిపుల్ల-సబ్బుబిళ్ళ-ప్రభుత్వ పతనం - యుద్ధం - విప్లవం - వైద్యశాల-శస్త్రికారుని మహేంద్రజాలం-సమ్మెలు - కార్ఖానా-యంత్రభూతాలు - చెరసాలలు - రాక్సీలో నార్మాషేరర్ - బ్రాడ్వేలో కాంచనమాల - ఉడిపి శ్రీకృష్ణవిలాస్ - ఉద్యోగి - విద్యార్థి - కర్మాగారం - కళాయతనం - కార్యాలయం - కారాగృహం - రిక్షావాలా - ఓడకళాసీ - గనిపనిమనిషి - మరఫిరంగి - విషవాయువు-న్యాయ స్థానాలు - రక్షకభటవర్గాలు - ఉరికొయ్యలు - వంతెనలు - వస్తుప్రదర్శనశాలలు - గ్రంథా గారాలు - పరిశ్రమాలయాలు - ధూమశకటాలు - నౌకలు - విమానాలు - రేడియో-ఆఫీసులు - సభలు - వంటి కవితాసామగ్రితో శ్రీశ్రీ 'నగరకవి'గా దర్శనం ఇస్తాడు. గ్రామీణప్రకృతి వాతావరణంనుంచి నగరపారిశ్రామికవాతావరణానికి తెలుగుకవిత్వాన్ని నడిపించాడు శ్రీశ్రీ. ఇటువంటి సామగ్రిని కవితాసామగ్రిగా భావకవులు ఆమోదించలేదు.

## శ్రీశ్రీ కవిత్వంలో వర్గస్వభావాల చిత్రణ

బూర్జువావర్గస్వభావాన్నీ కార్మికవర్గస్వభావాన్నీ శ్రీశ్రీ చిత్రించాడు. 'వ్యత్యాసం'లో బూర్జువాలకు ముఖాముఖిగా కార్మికులంతా కలిసి వర్గతారతమ్యస్వభావాలను చెబితే, 'వాడు'లో బూర్జువాల పరోక్షంగా కార్మికులు తమకు జరిగిన అన్యాయాన్ని గురించి చెప్పుకుంటారు. ఇక్కడ శ్రోతలు బూర్జువాలు కారు; కార్మికులూ! మధ్యతరగతివారూ!

బూర్జువాకూ కార్మికులకూ మధ్యజరిగిన మూడు సంఘటనలనుచెప్పడమే శ్రీశ్రీ 'వాడు'లో చేసిన పని.

(1) కార్మికులు అందరూకలసి అందమైన వస్తుసముదాయం నిర్మిస్తారు. వారిది నిర్విరామ కృషి. నిర్మాణమార్మికత వారికే తెలుసు! కానీ వారు తయారుచేసిన వస్తువులను బూర్జువా స్వాధీనం చేసుకున్నప్పుడు వారు అసహాయంగా ఆక్రందిస్తూ 'అన్యాయం! అన్యాయం!' అంటారు.

(2) కార్మికులు పొద్దుపొడిచి పొద్దుగడిచేదాకా ఎద్దుల్లాగు పనిచేస్తారు. కానీ వారు మొద్దులూ మొరటులూ గా మిగిలిపోవడానికి కారణం విద్యాసౌకర్యాలు లేకపోవడం! బూర్జువా వారిని ముద్దకి కూడా దూరం చేస్తాడు. కార్మికులు ఏమీ చేయలేక 'ఘోరం ఇది! దారుణం ఇది!' అని ఘోషిస్తారు.

(3) ముద్దలేకపోవడం వల్ల కార్మికులు కడుపుమంటను భరించలేక పనిముట్లు క్రిందపడవేసి సమ్మె చేస్తారు. 'చెయ్యలేం చస్తున్నాం! జీవనానికి ఆసరా చూపించు!' అంటూ బూర్జువాను ప్రార్థిస్తారు. ఆ మాటలను బూర్జువా లెక్క చేయడు.

పనిముట్లూ, పెట్టుబడి తనదనే నెపంచేత వస్తువులను కూడా స్వాధీనం చేసుకోవడం బూర్జువా స్వార్థస్వభావం. ఈ స్వార్థాన్ని కప్పి పుచ్చుకుంటూ కార్మికుల్ని 'అనుభవించాలి మీకర్మం!' అంటాడు.

ఎద్దుల్లా పనిచేసి మొద్దుల్లా మిగిలిపోవడం కార్మికుల ఆచారం! అంటాడు బూర్జువా. ఇది అమానుషవర్తన — మూర్ఖత్వం.

సమ్మెచేస్తే కార్మికుల నోరుమూసి, జోడుతీసి కొట్టి దౌర్జన్యం చేశారని ఆరోపించడం బూర్జువా కర్కశచిత్తవృత్తికి నిదర్శనం.

కార్మికులను పరాజితులుగా చిత్రించడమే మహాప్రస్థానగీతాలలో కనిపిస్తుంది. పరాజితులు సాహసులై విజృంభించాలన్నదే శ్రీశ్రీ ఆశయం. వారికి సాహసాన్ని నూరిపోస్తాడు శ్రీశ్రీ.

కార్మికుడు శ్రమకు అంకితమైపోతాడు. కాని ఆ శ్రమను అతడు బూర్జువాఅధికారంలో ఉంటూనే చేస్తాడు. అందుకే అతడు పరాధీనుడు! పరాజితుడు! తన శ్రమ మీదనే బూర్జువా బ్రతుకుతున్నాడనే సత్యం తెలుసుకోలేక పోతాడు.

## శ్రీశ్రీ - బూర్జువా గౌరవతిరస్కారం

బూర్జువావ్యవస్థలో శ్రమకు గౌరవం, మర్యాద లభించవు. దోచుకునేవాడు గౌరవింపబడతాడు. దోచుకోబడేవాడు హీనంగా చూడబడతాడు. ఈ పరిస్థితిని తారుమారు చేయాలని శ్రీశ్రీ అభిప్రాయం! ఘర్మజలానికి ఖరీదుకట్టే షరాబు లేడనడం అందుకే! శ్రమజీవనసౌందర్యానికి సమానమైనది లేదన్నాడు శ్రీశ్రీ. ఈ దృష్టితో చూస్తే సోమరిగా బ్రతికే బూర్జువాకు గౌరవం ఈయనక్కరలేదు. ధనవంతుడైన బూర్జువాను లోకం ఎంతో గౌరవిస్తుంది. ఆయన, గారు, శ్రీ వంటి గౌరవవాచకాలను తగిలిస్తుంది. కానీ అందమైన వస్తుసముదాయాన్ని ఎత్తుకుపోయినవాడ్నీ, న్యాయాన్నీ ధర్మాన్నీ తిరస్కరించి దౌర్జన్యం జరిపినవాడ్నీ "వాడు" అంటే చాలునని శ్రీశ్రీ అభిప్రాయం. ఈ అభిప్రాయాన్నే శీర్షికలో వ్యక్తంచేశాడు. 'వాడు' ఏకవచనం! తిరస్కార సూచకం!

బూర్జువాల ఉచ్చస్థితి పోయినప్పుడే సమసమాజం ఏర్పడుతుంది. అప్పుడే కార్మికుడు భువనభవనపుబావుటాగా సిసలైన గౌరవాన్ని పొందుతాడు.

## శ్రీశ్రీ - బూర్జువాదృక్పథపరామర్శ

బూర్జువా జీవితసౌఖ్యాలను కాపాడుతున్న విషయాలు రెండున్నాయి. మొదటిది మతం; రెండవది రాజకీయాధికారం. ఈ రెండింటినీ శ్రీశ్రీ వ్యక్తంచేసిన రీతిని పరిశీలిద్దాం!

(1) కార్మికులు తమ 'భౌతికకర్మఫలాన్ని' తాముఅనుభవించటంలేదు. దాన్ని బూర్జువా అనుభవిస్తున్నాడు. ఇది అన్యాయం అని కార్మికులన్నప్పుడు 'అనుభవించాలి మీ కర్మం' అంటాడు బూర్జువా. ఇందులోనే ఉంది వేదాంతం. ఇది 'పూర్వజన్మపాపకర్మం' బూర్జువాదృష్టిలో. ఆ కర్మననుభవించడం అంటే కష్టాలననుభవించడం. బూర్జువా కార్మికులకు చెప్పేవిలువలు మతంమీద ఆధారపడి ఉంటాయి. తన స్వార్థంఅయితే భౌతికలాభంమీదా ఇతరుల విషయం అయితే మతసిద్ధాంతాలమీదా ఆధారపడి ఉందనడమే బూర్జువామనస్తత్వంలోని అక్రమం. "Those who toil and live in want all their lives are taught by religion to be submissive and patient while here on earth, and to take comfort in the hope of a heavenly reward"[1] ఈలోకంలో శ్రమపడితేనేం పరలోకంలో నీకు సౌఖ్యం లభిస్తుందిగదా అనేది మతం ఇచ్చే ఓదార్పు. బూర్జువా మాటల్లో ఈ ఓదార్పు కూడా కనిపించదు. బూర్జువా తాననుభవిస్తున్నది కూడా తన కర్మమేఅంటాడు. ఇది పూర్వజన్మపుణ్యకర్మ మరి.

"Every philosophy expresses a class outlook. But in contrast to the exploiting classes which have always sought to uphold and justify their class position by various

---

1 LENIN : On Socialist Idealogy and Culture 37 P.

disguises and falsifications, the working class from its very class position and aims, is concerned to know and understand things as they are, without disguise and falsification."[2]

బూర్జువావర్గం తను చేస్తున్న అన్యాయానికి మతపుముసుగులు వేస్తుంది. కార్మికవర్గం ఆ ముసుగులు తొలగించకతప్పదు.

ధరలు పెంచివేయడం, సరుకు దాచివేయడం మొదలైన బూర్జువాచర్యల వల్ల ముద్దకు కూడా దూరమైన కార్మికవర్గం 'ఇది ఘోరం! దారుణం!' అన్నప్పుడు 'ఆచారం అడుగువాట రాదు' అని బూర్జువా అనడం కూడా మతం ముసుగే. ఈ ప్రపంచం 'ఈ విధంగానే నడుస్తోంది. ఈ సంప్రదాయాన్ని మీరూ పాటించాలి. దీన్ని ధిక్కరించడం పాపం' అని బూర్జువా అభిప్రాయం.

తిండిలేక బిచ్చగాళ్ళు మరణించడం తమ పాపంకాదని చెప్పే బూర్జువావేదాంతాన్నే భిక్షువర్షీయసిలో శ్రీశ్రీ స్ఫురింపజేశాడు. అంతా మాయ అనీ మిథ్య అనీ చెబుతూ రోల్సు కార్లల్లో తిరగడం, మనీపర్సులు నింపుకోవడం, మారణాయుధాలు తయారుచేయడం, యుద్ధాలు నడిపించడం వంటివి చేసే బూర్జువాల సిద్ధాంతాలను 'మిథ్యావాది'లో శ్రీశ్రీ పరిహసించాడు.

(2) భరించడం కష్టమైపోయి, పనిముట్లు క్రిందను పడవైచి చెయ్యలేం చస్తున్నాం మేము జీవనానికి ఆసరా చూపించమని అడగడమే బూర్జువాకు దార్జన్యంగా కనిపించిందంటే అతడెంత దుర్జనుడో అర్థమవుతుంది. సమ్మె ప్రకటించడమే బూర్జువాదృష్టిలో ధిక్కారం. పనిముట్లు బూర్జువా సొంత ఆస్తి. వాటిని కార్మికులు మోయలేనంత నీరసించిపోయారని బూర్జువా గ్రహించడు. అలాంటి దుర్బలస్థితిలో దౌర్భాగ్యస్థితిలో ఉన్న కార్మికుల్ని నోరుమూసి, బూర్జువా తన కాలిజోడు తీసికొడుతూ మీ దౌర్జన్యానికి నా దౌర్జన్యం మందు అన్నాడు. బూర్జువా కార్మికులపై దౌర్జన్యపునేరం మోపాడు. ఇదే బూర్జువావినాశానికి మార్గమవుతుంది. బూర్జువాదౌర్జన్యం కార్మికసామూహికశక్తివిజృంభణానికి హేతు వవుతుంది. బూర్జువాదౌర్జన్యాన్ని సమర్థించి అతనికే రక్షణ కల్పించడానికి న్యాయస్థానాలు, రక్షకభట వర్గాలు, చెరసాలలు, ఉరికొయ్యలు పనిచేస్తాయి. అయినా కార్మికశక్తి యొక్క నిరంతరమైన పోరాటంవల్ల విప్లవం వర్ధిల్లుతుంది. "బూర్జువావర్గం సృష్టించింది తన్నే నాశనం చేయగల ఆయుధాలను మాత్రమే కాదు; ఆ ఆయుధాలను ధరించే మనుషులను కూడా అది సృష్టించింది. ఆ మనుషులే అధునికకార్మికవర్గం"[3] అంటారు మార్క్సు ఎంగిల్సులు.

---

2 Maurice Cornforth : Dialectical Materialism - 1 P.

## శ్రీశ్రీ కవిత్వంలో పార్టీసాహిత్యలక్షణాలు

సామ్యవాదవిప్లవానికి కవిత్వం కూడా ఒక అమోఘమైన ఆయుధం. ఆ విప్లవం రావడానికి ప్రజల మనస్సులను సిద్ధంచేయడమే కవిత్వం చేయగలిగే పని. బూర్జువాల దురన్యాయాలకూ, దౌర్జన్యాలకూ ప్రతిక్రియ తలపెట్టేందుకు కార్మికులను పురికొల్పడమే సామ్యవాదసాహిత్య లక్ష్యం. బూర్జువాస్వార్థం అధర్మమే అయితే దాన్ని ప్రతిఘటించడం ధర్మసంగ్రామమే అవుతుంది. ఆ సంగ్రామానికి ఆయత్తపరచడం సాహిత్యప్రయోజనం. అందువల్ల సాహిత్యం కన్నా కార్మికులకు 'భగవద్గీత' మరొకటి లేదు.

కార్మికుల కదలికను ప్రేరేపించే ఏ రచనలనైనా బూర్జువాలు నిషేధిస్తారు. ఆ నిషేధమే మరింత ఉద్రేకంతో రచనలు చేయడానికి మూలమవుతుంది కార్మికుల కదలికను తెచ్చే 'పార్టీ' ఇటువంటి సాహిత్యాన్ని ప్రచారానికి తెస్తుంది. అందుకే దీనికి "పార్టీ సాహిత్యం" అన్న పేరు వచ్చింది. కనుక కేవలరాజకీయనినాదాలనే పార్టీసాహిత్యం అనడానికి వీలులేదు. గతితార్కిక భౌతికవాదాన్ని సమర్థించే సాహిత్యమంతటినీ పార్టీ ప్రచారంచేస్తుంది.

పార్టీసాహిత్యం శుద్ధకళ (Pure Art) కు అతీతమైన ఉపయోగకళయే. ఉపయోగకళ బూర్జువాల అభిప్రాయాలనూ ఆశయాలనూ కూడా ప్రతిబింబించవచ్చు. అప్పుడది కార్మికులకు ఉపయోగించదు. అది కార్మికవర్గసాహిత్యం కాక బూర్జువావర్గసాహిత్యం అవుతుంది. అందువల్ల అభ్యుదయరచయిత దృష్టిలో సాహిత్యం రెండు రకాలవుతోంది: (1) బూర్జువావర్గ సాహిత్యం (2) కార్మికవర్గసాహిత్యం అని. మొదటిదే వ్యక్తివాదాన్నీ అనుభూతివాదాన్నీ ఆదర్శవాదాన్నీ ప్రోత్సహిస్తుంది. రెండవది సామ్యవాదాన్నీ వాస్తవవాదాన్నీ ఉద్దీపిస్తుంది.

'పార్టీసాహిత్యం' అనే పరిభాషను సృష్టించి, దానికి వివరణ చెప్పిన ప్రవక్త లెనిన్. 1905 నవంబరు 13న వెలువడిన 'పార్టీనిర్మాణమూ పార్టీసాహిత్యమూ' అనే వ్యాసం ఈ వివేచనకు ఆధారభూమిక.

శ్రీశ్రీ మహాప్రస్థానగీతాలు రాసేనాటికి కార్మికవర్గం బూర్జువావర్గంమీద తిరుగుబాటు చేయడానికి తగినంతబలంతోకానీ చైతన్యంతోకానీ లేదు. బూర్జువావర్గం కార్మికవర్గాన్ని బాగా అణగద్రొక్కే అధికారంతోనే ఉంది. కనుకనే 'వాడు'లో బూర్జువావర్గపు దౌర్జన్యాన్ని వాస్తవికదృష్టితో చిత్రించారు శ్రీశ్రీ.

---

3 కమ్యూనిస్టుపార్టీప్రణాళిక.

పార్టీ సాహిత్యం "కార్మికవర్గసమష్టిహితంతో సంబంధంలేని వ్యక్తిగతప్రయత్నం" కాదన్నాడు లెనిన్. పార్టీ సాహిత్యం కార్మికపక్షపాతంతోనే నిండిఉంటుంది. శ్రీశ్రీ మహాప్రస్థానగీతాలు అలాంటివే. సామ్యవాద నిబద్ధత శ్రీశ్రీని పార్టీ సాహిత్యపంథాలోకి లాగింది.

"Down with non-partisan writers! Down with literary supermen! Literature must become part of the common cause of the proletariat, "a cog and a screw" of one single great Social - Democratic mechanism set in motion by the entire politically conscious vanguard of the entire working class. Literature must become a component of organised, planned and integrated Social - Democratic Party work"[4]

సాహిత్యం ఏ పక్షానికీ చెందకూడదనే వాదంలో నిజాయితీ లేదు. కార్మికపక్షానికి చెందని సాహిత్యం బూర్జువాపక్షానికి ఎలాగూ చెందుతుంది. అల్పసంఖ్యాకులైన బూర్జువాలకు చెందడంకన్నా అత్యధికసంఖ్యాకులైన పీడితకార్మికవర్గానికి చెందడమే న్యాయం.

ఒక పార్టీకి సాహిత్యం అంకితమైపోవడం రచయిత స్వేచ్ఛకు భంగం కలిగిస్తుందనే వాదాన్ని లెనిన్ గట్టిగా ఎదుర్కొని బూర్జువాసమాజంలో రచయితకు స్వేచ్ఛ లేనే లేదనీ ఆ సమాజంలో రచయిత, ధనానికి తల ఒగ్గి రచనలుచేస్తాడనీ సమాధానం చెప్పాడు. రచయితకు సంపూర్ణ రచనాస్వేచ్ఛ ఉండాలన్నప్పుడు అతడు సంపూర్ణ స్వేచ్ఛతోనే తనకు నచ్చిన రాజకీయ పక్షం వైపు ఉంటాడు. కార్మిక పక్షంవైపు రచయితను ఉండవద్దనడానికి ఎవరికీ హక్కులేదు.

బూర్జువావ్యక్తివాదులు 'రచయితకుండే సంపూర్ణ స్వేచ్ఛను పార్టీసాహిత్యసృష్టి చెడగొడుతుందని వాదిస్తారు. కానీ పార్టీ సాహిత్యాన్ని సృష్టించవలసిన అవసరం బూర్జువావ్యవస్థలోనే. రచయితకు సంపూర్ణ స్వేచ్ఛ లభించనిది బూర్జువావ్యవస్థలోనే. "There can be no real and effective 'freedom' in a society based on the power of money, in a society in which the masses of working people live in poverty and the handful of rich live like parasites. Are you free in relation to your bourgeois publisher, Mr. Writer, in relation to your bourgeois public, which demands that you provide in with pornography in frames and paintings, and prostitution as a "supplement" to "sacred" scenic art? This absolute freedom is a bourgeois or an anarchist phrase (since, as a world outlook, anarchism is bourgeois philosophy turned inside out). One cannot live in society and be free from society. The freedom of the bourgeois writer, artist or actress is simply masked (or hypocritically masked) dependance on the money bag, on corruption, or prostitution,"[5] అంటూ లెనిన్ బూర్జువారచయితలకు తమ చుట్టూ ఉండే అస్వతంత్రవాతా

4 On Literature and Art 23 P.

5 On Literature and Art 26 P.

వరణాన్నీ జుగుప్సనీ జ్ఞాపకంచేశాడు. స్వేచ్ఛ స్వేచ్ఛ అంటూ కలవరించిన భావకవుల అనిర్దిష్ట దృక్పథాన్నీ వ్యక్తివాదాన్నీ పలాయనవాదాన్నీ తిరస్కరించి శ్రీశ్రీ సామాజికదృక్పథంతో రచనలు చేయనారంభించడంతోటే పార్టీ రచయిత కాక తప్పలేదు. ఈ విషయాన్ని శ్రీశ్రీయే గుర్తించి, సమర్థించుకున్నాడు కూడా. "కొన్ని రాజకీయకక్షలు అభ్యుదయరచయితల భావాలను తీసుకొని ప్రచారంసాగించడమూ కొన్ని రాజకీయపక్షాల ఆశయాలవల్ల ఉత్తేజితులై రచయితలు కావ్యాలను నిర్మించడమూ రెండూ జరుగుతున్నాయి. ఇందుకు ఒక్కటే కారణం! రచయితనూ రాజకీయవాదినీ ఇద్దరినీ జీవితమే ఉద్బోధిస్తుంది. జీవితంలో ఒకదాని నొక్కటి ప్రతిఘటించే రెండు భిన్నవర్గాలు ఉన్నంతకాలం, అభిమానాల విభజన కూడా అస్వాభావికం కాజాలదు. ఈ వర్గ భేదాలవల్ల ప్రవర్తిల్లే సాంఘికదురన్యాయాలను ప్రతిఘటిస్తూ కొందరు, సమర్థిస్తూ కొందరు ఉంటారు. ఈ సమర్థిస్తున్నవారిలో కొందరకవి దురన్యాయాలుగా కనబడక పోవచ్చునని కూడా ఒప్పుకోవచ్చును. ఏమైనా ఇటువంటి రెండువర్గాలున్నమాట ప్రత్యక్ష సత్యం. చిత్తశుద్ధిగల ప్రతిరచయితా ఎప్పుడో ఒకప్పుడు బాహాటంగా తన కభిమానం ఉన్న వర్గం తరఫున చేరుకుంటాడు. అపుడతని రచనలలో అతని అభిమానాలు ప్రతిఫలించక తప్పదు. తాటస్థ్యమనేది జీవితానికి విరుద్ధం.... తాను ఏ సాంఘికదురన్యాయాలను నిర్మూలించాలని ఆవేదన పడుతున్నాడో వాటి నిర్మూలనకే ఒక రాజకీయపక్షం కూడా ప్రచారం సాగిస్తే, కవి తనశిల్పాన్ని తప్పకుండా ఆ పక్షానికి అంకితం చేసి తీరుతాడు."6

శ్రీశ్రీ కవితల్లో ప్రచారం పాలు తక్కువే. కవిత్వగౌరవాన్నీ సంవిధానచాతుర్యాన్నీ వదలకుండానే కమ్యూనిజాన్ని వస్తువుగా తీసికోవడంలోనే శ్రీశ్రీ విజయం ఉంది.

ఎర్రబావుటా నిగనిగలు – సమ్మెకట్టిన కూలీలు – ఆకటిచీకటి చిచ్చులు – ఘర్మజలానికి ఖరీదు – గనిలో వనిలో కార్ఖానాలో పరిక్లమం – ధనికస్వామికి దాస్యం – యంత్రభూతముల కోరలు తోమే కార్మికులు – విప్లవశంఖం–కార్మికలోకపుకల్యాణం–శ్రామికలోకపు సౌభాగ్యం–శ్రమైకజీవన సౌందర్యం – పేదవాళ్ళవాడలు – రెక్కవిప్పిన రివల్యూషన్ – ధనవంతుల పన్నాగాలు – పీడించే సాంఘిక ధర్మం – చీనాలో రిక్షావాలా – చెక్ దేశపుగనిపనిమనిషీ – ఐర్లాండున ఓడకళాసీ – రాళ్ళెత్తిన కూలీలు – పాలికాపు నుదుటిచెమట – కూలివాని గుండెచెరువు – బిచ్చగాని కడుపు కరువు – అలజడి – ఆందోళన – తిరుగుబాటు – కార్మికస్వర్గం – పరపీడనాపరులు – పెట్టుబడికూటాలు – అసత్యప్రచారం – రాజకీయాలలో రంకువేషాలు – ఎగరేసిన ఎర్రని జెండా – వంటి పదజాలం శ్రీశ్రీ కార్మికప్రపంచపక్షపాతాన్ని సూచిస్తుందే తప్ప తక్కినచోట్ల

6 శ్రీశ్రీ సా. మూడు వచన. 200-01 పే.

పార్టీ సాహిత్యపు పలుచదనం కనిపించదు. ప్రచారధోరణి అనిపించదు. పార్టీ సాహిత్యాన్ని కూడా పరమోదాత్తంగా సృష్టించాడు శ్రీశ్రీ.

లెనిన్ స్వతంత్రసాహిత్యం గురించి ఏ ఉదాత్తవచనాలు పలికాడో వాటిని గుర్తుకుతెస్తాయి శ్రీశ్రీ కవితలు.

"It will be a free literature, because the idea of socialism and sympathy with the working people, and not greed or careerism, will bring ever new forces to its ranks.

It will be a free literature, because it will serve, not some satiated heroine, not the bored "upper ten thousand" suffering from fatty degeneration, but the millions and tens of millions of working people — the flower of the country, its strength and its future.

It will be a free literature, enriching to last word in the revolutionary thought of mankind with the experience and living work of the socialist proletariat, bringing about permanent interaction between the experience of the past (scientific socialism, the completion of the development of socialism from its primitive, utopian forms) and the experience of the present (the present struggle of the worker comrades.)"[7]

## శ్రీశ్రీ వచనపద్యంలో పాదవిభజన

వచనపద్యాన్ని 6 పాదాల నియమంతో వ్రాశాడు శ్రీశ్రీ. 'వాడు' లోని మూడు వచన పద్యాలూ షట్పాది వచనపద్యాలే. వచన పద్యంలా కనిపించే ఐ గేయంలో మూడు పద్యాలూ షట్పాదులే. నవకవితలోని నాలుగుగీతాలూ షట్పాదులే కానీ చివరను ఒక పల్లవి ఉంటుంది. 'కేక' లోని ఎనిమిది గీతాలూ షట్పాదులే.

వచన పద్యంలో పాదాలవిభాగానికి శ్రీశ్రీ పెట్టుకునే సరిహద్దులేమిటి? గణాలు లేవు కదా! శ్రీశ్రీయే అన్నాడొకచోట - "గణాలు లేని పద్యాలకు కూడా కొన్ని నియమాలు లేక పోలేదు. ఈ నియమాలు గణబద్ధచ్ఛందస్సులకు చెందిన నియమాలుకావు."[8] అయితే ఆ నియమాలేమిటో శ్రీశ్రీ రచించిన వచనపద్యాలనుబట్టి మనం నిర్ణయించుకోవలసి ఉంటుంది.

(1) గణబద్ధచ్ఛందస్సులలో పాదం గణనియమాన్నిబట్టి విరుగుతుంది. అలా విరగడంలో పదమధ్యంలో కానీ పదంలోని ఏ ఒక అక్షరంతో కానీ అసహజంగా పాదం ముగుస్తూంటుంది. ఉదాహరణకి ; — "కోమలమందహాసవినిగూహనచారుకపోలకామినీ/ చ్ఛామతి లోకమంతటను సర్వుడుకానియొకండపేత వాం/ఛామతి—" (విశ్వనాథ) అన్నపద్యంలో మొదటిపాదం ఇ/చ్ఛామతి

---

7 On Literature and Art 26 P.

8 శ్రీశ్రీ సా. రెండు. వచన. 500 పే.

అంటూ విరిగింది. రెండవపాదం వాం/ఛామతి అంటూ విరిగింది. ఈ అసహజపదవిభాగానికి శ్రీశ్రీ వచనపద్యం స్వస్తి చెప్పింది. శ్రీశ్రీ గేయాలలో కూడా ఇలాంటి అసహజపదవిభాగం, పాదవిభాగం సాధారణంగా ఉండవు. ఉదాహరణకు కవితా ఓ కవితా చూడండి. పాదాలు సహజభావవిరామంతో పదవిరామంతో నడుస్తాయి. గణబద్ధవృత్తాలలో పాదాలను పదమధ్యం లోకి విరవడం ఘనంగా భావిస్తే స్వేచ్ఛాచ్ఛందస్సులలో పదాంతానికి పాదాంతంచేయడం ఘనంగా భావించారు. మొదటి సంప్రదాయాన్ని సనాతనులు పనితనంగా భావిస్తే శ్రీశ్రీ దాన్ని అసహజంగా భావించాడు.

(2) పాదాదిని ప్రతి రెండు పాదాలకూ మాత్రం ప్రత్యేకంగా యతిమైత్రిని పాటించడం ద్వారా పాదాల విరుపును సాధించడం. ఉదా :-

అందరం కలిసి చేసిన ఈ
అందమైన వస్తుసముదాయం అంతా
ఎక్కడో ఒక్కడే వచ్చి
ఎత్తుకు పోతూ ఉంటే చూచి
అన్యాయం అన్యాయం అని మేమంటే -
అనుభవించాలి మీ కర్మం అంటాడు.

(3) వచనపద్యంలో పాదవిభాగానికి ప్రమాణంగా ప్రాసను కూడా స్వీకరించడం! ఈ ప్రాస ఆ సందర్భానికి వన్నె పెట్టే అక్షరంతో ఉంటుంది. ఉదా :-

పొద్దుపొడిచి పొద్దుగడిచేదాకా
ఎద్దుల్లాగు పనిచేసే మమ్మల్ని
మొద్దుల్నీ మొరటుల్నీ చేసి
ముద్దకి కూడా దూరం చేశాడు.

ఇక్కడ ద్విత్వాక్షరప్రాస కార్మికుల కష్టనిష్ఠురాలను వ్యక్తంచేస్తోంది. ప్రాసను గేయాలలో విరివిగా శ్రీశ్రీ వాడాడు; వచనపద్యంలోనూ సందర్భోచితంగా వాడాడు.

(4) భావానికి ఈషద్విరామం కల్పించడంద్వారా వచనపద్యంలో పాదవిభాగం చేయడం!

ఉదా:- 'అన్యాయం అన్యాయం' అని మే మంటే-
'అనుభవించాలి మీ కర్మం' అంటాడు.
'ఘోరం ఇది, దారుణం ఇ'దంటే-
'ఆచారం! అడుగుదాటరా' దంటాడు.

ఇక్కడ ఉన్న నాటకీయసంఘర్షణకు ఈ పాదాల విభజన దోహదం చేస్తోంది. ఒక పాదం కార్మి

కులది: ఒక పాదం బూర్జువాది. ఈ విభజనలో ఒక క్రమం (sequence) ఉంది. ఇలాంటి భావ క్రమాన్ని పరాజితులు, అవతలిగట్టు గేయాల్లో చూడవచ్చు.

(5) యతిప్రాసల కొండగుర్తులతో పాదాలు విభజించుకున్నాడనడం కొంతవరకే నిజం. సమవృత్తాలలోలాగ సమానమైన అక్షరగణాలు లేకపోవడంవల్లనూ భావవిశ్రాంతిమాత్రమే పాటించడంవల్లనూ పాదాలు ఒకటి పొట్టిగా ఒకటి పొడవుగా రాకతప్పవు. మరి అలాంటప్పుడు ఏపాదం కనీసపుపొడుగెంత ? గరిష్ఠపుపొడుగెంత ? దీనికేమైనా ప్రమాణంఉందా ? ప్రమాణం లేకపోతే వచనంగా మారిపోదా ? శ్రీశ్రీ ఏ ప్రమాణంతో పాదవిస్తృతిని నిర్ణయించుకున్నాడు?

గణబద్ధత అనేది ఏ పాదానికీ లేనప్పుడు గణాలకుబదులు అక్షరాలూ, పదాలూమాత్రమే ముఖ్యమైన లెక్క.

వచనపద్యంలోని పాదాలలో వృత్తాలలోలాగే 2 అక్షరాలనుంచి 26 అక్షరాలదాకా ఉండవచ్చు. ఎటొచ్చీ గణనియమమే ఉండదు. 26 అక్షరాలకు మించిన పాదం పద్యంలోకాక కేవలవచనంలోనే ఉంటుంది. అప్పుడు పద్యం 'పేరా'గా మారుతుంది. 'వాడు'లో శ్రీశ్రీ 8 అక్షరాలనుంచి 13 అక్షరాలవరకూ పాదానికి ప్రమాణంగా వాడాడు.

| | |
|---|---|
| ఎక్కడో ఒక్కడే వచ్చి | 8 |
| ఎత్తుకు పోతూఉంటే చూచి | 9 |
| అన్యాయం అన్యాయం అని మేమంటే- | 11 |
| అనుభవించాలి మీ కర్మం అంటాడు- | 12 |
| భరించడం కష్టమైపోయి- | 9 |
| పనిముట్లు మేము క్రిందను పడవైచి | 13 |

అత్యంతహ్రస్వపాదం రెండక్షరాలు. ఖైదీ/రౌడీ - పవీ/కవీ వంటి పాదాలు. అత్యంతదీర్ఘ పాదాలు కవితా ఓ కవితా, కొంపెల్ల జనార్దనరావుకోసం, మానవుడా ఖండికల్లో ఉన్నాయి. ఓహో ఓ రసధుని మణిఖని జననీ ఓ కవితా (18) — నా యువకాశల నవపేశల సుమగీతా వరణంలో (19) కాట్లాడుకునేవాడా ఓర్వలేనివాడా సంకుచితస్వభావుడా (23)

(6) పాదంలో పదాలు కూడా ఒక లెక్కలోనే పడుతూఉంటాయి.

| | |
|---|---|
| అంవరం । కలిసి । చేసిన । ఈ | 4 |
| అంద । మైన । వస్తు । సముదాయం । అంతా | 5 |
| ఎక్కడో । ఒక్కడే । వచ్చి | 3 |
| ఎత్తుకు । పోతూ । ఉంటే । చూచి | 4 |
| అన్యాయం । అన్యాయం । అని । మే । మంటే | 5 |
| అనుభవించాలి । మీ । కర్మం । అంటాడు | 4 |

సాధ్యమైనన్ని తక్కువపదాలు పడటమే శ్రీశ్రీ పాదాలలోని మర్మం. పాదప్రమాణాన్నిబట్టి పదప్రమాణంకూడా తగ్గుతూఉంటుంది.

(7) శ్రీశ్రీ వచనపద్యంలో వచనలక్షణంతోపాటు గేయలక్షణమూ పద్యలక్షణమూ కూడా ఉంటాయి. ఇవే పాదప్రమాణాన్ని నిర్ణయిస్తూనూ ఉంటాయి.

ఎక్కడో । ఒక్కడే । వచ్చి అనే పాదంలో 5 + 5 + 3 మాత్రలున్నాయి. ఎత్తుకు ।పోతూ । ఉంటే । చూచి అనే పాదంలో చతురస్రగతి ఉంది. నోరు । మూసి । జోడు । తీసి । కొట్టి అనే పాదం త్ర్యస్రగతిలోది. జీవ । నానికి । ఆస । రాచూ । పించ । మంటే– అనేది ముత్యాలసరం నడక.

(8) "వచనగీతానికి ప్రాణప్రదమైన లక్షణం గమనవైవిధ్యం. అది సంభాషణలోని యాసలూ కాకువులూ ఉచ్చారణ విశేషాలమీద ఆధారపడి ఉంటుంది. శైలికీ రీతికీ సంబంధించిన సమస్యలెన్నో దీనినుండి బయలుదేరుతాయి"9 అని శ్రీశ్రీ ఒకచోట వివరించాడు. వాడు వ్యత్యాసం, ఆకాశదీపం వంటి వచనపద్యాలలో వాడబడినభాష అనుదినవ్యవహారానికి దగ్గరదే. ఆ యాసలూ కాకువులూ పాదవిభజనను నిర్ణయించాయి.

(9) వచనపద్యాన్ని ముగించడంలో శ్రీశ్రీ ఒక లయను పాటించాడు. వచనపద్యపు శిల్పానికి ఆ ముగింపు ఒక మెరుపు. 'వాడు'లోని మూడు వచనపద్యాలూ ఒకేవిధంగా అంతం అవుతున్నాయి. మూడుపద్యాల చివరిపాదాలనూ చూస్తే ఆ సమతాశిల్పం తెలుస్తుంది.

- అనుభవించాలి మీ కర్మం అంటాడు.
- ఆచారం అడుగు దాటరా దంటాడు.
- దౌర్జన్యానికి దార్జన్యం మందంటాడు.

ఎవడు ఈ అన్నవాడు ? – వాడే! అదే శీర్షికలోని "వాడు". ప్రతిపద్యంచివర 'వాడు' అనిచదివితే ఆ మర్మం తెలుస్తుంది. కార్మికుల తిరస్కారం అర్థమవుతుంది.

వచనపద్యాన్ని ముగించడంలోని సమతను 'సంధ్యాసమస్యలు' ఖండికలో కూడా చూడవచ్చు.

## శ్రీశ్రీ - వాస్తవికపదజాలం

సుకుమారమైన పదజాలాన్నీ ముఖ్యంగా సంస్కృతసమాసబంధురశైలినీ, రంగు,రుచి, వాసన గల కాల్పనికపదజాలాన్నీ వదిలివేసి మామూలుమాటలతో భావశబలతను సృష్టించడానికి శ్రీశ్రీ ప్రయత్నించాడు. ఇది వాస్తవదృష్టికి ప్రతిఫలమే. వస్తుసముదాయం అనే రెండుపదాల

---

9 శ్రీశ్రీసా. రెండు. వచన. 478 పే.

సమాసాన్ని తప్ప సమాసాలనే వాడలేదు 'వాడు'లో. వాడు, వ్యత్యాసం వంటి ఖండికలలోని పదజాలం మరీసామాన్యంగా ఉండి బూర్జువాకావ్యధోరణుల కలవాటుపడినవారికి కొత్తదవు తోంది. ఏ వర్గంయొక్క పెత్తనం సమాజంలో చెల్లుతూఉంటుందో ఆ వర్గంయొక్క భాషయే - ఆ వర్గానికి నచ్చినభాషయే – ఆ కాలపు సాహిత్యంలో చెలామణి అవుతుంది. కాని బూర్జువాలది మైనారిటీవర్గంవారి భాష. మెజారిటీవర్గమైన సామాన్యుల భాషను సామ్యవాదిఅయిన శ్రీశ్రీ కావ్య భాషగా వాడుకున్నాడు. ఇదే వ్యావహారికభాషోద్యమంపట్ల శ్రీశ్రీ కున్న అభిమానంలోని అంత రార్థం. సమాజంయొక్క సజీవమైన ప్రతిబింబంగానే కాక పీడితసమాజానికి మార్గదర్శిగా కూడా సాహిత్యాన్ని సృష్టించడం శ్రీశ్రీ లక్ష్యం. ఇందుకు భాష మొదటిసాధనం. భాషావిప్లవం భావ విప్లవానికి దారితీస్తుంది.

అందరం కలిసి - ఎత్తుకు పోతూఉంటే – మీ కర్మం – పొద్దుపొడిచి పొద్దుగడిచేదాకా - ఎద్దుల్లాగుపనిచేసే – మొద్దుల్ని మొరటుల్ని చేసి – ముద్దకు కూడా దూరంచేశాడు - చెయ్యలేం చస్తున్నాం – ఆసరాచూపించు – నోరుమూసి – జోడుతీసికొట్టి మొదలైనవి తెలుగుభాషయొక్క అనుదినవ్యవహారం తెలిసినవారందరికీ వర్గభేదంతో నిమిత్తంలేకుండా అర్థమవుతాయి. ఇక్కడ నుడికారాలలో రాగద్వేషాలూ ఆవేశానుభవాలూ ఉన్నాయి. అన్యాయం అన్యాయం అన్నప్పుడు కార్మికులకు అధర్మంపట్ల గల అసహిష్ణుత ఉంది. చెయ్యలేం చస్తున్నాం అన్నప్పుడు కార్మికులదైన్యం ప్రతిధ్వనిస్తుంది. అనుభవించాలి మీ కర్మం అన్నప్పుడు బూర్జువా నిర్లక్ష్యభావం కనిపిస్తుంది.

సజీవసమాజసమస్యను తీసుకోవడంవల్ల శ్రీశ్రీ దేశ్యపదాలనే హెచ్చుగా వాడాడు. ఆ దేశ్య పదాలు విశిష్టార్థస్ఫోరకాలుగా మారతాయి శ్రీశ్రీ ప్రయోగంలో.

పొద్దు, ఎద్దు, మొద్దు, అందం, మొరటు, పనిముట్లు, ఆసరా, నోరు, జోడు, మందు వగైరాలు 'వాడు'లోవి. ఈ విధంగా రెండుమూడు అచ్చులతో కూడిన దేశ్యపదాలనే హెచ్చుసంఖ్యలో శ్రీశ్రీ వాడటం మహాప్రస్థానశైలిలో పాఠకులు గమనించవచ్చు. ఈ దేశ్యపదాల ప్రయోగంవల్ల శ్రీశ్రీ శైలికి సౌలభ్యం లభించింది. కాల్పనికకవి శైలిలో దేశ్యపదాలకన్నా తత్సమాలే ఎక్కువ. శ్రీశ్రీ శైలిలో ఈ రెండురకాలపదాలూ సమనిష్పత్తిలోనే ఉన్నాయి. మహాప్రస్థానం అనే ఖండికలో దారి, గుండె, నెత్తురు, బాట, వేట, కోట, అడవి, కొండ, ఎడారి, ఎముకలు, చమురు, కంచు, త్రాచు, రేచు, బావుటా వంటిదేశ్యపదాలలో రంగు, రుచి, వాసన కనబడవు. వీటిలో వాడి, వేడి, ఉద్రేకం, ఉద్వేగం వంటివే కనిపిస్తాయి.

## 75/మిథ్యావాది

### జమీందారు రోల్సుకారు మాయంటావూ ?

1937

ప్రతికవికీ ఒక తత్త్వచింతన ఉంటుంది. అది అతని కవిత్వంలో ప్రతిబింబిస్తుంది. తత్త్వచింతనలో వచ్చే మార్పులవల్ల కవితాదృక్పథంకూడా మారిపోతూ ఉంటుంది. గతంలో ముఖ్యమైన తత్త్వచింతనలు రెండున్నాయి.

(1) ఈ ప్రపంచం ఒక 'కన్నీటిలోయ' అనీ ఇందులో దుఃఖం తప్ప మరేమీ లేదనీ ఈ జీవితం పరలోకంలో సర్వసుఖాలనూ అనుభవిస్తుందనీ అందుకు పుణ్యాలను ఆచరించాలనీ కొందరు తలపోస్తారు. ధూర్జటిమహాకవి సమస్తభోగాలనూ అనుభవించినతరువాత విరాగిఅయి ఈ ప్రపంచం అంతా మిథ్యఅని తలపోస్తూ ఇహలోకవిముక్తిని కోరుకున్నాడు. భార్య, బిడ్డలు, ధనం, శరీరం శాశ్వతం అనుకోవడం అజ్ఞానమనీ ఈశ్వరచింతయే జీవితపరమార్థమనీ భావించాడు. భగవంతుడే సత్యం అనీ జగత్తుమిథ్య అనీ భావించడం శంకరాచార్యుని 'అద్వైతం' యొక్క ప్రభావమే. దృశ్యమానప్రపంచం నిరంతరం పరిణామం చెందుతూ ఉంటుంది కనుక అది మిథ్య; దాన్ని సత్యంగా భావించడం అవిద్యయొక్క లక్షణం. బ్రహ్మం సచ్చిదానంద స్వరూపం! అదే సత్యం - దాన్ని తెలుసుకోవడమే బ్రహ్మవిద్య. ఈ తత్త్వచింతన వ్యక్తికి ఇహలోకసౌఖ్యాలపట్ల విముఖతను కలిగించింది.

(2) సర్వసంపదలనూ భోగాలనూ అనుభవించడానికి ఈ ప్రపంచంకన్నా మరొక స్థానం లేదనీ ప్రతివ్యక్తి అందుకు ప్రయత్నించాలనీ భావించడం మరో లౌకికదృక్పథం. ఆధునికకవి దువ్వూరి రామిరెడ్డి వైరాగ్యాన్ని తిరస్కరించి భోగాలను అనుభవించవలసిందిగా 'ఆమనినిషా' అనే ఖండికలో ప్రబోధించారు. జగత్తు మిథ్యఅనే వాదాన్ని తిరస్కరించి ప్రపంచసుఖాలను అన్నింటినీ బ్రతికిఉండగానే తృప్తిగా అనుభవించవలసినదిగా చెప్పడం మీద ఉమర్ఖయ్యాం తాత్త్వికదృష్టియొక్క ప్రభావం ఉంది.

పై రెండు దృక్పథాలూ ప్రత్యేకవర్గాల దృక్పథాలే కానీ సామాన్యమానవుడి జీవితంతో సమన్వయించేవి కావు. బూర్జువావ్యవస్థలో పీడితవర్గానికవి ఉపయోగకరమైనవి కావు. 19 వ శతాబ్దిలో మరో తత్త్వచింతన ఆరంభమయింది. అదే మూడవది.

(3) బూర్జువావ్యవస్థ అవతరించడంతోపాటే ఆధునికకార్మికవర్గం అవతరించింది. అంతకు ముందు సమాజంమీద పెత్తనమూ పలుకుబడీ గలవారి తత్త్వచింతనకే ప్రాధాన్యం ఉంటూ రావడంవల్ల ఆ లౌకికదృక్పథం 'పాలకవర్గం' వారి దృక్పథమే అయింది. సమాజంలో పీడితవర్గం పైకి రావలసినట్లయితే ఆ సనాతనలౌకికదృక్పథంవల్ల ప్రయోజనం ఉండదు.

పీడితవర్గం తన దృక్పథాన్ని ఊహలతో కాక 'సైన్సు'తో ఏర్పరచుకోవాలి. తన వర్గ స్వభావాన్ని చారిత్రకవాస్తవజ్ఞానంతో దర్శించుకోవాలి. ఈ ప్రపంచంలో దుఃఖంకానీ సుఖంకానీ కలగడానికి ఆర్థికవ్యవస్థ మూలకారణం. ఆర్థికవ్యవస్థలో మార్పుతేవడం మానవుడిచేతిలోనే ఉంది. ఈ ప్రపంచాన్ని ఎలాకావలిస్తే అలా మార్చుకోవచ్చును. పరపీడనమే పాపం. వర్గరహిత సమాజమే స్వర్గం. మానవుడే దేవుడు. నిత్యపరిణామం పొందుతున్న వాస్తవప్రపంచాన్ని వేగంగా విప్లవీకరించి నూతనప్రపంచాన్ని నిర్మించుకోవడం మానవుడి కర్తవ్యం. ఇది సమష్టి కర్తవ్యం. ఈ లౌకికదృక్పథమే గతితార్కిక భౌతికవాదం. దీన్ని నిర్వచించినవారు మార్క్సు - ఎంగిల్సు - లెనిన్‌లు.

'The teaching that the world is material, that there is nothing in the world besides matter and the laws of its motion and change, is the corner stone of Dialectical Materialism'[1]

'All the mysteries which lead theory to mysticism are rationally resolved in human practice and in the understanding of this practice.'[2]

మార్క్సిజం - లెనినిజం శంకరుల అద్వైతానికీ ఉమర్‌ఖయ్యాం బోధనలకూ వ్యతిరేకమైనది. వాస్తవంతో నిమిత్తంలేకుండా ఆదర్శాలకు అంకితమయ్యే తత్త్వచింతనల కన్నింటికీ మార్క్సిజం-లెనినిజం ప్రతిపక్షంలోనిది. సాంఘికప్రయోజనంలేనితత్త్వచింతన (Pure Philosophy)ను కూడా మార్క్సిజం - లెనినిజం వ్యతిరేకిస్తుంది. అభ్యుదయకవి మార్క్సిస్టుతత్త్వచింతనతోనే కవిత్వం రాస్తాడు. ఇందుకు శ్రీశ్రీయే మార్గదర్శి.

వివిధసాంఘికవ్యవస్థల్లో తత్త్వచింతన పాలకవర్గానికి అనుకూలంగా నడిచింది. ఉదా:— (1) బానిసలసంఘం నడుస్తున్నప్పుడు బానిసఅనేవాడు ప్రకృతిసహజంగా బానిసగానే జనించాడన్నారు. (2) ఫ్యూడల్‌సంఘం నడుస్తున్నప్పుడు రాజు దైవాంశసంభూతుడన్నారు. అతడ్ని దేవుడే పాలనాధికారంలో నియోగించాడన్నారు. (3) మరి బూర్జువాసంఘం ఆరాజునే పదవీభ్రష్టుడ్ని చేసింది. "మనిషికీ మనిషికీ మధ్య నగ్నమైన స్వలాభం తప్ప, కిరాతకమైన డబ్బులావాదేవీ తప్ప, యిక యేసంబంధాన్నీ మిగులనివ్వలేదు. మతావేశంవల్లా రణోత్సాహంవల్లా

1 A Dictionary of Philosophy

2 IBID (Marx)

మూర్ఖపుమమకారంవల్లా కలిగే అలౌకికఆనందాలన్నిటినీ అది స్వలాభమనే కత్తితో ఖండించి వేసింది.3 అది మనిషివిలువను రూపాయల్లోకి మార్చింది" బూర్జువాసమాజంలో బూర్జువాలు వ్యక్తిప్రాముఖ్యాన్ని పెద్దదిగా చేసి సమష్టిసౌభాగ్యాన్ని విస్మరిస్తారు. కార్మికులు పని చెయ్యాలనీ తాము పెట్టుబడి పెట్టి కూలీఇవ్వాలనీ వారి అభిప్రాయం. ఈ పద్ధతి మారేందుకు వారు అంగీకరించరు. ఇదే వారి లౌకికదృక్పథం.

బూర్జువాల లౌకికదృక్పథాన్ని కార్మికులు వ్యతిరేకించి, ఎవరిశక్తిననుసరించి వారు పని చేయాలనీ, ఎవరి అవసరాన్ని అనుసరించి వారు సొమ్ము తీసుకోవాలనీ ప్రతిపాదిస్తున్నారు. మనిషిని మనిషి దోచుకోవడం, దగాచేయడం, మభ్యపెట్టడం కార్మికులిష్టపడరు కనుకనే వాస్తవవాదులవుతున్నారు.

బూర్జువావర్గంవారు తమ స్థితిని రక్షించుకోవడానికి ఏ సిద్ధాంతాలూ వాదాలూ పనికి వస్తాయో వాటిని అభిమానిస్తారు. అందువల్లనే బూర్జువావర్గం ఆదర్శాలను ప్రచారం చేస్తుంది. మాయావాదాన్నీ ఉమర్‌ఖయ్యాం సిద్ధాంతాన్నీ కూడా అది గౌరవిస్తుంది. పీడితవర్గపక్షపాతి అయిన శ్రీశ్రీ బూర్జువావర్గపు లౌకిక దృక్పథాన్ని సహించలేడు. వారి సనాతనతత్త్వశాస్త్రాభిమానాన్ని క్షమించలేడు. మంచిని గురించి, మర్యాద మప్పితం గురించి, నడతా నాణ్యం విలువల విషయం గురించి బూర్జువాల నిశ్చలనిశ్చితాలను విమర్శిస్తాడు. ఇంకా వెనక్కుపోతామనే బూర్జువాలపై ఆగ్రహిస్తాడు. కార్మికులు కర్మననుభవించాలని శాసించే బూర్జువాలను ప్రపంచం ముందుంచుతాడు. అంతా మాయ అంతా మిథ్యఅని ప్రచారంచేసి బూర్జువాల అభిమానం చూరగొనే వేదాంతులను నిలదీసి ప్రశ్నిస్తాడు. 'వడ్డించిన విస్తరి'గా జీవితాన్ని అనుభవించే ఉమర్‌ఖయ్యాం ఆరాధకులను కూడా అవహేళన చేస్తాడు.

### శ్రీశ్రీ మిథ్యావాద తిరస్కారం

"The philosophers have only interpreted the world in various ways, the point, however, is to change it" అన్నది మార్క్సు దృక్పథం. తాత్త్వికుల వ్యాఖ్యానాలతో స్తంభించిపోయిన మానవుల భావాల్ని కదలించి, మార్పించి, నూతన ప్రపంచనిర్మాణానికి ఆయత్తపరచడం గతితార్కికభౌతికవాదపులక్ష్యం. అందుకే శ్రీశ్రీ 'మాయంటావా అంతా మిథ్యంటావా' అని ప్రశ్నించాడు. భారతదేశంలో బుద్ధునికాలంలోనే 'మాయావాదం'గా అవతరించి శంకరుల తాత్త్వికసంస్కరణలతో 'అద్వైతవాదం'గా మారి ప్రాపంచికదృక్పథాన్ని ప్రభావితం చేసిన ఒక అతిప్రధాన తత్త్వచింతనకు శ్రీశ్రీ సాహసంతో చేసిన సవాలు 'మిథ్యావాది' లోని

3 కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక 38 పే.

ప్రశ్న. కవిగా శ్రీశ్రీ చేయగలిగిన మార్పు భావవిప్లవమే కనుక తన గేయాలలో సామాజిక భావ విప్లవాన్నే ఆశించాడు.

గతితార్కికభౌతికవాదం శ్రీశ్రీ కవిత్వానికి వెన్నెముక. కవిత్వానికి ప్రయోజనం ముఖ్యం కావడం ఈ విప్లవాత్మకతత్త్వచింతనను శ్రీశ్రీ తీసుకోవడం వల్లనే. ప్రపంచాన్ని మార్చడానికి ఒక సాధనంగా గతితార్కికభౌతికవాదం వినియోగపడుతుందనే అవగాహన ప్రపంచ పరిణామం తేవడానికి కవిత్వం కూడా వినియోగపడుతుందనే అవగాహనకు మూలం అయింది. శుద్ధతత్త్వశాస్త్రం (Pure philosophy) ప్రయోగతత్త్వశాస్త్రం (Applied Philosophy)గా మారినట్లే శుద్ధకవిత్వం (Pure Poetry) ప్రయోగ కవిత్వం (Applied Poetry) గా మారింది. ఈ పద్ధతి కవిత్వానికి ముందుగానే తయారుచేసినలక్షణాలుండవు. ఉన్నదానిని ఉండవలసినదానినిగా మార్చుకోవడానికి కావలసిన వివేచననుంచే శ్రీశ్రీ కవిత్వం ఉద్భవించింది. ఉండవలసిన దేమిటో గతితార్కికభౌతికవాదం నిర్దేశిస్తుంది.

'అంతా మాయ, అంతా మిథ్య; కనబడినది కనబడదు; వినబడినది వినబడదు; జగతి మరుపు – స్వప్నం – నిశ్శబ్దం; జమీందారురోల్సుకారు, మహారాజుమసీపర్సు, మరఫిరంగి, విషవాయువు, పాలికాపు నుదుటిచెమట, కూలివాని గుండెచెరువు, బిచ్చగాని కడుపుకరువు, తుపానులూ, భూకంపం, తిరుగుబాట్లు, సంగ్రామం అన్నీ మాయే! అంతా మిథ్యే!, అని వాదించే వేదాంతినే శ్రీశ్రీ మిథ్యావాది అన్నాడు. భౌతికవాదాన్నీ గతితర్కాన్నీ నమ్మే హేతువాదీ – ఈ ప్రపంచాన్నే నమ్మక దివ్యశక్తులను నమ్ముకునే ఆదర్శవాదీ–ముఖాముఖిగా ఉన్నసందర్భాన్ని ఊహించుకుని శ్రీశ్రీ ఈ ఖండికను రచించాడు. పరస్పరభిన్నవాదాలయిన భౌతికవాదాన్నీ ఆదర్శ వాదాన్నీ (Materialism and Idealism) పరిశీలిస్తే ఈ ప్రపంచాన్ని ముందుకు నడిపేది ఒకటీ వెనకకు లాగేది ఒకటి అని తేలిపోతుంది.

శ్రీశ్రీ తన మహాప్రస్థానగీతాలలో భౌతికవాదాన్ని ఎలాస్థాపించాడు ? ఆదర్శవాదాన్ని ఎలా తిరస్కరించాడు ? ఇందుకు కొన్ని నిదర్శనాలు :

(1) శ్రీశ్రీ భౌతికవాదానికి మొదటినిదర్శనం చారిత్రకభౌతికవిమర్శ. బలవంతులు దుర్బల జాతిని బానిసలను కావించారనీ నరహంతలు ధరాధిపతులై చరిత్రమున ప్రసిద్ధికెక్కారనీ వైషమ్యం, స్వార్థపరత్వం, కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు మాయలతో మారుపేర్లతో చరిత్ర గతిని నిరూపించాయనీ పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టిందనీ చెప్పడం భౌతిక వాదమే !

(2) రెండవది కర్మవాదవిమర్శ. 'వాడు' ఖండికలోని కార్మికులు భౌతికవాదులుకనుకనే అన్యాయాన్ని వేలెత్తి చూపెట్టారు. బూర్జువా ఆదర్శవాదికనుకనే 'అనుభవించాలి మీ కర్మం'

అని సమాధానం చెప్పాడు. ధనికదరిద్రభేదకారణాన్ని శ్రీశ్రీ ఈ ఖండికలో భౌతికవాదిగానే నిరూపించాడు.

(3) మూడవది విప్లవగమనప్రబోధం. మహాప్రస్థానగీతంలో మరోప్రపంచానికి పదండి ముందుకు అని కలలించడం భౌతికవాదప్రభావంవల్లనే. అభాగ్యులు విప్లవశంఖం వినిపిస్తారనీ, అణగారిన ఆర్తులు చారిత్రకయథార్థతత్త్వం చాటిస్తారనీ చెప్పడంలో గతితర్కాన్నీ భౌతికవాదాన్నీ అవగాహన చేసుకున్న శ్రీశ్రీ కనిపిస్తాడు. కార్మికుల తిరుగుబాటును క్షమించలేని వాడెవడైనా ఉంటే అతడు ఆదర్శవాదియే.

(4) నాల్గవది మాయావాదతిరస్కారం. అసలు భౌతికప్రపంచమే లేదనే ఆదర్శవాదం (Subjective idealism) కూడా ఒకటి ఉంది. మన మనస్సులలో భావాలే ఉన్నాయికానీ ఆ భావాలకు సరిపోయే వస్తువులు లేనేలేవంటారు ఈ వాదానికి చెందినవారు. "Nothing exists but the sensations and ideas in our minds, and there is no external material reality corresponding to them"[4] ఈ ఆత్మాశ్రయ ఆదర్శవాదియే శ్రీశ్రీకి "ముద్దుల వేదాంతి". ఈ వేదాంతి ఎదురుగా కనిపిస్తున్నవన్నీ లేవంటాడు. అంటే అబద్ధమాడుతున్నాడన్నమాట. ఆ అర్థంలోనే మిథ్యావాది (అసత్యవాది) అవుతున్నాడు వేదాంతి. ఎదురుగా కనిపిస్తున్నదంతా ఇతనిదృష్టిలో భ్రమ.

"We can truly say that idealism is essentially a conservative force — an ideology helping the defence of things as they are, and the preservation of illusions in men's minds about their true condition"[5]

పాలికాపు నుదుటిచెమటనూ కూలివాని గుండెబరువునూ మాయ అనడం శ్రమగౌరవాన్ని చిన్నచూపు చూడటమే అవుతుంది. కార్మికుడ్ని పైకి రాకుండా చేసే మాయావాదం బూర్జువాలకే అనుకూలిస్తుంది.

(5) ఐదవది సమాజవాస్తవికతాప్రదర్శనం. బూర్జువాసమాజంలో పీడితజనజీవితం కంటికి కనబడుతూనే ఉంటుంది కానీ ముద్దులవేదాంతి మాత్రం తనకది కనబడదంటాడు. అలాగే భువనఘోష తనకు వినబడదంటాడు. కనిపించిందంతా స్వప్నం అంటాడు. వినిపించిందంతా నిశ్శబ్దం అంటాడు. కానీ భౌతికవాది సమాజవాస్తవికతను చూపిస్తాడు. సమాజఘోషను వినిపిస్తాడు. పీడితసమాజ వాస్తవికతను శ్రీశ్రీ మహాప్రస్థానంలో చూపించాడు. ఒక త్రాగుబోతు, ఒక ఉన్మాది, ఒక భిక్షువర్షీయసి, ఒక నిరుద్యోగి, ఒగ పడుపుకత్తె, ఒక సమ్మెకట్టిన కూలీ, ఒక ఆకలేసిన బిడ్డ, ఒక చెమటోడ్చే కర్షకుడు, ఒక అలసిన కార్మికుడు, ఒక చెర

4 Dialectical Materialism part I - 16 P

5 IBID, - 21 P.

సాలలో చిక్కిన నిరపరాధి, ఒక ఆత్మహత్య చేసుకునే దౌర్భాగ్యుడు, ఒక కూడులేని గూడు లేని భిక్షువు, ఒక బాధాసర్పదష్టుడు – ఇలా ఎందరో శ్రీశ్రీకి కనిపిస్తారు. కానీ వేదాంతికి వీరెవరూ కనిపించరు!

త్రాగుబోతు ప్రేలాపన, పడుపుకత్తె ఆక్రందన, ఉన్మాదికేకలు, కూలీల హాహాకారం, కూలీసంసారపు ఆర్తారావం, కార్మికుని విలాపం, భిక్షువర్షీయసి మూలుగు, సామాన్యుడి చేదుపాట, అసహాయుల హాహాకారం, బాధాసర్పదష్టుల ఏడుపు శ్రీశ్రీ ఈ సమాజంలో విన్నాడు. ఇవేవీ వేదాంతి వినిపించుకోడు!

కనబడటం, వినబడటం ఈ రెండూ ఇంద్రియజ్ఞానాలు. వేదాంతి ఇంద్రియజ్ఞానాన్ని ప్రమాణంగా గ్రహించడు. ఇంద్రియజ్ఞానమంతా భ్రమ అని వాదిస్తాడు. అతీంద్రియజ్ఞానం వేదాంతికి సత్యం! జగతి మరపు అనీ స్వప్నం అనీ నిశ్శబ్దం అనీ వాదించడం వాస్తవికతను తిరస్కరించడమే!

(6) ఆరవది ఆర్థికకారణాల నిరూపణం. జగత్తు మాయ అనడమే కాదు; వేదాంతి 'జమీందారురోల్సుకారు'ని కూడా మాయే అంటాడు! భౌతికవాది రోల్సుకారు యాథార్థ్యాన్ని తెలుసుకోమంటాడు! కార్మికుడు తన శ్రమతో ఉత్పత్తిచేసిన వాహనం రోల్సుకారు! ఆశ్రమను దోపిడిచేసిన బూర్జువాయజమాని ఆ జమీందారు. శ్రమ, ఉత్పత్తి, దోపిడి అనే మూడంశాలను 'రోల్సుకారు'ను చూడగానే భౌతికవాది గుర్తుకుతెచ్చుకుంటే వేదాంతి మాయనే గమనిస్తాడు!

భోగలాలసుడైన మహారాజు చేతిలోని 'మనీపర్సు' అతని సమస్తభోగాలకు సాధనం! అతనికి ఆ సొమ్ము రావడానికి "ఇలాతలంలో హేమం పిండిన'' కర్షకులు కారణం. అతని 'మనీపర్సు' మాయ అంటాడు వేదాంతి. కాదంటాడు భౌతికవాది!

జమీందారు, మహారాజు అనేవి పెద్దమనుషులు, బుద్ధిమంతులు వంటి పరిహాసకపదాలు. అవి రెండూ ఇక్కడ బూర్జువాలకే ప్రతీకలు.

అందరూ కలిసి చేసిన అందమైన వస్తుసముదాయాన్ని ఎక్కడో ఒక్కడే వచ్చి ఎత్తుకుపోవడానికి ఉదాహరణే రోల్సుకారు. జమీందారుబ్రతుకూ మహారాజుల జీవితమూ వర్ధించిన విస్తర్లు కావడానికి కారణం కార్మికుల పరిశ్రమయే!

(7) ఏడవది హింసావాదతిరస్కారం. పెట్టుబడిదారీవ్యవస్థలోంచి ఆవిర్భవించిన సామ్రాజ్యవాదమే నవీనయుద్ధసాధనాలైన మరఫిరంగినీ విషవాయువునీ సృష్టించింది. సామ్రాజ్యవాదుల మధ్య ఏర్పడిన పోటీ, స్పర్థ, వైరం ప్రపంచయుద్ధానికి దారితీశాయి. మొదటి ప్రపంచ యుద్ధంలో అసంఖ్యాకప్రజలు మరణించడానికి మారణాయుధాలు కారణమయ్యాయి. మారణా

యుద్ధాలను కూడా 'మాయ' అంటాడు వేదాంతి. ప్రపంచంలోని రాజకీయపరిణామాలనూ, ఫాసిజం వంటి హింసావాదాలనూ గమనించిన భౌతికవాది వాటి వాస్తవాలను గ్రహిస్తాడు.

ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదాన్ని భౌతికవాదియైన శ్రీశ్రీ విన్నాడు. రెండవ ప్రపంచయుద్ధంలో హింసనచణధ్వంసరచననూ ధ్వంసనచణహింసరచననూ చేసిన విషవాయువు, మరఫిరంగి, టార్పిడో, టోర్నాడోలను గురించి తెలియజెప్పాడు. అంతా మిథ్య అనుకోవడం వ్యక్తిగతమైన నైరాశ్యం నుంచి జనించే భావం. కానీ విజ్ఞానశాస్త్రి ప్రయోగాలు ఎన్నిటినో రుజువుపరిచి జగత్ సత్యాలను వెలువరిస్తూంటే వాటిని అవగాహన చేసుకోవలసిందనేదే శ్రీశ్రీ మిథ్యావాద నిరూపణలోని వ్యంగ్యం. హింసావాదానికి జవాబుగా కార్మికులు యుద్ధం జరపవలసిందే! అదే జరిగింది రష్యామీద నాజీలు దాడి జరిపినపుడు.

(8) ఎనిమిదవది పలాయనవాద నిరసనం. పాలికాపు ఫ్యూడల్‌వ్యవస్థలోనూ కూలివాడు బూర్జువావ్యవస్థలోనూ పీడితులు. పాలికాపు నుదుటి చెమట అతని శ్రమ స్వేదమే! ఆ ఘర్మ జలానికి ఖరీదు లేదు. కూలివాని గుండె చెరువుకు కారణం – గనిలో వనిలో కార్ఖానాలో పరిశ్రమిస్తూ పరిప్లవిస్తూ ధనికస్వామికి దాస్యం చేస్తూ యంత్రభూతముల కోరలు తోముతూ విలపించడమే! బిచ్చగాని కడుపుకరువుకు కారణం సమాజంలో కొందరిది వర్ధించిన విస్తరి కావడమే!

వీటన్నింటినీ మాయ అంటాడు వేదాంతి. ఈ వాదం ఈ సమస్యలకు పరిష్కారంకాదు. పైగా ఇది పలాయనవాదం అవుతుంది. అన్నీ మాయ అనుకునేవాడు కూడా ఆకలినుంచి తప్పించుకోలేడు. క్షుద్బాధానివారణకై వేదాంతికూడా ప్రయత్నిస్తాడు.

సమాజంలో కొందరు సంపన్నులూ కొందరు బీదవాళ్లూ కావడానికి కారణం పూర్వజన్మ కర్మం అనీ మాయ అనీ భగవంతుడి సంకల్పం అనీ రకరకాలుగా వేదాంతులూ ఆదర్శ వాదులూ చెప్పవచ్చు. ముందుచూపు, జాగ్రత్త, పొదుపుగలవారంతా ధనవంతులయ్యారనీ ఖర్చుచేసేవారూ వ్యసనలోలురూ బీదలయ్యారనీ మరికొందరు వాదించవచ్చు. కానీ మార్క్సిస్టయిన భౌతికవాది ఖచ్చితమైన కారణాన్ని అన్వేషిస్తాడు. సమాజంలోని ఆర్థిక భౌతికపరిస్థితులూ వర్గ వైరుధ్యాలూ ఈ తారతమ్యాలను సృష్టించాయి. పీడకులు దారిద్ర్యాన్ని కల్పించారు. ఉత్పత్తిసాధనాలను స్వాధీనపరచుకున్నవారు తరతరాలుగా ధనవంతులుగా ఉన్నారు. కూలీలు వీరికోసం శ్రమనర్పిస్తూ ఉత్పత్తి సాధనాల లేమివల్ల దరిద్రులుగా మిగిలారు. ఇది సామాజికమైన అధర్మమే గానీ మాయ కాదు.

(9) తొమ్మిదవది రాజకీయ వాస్తవికతానిరూపణం. తిరుగుబాట్లు ప్రగతికి సరి అయిన మార్గాలు. పరిణామానికి చిహ్నాలు. సామాజికవాస్తవికత తెలిసినప్పుడు పీడితవర్గం పీడక

వర్గంమీద తిరగబడుతుంది. ఫ్యూడల్ వ్యవస్థమీద బూర్జువాలు తిరుగుబాటు చేశారు. అలాగే బూర్జువావ్యవస్థమీద కార్మికులు తిరుగుబాటుచేయడం అనివార్యం. నిరంకుశపాలకులమీద పాలితులు స్వాతంత్ర్యం నిమిత్తం అనేకదేశాలలో తిరుగుబాట్లు చేశారు. సామాజికదురన్యాయాలమీద తిరుగుబాటుచేయడం ఎడనెడ సంభవిస్తూనే ఉంటుంది. చరిత్ర వీటికి సాక్ష్యం. వీటినన్నింటినీ మాయ అనడం అజ్ఞానం!

శ్రీశ్రీ కోరుతున్న తిరుగుబాటును కార్మికులు బూర్జువాలమీద చేయవలసిఉంది. అభాగ్యులంతా అనాథులంతా అశాంతులంతా దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో విప్లవశంఖం పూరిస్తారని చెప్పినమాట ఈ తిరుగుబాటును గురించే. తిరుగుబాటే భౌతికవాది వేదాంతం. మాయ వేదాంతి వేదాంతం.

సంగ్రామం పీడకవర్గాలమధ్య జరిగే మహాయుద్ధం! ఇందులో పీడకవర్గాలు పీడితవర్గాల సాహాయ్యాన్ని అర్థిస్తాయి. శ్రీశ్రీ ఈ గీతంరాసేనాటికి ఒకే ప్రపంచయుద్ధం జరిగింది. జగన్నాథుని రథచక్రాలు రాసేనాటికి రెండవప్రపంచయుద్ధం జరుగుతోంది. ఈ మహాసంగ్రామం సామ్యవాదావతరణానికి దోహదం చేస్తుందనుకున్నాడు శ్రీశ్రీ. భౌతికవాది అయిన శ్రీశ్రీకి తిరుగుబాట్లు, సంగ్రామం వ్యర్థంగా కనిపించవు. స్పెయిన్‌లోవచ్చిన తిరుగుబాటు శ్రీశ్రీని కదిలించింది. మిథ్యావాదికి తిరుగుబాట్లూ సంగ్రామం అన్నీ అబద్ధమే.

ప్రకృతిలో తుపానులూ భూకంపం ఎంత సహజమైనవో సమాజవ్యవస్థలో తిరుగుబాట్లూ సంగ్రామం అంత సహజమైనవిగా శ్రీశ్రీకి కనిపిస్తాయి. ఈ పోలికను శ్రీశ్రీ అభివ్యక్తంచేసినతీరు విచిత్రమైనది. "తుపానులూ భూకంపం తిరుగుబాట్లు సంగ్రామం" అనే నాలుగింటివరుసలో మొదటిరెండూ ప్రకృతిసంఘటనలు. తరువాతివి రెండూ రాజకీయసంఘటనలు. తుపానులూ తిరుగుబాట్లూ బహువచనంలో ఉంటే, భూకంపం సంగ్రామం ఏకవచనంలో ఉన్నాయి. తుపానులూ తిరుగుబాట్లూ పలుమార్లు వచ్చేవి. భూకంపం, సంగ్రామం ఎప్పుడో వస్తాయి.

తుపానులకూ భూకంపానికీ శాస్త్రజ్ఞులు భౌతికకారణాలను కనుక్కొని నిరూపించారు. ఇవి మాయలెలాగవుతాయి? ఇవి రావడానికికారణం దేవుడికోపం అనుకునే రోజులు గతించాయి. ప్రకృతిశక్తుల గతిపరిణామాలవల్ల అవి సంభవిస్తాయి. అలాగే తిరుగుబాట్లూ సంగ్రామం కూడా సామాజిక గతిపరిణామాల ఫలితాలే!

### శ్రీశ్రీ - పరిహాసధోరణి

ఆదర్శవాదికి శృంగారం ఎంతప్రధానమయిందో, భౌతికవాదికి హాస్యం అంత ఆవశ్యకమయింది. ఆదర్శవాది ఆత్మాశ్రయకవి కావడం, భౌతికవాది సమాజాశ్రయకవి కావడం ఇందుకు

కారణాలు, తన ఆనందమే ముఖ్యమైనప్పుడు శృంగారాన్ని మించిందిలేదు. సమాజాన్ని మార్చ డమే ముఖ్యమైనప్పుడు హాస్యంచేయడం ముఖ్యమార్గం. ఇటువంటి దృష్టితోనే శ్రీశ్రీ పరిహాసం వైపు మొగ్గుతాడు. భావాలను ఎదిరించడం పరిహాసమే. శ్రీశ్రీ కవిత్వంలోని పరిహాసధోరణిని పరిశీలిద్దాం.

మిథ్యావాదిమీదచేసిన తిరుగుబాటే మాయంటావా అంతా మిథ్యంటావా – మాయం టావా లోకం మిథ్యంటావా ? మాయంటావా ఏం ఏమంటావా ? మాయంటావా బాబూ ఏమంటావా ? మాయంటావా ఏయ్ ఏమంటావా ? అనే ప్రశ్నల్లో వినిపిస్తుంది. ఒకప్రశ్న నే రకరకాలుగా సాగదీయడంలో వేళాకోళం ఉంది. మిథ్యావాది పరాజితుడై భౌతికవాదిచేతుల్లో పడినప్పుడు జరిగే పరాభవానికి ఈ ప్రశ్నలు వ్యంజకాలు ! నా ముద్దుల వేదాంతీ ! అనడంలో బాబూ ! అనడంలో ఏయ్ ! అనడంలో పరిహాసం కొట్టవచ్చినట్లుగా వినిపిస్తుంది. ఈ పరిహాసం సందర్భోచితం.

కనబడినది కనబడదని/వినబడినది వినబడదని – ఈ రెండు పాదాల్లోనూ హ్రస్వాక్షర సమూహమూ డకారావృత్తీ వేళాకోళాన్ని పట్టి చూపిస్తాయి. జగతిమరపు స్వప్నం ని/శ్శబ్దం అని పాదాంతంలో మాటను విడగొట్టడం అవహేళనకు పుష్టినిస్తుంది. మాయమమాయమమాయంటావా అని మాయను ముమ్మారు త్రిప్పడంలో మొహమాటంలేకుండా దులిపివేయడం ఉంది.

ఈ పరిహాసంలోనే తిరుగుబాటు, పోరాటం అభివ్యక్తమవుతున్నాయి. "the whole history of human thought has been the history of the fight of materialism against idealism of the overcoming of idealist illusions and fantasies."[6]

ఆదర్శవాదపు భ్రమలనూ, ఊహలనూ భౌతికవాస్తవికతతోనూ శాస్త్రీయవిజ్ఞానచైతన్యం తోనూ ఎదుర్కొన్న కవి శ్రీశ్రీ !

తన తిరుగుబాటుకు పరిహాసాన్ని ఒకపదునైన ఆయుధంగా వాడుకున్నాడు శ్రీశ్రీ. 'సాహసి' గేయంలోని నిషేధాలు పరిహాసపుపిడిబాకులే ! 'భిక్షువర్షీయసి' గేయంలో ఎగిరివచ్చిన ఎంగి లాకు ఇది నా పాపంకాదని చెప్పిందనడంలో సునిశితమైన పరిహాసం ఉంది ! 'ఉన్మాది'గేయంలో వెర్రివాణ్ణి చూసీచూడనట్లు వెళ్ళిపోయే పెద్దమనుషుల్నీ దురన్యాయం చేసిన బుద్ధిమంతుల్నీ వేళాకోళం చేశాడు శ్రీశ్రీ ! వెర్రివాడు తనవెకిలిచూపుతోనూ కూనిరాగంతోనూ సమాజాన్ని వేళాకోళం చేస్తున్నాడంటాడు శ్రీశ్రీ. 'చేదుపాట' గేయంలో 'కుక్కలవలె నక్కలవలె సందులలో పందులవలె' మనమంతా ఉన్నామనడంలో సమాజస్వవిమర్శ, పరిహాసం ఉన్నాయి. 'సంధ్యా సమస్యలు' గేయంలో విద్యార్థిపరిస్థితికీ ఉద్యోగి సందేహానికీ ఫక్కున నవ్వువచ్చి తరువాత జాలి వేస్తుంది. అద్వైతులైన దంపతులు ప్రపంచాన్ని పరిహసించాలని చూస్తారు. దేశచరిత్రలు

---

6 Dialectical Materialism Part I – 21 P.

గేయంలో ఎవరైతేనేం ఒకొక్కడూ మహాహంతకుడు! అనడంలో వెక్కసమైన వేళాకోళం, కోపం కూడా ఉన్నాయి. 'ఇతరేతరశక్తులు లేస్తే పడిపోయెను పేకమేడలై' అన్నప్పుడు అధిక్షేపం ఉంది. 'ఇంకానా ఇకపై చెల్లవు' అన్నప్పుడు తిరుగుబాటుతోపాటు తీవ్రనిరసన వినిపిస్తుంది. 'వాడు' ఖండికలో బూర్జువాచర్యలు ఎంతనీచమైనవో ధ్వనించినప్పుడు అతడిమీద ఉండే గౌరవం తొలగిపోతుంది. వ్యత్యాసం ఖండికలో 'ఇంకా వెనక్కి పోతామంటారు కూడా మీలో కొందరు' అనే విమర్శకు వారి వెనకనడక ఊహిస్తే నవ్వొస్తుంది.

## శ్రీశ్రీ ఏకపదావృత్తిశిల్పం

ఒకే పదాన్ని (పదసమూహాన్ని) బహుళంగా ఆవృత్తంచేసి లయను సృష్టించి శ్రుతికేకాక అర్థానికి కూడా పుష్టికలిగించడం శ్రీశ్రీ విచిత్రసంవిధానం.

తుపానులూ భూకంపం/తిరుగుబాట్లు సంగ్రామం/సంగ్రామం/సంగ్రామం

ఇందులో సంగ్రామం ముమ్మారు వచ్చి అనంతత్వాన్ని తెలుపుతోంది.

జగతిమరపు, స్వప్నం, ని/శ్శబ్దం, ఇది
మాయి! మాయ! / మాయ! మాయ!
మాయ! మాయ! / మాయంటావా?

ఇందులో మాయ 7 సార్లు ఆవృత్తమై వేళాకోళాన్నీ విసుగునూ సూచిస్తోంది. ఈ పదావృత్తి శిల్పం మహాప్రస్థానం, అభ్యుదయం, కళారవి, చేదుపాట, గంటలు, నిజంగానే, జగన్నాథుని రథచక్రాలు వంటి అనేక ఖండికల్లో కనిపిస్తుంది. వాటిని పాఠకులు గుర్తించగలరు.

## శ్రీశ్రీ అచ్చతెలుగు ప్రయోగం

సంస్కృతభాషయొక్క వాసనను కూడా చేరనీయకుండా అచ్చతెలుగు వాడటం అక్కడక్కడ శ్రీశ్రీ చేసే గమ్మత్తు. ఇందుకు అర్థసముద్దీపనదృష్టియే కారణం. పాలికాపునుదుటి చెమట – బిచ్చగాని కడుపుకరువు – కూలివాని గుండెచెరువు – ఎండకాలం మండినప్పుడు గబ్బిలంవలె క్రాగిపోలేదా – వానకాలం ముసిరిరాగా నిలువునిలువున నీరు కాలేదా – చండ్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు – నింగినుండీ తొంగిచూచే రంగురంగుల చుక్కలన్నీ రాలి, నెత్తురుక్రక్కుకుంటూ పేలిపోతాయి – పుడమితల్లికి పురుటినొప్పులు – పుడమికి నేడే పుట్టినరోజట – పులిచంపిన లేడినెత్తురు – ఎగరేసిన ఎర్రనిజెండా – రాబందుల రెక్కలచప్పుడు – వానవెలిసీ మబ్బులో ఒక మెరుపు మెరిసింది – వేగుజామును తెలియజేస్తూ కోడికూసింది – విడిన మబ్బుల నడుమనుండీ వేగుజుక్కా వెక్కిరించింది – ఎముకముక్క కొరుక్కుంటు ఏమీఅనలేదు కుక్క – కడలివలపూ వలపు కడలీ – మొదలైనవి.

## నాలో కదిలే నవ్యకవిత్వం కార్మికలోకపు కల్యాణానికి!

1937 మే 7

"ఏకవికైనా సరే అతనిచుట్టూ ఒకసమాజం, ఆ సమాజానికొక చరిత్ర ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. సామాజికచారిత్రకపరిణామగమనంలో కవియొక్క సాహిత్యస్థానం నిర్ణీత మవుతుంది. కవి ప్రగతిశీలీ, ప్రతిభాశాలీఅయితే ఈ గమనాన్ని అతడు మరింత వేగవంతం చేస్తాడు"1 అంటూ శ్రీశ్రీగారొకసిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. కవిత్వానికి విలువకట్టడానికి మార్క్సిస్టులు తీసుకునే ప్రమాణం ఇదే!

సమాజపరిణామం ప్రధానంగా రాజకీయవ్యవస్థాపరిణామం మీద ఆధారపడిఉంటుంది. తెలుగుకవిత్వం ఫ్యూడల్ రాజకీయవ్యవస్థలో ఆరంభమై 20వ శతాబ్ది ఆరంభంలో బూర్జువా రాజకీయవ్యవస్థను ఆహ్వానిస్తూ ఒక పెద్దమలుపుతిరిగింది.

ఫ్యూడల్ రాజకీయవ్యవస్థలో సామాజికంగా కులమతవర్గాలకు ప్రాధాన్యం ఉండేది. ఆర్థికంగా భూస్వాములు, కర్షకులు అనే వర్గాలుండేవి. ఉత్పత్తి వ్యవసాయంమీదా చేతివృత్తులమీదా జరిగేది. ఉత్పత్తిసాధనాలు భూమి, నాగలి, గొడ్డలి, రంపం, కొడవలి, కాయకష్టం వంటివి. కవిత్వం ధర్మార్థకామమోక్షాలకోసం. కవులు రాజాభిరుచిని ప్రమాణంగా స్వీకరించారు. బౌద్ధికంగా హేతువుకన్నా విశ్వాసమే అగ్రతాంబూలంపొందేది. కవులు స్వతంత్రప్రయోగాలు చేయడంకన్నా సంప్రదాయాలనూ లక్షణశాస్త్రాలనూ అనుసరించడంవల్లనే గౌరవం పొందుతూ ఉండేవారు. గ్రంథస్థమైనభాషనే ప్రామాణికంగా గ్రహించేవారు. సాంప్రదాయికఛ్ఛందస్సులను వాడటమే గొప్పగా పరిగణింపబడేది. పాండిత్యానికే పెద్ద పీటలభించేది. పల్లెలకే ప్రాధాన్యం! మానవుడికన్నా దేవుడికే గౌరవంఎక్కువ. రాజును దైవప్రతినిధిగా భావించేవారు. వ్యక్తికి స్వేచ్ఛ లేదు. విద్య కొన్నివర్గాలకే పరిమితం. వైజ్ఞానికపరిశోధనలు అతీంద్రియశక్తులతో సాగేవి. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ సామాజికవ్యవస్థలో కదలిక లేదు; పదార్థపరమైన - భౌతికమైన పురోగమనం లేదు. సమాజంలో మార్పు ప్రతిఘటింపబడుతూఉండేది. మూఢవిశ్వాసాలు ఇలాంటి సమాజంలో సహజం. ఈ వ్యవస్థలో భావదాస్యం ఎక్కువ. భావాలకుండే ప్రాధాన్యం

1 శ్రీశ్రీసా. రెండు. వచన. 469 పే.

వాస్తవానికి ఉండదు. ఈ భావాలనే ఫ్యూడల్ కవులు ప్రతిబింబించారు. కాని 12వ శతాబ్దిలో తిక్కన, 17వ శతాబ్దిలో వేమన ఫ్యూడల్ సమాజాన్ని మున్ముందుకు నడపడానికి ప్రయత్నించారు. మొత్తంమీద తెలుగుకవిత్వంలో 11-19 శతాబ్దాల చరిత్రను ఆదర్శవాద మహాయుగం (great idealistic age) అనవచ్చు.

ఫ్యూడల్ రాజకీయవ్యవస్థ 20వ శతాబ్ది ఆరంభంలో క్షీణదశకు వచ్చింది. అందువల్ల సమాజమంతా మారిపోవలసిన అవసరం ఏర్పడింది. ఈ మార్పుని వేగవంతంచేయడానికి యత్నించిన కవుల్లో గురజాడ, కృష్ణశాస్త్రి అతిముఖ్యులు.

ఫ్యూడల్ రాజకీయవ్యవస్థమీద తిరుగుబాటుచేసినది బూర్జువా రాజకీయవ్యవస్థ. ఈవ్యవస్థలో సామాజికంగా కులమతవర్గాలకు ప్రాధాన్యం నశిస్తుంది. ఆర్థికంగా పెట్టుబడిదారులు (బూర్జువాలు), కార్మికులుఅనే వర్గాలేర్పడతాయి. ఉత్పత్తి పరిశ్రమలమీదా యంత్రాలమీదా జరుగుతుంది. ఉత్పత్తిసాధనాలు పదార్థాలు, లోహాలు, యంత్రాలు, ధనం, (పెట్టుబడి), విద్యుచ్ఛక్తి, శ్రమ మొదలైనవి. ఫ్యూడల్ వ్యవస్థలో కని, విని, యెరుగని సదుపాయాలు బూర్జువావ్యవస్థలో ఉత్పత్తికి తోడవుతాయి. రవాణాసదుపాయాలు, వార్తాప్రసారసాధనాలు, రోడ్లు, ఆధునిక వాహనాలు, వినోదసాధనాలు కొత్తగా వచ్చిపడతాయి. కవిత్వం భౌతికమానసిక ప్రయోజనాలకోసం! ఫ్యూడల్ వ్యవస్థలోవలె మోక్షంకోసంకాదు. కవులు వ్యక్తులఅభిరుచిని ప్రమాణంగా స్వీకరిస్తారు. బౌద్ధికంగా విశ్వాసంకన్నా హేతువే అగ్రతాంబూలం వహిస్తుంది. కవులు సంప్రదాయాలనూ లక్షణశాస్త్రాలనూ నిరాకరించి విదేశీయసాహిత్యప్రభావంతో స్వతంత్రప్రయోగాలు చేయడంవల్లనే గౌరవం పొందుతారు. సజీవమైనభాషనే ప్రామాణికంగా గ్రహిస్తారు. సాంప్రదాయికచ్ఛందస్సును తిరస్కరిస్తారు. పాండిత్యానికికాక ప్రతిభకే పెద్దపీట లభిస్తుంది. నగరాలకే ప్రాధాన్యం! పెట్టుబడిదారుడికే గౌరవం! విద్య అన్నివర్గాలకూ విస్తరిస్తుంది. వైజ్ఞానికపరిశోధనలు యంత్రాలతో సాగుతాయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ సామాజికవ్యవస్థలో కదలిక ఎక్కువ. పదార్థపరంగాను భౌతికంగాను పురోగమనం జరుగుతుంది. విదేశాలతో సంబంధాలు పెరుగుతాయి. సమాజంలో మార్పులు అనేకంగా జరుగుతాయి. మూఢవిశ్వాసాలమీద తిరుగుబాటు జరుగుతుంది. భావదాస్యం సడలుతుంది. భావాలకన్నా వాస్తవానికి ప్రాధాన్యం వస్తుంది. ఈ భావాలను 1900-15 మధ్య గురజాడ, 1922-33 మధ్య కృష్ణశాస్త్రి తమకవిత్వంలో ప్రతిబింబించారు. సమాజపురోగమనానికి దోహదంచేశారు. ఈ మూడుదశాబ్దాలూ కవిత్వంలో ఆదర్శవాస్తవాల సంకీర్ణయుగం.

బూర్జువా రాజకీయవ్యవస్థవల్ల సమాజానికి అభ్యుదయంతోపాటు ఎన్నో అరిష్టాలు కూడా ప్రాప్తిస్తాయి. ఈ వ్యవస్థలో సామాజికంగా సమానన్యాయం లభించదు. ఆర్థికంగా పెట్టుబడిదారులు కార్మికుల శ్రమను దోపిడి చేస్తూ సుఖపడుతూ ఉంటారు. దారిద్ర్యాన్ని సరకు

గిరాకీని పెంచుతారు. ఉత్పత్తిసాధనాలను బూర్జువాలు సొంతం చేసుకుంటారు. రాజకీయాధికారాన్ని తమ వశంలో ఉంచుకుని, స్వార్థప్రయోజనాలకు దానిని వాడుకుంటారు. అన్ని కొత్త సదుపాయాలూ ధనవంతులకు మాత్రమే లభిస్తాయి. అవినీతి, పరపీడన, వంచన, అనారోగ్యం, దారిద్ర్యం, అవిద్య వంటివి సమాజంలో ప్రత్యక్షమవుతాయి. తాము ఫ్యూడల్‌వ్యవస్థ నెదిరించినట్లుగా తమమీద కార్మికవర్గం తిరగబడకుండా బూర్జువావ్యవస్థ జాగ్రత్తపడుతుంది. ప్రజలు పాతవ్యవస్థకు చెందినవారుగానూ తాము కొత్తవ్యవస్థకు చెందినవారుగానూ ఉండాలని బూర్జువాలు ప్రయత్నిస్తారు. బూర్జువావర్గం సామ్రాజ్యవాదం వైపు పురోగమిస్తూ ప్రపంచాన్ని అశాంతి పాలు చేస్తుంది.

కనుక బూర్జువావ్యవస్థమీద తిరుగుబాటు చేయవలసినది సామ్యవాదరాజకీయవ్యవస్థ. బూర్జువారాజకీయవ్యవస్థవల్ల వచ్చిన అభ్యుదయాన్ని స్వీకరిస్తూ అరిష్టాలను తొలగిస్తుంది సామ్యవాదరాజకీయవ్యవస్థ. సామాజికంగా సమానన్యాయాన్ని పంచిపెడుతుంది. ఆర్థికంగా వర్గాలు లేకుండా చేస్తుంది. శ్రమను గౌరవిస్తుంది. దోపిడీని నిర్మూలిస్తుంది. దారిద్ర్యాన్ని తుడిచిపెడుతుంది. ఉత్పత్తిసాధనాలను సమాజపరం చేస్తుంది. రాజకీయాధికారం సమాజపరం అవుతుంది. శాంతిని స్వేచ్ఛనూ సుఖాన్నీ సౌభాగ్యాన్నీ సమాజానికి అందజేస్తుంది సామ్యవాదవ్యవస్థ.

బూర్జువా రాజకీయవ్యవస్థ సాధించిన అభ్యుదయాన్నీ అరిష్టాలనూ కూడా కవిత్వంలో ప్రతిబింబిస్తూ సమాజం ఆ వ్యవస్థలో ఉండిపోకూడదనీ దానిమీద తిరుగుబాటుచేసి సామ్యవాద రాజకీయవ్యవస్థను స్థాపించుకోవాలనీ కవిత్వంద్వారా ప్రతిపాదించిన వాడు శ్రీశ్రీ. రాజకీయంగా ఆర్థికంగా సాంస్కృతికంగా వైజ్ఞానికంగా సమాజవ్యవస్థలో వస్తున్నమార్పులను ప్రతిబింబించడమే గాక ఆ మార్పులు సరిఅయిన దిశలో జరిగేందుకు శ్రీశ్రీ కవిత్వం దోహదం చేసింది. అందువల్ల 1933 నుంచి తెలుగు కవిత్వం వాస్తవికమహాయుగం (great realistic age) లోకి ప్రవేశించింది.

రాజకీయవ్యవస్థల దృష్ట్యా చూస్తే తెలుగుకవిత్వంలో మూడుదశలు కనిపిస్తాయి.

| (1) | | (2) | | (3) |
|---|---|---|---|---|
| ఫ్యూడల్ యుగం 1020 – 1900 | → | ఫ్యూడల్ + బూర్జువాయుగం 1900 – 1932 | → | బూర్జువాయుగం 1933 – |
| ఆదర్శవాదం | → | ఆదర్శ + వాస్తవ వాదాలు | → | వాస్తవవాదం |
| దైవం, రాజు | → | వ్యక్తి, ప్రజలు | → | వర్గసమాజం |

రాజకీయంగా నాల్గవపరిణామం సామ్రాజ్యవాదయుగం లేదా సామ్యవాదయుగం సంభవాలు. సామ్యవాదయుగంలోకి పయనించాలనేది శ్రీశ్రీ కోరిక.

## గురజాడ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ

ఇరవయ్యో శతాబ్ది రెండవదశాబ్దిలో (1910-20) గురజాడ, మూడవదశాబ్దిలో కృష్ణశాస్త్రి (1920-30), నాల్గవదశాబ్దిలో శ్రీశ్రీ (1930-40) సామాజికపురోగమనానికి భిన్నభిన్న మార్గాలు చూపించారు. మొదటియిద్దరికన్నా శ్రీశ్రీ చూపించినదారి వాస్తవమయినది సామాజిక పురోగమనానికి వీరు చూపించినదారులు సాహిత్యపురోగమనానికి కూడా సంబంధించినవే.

వస్తువులోనూ సంవిధానంలోనూ ఈ ముగ్గురూ సాధించిన వైశిష్ట్యం గురించి బేరీజువేసుకో వలసిన ఆవశ్యకం ఉంది. శ్రీశ్రీ పురోగమనాన్ని తెలుసుకునేందుకే అది సహకరిస్తుంది.

గురజాడ 'కొత్తపాతలమేలుకలయిక' కావాలనడంలో అర్థంఏమిటి? ఫ్యూడల్‌వ్యవస్థలోని పాతనూ బూర్జువావ్యవస్థలోని కొత్తనూ కలుపుకోవాలనేది ఆయన ఆశయం. మంచి గతమున కొంచెమే అన్నారాయనే. ఫ్యూడల్‌వ్యవస్థలో 'చెడు' చాలా కనిపించింది. దాన్ని సమాజమూ సాహిత్యమూ కూడా వదిలివేయవలసిందే. బూర్జువావ్యవస్థలో (కొత్తవ్యవస్థ) ఆయనకు అప్పటికి అంతా 'మంచి'యే కనిపించింది. దానినంతటినీ సమాజమూ సాహిత్యమూ కూడా స్వీకరించ వలసిందే! గురజాడ కవిత్వంలోని బూర్జువాచైతన్యలక్షణాలివిగో ఇవి:-

(1) 'ఆకులందున అణగిమణగి కవితకోయిల పలుకవలె! పలుకులను విని దేశమందభిమాన ములు మొలకెత్తవలె' అంటూ కవితావస్తువుమార్పును గురించి గురజాడ సూచించారు. ఇది సమాజంలో రావలసినమార్పే. పురాణగాధలను విడిచిపెట్టి దేశం, మనిషి, సమాజం, కవితా వస్తువులుగా స్వీకరించారాయనే. దేశభక్తిగీతంలో ఆయన చెప్పిన ప్రబోధమంతా బూర్జువావ్యవస్థ సాధించే అభ్యుదయాన్ని ఆహ్వానించేదే! వెనుకచూపువద్దు - ముందడుగువెయ్యాలి - వాణిజ్యం పెంచాలి - డబ్బుతేవాలి వంటివన్నీ బూర్జువాలక్ష్యాలే! మూఢవిశ్వాసాలను తిరస్కరించడం ఫ్యూడల్‌వ్యవస్థను తిరస్కరించడమే! హేతువాదాన్ని శిరసావహించడం బూర్జువావ్యవస్థను గౌరవించడమే!

బూర్జువావిప్లవానికి సామాజికంగా సంస్కరణవాదమే ప్రియమైనది. గురజాడ సంస్కరణ వాది! ఆయన ప్రగతినిరోధకుడు కాడు! యథాస్థితివాది కాడు! విప్లవవాది కాడు!

(2) కవితాసంవిధానంలోనూ గురజాడ సంస్కరణవాదియే! 'గుత్తునా ముత్యాల సరములు కూర్చుకొని తేటైన మాటలు! కొత్తపాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు చిమ్మగా' అంటూ సంవిధానసంస్కరణను ప్రవేశపెట్టడంలో బూర్జువాతత్త్వం ఉంది. అందుకే ఫ్యూడల్ సంప్రదాయాలనభిమానించేవారు ఆయనను మెచ్చుకోలేకపోయారు. బూర్జువాసమాజపు పరిణా మాలూ విలువలూ గురజాడకు అవగాహన అయినట్లు పాతవారికి అర్థంకాలేదు. 'మెచ్చునంటా నీవు నీవిక మెచ్చకుంటే మించిపాయెను! కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు కోమలుల సౌరెక్కునా?'

అంటూ గురజాడ చెప్పిన సమాధానంలో ఫ్యూడల్‌కవిత్వంమీద తిరస్కారం, బూర్జువా స్వేచ్ఛాప్రియత్వం, బూర్జువాసంస్కరణప్రియత్వం ఉన్నాయి. వ్యావహారికభాషలోని సౌలభ్యాన్నీ, మాత్రాచ్ఛందస్సులలోని సంగీతగుణాన్నీ, తేటతెలుగులోని సరళత్వాన్నీ ఆయన అభిమానించడానికి కారణం బూర్జువా చైతన్యమే!

(3) రాజాభిరుచిననుసరించి కవిత్వంరాయడం ఫ్యూడల్‌వ్యవస్థలక్షణం. సామాన్యుల అభిరుచినీ వ్యక్తిఅభిరుచినీ అనుసరించి కవిత్వంరాయడం బూర్జువావ్యవస్థలోనే కనిపించే రెండు భిన్నలక్షణాలు. ఇందులో మొదటిలక్షణాన్ని గురజాడకవిత్వంలో చూడగలం!

(4) మతోద్ధరణకై కవిత్వంరాయడం ఫ్యూడల్‌వ్యవస్థలక్షణం. ఇందుకు గతంలోని పురాణగాథలనే ఫ్యూడల్‌కవి ఆశ్రయిస్తాడు. మానవోద్ధరణకు కవిత్వంరాయడం బూర్జువావ్యవస్థ లక్షణం. ఇందుకు సమకాలికసమాజంనుంచే కథలను ఏరుకుంటాడు బూర్జువాకవి. ఈ రెండు లక్షణాలూ గురజాడ బూర్జువాచైతన్యాన్ని నిరూపిస్తాయి.

(5) పారలౌకికప్రయోజనం (బ్రహ్మానందసహోదరమైన ఆనందం) అర్థించడం ఫ్యూడల్ కవి కవితాలక్ష్యం. సంఘసంస్కరణప్రయోజనం(భౌతికమైన చైతన్యం), అనుభూతి–ఈ రెండింటినీ కోరడం బూర్జువాకవి కవితాలక్ష్యం. ఇందులో మొదటిప్రయోజనాన్ని కోరడం గురజాడ బూర్జువాచైతన్యానికి నిదర్శనం.

కృష్ణశాస్త్రి కంఠోక్తిగా చెప్పుకోకపోయినా ఆయనకూడా కొత్తపాతల మేలుకలయికనే కోరారు. అయితే కృష్ణశాస్త్రి బూర్జువావ్యవస్థలోని కొత్తదనాన్ని 'రొమాంటిసిజం'నుంచి తీసుకున్నారు. ఆయన కవిత్వంలోని బూర్జువాచైతన్యలక్షణాలివి:–

(1) భూస్వాములకు, జమీందారులకు మాత్రమే గౌరవమర్యాదలు లభించడం ఫ్యూడల్ వ్యవస్థ లక్షణం. వ్యక్తికి ప్రాధాన్యం లభించడం బూర్జువావ్యవస్థ లక్షణం. సమాజంలోనే కాదు; సాహిత్యంలోకూడా వ్యక్తిఅనుభవాలకే ప్రాధాన్యంఇవ్వాలనేది కృష్ణశాస్త్రిఆశయం. వ్యక్తికి తనఅభ్యుదయమే అన్నింటికన్నా ముఖ్యంకనుక – తనగొప్పతనమే తనకు లక్ష్యంకనుక - కృష్ణశాస్త్రి తనకవిత్వాన్ని ఆత్మాశ్రయంగా కాల్పనికంగా రాశారు. ఆయనదృష్టిలోని 'వ్యక్తి' మధ్యతరగతికిచెందినభావుకుడు మాత్రమే! ఫ్యూడల్‌వ్యవస్థలో ఈ వ్యక్తి అణగద్రొక్కబడ్డాడు. బూర్జువావ్యవస్థ ఇతనికి స్వేచ్ఛనిచ్చింది. ఇంగ్లాండులో బూర్జువావ్యవస్థనుంచి రొమాంటిక్‌కవులు ఉద్భవించారు. ఆకవుల్లో బైరన్‌కు దుఃఖమే మధురం; కీట్సుకు సౌందర్యమే ప్రాణం; షెల్లీకి స్వేచ్ఛయే జీవితం; వర్డ్సువర్తుకు ప్రకృతియే దేవత! వీరంతా హృదయవాదులు. వీరే కృష్ణశాస్త్రికి మార్గదర్శకులు!

(2) బూర్జువావ్యవస్థ సమాజంలో ఆర్థికసాంస్కృతికతారతమ్యాలను ఎక్కువచేస్తుంది. మధ్యతరగతివ్యక్తులు వంశపారంపర్యంగా వస్తున్న ఆర్థికపుష్టివల్ల, విద్యార్జనవల్ల సమాజంలో

ఉన్నతస్థితి నూహించుకుంటారు. అట్టినుగున దారిద్ర్యంలో ఉన్న వారిని చూసి పెరుపెవగించుకుంటారు. సమాజంలో ఉన్న జుగుప్సకన్నా వీరిని కల్పనలోని సౌందర్యం ఆకర్షిస్తుంది. కనుక సమాజంతో సంబంధంలేని ఒంటరితనం, సొంతఆస్తి, స్వతంత్రజీవనం, స్వేచ్ఛాప్రియత్వం, సౌందర్యలోలుపత, స్వప్నవీధివిహారం, ఆదర్శవాదం, ఈశ్వరశరణాగతి వంటివి వీరి లక్షణాలు. ఫ్యూడల్ వ్యవస్థనుంచి బూర్జువానాగరికతలోకి వీరు పరుగులిడతారు. ఒక్కొక్కప్పుడు వీరికి చుట్టూ ఉన్న సమాజంకన్నా ప్రకృతియే నయమనిపిస్తుంది. సమాజవాస్తవికతవల్ల అప్పుడప్పుడు కొంచెం నిరాశపొందుతారు. ఈ లక్షణాలన్నీ కృష్ణశాస్త్రి కవితాభావాలలో ప్రతిబింబిస్తాయి. ఇటువంటివి ఫ్యూడల్ కవుల భావాల్లో కనిపించవు.

(3) ఫ్యూడల్ వ్యవస్థ విధించిన ఆచారాలు, సంప్రదాయాలు, కట్టుబాట్లు, మతకర్మలు, కులవృత్తులు, చాదస్తాలు వంటివి సమాజాన్ని ముందుకు సాగనీయవు. ఆ వ్యవస్థ యథాస్థితి వాదానికి ప్రతీక. బూర్జువావ్యవస్థ వీటినన్నింటిని తిరస్కరించి, తిరుగుబాటుచేసి, స్వేచ్ఛ కోరుతుంది. ఈ స్వేచ్ఛ దాని పురోగమనశీలానికి ప్రతీక. కృష్ణశాస్త్రి బూర్జువా స్వేచ్ఛావాది! ఆయన 'స్వేచ్ఛాగానము'లోని స్వేచ్ఛాభిలాష విశ్వవిశాలమైనది. ఫ్యూడల్ వ్యవస్థలోని ఏకవిఅయినా అలాపాడుకోగల్గాడా? అలా పాడుకుంటే ఫ్యూడల్ వ్యవస్థలో 'సంఘద్రోహి'గా పరిగణింపబడడా? సమాజంలో అందరికీ స్వేచ్ఛలభించడం బూర్జువాఆర్థికవ్యవస్థలో అసాధ్యమే కావచ్చు, కానీ ఇది మనిషికి ఆలోచనాస్వేచ్ఛ నిచ్చింది. ఊహాస్వేచ్ఛ నిచ్చింది.

(4) స్త్రీపురుషలైంగికసంబంధాలను పచ్చిగా వర్ణించి భూస్వాముల భోగలాలసను రెచ్చగొట్టడం ఫ్యూడల్ కవిత్వలక్షణం. స్త్రీకి ప్రత్యేకవ్యక్తిత్వాన్ని అందజేయడం బూర్జువా వ్యవస్థలో ఆరంభమయింది. ఇది కృష్ణశాస్త్రి కవిత్వంలోని బూర్జువాచైతన్యాల్లో ఒకటి.

(5) కవితాసంవిధానంలో కృష్ణశాస్త్రి సంస్కరణవాదియే! ఫ్యూడల్ కవిత్వంలోని వ్యర్థపదాలు, దీర్ఘసమాసాలు, అలంకారభారం, ఛందోవైచిత్రి వంటివాటిని తొలగించి, కృష్ణశాస్త్రి బూర్జువానాగరికవ్యక్తి అభిరుచిని సంతృప్తిపరచే రంగు, రుచి, వాసనగలపదాలను, పదచిత్రాలను, మధురపదబంధాలను, ఛందస్సంగీతాన్నీ తెలుగుసంస్కృతాల సమతూకాన్నీ అవలంబించారు. భావకవిత్వాని కొకశైలిని సమకూర్చారు. ఈ శైలి బూర్జువావ్యక్తిశైలియే కానీ ఫ్యూడల్ పరిపాలకవ్యక్తిశైలి కాదు! కృష్ణశాస్త్రిశైలిని కూడా ఫ్యూడల్ పండితులు మెచ్చుకోలేకపోయారు. కానీ శాస్త్రిగారు బూర్జువావ్యవస్థఆశించే సౌలభ్యాన్ని భాషలో తేలేక పోయారు. అందుకుకారణం వారు వ్యక్తికోసమే కవిత్వం అనుకోవడమే! లేకపోతే, వ్యావహారిక భాషలోనే భావకవిత్వం వెలువడిఉండేది.

(6) కవిత్వానికి కథనాధారంగా గ్రహించి వర్ణనలతో దాన్ని నడిపించడం ఫ్యూడల్ కవుల లక్షణం. కథనూ వర్ణనలనూ విడిచి శుద్ధకవిత్వాన్ని సృష్టించడం బూర్జువాకవి లక్షణం. ఇతడికి అనుభూతియే కళాప్రయోజనం. కళ కళకోసం - కళ తనకోసం అనేవి బూర్జువాఆశయాలు. ఈ బూర్జువాచైతన్యం కృష్ణశాస్త్రికవిత్వంలో ఉంది.

శ్రీశ్రీ బూర్జువారాజకీయవ్యవస్థను తిరస్కరించాడు. బూర్జువావ్యవస్థలో మంచి, చెడు రెండింటినీ చూశాడు. మంచినంతటినీ సమాజం, సాహిత్యంకూడా స్వీకరించవలసిందే. చెడును సమాజం, సాహిత్యంకూడా వదిలివేయవలసిందే! అందుకే శ్రీశ్రీని సామ్యవాదవ్యవస్థ ఆకర్షించింది. శ్రీశ్రీకవిత్వంలోని సామ్యవాదచైతన్యలక్షణం ఇది:- బూర్జువావ్యవస్థలో ఆర్థికతారతమ్యాలే అన్నిరంగాలలోని సామాజికతారతమ్యాలకు మూలం. ఈ వ్యవస్థలోని అల్పసంఖ్యాకులైన బూర్జువాలు అత్యధికసంఖ్యాకులైన కార్మికకర్షకమధ్యతరగతివర్గాలను ఇబ్బందులపాలుచేస్తారు. బూర్జువావర్గంమీద కార్మికవర్గం తిరుగుబాటుచేస్తే వర్గరహితసమాజం ఏర్పడుతుంది. అంతవరకూ వ్యక్తికిగాని సమాజానికిగాని వాస్తవికంగా సుఖశాంతులుండవు. ఈ కీలకాన్ని తెలుసుకుని కార్మిక వర్గాన్ని విప్లవచైతన్యపూరితంగా చేయడానికే శ్రీశ్రీ తనకవిత్వాన్ని అంకితంచేశాడు.

సామ్యవాదచైతన్యంతో శ్రీశ్రీసాధించిన సాహిత్యపురోగమనం బూర్జువాచైతన్యంతో గురజాడ, కృష్ణశాస్త్రి సాధించిన సాహిత్యపురోగమనంకన్నా విస్తారమయినది. కవితావస్తువు, కవితాదృక్పథం, కవితాపాఠకవర్గం, కవితాప్రయోజనం, కవితాసంవిధానం (భాష, ఛందస్సు, ప్రక్రియ) అనే ఈ ఐదు విభాగాల్లోనూ శ్రీశ్రీ కొత్తదారులు తొక్కడం జరిగింది. కవిగా శ్రీశ్రీ గురజాడకన్నా కృష్ణశాస్త్రికన్నా ఎక్కువ సాహసంగలవాడు. ఈ సాహసాన్ని 6 విషయాల్లో నిరూపించవచ్చు.

(1) ఫ్యూడల్ పాలకవర్గాన్ని తిరస్కరించడంలో గురజాడ, కృష్ణశాస్త్రి ఎంత స్వాతంత్ర్యం అవలంబించారో అంతకన్నా అత్యధికస్వాతంత్ర్యం బూర్జువాపాలకవర్గాన్ని తిరస్కరించడంలో చూపించాడు శ్రీశ్రీ.

(2) సమాజమంతటికోసం కవిత్వం రాసినగురజాడవలెగాక ఒకవర్గంపట్ల పక్షపాతంతో కవిత్వంరాశాడు శ్రీశ్రీ. వ్యక్తిఆహ్లాదంకోసం కవిత్వంరాసిన కృష్ణశాస్త్రివలెగాక ఒకవర్గపు చైతన్యంకోసం కవిత్వం రాశాడు శ్రీశ్రీ.

(3) శిల్పానికి కన్నా వస్తువుకి ప్రాధాన్యంఇచ్చాడు గురజాడ. వస్తువుకికాక శిల్పానికే పట్టంకట్టాడు కృష్ణశాస్త్రి. వస్తువుకీ శిల్పానికీ దృక్పథానికీ సమప్రాధాన్యం ఇచ్చాడు శ్రీశ్రీ.

(4) గురజాడ సమాజాన్ని సంస్కరించడానికి కవిత్వం పనికిరావాలనుకున్నాడు. కృష్ణశాస్త్రి వ్యక్తిని సంస్కరించడానికి కవిత్వం అవసరంఅనుకున్నాడు. శ్రీశ్రీ పీడకవర్గ సమాజంమీద తిరుగుబాటు చేయడానికి కవిత్వంపనికిరావాలన్నాడు.

(5) భాష, ఛందస్సు, ప్రక్రియలలో గురజాడ ప్రజాభిరుచినీ ప్రజావగాహననూ గుర్తించాడు. ఈ మూడింటిలో కృష్ణశాస్త్రి వ్యక్తి అభిరుచినీ వ్యక్తి అవగాహననూ గుర్తించాడు. శ్రీశ్రీ బూర్జువావ్యవస్థలో పీడితపీడకవర్గాలకందుబాటులోకి వచ్చే సజీవవ్యావహారికభాషనీ బాగాసాగే ఛందస్సులనూ బూర్జువాసాహిత్యప్రక్రియలనూ అవలంబించాడు.

(6) మతాన్నికాదని హేతువాదాన్నీ భౌతికవాదాన్నీ అవలంబించాడు గురజాడ. ఫ్యూడల్ సంప్రదాయాన్ని వదలి కాల్పనికతనూ మానవతావాదాన్నీ శిరసావహించాడు కృష్ణశాస్త్రి. ఆదర్శవాదాన్నీ కాల్పనికతనూ తిరస్కరించి, వాస్తవికతనూ గతితార్కికభౌతిక వాదాన్నీ అవలంబించాడు శ్రీశ్రీ.

ఈ 6 విషయాలనుబట్టి తేలేదేమంటే గురజాడ కళాకారుడైన సమాజసంస్కర్త. కృష్ణశాస్త్రి కేవలం కళాకారుడే! శ్రీశ్రీ సమాజవిప్లవకారుడైన కళాకారుడు. కాలానుక్రమంలో గురజాడకన్నా కృష్ణశాస్త్రి నవ్యుడేఅయినా, శ్రీశ్రీ కృష్ణశాస్త్రిని ముందూ, గురజాడను తరువాత అనుసరించాడు. ఈ అనుసరణ శ్రీశ్రీకి ఎలాఉపకరించింది? శుద్ధకవిత్వాన్ని ముందు ఆకళించుకుని, వ్యవహారకవిత్వంలోకి ప్రవేశించగల్గడానికే ఉపకరించింది.

కృష్ణశాస్త్రి → శ్రీశ్రీ (1926-32) → గురజాడ → శ్రీశ్రీ (1933- )

## శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వలక్షణాలు

గతితార్కికభౌతికవాదం పునాదిగాగల కవిత్వం నిర్దిష్టలక్షణాలకు కట్టుబడిఉండదు. సామాజికావసరాలనుబట్టి ఆ కవిత్వం మారిపోతుంది. ముందుగానిర్ణయింపబడినలక్షణాలు దానిఅభివృద్ధికి నిరోధకాలు. బూర్జువావ్యవస్థలో కవిత్వంపాత్ర సామ్యవాదవిప్లవసాధన. సామ్యవాదవ్యవస్థలో కవిత్వం పాత్ర వేరు. అందువల్ల కవిత్వవస్తువుకి గతితార్కికభౌతికవాదిదృష్టిలో సార్వకాలికత లేదు. ఒకవర్గంకోసంరాయబడేదికనుక సార్వజనీనతకూడా వస్తువుకుండదు. ఈరెండుగుణాలూ సామ్యవాదవ్యవస్థలోనే కవిత్వానికి (వస్తుసంవిధానాలకు) లభిస్తాయి. భిన్నవ్యవస్థలలో కవిత్వం సాధించే శిల్పం మాత్రమే నిలుస్తుంది. అందువల్లనే శిల్పంమీద శ్రీశ్రీకి మోజు.

బూర్జువావ్యవస్థలో ఆరంభమైన విప్లవకవిత్వం శ్రీశ్రీది. దీన్నిగురించి శ్రీశ్రీ ప్రచారం చేసుకోవడం విప్లవంలోని భాగమే. ఇది ఆత్మోత్కర్ష కాదు.

కళ వ్యక్తికోసం అన్నా కళ కళకోసం అన్నా రెండు నినాదాలూ బొమ్మాబొరుసూ వంటివే. కళ సమాజసంస్కరణకోసం కావడం గురజాడతోనే మొదలైనా కళ సమసమాజ విప్లవంకోసం కావడం శ్రీశ్రీతోనే మొదలయింది. ఈ సమసమాజవిప్లవం కార్మికులవల్లనే వస్తుంది కనుక శ్రీశ్రీ "నాలోకదిలే నవ్యకవిత్వం కార్మికలోకపుకల్యాణానికి" అని చెప్పుకోవలసివచ్చింది.

సమసమాజవిప్లవంకోసం రాసేకవిత్వాన్నే శ్రీశ్రీ ప్రత్యేకించి వ్యవహారకవిత్వం (Applied Poetry) అని పిల్చుకున్నాడు.

ప్రతిజ్ఞలో శ్రీశ్రీ తనకవిత్వాన్ని 'నవ్యకవిత్వం' అనిమాత్రమే అన్నాడు. అప్పటికే తెలుగు దేశంలో నవ్యసాహిత్యపరిషత్తు ఉంది. ఆ నవ్యసాహిత్యం బూర్జువావ్యవస్థను బలపరిచేదే! (వ్యక్తిస్వేచ్ఛకు పట్టంకట్టిన) భావకవిత్వాన్ని భుజానవేసుకున్న నవ్యసాహిత్యపరిషత్తుకు భావకవిత్వమే నవ్యకవిత్వం. కానీ శ్రీశ్రీగారి నవ్యకవిత్వం బూర్జువావ్యవస్థకు ప్రతికూలమైనది. ఇదే అభ్యుదయకవిత్వం! దీని లక్షణాలను ప్రతిజ్ఞలో శ్రీశ్రీ చెప్పాడు. అవి:—

(1) లోకపు టన్యాయాలనూ కాల్చేఆకలినీ కూల్చే వేదననూ దారిద్ర్యాలనూ దౌర్జన్యాలనూ పరిష్కరించే బాటలు తీస్తూ బహిష్కరించే పాటలు వ్రాయడంద్వారా శ్రామికవర్గంవారి విప్లవాన్ని బలపరచడం అభ్యుదయకవిత్వం. "In literature Marxist writers turned to an interest in the lower classes and to propaganda aimed to eliminate their misery and to 'improve society' along Marxist lines."[2] ఈ లక్షణాన్ని ప్రతిబింబించేవే శ్రీశ్రీ రచించిన వాడు, వ్యత్యాసం, ప్రతిజ్ఞ, మహాప్రస్థానం, జగన్నాథుని రథచక్రాలు వంటివి.

(2) కార్మికలోకపుకల్యాణానికీ శ్రామికలోకపు సౌభాగ్యానికీ సమర్పణంగా సమర్చనంగా రచనలు చేయడం అభ్యుదయకవిత్వం. "సాహిత్యం కార్మికవర్గ సమష్టిహితంలో భాగంకావాలి. యావత్తుకార్మికవర్గంయొక్క రాజకీయచైతన్యపూరితమైన యావత్తు అగ్రిదళంచేత నడిపించబడే ఏకైక సోషల్ డెమోక్రాటిక్ మహాయంత్రాంగంలో ఒకచక్రమూ ఒకమరా కావాలి!"[3] అన్న లెనిన్ ఆశయానికిది సన్నిహితంగా ఉంది. ఈ ఆశయం సామ్యవాదసామాజికవ్యవస్థలోకానీ సాఫల్యం పొందదేమో! అంతవరకూ కార్మికలోకపు బాధలను, గాథలనుమాత్రమే కవి రాయగలడు. శ్రీశ్రీ వాటినే వ్యక్తంచేశాడు! పీడకవ్యవస్థను ఎదిరించడంలోనే కార్మికకల్యాణం అంతర్భూతంగా ఉంది. కార్మికవర్గానికి ఉజ్జ్వలభవిష్యత్తుఉందనేఆశావాదం శ్రీశ్రీలో కన్పిస్తుంది.

(3) శ్రమైకజీవనసౌందర్యానికి సమానమైనసౌందర్యం త్రిలోకాలలో త్రికాలాలలో లేనే లేదని చాటడం అభ్యుదయకవిత్వం.

శ్రమ సమస్తసంపదలకూ మూలమనీ మానవుడిమనుగడకూ అస్తిత్వానికీ శ్రమయే ఆధారమనీ శ్రమయే మానవుణ్ని రూపొందించిందనీ చెప్పిన ఎంగిల్సుమాటల కిది ప్రోద్బలకంగా ఉంది.[4] రాజుల, భూస్వాముల, బూర్జువాల భోగైకజీవితాన్ని సాహిత్యంలో చిత్రించడంమీద ఇది తిరుగుబాటే.

---

2 The Reader's Companion to World Literature 323 P.
3 లెనిన్. సాహిత్యంమీద వ్యాసాలు 8 పే.
4 The Part played by Labour ...

ధనమే అందంగా కనిపించే బూర్జువావ్యవస్థనుంచి శ్రమయేసుందరంగాకనిపించే సామ్యవాద వ్యవస్థకు మారడమే సామాజికవిప్లవపరిణామం. ఈ పరిణామం సాహిత్యంలో ముందే రావాలంటాడు శ్రీశ్రీ. శ్రమయొక్క విలువను డబ్బువిలువగా గ్రహిస్తుంది బూర్జువావ్యవస్థ. ఘర్మజలానికి ఖరీదుమాత్రమే కడుతుంటది. శ్రామికుడ్ని గౌరవించదు! శ్రామికుడ్ని అధముడిగా చూస్తుంది. ఒకవస్తువు అందంగా ఉండటానికీ, గౌరవింపబడటానికీ అదిసంపదతో కలిసిఉండటమే బూర్జువావ్యవస్థలో కారణం. "Everything precious seems beautiful because it is associated with the idea of wealth"[5] బూర్జువాలు ఖరీదుకట్టే వస్తువులన్నీ కార్మికులశ్రమవల్లనే తయారైనా ఆవిషయాన్ని కప్పిపుచ్చుతూ యంత్రాలేవాటినితయారుచేశాయంటారు. ఈబూర్జువావ్యవస్థఅంతరిస్తే శ్రమవిలువగుర్తించబడుతుంది. కార్మికాధిపత్యంలో శ్రమసౌందర్యం గుర్తించబడుతుంది. శ్రమసౌందర్యంగుర్తించడమే శ్రామికుడికిగౌరవం. శ్రమయే సంస్కృతికి, విజ్ఞానానికి కూడా మూలకారణం. "We must realize that it is the masses' labour that is the chief organizer of culture and creator of all ideas, those that have for ages detracted from the decisive significance of labour – that source of all knowledge"[6] అన్న గోర్కీ ఆశయాలను శ్రీశ్రీ ప్రతిబింబించాడు. 'దేశచరిత్రలు' ఖండికలో శ్రీశ్రీ చూపించిన శ్రామికపక్షపాతం ఈసూత్రానికి నిదర్శనం. తాజమహాల్ ఎవరుకట్టారు? రాజుకుపల్లకీ ఎవరుమోశారు? నాగరికతను ఎవరుకాపాడించారు? వంటిప్రశ్నలు వేయడంలో శ్రమైకజీవనసౌందర్యాన్ని గుర్తించాడు శ్రీశ్రీ.

(4) కష్టజీవులకూ కర్మవీరులకూ నిత్యమంగళంనిర్దేశిస్తూ స్వస్తివాక్యములుసంధానిస్తూ స్వర్ణ వాద్యములుసంధానిస్తూ రచనలుసాగించడంఅభ్యుదయకవిత్వం! శ్రీశ్రీ కష్టజీవి భూతవర్తమాన భవిష్యత్తులను గానంచేయడం జయభేరి, దేశచరిత్రలు, ప్రతిజ్ఞ, జగన్నాథునిరథచక్రాలు, వ్యత్యాసం వంటి ఖండికల్లో చూడగలం.

(5) వ్యథార్తజీవితయథార్థదృశ్యంపునాదిగా ఇకజనించబోయేభావివేదములజీవనాదములు వినిపించడం అభ్యుదయకవిత్వం.

ఈ సూత్రంతో మార్క్సిస్టుకవిత్వానికి ప్రాణమైన 'వాస్తవికత'ను స్ఫురింపజేశాడు శ్రీశ్రీ. బూర్జువాకవిత్వంలో ఒకభాగం కాల్పనికతారంజితంఅయిఉంటుంది. వ్యథార్తజీవితంనుంచి పలాయనం చిత్తగించి రంగురంగులకలలను చూస్తాడు బూర్జువాకవి. వ్యక్తివాదిఅవుతాడు. సమాజానికిబాహ్యంగాఉన్న పూలు, కోకిల, వెన్నెల, సరోవరం, రాత్రి, చుక్కలు, మెరుపులు, హరివిల్లు వంటి అచేతనాలు బూర్జువాకవికికనిపిస్తే సమాజమధ్యంలోఉన్న రోగి, భిక్షువు, కూలీ, వెర్రివాడు, సంసారి, విద్యార్థి, ఉద్యోగి, బాటసారి, పడుపుకత్తె, శిశువులు, యువకులు,ఫ్యాక్టరీలు,

5 ABC of Dialectical and Historical Materialism,

6 GORKY : On Literature 253 P.

గుడిసెలు వంటిచేతనాలు పీడితవర్గకవికి కనిపిస్తాయి. ఈ వ్యథాకలితజీవితదృశ్యాల వాస్తవికతను కవిత్వంలోప్రదర్శించి కర్తవ్యాన్నిస్ఫురింపజేసి విప్లవానికిపురికొల్పడమే పీడితవర్గకవిలక్ష్యం. సమాజంలోనిదోపిడియే వ్యథలకుకారణమనీ ఈదోపిడినిఅంతంచేయడానికికవిత్వం ఒకఆయుధమనీ అభ్యుదయకవి నమ్ముతాడు; రుజువుచేస్తాడు. విప్లవశంఖంపూరిస్తారోయ్‌అనీ పదండిముందుకుఅనీ రథచక్రాలొస్తున్నాయ్‌అనీ సామ్యవాదవిప్లవప్రచారాన్ని (వాస్తవికతను జోడించి) శ్రీశ్రీ సాగించాడు.

తమచుట్టూఉన్నదుర్భరవాస్తవాలనుచూడలేక కవిత్వపుకలలలోకి పారిపోతారు బూర్జువా కవులు. తానుంటున్న విషమసమాజంకన్నా గొప్పసమాజాన్ని కలగంటూ దాన్నివాస్తవికంగా రూపొందించడానికి కార్మికులను సిద్ధపరుస్తాడు శ్రీశ్రీ ! అందుకే అతడుభావివేదముల జీవనాదాలను వినిపించగలడు. ఆ భావివేదాలు సామ్యవాదనాదాలే. శ్రీశ్రీకూడా స్వాప్నికుడే కానీ అతని స్వప్నాలు మరోప్రపంచం అనబడే సామ్యవాదప్రపంచం గురించిమాత్రమే. అవి అబద్ధాలుకావు. శ్రీశ్రీ స్వప్నాలకు వాస్తవం పునాది. బూర్జువాకవి స్వప్నాలకు అవాస్తవం (illusion) పునాది. శ్రీశ్రీ 'శుద్ధవాస్తవికతను కళ'గా అంగీకరించడు. వాస్తవికతను ఆకర్షకంగాతీర్చిదిద్దేసంవిధానాన్ని ప్రయోగిస్తాడు. ఈ ఆకర్షణ పారవశ్యంలోముంచి, నిద్రపుచ్చదు. పాఠకుణ్ణి కదిలించి, ఆలోచింపజేస్తుంది- వాస్తవికతను మరింత స్పష్టంగా చూపిస్తుంది. భిక్షువర్షీయసి, జాటసారి, వాడు, ఉన్మాది, ప్రతిజ్ఞ, కవితా ఓ కవితా వంటిఖండికల్లో చూపిన దృశ్యాలు వాస్తవికతకు కళాత్మక ప్రతిబింబాలే.

"Realism is no excuse for lack of talent: realism is not an apology for an absence of technique; realism is not grubbing; mediocre mole's running through the mud; realism is not the substitution of 'bagoo' of idiotic, thoughtless political chaptrap for all the rich and variegated beauty and colour of the people's language; realism is not the 'leftist' imprisonment of art in manacles, a substitution of dogma for taste, of doggeral for verse, of pattern for the full flight of creativeness, realism is not a substitution of addition for creativity, of substraction for insight, realism is not the enemy of love, warmth and sensitivity, but rather the handmaiden of these qualities."[7] అనే హొవర్డుఫాస్టు ఆశయాలు శ్రీశ్రీచెప్పిన వాస్తవికతయొక్క గుణాలకుప్రతిబింబాలుగా భాసిస్తాయి.

(6) శరీరకష్టం స్ఫురింపజేసే సహస్రవృత్తుల సమస్తచిహ్నాలనూ రీతికి గీతికీ భావంగా భాగ్యంగా ప్రాణంగా ప్రణవంగా స్వీకరించడం అభ్యుదయకవిత్వం.

ఫ్యూడల్‌వ్యవస్థలో శ్రమజీవులుపయోగించిన వస్తూత్పత్తిసాధనాలను తన నవీనగీతికీ నవీన రీతికీ భావంగాభాగ్యంగాప్రాణంగా ప్రణవంగా స్వీకరిస్తాననడంలో శ్రీశ్రీ హృదయం స్పష్టంగా

7 Literature and Reality : Howard Fast 35 P,

దర్శనం ఇయ్యేదు. కమ్మరికొలిమి, కుమ్మరిచక్రం, జాలరిపగ్గం, సాలెలమగ్గం, గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి మొదలైనవి ఫ్యూడల్‌వృత్తిచిహ్నాలు. ఇవన్నీ పారిశ్రామికవిప్లవంతరువాత పాతబడిపోయాయి. ఈ వృత్తులను నమ్ముకున్నవారంతా ఆధునికకార్మికులుగా మారకతప్పదు. ఆధునికయంత్రాలను ఆశ్రయించి, శ్రమను అమ్ముకోకతప్పదు. "గనిలోవనిలోకార్ఖానాలో పరిక్లమిస్తూ, పరిప్లవిస్తూ ధనికస్వామికి దాస్యంచేస్తూ యంత్రభూతముల కోరలు తోముతూ" ఏడ్వక తప్పదు. ఇలాంటివారే విప్లవానికి సైనికులవుతారు. యంత్రనాగరికతవల్లనే వీరికి తిరుగుబాటుభావాలు కలుగుతాయి. కనుక యంత్రాలను కాక ఫ్యూడల్‌వస్తూత్పత్తిసాధనాలను శ్రీశ్రీ తన కవితాప్రేరణలుగా స్వీకరించడం ఎలా సమర్థనీయం?

బూర్జువావ్యవస్థలో కూడా గ్రామాలలో ఇంకా ఈ వృత్తిపరికరాలను నమ్ముకున్నవారున్నారు. వారు తమశ్రమమీదనే బ్రతుకుతున్నారు. వారికి పెట్టుబడిదారీదోపిడి ప్రత్యక్షంగా తగలదుకానీ వారివృత్తులకు రాణింపుమాత్రం ఉండదు. పట్టణాలలోని ఆధునికకార్మికులు కూడా మొదట ఈ వృత్తులకు సంబంధించినవారే.

సహస్రవృత్తుల సమస్తచిహ్నాలు తన నవీనగీతికీ, నవీనరీతికీ ఉపాదేయాలని చెప్పడంలో అర్థంఏమిటి? వీటిని తన కవితావస్తువులని శ్రీశ్రీ చెప్పనూలేదు; తీసుకోనూలేదు. కాని ఈ వృత్తిచిహ్నాలు పీడితులను జ్ఞాపకంచేస్తాయి.

ఈ వృతులవారి పాటల్లోని ఛందస్సులూ, పదజాలమూ బూర్జువావర్గంవారి నాగరికసాహిత్యంలో కనిపించవు. కానీ మొదట వీరిశ్రమనుంచే ఆ రీతులూగీతులూ అభివృద్ధిపొందాయి. శ్రమప్రియుడైన శ్రీశ్రీ శ్రామికవర్గాన్ని కదిలించే తనకవిత్వంలో శ్రామికవర్గంవారి గీతులనూ రీతులనూఅనుకరించదలచాడు. ఇదివరకు కవులు పాలకవర్గంవారి అభిరుచులననుసరించి రీతులనూ గీతులనూ సృష్టించారు. అవిఉదాత్తమైనవి. కానీ ఇప్పటి సామాజికపరిస్థితులువేరు. ఈసమాజంలో కార్మికులకుండే హక్కులు దోచుకోబడుతున్నాయి. నిజానికి కార్మికులే ఈ సమాజానికి హక్కుదారులు. వారు సృష్టించిన సంపదలతోనే అందరూ బ్రతుకుతున్నారు. కనుక కవిత్వంకూడా వారికోసమే! ఈ కార్మికుల గీతులూ రీతులూ సహజసుందరమైనవి. పనులవేగంలోనుంచి అవి పుట్టుకొచ్చాయి. అందువల్ల అవి సజీవంగా ఉంటాయి. వాటినే శ్రీశ్రీ తనకవిత్వానికి రూపరేఖలుగా తీసుకోదలచాడు. పాలకవర్గంవారు కృతకంగా సృష్టించుకున్నవి గ్రాంథికరీతి, వృత్తగీతి. వాటిస్థానంలో వ్యావహారికభాష, గేయం (రీతి, గీతి) రావాలి. వాటిని శ్రీశ్రీ తెచ్చాడు. ఈరీతి, గీతులకు ప్రాతినిధ్యం వహిస్తాయి మహాప్రస్థానం గీతాలు.

రీతి, గీతుల విషయంలో శ్రీశ్రీ సమన్వయవాదియే. యాంత్రికసౌలభ్యంవల్ల వచ్చిన బూర్జువాకళల రీతులను కూడా కార్మికప్రయోజనాలకనుగుణంగా మల్చుకున్నాడు.

'జయభేరి' గీతం (1933) నుంచే అభ్యుదయకవిత్వం ఆరంభమైనా, ప్రతిజ్ఞ (1937) గీతమే అభ్యుదయకవితాయుగానికి ఆవాహనం చేసింది! అందుకు పైలక్షణనిర్దేశమే కారణం. శ్రీశ్రీ తన కవిత్వం అభ్యుదయకవిత్వంఅని మహాప్రస్థానంలో ఎక్కడా చెప్పకపోయినా మహాప్రస్థానగీతాలు రాయడం పూర్తి అయ్యేసరికి అభ్యుదయకవిత్వంఅనే రూఢి ఏర్పడింది. ఇందుకు ఆంధ్రదేశంలో అభ్యుదయరచయితలసంఘం (1943) ఏర్పడటమేకారణం. శ్రీశ్రీ తనకవిత్వాన్ని నవ్యకవిత్వంఅనిమాత్రమే ప్రతిజ్ఞ గేయంలో పేర్కొన్నాడుకదా! వ్యవహారకవిత్వం; ఉపయోగకవిత్వం; సామాజికకవిత్వం; ప్రజాకవిత్వంఅనేవి అభ్యుదయకవిత్వానికి నామాంతరాలుగా శ్రీశ్రీ తన వ్యాసాల్లో ఉపన్యాసాల్లో వాడినవే!

1936 నుంచి 1969 వరకూ శ్రీశ్రీ అభ్యుదయకవిత్వాన్నిగురించి వ్యాసాలు, ప్రసంగాలు ఉత్తరాలు, ఉపన్యాసాలు, ఇంటర్వ్యూలు మొదలైనవాటిద్వారా సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ వచ్చాడు. ఆసిద్ధాంతాలన్నీ భావకవిత్వంనుంచిఅభ్యుదయకవిత్వం ఎలాభేదిస్తున్నదో వివరించేవే! వాటిలో ప్రధానవ్యాసాలు 20.

| | సంవత్సరం | వ్యాసం | పునర్ముద్రణ. | | |
|---|---|---|---|---|---|
| (1) | 1937 | శ్రుతులు | శ్రీశ్రీసా. | 2 వచన. | 455 పే. |
| (2) | 1939 | నేటితెనుగుకవితలో కొత్తపోకడలు | " | " | 473 " |
| (3) | 1942 | జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారికి | " | " | 556 " |
| (4) | 1945 | సంఘం - సాహిత్యం | " | 3 " | 197 " |
| (5) | — | సద్యః స్ఫూర్తి | " | 2 " | 324 " |
| (6) | — | సౌలభ్యం | " | " | 326 " |
| (7) | — | పొంగరంగరంగరాలు | " | " | 333 " |
| (8) | — | యంత్రయుగం | " | " | 351 " |
| (9) | — | అభ్యుదయం | " | " | 360 " |
| (10) | 1946 | సాహిత్యం ఎందుకు? ఎవరికి? | " | 2 " | 203 " |
| (11) | — | సాహిత్యంలో విప్లవం | " | " | 198 " |
| (12) | 1947 | నా కవిత్వం - I | " | " | 499 " |
| (13) | | నా కవిత్వం - II | " | " | 509 " |
| (14) | 1949 | ఆంధ్రదేశంలో సాహిత్యసంఘాలు | " | " | 514 " |
| (15) | 1954 | ఆరంభం పెద్దఅవస్థ | " | 2 " | 525 " |
| (16) | 1955 | అధ్యక్షోపన్యాసం | " | 3 " | 217 " |
| (17) | 1964 | జనశక్తి ఇంటర్వ్యూ | " | " | 276 " |
| (18) | — | ఎందుకు వ్రాయాలి? | " | " | 257 " |
| (19) | 1965 | సాహిత్యరచన: ప్రక్రియలు | " | " | 261 " |
| (20) | 1969 | సృజన ఇంటర్వ్యూ | " | " | 285 " |

పై ఇరవై వ్యాసాల్లోను అభ్యుదయకవిత్వలక్షణాలు లభిస్తాయి. మహాప్రస్థాన గీతాలు అభ్యుదయకవిత్వానికి లక్ష్యాలు కాగా ఈ వ్యాసాలలోని విషయాలు లక్షణాలు. ఒక కవితోద్యమానికి లక్ష్యలక్షణాలను రెండింటినీ తానే ఇవ్వడం వల్ల శ్రీశ్రీ ప్రవక్త, ప్రయోక్త కూడా అయ్యాడు. ఒక కవితా ప్రస్థానానికే మార్గదర్శకుడయ్యాడు.

అభ్యుదయకవిత్వం గురించి బయలుదేరే సమస్యలన్నింటికీ సందేహాలన్నింటికీ గతితార్కికంగా శ్రీశ్రీ సమాధానాలు సూచించాడు. ఆ కవిత్వానికి వస్తువు, ప్రయోజనం, దృక్పథం, సంవిధానం శ్రీశ్రీ చేతనే నిర్దేశింపబడ్డాయి. ఈ వ్యాసాలలో సమాజవాస్తవికత, సామాజిక వ్యవస్థాపరిణామం, సామ్యవాదవిప్లవం, సమాజపురోగమనం, సామాజికప్రయోజనం, పీడితవర్గ పక్షపాతం, సమకాలిక సమస్యలు, చారిత్రకావగాహన, భవిష్యద్విశ్వాసం, హేతువాదం, గతితార్కిక భౌతికవాదం, అంతర్జాతీయత, రాజకీయపరిస్థితులు, వస్తుసంవిధానాల సమ్మేళనం, సాహిత్యప్రయోజనం, సాహిత్యవిప్లవం, బాషావిప్లవం, జానపదచ్ఛందస్సులు, వ్యావహారిక భాష, అవగాహనసౌలభ్యం, రసానందం, విశ్వశ్రేయస్సు, పండితపామరాభిరంజనం, అభ్యుదయదృక్పథం, వచనగీతం, వర్గసంఘర్షణ, బూర్జువావ్యవస్థ, రచయితలూ - రాజకీయపక్షాలూ వంటి అనేక విషయాలు ప్రస్తావనకు వచ్చాయి. వీటిని క్రోడీకరించుకుంటే అభ్యుదయసాహిత్యవిమర్శకు ఒక మార్గం గోచరిస్తుంది.

## శ్రీశ్రీ విప్లవనాయకత్వం

మానవజాతి అభ్యుదయంకన్నా కవిత్వానికి ఉత్తమప్రయోజనం ఉండనిమాట నిజమే కాని ఆ అభ్యుదయం ఈనాడు కార్మికవర్గాభ్యుదయం మీదనే ఆధారపడి ఉందని శ్రీశ్రీ అవగాహన. అందుకే కార్మికవర్గపు కల్యాణానికి కవిత్వం అంకితంచేశాడు శ్రీశ్రీ. బూర్జువావ్యవస్థమీద తిరుగుబాటు చేయగలశక్తి కార్మికవర్గానికే ఉంది. కనుక కార్మికవర్గానికే కవిత్వపాఠాలు అందాలి. విప్లవనాయకుడుగా కూడా శ్రీశ్రీ తనను తాను ఊహించుకున్నాడు. పదండిముందుకు (మహాప్రస్థానం) భూకంపం పుట్టిస్తాను (జగన్నాథునిరథచక్రాలు) విప్లవశంఖం వినిపిస్తాకోయ్ (ప్రతిజ్ఞ) మొదలైన వాటిలో శ్రీశ్రీయే ఉద్యమనాయకుడు. తిరుగుబాటును తొందరపెట్టడమే శ్రీశ్రీ కవితాలక్ష్యం. అభ్యుదయకవిత్వం కార్మికోద్యమంలో ఒక భాగం మాత్రమే కాదు; అభ్యుదయ కవిత్వమే ఒక ఉద్యమంగా మారింది. తెలుగుదేశంలోని అభ్యుదయరచయితల ఉద్యమానికి శ్రీశ్రీయే పరోక్షనాయకుడయ్యాడు.

శ్రీశ్రీ కవిత్వం ఉద్యమంగా మారింది. ఆయన సంవిధానం - ముఖ్యంగా వ్యావహారిక భాష, మాత్రాచ్ఛందస్సులు, లయ - ప్రజలకు వీలయినంతదగ్గరగా వెళ్ళాయి. జానపదరీతులనూ

ప్రజాభాషనూ వాడుకుంటూ సాంస్కృతికరీతులనూ పండితభాషనూ కూడా వాటికి మేళవించి ప్రొలిటేరియట్ అభిరుచుల్నీ బూర్జువా అభిరుచుల్నీ కలగలిపి ముందుగా మధ్యతరగతివారికి తన కవిత్వాన్ని అందజేశాడు. అంతకన్నా కింది వర్గంవారికి చేరడానికి శ్రీశ్రీ ఉదాత్తశైలి అంతరాయం కల్పించింది. అయితే ఇందులో ఒక మెలకువ ఉంది. శ్రామికవర్గం మధ్యతరగతివర్గం వారి ఆలోచనలనే అనుసరిస్తూఉంటుంది. మధ్యతరగతి వర్గంలోనే మేధావులుంటారు. కనుక వారి సంచలనం కార్మికవర్గాన్ని సంఘటితం చేయగలదు.

కవిత్వ పరిణామక్రమంలో 1940 ల నాటికి శ్రీశ్రీ సాధించినది అపూర్వ విజయమే! విప్లవ యాథార్థ్యాలను బూర్జువావర్గం వారికి కూడా తెలపడం అవసరం కనుకనే శ్రీశ్రీ ఉదాత్తత సప్రయోజనమయింది.

## శ్రీశ్రీ కవిత్వంలో దోపిడివాస్తవికత

ఫ్యూడల్‌వ్యవస్థలోని పీడితులు_కర్షకులు. బూర్జువావ్యవస్థలోని పీడితులు - కర్షకులూ కార్మికులూ కూడా. వీరంతాకలిసి ఒకేవర్గం. ఈ వర్గమే బూర్జువావర్గపు దోపిడికి గురిఅవుతున్నది. ఈ దోపిడివాస్తవాలను శ్రీశ్రీ ప్రతిజ్ఞగీతంలో రెండురకాలుగా వ్యక్తంచేశాడు.

(1) ఏకర్షకవీరులు (కూలీలు) పొలాలుదున్ని హేమంపిండుతూ జగానికి సౌఖ్యం కలిగిస్తారో వారిశ్రమశక్తికి సంపూర్ణమైన విలువ(ఖరీదు)ను చెల్లించక భూస్వామి కొంతవిలువనే ఇచ్చి తక్కినదంతా తాను దోచుకుని సుఖపడతాడు. ఇతని ఐశ్వర్యానికి మూలం కర్షకుడి చెమటే. కర్షకుడి శ్రమశక్తికూడా పెట్టుబడిదారుడైన భూస్వామికి ఒక సరుకే (కమోడిటీ). పెట్టుబడిదారు అన్నింటినీ వ్యాపారదృష్టితోనే చూస్తాడు. కూలీలు అతనికి శ్రమను అమ్ముకుంటున్నారు. అతడు ఖరీదు చెల్లిస్తున్నాడు. కూలీ అమ్ముకున్న శ్రమశక్తిలో కొంతభాగానికే ఖరీదు చెల్లించి తక్కిన విలువను యజమాని కాజేస్తున్నాడన్నమాట. ఈ విలువనే అదనపువిలువ (Surplus Value) అంటారు. లాభాలకు మూలమిదే.

(2) గనిలో వనిలో కార్ఖానాలో పరిక్లమిస్తూ పరిప్లవిస్తూ ధనికస్వామికి దాస్యంచేస్తూ యంత్రభూతముల కోరలు తోముతూ నరాల బిగువుతో కరాలసత్తువతో వరాలవర్షం కురిపిస్తూ ప్రపంచభాగ్యాన్ని వర్ధిల్లజేసే కార్మికవీరుడికి కూడా శ్రమకుతగినవిలువ ముట్టడంలేదు. అదనపు విలువను బూర్జువా తీసుకుని కోటీశ్వరుడవుతాడు. కార్మికుడికి మిగులుతున్నవి విలాపాగ్నులూ విషాదాశ్రులూను! వీటికి విలువలేకుండా పోయింది. ఇది కార్మికజీవిత కఠోరవాస్తవికత.

కార్మికులు యంత్రభూతముల కోరలు తోముతారట! భయంకరమైన యంత్రాలను శుభ్రపరిచి, అవి చక్కగా పనిచేసేటట్లు చూసుకోకపోతే వారికి పని ఉండదు. ఆ పనిలో

వారప్పుడప్పుడూ లోహరాక్షసుల పదఘట్టనచే కొనప్రాణంతో కుములుతూ ఉంటారు. వారుచేసే పని ధనికస్వామికి దాస్యమేనట! కార్మికులకు ధనికస్వామియిచ్చే భాగ్యం కేవలం దాస్యమే! ఈ దాస్యంవల్లనే వారికళ్ళనిండా విలాపాగ్నులూ విషాదాశ్రులూ కనిపిస్తాయి. ఈ కార్మికులే కష్టంచాలక కడుపుమంటచే తెగించి సమ్మెలు కడతారట! సమ్మెకట్టిన కార్మికుల భార్యలూ బిడ్డలూ ఆకటిచీకటి చిచ్చులతో హాహాకారంచేస్తారట! పొద్దుపొడిచిపొద్దుగడిచేదాకా ఎద్దుల్లాగు పనిచేస్తారట కార్మికులు. కానీ ముద్దకు కూడా దూరమవుతారట! పనిముట్లు భరించలేక క్రిందను పడేస్తారట. పెట్టుబడిదారుడి దౌర్జన్యానికి గురిఅవుతారట!

## శ్రీశ్రీ కవిత్వంలో కావ్యనాయకులు

కర్షకులూ కార్మికులూ శ్రీశ్రీకవిత్వానికి నాయకులు. ఫ్యూడల్ వ్యవస్థలో కావ్యనాయకుడు సమస్తవిశిష్టలక్షణాలూ కలిగి ఉండేవాడు. ఆ విశిష్టలక్షణాలను శ్రీశ్రీ పీడితవర్గనాయకుడిలో చూశాడు. అందుకే 'కర్షకవీరులు, కార్మికధీరులు' అన్నాడు. వీరలక్షణం కర్షకుడిలో ఉందని సూచించాడు. కర్షకవీరుడు పొలాలనన్నీ హలాలదున్నీ ఇలాతలంలో హేమంపిండగ జగానికంతా సౌఖ్యం నిండగ విరామమెరుగక పరిశ్రమిస్తాడు. కర్షకుడి శ్రమకు ఈ భావచిత్రం ఉదాత్తీకరణం చేసింది. కార్మికుడిలో ధీరలక్షణం (ధీరోదాత్త) శ్రీశ్రీకి కనిపించింది. నరాలబిగువు, కరాలసత్తువ గలవాడు కార్మికుడు. వరాలవర్షం కురిపిస్తాడు తన దిగ్విజయంచేత ధీరాదాత్తుడిలాగే. ప్రపంచభాగ్యాన్ని వర్ధిల్లచేస్తాడు.

కర్షకకార్మికులను ఉదాత్తంగా చూపిస్తూనే దోపిడిదారులను నీచంగా చిత్రిస్తాడు శ్రీశ్రీ. ధనికస్వామి కార్మికుడ్ని బానిసగా చూస్తాడు. యంత్రభూతాల కోరలు తోమమంటాడు. విలాపాగ్నులకూ విషాదాశ్రులకూ ఖరీదు కట్టిస్తాడు. ఘర్మజలానికి ఖరీదు కట్టిస్తాడు. ఖరీదులు కట్టడం అతడి వర్గలక్షణం. విలాపాలకూ విషాదాలకూ ఖరీదులు కట్టడం షరాబుల వశంకాదని పరిహసించాడు శ్రీశ్రీ.

దోపిడిదారులకు కళ్ళున్నాచూడరు. పీడితుడ్ని చూసీ చూడనట్లే తొలగిపోయే పెద్ద మనుషులు వారు.

దోపిడిదారులను మోసగాళ్ళుగా దౌర్జన్యపరులుగా, స్వార్థపరులుగా, కుటిలురుగా, ఈర్ష్యాపరులుగా చిత్రించడానికి శ్రీశ్రీ సందేహించడు.

## బూర్జువావ్యవస్థకు శ్రీశ్రీ హెచ్చరిక

ప్రతిజ్ఞ ఖండికలో శ్రీశ్రీ తాను కార్మికుల కల్యాణానికి కవిత్వంరాస్తానని చెప్పడానికిముందు కర్షకకార్మికవర్గానికి జరుగుతున్న అన్యాయాన్ని చెప్పి వారంతా తమను పీడిస్తున్న వారిమీద తిరుగుబాటు చేసితీరతారని ప్రకటించాడు. ఈ ప్రకటన చూడండి -

నిరపరాధులై దురదృష్టంచే/చెరసాలలలో చిక్కేవాళ్ళూ -
లోహరాక్షసులపదఘట్టనచే/కొనప్రాణంతో కనలేవాళ్ళూ -
కష్టంచాలక కడుపుమంటచే/తెగించి సమ్మెలు కట్టేవాళ్ళూ -
శ్రమనిష్ఫలమై/జని నిష్ఠురమై
నూతిని గోతిని వెదికేవాళ్ళూ -/అనేకులింకా అభాగ్యులంతా
అనాథులంతా/అశాంతులంతా
దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో/విప్లవశంఖం వినిపిస్తారోయ్!

ఈ హెచ్చరికలో కసికూడా వుంది. బూర్జువావ్యవస్థలో పాలకవర్గంవారి దోపిడికీ అన్యాయాలకూ గురి అవుతున్నవారెందరో ఉన్నారు. వారిలో కొందరినే శ్రీశ్రీ ఇక్కడ పేర్కొని తక్కినవారు అభాగ్యులు, అనాథులు, అశాంతులు అన్నాడు. వీరనేకులు కూడాను. పేర్కొనబడినవారు కార్మికులూ కర్షకులూ కాక నాలుగురకాలవారు.

(1) కారాగారబంధితులు. అపరాధంచేయకుండానే చెరసాలలోకి వెళ్ళడం న్యాయవిచారణ సరిగాజరగకపోవడంవల్లనే! న్యాయస్థానాలు పాలకవర్గంవారివే. అందువల్ల పీడితుల పనులు 'దురదృష్టాలు' (సరిగా చూడబడనివి). బూర్జువాల దృష్టిలో "రేఖకవతలివారంతా నేరగాళ్ళు. రేఖను రక్షించడానికే న్యాయస్థానాలు, రక్షకభటవర్గాలు, చెరసాలలు, ఉరికొయ్యలు. రేఖను కాపాడకతీరదు."

(2) మృత్యుశయ్యపై కెక్కిన క్షతగాత్రులు. యంత్రాలయాల్లో పనిచేస్తూ ఆకస్మికంగా వచ్చిన ప్రమాదాలకు గురి అయి వైద్యసదుపాయాలు లేకపోవడం వల్ల 'చావుబ్రతుకులసంధ్యాకాలం'లో ఉంటారు వీరు. బూర్జువావ్యవస్థలో వైద్యసదుపాయం పీడితులకు అందుబాటులో ఉండదు.

(3) సమ్మెలుచేసే కార్మికులు. తక్కువ జీతాలతో జీవితం గడవని వాళ్ళంతా ఈ రకం వాళ్ళే. వీళ్ళ 'కడుపుమంట'కు కారణం క్షుద్బాధయేకాదు; అధర్మబాధకూడాను! అలజడి వీరి జీవితం! ఆందోళన వీరి ఊపిరి! తిరుగుబాటు వీరి వేదాంతం!

(4) నిరుద్యోగసమస్యకు బలిఅయ్యేవారు 'కూటికోసం కూలికోసం' వెడకులాడి, కాలువలో సముద్రంలో నూతిలో గోతిలో పడి ఆత్మహత్య చేసుకునే నిరాశావాదులు!

వీరంతా తమ బాధలు, కష్టాలు తమ పూర్వజన్మ కృతపాపఫలాలుగా భావించక, వాటికి కారకులు దోపిడిదారులే అని గ్రహించినపుడు విప్లవశంఖం పూరిస్తారు. ఇది భౌతికవాదం ప్రేరణగానే జరుగుతుంది. ఈ తిరుగుబాటు సామాన్యమైనదికాదు కనుకనే దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో విప్లవశంఖం వినిపించడం. ఇది భారతయుద్ధంవలె ధర్మ సంగ్రామం కనుకనే విప్లవ శంఖపూరణం చేయబడుతుంది.

## శ్రీశ్రీ సావేశోపన్యాస సంవిధానం

శ్రీశ్రీ గేయాలలో కొన్ని సావేశోపన్యాసాలు! ఇవి శ్రీశ్రీలోని విప్లవనాయకత్వానికి గుర్తులుగా కనిపిస్తాయి. ప్రతిజ్ఞ, కవితా ఓకవితా, జగన్నాథుని రథచక్రాలు, మహాప్రస్థానం, గర్జించు రష్యా ఇటువంటివే.

ప్రతిజ్ఞ గేయం చదివినపుడుగానీ పాడినపుడుగానీ ఆవేశవేగానికి మనం కదలిపోతాం. ఉక్కిరిబిక్కిరి అవుతాం. ప్రతిగీతం ఒకదీర్ఘవాక్యమేకానీ వాక్యాల పరంపర కాదిందులో. ఆదీర్ఘ వాక్యాంతంలో హెచ్చరికలూ, సానుభూతులూ, ప్రతిజ్ఞలూ, దండోరాలూ వినిపిస్తాయి. ఘర్మజలానికి ఖరీదులేదోయ్! విషాదాశ్రులకు విలాపాగ్నులకు ఖరీదుకట్టే షరాబులేడోయ్! విప్లవశంఖం వినిపిస్తారోయ్! జగత్తుకంతా చవులిస్తానోయ్! మొదలైన గీత్యంతభాగాల్లోని 'ఓయ్' అను మాటను వివిధార్థచ్ఛాయల్లో శ్రీశ్రీ వాడాడు. ఇవి గుండెల్లోకి దూసుకుపోతున్నట్లు వినిపిస్తాయి. నాలో కదిలే-నావినిపించే అంటూ ఉత్తమపురుషలో కవిచెబుతున్నపుడుశ్రోతలకూ ఆ ఆవేశం కలుగుతుంది. సామ్యవాదవిప్లవాన్ని ప్రచోదితం చేయడానికి ఈ ఆవేశం అవసర మవుతుంది.

## శ్రీశ్రీ త్రిపాదప్రాస శిల్పం

వృత్తాలలో నాలుగు పాదాలకూ ప్రాసనియమం ఉంటుంది. శ్రీశ్రీ గేయంలో మూడు పాదాలకే ప్రాస వేశాడు.

పొలాలనన్నీ
హలాలదున్నీ
ఇలాతలంలో హేమంపిండగ
× × ×
నరాలబిగువూ
కరాలసత్తువ
వరాల వర్షం కురిపించాలని

ఇలాంటివే ఇంకా మహాప్రస్థానగీతంలో కొన్ని ఉన్నాయి!

## శ్రీశ్రీ పాదాదిలగప్రయోగ శిల్పం

పాదాదిని లగం లేదా జగణం వాడటం ద్వారా గతివేగం సాధించడం శ్రీశ్రీకి పరిపాటి.

పొలాల నన్నీ
హలాల దున్నీ
ఇలాతలంలో హేమంపిండగ-

జగానికంతా సౌఖ్యం నిండగ-
విరామమెరుగక పరిశ్రమించే
బలం ధరిత్రికి బలికావించే

ఇటువంటివి ప్రతిజ్ఞలోనేకాక మహాప్రస్థానం, జయభేరి, జ్వాలాతోరణం, ఋక్కులు, బాటసారి, ఒకరోజులో, స్విన్‌బర్న్‌కవికి, జగన్నాథుని రథచక్రాలు ఖండికల్లో ఉన్నాయి.

## శ్రీశ్రీ స్వరప్రాసలు

పాదద్వితీయాక్షరంలో కేవలం అచ్చుతోనే ప్రాసవేయడం శ్రీశ్రీ నవీన సంవిధానం.

ఇలాతలంలో హేమం పిండగ
జగానికంతా సౌఖ్యం నిండగ
విరామమెరుగక పరిశ్రమించే

వ్యథార్త జీవిత యథార్థదృశ్యం
పునాదిగా ఇక జనించబోయే

ఇటువంటివి ఐ, సాహసి, ఆశాదూతలు వంటి ఖండికల్లో ఇంకా ఉన్నాయి.

## శ్రీశ్రీ కవిత్వంలో పారిభాషికాలు, వృత్తిపదాలు

రంగు, రుచి, వాసనగల పదాలను మాత్రమే వాడటం కాల్పనికతకు అవసరం. కానీ వాస్తవికత వాస్తవమైన సజీవమైన సమాజానికి సంబంధించిన పదాలన్నింటినీ వాడకతప్పదు. సామాజిక - ఆర్థికవాదప్రచారంలో ప్రసిద్ధికి వచ్చిన పదాలనెన్నింటినో శ్రీశ్రీ స్వీకరించాడు. వృత్తి పదాలకు కవిత్వంలో స్థానం కల్పించాడు. ఖరీదు - గని - కార్ఖానా - ధనికస్వామి - దాస్యం-యంత్రం - కార్మికులు - కర్షకులు - షరాబు - చెరసాల - సమ్మెలు - శ్రమ - విప్లవం - శ్రామికులు - కష్టజీవులు - కమ్మరికొలిమి - కుమ్మరిచక్రం - జాలరిపగ్గం - సాలెలమగ్గం - గొడ్డలి - రంపం - కొడవలి - నాగలి - వంటివి ప్రతిజ్ఞఖండికలోనే ఉన్నాయి. సైనికులు - రాక్షసిబొగ్గు - పొగగొట్టం - అగ్గిపుల్ల - సబ్బుబిళ్ళ - ప్రభుత్వం - వైద్యశాల - శస్త్రకారుడు-కూలి - గుండుసూది - విద్యార్థి - ఉద్యోగి - రివల్యూషన్ - తారీఖు - దస్తావేజు - మర ఫిరంగి - విషవాయువు - తుపాను - న్యాయస్థానం - రక్షకభటుడు, - ఉరికొయ్య - రేడియో-పెట్టుబడి - రాజకీయాలు - టార్పీడో - టోర్నాడో వంటి నాగరికపదజాలం (బూర్జువావ్యవస్థ వల్ల రూపొందినదే చాలావరకు) చేరింది శ్రీశ్రీ కవిత్వంలోకి.

'Only those could qualify as true poets, who could found a new world and a new language' అనే రేంబో సూక్తిని శ్రీశ్రీ సరికొత్తపద్ధతిలో అనుసరించాడు.

# 77/చేదుపాట

## మనమంతా బానిసలం! గానుగలం!! పీనుగులం!!!

1937 మే 14

భారతదేశం ఫ్యూడల్‌వ్యవస్థలో ఉండగానే సామ్రాజ్యవాదులైన ఆంగ్లేయులు ప్రవేశించి పారిశ్రామికవిప్లవపుమెరుపులను చూపించారు. పెట్టుబడిదారీవ్యవస్థకు బీజాలుచల్లారు. దేశంలోని ధనికవర్గమూ సామాన్యవర్గమూ కూడా బ్రిటిష్‌సామ్రాజ్యవాది పీడనకు గురిఅయింది. దేశీయులంతా బానిసలే అయ్యారు.

ఆర్థికసాంఘికసాంస్కృతిక విద్యారంగాల్లో - జీవితంలో - ఎన్నోమార్పులు వచ్చాయి. దేశంలో అభ్యుదయం విదేశీయులది; దారిద్ర్యం దేశీయులది. బూర్జువాలు, జమీందారులు విదేశీయులతో కుమ్మక్కయిపోవడంవల్ల వెరసి దేశంలో ఒక పీడకవర్గం ఏర్పడింది. కోట్లకొద్దీ ప్రజ పీడితవర్గం అయింది.

ఈ దోపిడినీ పీడననూ ప్రతిఘటించడానికి ఇంకా చాలినంత చైతన్యం కలగకముందు గురజాడ పారిశ్రామికవిప్లవాన్ని మెచ్చుకుంటూ వ్రాసినకవిత్వమే నవ్యకవిత్వంగా రూపొందింది! మూఢవిశ్వాసాల నెదిరించడం, సమాజాన్ని సంస్కరించాలనుకోవడం పారిశ్రామిక విప్లవఫలితాలే!

గురజాడకు సమాంతరంగానే రాయప్రోలు జాతీయపునరుజ్జీవనానికి కవితను పాక్షికంగా వినియోగించాడు. ఈయిద్దరి తర్వాతవచ్చిన భావకవులు బూర్జువామనోవ్యవస్థను ప్రతిబింబిస్తూ వ్యక్తివాదులై తమ ఏకాంతసుఖాలకూ స్వేచ్ఛకూ భంగం కలిగించే ఫ్యూడల్‌సమాజంపట్ల విముఖులై కాల్పనిక స్వప్నాలకోసం ఉద్రూతలూగారు. 1920-30 మధ్య భావకవులధోరణిలో నిరాశావాదం, స్వేచ్ఛావాదం, సౌందర్యవాదం, ప్రకృతిపూజ కనిపిస్తాయి. వీరి నిరాశావాదంలో దేశపారతంత్ర్యపు పీడకల కొంత ధ్వనించినా అది ప్రయత్నపూర్వకంగా ఉద్దేశించినది కాదు.

ఉదాహరణకు:— "స్వాదు సంగీత కలనా లసద్విపంచిఁ
గరమునందుంచిజీవితభరమువాయఁ
బాడుకొమ్మంటి తియ్యనిప్రణయగీతి
తంత్రులను ద్రెంచి మెట్లు విదల్చి స్వామి!
ఎటులఁబాడుదు, నీ బ్రదుకెట్లు వుత్తు!"[1]

1 కృష్ణపక్షము.

వంటి పద్యాలలోని కవినిరాశకు కారణం నిర్దిష్టంగా గోచరించదు. అది ఫ్యూడల్‌సమాజపు టాచారాలనూ కట్టుబాట్లనూ ఎదిరించలేని పరిస్థితివల్లనూకావచ్చు. బ్రిటిష్‌వారి నిరంకుశత్వాన్ని సహించలేనితనంవల్లనూ కావచ్చు. లేదా పూర్తిగా వ్యక్తిగతం కావచ్చు. ఏమైనా ఆ కవి కాల్పనికవాది కనుకకారణాలను నిర్దేశించడం అతనిపనికాదు. కాల్పనికవాదానికి పూర్తిగా అంకితంకాని బసవరాజు అప్పారావు, దువ్వూరిరామిరెడ్డి, అడవి బాపిరాజు వంటివారు వ్యక్తివాదం నుంచి ఎడంగా సామాజికస్పృహతో కొన్నికవితలు రాశారు.

దేశవాస్తవికతను గుర్తించి ప్రజాసామాన్యపక్షంలో నుంచి తనగళం విప్పినకవి అడవి బాపిరాజు 'పాతపాట' అనే ఖండికలో:-

"ద్వేషమేనా బ్రతుకుమార్గం? వేషమేనా సత్యరూపం?
మోసమేనా నిత్యకర్మం? మూర్తిమంతులకున్
ఇరుగువారలకేది కూడూ? పొరుగువారలకేది గుడ్డ?
ఇరుగుపొరుగులులేని మసనం దొరలు దొంగలకున్.
ఆకటార్పులు జోలలా? మా శాకయార్పులు డోలలా? మన
బానిసల చెడుబ్రతుకులే ఈ ప్రభులపానుపులా?
కూలినాలీ బ్రతుకు, మనవులు, కొలువులూ కోపాలు కొర్రులు
చాలు మీ దానాలు ధర్మాల్ చాలు మీ భిక్షాల్.
కంఠమెత్తీ గానమెప్పుడు? కలం హాయిగ ఖదం ఎప్పుడు?
కంటి చూపులలో సముజ్జ్వల కళలు తోచేనా?
పాతకతలూ పాతవెతలూ పారిచనె స్వేచ్ఛాపతాకము
నెత్తరా ఎత్తవేం ఎత్తూ ఏడుద్వీపాలన్!"2

అన్నారు. ఈ విధంగా రాయడంలో ఒక భావవిప్లవం ఉంది; భౌతికదృష్టి ఉంది; సమాజస్పృహ ఉంది! ఇది భావకవులకన్నా ఆలోచనలో ముందడుగే!

## శ్రీశ్రీ విప్లవప్రబోధం

మార్క్సిస్టుప్రాపంచిక దృక్పథంతో భారతదేశంలోని పీడనను, దోపిడిని అవలోకించి, పీడితవర్గపక్షపాతంతో కవిత్వం రాసిన మొదటి తెలుగుకవి శ్రీశ్రీయే! వ్యథార్తజీవితయథార్థ దృశ్యాలను శ్రీశ్రీ చూశాడు. ప్రజలు బానిసలైనప్పుడు వారి జీవితకష్టాలను చూస్తూంటే ఒక నిరాశ, నిర్వేదం కవికి కలగడం సహజమే కానీ గతితార్కికభౌతికవాది అయిన కవికి మానవ

2 వైతాళికులు 180 పే.

ప్రయత్నంమీద దృఢవిశ్వాసమూ, తిరుగుబాటు మనస్తత్త్వం, భవిష్యత్తుమీద ఆశ అతిసహజమైనవి. అందువల్ల సమాజనగ్నస్వరూపాన్ని చూపించడానికి వెనుదీయడు. ప్రగతినిరోధకుల్నీ నిరాశావాదుల్నీ వేళాకోళం చేయక మానడు.

దేశంలో రెండురకాల మితవాదులు కనిపిస్తారు. (1) కొందరు ఆదర్శవాదులూ, వేదాంతులూ నిరాశపడి కర్మసిద్ధాంతానికి కట్టుబడి, కర్తవ్యవిమూఢులై అంతా విధివిలాసం అనీ అంతా మాయ అనీ అన్నీ వ్యర్థం అనీ భావిస్తారు.

(2) మరికొందరు అంతా దగా అంటారు కానీ, తిరుగుబాటు కూడదంటారు. ఈ రెండు రకాల మితవాదాలవల్ల కలిసివచ్చేది ఏదీలేదు. ఈరెండురకాలవారినీ శ్రీశ్రీ ఎదిరిస్తున్నాడు.

అన్నీ మాయ అంతా మిథ్యఅనే వేదాంతిని శ్రీశ్రీ మాయంటావా అంతా మిథ్యంటావా రోల్సుకారు, మనీపర్సు, మరఫిరంగి, విషవాయువు, తిరుగుబాటు, సంగ్రామం అన్నీ మాయంటావా? అని ప్రశ్నించి అవి మాయ (లేనివి) కావని తెలుసుకోమన్నాడు. వాటి ఫలితాలు సమాజంమీద ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయని తెలిపాడు. ఈ తిరుగుబాటునుగురించి 75వ ప్రకరణంలో పూర్తిగా తెలుసుకున్నాం.

ఇక రెండవతరగతికి చెందిన మితవాదులను శ్రీశ్రీ ఎలా ఎదుర్కొన్నాడో చూడవలసి ఉంది. ఆ తిరుగుబాటు 'చేదుపాట'లో ఉంది. వలసప్రభుత్వాన్ని సాగిస్తున్న సామ్రాజ్యవాదులైన బ్రిటీషువారి పరిపాలనలో అంతా మాయ (దగా) గానే కనిపించింది కవికి. ఈ మాయ వేదాంతార్థంలోకాదు. భౌతికంగా జరుగుతున్న పీడన, దోపిడి మాయలే! ఈ మాయవల్ల లోకంలో సుఖంలేకుండాపోయింది. సార్థకం కావలసిన బ్రతుకు వృథా అవుతున్నది. పాలకవర్గం చెప్పే చదువు వృథా అవుతోంది. వాస్తవికతను గుర్తించలేని కవిత వృథా అవుతోంది. జనం బానిసలుగా బ్రతుకుతున్నారు. స్వదేశంలోనే గానుగెద్దులవలె బరువు మోస్తూ పురోగమనం లేకుండా తమచుట్టూ తామే తిరుగుతున్నారు. వెనుకా ముందూ కుడీయెడమా అంతటా దగాయే కనిపిస్తోంది. కుక్కలవలె పరాన్నభుక్కులుగా నక్కలవలె అరణ్యవాసులుగా సందులలో పందులవలె మురికిలో బ్రతుకుతున్నారు ప్రజలు. బ్రతుకు నీడలా, చదువు మాయగా కవిత కరక్కాయగా కనిపిస్తోంది. పరపీడనలో సుఖంలేకపోగా జీవఫలం చేదువిషంగా ఉంది. ఇవన్నీ వాస్తవాలే కానీ నిరాశగా చెప్పిన విషయాలు కావు. ఈ వాస్తవాలు శ్రోతను కవ్విస్తున్నాయి! అంత దగా అని ఒప్పుకుంటున్నా, ఆ దగాను ఖండించక తప్పదని చెప్పడమే శ్రీశ్రీ అతివాదం.

"ఏం రోజులివి! ఎంగిలాకు పత్రికలూ ఏనాంపెళ్ళిళ్ళూ కుక్కగొడుగుపార్టీలూ దాలిగుంటబ్రతుకులూ! ఎక్కడచూసినా లక్కపిడతమనుష్యులూ కర్రిపెండలంమనస్సులూ!

పత్రికలన్నీ నీరసం! మనుష్యులందరూ గుల్లసరుకు! అంతటాదగా! ఎవరిదీ రాజ్యం! క త్తిది! Cannon ది! Poison Gas ది! కళ్ళుమూసుకుంటే వెయ్యిరథచక్రాలు పోతాయి మనమీదనుండి. ఈ అల్లకల్లోలంలో కవీ ఎవరు వింటారు నీ పద్యాలు?"3 అంటూ ఫ్యూడల్ కవిత్వాన్ని వదిలివేయాలంటున్నాడు శ్రీశ్రీ. ఆశావహమైన సామాజికవ్యవస్థలో ప్రబంధనిర్మాణం జరిగింది. నిరాశావహమైన సమాజం ఏర్పడినప్పుడు కవిత్వం మారితీరాలని శ్రీశ్రీ హెచ్చరిస్తున్నాడు.

సామాజికంగా నిరాశావహమైన పరిస్థితులే శ్రీశ్రీచేత 'చేదుపాట'ను రాయించాయి. పరపీడనలో శ్రీశ్రీ 'తీపిపాటలు' రాయలేకపోయాడు. బాటసారి, భిక్షువర్షీయసి, ఉన్మాది, సంధ్యాసమస్యలు, కేక, ఒకరాత్రి, పరాజితులు, ఆః, నీడలు, వాడు గీతాలు శ్రీశ్రీ రాసిన చేదుపాటలే! వీటిలో వ్యథార్తజీవితయథార్థదృశ్యాలను శ్రీశ్రీ ప్రదర్శించాడు.

శ్రీశ్రీని నిరాశావాదిగా భావించనక్కరలేదు కానీ 'చేదుపాట'ని నిరాశావాదానికి తార్కాణంగా ఒకరు భావించారు. వారి ఆరోపణ ఇది:- 'ఇంతకంటె ప్రగతినిరోధకమైన రచన నేనూహించుకోలేను. ఇది పరాజితుల ప్రలాపమన్న సంగతి తెలిసికూడా పరాజితుడైన నిరాశావాదిగా పలకడం శ్రీశ్రీ దౌర్బల్యాన్ని చాటుతుంది. కొన్నిరచనలలో కనిపించే ఆశావాదం శ్రీశ్రీ హృదయంలో లోతుగా వేరూని నిలవలేదన్న శంక పాఠకుడికి కలుగుతుంది.... సమాజానికి క్షుద్రనిరాశావాదంతో విషపాత్రలందించే కవులు క్షంతవ్యులు కారు. శ్రీశ్రీలోని ఈ వైరుధ్యం క్షమించరానిది... నైరాశ్యకలుషితమైన రచనలు సంవిధానచాతుర్య మెంత గొప్పగా ఉన్నాసరే మహాప్రస్థానం నుండి తొలగిస్తే మంచిది.'4 ఈ ఆరోపణ సరిఅయినది కాదు. అందుకు కారణాలివి:-

(1) శ్రీశ్రీ చేదుపాట సమాజంలోని జీవితవాస్తవికతను కళ్ళముందు పెట్టి సమాజాన్ని క్రియాచరణకు ప్రేరేపించుతోందేకానీ ప్రగతినిరోధకంగా నిరాశావహంగా లేదు. చేదుపాట చేదుబ్రతుకుకే సంకేతం. ఇలాంటి చేదుబ్రతుకులను సందర్శించిన శ్రీశ్రీ 'ఏడువ కండేడువకండి' అంటూ ఓదార్చాడు. చేదుబ్రతుకులు బ్రతుకుతున్న పీడితులను తిరుగుబాటుకు ప్రేరేపించాడు. లోకమే శ్రీశ్రీకి నిరాశామయంగా కనిపించిందికానీ తాను నిరాశాపరుడు కాలేదు. అందుకే నిరాశామయలోకంలో కదనశంఖం పూరిస్తానన్నాడు. నిరాశాపీడితులంతా విప్లవశంఖం పూరిస్తారన్నాడు. నిరాశాపీడితులు ధనస్వామ్య పీడితులే. వారంతా సమైక్యమై కదిలితే వారికి ఆశయే. వారి పరాజయం, పరాభవం తాత్కాలికమే!

---

3 శ్రీశ్రీసా. రెండు వచన. 458 పే.

4 సంపత్: శ్రీశ్రీ సన్మానసంచిక (విశాఖ) 28 పే.

(2) వంచనలపాలైన వర్గం తాత్కాలికంగానయినా దుఃఖిస్తుంది. ఈ దుఃఖాన్ని లేదనుకోవడం ఆత్మవంచన. పడుపుకత్తె, ఉన్మాది, కూలీల దుఃఖాన్ని శ్రీశ్రీ వేలెత్తిచూపించాడు. శ్రీశ్రీ వ్యక్తంచేసే దుఃఖం, నిరాశ, నిట్టూర్పు వ్యక్తిగతాలుకావు; అవి సమాజపరమైనవే! అందుకే మనమంతా బానిసలం గానుగలం పీనుగులం అని బహువచనంలో చెబుతాడు. ఈ నిరాశయొక్క తీవ్రతే తిరుగుబాటుకు దారితీస్తుంది.

(3) శ్రీశ్రీ పీడితవర్గనిరాశను గాఢంగానే చిత్రిస్తూఉంటాడు. ఈ నైరాశ్యంతోనే పీడకలోకాన్ని తిడతాడు కూడా. "దొంగలంజకొడుకులసలే మెసలే ధూర్తలోకం" ఇది. 'అడుగడుగునా పొడచూపే అనేకానేక శత్రువులు', 'పొంచిచీకట్లో కరవజూచే వంచకాలు' 'పెద్దమనుషులు, బుద్ధిమంతులు' గల లోకం ఇది!

(4) ఇంతటి ఆగ్రహాన్ని దాచుకున్న శ్రీశ్రీ నిరాశ నిరాశామాత్రం కాదు. అది 'ఆశ'గా ధ్వనించేందుకు కావలసిన 'యాస' చేదుపాటలో ఉంది. "మనదీ ఒక బ్రతుకేనా? కుక్కలవలె నక్కలవలె సందులలో పందులవలె!" అనడంలో ఎత్తిపొడుపు ఉంది; వేళాకోళం ఉంది. విప్లవ నాయకుడి గొంతు ఉంది.

(5) దేశంలో కొందరు నిరాశావాదులు స్తబ్ధంగా ఉండిపోవడంవల్లనే బ్రతుకులు వృథా అవుతాయి. వాటితోపాటు చదువు, కవిత, కళ, సంస్కృతి నిష్ప్రయోజనం అవుతాయి. దగాకోరులు, అవకాశవాదులు, స్వార్థపరులు పెరుగుతారు. దారిద్ర్యం నగ్నతాండవం చేస్తుంది. ఈ చేదుబ్రతుకులకు భగవంతుడి మాయ కారణమా? ధనవంతుల, బలవంతుల మాయ కారణమా? ఈ ప్రశ్నకు సమాధానాన్ని స్ఫురింపజేశాడు శ్రీశ్రీ!

## శ్రీశ్రీ ముక్తపదగ్రస్త సంవిధానం

శ్రీశ్రీ శబ్దాలంకారాలలో ముక్తపదగ్రస్తం ఉంది. బూర్జువాయుగంలోని వాణిజ్య ప్రకటనల్లో ఈ పద్ధతి వాక్యరచన ఉంటుంది.

ఔను నిజం! ఔను నిజం!/ఔను నిజం! నీవన్నది!
నీవన్నది! నీవన్నది!/నీవన్నది! నిజనిజం!!

× × ×

చేదువిషం జీవఫలం!/జీవఫలం చేదువిషం!/చేదువిషం జీవఫలం!

ఇటువంటివి మహాప్రస్థానం, ప్రతిజ్ఞ, కేక, ఒక క్షణంలో, నీడలు, స్విన్‌బర్న్‌కవికి, మిథ్యావాది ఖండికల్లో ఇంకా ఉన్నాయి.

వచనగీతానికి ప్రాణప్రదమైన లక్షణం
గమనవైవిధ్యం !
ఇది సంభాషణలలోని
యాసలూ కాకువులూ ఉచ్చారణవిశేషాలమీద
ఆధారపడి ఉంటుంది !
శైలికీ రీతికీ
సంబంధించిన సమస్యలెన్నో
దీనినుండి బయలుదేరుతాయి !
ఒక్కొక్క కవి
తన సామర్థ్యంతో
ఒక్కొక్క ప్రత్యేకగుణం ప్రదర్శిస్తాడు !

—శ్రీశ్రీ.

భూకంపాలు, ప్రభుత్వపతనాలు, విప్లవం, యుద్ధం
అన్నీ నీ చైతన్యం! నీ విశ్వరూపసాక్షాత్కారం!

1937

ఒకమహాకవి తానొక రాజాస్థానంలో ఉండి రసజ్ఞుడూ భావుకుడూ పండితుడూ మహాకవీ అయిన ఆ రాజునే తన కవిత్వానికి ఆదర్శంగా భావించిన రోజుల్లో అతడు పాలకుని అభిరుచి కనుగుణంగానే కవిత్వం చెప్పకతప్పదు. ఈ పరిస్థితి 16వ శతాబ్దిలో కృష్ణరాయల ఆస్థానంలో పెద్దనగారికి ఏర్పడింది. కవిత్వం ఎలాఉండాలి? అనేప్రశ్నకు పెద్దన ఒక పెద్దఉత్పలమాలికలో సమాధానం చెప్పాడు.

పూత మెఱుంగులున్ పసరుపూపబెడంగులు చూపునట్టివా
కైతలు? జగ్గునిగ్గు నెనగావలె గమ్మనఁగమ్మనన్‌వలెన్!
రాతిరియుంబవల్ మఱపురాని హొయల్ చెలియారజంపు ని
ద్దాతరితీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్!
బాతిగఁ గైకొనన్వలెను బైదలికుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్! సొగసుకోర్కులు రావలె నాలకించినన్!
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్ని మే
ల్మూతల చన్నుదోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్!
డాతొడనున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవిగావలెఁ బంటనూదినన్!
గాతలఁ దమ్మిచూలిదొరకైవనపుంజవరాలి సిబ్బెపు
న్మేతెలియుబ్బురంపు జిగినిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బ హొం
బూతల సన్నకాయ సరిపోఁడిమి కిన్నెరమెట్లబంతి సం
గాతపు సన్నబంతి బయకారపుఁ గన్నడగౌళ పంతుకా
సాతత తానతానల పసం దివుటాడెడు గోటమీటు బల్
ప్రోఁతలునుంబలెన్ హరువుమొల్లముగావలె! నచ్చతెన్గు టీ
రీతిగ, సంస్కృతంబు పచరించినపట్టున భారతీవధూ
టీ తపనీయ గర్భనికటీభవదానన పర్వ సాహితీ
భౌతికనాటకప్రకర భారతభారత సమ్మతప్రభా
శీతనగాత్మజా గిరిశ శేఖర శీతమయూఖ రేఖికా
పాతసుధాప్రపూర బహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయసంగతి చుంచువిపంచికా మృదం

గా తత తేహిత త్తహిత హాదితధంధణుధాణు ధింధిమి
వ్రాత నయానుకూల పదవార కుహూద్వహ హారి కింకిణీ
నూతన ఝల్లిలాచరణ నూపుర ఝూళఝుళీ మరంద సం
ఘాతవియద్ధునీ చకచకద్వికచోత్పల సార సంగ్రహా
యాత కుమార గంధవహ హారి సుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁజేయవలె ! జిల్లునఁ జల్లవలె న్మనోహర
ద్యోతక గోస్తనీఫల మధుద్రవ గోఘృతపాయసప్రసా
రాతి రసప్రసార రుచిరప్రసరంబుగ సారెసారెకున్.[1]

ఇందులో అలనాటి సామాజికపరిస్థితులు కానీ కవితావస్తువుకానీ కనిపించకపోయినా ఆనాటి భోగలాలసజీవితం ప్రతిబింబిస్తూనేఉంది. సంవిధానంలో సంస్కృతాంధ్రభాషలకుండవలసిన ప్రాధాన్యంగురించి కవి బాగా పట్టించుకున్నాడు. రాయలవారి అభిరుచికే పెద్దన ఈ విధంగా అద్దంపట్టి చూపించాడు. సమాజం మారుతూ వస్తున్నా— పాశ్చాత్యసాహిత్యపు వెల్లువ మీద పడేదాకా - కవిదృక్పథం ఇలాగే గతానుగతికంగా సాగిపోయింది. దేశభక్తినీ, మానవత్వాన్నీ కవితామూల్యాలుగా భావించిన గురజాడ సంఘసంస్కరణకు సాహిత్యాన్ని సాధనంగా వాడు కున్నాడు. ఇక్కడ కవి ఎవరిఅభిరుచికీ తలఒగ్గలేదు. ప్రజల అభిరుచిని తీర్చిదిద్దడానికి తయారయ్యాడు. భావకవుల తరంలో కవులు తమఅభిరుచియే తమనికషోపలంగా భావించుకున్నారు. ఇక్కడ తమఅభిరుచి ఏదో తమది ! తక్కినవారు ఇష్టమైతే అనుసరిస్తారు. కష్టమైతే వదిలివేస్తారు. ప్రకృతి, ప్రేయసి, వేదన, స్వేచ్ఛ వారి కవితావస్తువులయ్యాయి. కృష్ణశాస్త్రిగారు 'కవికుమార' అనే ఖండికలో:-

నవవికస్వర దివ్యసౌందర్యమూర్తి/విశ్వసుందరి పరమపవిత్రమూర్తి
యుదయలక్ష్మి యవతరించె; నెదురుపోయి/స్వాగతంబిమ్ము గీతికాప్రసవమొసఁగి
అవిరళస్వేచ్ఛ వెన్కముందరయఁబోక/వారిదమ్ములు చిత్రకాశ్మీరరుచులఁ
బూని విహరించుఁ బశ్చిమ భూధరమున/రజని రానున్నదంచుఁ దెల్పంగ రాదె ?
శ్యామలాంబర పరిణాహసరసిలోనఁ/బ్రణయ లీలావిహార విలాసినులగు
తారకలఁగాంచుమా ! నీ హృదయమునందు/భావనక్షత్రకాంతులు పర్వనేమొ![2]

అన్నప్పుడు కవిలక్ష్యం ఏమిటో అర్థమవుతూనేఉంది. దివ్యసౌందర్యమూర్తి అయిన విశ్వసుందరి నారాధించడం ఆత్మతృప్తికోసమే! సూర్యోదయంకాగానే ఆనందించే కవి తిరిగి సూర్యాస్తమయం కాగానే వచ్చే నక్షత్రాలలో ప్రణయలీలావిహారవిలాసినులను చూచి ఆనందిస్తాడు. అప్పుడతనికి భావోదయం అవుతుంది. భావకవి చూపులు మానవసమాజంమీదికి ప్రసరించడం లేదు.

---

1 మనుచరిత్ర పీఠికలో వేటూరి ప్రభాకరశాస్త్రి ఉదాహరించిన పాఠం

2 కృష్ణపక్షము

తానుంటున్న సమాజంలో ఏంజరుగుతోందో అతని కవితల్లో కనిపించదు. దీనిమీద విప్లవం సాధించిన శ్రీశ్రీ "అగ్గిపుల్లా కుక్కపిల్లా సబ్బుబిళ్ళా హీనంగాచూడకు దేన్నీ కవితామయమేనోయ్ అన్నీ" అంటూ పారిశ్రామిక నాగరికత సాధించిన అగ్గిపుల్లనూ సబ్బుబిళ్ళనూ కూడా కవితా వస్తువులుగా సూచించాడు. ఆ తరువాత తనకవిత్వం కార్మికలోకపు కల్యాణానికి శ్రామికలోకపు సౌభాగ్యానికి అంకితం చేశాడు. ఇది ప్రబంధకవికిగానీ భావకవికిగానీ అవసరం లేని సమస్య. ఇక్కడే శ్రీశ్రీ అభ్యుదయకవిగా ఆ రెండు సంప్రదాయాలనుంచీ వేరుపడిపోయాడు. కవిత్వం ప్రభువులకోసం కాదు; కవిత్వం కవి సహృదయులకోసం మాత్రమే కాదు; అది ప్రజలకోసం - తత్రాపి పీడితుల కోసం! ఈ విధంగా కవిత్వం ప్రభువునుంచి వ్యక్తికీ, వ్యక్తినుంచి ప్రజలకు సంక్రమించింది. ఇది సమాజపరిణామానికి ప్రతిబింబమే! ఇలా సంక్రమింపజేయడంలో గురజాడ, శ్రీశ్రీ కాలంకన్నా ముందుకు నడిచారు. ప్రభువునుంచి నేరుగా ప్రజలకు సంక్రమింపజేయాలనుకున్నాడు గురజాడ. వ్యక్తినుంచి నేరుగా ప్రజలకు సంక్రమింపజేయాలనుకున్నాడు శ్రీశ్రీ. గురజాడ, కృష్ణశాస్త్రి రాజుకెదురుతిరిగారు. శ్రీశ్రీ వ్యక్తికే ఎదురుతిరిగాడు.

## కవిత్వంలో శ్రీశ్రీ అనుకరణలు

తన కవిత్వాన్ని ప్రజాయత్తం చేయడానికిముందు భావకవుల్లాగే ఆత్మతృప్తికోసం ఆరాట పడ్డాడు శ్రీశ్రీ. భావకవిత్వాన్నే కవితాస్వరూపంగా తలపోసి, శ్రీశ్రీ ఎన్నో అనుకరణలు సాగించాడు. ఈ అనుకరణలు స్థూలంగా మూడు విధాలు.

(1) అప్రాప్తమనోహరికోసం అర్రులు సాచిన సౌందర్యవాదులు – దిగిరాను దిగిరాను దివినుండి భువికి అంటూ గర్వంగా చెప్పుకున్న స్వేచ్ఛావాదులు-జాతినిండుగౌరవాన్ని ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్రనీ పాడుకున్న జాతీయవాదులు-మహాబలిపురపురాశిగోడలవంటి పద్యాలను రాసినరీతివాదులు ఏదారులనైతే చూపారో ఆదారుల్లోనే శ్రీశ్రీ కవితాప్రయాణం మొదలయింది. ఎటుచూసినా 'చటులాలంకారపు మటుమాయల నటనలూ' 'యువకాశల నవపేశలసుమగీతాలూ' ఆనాటివే! 'అతి సుందర సుస్యందనంలో దూరంగా వినువీధుల్లో విహరించే అందని అందం'గా కవిత్వాన్ని భావించిన శ్రీశ్రీ- 'గుహలో కుటిలో చీకటిలో' ఒక్కడై మ్రొక్కిన శ్రీశ్రీ- భావకవి మాత్రమే!

(2) సాహిత్యపోషణకు ప్రభువుల ఆస్థానాలస్థానే (కవుల, సహృదయుల) పరిషత్తులు ఏర్పడటం భావకవులతోనే ఆరంభమయింది. సాహిత్యంలో ఇది బూర్జువావ్యవస్థ. 'సాహితీ సమితి' అందుకు మొదటినిదర్శనం. సాహితీసమితిలో చేరిన కవుల్లో ఎక్కువమంది పరస్పర ప్రతిధ్వనులే! అదే శ్రీశ్రీకి చిన్నప్పటి ఆదర్శం. కవిత్వాన్నే కాక సాహితీ సమితిని కూడా

అనుకరిస్తూ శ్రీశ్రీ మొదలైనవారు (పురిపండా, కాళూరి, నారాయణబాబు వగైరా) 'కవితా సమితి'ని విశాఖపట్టణంలో ఏర్పాటుచేశారు.

(3) శ్రీశ్రీచేత అనుకరింపబడిన ప్రధానకవి కృష్ణశాస్త్రి. ఆయనవే 'సుమగీతాలు'. కృష్ణశాస్త్రి అనే సుడిగుండంలో తాను చిక్కుకున్నట్లు శ్రీశ్రీ గ్రహించాడు.3 ఆ విషమ పరిస్థితినే 'కవితా ఓకవితా' ఆరంభంలో స్మరించుకున్నాడు. కృష్ణశాస్త్రిని అనుకరించాలని బుద్ధిపుట్టడానికి కారణం కృష్ణశాస్త్రి ఎంతో 'మజా'గా కవిత్వం చెప్పిఉండటమే! అయితే అది 'అందని అందం'గా వినువీధుల్లో విహరించేది. వాస్తవజీవితానికి ఎంతో దూరమైపోయింది. ఇందులో రెండు లోపాలున్నాయి. (1) కవిత్వం చెప్పడం కష్టమైన పనిగా ఉండాలనుకోవడం! (2) అవాస్తవికంగా(కాల్పనికంగా)కవిత్వం ఉండాలనుకోవడం! ఈ రెండు లోపాలనే నిజంగా శ్రీశ్రీ అనుకరించింది. అనుకరిస్తూ రాసిన కవిత్వాన్ని శ్రీశ్రీ 'Second rate poetry' గా గుర్తించడానికి కొంపెల్ల జనార్దనరావు విమర్శ దారిచూపింది. కానీ, సొంతగొంతుకను వెదుక్కునేదాకా శ్రీశ్రీకి అనుకరణ తప్పలేదు.4 తన అనుకరణలు చివరికి తనకే నచ్చలేదు.5

### కవిత్వంకోసం శ్రీశ్రీ శోధన, సాధన

అనుకరణనుంచి విముక్తుడుకావడానికి కొంపెల్ల జనార్దనరావు విమర్శ శ్రీశ్రీకి కొంతవరకే సహకరించింది. ఇతరులు వేసిన దారిని వదలాలంటే తన సొంతదారిని తాను వేసుకోవాలి. ఇందుకు శోధన, సాధన ఎంతైనా అవసరమే. ఈ ప్రయత్నాలకు బాహ్యప్రేరణలేమిటి? అవి (1) పారిశ్రామికయుగచైతన్యం (2) అంతర్జాతీయకవిత్వాధ్యయనం (3) రష్యన్ ఫ్యూచరిజం (4) సామ్యవాద సామాజిక చైతన్యం (5) పడమటిదేశాల సాహిత్యవాదాలు (6) జాతీయోద్యమాలు. వీటిని క్రమంగా వివరిస్తాను :

(1) సాహిత్యసముద్రంలో సాహసియై నూతన ఖండాలను కనుక్కోవడానికి బయల్దేరిన శ్రీశ్రీ గవేషణ సఫలం అయిందంటే అందుకు శ్రీశ్రీ నివసిస్తున్న పారిశ్రామిక యుగమే కారణం. ఈ యుగం కల్పించిన అంతర్జాతీయ సంబంధాలవల్ల, రాకపోకల సాధనాలవల్ల ఖండాంతరాల, భాషాంతరాల సాహిత్యాన్ని కూడా శ్రీశ్రీ చదవగల్గాడు.

(2) శ్రీశ్రీకన్నా ముందుగానే భావకవితాధోరణులను వ్యతిరేకించినవారు శిష్ట్లా, ముద్దుకృష్ణ లిద్దరూను. వీరు ఆంగ్లకవులను మాత్రమే చదివి ప్రభావితులవుతూ ఉండేవారు.

3. శ్రీశ్రీ సా. ఒకటి. కావ్య. 221 పే.
4. శ్రీశ్రీ సా. రెండు. వచన. 512 పే.
5. శ్రీశ్రీ సా. రెండు, వచన. 456 పే.

వారిద్దరికన్నా చురుకైన బుద్ధిగలవాడు శ్రీశ్రీ. అందుకే "ముద్దుకృష్ణనీ శిష్ట్లానీ ప్రేరేపిస్తున్న పాశ్చాత్యకవుల దగ్గరికి సరాసరిగా వెళ్ళి" వారితో సంతృప్తి చెందక ఫ్రాన్సుజర్మనీదేశాలకవుల ఆకర్షణకి ముగ్ధుడై "ప్రపంచ విశాలమైన దృష్టితో అంతటా కలియజూస్తేనేకాని కావ్యస్వప్నం సఫలీకృతం కాదని" భావించాడు. ఆవిధంగా కలియజూశాడు. ఆ చూపులోనే "ప్రపంచం అంతటా అభివృద్ధిని కాంక్షించేకవుల స్వప్నాలు రష్యన్‌విప్లవంలో ఆకృతి ధరించడం" చూశాడు. "సామాజికవిప్లవానికి పురోగామిగా సాహిత్యవిప్లవం సాగాలన్న దృఢనిశ్చయానికి" శ్రీశ్రీ వచ్చేశాడు. ఇది శోధనకు ఒక గమ్యం అయింది. శోధన పూర్తికావడంతో అనుకరణలు అస్తమించాయి. శ్రీశ్రీకి నూతనదృక్పథం ఏర్పడింది.

(3) నగరజీవితాన్నీ పారిశ్రామికపరిస్థితుల్లో ఏర్పడేహృదయవిదారకదృశ్యాల్నీ పతనోన్ముఖమైన పాతసంఘపువికారనృత్యాన్నీ కావ్యవస్తువులుగా తీసుకుంటున్న రష్యన్‌ఫ్యూచరిజంను శ్రీశ్రీ గమనించాడు. మయకోవస్కీ, పాస్టర్నాక్ మొదలైన కవుల రచనలను చదివాడు. పీడిత లోకంతో సానుభూతి అందుకే కలిగింది శ్రీశ్రీకి. కుబేరవైభవంప్రక్కన కుచేలదారిద్ర్యం తన దేశంలో కూడా ఉందికనుక దానికి కారణం ఏమిటా? అని ఆలోచించాడు. ప్రపంచసాహిత్యంలో ప్రతిబింబిస్తున్న సామాజికదురన్యాయాలు వాస్తవంగా తనదేశంలో కూడా ఉన్నాయని గమనించిన శ్రీశ్రీ తన కవిత్వంలో వాటిని ప్రతిబింబింపజేసి పరిష్కారమార్గం చూపించదలచాడు. ప్రపంచ మొక పద్మవ్యూహంగా కనిపించింది. కవిత్వ మొక తీరని దాహం కూడా అయింది.

(4) ఈ శోధనలోనే కవితాసృష్టికి ప్రయోజనం వ్యక్తిగతానందం కాదనే అభిప్రాయానికి వచ్చాడు శ్రీశ్రీ. సామాజికచైతన్యం కల్పించాలి తన కవిత్వం.

(5) ఇటువంటి కవిత్వానికి శిల్పం కూడా ఉండాలనుకోవడంలో శ్రీశ్రీ సాధన మారాకు తొడిగింది. ప్రపంచ సాహిత్యంలో ఉద్యమాల రూపంలో బయలుదేరిన పనితనాల నన్నింటినీ ఆకళించుకోసాగాడు శ్రీశ్రీ. ఏ కార్మికుల అభ్యుదయంకోసం తన కవిత్వాన్ని అంకితం చేయాలనుకున్నాడో ఆ కార్మికులు పరిశ్రమల్లో 'పనితనం' (craftsmanship) లేనిదే రాణించరు కనుకనే తను కవిత్వంలో కూడా పనితనం చూపించాలి. అలాంటి పనితనం అభివృద్ధి పొందడానికి సాధన ఒకటేమార్గం!

ప్రపంచసాహిత్యవీధులలో వచ్చిన అనేకనూతనోద్యమాలు సామాజికపురోగమనాన్ని లక్ష్యంగా పెట్టుకున్నవి కావు. సింబాలిజం, ఇమేజిజం, ఫ్యూచరిజం, వోర్టిసిజం, ఇంప్రెషనిజం, క్యూబిజం, సర్రియలిజం, ఫ్రాయిడిజం (చైతన్యస్రవంతి) మొదలైనవి శ్రీశ్రీని ఆకర్షించిన ఉద్యమాలు. వీటి తత్త్వాన్ని తెలుసుకోవడంతో సరిపెట్టుకోక, వాటిని ప్రయోగించే నైపుణ్యం అలవరచుకున్నాడు శ్రీశ్రీ. వాటి సంవిధాన వైచిత్రులతో సామాజిక చైతన్యం సృష్టించదలచాడు.

(6) శ్రీశ్రీ సాధనకు స్వదేశంలోని వ్యావహారికభాషోద్యమం, జాతీయపునరుజ్జీవనోద్యమంలో భాగంగా వచ్చిన జానపదసాహిత్యరీతుల పరిశోధన తోడ్పడ్డాయి. వీటివల్లనే వాడుకభాషలో మాత్రాచ్ఛందస్సులలో రీతివిప్లవం సాధ్యమైంది.

## కవిత్వంలో శ్రీశ్రీ దర్శనప్రతిభ

'చిరదీక్షాశిక్షాతపస్సు' శ్రీశ్రీ సాధన కాగా దాని ఫలితం 'సమీక్షణ' (దర్శనం). ఈ దర్శనం సమాజదర్శనమే (Social outlook). ఈ దర్శనాన్ని సామాజికులకు ప్రదర్శనంగా మార్చడానికే 'నిశ్చలసమాధి'. ఆ సమాధిలోనే తన మస్తిష్కం "సర్గద్వారపు తోరణం' అయింది.

శ్రీశ్రీ దర్శనంలో ఘోషలూ భాషలూ దృశ్యాలూ కూడా ఉన్నాయి. తన గీతానికి అవి ప్రాణస్పందన కలిగించిన శక్తులు. నయనేంద్రియానికి గోచరించినవి దృశ్యాలు. శ్రవణేంద్రియానికి గోచరించినవి ఘోషలూ, భాషలూను. ఈ దృశ్యాలూ ధ్వనులూ గతానుగతికాలూ కావు; సుకుమారమైనవీ కావు; అవి శ్యమంతరోచిర్నివహాలూ రణన్నినాదాలూ! తానుంటున్న సమాజంలోనివే ఈ దృశ్యాలూ ధ్వనులూను.

ఈ దర్శనాన్ని రెండు విధాలుగా వ్యక్తంచేశాడు. (1) సంకేతాలతో నైరూప్యం (abstract) గా ఉండే ధ్వనులు. (2) వాస్తవాలతో సారూప్యం (concrete) గా ఉండే దృశ్యాలు. "నడిరేయాకసమావర్తించిన మేఘాలావర్షించిన ప్రచండఝంఝాప్రభంజనం గజగజలాడించిన నడిసంద్రపు కెరటాల్లో మ్రోగిన శంఖారావం, ఢంకాధ్వానం" అనేదీ 'ఒక లక్షనక్షత్రాల మాటలు, ఒక కోటి జలపాతాల పాటలు, శతకోటి సముద్రతరంగాలమ్రోతలు' అనేవీ నైరూప్య ధ్వనిచిత్రాలే! ఇటువంటి నైరూప్యధ్వనిచిత్రాలు 'మహాప్రస్థానం' గీతంలో ఇంకా ఉన్నాయి. ప్రసవించిన శిశువు, రుచిరస్వప్నాలను కాంచే జవరాలు, శిశువు చిత్రనిద్ర, వైద్యశాల, శస్త్రకారుడు, కన్నులు మూసిన రోగార్తుడు, త్రాగుబోతు, పడుపుకత్తె, ఉరితీయబడ్డ శిరస్సు, ఉన్మాది, సమ్మెకట్టిన కూలీలు, కూలీల భార్యలు, బిడ్డలు వంటివన్నీ సారూప్య దృశ్యచిత్రాలు. శ్రీశ్రీని ప్రేరేపించి కవిత్వం రాయించినవి ఈ ధ్వనులూ ఈ దృశ్యాలే కానీ అంతర్గతమైన భావోన్మాదమేదో కాదు. సామాజికస్పృహవల్లనే కవిత్వం బయల్దేరుతుందనే భౌతికవాదం శ్రీశ్రీ కవిత్వానికి చోదకశక్తి. శ్రీశ్రీ కవితాచైతన్యం సమాజజీవితదర్శనానికి ప్రతిబింబమే!

## కవిత్వంలో శ్రీశ్రీసామాజిక స్పృహ

సమాజవాస్తవికతను దర్శించడమే సామాజికస్పృహ. బూర్జువాసమాజంలో దోపిడి ఉందనీ పరపీడకులున్నారనీ మార్క్సిస్టుకళ్ళతో చూస్తేనే కానీ అర్థంకాదు. శ్రీశ్రీకి ఉన్న సామా

జికస్పృహ వర్గసమాజదర్శనంవల్ల కలిగిందే! ప్రతివ్యవస్థలోని సమాజంలోనూ ప్రతిజీవికీ కష్టాలుండటం సహజమే. ఆ కష్టాలపట్ల సానుభూతి చూపడం కూడా ప్రతికవికీ సహజమే. ఆ సానుభూతిని పీడితవర్గంపట్లనే చూపడం బూర్జువావ్యవస్థలోని మార్క్సిస్టుకవి ప్రత్యేకత. సామాజికస్పృహ అంటే ఈ అర్థంలోనే. శ్రీశ్రీ తాను పారిశ్రామికాభ్యుదయాన్ని సాధించిన బూర్జువాల వ్యవస్థలో ఉన్నానని గుర్తించాడు. ఆ స్పృహతోనే సమాజాన్ని దర్శించాడు. కనుక శ్రీశ్రీకి పీడితులే అధికసంఖ్యలో కనిపించారు. ఆకలిమంటలు, అప్పుల బాధలు, నిరాశలు, నిర్వేదాలు, ఆత్మహత్యలు, దౌర్జన్యాలు, స్వార్థాలు, దోపిడి, దురన్యాయాలు వంటి వెన్నో బూర్జువావ్యవస్థలోని సమాజంలో కనిపించాయి. ఇవన్నీ సమాజంలో ఉన్నా భావకవి వీటిని చూడలేకపోయాడు. ప్రకృతినిచూశాడు. ఆత్మీయమైనబాధలనే గమనించాడు. శ్రీశ్రీ సామాజిక బాధలను చూశాడు. నిజానికి భౌతికవాదికికానీ సంపూర్ణ సామాజికస్పృహ (Social awareness) ఉండదు. కాల్పనికవాదికి ఆత్మీయస్పృహ (Self awareness) అపారం.

శ్రీశ్రీ సామాజికస్పృహలో రెండు దశలున్నాయి. (1) సమాజదర్శనం మాత్రమే. (2) ఆ సమాజాన్ని మార్చివేయాలనే సామాజికవిప్లవస్పృహ. ఈ రెండవది శాస్త్రీయమైన మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలమీద ఆధారపడినదే కానీ అరాచకవాదం కాదు. 'కవితా ఓ కవితా'లో సమాజదర్శనస్పృహ మాత్రమే ఉంది. సమాజ విప్లవస్పృహ లేదు. కానీ కవితా విప్లవస్పృహ ఉంది. అది కవితా సంవిధానం గురించి ప్రకటించిన అభిప్రాయాల్లో ఉంది. శ్మశానాలవంటి నిఘంటువుల్నీ వ్యాకరణాల సంకెళ్ళనీ ఛందస్సుల సర్పపరిష్వంగాలనీ విడిచి మాటలు వెలువడ్డాయనడం కవితా విప్లవ స్పృహ ఉన్న కవి కానీ అనలేడు.

## శ్రీశ్రీ సమాజ వాస్తవ చిత్రాలు

కవితాదృష్టితో శ్రీశ్రీ విన్నవీ కన్నవీ సమాజవాస్తవ చిత్రాలే! వీటిలో కొంత వైవిధ్యం ఉంది.

(1) నడిసంద్రపు కెరటాల్లో మోగిన శంఖారావం, ఢంకాధ్వానం, కారడవులలో విరుతించిన నానాజంతుధ్వనులు, నక్షత్రాంతర్నిబిడనిఖిలగానం, భూకంపాలు, నక్షత్రాలమాటలు, జలపాతాల పాటలు, సముద్రతరంగాల మోతలు ఒక తరగతికి చెందుతాయి. ప్రకృతిపరమైన సంకేతాలతో సామాజిక వాస్తవికతను ధ్వనించాలనే ప్రయత్నం ఈ చిత్రాలలో కనిపిస్తుంది.

(2) ప్రభుత్వపతనాలు, విప్లవం, యుద్ధం, అగ్నిసరస్సున వికసించిన వజ్రం, ఎగిరే లోహశ్యేనం, ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగరావం, వైద్యశాలలో శస్త్రకారుని మహేంద్రజాలం ఇవి మరోతరగతికి చెందినవి. రాజకీయాలు, పరిశ్రమలు, విజ్ఞానశాస్త్ర

పరిశోధనలు, యంత్రాలు మొదలైనవి బూర్జువావ్యవస్థ తాలూకు అభ్యుదయంలో సోపానాలుగా చెప్పదగినవి. ఇవి సమాజవాస్తవికత మీద ప్రభావం చూపించేవి.

(3) అప్పుడే ప్రసవించిన శిశువు నెడద నిడుకొని రుచిరస్వప్నాలను కాంచే జవరాలి మనఃప్రపంచపుటావర్తాలు, శిశువు చిత్రనిద్రలో ప్రాచీన స్మృతులూచే చప్పుడు, చావుబ్రతుకుల సంధ్యాకాలంలో కన్నులు మూసిన రోగార్తుని రక్తనాళసంస్పందన - ఇంకో తరగతికి చెందినవి. జననం, మరణం, రోగం, స్వప్నం, మనోభావాలు మొదలైన మానవజీవితవాస్తవాలు ఈ చిత్రాలకు ఆధారం. వీటి ప్రభావం కూడా సమాజవాస్తవికత మీద ఉంటుంది.

(4) కాలువనీళులలో జారిపడి కదలగనైనా చాలని తాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, ప్రేలాపన, కడుపుదహించుకుపోయే పడుపుకత్తె రాక్షసరతిలో అర్ధనిమీలిత నేత్రాల భయంకర కేకా భేకం బాకా, సమ్మెకట్టిన కూలీల, భార్యల, బిడ్డల ఆకటిచీకటి చిచ్చుల హాహాకారం, బాధల పాటల పల్లవి; ఉరితీయబడ్డ శిరస్సుచెప్పిన రహస్యం; ఉన్మాది మనస్సినీవాలిలో ఘూకం ఆర్తారావం మరోతరగతికి చెందిన వాస్తవాలు. సమాజంలోని ఒకవర్గంవారి దోపిడి, మరో వర్గం వారి నికృష్టజీవితం – ఈ వాస్తవచిత్రాల వెనుక స్ఫురించే విషయం.

శ్రీశ్రీ కవిత్వానికి ఈ నాలుగు రకాలైన వాస్తవాలూ నాలుగు ఆధారస్తంభాలు. నాలుగోదే శ్రీశ్రీ కవిత్వజీవనాడి. ఈ వాస్తవచిత్రాలనే శ్రీశ్రీ జాబితాగా చూపించాడు. కాని వీటికి ఒక క్రమం పాటించలేదు. శ్రీశ్రీ కవితాదర్శనంలో ఇవన్నీ ఒకదానితరువాత ఒకటిగా తెరమీద కదిలిపోయినట్లు కదిలిపోయాయన్నమాట. విన్నానమ్మా విన్నానెన్నో విన్నాను అంటూ శ్రీశ్రీ ఈ పేర్కొన్నవాటినే కాక ఈ కోవకు చెందిన వింకా ఎన్నో విన్నానన్నాడు. అవన్నీ మహాప్రస్థానం గేయాలలో ఉన్నవే

శ్రీశ్రీ కవిత్వంలోని సమాజవాస్తవికతలో రెండు ప్రధానభాగాలున్నాయి (1) పారిశ్రామిక విప్లవవాస్తవికత. ఇందులోనే బూర్జువా వర్గ జీవితవాస్తవికత చేరుతుంది. ఎందువల్లనంటే పారిశ్రామిక విప్లవాన్ని తెచ్చి, ఆ విప్లవంయొక్క మంచిఫలితాలనన్నింటినీ అనుభవిస్తున్నది ఆ వర్గంవారే కనుక. (2) సామ్యవాదవిప్లవవాస్తవికత. ఇందులోనే పీడితవర్గజీవితవాస్తవికత చేరుతుంది. పారిశ్రామిక విప్లవంవల్ల వచ్చే అరిష్టాలనన్నింటినీ అనుభవిస్తూ, వాటిని తొలగించడానికి ప్రయత్నించేవారు ఈవర్గంవారే. పరస్పరవిరుద్ధమైన ఈరెండు వాస్తవికతలకూ సంఘర్షణమే శ్రీశ్రీ కవిత్వం.

శ్రీశ్రీ సామాజికస్పృహ భౌతికవాదం వల్లనే ఏర్పడినా ఆ స్పృహను ఒకనిర్దిష్ట పంవిధానంతో వ్యక్తంచేయడానికి పాశ్చాత్యసాహిత్యోద్యమాలు దోహదంచేశాయి.

## శ్రీశ్రీపై వోర్టిసిజం ప్రభావం

రెండు ప్రపంచయుద్ధాల మధ్య బయలుదేరిన ఆధునిక పాశ్చాత్య సాహిత్యవాదాలలో వోర్టిసిజం (ఆవర్తవాద) ప్రభావం శ్రీశ్రీపై కనిపిస్తుంది. ఇందుకు నిదర్శనాలు :- (1) "నడిరే యాకస మావర్తించిన - మేఘాలావర్షించిన - ప్రచండఝంఝూప్రభంజనం గజ గజలాడించిన - నడిసంద్రపుకెరటాల్లో మ్రోగిన -" శంఖారావాన్నీ ఢంకాధ్వానాన్నీ తాను విన్నానడం తర్కబద్ధంగా తోచదు. నడిసంద్రపుకెరటాల్లో శంఖం, ఢంక ఎలామ్రోగుతాయి? అర్ధరాత్రి, ఆకాశం, మేఘాలు, ప్రభంజనం, సముద్రం, తరంగాలు వేటికైనా సంకేతాలా? అనే సందేహం వస్తుంది. ఎన్నోదిక్కులనుంచి ముసురుకుని వస్తున్న ఆధునికజీవితం మానవుడి మెదడు కేంద్రంగా వివిధపరిధుల్లో సుడులు (ఆవర్తాలు)గా విస్తరిస్తున్నందున సాహిత్యంలో ఆవర్తవాదం బయలుదేరిందనీ, నీటిలో రాయి విసిరితే వలయాలు వలయాలుగా కెరటాలు బయలుదేరినట్లు ఈ ఆవర్తాలు బయలుదేరతాయనీ శ్రీశ్రీయే వివరించాడు.6 పారిశ్రామిక విప్లవం తరవాత ప్రపంచంలో వచ్చిన, వస్తున్న అనేక పరిణామాలే శంఖారావ ఢంకాధ్వానాలు. రోదసీయాత్రలు, విజ్ఞానశాస్త్రప్రయోగాలు. మనస్తత్వపరిశోధనలు, స్వాతంత్ర్యసమరాలు మొదలైనవన్నీ శంఖారావఢంకాధ్వానాల విశేషణాలద్వారా సూచింపబడ్డాయి. ఇవన్నీ నలు దిక్కులనుంచీ ఆధునికమానవుడి మనస్సులో ముసురుకుని సుడిగుండాలను సృష్టిస్తున్నాయి. సర్గ దారపు తోరణంగా వ్రేలిన శ్రీశ్రీ మస్తిష్కంలో కూడా ఎన్నోఘోషలు, భాషలు, దృశ్యాలు తోచడానికి కారణం ఈ ఆవర్తవాదమే. 'ఆవర్తించిన' అనే క్రియద్వారా శ్రీశ్రీ ఈ ఆవర్త వాదాన్నే సూచించాడు. నడిసంద్రపుకెరటాల్లో ఢంకాధ్వానం శంఖారావం మ్రోగడం ఆవర్త వలయాలకు సూచనలే! క్యూబిజం ఆధారంగా WINDHAM LEWIS (1884-1957) అనే చిత్రకారుడూ రచయితా లేవదీసిన ఈ ఉద్యమాన్ని శ్రీశ్రీ తెలుగుకవిత్వానికి పరిచయం చేశాడు.

(2) వెనుక చెప్పిన 'నడిరేయి' రెండు సామాజికవ్యవస్థలకు మధ్యవచ్చిన గడ్డుకాలానికి సూచికగానే కనిపిస్తుంది. అదే బూర్జువాయుగం. ఇది తెల్లారితే వచ్చేది సామ్యవాదయుగమే. కానీ ఈ నడిరేయి భయంకరమైన యంత్రాలధ్వనులు వినిపిస్తున్నాయి. మోటారుకారు, గ్రామ ఫోను, సినిమా, రేడియో, కర్మాగారం, రైలింజను, వాయువిమానంవంటి అనేకానేక యంత్రాల ధ్వనులను ఫ్యూడల్‌వ్యవస్థలోని కవి వినలేదు. బూర్జువాయుగపు కవి వీటిని వినడమేకాదు; కావ్యవస్తువులుగా గ్రహిస్తాడు. వీటి నన్నింటినీ శ్రీశ్రీ జంతుధ్వానులుగా భావించాడు. అందుకే: "ఆరాత్రి కారడవులలో లయాతీతమై విరుతించిన నానాజంతుధ్వానులలో" అంటూ వాటిని

6 శ్రీశ్రీసా. రెండు. వచన. 473 పే.

పేర్కొన్నాడు. ఈ జంతుధ్వనులన్నీ ఒక్కమారే వినిపించాయని చెప్పడం ఆవర్తవాద ప్రభావమే!

(3) అప్పుడే ప్రసవించిన శిశువు నెడదనిడుకొని రుచిరస్వప్నాలను కాంచే జవరాలి మనః ప్రపంచపుటావర్తాలను విన్నాననడం కూడా ఆవర్తవాదాన్ని అభిమానించడం వల్లనే! పుడమి తల్లికి పురుటి నొప్పులు వస్తున్నట్లు ఊహించి సామ్యవాదశిశువు ఉదయించబోతున్నట్లు కలగన్న శ్రీశ్రీ శిశువును కన్నాక తల్లి పొందే కలలనూ ఆ కలల్లో ఆమె మనస్సులోని సుడిగుండాలనూ ఊహిస్తున్నాడు. శిశువును ప్రసవించకముందు గర్భభారమూ, ప్రసవించేటప్పుడు పడిననొప్పులూ ప్రసవించినతరవాత మాయమౌతాయి. కానీ శిశుభవిష్యత్తును గురించి ఆమెపొందే మనోహర స్వప్నాలు కమ్మ్యూనిజంలోకానీ నిజం కావని ఆమెకు తెలుసు. కానీ ఈలోగా ఆమె మనస్సులో వచ్చే సుడిగుండాలు (ఆవర్తాలు) తనకు వినిపించాయంటాడు శ్రీశ్రీ.

(4) కవితావిశ్వరూపసాక్షాత్కారం తన కయిందంటూ భూకంపాలనూ ప్రభుత్వపతనాలనూ విప్లవాలనూ యుద్ధాలనూ కవితాచైతన్యంగా పేర్కొనడంమీద కూడా ఆవర్తవాద ప్రభావమే గోచరిస్తుంది. విశ్వం అంటే సముద్రాలు, కొండలు, భూమి, ఆకాశం అనుకోవడం ఫ్యూడల్ భావం. విశ్వం అంటే మానవజగత్తు అనుకోవడం బూర్జువాభావం. ఈ భావంనుంచే ఆవర్తవాదం వచ్చింది.

## శ్రీశ్రీపై ఇమేజిజం ప్రభావం

ప్రథమప్రపంచయుద్ధానికి ముందే 1912 లోనే ఎజ్రాపౌండు (1885-1972) లేవనెత్తిన ఉద్యమం ఇమేజిజం. సింబాలిజమే దీని మాతృక. బ్రిటన్, అమెరికాలు ఇమేజిజంకు స్థావరాలు. ఆ ఉద్యమాన్ని ఆంధ్రదేశంలో తనకవిత్వంద్వారా పరిచయంచేసినవాడు శ్రీశ్రీయే. వచనపద్యానికీ దృశ్యశ్రవ్యపదచిత్రాలకూ ఇమేజిజమే శ్రీశ్రీకి దారి చూపించింది.

శ్రీశ్రీ పదచిత్రాలకు గల విశిష్టలక్షణాల్లో మొదటిది: ప్రతిపదసార్థక్యం. ఉదాహరణకు-'అగ్నిసరస్సున వికసించిన వజ్రం' అనే పదచిత్రంలో నాలుగుపదాలూ అర్థంకోసం విడువరానివే. రెండవది: శ్రుతిలలిత పదబంధరచన. ఉదాహరణకు-అగ్నిసరస్సు, లోహశ్యేనం, యుద్ధగుంజన్మృదంగం వంటివి. వీటిలోని పదాలకు పర్యాయపదాలు కుదరవు. మూడవది: వాక్యలయ. ఉదాహరణకు: వైద్యశాలలో శస్త్రకారుని మహేంద్రజాలంలో చావుబ్రతుకులసంధ్యాకాలంలో కన్నులు మూసినరోగార్తుని రక్తనాళసంస్పందన. ఇందులోని లయ తాత్పర్యం చెబితే ఉండదు. నాల్గవది: ఇంద్రియసాక్షాత్కారచిత్రణ. ఉదాహరణకు: ఘూకంకేకా భేకంబాకా అనే రెండూ గ్రుడ్లగూబనూ, కప్పనూ చూపించడమేగాక వాటి అరుపులను వినిపింపజేస్తాయికూడా.

ఇమేజిజం ఒక శిల్పమేకానీ ఒక తత్త్వదర్శనం కాదు. ఆ శిల్పాన్ని సంస్కరించుకుని తన ప్రయోజనాలకనుగుణంగా వాడుకున్నాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ తన కవితావస్తువులను బూర్జువావ్యవస్థలోనే చూశాడు. అగ్నిసరస్సున వికసించిన వజ్రమూ ఎగిరే లోహశ్యేనమూ ఫిరంగిలో జ్వరంధ్వనించే మృదంగరావమూ బూర్జువావ్యవస్థ లోనివే. ఆ మూడు పదచిత్రాల రచనమీద ఇమేజిజంప్రభావం కంఠదఘ్నంగా ఉంది. వాటిని సంగ్రహంగా వివరిస్తాను.

(1) "అగ్నిసరస్సున వికసించిన వజ్రం":- అగ్నియొక్క వేడిమి సరస్సుయొక్క చల్లదనం రెండూ ఏకత్ర ఎక్కడైనా ఉంటే దాన్ని అగ్నిసరస్సు అనకతప్పదు. అందులో పద్మాలు కాక వజ్రాలే వికసించడం అద్భుతం కాదు. ఇది 'మధుకీల' వంటి పదచిత్రమే! మధువుయొక్క మాధుర్యమూ కీలయొక్క వేడిమీ ఒక్కచోటనే ఉన్న మానసికావస్థనే మధుకీల స్ఫురింప జేస్తోందన్నాడు శ్రీశ్రీ.7 'అగ్నిసరస్సు' నలాగే సృష్టించాడు. అగ్ని తీక్ష్ణతనీ తాపాన్నీ వ్యక్తం చేస్తుండగా సరస్సు స్వేదాన్నీ శ్రమనూ వ్యక్తంచేస్తోంది. వజ్రం అమూల్యతనీ అకుంఠితత్వాన్నీ తెల్పుతోంది. అగ్నిసరస్సున వికసించిన వజ్రం అంటే తాపంనుంచి వెలువడిన సంపద - శ్రమవల్ల వికసిస్తూన్న పెట్టుబడి అనే నూతనార్థం వస్తోంది. పారిశ్రామిక విప్లవం వల్ల, శ్రమ విని యోగంవల్ల పుట్టిన అమూల్య వస్తుసంపద అంతా శ్రీశ్రీకి కనిపించింది.

(2) "ఎగిరే లోహశ్యేనం" - ఆకాశయానానికి విమానాలు వచ్చిన బూర్జువాయుగం లోని కవి కనుకనే కవితను స్మరించగానే "ఎగిరే ఇనుపడేగ"ను చూడగల్గాడు. (లోహం దృఢత్వానికి శ్యేనం వేగానికీ చిహ్నాలు). పారిశ్రామిక నాగరికతకు, విజ్ఞానపరిశోధనలకు, ఆధునిక యుద్ధాలకు విమానం - ఫ్యూడల్ వ్యవస్థలో రథంలాగే - ముఖ్యవాహనం. బూర్జువాలు ప్రపంచానికి చేసిన మేళ్ళలో ఎగిరేవాహనాలను నిర్మించడం ప్రముఖమైనది. అందువల్లనే ప్రొలిటేరియన్ కవి అయిన శ్రీశ్రీ వాటినభిమానించడం! లోహశ్యేనమే శ్రీశ్రీ పదనిర్మాణంలో ఎన్నో రూపాంతరాలను పొందింది. 'లోహవిహంగం', 'రెక్కవిప్పిన రివల్యూషన్, ''విసురుతున్న విమానబాహువులు' వగైరా.

(3) 'ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం '- అన్వయమే తికమకగా కనిపించే ఈ శ్రవ్యపదచిత్రం తనలోని భావాని కనుగుణంగా మనల్ని విభ్రాంతి పరుస్తుంది. ఫ్యూడల్ వ్యవస్థలో పుట్టిన మృదంగమనే వాద్యవిశేషం బూర్జువా వ్యవస్థలోకి రాగానే భయంకరమవుతోంది. అది జ్వరాన్ని ధ్వనిస్తోంది. ఆ జ్వరం విధ్వంసిని అయిన ఫిరంగిలోది! ఫిరంగికీ జ్వరానికీ ఏం సంబంధం అంటే జ్వరం ఉష్ణోగ్రతకు సూచకం మాత్రమే. ఉష్ణోగ్రతతో బాధపడేవాడు చేసే మూలుగే మృదంగనాదం! ఇంతకీ కవి చెప్పదలచిందేమిటి? ఆధునికమారణాయుధాల సంసిద్ధతనే.

---

7 విశ్వంపేరుమగీతాలు సమీక్ష.

ఆధునిక విజ్ఞానశాస్త్రాన్ని ప్రోత్సహించిన బూర్జువాలు తమ రక్షణకై మారణాయుధాలు సృష్టించి మానవశ్రేయస్సుకూ మానవ విధ్వంసానికీ కూడా కారణం అవుతున్నారు.

## శ్రీశ్రీపై ఫ్యూచరిజం ప్రభావం

ప్రథమ ప్రపంచయుద్ధానికి ముందే 1909 లోనే ఇటలీలో కరడుకట్టిన సంప్రదాయాల మీద తిరుగుబాటుగా తలెత్తిన 'ఫ్యూచరిజం' (భావివాదం) బూర్జువాయంత్రనాగరికతను సాహిత్యంలోకి అంటుతొక్కడానికి యత్నించింది. ఈ ఉద్యమాన్ని తెలుగుదేశానికి తనకవిత్వం ద్వారా పరిచయం చేసినవాడు శ్రీశ్రీయే!

ఫ్యూచరిజం కేవలసంవిధానవిప్లవమే కాదు; దీనికొక తాత్త్వికదర్శనం కూడా ఉంది. ఫ్యూడల్‌వ్యవస్థలోని పద్ధతులనూ జీవితావగాహనలనూ తిరస్కరించి బూర్జువావ్యవస్థలోని వేగాన్నీ యంత్రచలనాన్నీ పారిశ్రామికపురోగమనాన్నీ ప్రేమించడమే ఫ్యూచరిజంలోని తత్త్వం. వెన్నెల కన్నా విద్యుచ్ఛక్తిని సుందరమైనదిగా భావించడం ఫ్యూచరిస్టు లక్షణం. వీరి దృష్టిలో సౌందర్యానికి నిర్వచనమే అపూర్వమైనది. యుద్ధంలో అందంచూస్తారు; మోటారు కారు పరుగులో సొంపు నారాధిస్తారు.

ఫ్యూడల్,బూర్జువాపద్ధతులమీద, భావకవిత్వంమీద, గ్రాంథికంమీద తిరుగుబాటు చేయడానికి శ్రీశ్రీకి ఫ్యూచరిజం బాగా సహకరించింది. శ్రీశ్రీలోని ఫ్యూచరిజం లక్షణాలను 10 విధాలుగా క్రోడీకరించవచ్చు. (1) గతసంప్రదాయ నిరసనం: నిఘంటువులను శ్మశానాలనడం, ఛందస్సులను సర్పపరిష్వంగాలనడం, వ్యాకరణాలను సంకెళ్ళనడం వంటివి ఇందుకుదాహరణలు. (2) వేగప్రశంస: ఇందుకుదాహరణగా మాటలు వడిగావడివడిగా వెలువడినై పరుగిడినై నాయెద నడుగిడినై అన్నది గ్రహించవచ్చు. మహాప్రస్థానం, జగన్నాథునిరథచక్రాలు, నవకవిత వంటి ఖండికల్లో ఈ వేగాన్ని ప్రశంసించడం వ్యక్తమయింది. శ్రీశ్రీ కవితాలయలోని వేగానికి ఫ్యూచరిజం దోహదం చేసింది. (3) నగరవాతావరణం: సంధ్యాసమస్యలు ఖండిక ఇందుకుదాహరణం. వైద్యశాల, కర్మాగారం, రోల్సుకారు, కార్మికుల సమ్మెలువగైరా శ్రీశ్రీ కవిత్వానికి నగరవాతావరణాన్ని సమకూర్చాయి. (4) పారిశ్రామిక వాతావరణం: వాడు, వ్యత్యాసం, ప్రతిజ్ఞ వంటి ఖండికలు; యంత్రభూతాలు, వికసించిన విద్యుత్తేజం, పొగగొట్టపు భూంకారధ్వని, లోహశ్యేనం వంటి ప్రయోగాలు ఇందుకు ఉదాహృతులు. (5) భయంకర సౌందర్యం: ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం, అగ్నిసరస్సు, అగ్నికిరీటం, రక్తకాసారం, నటధూర్జటి నిటాలాగ్ని, ప్రపంచమొక పద్మవ్యూహం వంటివి ఉదాహరణాలు. (6) వ్యతిక్రమాలంకారం: కూడులేని

గూడులేని పక్షులార! భిక్షులార! వంటివి. (7) సమకాలిక జీవితవాస్తవికత: పడుపుకత్తె, బిచ్చగాడు, త్రాగుబోతువంటి పాత్రలు. (8) విధ్వంసన భావాలు: యముని మహిషపులోహఘంటలు, భూకంపం, బలివితర్ది, టార్పిడో, టోర్నాడో వంటివి. (9) అన్యదేశ్యప్రదప్రయోగం. (10) అర్థరహితపదప్రయోగం: అరెర్ఝూఝూఝూ ఝుటక్ ఫటక్ వంటివి.

## శ్రీశ్రీపై రియలిజంప్రభావం

వాస్తవికతావాదం (రియలిజం) సంవిధానానికి కాక తత్త్వదర్శనానికే సంబంధించింది. శ్రీశ్రీ వాస్తవికత సమకాలిక సమాజవాస్తవికతయే! ఆ సమాజం కూడా వర్గసమాజమే. ఆ వర్గసమాజంలో వ్యథార్తజీవితయథార్థత శ్రీశ్రీకి లక్ష్యం. అంటే బూర్జువావ్యవస్థలో ప్రొలిటేరియట్ వర్గం పడుతున్న కష్టాలను స్ఫురింపజేయడం శ్రీశ్రీ వాస్తవికతాదృష్టికి ప్రయోజనం.

శ్రీశ్రీ వాస్తవికతావాదంలో ప్రధానంగా మూడు కోణాలున్నాయి. (1) పీడితజన మనోవాస్తవికత: మనోవిశ్లేషణశాస్త్రాన్ని అనుసరించి పీడితవర్గమనోవాస్తవికతను సృష్టిస్తాడు శ్రీశ్రీ. త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, ఉన్మాది మనస్సినీవాలిలో ఘూకంకేకా, భేకం బాకా వంటివి దీనికుదాహరణాలు. (2) పీడితజనభౌతిక వాస్తవికత: సమ్మెకట్టిన కూలీల భార్యల, బిడ్డల ఆకటిచీకటిచిచ్చుల హాహాకారం, ఆర్తారావం వంటివి ఇందుకు నిదర్శనాలు. (3) పీడితజన విప్లవవాస్తవికత: ప్రతిజ్ఞ ఖండికలో పీడితజనులు ఎలా ఎప్పుడు విప్లవశంఖం పూరిస్తారో సూచింపబడింది. శ్రీశ్రీ వాస్తవికతలోని ఇతరభేదాలు స్థలాంతరాల్లో విశ్లేషించిఉన్నాను.

## శ్రీశ్రీ దర్శించిన వైరుధ్యాలు

తానుంటున్న బూర్జువాసమాజంలో శ్రీశ్రీకి వైరుధ్యాలు కనిపించాయి. ఈ వైరుధ్యాలు బూర్జువాఅభ్యుదయానికీ బూర్జువాపరపీడనకూ సంబంధించినవి. విజ్ఞానపరిశోధనలకు ప్రోత్సాహం ఇచ్చిన బూర్జువాలు వైద్యరంగంలో అద్భుతప్రగతిని సాధించారు; కానీ వారే రోగాలనూ ప్రమాదాలనూ పెంచినవారు కూడా. అందుకే "శస్త్రకారుని మహేంద్రజాలం" అని ప్రశంసిస్తూనే "చావుబ్రదుకుల సంధ్యాకాలంలో కన్నులు మూసిన రోగార్తుని రక్తనాళసంస్పందన" అంటూ విచారిస్తాడు శ్రీశ్రీ. ఆ సంస్పందననే తాను వింటాడు. కర్మాగారాలను ప్రశంసిస్తూనే లోహరాక్షసుల పదఘట్టనచే కొనప్రాణంతో కనలే కార్మికులను చూసి బాధపడతాడు.

## శ్రీశ్రీ దర్శనంలో బూర్జువాసమాజ దురాచారాలు

పీడితులజీవితాలలోప్రవేశించిన దురాచారాలకు పీడితవ్యక్తుల ఆర్థికపరిస్థితులే కారణంగా భావిస్తాడు శ్రీశ్రీ. పీడితవ్యక్తుల దౌర్బల్యాలకు బూర్జువా సమాజపు బాధ్యత ఉంది. ఇందుకు

త్రాగుడు, పడుపువృత్తి, భిక్షావృత్తి నిదర్శనాలు. భిక్షావృత్తిని గురించి భిక్షువర్షీయసి అనే ఖండికనే రాశాడు శ్రీశ్రీ. తక్కిన రెండు దురాచారాలనూ రెండు పదచిత్రాల్లో సూచించాడు.

(1) బూర్జువావ్యవస్థలో మానవుడనేక వ్యసనాలకు లోనుకావడానికి కారణం లాభార్జన దృష్టితో బూర్జువాలు అలాంటి మత్తుపదార్థాలను ఉత్పత్తిచేయడమే! దారిద్ర్యంవల్ల, అధిక శ్రమవల్ల కార్మికులు సారాయి త్రాగడానికి అలవాటుపడతారు. ఆ సారాయినే ఒక వ్యాపారంగా చేస్తారు బూర్జువాలు. అందువల్ల బూర్జువావ్యవస్థను ద్వేషించే శ్రీశ్రీ త్రాగుబోతులపట్ల జాలి పడతాడు: "కాలువనీళులలో జారిపడి/కదలగనైనా చాలని/త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన!" తాను కవితను స్మరింపగానే విన్నానని శ్రీశ్రీ అన్నాడు. త్రాగినవాడు ధనవంతుడు కాడుకనుకనే నడుస్తూ కాలువనీళ్ళలో జారిపడిపోయాడు; కానీ అతడ్ని లేవదీసేవాళ్లు కూడా లేరు. అప్పుడతడు చేసే ప్రసంగం అర్థరహితంగా కనిపిస్తుంది కానీ అదంతా అతని సుప్తచైతన్య లోని భాగమే. వ్యక్తావ్యక్తస్థితిలో అతడు మాటాడే మాటలలోకూడా ఒక అర్థం ఉంటుందని మనస్తత్త్వవేత్తలు గ్రహించగలరు. అతడి బాధల నిజస్వరూపం, నిజాయితీ అప్పుడే పైకివస్తాయి. అంతకుముందు అతనిదంతా సమాజంపెట్టిన సరిహద్దులలో ఉన్న ప్రవర్తన మాత్రమే.

(2) ఫ్యూడల్‌వ్యవస్థలో రసికుల భోగాలకోసం శరీరాల నమ్ముకునే వేశ్యావృత్తిమొదలై అది ఆ వ్యవస్థఅంతరించినా ధనస్వామ్యంలోకూడా జరుగుతూనే ఉండటానికికారణం వెలయాళ్ళ దారిద్ర్యమే తప్ప కామపిపాసకాదు. కానీ రెండోవైపున ధనస్వామ్యయువకులు, వృద్ధులూకూడా కామపిపాసవల్ల, ధనమదంవల్ల ఆ వృత్తి నిరంతరాయంగా కొనసాగేటట్లు చేస్తారు. దీన్నే శ్రీశ్రీ తానుంటున్న సమాజంలో చూశాడు. "కడుపు దహించుకుపోయే/పడుపుకత్తె రాక్షసరతిలో/అర్ధనిమీలితనేత్రాల/భయంకరబాధల పాటలపల్లవి" శ్రీశ్రీ విన్నాడు. ఆకలివల్ల కడుపుమంట కాగా రాక్షసరతివల్ల శరీరబాధ కాగా ఆ పడుపుకత్తె కళ్ళుమూసుకుని పడేబాధలు భయంకరమైనవి. వాటిని పాటలుగా పోల్చడం వాటికి పల్లవి చెప్పడం ఆ బాధల ఆరంభోద్రేకాలను సూచించడానికే. అంతేగాక పాటకు పల్లవి ఆవృత్తమవుతూ ఉన్నట్లు ఆమె బాధలు విటుల పునఃపునరాగమనంవల్ల ఆవృత్తమవుతూ ఉంటాయి.

## శ్రీశ్రీ దర్శనంలో బూర్జువారాజకీయ దురాచారాలు

బూర్జువా రాజకీయాలు తమవర్గాన్ని రక్షించుకునేటందుకు క్రూరమైన, అమానుషమైన శాసనాలు చేస్తాయి. వీటిని గర్హిస్తాడు శ్రీశ్రీ. ఉరితీత, చెరసాల ఇటువంటి శిక్షలే. స్వాతంత్ర్యం కోసం పీడితవర్గం తిరుగుబాటుచేస్తే ఈ శిక్షలు వేస్తారు బూర్జువాలు.

భారతస్వాతంత్ర్యసమరంలో భగత్‌సింగ్ వంటి దేశభక్తు లెందరో ఉరితీయబడ్డారు. పాలకవర్గం చేసే దుర్మార్గాలకు శిక్షఉండదు. వాటికి ప్రతిగా పాలితవర్గంచేసే తిరుగుబాటుకు

శిక్షపడుతుంది. ఇది అన్యాయం. ఇటువంటి రాజకీయాన్యాయం శ్రీశ్రీ దేశదేశాల్లోనూ ఉండటం గమనించి "ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం" అన్నాడు. ఉరితీయబడినవాడు నిరపరాధి కనుకనే అతని మొండెంనుంచి విడివడిన తలకాయను చూస్తే అనేక రహస్యవృత్తాంతాలు వ్యక్తమవుతాయి. అంతేకాక శిరస్సు అపారమైన మేధాసంపత్తికీ, విప్లవభావాలకూ ప్రతీక. ఒక మహావ్యక్తి తాను బ్రతుకుతున్న కాలంకన్నా ముందుకుఅడుగువేసి, సమాజాన్ని కూడా నడిపించా లనుకుంటాడు; కానీ సమాజం అతణ్ని అనుసరించక, అతణ్ని చంపివేస్తుంది. తరువాత అతడెంతో గొప్పవాడని శిలావిగ్రహం తయారుచేయించి పూజిస్తుంది. అతని శిరస్సు బావికాలానికి ఎన్నో రహస్యాలను అందిస్తుంది. ఈ భావన నంతటినీ శ్రీశ్రీ శిరస్సుచెప్పిన రహస్యం అనేరేడియోనాటికలో వెల్లడించాడు. యుగయుగాలతరబడి భవిష్యత్తుని వర్తమానంలోనే జీవిస్తూ అపార్థాలకి ఆహుతిఅయిపోయిన సోక్రటీస్, జీసస్, వీరేశలింగం, గురజాడ, గిడుగు, గెలీలియో, సక్కో, వంజెట్టీ, షెల్లీ వంటి ప్రవక్తలందరినీ శ్రీశ్రీ ఉరితీయబడ్డ శిరస్సులుగానే భావించాడు. ప్రతీకొత్త ఊహకూ అన్నిరంగాల్లోనూ శిలువ వేస్తారు.8

కవితను స్మరించగానే 'ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం' వినిపించిందని చెప్పినశ్రీశ్రీ ఇటువంటి బీభత్సాలను తన మహాప్రస్థానగీతాలలో ఎన్నో చూపించాడు.

## శ్రీశ్రీ దర్శనంలో బూర్జువాసమాజపు మనోరోగాలు

సామ్యవాదసమాజంలో నిరాశలకు తావు తక్కువకనుక ప్రజలందరికీ మానసికారోగ్యం లభిస్తుంది. కానీ బూర్జువాసమాజంలో పీడితవర్గానికి మానసికంగా కల్లోలాలు తప్పవు. ఈ మనఃక్షోభలకు దోపిడీ, దారిద్ర్యం, దగా, అవినీతి వంటివి కారణం. అందువల్ల పిచ్చి ఒక విధమైన రోగం అవుతుంది. దీని నివారణకు వైద్యశాలలు అవసరమవుతాయి. ఉన్మాదుల్ని బూర్జువా సమాజంలో శ్రీశ్రీ చూశాడు. తన ఊరైన విశాఖపట్నంలోనేఉన్న 'పిచ్చాసుపత్రి' శ్రీశ్రీకి తెలుసు. ఉన్మాదవాస్తవికతను గురించి పరిశోధనలు చేసిన ఫ్రాయిడ్‌ను శ్రీశ్రీ చదివాడు; సర్రియలిజంకూ ఉన్మాదావస్థకూ గల అనుబంధాన్ని అర్థంచేసుకున్నాడు. అందుకే "ఉన్మాది మనస్సినీవాలిలో ఘూకంకేకా భేకంబాకా" విన్నానన్నాడు. సినీవాలీ అనే నిఘంటుశరణ్యపదానికి 'చంద్రికళ కనిపించే అమావాస్య' అని అర్థం కనిపిస్తుంది కానీ సరిగా ఆ అర్థానికే కట్టుబడి ప్రయోగించలేదు శ్రీశ్రీ. ఈపద్వివేకం 'ప్రకాశించే అజ్ఞానం అనే అర్థాంతరం కూడా కల్పించాడు. వెర్రివాడి మనస్సు అమావాస్య అయితే అందులోని రవంత తెలివియే ఆ చంద్రరేఖ! ఉన్మాదం అనేది వ్యక్తావ్యక్తమానసికపరిస్థితేకాని అవ్యక్తమూకాదు, సువ్యక్తమూకాదు. వ్యక్తి మనస్సు

---

8 శిరస్సు చెప్పిన రహస్యం. శ్రీశ్రీసా. రెండు. వచన. 256 పే.

లోని యథార్థాలు బైటికివచ్చేది ఉన్మాదంలోనే! వ్యక్తావ్యక్త పరిస్థితిలో ఉన్న ఉన్మాది మనస్సులోంచి గుడ్లగూబ కేకలూ కప్ప బెకబెకలూ వినిపించడానికి ఆ మనస్సులోని భయమూ ఉత్సాహమూ కారణాలు. భయం బూర్జువా వ్యవస్థవల్ల కలిగింది. ఉత్సాహం పలాయన స్వభావంవల్ల కలిగింది. ఉన్మాది వాస్తవాన్ని విడిచి ఊహాలోకాల్లో సంచరిస్తూ ఉంటాడు. వాస్తవమూ ఊహా రెండూ అతణ్ని వదలవు. ఉన్నది వాస్తవం. ఉండవలసింది ఊహ. ఈ పద చిత్రం చాలా అపూర్వమైనది. ఉన్మాది మనస్సునిండా చీకటి. ఆచీకటియే ఘూకం కేకకు ప్రేరణ. అతని మనస్సులోని చల్లదనం భేకంబాకాకు ప్రేరణ. ఉన్మాది మనస్సు 'సినీవాలి' కావడంవల్ల చీకటి, చల్లదనం కలగలిసి ఉన్నాయి. ఉన్మాది ప్రవర్తన విచిత్రమైనది. అతడు గుడ్లగూబలా కళ్ళు పెద్దవిచేసుకుని, కేకలు వేస్తాడు. కప్పలా నోరుపెద్దది చేసుకుని బాకా ఊదుతాడు.

కృష్ణశాస్త్రి కవిత్వంలోని ఉన్మాదం కాల్పనికం. శ్రీశ్రీ కవిత్వంలోని ఉన్మాదం వాస్తవికం. అసాధ్యమైన ఊహలు నెరవేరక, భావకవి ఉన్మాదాన్ని ఆరోపించుకుంటాడు. సామాజిక పరిస్థితులవల్ల దగాపడి, పీడితుడు ఉన్మాదంలో పడిపోతాడు. ఇటువంటి ఉన్మాదిపట్లనే శ్రీశ్రీకి సానుభూతి. ఉన్మాది, కేక వంటి ఖండికలిందుకు నిదర్శనాలు.

## శ్రీశ్రీ దర్శనంలో కార్మికవర్గ సంక్షోభం

ఫ్యూడల్‌వ్యవస్థలో లేని కర్మాగారాలను బూర్జువాలు స్థాపించి కార్మికుల శ్రమమీద ధనం మిగుల్చుకుని కార్మికులను 'బుక్కాపకీరులు'గా తయారుచేయడం సామాజికంగా ఆర్థికంగా అన్యాయం. పరిపాలనవ్యవస్థనే తమచేతిలోకి తీసుకునే బూర్జువాలు పరిపాలితులకు మాత్రం తిండి, గుడ్డ దొరకకుండా చేస్తారు. తమ న్యాయమైన హక్కులకోసం కార్మికులు పనినిలిపివేసి సమ్మెలు కట్టడం ఆధునికచైతన్యంలోని భాగం. దీన్నే శ్రీశ్రీ కవితాదర్శనం స్వీకరించింది. "సమ్మెకట్టిన కూలీల సమ్మెకట్టినకూలీలభార్యల, బిడ్డల ఆకటిచీకటిచిచ్చుల హాహాకారం! ఆర్తారావం'' శ్రీశ్రీకి వినిపించిన ఘోషల్లోవి. ఆకటి చిచ్చులంటే క్షుధాగ్నులేకానీ చీకటి చిచ్చులంటే చలిమంటలు మాత్రమే కాదు; దీపం వెలిగించుకోడానికి కిరోసిన్ దొరకకపోవడం వల్ల కలిగే బాధ – చీకటిబాధ. చీకటి నిరాశాతీవ్రతను సూచిస్తుంది. ఈ ఆకటి చీకటిచిచ్చులే హాహాకారానికీ ఆర్తారావానికి కారణం! (కూలీల) భార్యలు, బిడ్డలు కూలీలమీద ఆధారపడి బ్రతికే జీవులు. కూలీకే జీతమే సరిపోకపోగా సమ్మెకట్టినప్పుడు ఆజీతం కూడా ఉండదు. అందువల్ల తిండికీ వెల్తురుకీ కరువు ఏర్పడుతుంది. కూలీలు పనిచేసే ఫ్యాక్టరీలవాతావరణమంతా నవకవితకు కావాలన్నాడు శ్రీశ్రీ. కార్మికవర్గ సంక్షోభచిత్రణ ప్రతిజ్ఞ, దేశచరిత్రలు, వాడు, వ్యత్యాసం, జగన్నాథుని రథచక్రాలు వంటి ఖండికల్లో కనిపిస్తుంది.

### శ్రీశ్రీ కవిత్వంలో బూర్జువాపరిభాషలు

ఏ సంఘటనైనా అంకెలలో చెప్పుకోవడం బూర్జువానాగరికత లక్షణం. శ్రీశ్రీకూడా అంకెలను అభిమానిస్తాడు. ఒక లక్షనక్షత్రాల మాటలు, ఒక కోటిజలపాతాల పాటలు, శతకోటి సముద్రతరంగాల మోతలు తాను విన్నాడట. ఒక్కొక్కమాటు అంకెలతో వెక్కిరిస్తాడు. ఎనభై లక్షల మేరువులు ఎగిరిపడుతున్నాయట! క్రూరఘోరకర్కోటకులకు ఇరవైకోరలూ అరవై కొమ్ములూ ఉన్నాయట! ఒక్కొక్కమాటు అంకెలతో ప్రశంసిస్తాడు. రష్యాను కోటిగొంతులు రమ్మన్నాయట! కోటిచేతులు కౌగిలించాయట!

### శ్రీశ్రీకవిత్వంలో కవితాలక్షణాలు

తన కవిత్వంలో కవితాలక్షణాలను చెప్పడం శ్రీశ్రీ అలవాటు. ఋక్కులు, నవకవిత, ప్రతిజ్ఞ, కవితా ఓ కవితా ఇందుకు సంబంధించినవే. కవితాలక్షణాలను శ్రీశ్రీ రెండుపద్ధతుల్లో చెబుతాడు. మొదటిది అనిర్దిష్టపద్ధతి. ఒకలక్షనక్షత్రాల మాటలనూ ఒకకోటి జలపాతాల పాటలనూ శతకోటి సముద్రతరంగాలమోతనూ వినడం కవిత్వం! ఇది అనిర్దిష్టం. నక్షత్రాలనగానే వెలుతురు, జలపాతాలనగానే వేగం, తరంగాలనగానే కదలిక స్ఫురిస్తాయి. ఇవి ఆధునిక కవిత్వ ప్రధానగుణాలు. కానీ ఈ పద్ధతిలో చెప్పడం అస్పష్టమైనదే! కవి అభిప్రాయం అవ్యక్తంగానే ఉంటుంది. రెండవది నిర్దిష్టపద్ధతి. కదిలేదీ కదిలించేదీ కావాలనడం, కాదేదీ కవితకనర్హం అనడం నిర్దిష్టాలే! వీటిలో అస్పష్టత అంతగా లేదు.

### శ్రీశ్రీ సంవిధాన విజయం

పీడితప్రజాజీవితాన్ని కవితావస్తువుగా చూడగల్గడమే కవిగా శ్రీశ్రీ సాధించిన మొదటి విజయం! అంతవరకూ పాలకవర్గానికీ వ్యక్తికీ వాహనాలుగా ఉన్న భాషాచ్ఛందోవ్యాకరణాలతో ఆ వస్తువును వ్యక్తంచేయడం ఎంతవరకూ సాధ్యం అనే సమస్యను పరిష్కరించుకోవడంలోనే రెండవవిజయం ఉంది.

> నా విన్నవి కన్నవి విన్నవించగా/మాటలకై వెదుకాడగబోతే-
> అవి/పుంఖాను పుంఖంగా/శ్మశానాల వంటి నిఘంటువులదాటి
> వ్యాకరణాల సంకెళ్ళు విడిచి/ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి-
> వడిగా వడివడిగా/వెలువడినై/పరుగిడినై/నాయెదనడుగిడినై"

అనడంతో ఆ రెండో విజయం సిద్ధించింది. సంవిధానం (Technique)లో సాధించిన ఈ విజయం తెలుగు కవిత్వ మార్గాన్ని మార్చివేసింది. తాను విన్నధ్వనులనూ కన్నదృశ్యాలనూ చెప్పడానికి కవికి భాషావ్యాకరణచ్ఛందస్సులు ముఖ్యమైన పనిముట్లు కనుక మారినవస్తువుకు, మారినప్రయోజనానికి తగినట్లు నూతనమైన ఉత్పత్తిసాధనాలు అవసరం అవుతాయి. పాతపరికరాలు వదలక

తప్పదు. కానీ పాతపనిముట్ల నుంచే కొత్తపరికరాలు పరిణతమవుతాయి. ఆ పరికరాలనింకా విస్తృతం చేసుకోవలసివస్తుంది. పనితనంలో ఎక్కువ స్వాతంత్ర్యం తీసుకోవలసివస్తుంది. ఈ స్వాతంత్ర్యం ఒకరిస్తే లభించేదికాదు. తిరుగుబాటుచేసి కళాకారుడు తనంతటతానే తీసుకుంటాడు. ఇలా తీసుకోవడానికి అతనికి సంప్రదాయపరిజ్ఞానం, చొరవ, ప్రయోగకౌశలం, అభ్యాసపరిణతి ఉండాలి. ఇవేవీలేకుండా తీసుకున్న స్వాతంత్ర్యం ఎంతమాత్రం నిలబడదు. శ్రీశ్రీకి పై అర్హతలూ, అధికారాలూ ఉన్నందువల్ల బూర్జువా ఫ్యూడల్ వ్యవస్థలలో ఉన్న కవితాధికారాన్ని పీడితపక్ష ప్రతినిధిగా లాక్కుని కవిత్వంలో వామపక్షనియంతృత్వం సంపాదించాడు.

సంప్రదాయాలను ధ్వంసం చేయడానికి ఉద్యమించిన ఫ్యూచరిస్టులను, డాడాయిస్టులను అభిమానించినా, ఆచరణలో శ్రీశ్రీ సంప్రదాయధ్వంసనం ఎక్కడాచేయలేదు. భాషావ్యాకరణ చ్ఛందోరంగాలలో శ్రీశ్రీ చేసినవి సంస్కరణలు మాత్రమే! సంప్రదాయసంస్కరణంతో పాటు నూతన సంప్రదాయాలను విధించినమాట నిజమే. శ్రీశ్రీ సంప్రదాయసంస్కరణంలో మూడు ప్రధాన ఘట్టాలున్నాయి. (1) నిఘంటుసంస్కరణం (2) వ్యాకరణ సంస్కరణం (3) ఛంద స్సంస్కరణం. వీటి అంతస్తత్త్వం ఎలాంటిదో పరిశీలిద్దాం.

శ్రీశ్రీ నిఘంటుసంస్కరణ

నిఘంటువులను శ్మశానాలనడం స్థూలంగా నిఘంటువులలోని శబ్దార్థాలు శవప్రాయాలుగా ఉన్నాయనడమే! కావ్యస్థమైన శబ్దాలను విడిగా తీసుకుని నైఘంటికులు అర్థాలను నిర్ణయించి నిఘంటువులను తయారుచేయడంలో కావ్యజీవితం వాటికి అపహృతమై పోకతప్పదు. తిరిగి కవులు ఆ శబ్దాలను అవే అర్థాలలో కాక నూతనార్థచ్ఛాయల్లో వాడినపుడు తిరిగి ప్రాణవంతాలవుతూ ఉంటాయి. అయితే అన్ని విషయాలనూ మంగళదృక్పథంతోనే చూడటానికి అలవాటుపడిన ఫ్యూడల్ సాంప్రదాయికులకు భౌతికవాస్తవభావన నచ్చదు. కానీ నిఘంటువులను శ్మశానాలవంటివనడం కేవలం శ్రీశ్రీభావనమాత్రమేకాదు. ఈ గీతాన్ని 1937లో కదా రాశాడు! 1930లో లండన్‌నుంచి వెలువడిన Lectures on Style and Composition అనే గ్రంథంలో E. CLASSEN అనే ఆంగ్ల లాక్షణికుడు కూడా సరిగ్గా ఇలాగే భావించాడు. శ్రీశ్రీ దీన్ని చూశాడోలేదో చెప్పలేము కాని ఆ వాక్యాలివి :— "Words as they stand in a dictionary are dead, and, in spite of the columns of meanings attached to them are really meaningless. A Dictionary is, indeed, like a graveyard. The tombstones tell us who and what the inmates were, when the breath of life was in them, and may even tell us what they would be if they were again quickened into life. But for the present, they are safely buried. So it is also with words. Take them out of their grave, join them, and they will spring into life, each yielding strength and force to his fellow"[9] క్లాసెన్ భావించినట్లే శ్రీశ్రీకూడా

9. Lectures on Style and Composition

పదాలన్నీ సంకేతప్రాయంగా వాడబడుతున్నాయనీ దేనికీ సరియైన - శాశ్వతమైన అర్థంలేదనీ ఘోషించాడు 1937 లోనే [10]. నిఘంటువులలో ఉన్న మాటలకు జీవం, చైతన్యం లేవనడానికి శ్రీశ్రీ చెప్పేకారణాలను క్రింది విధంగా క్రోడీకరించవచ్చు.

(1) కవిత్వంమాటలకన్నా భిన్నమయినది కనుకనే మాటలు వచ్చిన ప్రతీవ్యక్తీ కవి కాలేక పోతున్నాడు. ప్రతీమాటకీ ఒక కొలతా ఒక బరువూ ఒక ఒరవూ ఉంటాయి. రెండు మాటలను సరియైన ఉద్దిష్టార్థం వచ్చేటట్లుకలపడం చాలాకష్టం [11]. ఇవి శ్రీశ్రీ అభిప్రాయాలే! (2) చక్రాల్లో చక్రాల్లాగ కవి వాడిన మాటల అర్థాల్లో అంతరార్థాలు కూడా ఉంటాయి. ఆ అర్థాంతరాలను నిఘంటువు చెప్పలేదు కనుక వ్యాఖ్యాత అవసరం ఉంటుందని శ్రీశ్రీకి తెలియకపోలేదు.[12] (3) "మాటలకు సొంతవిలువ లేదు. వాటిని పేర్చినపుడు కొంత విలువ వస్తుంది" అని శ్రీశ్రీ గ్రహించాడు. నిఘంటువు ఆ విలువను చెప్పలేదు. (4) పదాలకు వాచ్యార్థం మాత్రమే నిఘంటువు వల్ల తెలుస్తుంది. నిఘంటువులోని పదాలన్నీ వాచకాలు. అభిధాశక్తి మాత్రమే ఆ పదాలకుంటుంది. అభిధాశక్తితో పదాలను వాడటం మీదనే శ్రీశ్రీ తిరుగుబాటు. నిజమైన ఏకవి అయినా పదాలను అభిధాశక్తితో మాత్రమే వాడడు. (5) పదాలను లక్షకాలు (indicatives)గా వ్యంజకాలు (suggestives)గా వాడతాడు కవి అయినవాడు. లక్ష్యార్థాలూ వ్యంగ్యార్థాలూ మాత్రమే రమణీయంగా ఉంటాయి. (6) పదాలను ప్రతీకలు (symbols)గా వాడటం సింబాలిజంవల్ల ప్రసిద్ధమయింది శ్రీశ్రీ పదాలలో అధికభాగం ప్రతీకలుగా వాడబడినవే. ఈ ప్రతీకార్థాలు నిఘంటువులలో ఉండవు.

మహాప్రస్థానగీతాలలోని మాటలు రకరకాలుగా కనిపిస్తాయి. వీటిలో కొన్ని నిఘంటువుల్లో ఉండవు. ఉన్నా అర్థాలు భిన్నంగా ఉంటాయి. (1) లక్షకాలుగా కనిపించే మాటలు: 'హృదయంలో దీపం పెట్టకు' అనే వాక్యంలో దీపం అనే మాటకు అర్థం పొసగదు. దీపానికి చైతన్యం అనే అర్థాన్ని కల్పించుకోవడం లక్షణాశక్తివల్ల సాధ్యమవుతుంది. ఈ అర్థం నిఘంటువులో ఉండదు. (2) వ్యంజకాలుగా కనిపించే మాటలు: ప్రపంచమొక పద్మవ్యూహం అనే వాక్యంలో పద్మవ్యూహం అనే మాటకు వక్తను బట్టి ప్రకరణాన్ని బట్టి విచిత్రమైన అర్థం స్ఫురిస్తుంది. శత్రువులతో చుట్టు ముట్టబడినదని అర్థాంతరం అది. అదే వ్యంగ్యార్థం. ఇది నిఘంటువులో ఉండదు. (3) ప్రతీకలుగా కనిపించే మాటలు: అగ్నిసరస్సున వికసించిన వజ్రం అనే పద చిత్రంలో అగ్నిసరస్సు శ్రమకు వజ్రం సంపదకు సంజ్ఞలు. ఇవి నిఘంటువులో కనిపించవు.

---

10 శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 215 పే.

11 'కవితాప్రయోజనం' అనే ఖండికలో

12 శ్రీశ్రీసా. రెండు. వచన. 138 పే.

పైమూడురకాలకు సంబంధించిన మాటలు శ్రీశ్రీ ప్రయోగంలో కొంతవరకున్నాయి. దుర్గం, ముళ్ళదారి, హేమం, కల్యాణం, మేరువులు, పరిచుంబన, గుహ వంటివి. (4) లోక వ్యవహారంలో లేక నిఘంటువుల్లో మాత్రమే ఉండే మాటలు. 'ఉన్మాది మనస్సినీవాలి' అనే ప్రయోగంలో 'సినీవాలి' అనేమాట నిఘంటుశరణ్యమే. అది మృతప్రాయం. దానికి జీవం పోశాడు శ్రీ శ్రీ. 'సినీవాలి' అనేమాటని నిఘంటువ్వర్థంలో కాక వినూత్నార్థంలో వాడాడు. నిఘంటుశరణ్యమైనవే శ్రీశ్రీ వాడిన షడ్జం, ఆవర్తం, చంక్రమణం వంటివి. (5) అన్యదేశ్యాలైన మాటలు. ఇవి తెలుగు నిఘంటువుల్లో ఉండవు. సజీవంగా లోకవ్యవహారంలో ఉంటాయి. మరఫిరంగి, టార్పిడో, రిక్షావాలా వంటివి. (6) కొత్త భావాలకోసం సృష్టింపబడిన కొత్త మాటలు. ఇవికూడా నిఘంటువుల్లో ఉండనివే వ్యవస్థలు మారడం, వైజ్ఞానికపరిణామాలు రావడం మొదలైనవి నూతన భావాలకు మూలం. వ్యక్తావ్యక్తం, వైద్యశాల, శస్త్రికారుడు, గ్రంథాలయం, లోహశ్యేనం, సమ్మె, తిరుగుబాటు, వంటివి. (7) మాటలను కలిపి ఆ మాటలకన్నా నూతనార్థాన్ని సృష్టించే ప్రయత్నం. పర్జన్యశంఖం, ఉష్ణరక్తకాసారం, అగ్ని సరస్సు వంటివి. ఈ పదబంధాలలోని పదాలకు అర్థం తెలిసినంతమాత్రాన పదబంధమంతా అర్థంకాదు. (8) వాడుకలోని మాటలు. ఇవి కూడా నిఘంటువులో ఉండవు. 'నీవేపే' అన్నప్పుడు 'వైపు' అనే దాని వికారరూపం 'వేపు'. (9) ధ్వన్యనుకరణం కోసం సృష్టింపబడేమాటలు. అరె ఝూం ఝూం ఝుటక్ ఫటక్, ఖణేల్ వంటివి. (10) మాండలికాలు. వెళిపోవు, ఒస్తున్నాయి (వస్తున్నాయొస్తున్నాయి) ఏళాను (కేకలేశాను) వంటివి. (11) నూతనక్రియలు. ప్రగల్భించు, అఘోరించు, ఆవర్తించు, సంరావించు, స్ఫురింపించు వంటివి.

## శ్రీశ్రీ వ్యాకరణసంస్కారణం

వ్యాకరణాల సంకెళ్ళు విడిచి, తనకవిత్వంకోసం మాటలు వెలువడ్డాయని చెప్పుకోవడంలో ఎంతో సాహసం ఉంది. భాషాప్రయోగంలో వ్యాకరణం పెట్టే అవరోధాలను తొలగించుకుని అపారమైన స్వేచ్ఛను సంపాదించుకోవాలనే తహతహాయే ఇందుకు మూలం. నియమాల నేర్పరచి భాషను సంకుచితం చేసే వ్యాకరణానికి శ్రీశ్రీ వ్యాకోచం కలిగించాడు. వ్యావహారిక భాష అంటే శ్రీశ్రీకున్న అభిమానం గ్రాంథికవ్యాకరణాన్ని త్రోసిరాజనిపించింది. వ్యాకరణం ఎంత పరిమితమైనదో శ్రీశ్రీ తన వ్యాసాలలో కొన్నిచోట్ల ఉద్ఘాటించాడు.

(1) 'కవిత్వాస్వాదనకు వ్యాకరణం అవసరం కాదని నేననను. నిజమైన వ్యాకరణం అభిరుచిని తీర్చిదిద్దుతుంది కాని కవిత్వాన్ని కొలవడానికి వ్యాకరణం చాలదు'13 అన్నాడు శ్రీశ్రీ.

---

13 శ్రీశ్రీ సా. ఒకటి. కావ్య. 215 పే.

వ్యాకరణకారుడు నూతనకవులకు సంకెళ్ళు వేస్తాడు. చొరవగలవారు ఆ సంకెళ్ళను పగుల గొట్టి నూతనప్రయోగాలు చేస్తారు. వాటిని వ్యాకరణకారుడు తిరిగి ఆమోదిస్తాడు. ఇది స్వేచ్ఛకూ సంయమనానికీ జరిగే పోరాటం. ఇందులోనే భాష అభివృద్ధి పొందుతుంది.

(2) 'సుకవుల్ వ్యాకృతి ఆకృతి మార్చేసే కావ్యాలల్లగలరు'14 అంటూ శ్రీశ్రీయే స్వయంగా అంగీకరించాడు. శ్రీశ్రీ కవిత్వం నూతనవ్యాకరణానికి ఎన్నో లక్ష్యాలను సరఫరా చేస్తుంది. ఉదాహరణకు – 'వెలువడినై, ఒస్తున్నాయి అనే క్రియారూపాల్ని బాలవ్యాకరణం అంగీకరించదు. కాని వీటిని వ్యావహారికోచ్చారణను బట్టి శ్రీశ్రీ స్వీకరించాడు. 'భూమిమీదా భగ్నమౌతాయి' అన్నప్పుడు 'మీదా' అనే దీర్ఘం వ్యాకరణసమ్మతంకాదు. కానీ ఇలాంటి వాటినన్నింటినీ రేపటివ్యాకరణం అంగీకరించక తప్పదు. మౌలికమైన లక్షణాలను శ్రీశ్రీ సాధారణంగా తిరస్కరించడు. విలక్షణ ప్రయోగానికి లోకవ్యవహారాన్నో ప్రత్యేక ప్రయోజనాన్నో ఆలంబనం చేసుకుంటాడు.

(3) 'వ్యవహారాంధ్రం జీవత్ప్రవాహమది వదిలిపెట్టి పాతదయిన స్థాణువయిన గ్రాంథిక భాషను చెవినెవడు పెట్టు నేడు'15 అని శ్రీశ్రీ ఒకచోట ప్రశ్నించాడు. మనకున్న వ్యాకరణం గ్రాంథికభాషదే! గ్రాంథికభాషలాగే వ్యాకరణమూ స్థాణువయిపోయింది. దాని వికాసానికి జీవద్భాష అయిన వ్యావహారికం అవసరం అవుతుంది. 'వెర్రిగాలి ప్రశ్నిస్తూ వెళిపోయింది' అనే వాక్యంలో వెళిపోయింది అనే ప్రయోగం విశాఖమండలంలోని జీవద్భాషలోనిదే! "వెర్రిగాలి ప్రశ్నించుచు వెడలిపోయె" అని గ్రాంథికంలో రాసి ఉంటే శ్రీశ్రీ తన శైలీలక్షణమైన లయను కోల్పోయేవాడు. ముసిల్దొకతె, నీవేపే చూస్తూ ఉంటాయ్, పాడేదీ పాడించేదీ, కావాలోయ్ వంటి ప్రయోగాలనేకం జీవత్ప్రవాహం నుంచి శ్రీశ్రీ చేత స్వీకరింపబడ్డవే.

(4) 'ఒక వాక్యాన్ని పూర్తి చెయ్యకుండా ఇంకోవాక్యాన్ని ప్రారంభించకూడదు. కాని ఒక్కొక్కప్పుడు వాక్యం పూర్తి కాకముందే వక్తృత్వం పూర్తి అయిపోతుంది. అటువంటప్పుడు వ్యాకరణ మర్యాదను పాటించడానికి వ్యర్థపదాలను వాడవలసివస్తుంది'16 అని శ్రీశ్రీ ఒకచోట సూత్రీకరించాడు. వ్యర్థపదాలను పూర్వకవులు వాడటానికి కారణాలలో ఇదొకటి. "నిద్రకు వెల్తైె.... నేనొంటెరినై ....నాగదిలోపల చీకటిలో! చీకటిలోపల నా గదిలో" అనే ప్రయోగంలో వాక్యాలు పూర్తికాకుండానే వక్తృత్వం పూర్తి అయిపోయింది. "గదినిండా నిశ్శబ్దం!

14 శ్రీశ్రీసా. మూడు. వచన. 275 పే.

15 సిరిసిరిమువ్వ శతకం.

16 శ్రీశ్రీ సా. రెండు. వచన. 509 పే.

సాయంత్రం ఆరున్నర! గదిలోపల చినుకులవలె చీకట్లు! గదిలోపల ఏవేవో ఆవిరులు!" మొదలైనవాక్యాలన్నీ అసంపూర్ణాలే.

(5) సంస్కృతి వ్యాకరణాన్ని కూడా శ్రీశ్రీ కొన్నిచోట్ల ధిక్కరించాడు. ఘూర్ణమాన ఘూర్ణమాన దీర్ణమాన గిరిశిఖరాల్ మొదలైనవి - సాహసప్రయోగాలే అన్నారు వ్యాకరణ వేత్తలు. "ఏ చండశాసనుడికీ లేని శక్తి భాషకి ఉంది సంఘానికి పోలీసులు ఎలాంటివారో భాషకి వ్యాకరణం అలాంటిది. ఆస్తివున్నవాళ్ళ నేరాలను పోలీసులు కామాపు చేస్తారు. పండితుల దోషాలను ప్రౌఢప్రయోగాలంటుంది వ్యాకరణం"17 అని శ్రీశ్రీ ప్రౌఢప్రయోగాలను చేస్తూ ఉంటాడు.

శ్రీశ్రీ వ్యాకరణజ్ఞానాన్ని 4 రకాలుగా విశ్లేషించవచ్చు. (1) వ్యాకరణసంప్రదాయాను సరణం (2) నూతనవ్యాకరణసంప్రదాయకల్పన (3) వ్యాకరణ సంప్రదాయసంస్కరణం (4) వ్యాకరణసంప్రదాయతిరస్కరణం. వీటిని వరుసగా ఉదహరిస్తాను. (1) వ్యాకరణ మర్యాదలు తనకు సంకెళ్ళు కానపుడు వాటిని శిరసావహించాడు శ్రీశ్రీ. అసలు రహస్యం ఏమి టంటే వ్యాకరణానికి మూలమైన మహాకవుల ప్రయోగాలమీద శ్రీశ్రీకి గౌరవం ఎక్కువగా ఉంది. అందువల్లనే వ్యాకరణం ఉపాదేయం. రోచిర్నివహం, గరుత్పరిరంభం, మనఃప్రపంచపు టావర్తాలు, శరన్నిశీథినులు, భిక్షువర్షీయసి, మనస్సినీవాలి, క్రొన్నెత్తురు, ధనుర్జ్యుతి, విద్యుత్తేజం, తటిన్మణి, గుంజన్మృదంగాలు, గళన్మంగళ, మొయిల్దారి వంటి ప్రయోగాలను వ్యాకరణమంతా సంకెలగా భావించే కవి చేయలేడు. ఇవన్నీ వ్యాకరణజ్ఞులకు ఆహ్లాదం కలిగించే ప్రయోగాలు.

(2) అన్యభాషలలో కవులను పరిశీలించడంవల్ల శ్రీశ్రీ నూతనవ్యాకరణమర్యాదలను సృష్టించగలిగాడు. ఇవి చాలావరకూ వాక్యసంవిధానాలకు సంబంధించినవి. "నడిరేయాకస మావర్తించిన - మేఘాలావర్షించిన - ప్రచండఝంఝాప్రభంజనం గజగజలాడించిన - నడిసంద్రపు కెరటాల్లో మ్రోగిన - శంఖారావం, ఢంకాధ్వానం" అనే ప్రయోగంలో విశేషణా లన్నీ వాక్యాలలో నడుస్తాయి. ఈ పద్ధతివాక్యం మన వ్యాకరణానికి అచుంబితమే. 'తల్లడిల్లే కెళ్ళగిల్లే పల్లటిల్లే బాటసారి' అనేప్రయోగంలో విశేషణాలు మూడు క్రియాజన్యవిశేషణాలు కావడం వినూతనం. 'కనబడలేదా మరోప్రపంచపు అగ్నికిరీటపు ధగధగలు, ఎర్రబావుటా నిగ నిగలు, హోమజ్వాలల భుగభుగలు' అనే వాక్యసంవిధానంలో శ్రీశ్రీ మాటల పొదుపును సాధించగలిగాడు.

(3) వ్యాకరణాన్ని సంస్కరించాలనే చూపుతోనే శ్రీశ్రీ నూతనక్రియలను సృష్టించ గలిగాడు. విశీర్ణిల్లు, పరిక్లమించు, పరిప్లవించు, విరుతించు, ప్రలాపించు, ఆవర్తించు, వికాసించు, సంఘర్షించు, క్రమించు వంటివి అరుదైన ప్రయోగాలు.

---

17 శ్రీశ్రీసా. రెండు వచన, 132 పే

(4) వ్యాకరణాల సంకెళ్ళను విడవడం వల్లనే వ్యావహారిక భాషనుంచి అనేక ప్రయో గాలను శ్రీశ్రీ స్వీకరించగలిగాడు. విరుచుకు పడండి, ఆకలేసీ, నేనొకణ్ణే, కనుక్కోమంటాయ్, కళ్ళంటూ ఉంటే, అడుగిడినై, తిరుగుతుంటే, అడుక్కునే శక్తిలేదు వంటివెన్నో ఉన్నాయి.

## శ్రీశ్రీ ఛందస్సంస్కరణం

ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి మాటలు వెలువడి, పరుగిడి తన యెదలో అడుగిడి నాయని చెప్పకోడంవల్ల ఛందస్సులను భయంకరమైన బంధాలని చెప్పినట్లయింది. ఏ ఛందస్సులు సర్పపరిష్వంగాలు ? ఎందుకిలా చెప్పవలసివచ్చింది ? చాలా నిదానంగా అర్థంచేసుకోవలసిన విషయం. గణబద్ధచ్ఛందస్సుల మీదనే ఈ దండయాత్ర. మాత్రాబద్ధచ్ఛందస్సులూ వచనగీతాల స్వచ్ఛందగమనాలూ శ్రీశ్రీ మాటలకు సర్పపరిష్వంగాలు కావు.

ఛందస్సుల పరిమితినీ ఔచితినీ ప్రయోజనాన్నీ గురించి శ్రీశ్రీ ఎంతో చర్చ సాగించాడు. ఛందస్సుకు శ్రీశ్రీ భావించిన ప్రయోజనాలేవి? (1) వేగం (2) గద్యభిన్నత (3) గతి (4) నియతి (5) రసావిష్కరణ (ఇందులోవే క్లుప్తత, గుప్తత, రమ్యత, లయ వంటి వన్నీ). ఈ ఐదింటినీ వరుసగా ఉదహరిస్తాను.

(1) "వేగాన్ని సాధించే ఉపాయం ఛందస్సు. ఛందస్సు లేకుండా కూడా ఈ వేగాన్ని తీసుకురావచ్చు .. అనుప్రాసలవల్లనూ, ఒక మాటగాని, కొన్నిమాటలుగాని పునశ్చరణ చేయడం వల్లనూ యమకంవల్లను, వాక్యరూపాన్ని మార్చడం వల్లను వచనగీతంలో ఈ గుణాన్ని సాధించవచ్చును. ఇందుకుగాను కవికి మాటలయొక్క కొలత, బరువు, ఒరపు, texture బాగా తెలియాలి. మాటలోనుంచి ఎంత అర్థం పిండడానికి వీలుందో అంతా అతను పిండుకోగలగాలి. వాటిని ఏరకంగా అమర్చితే ఎక్కువ effect తీసుకురావచ్చునో తెలిసి ఉండాలి"18 ఇవి ఛందస్సు పరిమితిని గురించి శ్రీశ్రీ చెప్పిన మాటలు. ఛందస్సులేకుండా కూడా ప్రబంధ కవులు తమ వచనాల్లో వేగాన్ని తీసుకురాగలిగారు. అయితే ఆ వచనంలో పాదవిభాగం లేదు. పద్యానికి పనికిరాదనుకున్న విషయాన్నే వారు వచనంలో చెప్పారు. శ్రీశ్రీ విషయానికి పద్యం పనికి రాలేదు. వేగం మాత్రమే అవసరమయింది. అందుకే (ఫ్యూడల్) గణబద్ధవృత్తాలను విడిచి వేయవలసివచ్చింది. 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను' అనే గీతంలో ఛందస్సును మించిన వేగం ఉంది. ఇందులో వేగం సాధించడానికి ఛందస్సు ఒక ఉపాయం మాత్రమే. "ఆ చెలరేగిన కలగాపులగపు విలయావర్తపు బలవత్ ఘురవత్ పరివర్తనలో నేనేయే వీధులలో చంక్రమణం చేశానో" అనే పంక్తుల్లో నిర్దిష్టమైన ఛందస్సులేదు. ఛందస్సు

18 శ్రీశ్రీ సా. రెండు. వచన. 505 పే.

లేకుండానే 'వేగం' సాధించబడింది. వేగం సాధించినప్పుడొక గమనం ఏర్పడింది. ఆ గమనం చతురస్రగతి అయి కూర్చుంది.

(2) "పద్యాన్ని గద్యంనించి వేరుచేసి చూపేది ఛందస్సే అయినా ఛందోననుబద్ధంగా రచన సాగించి కావ్యత్వం సాధించడం సాధ్యమే అని వచనగీతాలసంవిధానం రుజువుచేస్తుంది"19 అని వచన గీతకావ్యత్వానికి ఛందస్సు ముఖ్యంకాదన్నాడు శ్రీశ్రీ. ఈ అభిప్రాయం "చెన్న పట్టణపు సముద్రతీరంలో మనం అన్నీ పిచికగూళ్లేనే కట్టింది?" వంటి పంక్తుల్లో రుజువయింది.

(3) "ఛందస్సు గుర్రం వంటిది. గుర్రం ఎటుతీసుకుపోతే అటల్లా వెళ్ళిపోయేవాడు ఆశ్వికుడు కానట్లే, ఛందస్సు లాగుకుపోయినట్లు వ్రాసేవాడు సంవిధానజ్ఞుడుకాడు. మరి ఆ ఛందస్సును లొంగించుకొని దానిచేత చిత్రవిచిత్రరీతులలో కదం తొక్కించినవారినే ప్రశంసిస్తాము"20 అన్నాడు మరోచోట శ్రీశ్రీ. "మరి నిన్ను స్మరిస్తే/నాకగుపించే దృశ్యాలా/వినిపించే భావ్యాలా/అగ్నిసరస్సున వికసించిన వజ్రం/ఎగిరే లోహశ్యేనం/ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం" అనే పంక్తుల్లో 6 పాదాలున్నాయి. ఇవన్నీ ఒకే కొలతలు కలవికావు. 10, 14, 12. 18, 12, 22 మాత్రలుగల పాదాలు. అన్నీ చతురస్రగతిలో నడవవు. అయినా లయ పరిపుష్టంగా ఉంది. ఇదే చిత్రవిచిత్రగతులలో ఛందస్సును నడిపించడం.

(4) "గణాలు లేకుండా పద్యాలు వ్రాయడానికి వీలుంది అంటే ఇదివరకు కొంతమంది ఎగతాళి చెయ్యలేదూ? కాని గణాలు లేని పద్యాలకు కూడా కొన్ని నియమాలు లేకపోలేదు. ఈ నియమాలు గణబద్ధచ్ఛందస్సులకు చెందిన నియమాలు కావు. ఒక్కొక్కప్పుడివి వెనుకటి నియమాలకు కేవలం వ్యతిరేకంగా కూడా ఉండవచ్చును. వెనుకటి కొలబద్దలను తెచ్చి వీటిని విలువ కట్టడానికి ప్రయత్నించకూడదు"21 అని మరోచోట శ్రీశ్రీ స్పష్టంచేశాడు. ఆకాశదీపం ఖండిక గణాలులేని పద్యమే!

(5) "ఛందస్సునుంచి స్వాతంత్ర్యం కోరడంలో కవి రసావిష్కరణకు కావలసిన కొన్ని మూలద్రవ్యాలను సంతరించుకుంటాడు. ఈ మూలద్రవ్యాలు ఉన్నంతకాలం కవిత్వానికి ఛందోరాహిత్యం లోపంకాదు"22 అని మరో రహస్యం బయటపెట్టాడు శ్రీశ్రీ. పదాడంబరంతో కూడిన ఛందోలయవిన్యాసం మీద తిరుగుబాటిది. "అస్మదీయ ప్రఫుల్ల హృదంతరాళ సంస్థిత పవిత్రతర భావసముదయ ప్రదర్శనోత్సుకమతి నొచుఁదమక మొసఁగ దేవ! నీ సన్నిధికి నేగు

---

19 శ్రీశ్రీసా. రెండు వచన. 531పే.

20 శ్రీశ్రీసా. రెండు వచన. 445 పే.

21 శ్రీశ్రీ సా. రెండు. కావ్య. 501 పే.

22 శ్రీశ్రీ సా. రెండు వచన. 504పే.

దెంచినాడ"23 అనే తేటగీతిపద్యంలో ఛందస్సున్నంతగా రసావిష్కరణలేదు. "కడుపు దహించుకు పోయే పసుపుకత్తె రాక్షసరతిలో అర్ధనిమీలితనేత్రాల భయంకర బాధల పాటలపల్లవి" అనే వచనగీత పంక్తుల్లో రసావిష్కరణకు కావలసిన మూలద్రవ్యాలున్నాయి. ఛందస్సు లేకుండా కూడా పై 5 లక్షణాలను సాధించవచ్చునంటాడు శ్రీశ్రీ. ఆ విషయాన్ని ఎలా ప్రతిపా దించాడో చూడండి.

(1) "వచనం నడుస్తుంది. కవిత్వం పరుగెడుతుంది. వచనంచేత పరుగెత్తించి దాన్ని కవిత్వం చెయ్యవచ్చును"24 అన్నాడు శ్రీశ్రీ. "నిప్పులు చిమ్ముకుంటూ నింగికి నేనెగిరిపోతే నిబిడాశ్చర్యంతో వీరు –" అన్నది వచనమే. దాన్ని పరుగెత్తించడానికి పదాదియతి విన్యాసం సహకరించింది. ఇలా కాక "అగ్గి కురుస్తూ నేనాకాశానికెగిరిపోయాను. వీళ్ళు నన్ను ఆశ్చ ర్యంగా చూశారు" అంటే వేగంలేదు. వచనంగా మిగిలిపోయింది. వచనంలో వాక్యాలు విడిపోతాయి. కేవలం అభిప్రాయప్రకటనయే అక్కడ ముఖ్యం. కవిత్వంలో భావవ్యంజనకు వక్త ప్రయత్నిస్తాడు. ఇందుకే పరుగు.

(2) 'ఒకానొక కాలానికీ స్థలానికీ సంబంధించిన దృశ్యంనుంచి వెంటనే ఇంకొక స్థలకాలాల దృశ్యానికి గంతువేసి ఒప్పించుతుంది కవిత్వం. T, S, Eliot వ్రాసిన Waste Land లో ఇందుకు చాలా ఉదాహరణలున్నాయి" 25. ఎగిరించకు లోహవిహంగాలను/కదిలించకు సుప్తభుజంగా లను" అన్నప్పుడు రెండు భావచిత్రాలకు స్థలభిన్నత ఉంది. "వాసంత సమీరం నీవై / హేమంత తుషారం నేనై" అన్నప్పుడు భావచిత్రాలకు కాలభిన్నత కవిపిస్తుంది.

(3) "ఛందస్సుల చండశాసనానికి కూడా కాలం వెళ్ళిపోయింది. కవి హృదయంలోని రాగాలాపన ఎట్టితీగలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి"26 అన్నాడు మరోచోట శ్రీశ్రీ. "మాయంటావా ? అంతా మిథ్యంటావా నా ముద్దుల వేదాంతీ ఏమంటావు ? మాయం టావూ ? లోకం మిథ్యంటావూ ?" అని వ్రాసినప్పుడు హృదయంలోని రాగాలాపన వినవస్తుంది. "తల వంచుకు వెళిపోయావా నేస్తం సెలవంటూ ఈ లోకాన్ని వదలి" అనే వచనపద్యం విషాద రాగానికి బహిస్స్వరూపమే. ఛందస్సులను నిర్ణయించుకుని రాసి ఉంటే వాటికి ఆ సహజత్వం లభించేదికాదు.

---

23 శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 37 పే.

24 శ్రీశ్రీ సా. రెండు, వచన. 504 పే.

25 అదే...

26 శ్రీశ్రీసా. రెండు. వచన. 548 పే

(4) "ఛందస్సుల అశ్వహృదయం తెలియనివాడు సవారీకి తయారుకాకూడదు"27 అని కూడా చెప్పే అధికారం ఉంది శ్రీశ్రీకి. మహాప్రస్థానం, ప్రతిజ్ఞ, జగన్నాథుని రథచక్రాలు వంటివి శ్రీశ్రీని ఛందస్సులకు రాతుగానిరూపించేగీతాలు. (5) "పద్యంలో ఏది చెప్పినా బాగానే ఉంటుంది ఏదీ చెప్పకపోయినా ఏదో చెప్పినట్టే ఉంటుంది"28 అని మరోచోట ఎత్తిపొడిచాడు శ్రీశ్రీ. పద్యానికుండే సంవిధాన తత్పరత్వం మీద ఇది తిరుగుబాటు. ఈచర్చవల్ల తేలుతున్న అంశాలివి. (1) కవి ఛందస్సుకి లొంగిపోరాదు, ఛందస్సునే లొంగదీసుకోవాలి. (2) ఛందస్సే కవిత్వం అనుకోరాదు. ఛందోగుణాలయిన లయ, గతి, వేగం వంటివి కవిత్వానికి లభిస్తేచాలు! (3) గణబద్ధచ్ఛందస్సులు నేటి కాలపుటవసరాలకుగానీ వ్యావహారిక భాషకుగానీ సమాజవాస్తవికతకుగానీ సరిపోవు. (4) మాత్రాచ్ఛందస్సులూ స్వేచ్ఛాచ్ఛందస్సులూ స్వీకరించకతప్పదు.

ఛందస్సును కొండచిలువ కౌగిలింతతో పోల్చడానికి కారణాలను మనం క్రిందివిధంగా క్రోడీకరించవచ్చు :

(1) ఛందస్సులంటే తాను ప్రభవ, స్వర్గదేవతలు (1926-33) రచించిన కాలంనాటి వృత్తాలూ తేటగీతులూను. అవి వాక్యక్రమాన్ని అస్తవ్యస్తంచేస్తాయి. అక్కడి అన్వయక్లేశ కారణం ఆ ఛందస్సే. (2) రసావేశం జలపాతంలా ప్రవహిస్తున్నప్పుడు వ్యవహారానుగుణంగా వచ్చే సహజవాక్యాలు ఛందస్సులలో ఇమడవు. అందువల్ల కృతకవాక్యాలు తయారవుతాయి. ఆవేశం మరుగున పడుతుంది. వేగం కుంటుపడుతుంది. (3) ఛందస్సు మాటలకు పర్యాయపదాలను వెదుక్కోవడానికి దారితీస్తుంది. పాతపడిన పదాలను వాడవలసివస్తుంది. ఇవి జీవద్భాషకు ప్రతిబంధకాలవుతాయి. (4) ప్రాచీన కవులు ఛందస్సులతో కొన్ని గారడీలు చేశారు. ఇవి మాటలకు సర్పపరిష్వంగాలవంటివే! అప్పకవి దీన్ని 'బంధకవిత్వం'గా పేర్కొన్నాడు. ఈ బంధాలలో నాగబంధంకూడా ఒకటి. ఇటువంటివి రసావేశానికి భంగకారణాలవుతాయి.

ఛందస్సులను సర్పపరిష్వంగాలన్న శ్రీశ్రీ ఛందస్సులను వదిలిపెట్టగలిగాడా ? అని చాలా మంది వేసే ప్రశ్న. కవిత్వానికి ఛందస్సే అవసరం లేదని శ్రీశ్రీ ఎక్కడా చెప్పలేదు. ఏ ఛందస్సులైతే మాటల పాలిటి సర్పపరిష్వంగాలవలె ప్రాణభీతి కలిగిస్తాయో వాటినే విసర్జించాడు శ్రీశ్రీ. పాతకొత్త ఛందస్సులనూ దేశిమార్గిచ్ఛందస్సులనూ సమ్మేళనం చేసుకుంటూ లయప్రాసలనూ శ్రుతిగతులనూ ఆధారంగా చేసుకుని నూతనచ్ఛందస్సులను ప్రయోగించాడు. ఛందస్సులలో భాగంగానే పరిగణింపబడ్డ యతిప్రాసలు కూడా కవిత్వానికి "పైసాగసు పూతలు" అయితే వాటిని విడిచివేసి నూతనరీతులను ప్రవేశపెట్టాడు.

---

27 కవితాప్రయోజనం ఖండికలో

28 'అరుణచరణాలు' ఖండికలో

## శ్రీశ్రీ వచనకవితాప్రస్థానం

ఫ్యూడల్ వ్యవస్థనుంచి సమాజం బూర్జువా వ్యవస్థలోకి మారుతూ ఉండగా కవిత్వం వృత్తంనుంచి ముత్యాలసరంలోకి పురోగమించింది. బూర్జువా వ్యవస్థలో ప్రజానీకానికి మాత్రాచ్ఛందస్సుల ద్వారాను నాగరికజనానికి వచనగీతం ద్వారాను కవిత్వం అందజేయబడుతుంది. మాత్రాచ్ఛందస్సులలోనూ వచనగీతంలోనూ కూడా శ్రీశ్రీ తన కవిత్వాన్ని రాయడం ఒక సమన్వయ ధోరణియే. ఫ్యూడల్ ఛందస్సుల సర్వపరిష్వంగం విడిచిన శ్రీశ్రీ మాటలు వచనగీతం **(VERSE LIBRE – Free Verse)**గా రూపొందాయి. కవితా ఓకవితాస్థూలంగా వచనగీతమే! అనుప్రాసలూ సజాతీయశబ్దాలూ వడిగల నడకా" కొన్ని దృశ్యాల రూపచిత్రాల జాబితాద్వారా ఒక మానసికస్థితిని కల్పించడం (Evocation) వచనగీతపు లక్షణాలు అన్నాడు శ్రీశ్రీ.

వచనకవితాప్రస్థానానికి శ్రీశ్రీని మరలించినవేమేమిటి ? ఇందుకు సమాధానంచెప్పడానికి 'కవితా ఓ కవితా' గీతాన్నే ప్రమాణంగా తీసుకుందాం. (1) 'కవితా ఓ కవితా' లోని వడిగల నడకకు మూలం చతురస్రగతి రచనయే. ఈ గతి ధారాప్రాయంగా సాగిపోతుంది. పాదవిభజన గణసంఖ్యను బట్టి జరగదు. అది అనేకరూపాలను యథేచ్ఛగా పొందుతుంది. సాధారణంగా ఈ విభజన పదవిరామాలమీదా వాక్యవిరామాలమీదా భావవిరామాలమీద ఆధారపడి జరుగుతుంది. పాదవిభజన జరిగినా లయవిరామం జరగదు.

(2) కందపద్యంమీద శ్రీశ్రీకి గల ప్రత్యేకాభిమానం వచనగీతం రచనలో అంతర్లీనంగా గోచరిస్తుంది. ఇది కందపద్యాన్ని సాగదీస్తూ చేసిన ఛందఃప్రయోగంలా ఉంటుంది కానీ కందపద్యాన్ని కుంటించితే వచనగీతం కాదనీ ఛందోగమనం రైలుబండి నడకయితే వచనగమనం విమానవిహారం వంటి[29]దనీ శ్రీశ్రీ స్పష్టంచేశాడు. పట్టాలమీదనే స్టేషన్లలో ఆగుతూ పోయేది రైలుబండి. ఆకాశంలో స్వేచ్ఛగా మరింత వేగంతో పోయేది విమానం. ఈ స్వేచ్ఛ, వేగం అనేవి వచనగీతపు ముఖ్యగుణాలు. ఇవి బూర్జువా సమాజ పురోగమనానికి సంకేతాలే.

(3) ఆంగ్లసాహిత్యంలో బూర్జువా వ్యవస్థకు ప్రతీకగా వచ్చిన బహుళశబ్ద చిత్రవచనం **(Poly phonic prose)** శ్రీశ్రీ వచనగీతానికి ఒక ప్రేరణ కావచ్చు. ఇలాంటి వచనగీతాన్ని తెలుగులో తనకన్నా ముందే శిష్ట్లా, అడవిబాపిరాజూ రచించారని శ్రీశ్రీయే ఒప్పుకున్నాడు[30]. ఇంగ్లీషులో AMY LOWELL పాలీఫోనిక్ వచనకవితోద్యమానికి నాయకురాలు. 1914 లో ఆరంభమైనది ఈ ఉద్యమం. ఈ వచనాన్ని ORCHESTRAL FORM అంటారు.

29 శ్రీశ్రీసా. రెండు. వచన. 506 పే.

30 శ్రీశ్రీసా. రెండు. వచన. 506 పే.

దాని లక్షణం "a blending of meter, free verse, rime, assonance, alliteration, and the return i.e. return of dominant image"[31]

(4) తనకన్నా ముందే 'ఫ్రీవర్సు'ను దువ్వూరి రామిరెడ్డిగారూ ముద్దుకృష్ణగారూ రాశారని శ్రీశ్రీ వాఙ్మూలం[32]. ఫ్రీవర్సు ఫ్యూడల్ వ్యవస్థలోని గణబద్ధచ్ఛందస్సులను సవాలుచేసి స్వేచ్ఛను సాధించడంతోపాటు పదాలను రసోద్దీపకం (evocative) గా వాడటంకూడా నేర్పింది. "...the vogue of free verse served to challenge the arbitrary mechanical use of meter and to focus attention on the evocative value of words"[33]

(5) శ్రీశ్రీ వచనగీతంలో వృత్తగంధిపాదాలు కనిపిస్తాయి. జంటమాటలున్నాయి. సమానాక్షర గణాలు గల ద్విపాదివృత్తాలున్నాయి. యతిప్రాసల నియమాలు లేకపోయినా నానా విధాలైన అనుప్రాసలున్నాయి. విచిత్రపదగుంఫనాలున్నాయి. అందువల్ల శ్రీశ్రీ వచనగీతం సకలరీతి సమ్మేళనం గల లయగంధి వచనగీతం. ఇందులో శ్రీశ్రీ చేసిన ప్రయోగం ఏమిటంటే ఐదురకాల ఛందోవ్యవస్థలను కలిపి ఒక నూత్నవ్యవస్థను సృష్టించడం. ఆ ఐదూ (1) మాత్రాచ్ఛందస్సులు (2) కందపద్యం (3) పోలీఫోనిక్ వచనం (4) ఫ్రీవర్సు (5) వృత్తాలు.

శ్రీశ్రీ రాసిన వచనకవిత బహుళశబ్దచిత్రవచనం (Polyphonic prose) కాదు; బహుళశబ్దచిత్రపద్యం (Polyphonic verse) మాత్రమే. పోలిఫోనిక్ పద్యం (Polyphonic verse) గురించి John Gould Fletcher అనే కవి చెప్పినదిది :– "a way of fusing together unrhymed verse libre and rhymed metrical patterns, giving the rich decorative quality of the one and the powerful conciseness of statement of the other"[34]. పోలీఫోనిక్ పద్యంలో ఫ్రీవర్సులక్షణాలూ పద్య/గేయ లక్షణాలూ కలగలిసి ఉంటాయి. 'కవితా ఓ కవితా' గీతం అలాంటిదే.

"ప్రతివచనగీతాన్నీ దేన్ని దానికిగా విశ్లేషించి సమాలోచించాలి" అన్నాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ వచనగీతాల్లో వైవిధ్యం ఉండటమే ఇందుకు కారణం. వాడు, వ్యత్యాసం అనే ఖండికలు 'ఫ్రీవర్సు' కుదాహరణలు. 'ఆకాశదీపం'లో పోలిఫోనిక్ ప్రోజు లక్షణం ఉంది. కవితా ఓకవితా పోలిఫోనిక్ వర్సు లక్షణంగలది. 'కొంపెల్ల జనార్దనరావుకోసం' కొంత పోలిఫోనిక్ ప్రోజుగానూ కొంత పోలిఫోనిక్ వర్సుగానూ నడుస్తుంది.

---

31 SHIPLEY 274 P.

32 శ్రీశ్రీ సా. రెండు, వచన. 506 పే.

33 SHIPLEY 133 P.

34 Introduction to the Study of English Literature 244 P.

'కవితా ఓకవితా'లో పద్యగమనం చెదురుమదురుగా ఉంది. కందం, విద్యున్మాల, విద్యుల్లేఖ, తోటకం స్పష్టంగానే కనిపిస్తాయి. ఏ గణాలను ఆవృత్తంచేస్తే లయ ఏర్పడుతుందో శ్రీశ్రీకి బాగా తెలుసు. మగణ నగణ జగణాలను ఎక్కువగా ఆవృత్తంచేస్తాడు. స్థూలదృష్టికి ఛందస్సును వదిలివేసినట్లు కనిపిస్తూ ఛందస్సంప్రదాయాలను పుష్టికరాహారంగా స్వీకరిస్తూ కొత్తరక్తం సముపార్జించుకుంటూ ఉంటాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ ఆవేశానికి ఛందస్సు లొంగిపోతూ ఉంటుంది. 'లయ' శ్రీశ్రీ వచనగీతానికి ప్రాణధాతువు. ఛందస్సునుంచి లయవైపునకు సాగడం ఫ్యూడల్ సంప్రదాయం. లయనుంచి ఛందస్సువైపుకు సాగడం బూర్జువాప్రయోగం. ఇదే శ్రీశ్రీ వచనకవితా ప్రస్థాన రహస్యం. "When there is no stir of feeling in the poet, there can be no poetry, but when there is no metre, poetic expression cannot acquire the finish and regulated articulate energy which the descipline of verse alone can give. The stir of feeling and metrical form are like impulse and law to the poet, and both are necessary"[35] అన్నట్లు శ్రీశ్రీకి ఆవేశమూ లయవిన్యాసమూ భిన్నభిన్నాలు కావు. రెండూ ఏకధారగానే వెలువడుతూ ఉంటాయి.

## శ్రీశ్రీ వచనగీతంలో ఆవేశవిరామాలు

'కవితా ఓకవితా' అంతా ఒక ఆవేశపూరితకవితాస్తోత్రమే. ఒక అద్భుతానుభవం కలిగినప్పుడు, ఒళ్ళు జలదరించి, గుండెలు కరిగిపోయి, రక్తం స్పందించి, వెలువడిన వాగ్ధారవలె భాసిస్తుందీ వచనగీతం. తానుపొందిన అనుభవసంస్పందనను భాషలోకి అనువదిస్తూ గుక్కత్రిప్పుకోకుండా పాడుకుంటూ పోతున్నప్పుడు ఎక్కడైతే విరామమూ నిశ్వాసమూ అవసరమనిపిస్తుందో అక్కడే ఈ వచనగీతంలో ఆశ్వాసవిభాగం వంటిది ఏర్పడింది. దీన్ని ఆంగ్లంలో STROPHE అంటారు. పద్యంలోనూ గేయంలోనూ నాలుగేసి పాదాలకు విరామం ఉంటుంది. కాని వచనగీతంలో Strophe యే విభాజకాంశం. 'The unit of verse libre is not the foot, the number of syllables, the quantity or the line. The unit is the strophe, which may be the whole poem, or may be only a part. Each strophe is a complete circle.[36] ఇటువంటి భాగాలే కవితా ఓకవితాలో ఎనిమిది కనిపిస్తాయి. అవన్నీ అవిచ్ఛిన్నలయప్రవాహాలు. ఈ భాగాలు ఒక్కొక్కటి ఒక్కొక్క దీర్ఘవాక్యంగా రూపొందాయి. ఈ దీర్ఘవాక్యాలలో తిరిగి కొన్ని ఉపవాక్యాలుంటాయి. కానీ అవన్నీ ఆశ్చర్యార్థకవాక్యాలేకానీ సంపూర్ణవాక్యాలు కావు. ఇంకా నేనేం విన్నానా? అని ప్రశ్నించి ఆ విన్నవాటి నొక జాబితాగా ఇస్తాడు. ఈ జాబితా పూర్తిఅయ్యేదాకా ఆ వాక్యం ముగియదు.

---

35 IBID 246 P.

36 Amy Lowell: See Introduction to the Study of English Literature 244 P.

## శ్రీశ్రీ కవిత్వంలో ఇవొకేషన్

కొన్ని దృశ్యాల రూపచిత్రాల జాబితాద్వారా ఒక మానసికావస్థను సృష్టించే పద్ధతిని శ్రీశ్రీ EVOCATIVE పద్ధతిగా పేర్కొన్నాడు. "వేదాలనుంచి నేటిదాకా EVOCATION అనేది కవిత్వపు ముఖ్యలక్షణాలలో ఒకటి. ఇక్కడ మనస్సు నాకర్షించేది ఛందస్సు కాదు. వరుసగా ఒకదానితర్వాత ఒకటిగా వచ్చే images ఒకానొక మానసికావస్థను, ఒక moodను సృష్టిస్తాయి." 37 అని వివరించాడు. పదాలను, భావచిత్రాలను వ్యంజకాలుగా రసోద్బోధకాలుగా అర్థాంతర స్ఫోరకాలుగా వాడటమే EVOCATION. (Evoke అనే క్రియకు to suggest memories, feelings etc. అని అర్థం. 'The music evoked the mood of spring' అన్నట్లు ఆక్రియను ప్రయోగిస్తారు.) "evocative value of words" శ్రీశ్రీ కవిత్వాని కంతటికీ ముఖ్యలక్షణం. దీని ఆసరాతోనే ఛందస్సును ఆనుషంగికంగా చూడగలిగాడు శ్రీశ్రీ.

"భూకంపాలు, ప్రభుత్వపతనాలు, విప్లవం, యుద్ధం అన్నీ నిశ్చైతన్యం" అన్నప్పుడు ఆపదాల పట్టిక ఒక మానసికావస్థను రేకెత్తిస్తుంది. ఇదే evocation. వచన గీతంలో శ్రీశ్రీ ఇచ్చే జాబితాలు పదచిత్రాలకూ పదాలకూ కూడా సంబంధించి ఉంటాయి. వచనగీతంలో మానసికోద్దీపన (ఇవొకేషన్)ను సృష్టించడానికి (1) సదృశవాక్యపరంపరాప్రయోగం, (2) ఏకవిధ క్రియాప్రయోగం (3) ఆద్యక్షర స్వరసాదృశ్యం (4) పాదాంతసమత (5) విశేషణపరంపరాప్రయోగం (6) శబ్దాలంకారాలు (7) శబ్దచిత్రాలు మొదలైనవాటిని వాడుతూ ఉంటాడు. ఇవన్నీ 'కవితా ఓకవితా'లో ఉన్నవే.

## శ్రీశ్రీపై సింబాలిజం ప్రభావం

కవిత్వానికి ప్రయోజనం ఏమిటి ? అనే మీమాంసకు భిన్నభిన్న కాలాల్లో భిన్నభిన్న సమాధానాలు వచ్చాయి. ఈ సమాధానాలే భిన్నభిన్నసాహిత్యవ్యవస్థలను సృష్టించాయి. శ్రీశ్రీ తన కవితాయాత్రలో ఈ సాహిత్యవ్యవస్థలను దాటుతూ మార్క్సిజంలోకి ప్రవేశించాడు. ఆ సాహిత్యచంక్రమణ క్రమం ఇది –

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| రొమాంటిసిజం | → | సింబాలిజం | → | ఫ్రాయిడిజం | → | మార్క్సిజం |
| వ్యక్తివాదం | → | వ్యక్తివాదం | → | వ్యక్తివాదం | → | సమష్టివాదం |
| మనఃశ్లాఘనం మనోరంజనం | → | బ్రహ్మానుభవం | → | మనోబాధా విముక్తి | → | సమష్టిబాధా విముక్తి |

కవితా ఓ కవితాలో ఈ క్రమాన్ని సూచించాడు. భావకవిత్వం నుంచి సింబాలిజంలోకి పురోగమించిన శ్రీశ్రీ కవితాసంగీతమే (Poetical music) బ్రహ్మానుభవాన్ని కలిగిస్తుందని

37 శ్రీశ్రీ సా. రెండు. వచన. 503పే.

భావించాడు. అందుకే ఛందస్సును పూర్తిగా వదులుకోలేదు. కవితా సంగీతం ఎంతగొప్పదో 'కవితాఓకవితా'లో సూచించాడు. తనను మంత్రించిన సమ్ముగ్ధం గావించిన గాంధర్వం" అది! "తారానివహపు ప్రేమ సమాగమంలో జన్మించిన సంగీతం' అది ! తన "నాదుల తీగలపై సాగిన నాదబ్రహ్మపు పరిచుంబన"లో "ప్రాణావసాన వేళాజనితం" అది! "నానాగానానూనస్వానావళితం బ్రతుకును ప్రచండ భేరుండ గురుత్వపరిరంభంలో పట్టినది"- ఆ సంగీతమే! ఇటువంటి సంగీతానికి ఛందస్సే ఆలంబనం.

కవిత్వంలో సంగీతానికి పట్టంకట్టిన ఉద్యమం సింబాలిజమే! "In the Poetry of the symbolist, words and music were one. Baudelaire announced the intimate union. Poetry joins music by a prosody whose roots plunge deeper into the human soul than any classical theory indicates."[38] "ఆరోహణావరోహణాలతో మంద్రంనుండి తారందాకా ఉద్రేకఝంఝ, ఉత్సాహకంప ఉలుకెత్తించి ఉగ్రరూతలూగించి జీవితాన్ని నక్షత్రగోళాల రాగమాలా ఆలాపనలతో హోరెత్తించడం" అనేదే (శ్రీశ్రీ మాటల్లో) సింబాలిస్టుల ధోరణి. తాను కవిత్వంకోసం చేసిన అన్వేషణలో 'నక్షత్రాంతర్నిబిడనిఖిలగానం' విన్నానన్నాడు శ్రీశ్రీ. అంతేకాదు; లక్ష నక్షత్రాలమాటలు, కోటిజలపాతాల పాటలు, శతకోటి సముద్రతరంగాల మ్రోతలు శ్రీశ్రీకి వినిపించాయి. ఇదంతా సింబాలిజం ప్రభావమే.

ఈ సంగీతంలో తన పాపాలన్నీ ప్రక్షాళితమయ్యాయని సింబాలిస్టులాగే అనుకున్నాడు. అందువల్లనే ఆనందవశంవదహృదయుడయ్యాడు. మేలుకున్న సకలేంద్రియాలు గలవాడయ్యాడు. నిర్వికల్పసమాధిలో నిర్వాణం పొందిన ప్రాణం గలవాడయ్యాడు. సింబాలిస్టుకవి ఈ నిర్వికల్ప సమాధిలోనే సంగీతం సృష్టిస్తాడు. అతని లక్ష్యం కవితాసంగీతమే (Poetical music) కాని సంగీత కవిత్వం (Musical poetry) కాదు.

కవితా సంగీత స్రష్టలైన ఎడ్గార్ అల్లన్‌పో, బాడ్లెయిర్, స్విన్‌బర్న్‌లు ముగ్గురూ శ్రీశ్రీకి ఆరాధ్యదేవతలయ్యారు. "అందుకోదగిన ఇంద్రియాలున్నవారికి" అల్లన్‌పో గీతాల్లో "గంధర్వ సంగీతం అనుక్షణానుభూతం" అవుతుందని శ్రీశ్రీ అభిప్రాయం. పాపపుష్పాలు (బాడ్లెయిర్ ఖండిక) చదివినప్పుడు 'మాఘపూర్ణిమ మంచుతెరల సోయగం' ఆవరిస్తుందనీ స్విన్‌బర్న్‌గీతాలలో "సంగీతపుహాయి" ఉందనీ మెచ్చుకున్నాడు శ్రీశ్రీ. మోహినీ గంధర్వగీతం అతడిదే!

ఇటువంటి కవితా సంగీతమే శ్రీశ్రీని మంత్రించి సమ్ముగ్ధుణ్ని చేసినది. ఈ సంగీతం సుఖ దుఃఖాదిక ద్వంద్వాతీతం, అమోఘం, అగాధం. అచింత్యం, అమేయం, ఏకాంతం, ఏకైకం, క్షణికమై శాశ్వతమైన దివ్యానుభవం - బ్రహ్మానుభవం కలిగించి తనను కరగించిన కవిత్వమే! సంగీతం, కవిత్వం, మోక్షం మూడూ కలిసిపోయాయి ఇదిపూర్తిగా సింబాలిస్టు వైఖరియే.

38 Critics and Criticism 195

కవితా సంగీతం బ్రహ్మానుభవాన్ని కలిగించిందనడంలో ఒక విశేషం ఉంది. కళలవల్ల బ్రహ్మానుభవం కలుగుతుందనేది అపూర్వమైన ప్రతిపాదన. కవిత్వంవల్ల బ్రహ్మానంద సబ్రహ్మచారి అయిన రసానందం కలుగుతుందన్నారు ప్యూడల్ భారతీయాలంకారికులు. అది విగళిత వేద్యాంతరమైన ఆనందం!

బ్రహ్మానుభవం అనేది వేదాంత పరిభాషే. దానికి విశేషణాలుగా చెప్పబడినవన్నీ ఆ పారిభాషిక పదజాలమే కూడాను. కవితాసంగీతం వల్ల బ్రహ్మానుభవం కలిగిందనడం శుద్ధకళావాదమే. తాను తప్ప మరేదీకాని కవిత్వం బ్రహ్మపదార్థంవంటిదని శ్రీశ్రీయే అన్నారు సింబాలిజం తాను తప్ప మరేదీ కానిదే!

## శ్రీశ్రీపై ఫ్రాయిడిజం ప్రభావం

మన సత్త్వశాస్త్రదృష్ట్యా కవిత్వ ప్రయోజనాన్ని నిర్దేశించడం ఫ్రాయిడ్‌ప్రభావంవల్ల వచ్చింది. లోకయాత్రలో భయవిహ్వలుడైన మానవుణ్ణి ఆ భయనుంచి తొలగించగల్గింది కవిత్వమే. జీవితభయాలకు పాడలెత్తి సన్యాసం తీసుకోవడంకాక కవిత్వంవల్ల జీవితంమీద అనురక్తుడవుతాడు మనిషి. "నేనీ భూలోకంలో పడి సుఖదుఃఖాలేవేవో వస్తూంటే తలదాలిచి ప్రపంచ పరిణాహంలో ప్రయాణికుడనై పరివ్రాజకుడనై విహ్వలంగా వర్తించేవేళ అభయ హస్తముద్రతో నన్నుదరిసిన నన్నుపునీతుని కావించిన కవితా" అనడంలో అంతరార్థమిదే. "విశ్వకటాహంలో వ్రేగిపోతున్న కోటికోటిమానవుల ఘోటుఘోటు మని కొట్టుకునే విహ్వలత్వం, శాధలూ, విభ్రమత్వం, వ్యాధులూ సకలవికలమనోవస్థలనూ Sublimate చేసి స్ఫటీకరణ"39 చేయవలసిందిగా కవిని అర్థించాడు శ్రీశ్రీ.

సమాజం పెట్టే కట్టుబాట్ల వల్ల మానవుడు తనకు సహజంగా కలిగే వాంఛల్ని అరికట్టుకోవలసి వస్తుంది. ఆ కోరికలకు ఫ్రాయిడ్ రెండు విముక్తిమార్గాలను పేర్కొన్నాడు. మొదటిది : రిప్రెషన్. రెండవది : సబ్లిమేషన్ మన ఇచ్ఛ ద్వారా కోరికను బలవంతంగా అణిచివేసుకోవడమే రిప్రెషన్. ఇదే మనోబాధలకు హేతువు. ఈ అణిచివేయబడిన కోరికలు అవ్యక్త మానసం (మనోవల్మీకం)లో సుప్తదశలో ఉంటాయి. పరివ్రాజకుని విహ్వలత్వానికివే కారణాలు.

లలితకళల ద్వారా సుప్తవాంఛల్ని ఉదాత్తీకరించడం సబ్లిమేషన్. వాస్తవప్రపంచంలో తీరడానికి అవకాశంలేని కోరికలను కళలు తీరుస్తాయి. అందుకే కళ కల వంటిదవుతుంది. "To wrestle with nature, to give our hate a creative material outlet, are still higher forms of sublimation. To dance, to write love poetry, to pay the woman we love the

39 శ్రీశ్రీసా. రెండు వచన. 457 పే.

compliments of service or speech are the ways in which we civilise sex. Thus these instincts whose blind strength might make us their blind slaves, acknowledges us as their masters and increase our spontaneity because they are given a conscious and therefore social adaptations"[40] అన్నట్లు కళలవల్ల కోరికలే మనిషికి బానిసలవుతాయి. కవిత్వమే మనిషికి అభయహస్తముద్రపడుతుంది.

జనని గర్భంలో ఆకారం లేకుండా నిద్రిస్తున్న తన అహంకారానికి ఆకలి గొల్పించినది కూడా కవిత్వమే అంటాడు శ్రీశ్రీ. తన బహిరంతరింద్రియాలలో ప్రాణం ప్రసరించడానికి కవిత్వమే కారణం అయిందట. కవిగానే తాను పుట్టాడు. కవిత్వమే తన జనని. మనోబాధావిముక్తి కోసం శ్రీశ్రీ రచించిన ఖండికల్లో ఒకరాత్రి, కళారవి, దేనికోరకు, కేక, ఒక క్షణంలో, అద్వైతం వంటి వాటిని పేర్కొనవచ్చు.

## శ్రీశ్రీపై మార్క్సిజం ప్రభావం

తాను చంక్రమణంచేసిన సాహిత్యవీధులలో రాజవీధి మార్క్సిజం. సింబాలిజం ఫ్రాయిడిజంలు శ్రీశ్రీ వ్యక్తిగతకవితాప్రయోజనాలకు దీపికలెత్తితే మార్క్సిజం శ్రీశ్రీ సామాజికదృక్పథాన్ని వెలిగించింది. ఇందువల్ల, బ్రహ్మానందాన్నీ మనోబాధావిముక్తినీ కవితాప్రయోజనాలుగా భావించిన దశ నుంచి సమాజశ్రేయస్సును కవితాప్రయోజనంగా భావించే దశకు శ్రీశ్రీ పరివర్తన చెందాడు. కలగాపులగపు విలయావర్తాలనుంచి శ్రీశ్రీ పూర్తిగా పరివర్తన చెందాడు. అందుకే "నా రచనలలో లోకం ప్రతిఫలించి నా తపస్సు ఫలించి నా గీతం (ప్రజల) గుండెలలో ఘూర్ణిల్లగ నా జాతిజనులు పాడుకొనే మంత్రంగా మ్రోగించాలని నా ఆకాశాలను లోకానికి చేరువగా నా ఆదర్శాలను సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వల జడిగా" అనే పంక్తుల్లో తన పరిణతకవితాధ్యేయాన్ని నిర్దేశించుకున్నాడు శ్రీశ్రీ. ఈ ధ్యేయంలో నాలుగు అంశాలు కనిపిస్తున్నాయి. (1) వాస్తవికత (2) లయాత్మకత (3) విప్లవప్రేరణ (4) హృదయంగమత్వం. ఈ నాలుగూ అభ్యుదయకవిత్వాని కావశ్యకాలు.

(1) తనకవిత్వంలో లోకం ప్రతి ఫలించాలనడం వాస్తవికతా వాదం.

(2) "తనగీతం గుండెలలో ఘూర్ణిల్లగ తన జాతిజనులు పాడుకునే మంత్రంగా మ్రోగించాలనుకోవడం" తనకు సంగీతకవిత్వం మీాద ఉండే మమకారానికి నిదర్శనం. "పాడేదీ పాడించేదీ" "పెనునిద్దుర వదిలించేదీ" నవకవనానికి కావాలనడం ఇందుకోసమే.

(3) తన ఆకాశాలు లోకానికి చేరువగా తన ఆదర్శాలు సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వల జడిగా కావాలనడం లోకపుటన్యాయాలూ కాల్చే ఆకలి, కూల్చే వేదన,

---

40 ILLUSION and REALITY –150 P,

దారిద్ర్యాలూ దౌర్జన్యాలూ పరిష్కరించే బహిష్కరించే బాటలు తీస్తాననడం, పాటలు వ్రాస్తాననడం ఒకటే! తన ఆకాశాలూ ఆదర్శాలూ సామ్యవాదంతోనూ సమాజ విప్లవంతోనూ ముడిపడినవే.

(4) ఒకప్పుడు కవిత్వం "దూరంగా వినువీథుల్లో విహరించే అందని అందం". దానినే ఇప్పుడు "లోకానికి చేరువగా" తీసుకురాదలచాడు. ఇప్పుడు కూడా "అందీఅందకపోయేదే" కవిత్వం. అయినా కవితాచేలాంచలాల కొసగాలులు అందుతాయి. వాటితోనే నిర్మిస్తాడు కవిత్వాన్ని. అందువల్ల అది కవితామతల్లికి గుడి (నివాసం) అవుతుంది. తన గీతం హృద్య నైవేద్యం అవుతుందే కానీ నినాదప్రాయంగా మిగిలిపోదు.

## శ్రీశ్రీ సమన్వయ కవితావాదం

తన గీతం "రసవిస్మృమరకుసుమపరాగం" కావాలని, "రసధుని" కావాలని శ్రీశ్రీ చరమ లక్ష్యం. సామాజికప్రయోజనం గల కవితకైనా రసాత్మకత నిషిద్ధంకాదు. కదిలేదీ కదిలించేదీ ఈ రసాత్మకతవల్లనే సిద్ధిస్తుంది. అణగారిన ఆర్తులంతా విప్లవశంఖం పూరించడానికైనా కావలసింది ఉద్రేకమే. రసశబ్దం శృంగారపరంగా బూజుపట్టిపోయింది. వీరకరుణ భయానక భీభత్సాదులూ రసాలే. శ్రీశ్రీ Applied Poetry సిద్ధాంతం రసవిరహితవాక్యరచనకు సంబంధించిందని ఎవరూ అనలేరు— శ్రీశ్రీ రచనలను చూస్తే.

రసాత్మకతనూ సామాజికప్రయోజనాన్నీ కలిపి Applied Poetry అనే కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించినది శ్రీశ్రీయే. అభ్యుదయకవిత్వానికిదే కీలకమైన సిద్ధాంతం. ఇది శ్రీశ్రీ సాహిత్యంలో సాధించిన అద్వైతం.

ఇందువల్ల శ్రీశ్రీ అభ్యుదయవాది మాత్రమేగాక సమన్వయవాదికూడా అవుతున్నాడు.

## శ్రీశ్రీ ఇష్టపదజాలం

ప్రతికవికీ ఇష్టమైన పదజాలం కొంత ఉంటుంది. అది అతని రసావేశానికీ ఊహలకీ దృక్పథానికీ అంటిపెట్టుకునే ఉంటుంది. కృష్ణశాస్త్రికి విభావరి, ప్రేయసి, సంధ్య, బాష్పం, హృదయం. జలదం, తుషారం, ముంగురులు, ప్రసవం, అంధకారం, వియోగం, ప్రవాసం వంటివి ఇష్టపదజాలం. వీటికి రంగు, రుచి, సువాసన ఉండి తీరాలి. రొమాంటిసిజం వదలి రియలిజంలో అడుగుపెట్టిన శ్రీశ్రీ పదజాలం విభిన్నమయింది. పీడిత జన జీవితవాస్తవికతనూ జాగృతినీ ప్రతిబింబించే పదజాలమిది. వీటికి వాడి, వేడి, చేదు, కదలిక, లయ, విప్లవం, యాథార్థ్యం, evocation వంటివి ప్రధానలక్షణాలు. శ్రీశ్రీ ఇష్ట పదజాలాన్ని క్రింది విధంగా విభజించుకోవచ్చు.

(1) సంస్కృతపదజాలం:- ఘోష, చైతన్యం. భాష్యం, ఆవర్తం, ఉన్మాది, చంక్రమణం,

మస్తిష్కం, ప్రభంజనం, సినీవాలి, విప్లవం, యుద్ధం, మృదంగం, ప్రపంచం, శక్తి, సముద్రం, జ్వాల, ఆహుతి, దాహం, ప్రళయం, నగ్నం, భయం, పరివర్తన, అభ్యుదయం, అనాథులు, సాహసి, శ్మశానం, విరామం, పరిశ్రమ, కర్షకుడు, ఘర్మం, యంత్రం, కార్మికుడు, విలాపం, విషాదం, అన్యాయం, దారిద్ర్యం, దౌర్జన్యం, వ్యథ, యథార్థం, కళేబరం, అపస్వరం, శాసనం, సూర్యుడు, వ్యసనం, భవిష్యం, విలయం, కాహళ, చరిత్ర, ఉద్యోగం, బీభత్సం, పిశాచం, గతం, సంసారం, హంతకుడు, అజ్ఞానం, సామ్రాజ్యం, వ్యక్తి, జాతి, ధర్మం, ఋక్కులు సంఘం, రాజ్యం, ఇతిహాసం, సత్యం, నాగరికత, సామాన్యుడు, నిర్మాణం, దేశం, అన్యాయం, కర్మం, ఘోరం, దారుణం, ఆచారం, వ్యత్యాసం, పరాజయం, రాజకీయం, సంక్షోభం, సంఘర్షణ, స్వాతంత్ర్యం మొదలైనవి.

(2) సంస్కృతపదబంధాలు :- శంఖారావం, ఢంకాధ్వానం, భూకంపం, జలపాతం, బలివితర్ది, నరజాతి, నవజీవనం, నరలోకం, ఖడ్గమృగం, కపాలగణం, ఆకాశదీపం, ఝంఝానిలం, జ్వాలాతోరణం, మహాప్రస్థానం, రథచక్రం, పద్మవ్యూహం, విషవాయువు, నరహంత, రణరంగం, ఖండాంతరం, దండయాత్ర, న్యాయస్థానం, పురోగమనం, ఆత్మహత్య మొదలైనవి.

(3) తెలుగుపదాలు :- ఉరి, కేక, సమ్మె, నెత్తురు, బావుటా, ఆకలి, రాబందులు, సంకెళ్ళు, కొలిమి, కొడవలి, నాగలి, గొడ్డలి, కూడు, మూలుగు, చలి, ఎముకలు, బానిస, గానుగ, పీనుగు, చేదు, అప్పు, పొగ, దయ్యం, ఆవిరి, నిప్పులు, దోపిడి, గోడలు, వాడలు, కళ్లెం, గొళ్లెం, కన్నీళ్ళు, కత్తులు, వంతెన, చట్టం, మోసం, ముట్టడి, రాళ్ళు, ముద్ద, చెమట వంటివి.

(4) తెలుగుపదబంధాలు :- వేగుజుక్క, పాడుకల, ఎంగిలాకు, పెద్దమనిషి, పేకమేడ, చెరసాల, ఉరికొయ్య, తాగుబోతు, పడుపుకత్తె, పొగగొట్టం, బిచ్చగాడు, నేరగాడు మొదలైనవి.

(5) అన్యదేశ్యాలు :- కూలీ, నగారా, కార్ఖానా, తుపాను, రిక్షావాలా, కళాసీ, తారీఖు, దస్తావేజు, ఖర్చు, మతలబు, జమీందారు, మనీపర్సు, ఫిరంగి, టార్పిడో, టోర్నాడో వంటివి.

(6) ఉపసర్గలతో కూడిన పదాలు :- సమీక్షణ, ప్రచండ, సంస్పందన, ప్రక్షాళిత, పరిచుంబన, సమ్ముగ్ధం, అభ్యుదయం, విక్రాంతి, విరావం, సమర్పణం, సమర్చనం, వినుతించు, విరచించు, అనాథులు, సముజ్జ్వల, పరిచ్యుతుడు, సంఘర్షణ వంటివి. ఇవి శైలికి ఉదాత్తత కావలసినపుడు వాడుతూంటాడు. అర్థసముద్దీపనం కూడా వీటి ప్రయోజనం.

## శ్రీశ్రీ పదబంధరచనా శిల్పం

సంప్రదాయాన్ని నూతనీకరించుకోవడం శ్రీశ్రీ పదబంధాల్లో అడుగడుగునా కనిపిస్తుంది. వీటిని ప్రధానంగా నాల్గువిధాలుగా విభజించవచ్చు. (1) కొన్ని పదబంధాలు భాషలో అతి ప్రసిద్ధాలు. అందువల్ల అవి అరిగిపోయినట్లుగా ఉంటాయి. వాటిని అనుకరించి నూతనపదబంధాలు సృష్టించడం ఒకప్రయోగం. వాతావరణం అనే పదబంధానికి అనుకృతిగా గీతావరణం, స్వర్గద్వారానికి దీటుగా సర్గద్వారం వెలువడ్డాయి. విశ్వసృష్టి - విశ్వవృష్టిగా, గదాఘాతం - పదాఘాతంగా, విద్వత్తేజం - విద్యుత్తేజంగా, ఘర్మజలం - ధర్మజలంగా, సమరరంగం - సవనరంగంగా మారడానికి మూలసూత్రం ఇదే. (2) పాతపదాలనూ, కేవలం నిఘంటువుల్లో పడిఉండే పదాలనూ వాడటంలో శ్రీశ్రీ చూపే వివేచన అదొక సంవిధానం. ఆ పదాలను వ్యస్తంగా వాడక మరొక పదంతో కరగ్రహణంసంధించడంద్వారా వాటికి ప్రాణం పోస్తాడు. సినీవాలి మనస్సినీవాలిగా మారి మిలమిలలాడింది. భేకం అనే పదం భేకంబాకా అయి కొత్తదనం తెచ్చుకుంది. కులాయం మస్తిష్క కులాయం అయింది. వల్మీకం మనోవల్మీకం అయింది. పరిష్వంగం సర్పపరిష్వంగం అయింది. పరిరంభం గరుత్పరిరంభం అయింది. కవాటం మంత్రకవాటమయింది. కౌముది స్వచ్ఛకౌముది అయింది. నిక్వాణం కంకణనిక్వాణం అయింది. హల్లీసకం కవనపుహల్లీసకం అయింది. హంత నరహంతిగా మారాడు. (3) శ్రీశ్రీ పదబంధరచనలో స్వీయతాముద్ర నిర్ణిద్రం. సర్పపరిష్వంగం, విలయావర్తం, గరుత్పరిరంభం, అగ్నిసరస్సు వంటి పదబంధాల్లో భావోద్దీపనశక్తి ఉంది. (4) పదాలకు కొత్తవాతావరణం, అభినవగమనం, నూత్నజీవం కలిగిస్తాడు శ్రీశ్రీ. అందని అందం, వికసించిన వజ్రం, చావుబ్రతుకుల సంధ్యాకాలం, ఆకటిచీకటిచిచ్చులు, నక్షత్రాలమాటలు, కొసగాలులు వంటివి సరికొత్తరచనలు.

## వికసించిన విద్యుత్తేజం! చెలరేగిన జనసమ్మర్దం!

1937 ఆగస్టు 3

వ్యక్తిగతమైన అనుభవాలను మధురమధురంగా వ్యక్తంచేయడం ప్రధాన లక్ష్యంగా గల భావకవి కవితాప్రయోజనానికి కాక కవితాసంవిధానానికి ప్రథమతాంబూలం సమర్పించుకున్నాడు. కానీ నిర్దిష్టమైన కవితాప్రయోజనంతో శ్రీశ్రీ తెలుగు కవితారంగంలోకి ప్రవేశించాడు. అందువల్ల కవితాసంవిధానం కూడా దానికి తగినట్లే రూపొందింది. కదలిక, మార్పు, జాగృతి, పురోగమనం, సుఖజీవనం ఇవి శ్రీశ్రీ కవితా ప్రయోజనాలు. యశస్సు, ధనార్జన, వ్యవహారం, శివేతరక్షతి, సద్యఃపరనిర్వృతి, కాంతాసమ్మితంగా ఉపదేశం వంటి ఫ్యూడల్‌కవితా ప్రయోజనాల స్థానంలో కొత్తవి ప్రవేశించాయి. ప్రాచీనప్రయోజనాల్లో కొన్ని కవికీ కొన్ని పాఠకులకూ కొన్ని కృతిభర్తకూ మాత్రమే. నవీనప్రయోజనాలన్నీ సమాజానికంతటికీ. కవికి ప్రత్యేకంగా కవిత్వంవల్ల ప్రయోజనం లేదు. తన కవిత్వం కార్మికలోకపుకల్యాణానికి! తన కవిత్వం స్వార్థంకోసం కాదు; పరార్థం కోసమే! భావకవిత్వం ప్రాథమికంగా స్వార్థంకోసమే. సమానధర్ములెవరైనా ఉంటే వారు దాన్ని అనుభవించవచ్చు.

శ్రీశ్రీకి కవిత్వప్రయోజనం పట్ల వినూత్నమైన అవగాహన ఎందుకు కలిగింది? ఒక వర్గాన్ని కవిత్వంద్వారా సముద్ధరించాలనే ఆశయం ఎందుకు కలిగింది? 20వ శతాబ్ది రాజకీయ సాహిత్యసామాజిక పరిణామాలే స్థూలంగా అందుకు కారణం. (1) 1918 తో ఒకయుద్ధం ముగిసింది. కానీ మళ్ళీ జర్మనీలో జపాన్‌లో ఇటలీలో స్పెయిన్‌లో సామ్రాజ్యదాహం గల పైశాచికశక్తుల విజృంభణం రెండవ ప్రపంచయుద్ధానికి సన్నాహాలు చేస్తోంది. 1930లో వచ్చిన ఆర్థికసంక్షోభం ప్రపంచమంతటా నీడలా పరుచుకుంది. ఈ ప్రాపంచిక పరిస్థితులను చూసి చేసుకున్న నిర్ణయమే–సాహిత్యం ఒక నిర్దిష్టమైన సాంఘికరాజకీయ ప్రయోజనం సాధించే సాధనం కావాలనేది. (2) కేవలం మానవతాదృష్టిమాత్రమే సాహిత్యానికి సరిపోదు. పీడితజనావళికది విప్లవశంఖం కావాలి. ఈ ప్రయోజనానికి దూరమైన సాహిత్యం ప్రపంచమంతటా నిరర్థకంగా భావించబడింది. 1932లో ఇంగ్లాండులో వెలువడిన New Signatures అనే కవితా సంకలనం ఈ వర్గదృక్పథంగల నవకవుల రచనలే. ఈ ఉద్యమానికి అక్కడి నాయకుడు ఆడెన్. ఈ ఉద్యమానికి ప్రతిస్పందనే శ్రీశ్రీ 'నవ్యకవిత్వం'. (3) లండన్ అభ్యుదయరచయితలు 1930లలో తమ

మేనిఫెస్టోప్రకటించి సాహిత్యవిప్లవాన్ని ఆహ్వానించారు. ప్రపంచంలో జరుగుతున్న ప్రభుత్వ పతనాలు, యుద్ధాలు, విప్లవాలు మానవజాతి పురోగమనానికి దోహదం చేసే తీరుతెన్నులను శ్రీశ్రీ ఆ మేనిఫెస్టో వెలుగులో కనుగొన్నాడు. కనుక వర్గ దృక్పథంతో సమాజాన్ని గురించి రాయడం ఎంత ప్రధానమో అదే దృక్పథంతో కవితాలక్షణాలను గురించి చెప్పడం కూడా శ్రీశ్రీకి అంతే ప్రధానమయింది. 1934 లో ఋక్కులు, 1937 లో ప్రతిజ్ఞ, కవితా ఓకవితా రచించడం ద్వారా నవ్యకవిత్వ లక్షణచర్చను పరోక్షంగానూ ప్రత్యక్షంగానూ నిర్వహించాడు శ్రీశ్రీ కొంతవరకూ. నవకవితాసామగ్రిపై రసాలనూ ధ్యేయాలనూ గురించి ప్రతీకలతో స్ఫురింపజేశాడు. ప్రయోజనాలను సూచించాడు.

## శ్రీశ్రీ రసాభినివేశం

శృంగారం రసరాజంగా పరిగణించబడిన ఫ్యూడల్‌వ్యవస్థ ఎక్కువమందికి కడుపునిండిన కాలం. ఆ శృంగారమే తిరిగి రసరాజంగా పరిగణించబడాలంటే కావలసింది సామ్యవాదవ్యవస్థ. దోపిడికి గురిఅవుతూ అధికసంఖ్యాకులు కూటికి కూడా మొగంవాచిన మానవుడి ప్రధానసమస్య ఆకలియే కాని కామంకాదు. అందువల్లనే పీడితవర్గపు కవి అయిన శ్రీశ్రీ శృంగారానికి దూరమై పోయాడు. శృంగారం వ్యక్తిగతానుభవం. ఎవడి శృంగారం వాడిదే! కవి సృష్టించే శృంగారం సామాజికుడనుభవించడానికి సమానధర్మం కారణం అవుతుంది. బూర్జువావ్యవస్థలో ధనికవర్గం వారి రసం శృంగారంకాగా పీడితవర్గంవారి రసం కరుణ మవుతోంది. పీడితులే తిరుగుబాటు చేయ డానికి వీరరసం అవసరమవుతుంది. కరుణానికి రామాయణంలోలా శృంగారం సహాయకం కాదిక్కడ. పీడితులు కోల్పోయింది ప్రేయసినికాదు; జీవితసుఖాలనే. వాటి కోసమే వారు పడేబాధ. పీడితుల వాస్తవజీవితాలు బీభత్సనిలయాలు. వారి జీవితాన్ని ఆక్రమించేది భయానకం. ఈ విధంగా శృంగారేతర రసాలుమాత్రమే పీడితజనవృత్తానికి సన్నిహితమవుతున్నాయి.

పీడకులైన బూర్జువాలు వ్యక్తిగతంగా శృంగారాన్ని ఆశ్రయించినట్లే సమష్టిగా భక్తిని రసంగా స్వీకరిస్తారు. పీడకవర్గరసాలపట్ల శ్రీశ్రీకి సానుభూతి ఉండకపోవడంలో వింతలేదు. అందుకే ఆ రసాలను పరిహాసం పాలుచేస్తాడు. విప్లవం ఎన్నో పరిణామాలను వేగంగా సాధిస్తుంది. కనుక శ్రీశ్రీ అద్భుతరసాభిమాని అవుతున్నాడు. శ్రీశ్రీకి రసాభినివేశమైతే ఉంది కానీ రస ప్రయోజనం అలౌకికానందం అనడం మీద నమ్మకంలేదు. శ్రీశ్రీదృష్టిలో రసప్రయోజనం లౌకిక చైతన్యం మాత్రమే!

ఫ్యూడల్‌వ్యవస్థలో తొలిదశలో నవరసాలకూ తుల్యప్రాధాన్యమే ఉన్నా ప్రబంధ యుగంలో శృంగారమూ భక్తీ ప్రముఖస్థానానికి వచ్చాయి. భావకవితాయుగంలో ఈ రసాలే సంస్కరింపబడ్డాయి. కానీ శ్రీశ్రీ పీడితపీడకవర్గసమాజపువాస్తవజీవితాలలోని రసాలనేతీసుకున్నాడు.

పురాణయుగం → ప్రబంధయుగం → భావకవితాయుగం → శ్రీశ్రీ యుగం
నవరసాలు → శృంగారం, భక్తి → అమలినశృంగారం మధురభక్తి, కరుణం } రౌద్రం, భయానకం, బీభత్సం అద్భుతం, వీరం, హాస్యం, కరుణం,
పురాణపాత్రలు → నాయికానాయకులు → వ్యక్తులు → పీడితపీడకవర్గాలు

## రౌద్రరసంమీద శ్రీశ్రీ అభినివేశం

నవకవిత ఖండికలో శ్రీశ్రీ సూచించిన రసాలు నాలుగు. అవి రౌద్ర, భయానక, బీభత్స, అద్భుతరసాలు. ఈ నాల్గింటిని క్రమంగా పరిశీలిద్దాం!

పీడితులమీద నిష్కారణంగా క్రోధం ప్రకటిస్తారు పీడకులు. మరి పీడితులు కూడా అంతా సంక్షుభితవిస్తే పీడకవర్గంమీద రుద్రమూర్తులు కాక తప్పదు. శ్రీశ్రీ చిత్రించేది పీడితవర్గ రౌద్రాన్నే! "సిందూరం, రక్తచందనం/,బంధూకం, సంధ్యారాగం/ఎగరేసిన ఎర్రనిజెండా/, రుద్రాలిక నయనజ్వాలిక/, కలకత్తా కాళిక నాలిక" - ఎర్రరంగు గల ఈ జాబితా అంతా పీడితవర్గంయొక్క రౌద్రరసాన్ని అభివ్యక్తంచేస్తుంది. పులిచంపినలేడినెత్తురు పీడకుల రౌద్రాన్ని వ్యక్తం చేస్తుంది. మహాప్రస్థానం, అవతారం, జ్వాలాతోరణం, ప్రతిజ్ఞ వంటి ఖండికలలో పీడితవర్గపు రౌద్రభావం వ్యక్తంచేయబడింది దేశచరిత్రలు, వాడు, జగన్నాథునిరథచక్రాలు వంటి ఖండికల్లో పీడకవర్గపు రౌద్రభావం సూచ్యమయింది.

రౌద్రరసాభివ్యంజకపదచిత్రాలు నవకవితలో ప్రధానంగా మూడే ఉన్నాయి. (1) ఎగరేసిన ఎర్రనిజెండా: సామ్యవాదవిప్లవానికి రాజకీయోద్యమచిహ్నం అరుణపతాకం. దీన్ని శ్రీశ్రీ అభిమానిస్తాడు. ఎగరేసిన ఎర్రని జెండా, ఎర్రబావుటా నిగనిగలు కార్మిక వర్గపు ధర్మసంగ్రామాన్ని సూచించేవే! (2) 'రుద్రాలికనయనజ్వాలిక': ఇది పాత ప్రపంచానికి వచ్చేవిలయాన్ని సూచిస్తుంది. నటధూర్జటి నిటాలాక్షి రగిలి, నిటాలాక్షి పటాలుమని ప్రపంచాన్ని భయపెట్టిందంటూ రెండవప్రపంచయుద్ధం జరుగుతున్నప్పుడు శ్రీశ్రీ ప్రళయసూచన చేశాడు. (3) కలకత్తా కాళిక నాలిక: ఇది దుష్టసంహారోత్సాహాన్ని సూచిస్తుంది. కనకదుర్గ, కలకత్తాకాళిక పీడితశక్తికి సంకేతాలే! దుష్టదానవులైన ఫాసిస్టుల్ని ఆ శక్తియే ఖండిస్తుంది. సిందూరం, బంధూకం, సంధ్యారాగం, రక్తచందనం అనే నాలుగు సంకేతాలూ అరుణిమను సూచించేవే.

## భయానకరసం మీద శ్రీశ్రీ అభినివేశం

బూర్జువావ్యవస్థ సామాన్యులకు భయం కలిగిస్తుంది. కానీ సామాన్యులు విజృంభించి బూర్జువాలకు కూడా భయం కలిగించగలరు. కనుక అభ్యుదయకవిత భయానకరసానికి ఆలవాలం అవుతుంది. ఘూకెక్కిన గంధకధూమం/పోటెత్తిన సప్తసముద్రాలు/రగులుకొనే రాక్షసిబొగ్గు/

బుగులుకొనే బుక్కాగుండా/వికసించిన విద్యుత్తేజం/చెలరేగిన జనసమ్మర్దం"- ఈ జాబితా భయానకరసవ్యంజకమైనదే. ఈ అభ్యుదయకవితాసామగ్రి సంక్షోభాన్నీ ఉద్రేకాన్నీ వేడిమినీ సూచిస్తుంది. భయానకరసానికి చెందిన పెక్కు పదచిత్రాలను పాఠకులు మహాప్రస్థానంలో గుర్తుపట్టవచ్చు. మహాప్రస్థానం జయభేరి, అభ్యుదయం, అవతారం, జ్వాలాతోరణం, సాహసి, కవితా ఓ కవితా, బాటసారి, ప్రతిజ్ఞ, సంధ్యాసమస్యలు, కేక, వాడు, దేశచరిత్రలు, గర్జించు రష్యా, జగన్నాథుని రథచక్రాలు, కొంపెల్ల జనార్దనరావు కోసం వంటి ఖండికలన్నింటిలోనూ భయవ్యంజకపదచిత్రాలు కనిపిస్తాయి. భయానకరసాభి వ్యంజకపదచిత్రాలు నవకవితలో ప్రధానంగా మూడే కనిపిస్తాయి. (1) పోటెత్తిన సప్తసముద్రాలు : ఇవి ప్రజాసమూహాలకు ప్రతీకలే. పోటెత్తిన అనే విశేషణంతో యుద్ధంచేసే ప్రజల్ని పొంగిన సముద్రాన్ని వ్యక్తం చేశాడు. ప్రజాసంక్షోభం అభ్యుదయ కవితకు ప్రేరణ. చెలరేగిన జనసమ్మర్దం, పోటెత్తిన సప్త సముద్రాలూ ఒకటే. అనాథులంతా అశాంతులంతా దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో విప్లవశంఖం వినిపిస్తారనీ కార్మికులు కర్షకులు తాడితులు పీడితులు కెరటాలుగా పొంగి తిరగబడతారనీ శ్రీశ్రీ తెలిపే హెచ్చరిక. (2) రగులుకొనే రాక్షసిబొగ్గు: ఇది పారిశ్రామికవిప్లవానికీ యంత్రచలనానికీ జ్ఞాపిక. యంత్రాలమీద శ్రామికులూ, శ్రామికులమీద పెట్టుబడిదారులూ ఆధారపడతారు. 'గనిలో వనిలో కార్ఖానాలో పరిక్లమిస్తూ పరిప్లవిస్తూ ధనికస్వామికి దాస్యంచేసే - యంత్రభూతముల కోరలు తోమే కార్మికధీరులే' చివరికి రగులుకొనే రాక్షసిబొగ్గులవుతారు. ఈ పదచిత్రానికి అనుబంధాలే బుగులుకొనే బుక్కాగుండా, ఘూటెక్కిన గంధకధూమం అనేవి. కణకణమండే త్రేతాగ్ని, భుగభుగమండే హూమజ్వాలలు, కొలిమినిప్పులు, గంధకజ్వాలలు, గుగ్గిలపు ధూమం వంటివి శ్రీశ్రీ సృష్టించిన భయంకర పదచిత్రాలు. (3) వికసించిన విద్యుత్తేజం: భావకవి వెన్నెలను ప్రేమిస్తే పారిశ్రామికయుగపుకవి విద్యుత్తును అభిమానిస్తాడు. విద్యుత్తేజోవికాసమే అంధయుగానికి స్వస్తి చెప్పింది. శుద్ధసౌందర్యవాదం నుంచి శ్రామికసౌందర్యవాదానికి కవుల దృష్టిని మరలించింది. జీవన విధానాన్నీ ఉత్పత్తివిధానాల్నీ విప్లవీకరించింది. అజ్ఞానాన్నీ జడత్వాన్నీ పారద్రోలడంలో ప్రముఖపాత్ర వహిస్తోంది. అగ్నిసరస్సున వికసించిన వజ్రం - ఒకకోటి జలపాతాల పాటలు, శివసముద్రమూ నయాగరా వలె ఉరకడం వంటి పదచిత్రాలను వికసించిన విద్యుత్తేజం నుంచే శ్రీశ్రీ అల్లుకున్నాడు.

### బీభత్సరసంమీద శ్రీశ్రీ అభినివేశం

యుద్ధదాహంతో అల్లాడిపోతున్న సామ్రాజ్యవాదులూ పైశాచికక్రీడలతో ఆనందిస్తున్న ఫాసిస్టులూ సామాన్యుడి జీవితంలో బీభత్సం సృష్టిస్తున్నారు. ప్రపంచం నిండా ఉన్న ఈజుగుప్సనీ వికృతత్వాన్నీ అభ్యుదయకవి చూస్తాడు. తన కవిత్వంలో పునఃసృష్టిస్తాడు. వ్యథార్తజీవితయథార్థ

దృశ్యాలన్నీ బీభత్సరసానికి ఆలవాలాలే. కరుణరసానికి మరో ప్రక్క బీభత్సరసమే. వికలత, విచ్ఛేదం ఎక్కడుంటాయో అక్కడే దుఃఖం కూడా ఉంటుంది. కానీ ప్రగతివాది దుఃఖిస్తూ కూర్చోలేడు. బీభత్సాన్నీ, బీభత్సానికి కారణాలనూ చిత్రించి, ప్రతిచర్యకు పురికొల్పుతాడు

'రాబందుల రెక్కల చప్పుడు/ పొగగొట్టపుభూంకారధ్వని/ అరణ్యమున హరీంద్రగర్జన/ పయోధరప్రచండ ఘోషం/ఖడ్గమృగోదగ్రవిరావం/ఝంఝానిలషడ్జధ్వానం'— ఈ జాబితా అంతా బీభత్సరస వ్యంజకమైనదే. ఈ నవకవితాసామగ్రి రకరకాలైన ధ్వనులు. ఇవి చప్పుళ్ళూ అరుపులూను. ఈ ధ్వనులన్నీ విశ్రాంతిలేక అల్లకల్లోలంలో మునిగి తేలుతున్న ఈ బూర్జువాప్రపంచాన్నీ యుద్ధదాహంతో అల్లాడిపోతున్న సామ్రాజ్యవాదుల్నీ శ్మశానప్రాయాలైన యుద్ధరంగాలనూ హింసారిరంసనీ వ్యక్తంచేస్తున్నవే. 'శృంగారం రసాలకు రాజు అన్నారేగాని ఇవాళ దాని సింహాసనం లాగేస్తున్నాం...నిజం చెప్పాలంటే నేడు బీభత్సానిది రాజ్యం...బీభత్సానికి ముడిసరుకులు పిశాచాలూ శ్మశానాలూ కపాలాలూ సృగాలాలూ మాత్రమే అనుకున్నావు కాబోలు! పిడికెడు బుగ్గిలో భీతిని చూపిస్తానన్నాడు కవి...[1]అంటూ ఒకచోట బీభత్సప్రాధాన్యాన్ని వివరించాడు శ్రీశ్రీ. "కరుణరసం, శృంగారం వాడిన పూరేకులు! వీరరసం, బీభత్సం ఈనాటి తుపాకులు" అనీ "బీభత్సం రసరాట్టు! దాని స్థాయి జుగుప్స! అజీర్ణానికౌషధమది! అనవసరం విచికిత్స!" అనీ "అసహ్యాన్ని పుట్టించడమన్నదే నా హితభావన! ఎవరిమీద ఎందుకోసమన్నది మీ అవగాహన!" అనీ ఇంకా స్పష్టంచేశాడు శ్రీశ్రీ.[2] పీడితజనపక్షపాతి అయిన కవి తనచుట్టూ దోచుకు తింటున్న వర్గాన్ని చూసి అసహ్యాన్నీ కసినీ ద్వేషాన్నీ పెంచుకోకమానడు. అందరినీ సహించి అందరినీ ప్రేమించడం ఆత్మవంచన అవుతుంది; కానీ ప్రజాహిత భావన కాజాలదు.

కరుణానికి కూడా ఉద్వాసన చెప్పి కర్తవ్యానికి పురికొల్పడంలోనే వీరరసం అగ్రస్థానానికి వచ్చింది. శ్రామిక వీరరసానికి ప్రేరణ సమాజజీవితంలోని - ప్రపంచంలోని బీభత్సమే అవుతుంది. అందుకే బీభత్సాన్ని (జుగుప్సను)అంతగా అభిమానించాడు శ్రీశ్రీ. సామాజిక బీభత్సాన్ని వ్యక్తంచేసే పదచిత్రాలు కవితా ఓకవితా, భిక్షువర్షీయసి, బాటసారి, చేదుపాట, ఒకరాత్రి, ఆకాశదీపం, దేశచరిత్రలు, గర్జించురష్యా, జగన్నాథుని రథచక్రాలు వంటి ఖండికల్లో కనిపిస్తాయి.

బీభత్సరసాభివ్యంజకాలైన పదచిత్రాలు నవకవితలో ఆరున్నాయి. (1) రాబందుల రెక్కలచప్పుడు : ఇది యుద్ధరంగంలో హతులైనవారి శవాలు పడిఉండటాన్ని సూచించే పదచిత్రం. అసలు సామ్రాజ్యవాదులే రాబందులనే సూచన ఉంది. ఇందులో ప్రథమప్రపంచ

---

1 శ్రీశ్రీ సా. రెండు. వచన. 328 పే.

2 మరో మూడు యాభయిలు 25 పే.

యుద్ధంలో మరణించిన కోట్ల జనావళినిది జ్ఞాపకం చేస్తుంది. రెండవ ప్రపంచయుద్ధం జరిగాకా ఇది ఎంత దారుణమో తెలియవచ్చింది. అందుకే 'ఈ శతాబ్ది నేలుతుంది బీభత్సరసాయనం' అన్నాడు శ్రీశ్రీ. ఈ బీభత్సం సామ్యవాదం అవతరిస్తే కానీ ఆగదు.

ఇంకిన, తెగిపోయిన, మరణించిన క్రొన్నెత్తురు, విపంచికలు, యువయోధులు, బాటసారి కళేబరం, ఉరితీయబడ్డ శిరస్సు, ఎముకముక్క కొరుక్కునే కుక్క, కరికళేబరం, ఖండపరశుగళ కపాలగణములు, చితులుంచిన చోట్లు, పిశాచగణసమవాకారం, మరణించిన జనసందోహం వంటి పదచిత్రాలు రాబందులరెక్కల చప్పుడుకు సన్నిహితమైనవే!

(2) 'పొగగొట్టపు భూంకారధ్వని' ద్వారా ఫ్యాక్టరీయజమానుల అహంభావంకూడా సూచ్యమయింది. 'వాడు' ఖండికలో చిత్రింపబడిన పెట్టుబడిదారు దౌర్జన్యం ఈ పొగగొట్టపు భూంకారధ్వని వంటిదే! రగులుకొనే రాక్షసిబొగ్గు, బుగులుకొనే బుక్కాగుండా, ఘాటుక్కిన గంధకధూమం ఫ్యాక్టరీల వాతావరణాన్ని జ్ఞాపకంచేసేవే!

(3) 'అరణ్యమున హరీంద్రగర్జన' అనే పదచిత్రం రెండర్థాలను ప్రతిపాదిస్తుంది. బల వంతుల బెదిరింపు లేదా, విప్లవశక్తుల విజృంభణం. అరణ్యం అవ్యవస్థకు ప్రతీక అయితే హరీంద్రుడు విప్లవనాయకుడవుతాడు. ఇలా శ్రీశ్రీ ప్రతీకలు పరస్పర భిన్నాలయిన అర్థాలను ప్రతిపాదిస్తూ ఉంటాయి. 'కనకదుర్గాచండసింహం జూలుదులుపి ఆవులించింది' అన్నచోట సింహం పీడితపక్షం లోనిదే! అందుకే హరీంద్రుడూ పీడితజన నాయకుడే కావాల్సి ఉంటుంది. హృదంతరాళం గర్జించమనడం, రష్యాను గర్జించమనడం కూడా ఈ అభిప్రాయాన్నే బల పరుస్తాయి.

(4) 'పయోధర ప్రచండఘోషం'లో పయోధరుడెవడు? సంపన్నుడా? శ్రామికుడా? సంపన్నుడు శ్రామికుడిమీద విరుచుకుపడతాడు. శ్రామికుడు సంపన్నుడి మీద తిరగబడతాడు. ఒకటి వర్తమానం. రెండవది భవిష్యత్తు. 'వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె పెళపెళ పెళపెళ విరుచుకుపడండి' అని పీడితులకే శ్రీశ్రీ హెచ్చరిక. భువనఘోషకు విచ్చిమోసిన వెర్రిగొంతుక, ఆకలికేకలు, సంవర్తపు తుపాను మేఘపుతొలిగర్జన, కారడవులలో లయాతీతమై విరుతించిన నానాజంతుధ్వనులు, విప్లవశంఖారావం మొదలైనవి పయోధరప్రచండ ఘోషం వంటి పద చిత్రాలే!

(5) 'ఖడ్గమృగోదగ్రవిరావం'లో ఖడ్గమృగం ఆయుధధారియైన సైనికుడికి సంకేతం. ఈ సైనికులు సామ్రాజ్యవాద ప్రతినిధులా? సామ్యవాద విప్లవసేనలా? నెత్తురుమండే శక్తులునిండే సైనికులారా రారండి హరోం హరోం హర... అని కదలండి' అనే పిలుపులో ఉంది సమాధానం. మహాప్రస్థానంలో ఎక్కడా ఆయుధాలు ధరించి తిరుగుబాటు చేయమనలేదు శ్రీశ్రీ. అందులోది

చాలావరకు భావవిప్లవమే. కానీ మరఫిరంగులు తెచ్చి మందిచ్చి విమానబాహువులు విసురుతూ రష్యానుయుద్ధం చేయమంటాడు. సామ్రాజ్యవాదుల విషవాయువు, మరఫిరంగి, టార్పిడోల ప్రయోగాన్ని వివరిస్తాడు. ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగరావం విన్నానంటాడు.

(6) 'ఝంఝానిల షడ్జధ్వానం'లో ఝంఝానిలం అల్లకల్లోలానికీ తిరుగుబాటుకీ ప్రతీకే. వానతో కూడిన గాలియొక్క హోరునే "షడ్జధ్వానం" అని సంకేతించాడు. సంగీతస్వరాల్లో మొదటిది షడ్జం. విప్లవారంభదశే షడ్జధ్వానం. విప్లవాన్ని విచిత్రభావనతో చెప్పడం శ్రీశ్రీ సంవిధానం. ఝంఝానిలమూ కాదు షడ్జధ్వానమూ కాదు శ్రీశ్రీ కోరుతున్నది. ఆ రెండింటి ద్వారా విప్లవాన్ని స్ఫురింపించడమే. యుద్ధగుంజన్మృదంగాలు, రెక్కవిప్పిన రివల్యూషన్, ప్రభంజనం, పుడమితల్లికి పురుటినొప్పులు, శంఖారావం, ఢంకాధ్వానం, విప్లవశంఖం, కదనశంఖం, హాలాహలం, విలయం, జలపాతం, త్రేతాగ్ని, కాసారం, కంచునగారా, అగ్నికిరీటం, ఎర్రబావుటా, యజ్ఞోపవీతం, భువనఘోష, బలివితర్ది, పద్మవ్యూహం, ఆకాశతార, అవతలిగట్టు, పర్జన్యశంఖం, మహారథం, వంటివన్నీ శ్రీశ్రీ విప్లవభావనకు ప్రతిబింబాలే.

## అద్భుతరసంమీద శ్రీశ్రీ అభినివేశం

పారిశ్రామికవిప్లవంతో బూర్జువాలు అనేకమైన అద్భుతాలు సృష్టించినా, అవి మానవులందరికీ అందుబాటులోకి రావడంలేదు. సామ్యవాదవిప్లవం అన్నిటినీ అందరికీ సమానంగా పంచిపెట్టి నిజంగా మరిన్ని అద్భుతాలను సృష్టించగలదు. ఆ విప్లవం తేగల వర్గం శ్రామికవర్గం. కదలిక, ఘర్షణ, మార్పు అనేవి ఈ విప్లవానికి మూలసూత్రాలు. ఈ విప్లవమే అద్భుతాలను తీసుకువస్తుంది. 'కదిలేదీ కదిలించేదీ/మారేదీ మార్పించేదీ/పాడేదీ పాడించేదీ/మునుముందుకు సాగించేదీ/పెనునిద్దుర వదిలించేదీ/పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ' నవకవనానికి కావాలనడంలో అద్భుతరసానికి ప్రాధాన్యం కలుగుతోంది. విస్మయాపాదకమైన మార్పులు భవిష్యత్ సత్యాలు. ఇవి ఏ దివ్యశక్తివల్లనో జరిగేవికావు. వీటిని మానవుడే తీసుకురాగలడు. కనుక సామాజిక చైతన్యమే సాహిత్యప్రయోజనమవుతుంది. మహాప్రస్థానంలోని గీతాలు చైతన్యం, పరిణామం, ఉత్సాహం, పురోగమనం, జాగరణం, జీవనం అనే నవయుగలక్ష్యాలను ప్రతిపాదిస్తున్నాయి. ఇవన్నీ అద్భుతరసభావాలే!

కవిత్వంలోని భావనద్వారా శ్రీశ్రీ ఎన్నో అద్భుతాలను చవిచూపిస్తాడు. మరోప్రపంచం పిలిచిందనీ మరోప్రపంచపుజలపాతం వినిపించిందనీ ఎనభైలక్షలమేరువులు ఎగిరిపడుతున్నాయనీ సముద్రాలు జలప్రళయనాట్యం చేస్తున్నాయనీ మరోప్రపంచపుకంచునగారా మ్రోగిందనీ మరో ప్రపంచపుఅగ్నికిరీటం ధగధగలాడుతోందనీ ఎర్రబావుటా నిగనిగలాడుతోందనీ మరోప్రపంచం ధరిత్రినిండా నిండిందనీ చెప్పడం అద్భుతంగానే కనిపిస్తుంది. స్మరిస్తే పద్యం వస్తుందనీ అరిస్తే

వాద్యం పుడుతుందనీ తానే ఒక దుర్గాన్ననీ తనదే ఒక స్వర్గమనీ చెప్పుకోవడం విస్మయావహమే. ఇలాంటి వింతలు శ్రీశ్రీ భావనలో అడుగడుగునా కనిపిస్తాయి. జయభేరి, అవతారం, కవితా ఓ కవితా, ప్రతిజ్ఞ, భిక్షువర్షీయసి, శైశవగీతి, అద్వైతం, గర్జించురష్యా, జగన్నాథుని రథచక్రాలు మొదలైన ఖండికల్లోని భావచిత్రాలెన్నో విస్మయాపాదకాలుగా కనిపిస్తాయి.

'పదండి ముందుకు పదండి త్రోసుకు పోదాం పోదాం పైపైకి' అనే అభ్యుదయ నినాదం పునాదిమీదనే శ్రీశ్రీ కవితాదుర్గమంతా నిర్మింపబడింది. అది మయసభవలె అనేక చిత్ర విచిత్రాలతో నిండి ఉన్నది. అభ్యుదయకవిత్వపు అద్భుతప్రయోజనాలేమిటో నవకవితలోని ఆఖరిగేయం సూచిస్తోంది. ఈ ప్రయోజనాలు ఆరుగా సూత్రీకరింపబడ్డాయి.

(1) కదిలేదీ కదిలించేదీ నవకవనానికి కావాలనడంవల్ల కదలనిదీ కదిలించలేనిదీ దాని కక్కరలేదని సూచ్యం. అయితే ఈ సూత్రంలో విషయనిర్దేశం లేదు. ఎలా సాగదీస్తే అలా పనికివచ్చే సూత్రం ఇది. అయినా భౌతికవాదంతోనే ఈ సూత్రాన్ని వ్యాఖ్యానించాలి. కదలనిది గతం, జడం. కదిలించనిది నిస్సారవిషయం – నీరససంవిధానం. కదిలేది వర్తమానం; కదిలేది యంత్రం; కదిలేది కాలం. కదిలించేది వివేచన, ఆవేశం, ప్రేరణ, ఆశయం, విప్లవం- అన్నీ ఒకలాంటివే. కదలిక పుట్టిందా సాహసి అర్ధరాత్రి అవతలిగట్టుకు చేరడానికి తయారై పోతాడు. శ్రామికులు త్రాచులవలెనూ రేచులవలెనూ ధనంజయునిలా సాగుతారు. శివసముద్రమూ నయాగరావలె ఉరుకుతారు. పీడితుడు భువనభవనపు బావుటాయై పైకి లేస్తాడు. గొలుసు త్రెంచుకు ఉరుకుతాడు. నురుగులెత్తే పరువు పెడతాడు. జూలుదులుపుకు ఆవులిస్తాడు. ఘీంకరిస్తూ సవాల్ చేస్తాడు. రంకెవేస్తూ కదిపి గెంతుతాడు. కదలికవల్లనే జనసమ్మర్దం చెలరేగుతుంది. సుప్తభుజంగాలను కదిలిస్తాడు సాహసి. లోహవిహంగాలను ఎగిరిస్తాడు. ముళ్ళదారి అని సంకోచించకుండా సంచరిస్తాడు. మానమృదంగాలను పలికిస్తాడు. విప్లవశంఖం వినిపిస్తాడు. ప్రతిసమస్యగురించీ ప్రశ్నిస్తాడు. ప్రపంచాన్ని పరిహసిస్తాడు. గోడలను పగుల గొడతాడు. తిరగబడతాడు. నిరాశామయలోకంలో కదనశంఖం వినిపిస్తాడు. వెంటనే మరో ప్రపంచానికి కదలండి అంటాడు.

(2) మారేదీ మార్పించేదీ:– మారేవి జీవితం, సమాజం, వ్యవస్థ, కాలం మొదలైనవి. మార్పించేవి ఆలోచన, పరిసరాలు, విప్లవవాంఛ వంటివి. మార్పించనిది నవజీవనానికి నవకవితకూ అనవసరం. ఈ సూత్రంవల్లనే శ్రీశ్రీ భావకవిత్వాన్నీ శుద్ధకవిత్వాన్నీ తిరస్కరించింది. బాటలు నడచీ పేటలు కడచీ కోటలన్నిటిని దాటడం ఈ మార్పుకోసమే! ఫ్యూడలిజంనుంచీ కేపటలిజం

నుంచీ సోషలిజంలోకి సమాజం మారాలి. కవిత్వం మార్పించాలి. ప్రపంచాగ్నికి సమిధ నాహుతిచ్చిన శ్రామికుడు ప్రపంచాబ్జపు తెల్లరేకుగా మారాలంటాడు శ్రీశ్రీ. సాహిత్యంలోనూ సమాజంలోనూ శ్రీశ్రీ కోరిన మార్పు లనేకం. ఉదాహరణకు - గ్రాంథికభాషనుంచి ప్రజాభాషలోకి మార్పు; గణబద్ధచ్ఛందస్సులనుంచి మాత్రాబద్ధచ్ఛందస్సులలోకి మార్పు; భోగ మనస్తత్త్వంనుంచి శ్రమమనస్తత్త్వంలోకి మార్పు; యథాస్థితివాదంనుంచి విప్లవవాదంలోకి మార్పు; జాతీయవాదంనుంచి అంతర్జాతీయవాదంలోకి మార్పు; తిరోగమనంనుంచి పురోగమనం లోకి మార్పు; మూఢవిశ్వాసాలనుంచి హేతువాదంలోకి మార్పు; తాటస్థ్యంనుంచి నిబద్ధతకు మార్పు. ఇటువంటి మార్పులే అభ్యుదయానికి సోపానాలుగా శ్రీశ్రీ భావించాడు. మార్క్సిజం నిర్దేశించిన మార్పే శ్రీశ్రీ కోరుతున్నది.

(3) పాడేదీ పాడించేదీ:- పాడేది ఉత్సాహంగలగొంతు; శ్రమపడుతున్న జీవి. పాడేది పాట. పాడేది పాడదగినది. పాడించేవి ఉత్సాహం, ఆవేశం, శ్రమ. పాడనిది మూగగొంతు; పాడించనిది మూర్ఛ; జడత్వం; నిద్ర. పాట సమాజచైతన్యానికొక సాధనం కనుకనే శ్రీశ్రీ మాత్రాచ్ఛందస్సులవైపు మళ్ళాడు. కవిత్వం శ్రామికచైతన్యంకోసం నిర్దేశింపబడినప్పుడు పద్యం కానీ వచనంకానీ సరిఅయిన సాధనాలు కావు. అవి రెండూ ఫ్యూడల్, బూర్జువావ్యవస్థల చిహ్నాలు. ముత్యాలసరం వాడుకభాషకు సరిపోయే పాట. చతురస్రగతి, త్ర్యస్రగతి గేయాలు లయకు ఒరవడులు. అభ్యుదయకవిత పద్యాన్ని తిరస్కరించింది. కానీ పద్యలయను కాపాడుకుంది. కదంతొక్కేవారికి పదంపాడటం అలవాటు. ఆకలేసినవాడికి కేకలే శరణ్యం. విశ్వవీణకు తంత్రి కావాలనడంలో పాటలమీద శ్రీశ్రీకున్న ఉత్కంఠ వెల్లివిరిసింది. పీడితుల భయంకర బాధలు 'పాటలు'గానే వినిపించాయి శ్రీశ్రీకి. స్విన్‌బర్న్‌నుంచి శ్రీశ్రీ నేర్చింది కవితాసంగీతమేఅయినా సంగీతకవిత్వంగా దాన్ని మార్చుకుని పాటనూ మాటనూ కలుపుకున్నాడు. లోకపుటన్యాయాలూ కాల్చేఆకలి, కూల్చేవేదన, దారిద్ర్యాలూ దౌర్జన్యాలూ బహిష్కరించడానికి శ్రీశ్రీ పాటలనే సాధనంగా తీసుకున్నాడు. తాను వినిపించే 'నవగీతి'కి పల్లెలలోని వృత్తికార్మికులే దారి చూపించారట! బానిసలు 'చేమిపాట' పాడుకుంటే ఉన్మాది కూనిరాగపు పాట పాడతాడు.

(4) మునుముందుకు సాగించేది:- మునుముందుకు సాగించేవి కర్తవ్యస్ఫూర్తి, అభ్యుదయ కాంక్ష, విజ్ఞానశాస్త్రఫలితాలు, పరిశ్రమలు, ఉత్సాహశీలం వంటివి. వార్ధక్యం, సోమరితనం, భోగలాలస, జడత్వం, మూఢవిశ్వాసాలు, సంప్రదాయమమకారం వంటివి మునుముందుకు సాగనీయవు. కదిలేదీ కదిలించేదీ మునుముందుకు సాగించేదీ ఒకటే. ముఖ్యారాఖ్యా అవాంతరాలెన్ని ఉన్నా ముందుదారి అభ్యుదయవాదులది. ఉన్నచోటు చాలుననీ ఇంకా వెనక్కిపోతామనీ అనేవారు తిరోగమనవాదులు. ప్రగతిశీలభావాలను ప్రచారంచేయడం అభ్యుదయకవిత్వ

ప్రధానలక్ష్యం. ఎముకలుక్రుళ్ళిన వయస్సుమళ్ళిన సోమరులు మునుముందుకు సాగలేరు. అందుకే వారిని చావండి అని శపిస్తాడు శ్రీశ్రీ. ప్రగతిశీలభావాలు లేని ఖండికలు మహాప్రస్థానంలో లేవు.

(5) పెనునిద్దుర వదిలించేది:- భౌతికవాదిదృష్టిలో మతం, మూఢవిశ్వాసం, అజ్ఞానం వంటివి పెనునిద్దురకు కారణాలు. అవగాహన, ఆలోచన, వాస్తవం, అధ్యయనం, అనుభవం వంటివి నిద్రను వదిలించేవి. కవిత్వం మేలుకొల్పాలి కాని జోకొట్టకూడదని శ్రీశ్రీ నిష్కర్ష.[3] ఈ మేలుకొల్పు విప్లవాభిముఖంగానే. నిద్రపోతున్న సామాజికులు సమాజంలోని దోపిడీని గ్రహించలేరు. అలాంటివారినే శ్రీశ్రీ కనబడలేదా మరోప్రపంచపు ఎర్రబావుటా నిగనిగలు అంటూ నిలదీసి ప్రశ్నిస్తాడు. నిద్రపోతున్నవాడికి నిజం తెలియదు. అతడికి సరిఅయిన దర్శనం లభించదు. కుక్కపిల్లా అగ్గిపుల్లా సబ్బుబిళ్లా వంటివి హీనంగా కనిపించడానికి ఈ మానసికమైన నిద్రే కారణం. కళ్ళంటూఉంటే చూస్తే ప్రపంచమొక పద్మవ్యూహంలా కనిపిస్తుంది. సమాజంలో పీడితజన జీవితవాస్తవికతను చూడగల్గడానికీ, జగన్నాథరథచక్రాల ఆగమనాన్ని చెప్పగల్గడానికీ శ్రీశ్రీకి లభించిన జాగృతియే కారణం.

(6) పరిపూర్ణపుబ్రతుకిచ్చేది:- బూర్జువావ్యవస్థ 'కొందరికి' స్వర్గప్రాయం. 'చాలామందికి' నరకతుల్యం. సంపూర్ణజీవనసౌఖ్యం లభించడానికి సామ్యవాదం కావాలి. ఆ సామ్యవాదమే నవకవితకు వెన్నెముక. 'పరిపూర్ణపుబ్రతుకు'ను వ్యాఖ్యానించేమాటలు లెనిన్‌నుంచి గ్రహించవచ్చు.
"We want to achieve a new and better order of Society; in this new and better society there must be neither rich nor poor; all will have to work. Not a handful of rich people, but all the working people must enjoy the fruits of their common labour. Machines and their improvements must serve to ease the work of all and not to enable a few to grow rich at the expence of millions and tens of millions of people. This new and better society is called Socialist Society. The teachings about this Society are called Socialism"[4]

ఇలాంటి పరిపూర్ణపుబ్రతుకును గురించియే శ్రీశ్రీ స్వప్నమంతా. "స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం పునాదులై ఇళ్ళులేచి, జనావళికి శుభంపూచి - శాంతి, శాంతి, కాంతి, శాంతి జగమంతా జయిస్తుంది, ఈ స్వప్నం నిజమవుతుంది, ఈ స్వర్గం ఋజువవుతుంది" అనే పంక్తులే ఆ స్వప్నపు సారాంశాలు. సంపూర్ణజీవితం లభించేది మరోప్రపంచంలోనే. అదే శ్రీశ్రీ స్వర్గం. అది 'కొత్తసృష్టి'. అది అవతలిగట్టు. అది భవిష్యం. అది కార్మికస్వర్గం.

---

3 చూ. కవితాప్రయోజనం ఖండిక.

4 V. I. LENIN - A Short Biography.

## శ్రీశ్రీ అనుష్టుప్పులు

నవకవితలోని గేయాలు సప్తపాదులు. పాదం 14 మాత్రల పరిమాణం గలది. 6 మాత్రలకో 8 మాత్రలకో యాదృచ్ఛికమైన విరుపు. అయితే ఈ గేయాలను కందపద్యంలా రాయవచ్చు; చదవవచ్చు. మొదటిగేయం ఒకటిన్నర కందపద్యం అవుతుంది.

చాలాపాదాల్లో అనుష్టుప్పు నడక కనిపిస్తుంది. 'సిందూరం రక్తచందనం' అనుష్టుప్పులాగే నడుస్తుంది. అనుష్టుప్పుకి గణాలు లేవు. 8 అక్షరాలుంటాయి. పాదపంచమాక్షరం లఘువు; షష్ఠాక్షరం గురువు. 7వ అక్షరం 1-3 పాదాల్లో గురువు. 2-4 పాదాల్లో లఘువు. శ్రీశ్రీ దీన్ని పూర్తిగా అనుసరించలేదు. శ్రీశ్రీ అనుష్టుప్పుకు 14 మాత్రలు ప్రధానం. చతురస్రగతి నడక. మిశ్రగతిలో నడిచే ముత్యాలసరానికీ 14 మాత్రలే. శ్రీశ్రీ గేయరహస్యం ఈ రెండు గతుల్లో ఉంది.

## శ్రీశ్రీ పర్యాయపదలయ

ఒకే శబ్దానికి పర్యాయపదాలను పాదాంతాలలో గుప్పించడం పర్యాయపదలయ. నవకవితలోని మూడోగీతంలో చప్పుడు, ధ్వని, గర్జన, ఘోషం, విరావం, ధ్వానం మొదలైన వన్నీ ధ్వనిపర్యాయపదాలే.

## శ్రీశ్రీ క్రియాజన్యవిశేషణాలు

శ్రీశ్రీ కవితాభాషలో క్రియాజన్యవిశేషణాలెక్కువ. ఎర్రనిజెండా అని ఊరుకోడు; ఎగరేసిన ఎర్రనిజెండా అంటాడు.

ఘాటెక్కిన గంధకధూమం, పోటెత్తిన సప్తసముద్రాలు, రగులుకొనే రాక్షసిబొగ్గు, బుగులుకొనే బుక్కాగుండ, వికసించిన విద్యుత్తేజం, చెలరేగిన జనసమ్మర్దం, అలసిన కన్నులు, చెదరిన గుండెలు, విసిగిన ప్రాణులు, నా పగిలిన మరణమృదంగం, చిగిరించిన తోటలు, విషం క్రక్కే భుజంగాలు, రెక్కవిప్పిన రివల్యూషన్, చల్లారిన సంసారం, పరస్పరం సంఘర్షించిన శక్తులు మొదలైనవి శ్రీశ్రీ శైలికి ఆనవాళ్ళుగా నిలిచిన ప్రయోగాలు.

# చరిత్రదేహళిలో జ్వాలాతోరణాలు

---

## 1938 కవితలు

---

---

దేశచరిత్రలు జ్వాలాతోరణం

మానవుడా!

కొంపెల్ల జనార్దనరావుకోసం!

---

ఏ కవియొక్క ఆవిర్భావంవల్ల

ఈ ప్రపంచం

ఇంకో అడుగు ముందడుగువేసిందో

ఆ కవే మహాకవి !

—శ్రీశ్రీ.

## పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టేను !

1938 ఏప్రిల్ 19

'ఏ దేశ మేగినా ఎందు కాలిడిన/ఏ పీఠమెక్కినా యెవరెదురయిన/పొగడరా నీతల్లి భూమి భారతిని/నిలుపరా నీ జాతి నిండుగౌరవము' అంటూ రాయప్రోలు సుబ్బారావుగారు తన దేశ సాంస్కృతికచరిత్రను వేనోళ్ళ స్తుతించారు. తన దేశచరిత్రలో గర్వకారణాలెన్నో ఆయనకు కనిపించాయి. మనభూమివంటి చల్లని భూమి లేదన్నారాయన. ఋషులు తపస్సుల్ని రాజ చంద్రులు శౌర్యహారాల్ని భక్తులు రాగదుగ్ధాల్ని కవిప్రభువులు బావసూత్రాల్ని సమర్పించిన దేశమిది అన్నారు. దిక్కులకెగదన్నే తేజం, జగముల నూగించే మగతనం, రాళ్ళ తేనియలూరే రాగాలు, సౌందర్యమెగబోసే సాహిత్యం తనదేశంలో వెలశాయన్నారు. గతం గురించి గొప్పగా చిత్రించి, తిరిగి ఆ ఔన్నత్యాన్ని అందుకోవాలని ఆయన భావించారు. చరిత్రను ఆయన ఆదర్శవాదదృక్పథంతో అధ్యయనం చేశారు. చరిత్రను అధ్యయనం చేయడంలో ఆదర్శవాదికీ భౌతికవాదికీ తేడాలున్నాయి.

(1) చరిత్రను భౌతికవాదదృక్పథంతో అధ్యయనం చేసిన శ్రీశ్రీ 'ఏ దేశచరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం? అని ప్రశ్నించి, నరజాతి చరిత్ర సమస్తం పరపీడనపరాయణ త్వం' అని జవాబు చెప్పాడు. శ్రీశ్రీకి- సేతుశీతాచలాల మధ్యనున్నదే దేశం కాదు; మానవజాతి వర్ధిల్లిన అన్ని దేశాల చరిత్రలనూ భౌతికవాదిగా పరిశీలిస్తే కనిపించిన పరమసత్యాన్నే శ్రీశ్రీ బయటపెట్టాడు. తెలుగుకవి దృక్పథంలో వచ్చిన మార్పుకిది నిదర్శనం.

(2) దేశచరిత్రలో జరిగిన యుద్ధాలను ఆదర్శవాది జాతీయగౌరవానికి ప్రతీకలుగా తీసు కున్నాడు. భట్టిప్రోలుకి సమీపమున నాంధ్రసామ్రాజ్యదిగ్జయస్తంభ మెత్తించిన రోజులు, తన పోటులు విరోధితండములకు సహింపనివిగా తెలుగుకత్తి మెరసిన రోజులు, సమరసేనావ్యూహా జయపతాకలక్రింద నాంధ్రపౌరుషము చెండాడిన రోజులు రాయప్రోలువారికి దర్శనమిచ్చాయి. దేశచరిత్రలో జరిగిన యుద్ధాలు శ్రీశ్రీకి పరస్పరాహరణోద్యోగాలుగా పరపీడన పరాయణత్వా లుగా దరిద్రులను కాల్చుకుతినడాలుగా బలవంతులు దుర్బలజాతిని బానిసలను కావించే ప్రయ త్నాలుగా కనిపించాయి. ధరాధిపతులు 'నరహంతలు'గా శ్రీశ్రీకి కనిపించారు. పాలకులు బలవంతులు; పాలితులు దుర్బలజాతులు- ఇదే చరిత్ర న్యాయమయిపోయింది.

(3) చరిత్రలో మహావైభవాన్ని ఆదర్శవాది దర్శిస్తే 'చల్లారిన సంసారాలూ మరణించిన జన సందోహం అసహాయుల హాహాకారం చరిత్రలో మూలుగుతున్నవి' అని భౌతికవాది దర్శనం.

(4) చరిత్ర ధర్మపూర్ణంగా ఆదర్శవాదికి కనిపించింది. ఉదాహరణకు - విశ్వనాథవారి 'వేగిక్షేత్రము' ఖండిక. "ఈ నాపదార్పితక్షోణి నేరాజు ధర్మాసనంబుండి స్మృత్యర్థమనెనొ/, ఈ నా దృగావృతంబైన భూముల లోన నేశౌర్యధనులు శిక్షింపబడిరొ/ఈ నా శరీరమందివతళించిన గాలి యెంత పౌరాతన్య మేచుకొనెనొ/ఈ నాతనూపూర్ణమైన యాకాశమ్ము నే క్రతుధ్వనులు శబ్దించినవియొ/అస్మదజ్ఞాతపూర్వదివ్యత్వమొప్ప/నీ పురీతావనీ ఖండ మిచట నిలిచి/యస్వతంత్రత దొరలు నా యాంధ్రశక్తి/నన్నుగంపింపజేయుచున్నది భృశమ్ము" అంటారు విశ్వనాథ చరిత్ర అధర్మ నిలయంగా కనిపించింది శ్రీశ్రీకి. "వైషమ్యం, స్వార్థపరత్వం, కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు మాయలతో మారుపేర్లతో చరిత్రగతి నిరూపించినవి" అంటాడు శ్రీశ్రీ.

(5) ఆదర్శవాదులు పాలకధర్మపక్షంనుంచి చరిత్రను పరిశీలిస్తే భౌతికవాదులు పాలక-అధర్మపక్షంనుంచి చరిత్రను పరిశీలించారు. చరిత్రలోని 'చెడు' వర్తమానపరిస్థితికి కారణమని భౌతికవాది అవగాహన.

(6) జరిగిన చరిత్ర అంతా వర్గసంఘర్షణల చరిత్ర అనే వివేకం భౌతికవాదిది. ధర్మాధర్మాల సంఘర్షణ అని ఆదర్శవాది అవగాహన. ఈ ధర్మాధర్మాలకు నిర్దేశకశక్తి మతం. వర్గభేదాలకు కారణాలు బలం, ధనం. బలవంతుల దౌర్జన్యాలూ ధనవంతుల పన్నాగాలూ సాంఘికధర్మాన్ని నిర్ణయిస్తూ వచ్చాయని భౌతికవాది నిరూపణ.

గతచరిత్రను సాంఘికదృక్పథంతో విమర్శించి విప్లవాన్ని సమాజానికి ప్రబోధించి చరిత్రకారుల దృక్పథాన్ని తీర్చిదిద్దడమే శ్రీశ్రీ దేశచరిత్రల ధ్యేయం. ఇందులోనే వర్తమానచరిత్ర ఎలానడవాలో నిర్దేశించాడు. భవిష్యచ్చరిత్ర ఎలాంటిదో సూచించాడు. గతచరిత్రను సామాజిక పరిణామశీలంతో భౌతికవాదదృక్పథంతో చదువుకోనివాళ్ళే యథాస్థితివాదాన్ని సమర్థిస్తారు. గతం మేలైనదిగా భావిస్తారు. విప్లవపరిణామాలను నిరోధిస్తారు. అతివాదులను శపిస్తారు.

విప్లవవాది అయిన శ్రీశ్రీ సాహిత్యపరిధిలోకి చరిత్రవిమర్శను తీసుకురావడం సమంజసమే!

## శ్రీశ్రీ చారిత్రక భౌతికదృక్పథం

చరిత్ర అంటే "a continuous systematic narrative of past events as relating to a particular people, country, period, person etc., usually written in Chronological order"[1]

---

1 The Random House Dictionary

అని సామాన్యంగా నిఘంటువు చెబుతుంది. ఏ యుద్ధం ఎందుకు జరిగెనో ? ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో?' చరిత్రలో 'తారీఖులతో దస్తావేజులతో' కనిపిస్తాయి. కానీ వీటినే చరిత్రకర్థంగా శ్రీశ్రీ అంగీకరించడు. 'ఈ రాణీ ప్రేమపురాణం, ఆ ముట్టడికైన ఖర్చులూ మతలబులూ కైఫీయతులూ చరిత్రలో కనిపిస్తాయి. కానీ వీటినే 'చరిత్రసారం'గా శ్రీశ్రీ స్వీకరించడు. మరి దేశచరిత్రల్లో శ్రీశ్రీ ఏయే విషయాలుండాలని ఆశిస్తాడు ?

| | చరిత్రలో ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|
| (1) | పాలకవర్గపు జీవిత వాస్తవికత | పాలితవర్గపు జీవితవాస్తవికత |
| (2) | తాజమహల్ నిర్మాణానికి కారణం ఒక రాణీ ప్రేమపురాణం- తాజ మహల్ అందచందాలు- దాని నిర్మాణానికైన ఖర్చులు. | తాజమహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవరు ? ఆ కూలీలకు సుఖజీవనం లభించిందా ? |
| (3) | అసామాన్యుల జీవితకథలు | సామాన్యుల జీవితకథలు - ఇతిహాసపు చీకటికోణం అట్టడుగునపడి కాన్పించని కథలు- నైలునదీ నాగరికతలో సామాన్యుని జీవనం- |
| (4) | ఆ ముట్టడికైన ఖర్చులు ఏ యుద్ధం ఎందుకు జరిగెనో ? ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో ? తారీఖులు, దస్తావేజులు. | సామ్రాజ్యపుదండయాత్రలో సామాన్యుల సాహస మెట్టిది ? |
| (5) | రాజులు పల్లకీ లెక్కి ఊరేగుతూ సమస్త భోగభాగ్యాలూ అనుభ వించారు. రాజుల కీర్తిప్రశంసలు. | ఆ రాజు ఆ భోగభాగ్యాల ననుభవించడానికి దోహదం చేసిన సామాన్యులెలా జీవించారు? ప్రభువెక్కిన పల్లకి కాదోయ్! అది మోసిన బోయీలెవ్వరు? |
| (6) | ఒక కాలానికి ఒక యుగానికి ఒక వ్యక్తికి పరిమితమైన వివరాలు- నిరపేక్ష చరిత్ర- సమాజపురోగమన తిరోగమనాల గురించి అవగాహన శూన్యత. | ప్రపంచవిశాలదృష్టితో సాపేక్షంగా రాయవలసిన చరిత్ర- తక్షశిలా, పాటలిపుత్రం, మధ్యధరాసముద్రతీరం, హరప్పా, మొహెంజొదారో, క్రో - మాన్యాన్ గుహాముఖాల్లో చారిత్రక విభాతసంధ్యల మానవకథ వికాస మెట్టిది ? ఏ దేశం ఏకాలంలో సాధించిన దే పరమార్థం ? |

| | | |
|---|---|---|
| (7) | ఆదర్శవాదదృక్పథం- చరిత్రను విధి నడిపిస్తున్నదనే భావం- | గతితార్కిక భౌతిక దృక్పథం- సమాజ చరిత్ర వర్గ సంఘర్షణలచరిత్రే అనేభావం- 'స్థాపించిన సామ్రాజ్యాలూ నిర్మించిన కృత్రిమచట్టాల్ ఇతరేతరశక్తులు లేస్తే పడిపోయెను పేకమేడలై! పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెను' అనే సూత్రాలతో చరిత్రను పరిశీలించాలి. |
| (8) | తిరుగుబాటును అన్యాయంగా చిత్రించడం. | పీడితులతిరుగుబాటువల్ల నూతనవ్యవస్థ ఆవిర్భావం- 'చిరకాలం జరిగినమోసం, బలవంతుల దౌర్జన్యాలూ, ధనవంతుల పన్నాగాలూ' 'ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తీ ఒకజాతిని వేరొకజాతీ పీడించే సాంఘికధర్మం' చెల్లని పరిస్థితిని గుర్తించడం- ఖండాంతరాల్లో అణగారిన ఆర్తుల తిరుగుబాట్లు- చారిత్రక యథార్థతత్త్వం- |
| (9) | గతచరిత్ర గర్వకారణంగా చిత్రించడం- కళంకహేతువైన సత్యాలను దాచివేయడం. | ఏదేశచరిత్రచూచినా ఏమున్నది గర్వకారణం? పరపీడనపరాయణత్వం- పరస్పరాహరణోద్యోగం- రణరక్తప్రవాహాలు- హత్యలు- ఏడ్పులు- స్వార్థాలు -స్పర్థలు- ఈర్ష్యలు- మాయలు- దోపిడి వంటివి యథాతథంగా వివరించడం. దాచేస్తే దాగని సత్యాలు. |
| (10) | వ్యక్తిప్రాధాన్యం- వ్యక్తిగౌరవాతిశయకథనం- | వ్యక్తిప్రాధాన్య తిరస్కారం- ప్రజలే చరిత్రనిర్మాతలని నిరూపించడం- కాలానికి కత్తులవంతెన కట్టినవారిని ఎత్తిచూపించడం- అజ్ఞానపు టంధయుగంలో ఆకలిలో ఆవేశంలో తెలియని ఏతీవ్రశక్తులో నడిపిస్తే నడిచి మనుష్యులు (వ్యక్తులు) అంతా తమ ప్రయోజకత్వంగా భావించారని నిరూపించడం. |

(11) శుద్ధచరిత్ర (వర్గదృష్టి, సామాజిక ప్రయోజనంలేని చరిత్ర). చరిత్ర చరిత్రకోసమే.

సమాజవ్యవస్థల పరిణామాలు- ఆదిమసమష్టిసమాజం→ యజమాని బానిససమాజం→ ఫ్యూడల్ వ్యవస్థ→ బూర్జువావ్యవస్థ→ సామ్యవాదవ్యవస్థ- ఈ సమాజాల పతనాభ్యుదయాలు- పరస్పరం సంఘర్షించిన శక్తులు- పరస్పరాహరణోద్యోగాలు- బలవంతులు దుర్బలజాతిని బానిసలను కావించడం→ నరహంతలు ధరాధిపతులు కావడం→ రణరంగాలు→ కాలానికి కత్తులవంతెనలు→ ధనవంతుల పన్నాగాలు→ పీడించే సాంఘికధర్మం→ అణగారిన ఆర్తుల తిరుగుబాటు→ కార్మికస్వర్గం అవతరణ. ఈ పరిణామానికి చూపుడుబ్రేలుగా చరిత్ర.

## ఫ్యూడల్, బూర్జువా చరిత్రకారులపై శ్రీశ్రీ విమర్శ

ఫ్యూడల్, బూర్జువా చరిత్రకారులు శుద్ధచరిత్ర (pure history) మాత్రమే రచిస్తారు. సామ్యవాద చరిత్రకారుడు రచించేది వ్యావహారికచరిత్ర (applied history) అవుతుంది. వ్యక్తుల జీవితకథలు చెప్పడం, రాజకీయసంఘటనలను పేర్కొనడం, యుద్ధాలను వర్ణించడం వంటివి శుద్ధచరిత్ర లక్షణాలు. ప్రజాజీవిత పరిణామాలను నిరూపించడం, సాంఘికవ్యవస్థల రూపరేఖలను నిరూపించడం, తిరుగుబాట్లను, వాటికి కారణాలను, పర్యవసానాలను వివరించడం, ఆర్థికసాంఘిక సాంస్కృతిక విద్యావైజ్ఞానిక రంగాలలోని చైతన్యాన్ని వ్యక్తంచేయడం వంటివి వ్యావహారిక చరిత్రలక్షణాలు. "the essence of history lies in the evolution of an entire people, a society rather than individuals[2] అన్న అభిప్రాయం మార్క్సిస్టు చరిత్రకారులదే. ఫ్యూడల్, బూర్జువా చరిత్రకారులు నిర్మించినచరిత్రను సామ్యవాదచారిత్రకదృక్పథంతో పునర్నిర్మించుకోవలసివస్తుంది. అందువల్ల చరిత్రలోనే నూతనశకం ఆరంభం అవుతుంది. సామాజికదృష్టినిబట్టి చరిత్రకారులు మూడురకాలు:

(1) ఫ్యూడల్ చరిత్రకారులు పాలకవర్గపక్షపాతులు. వారికి సామాజికస్పృహ లేదు. వర్గ వైరుధ్యాలను గురించి వారికి తెలిసే అవకాశంలేదు. వారు ఆదర్శవాదులు. అందువల్లనే వారు రచించిన చరిత్ర సామాజిక పురోగమనానికి దోహదం చేయదు. (2) బూర్జువాచరిత్రకారులు కూడా వీరికి తీసిపోరు. వీరు కూడా బూర్జువావర్గ పక్షపాతులే. వీరికి సామాజిక స్పృహఉంటున్నా దాన్ని వ్యక్తం చేయరు. వర్గవైరుధ్యాలను గురించి ఎంతతెలిసినా వాటికి దూరంగా ఉంటారు.

---

2 A Marxian Glimpse of History.

వలస దేశాలలో సామ్రాజ్యవాదుల దౌర్జన్యాలను గురించి వీరు రాయరు. పైగా ప్రజల న్యాయ సమ్మతమైన విముక్తిపోరాటాలను గురించి వక్రంగా చిత్రిస్తారు. వీరికి శ్రామికవర్గ సానుభూతి ఉండదు. పెట్టుబడివల్లనే ప్రపంచం ముందుకు నడుస్తోందంటారు. మానవజాతి వికాసంగురించి వ్రాయడంలో వీరు ఫ్యూడల్ చరిత్రకారులకన్నా ముందంజ వేస్తారు. కానీ సమాజవ్యవస్థల క్రమ పరిణామాన్ని గురించి గతితార్కికంగా నిరూపించరు. బూర్జువా వ్యవస్థమీద తిరుగుబాటును గురించి చరిత్రలోకి ఎక్కించరు. ఫ్యూడల్ వ్యవస్థమీద బూర్జువాల తిరుగుబాటునే ఘనంగా కీర్తిస్తారు. సామాజికమైన అరిష్టాలకు బూర్జువాలు కారణం కాదనీ వాటికి శ్రామికవిప్లవాలే కారణమనీ ప్రకటిస్తారు. అందువల్ల "సత్యం దాచివేయబడటం" జరుగుతుంది. (3) "The history of all hitherto existing society is the history of class struggles"[3] అన్నదే సామ్యవాద చారిత్రకుడి ప్రధానసూత్రం. ఈ సూత్రంతోనే గతవర్తమానచరిత్రల్ని సామ్యవాదచరిత్రకారుడు పరిశీలిస్తాడు. దాచేస్తే దాగని సత్యాలనూ ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడికాన్పించని కథలనూ చారిత్రకవిభాతసంధ్యల మానవకథవికాసాన్ని ఒక దేశం ఒక కాలంలో సాధించిన పరమార్థాన్ని అవిష్కరిస్తాడు.

'దేశచరిత్రలు' ఖండికలో ప్రధానంగా నాల్గు ఘట్టాలున్నాయి. మొదటి ఘట్టంలో ఫ్యూడల్ వ్యవస్థమీద విమర్శ. రెండవ ఘట్టంలో బూర్జువా అభ్యుదయంగురించి విమర్శ. మూడవ ఘట్టంలో బూర్జువావ్యవస్థమీద రానున్న తిరుగుబాటు. నాల్గవఘట్టంలో సామ్యవాద చరిత్రకారులకు సూచనలూ, హెచ్చరికలూను. మొదటి రెండుఘట్టాలలోనూ ఫ్యూడల్ బూర్జువా చరిత్రకారుల అబద్ధాలను నిరూపించడానికే ప్రయత్నంచేశాడు. మూడవఘట్టంలో సామ్యవాదచరిత్రకారుల దృక్పథాన్ని వివరించాడు. నాల్గవఘట్టంలో సామ్యవాదచరిత్రకారుడి లక్ష్యాలను నిర్దేశించాడు.

(1) ఫ్యూడల్ చరిత్రకారులు దేశచరిత్రల్ని నిష్కళంకంగా నిరూపిస్తే శ్రీశ్రీ 'ఏమున్నది గర్వకారణం ?' అని ప్రశ్నించి నరజాతి చరిత్రసమస్తం పరపీడనపరాయణత్వం, పరస్పరాహరణోద్యోగం, రణరక్తప్రవాహసిక్తం, బీభత్సరసప్రధానం, పిశాచగణసమవాకారం, దరిద్రులను కాల్చుకుతినడం, బలవంతులు దుర్బలజాతిని బానిసలనుకావించడం, నరహంతలు ధరాధిపతులు కావడం, భూస్థలమంతా రణరంగం చేయడం, గతమంతా రక్తంతో కన్నీళ్ళతో తడపడం అంటూ పరిహసించాడు. ఫ్యూడల్ చరిత్రకారులు పాలకవర్గపక్షపాతంతో వైషమ్యాలను సమభావనలుగా స్వార్థపరత్వాన్ని పరోపకారంగా కౌటిల్యాన్ని సౌజన్యంగా ఈర్ష్యను ఔదార్యంగా స్పర్ధను సహనంగా చిత్రించారన్నాడు.

3 Manifesto of the Communist Party.

'వైషమ్యం స్వార్థపరత్వం/కౌటిల్యం ఈర్ష్యలు స్పర్థలు
మాయలతో మారుపేర్లతో/చరిత్రగతి నిరూపించినవి'

విదేశాలమీద దండయాత్రలు చేసి ప్రజలను చంపివేసినవారంతా దిగ్విజయయాత్రలు చేసినట్లు వర్ణింపబడ్డారన్నాడు.

జెంఘిజ్‌ఖాన్ తామర్లేనూ/నాదిర్షా ఘజ్నీ ఘోరీ
సికందరో ఎవడైతేనేం?/ఒకొక్కడూ మహాహంతకుడు !'

ప్రజలమీద ప్రచ్ఛన్నంగా దాడిచేసి దోచుకొని హింసించి జీవించిన దోపిడీగుంపులను గురించి ఫ్యూడల్ చరిత్రకారులు రాయనేలేదు. ఈ దోపిడులకాలంలో సమాజగమనం స్తంభించిందని సూచించాడు శ్రీశ్రీ.

'వైకింగులు శ్వేతహూణులూ/సిథియన్లూ పారశీకులూ
పిండారులు, థగ్గులు కట్టిరి/కాలానికి కత్తులవంతెన'

ప్రకృతిశక్తుల విజృంభణాన్ని చూసి భయపడి మూఢవిశ్వాసాల్ని ఆశ్రయించిన అజ్ఞానపుటంధయుగంలో మతాధికారులూ పాలకులూ సామాన్యప్రజల్ని శాసించారు. అజ్ఞాతతీవ్రశక్తుల నడ్డుపెట్టుకుని విజయాలు సాధించారు. ఈ విజయసాధనకు ఆకలి, ఆవేశం మూలకారణాలయ్యాయి. కానీ విజయాలు లభించగానే అహంభావంతో సామ్రాజ్యాలు స్థాపించారు. ఈ విధంగా పాలకపాలితవర్గా లేర్పడ్డాయి. ఇదంతా ఫ్యూడల్ చరిత్రకారులకు తెలియని హేతువాదం.

అజ్ఞానపుటంధయుగంలో/ఆకలిలో ఆవేశంలో-
తెలియని ఏతీవ్రశక్తులో/నడిపిస్తే నడిచి మనుష్యులు-
అంతా తమ ప్రయోజకత్వం/తామే భువి కధినాథులమని
స్థాపించిన సామ్రాజ్యాలూ/నిర్మించిన కృత్రిమచట్టాల్-

ఈ చట్టాలవల్ల ఫ్యూడల్ వ్యవస్థకొక రూపం ఏర్పడింది.

(2) పరిపక్వమైపోయిన ఫ్యూడల్‌వ్యవస్థమీద తిరుగుబాటు చేసింది బూర్జువావ్యవస్థ. పారిశ్రామిక విప్లవంతో ప్రకృతిసంపదలను వశపరుచుకుని, ఫ్యూడల్‌శక్తిని మించిపోయింది. విజ్ఞానవికాసాన్ని అందించి పురోగమనాన్ని సాధించింది. 'ఇతరేతరశక్తులులేస్తే పడిపోయెను పేకమేడలై'- ఆ పడిపోయినవి ఫ్యూడల్‌సామ్రాజ్యాలే. ఆ యితరేతరశక్తులు బూర్జువా శక్తులే. ఇక్కడనుంచే ఆధునిక మానవచరిత్ర ఆరంభమయింది. 'పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెను !'- ఫ్యూడల్ బూర్జువాశక్తుల సంఘర్షణలో బూర్జువాశక్తి గెలిచింది. కానీ సమాజంలో దోపిడి, మోసం, పీడన తొలగిపోలేదు. ఇంకా ఎక్కువయ్యాయి.

(3) ఇంతటితో బూర్జువావ్యవస్థ విఫలమవుతుంది. ఈ వ్యవస్థమీద పీడితులు తిరగబడ తారని శ్రీశ్రీ సూచించాడు. ఈ తిరుగుబాటును గురించి బూర్జువా చరిత్రకారులు వివరించ రనేదే శ్రీశ్రీ విమర్శ.

'చిరకాలం జరిగిన మోసం/బలవంతుల దౌర్జన్యాలూ
ధనవంతుల పన్నాగాలూ/ఇంకానా ఇకపై చెల్లవు!
ఒకవ్యక్తిని మరొక్కవ్యక్తీ/ఒకజాతిని వేరొకజాతీ
పీడించే సాంఘికధర్మం/ఇంకానా ఇకపై సాగదు!
చీనాలో రిక్షావాలా/చెక్ దేశపు గనిపనిమనిషీ
ఐర్లాండున ఓడకళాసీ/అణగారిన అర్హులందరూ-
హాటెన్‌టాట్ జూలూనీగ్రో/ఖండాంతరనానాజాతులు

చారిత్రిక యథార్థతత్త్వం/చాటిస్తారొక గొంతుకతో"

ఈ భవిష్యత్ చరిత్రను సామ్యవాదచరిత్రకారుడే సూచిస్తాడు. ఈ సూచన పీడితవర్గాన్ని ప్రబుద్ధుల్ని చేసి తిరుగుబాటును వేగీకరిస్తుంది. బూర్జువావ్యవస్థలో సాంఘికమైన అధర్మా లున్నాయికనుకనూ ఆ అధర్మాలను అనుభవించేది శ్రామికులే కనుకనూ వారు తిరుగుబాటు చేస్తారు. ఈ తిరుగుబాటు తొలిదశలో జాతీయోద్యమంగా మొదలవుతుందని మార్క్సిస్టుచరిత్ర కారుడు నమ్ముతాడు.4 బూర్జువాసామ్రాజ్యవాదులు వలసవెళ్ళిన దేశాలలో హాటెన్‌టాట్, జూలూ, నీగ్రోవంటి జాతులు కూడా బూర్జువాదోపిడికీ క్రౌర్యానికీ గురిఅవుతూ ఉండటంవల్ల తిరుగుబాటుచేయక విడువరని ప్రకటిస్తాడు.

(4) దేశచరిత్రలు ఖండికలో నాల్గవఘట్టమే ముఖ్యమైనది. ఫ్యూడల్ చరిత్రనూ బూర్జువా చరిత్రనూ సామాజికరాజకీయార్థికదృక్పథంతో విశ్లేషిస్తాడు సామ్యవాదచరిత్రకారుడు. గత చరిత్రమీద తిరుగుబాటు చేస్తాయి అతడువేసే ప్రశ్నలు. అందుకే ఈ ఘట్టంలో అన్నీప్రశ్నలే! అన్నీ మందలింపులే! అన్నీ హెచ్చరికలే!

(a) 'తాజమహాల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?' అనేది ఇందులో ప్రముఖ మైన ప్రశ్న. అసలు ఇలాంటి మీమాంస ఫ్యూడల్ బూర్జువాచరిత్రకారులకు రానేరాదు. మార్క్సిస్టుదృక్పథమే ఇలాంటిప్రశ్నకు మూలం. అపూర్వమైన వాస్తుశిల్పాన్ని రూపొందించా డని షాజహానును ప్రస్తుతించడం, ముంతాజ్‌బేగమ్ ప్రేమపురాణాన్ని వివరించడం మాత్రమే చరిత్రలో కనిపిస్తుంది. ఇందుకు కారణం పాలకవర్గంపట్ల చరిత్రకారుడికి ఉండే గౌరవమే. కానీ నిజానికి కూలీల శ్రమలేనిదే అంత సుందరశిల్పం ఆవిర్భవించేదా? ఇది మార్క్సిస్టు చరిత్ర

4 కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక.

కారుడి దృక్పథానికి ఆనవాలు. ఇతిహాసపు చీకటికోణం అట్టడుగునపడి కాన్పించని కథల్లో ఈ కూలీల కథ ఒకటి.

(b) నైలునదీనాగరికతలో సామాన్యుని జీవన మెట్టిది? అనేది మరో ప్రశ్న. మానవ జాతి తొలినాగరికసమాజం అవతరించినప్రాంతాల్లో ఈజిప్టులోని నైలునదీతీరాలు ముఖ్యమైనవి. వ్యవసాయం విస్తరించడంతో నూతనసమాజవ్యవస్థ అక్కడ ఆవిర్భవించింది. ఉత్పత్తి పెరిగి సంపదలు విస్తరించడమే నాగరికతకు తొలిమెట్టు. ఈ నాగకరికతను ప్రస్తుతించడమే ఫ్యూడల్ చరిత్రలో కనిపిస్తుంది కానీ ఆనాగరికతను వృద్ధిచేసిన సామాన్యుడి జీవనంగురించి వివరాలు కనిపించవు. ఆ వివరాలే చరిత్రకు కావాలంటాడు మార్క్సిస్టు. (c) ఇలాంటిదే మరోప్రశ్న- 'తక్షశిలా, పాటలిపుత్రం, మధ్యధరాసముద్రతీరం, హరప్పా, మొహెంజొదారో, క్రో-మాన్యాన్ గుహాముఖాల్లో చారిత్రక విభాతసంధ్యల మానవకథవికాస మెట్టిది?' ఈ ప్రదేశాల్లోని చారిత్ర కావశేషాలనుబట్టి ఆనాటి సమాజచరిత్రను భౌతికవాదదృక్పథంతో తిరిగి రచించుకోవాలి. ఈ ప్రాంతాల్లో ఫ్యూడల్ వర్గసమాజం ఎలా ఎప్పుడు ఏర్పడింది? ఆ సమాజాన్నిబట్టి ఆనాటి రాజ కీయబౌద్ధిక చరిత్ర ఎలాంటిది? ఈ మీమాంస కావాలంటాడు సామ్యవాద చరిత్రకారుడు.

(d) సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుల సాహస మెట్టిది? అనేది మరోప్రశ్న. చక్రవర్తులు దిగ్విజయం సాగించారని కొనియాడటం ఫ్యూడల్ చరిత్ర. ఆదిగ్విజయం సామాన్యుల సాహసం లేకుండా లభించిందా? అని మార్క్సిస్టు ప్రశ్న. 'గతమంతా తడిసెర క్తమున కాకుంటే కన్నీళులతో' అనడానికి కారణం సామాన్యుల సాహసాన్ని నిరూపించడానికే. (e) ప్రభువెక్కిన పల్లకి కాదోయ్ అది మోసిన బోయీలెవ్వరు? ఇదీ మార్క్సిస్టు దృక్పథమే.

మార్క్సిస్టు చరిత్రకారుడు హేతువాది. ప్రయోజనవాది. ఆ ప్రయోజనంకూడా పీడిత పక్షం కోసమే. ఏదేశం ఏకాలంలో సాధించినదే పరమార్థం? ఏశిల్పం? ఏసాహిత్యం? ఏగాంధర్వం? ... ఏస్వప్నం? ఏదిగ్విజయం? ఇవన్నీ నిర్దిష్టంగా నిరూపించవలసిందే. అంతే కాదు, ఏవెల్గులకీ ప్రస్థానం? అంటూ మానవుడి మహాప్రస్థానానికి గమ్యంగురించి ఆరాతీస్తాడు. ఆ వెల్గులు సోషలిజం, కమ్యూనిజంలే!

చరిత్రలో వర్గకలహాలను గుర్తిస్తూ వర్గరహితసమాజంవైపు మానవులు ఎలా పయనిస్తు న్నారో సామ్యవాదచరిత్రకారుడు నిరూపించాలి. ఈ ప్రస్థానమే అభ్యుదయం.

## శ్రీశ్రీ భావాలలో అంతర్జాతీయసాదృశ్యం

"భౌతిక జీవితపరిస్థితుల్లోనూ సాంఘికసంబంధాల్లోనూ సాంఘికజీవితంలోనూ వస్తున్న మార్పులవల్లనే ఊహాలూ అభిప్రాయాలూ భావాలు, చైతన్యం మారుతూ ఉంటుంది"[5]

---

5 కమ్యూనిస్టు పార్టీప్రణాళిక.

కనుకనే శ్రీశ్రీ తాజమహాల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు? అని ప్రశ్నించగలిగాడు. మార్క్సిజం ప్రభావంవల్లనే ప్రపంచంలోని అనేక భాషలలోని కవులు ఇలాగే ప్రశ్నించారు. ఉదాహరణకు- జర్మన్ కవి బెర్టోల్ట్ బ్రెహ్ట్ (1898-1956), ఇంగ్లీషుకవి జాన్ మేజ్ ఫీల్డ్ (1878-1966) కూడా ఇలాంటి ప్రశ్నలు వేశారు. మేజ్‌ఫీల్డు రాసిన A concecration అనే గీతంప్రభావం తనమీద ఉందని శ్రీశ్రీయే ఒప్పుకున్నాడు.6

## శ్రీశ్రీ చారిత్రక వ్యుత్పత్తి

శ్రీశ్రీకి గల చరిత్రపాండిత్యం దేశచరిత్రలు, గర్జించరష్యా, ఆశాదూతలు, జగన్నాథుని రథచక్రాలువంటి ఖండికల్లో గోచరిస్తుంది. ఈ చారిత్రిక వ్యుత్పత్తిలో సామాజిక రాజకీయ ఆర్థిక భౌగోళిక విషయాలు మిళితమైఉంటాయి. శ్రీశ్రీ చారిత్రికవ్యుత్పత్తిని వ్యక్తీకరించే సామగ్రి మూడు రకాలు. (1) వ్యక్తినామాలు : ప్రశంసకో నిందకో కొందరు వ్యక్తులనామాలనే శ్రీశ్రీ తన కవిత్వంలో చేర్చవలసి వచ్చింది. వీరు కల్పితవ్యక్తులుకారు. నిజమైన చారిత్రక వ్యక్తులు. వ్యక్తినామాలను చేర్చడానికి వాస్తవికతావాదమే కారణం. 'దేశచరిత్రలు' లోని జెంఘిజ్‌ఖాన్, తామర్లేన్, నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ. సికందర్ వ్యక్తినామాలే.

జెంఘిజ్‌ఖాన్ (1162-1227) మంగోలు జాతీయుడు. ఆసియాలోని చాలా భాగాన్నీ తూర్పుయూరప్‌లోని కొంతభాగాన్నీ జయించడంలో ఇతడు మహాహంతకుడయ్యాడు. "ప్రపంచ మానవజాతిని ఇతడు పీడించినంతగా మరియొకడెవ్వడును పీడించియుండలేదు....చీనా మహాకుడ్యమును ఛేదించుకొనిపోయి, చీనా ఉత్తరభాగమునంతను జయించెను"7

తామర్లేన్ (తైమూరు 1369-1405) "ఇతడు వెడలిన మార్గము పొడుగునను బొమికల గుట్టలును, బొగ్గుల దిబ్బలును, బూడిద పోగులును మాత్రమే మిగిలినవి. శత్రువుల కపాలములను దండలుగా గుచ్చి తోరణములుగానూ, గృహనిర్మాణోపకరణములుగానూ ఉపయోగించి, వీటితో పెద్ద పెద్ద పిరమిడులను నిర్మించుట ఇతని ఆచారము"8

నాదిర్షా (1688-1787) ఇరాన్‌దేశీయుడు. పర్షియారాజును చంపి సింహాసనం ఆక్రమించాడు. తురుష్కుల్నీ రష్యన్‌లనీ దేశంనుంచి తరిమి దండయాత్రలు చేశాడు. భారతదేశాన్ని ముట్టడించాడు. ఢిల్లీలో ప్రజలితడ్ని రాళ్ళతో కొట్టగా కోపించి ప్రజల్ని చంపించాడు. ఈ హత్యాకాండలో వేలకు వేలమంది మరణించారు. 57 రోజులు దోపిడిసాగించి నెమలిసింహాసనం పట్టుకుపోయాడు.9

---

6 చూ. ప్రజాతంత్ర 1976 ఆగష్టు 8.

7 విజ్ఞానసర్వస్వము చరిత్ర-రాజనీతి 116 పే.

8 అదే గ్రంథం 116 పే. 9 అదే గ్రంథం 783 పే.

ఘజ్నీ క్రీ. శ. 1000 నుంచి 1026 లోగా 17 సార్లు దండెత్తి భారతదేశాన్ని దోచుకున్నాడు.

ఘోరీ (1173-1206) ముస్లింసామ్రాజ్యాన్ని ఉత్తరభారతంలో సుస్థిరంచేయడానికి దండయాత్రలు సాగించాడు.

సికందర్ (అలెగ్జాండర్) - మెసడోనియా రాజు. క్రీ. పూ. 327 లో ఇతని నాయకత్వం కింద గ్రీకులదండయాత్ర జరిగింది. పశ్చిమఆసియా, ఈజిప్టు మొదలైన పారశీకరాజ్యాలన్నీ జయించి పంజాబులో ప్రవేశించాడు. అన్నిరాజ్యాలూ జయించాడు. పురుషోత్తముడితడ్ని ప్రతిఘటించాడు. తూర్పున పంజాబునుంచి పడమర గ్రీసుదాకా ఉత్తరాన ఆర్మీనియానుంచి దక్షిణాన ఈజిప్టు దాకా సామ్రాజ్యం విస్తరించుకున్నాడు. సికందర్ పేరుగల తురుష్కుడు మరొకడు 16 వ శతాబ్దిలో పంజాబు నాక్రమించుకొని ఇబ్రహీంను ఢిల్లీఆగ్రాల నుంచి తరిమివేశాడు.

(2) జాతి నామాలు:- వైకింగులు (VIKINGS) 10 శ్వేతహూణులు (HUNS)11 శిథియన్లు 12 పారశీకులు 13 పిండారులు, 14 థగ్గులు (THUGS)15 వీరంతా గతంలో ప్రజలమీద ప్రచ్ఛన్నంగా దాడిచేసి దోచుకుని, హింసించి, జీవించిన గుంపుజాతులు. ఇవన్నీ పీడకవర్గాలే. వీరి ఆయుధాలు కత్తులు కనుకనే కత్తులవంతెనలు కట్టారని చమత్కారం. కాలప్రవాహాన్ని దాటడానికి వంతెనలు కావాలిగానీ కత్తులవంతెనలు కాదు. పీడకవర్గజాతులలాగే పీడితవర్గ జాతులూ శ్రీశ్రీకి ప్రపంచచరిత్రలో కనిపించాయి. హాటెంటాట్ (HOTTENTOT), జూలూ,

---

10 వైకింగులు 8-10శతాబ్దాల మధ్య యూరపు ఉత్తర పశ్చిమసముద్రతీరాల్లో దొంగతనంతో బ్రతికిన స్కాండినేవియన్ జాతి. దోపిడి మూకలివి

11 శ్వేతహూణులు 5వ శతాబ్దిలో గుంపులుగా తిరుగుతూ తూర్పు మధ్యయూరపును ఆక్రమించుకున్న ఆశియాజాతి. యుద్ధోన్మాదులు వీరు,

12 శిథియన్లు క్రీ. పూ. 9 వ శతాబ్దిలో ఒక సామ్రాజ్యాన్నే స్థాపించిన జాతి. అశ్వికబలం ఎక్కువగా గలవీళ్ళు ఎన్నో యుద్ధాలు చేసి హింసలకు దారితీశారు.

13 పారశీకులు క్రీ. పూ. 700 లో పర్షియారాజ్యాన్ని స్థాపించారు. ఈ రాజ్యానికి పునాది వేసినవాడు సైరస్ (క్రీ. పూ. 558). ఇతడెన్నో దండయాత్రలు చేశాడు.

14 పిండారులు ఆఫ్ఘన్ జాతీయులు. 1812-17 సంవత్సరాల మధ్య పిండారీలు రాజపుత్రరాజ్యాలనూ నిజాంరాజ్యాన్నీ ఉత్తర సర్కారుల్నీ దోచుకున్నారు.

15 థగ్గులు 13 శతాబ్దిలో ఇండియాలో దోపిడీలు, హత్యలు సాగించిన మతోన్మాదజాతి. కాళికాదేవికి బలిఇవ్వడం వారి ఉన్మాదం.

(ZULU), నీగ్రో (NEGRO) జాతులవి. ఈ జాతులను నేటికీ బాధిస్తున్న పీడకజాతిపేరు శ్రీశ్రీ చెప్పలేదు. కానీ అది యూరపియన్‌జాతి అని అందరకూ తెలిసినదే. శ్రీశ్రీకి జాతిద్వేషం లేదు. ఏజాతిలోఅయినా పీడకులూ పీడితులూ ఉంటూనే ఉంటారు. ఈ మార్గాలు పోయి, జాతులన్నీ సామ్యవాదంలోకి రావాలన్నదే సదాశయం.

(3) స్థలనామాలు:- తక్షశిల, పాటలీపుత్రం, మధ్యధరాసముద్రతీరం, హరప్పా, మొహెంజొదారో, క్రోమాన్యాన్ (ఫ్రాన్సు)లు ప్రపంచంలో ప్రాచీనసంస్కృతి కేంద్రాలుగా వర్ధిల్లిన స్థలవిశేషాలు. నైలునది, నయాగరా, శివసముద్రం, తాజమహలు, సింహాచలం, వింధ్యాచలం వంటివి కూడా ఈ సందర్భంలో పేర్కొనదగినవే.

## శ్రీశ్రీ సామ్యవాదసూక్తులు

సామ్యవాదసత్యాలను కొన్నింటిని లయాత్మకభాషలో సూత్రప్రాయంగా ఆవిష్కరిస్తూ ఉంటాడు శ్రీశ్రీ. ఈ సూక్తులు బౌద్ధికమైనవిగా ఉంటూనే కవి భావనాస్పర్శచే కవిత్వీకరింపబడి మరపురానివిగా మారతాయి. కవి ప్రవక్తగా తాత్త్వికుడుగా మారిపోయిన క్షణాల్లో కూడా అతడి ప్రవచనాలు, సిద్ధాంతాలు, ఆశయాలు, ఉద్ఘాటనలు హృదయాన్ని కదిలించగల్గడం ప్రతిభయొక్క ఇంద్రజాలం. ఈ సత్యాలు నాలుగు రకాలు.

(1) నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం – నరహంతలు ధరాధిపతులై చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి – రణరంగం కానిచోటు భూస్థలమంతా వెదకిన దొరకదు–గతమంతా తడిసెరక్తమున, కాకుంటే కన్నీళులతో – ఇవి చారిత్రక సత్యాలు.

(2) కవితామయమేనోయ్ అన్నీ – కాదేదీ కవితకనర్హం – దొరకదటోయ్ శోభాలేశం కళ్ళంటూ ఉంటే చూసీ వాక్కుంటే వ్రాసీ – ప్రపంచమొక పద్మవ్యూహం! కవిత్వమొక తీరని దాహం – ఇవి కవితాసత్యాలు.

(3) ఘర్మజలానికి ఖరీదు లేదోయ్ – విలాపాగ్నులకు విషాదాశ్రులకు ఖరీదు కట్టే షరాబు లేడోయ్ – శ్రమైకజీవనసౌందర్యానికి సమానమైనది లేనేలేదు – వెనుకదగా ముందుదగా కుడియెడమల దగాదగా – బ్రతుకు ఛాయ చదువు మాయ కవిత కరక్కాయ సుమీ! – చేదువిషం జీవఫలం – అలసిన కన్నులు కాంచేదేమిటి? తోఁకిన స్వప్నం తొలగిన స్వర్గం – చెదరిన గుండెల నదిమేదేమిటి? అవతల ఇవతల అరులై ఇరులే – విసిగిన ప్రాణుల పిలిచేదెవ్వరు? దుర్భ్రాంతి, దుర్గతి, దుర్మతి, దుర్మృతి – దౌర్జన్యానికి దౌర్జన్యం మందు – అలజడి మా జీవితం – ఆందోళన మా ఊపిరి – తిరుగుబాటు మా వేదాంతం – మానవాళికి నిజంగానే మంచికాలం రహిస్తుందా – ఇవి సామాజిక సత్యాలు.

(4) మరో ప్రపంచం పిలిచింది – నదీనదాలూ అడవులు కొండలు ఎడారులా మనకోసమే – జగమంతా బలివితర్ది – నరజాతికి పరివర్తన నవజీవన శుభసమయం, అభ్యుదయం – పుడమితల్లికి పురుటినొప్పులు కొత్తసృష్టిని స్ఫురింపించాయి – పుడమికి నేడే పుట్టినరోజు – కాలానికి కళ్ళెం వేస్తాం – ప్రేమానికి గొళ్ళెం తీస్తాం – ప్రపంచమును పరిహాసిస్తాం – భవిష్యమును పరిపాలిస్తాం – ఇవి విప్లవసత్యాలు.

శ్రీశ్రీ లయవైవిధ్యం

'దేశచరిత్రలు' లోని ఛందస్సు 14 మాత్రల పాదంమీద, 12 అక్షరాల పాదంమీద, చతురస్రగతిమీద ఆధారపడి ఉంది. అన్నీ చతుష్పాది గేయాలే ఇవి. ఈ చతుష్పాదులు కూడా సమపాదులే. ప్రతిపాదం 4 + 4 + 4 + 2 గా విరుగుతుంది; కానీ 5+4+5 గా గానీ 6+8 గా గానీ కూడా విరుపులు కనిపిస్తాయి. ఈ విరుపులే రకరకాల లయలను సృష్టిస్తాయి. దేశచరిత్రలు గేయం తెలుగులో అనుష్టుప్పులవలె సాగుతుంది. ఇందుకు పాదాంతదీర్ఘాలూ పాదాంతబిందువులూ సహకరిస్తాయి. శ్రీశ్రీ లయలకు కొన్ని నామకరణాలు చేయవచ్చు. (1) పాదపునరుక్తిలయ (2) ఆరోహణలయ (3) శ్లోకలయ (4) పాదాదియతిలయ (5) ప్రాసలయ (6) పదాదిస్వరసాదృశ్యలయ (7) ప్రశ్నపరంపరాలయ (8) ఉదాహరణలయ (9) సర్వగురులయ. వీటి కుదాహరణాలు చూపిస్తాను.

(1) ఒక పాదాన్ని పునఃపునః ప్రయుక్తంచేసి పాఠకుల మనస్సులమీద వర్ణ్యవిషయ ప్రాముఖ్యాన్ని ముద్రిస్తాడు శ్రీశ్రీ. నరజాతిచరిత్ర సమస్తం అనే పాదం అలాంటిదే.

నరజాతి చరిత్ర సమస్తం_
,, పరపీడనపరాయణత్వం
,, పరస్పరాహరణోద్యోగం
,, రణరక్తప్రవాహసిక్తం
,, దరిద్రులను కాల్చుకుతినడం

దీన్ని పాదపునరుక్తిలయ అనవచ్చు. (2) పాదాదిని సగణాలువాడటం శ్రీశ్రీ లయల్లో మరొకటి. సగణానికి ముగింపులో కానీ గురువు రాదు. మొదటి రెండక్షరాలూ లఘువులు కావడంవల్ల ఆరోహణలయ ఏర్పడి వేగం లభిస్తుంది. నరజాతి చరిత్ర సమస్తం – రణరక్తప్రవాహసిక్తం అన్నప్పుడు ఆ లయ వినిపిస్తుంది. (3) పాదాంతంలో దీర్ఘం లేదా బిందువు రావడంవల్ల శ్లోకలయ ఏర్పడుతుంది. ఏ దేశచరిత్రచూచినా/ఏమున్నది గర్వకారణం? (4) పాదాదియతిని పాటించడం మరోలయ. చారిత్రకయథార్థతత్వం/చాటిస్తారొక గొంతుకతో. (5) ప్రాసను పాటించే లయ ఇంకొకటి. నరజాతి చరిత్రసమస్తం/పరస్పరాహరణోద్యోగం. (6) పదాది స్వరసాదృశ్యం పాటించడంవల్ల ఒకలయ. "అజ్ఞానపుటంధయుగంలో ఆకలిలో ఆవేశంలో" (7) ప్రశ్నపరంపరలను

గుప్పించడం మరొకలయ. ఏ శిల్పం? ఏ సాహిత్యం? ఏ శాస్త్రం? ఏ గాంధర్వం? ఏ వెలుగుకీ ప్రస్థానం? ఏ స్వప్నం? ఏ దిగ్విజయం? (8) జాబితాలివ్వడంవల్ల ఒకలయ. జెంఘిజ్‌ఖాన్ తామర్లేనూ నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ. (9) పాదంలో అన్నీ గురువులే పడటంవల్ల మరొకలయ. చీనాలో రిక్షావాలా - హాటెన్‌టాట్ జూలూ నీగ్రో.

## శ్రీశ్రీ పదబంధపరిహాసం

ప్రసిద్ధపదాలను నూతనార్థచ్ఛాయలలో ప్రయోగించి పదబంధాలతో పరిహాసం సృష్టిస్తాడు శ్రీశ్రీ. పరాయణత్వం అనే పదం పూర్వాచారపరాయణత్వంవంటి సమాసాల్లో వాడబడుతుంది. కానీ 'పరపీడనపరాయణత్వం' అనే పదబంధాన్ని సృష్టించి ఆదర్శవాదులను అవహేళన చేశాడు శ్రీశ్రీ.16 ఉద్యోగం అనే పదం 'పరస్పరాహరణోద్యోగం' అనే పదబంధంలో చేరడంవల్ల వేళాకోళం వ్యక్తమవుతోంది. 'మహాపురుషుడు' వంటిదే 'మహాహంతకుడు' కానీ ఇందులో ఎంత పరిహాసముంది? వంతెన 'కత్తులవంతెన' కావడంలోనూ పురాణం 'ప్రేమపురాణం' కావడంలోనూ పరిహాసవ్యంజకత్వం పుష్కలంగా ఉంది.

సర్పపరిష్వంగం, మౌనమృదంగం, ధనికస్వామి, యంత్రభూతములు, లోహరాక్షసులు, వెర్రిగాలి, దానవభాషలు, కంటకకంఠం, గడుసుదయ్యాలు, ఒంటరిఒంటె, పొగమేడలు, ప్రమాదవీణలు, విషవాయువులు, మరణమృదంగం, అంధయుగం, విలయలయ, అగ్నివర్షం, అసత్యప్రచారం, రంకువేషం, శనిదేవత, వ్యథానివిష్టులు, ధ్వంసరచన వంటి పదబంధాలన్నీ పరిహాస వ్యంజకాలే.

# 81/జ్వాలాతోరణం

## పుడమికి నేడే పుట్టిన రోజట!

1938 అక్టోబరు 3

ప్రతిజాతికీ కొన్ని సాంస్కృతిక సంప్రదాయాలుంటాయి. అవి సాధారణంగా ఫ్యూడల్ వ్యవస్థలో మతంవల్ల పెంపొందుతూ ఉంటాయి. ప్రజలు మతంమీది విశ్వాసంతో వాటిని మన్నిస్తూ ఉంటారు కానీ వాటి హేతుబద్ధతను గురించి ఆరాతీయరు. పండుగలు, దేవతల పూజలు, వ్రతాలు, యజ్ఞాలు, కర్మలు మొదలైనవి భారతదేశంలోని సాంస్కృతిక సంప్రదాయాలు. వీటినే కవులు తమ భావనకు పరికరాలుగా వాడుకుంటూ ఉంటారు. కొన్ని 'కవిసమయాలు'గా ప్రచారంలోకి వస్తాయి. "విద్యానగర రాజవీథులఁ గవితకు పెండ్లిపందిళ్ళు కప్పించునాడు" అన్నప్పుడు 'పెండ్లిపందిరి' సాంస్కృతికసంప్రదాయమే! "పూజ్యులధములు, ధనికులు, పట్టుబీదలనెడి యెడలేక యెత్తిరి హారతులను" అన్నప్పుడు 'హారతి' అలాంటిదే. "ఏరాజుపంచెనో ఇచట శౌర్యపుఁబాయసమ్ములు నాగులచవితి నాళ్ళ" అన్నప్పుడు 'నాగులచవితి' ఒక పండుగే. ఈ ఉదాహరణలు వరసగా రాయప్రోలు, రామిరెడ్డి, విశ్వనాథగార్ల కవితలలోనివి. సాంస్కృతిక కవిసమయాలను శ్రీశ్రీ కూడా అందరికన్నా ఎక్కువగానే స్వీకరించాడు. కానీ ఇతరులకూ శ్రీశ్రీకీ వాటిని వాడుకోవడంలో ఎంతో తేడాఉంది. భారతీయపురాణవిషయాలూ, సాంస్కృతిక విశేషాలూ శ్రీశ్రీకి తన దృక్పథాన్ని ప్రచారం చేసుకోవడానికి కేవలం అవలంబనాలే. ఇతరులకు అవి అలంకారాలు. కొందరికవి నమ్మకాలు. భారతీయసంస్కృతి పునరుజ్జీవనంకోసం వారు అటువంటి సంప్రదాయాలనూ, కవిసమయాలనూ ఎక్కువగా ఆరాధిస్తారు. శ్రీశ్రీ వాటిని ఆరాధించడు; వాటిని కావ్యసామగ్రిగా గ్రహించి సంకేతాలుగా మార్చుకుంటాడు.

### శ్రీశ్రీ ఫ్యూడల్ సాంస్కృతిక 'కవిసమయాలు'

ఫ్యూడల్ సంస్కృతికి సంబంధించిన అనేకసంప్రదాయాలను శ్రీశ్రీ కవిసమయాలుగా స్వీకరించాడు. (1) జ్వాలాతోరణం, ఆకాశదీపం అనేవి పండుగలపేర్లు. (2) త్రేతాగ్ని, హోమజ్వాల, యజ్ఞోపవీతం, అగ్రనైవేద్యం, హారతిపళ్లెం, మంత్రం, బలి, ప్రణవం, పాపం, ఋక్కులు, షణ్యాం, యజ్ఞాశ్వం, సవనరంగం వంటివి వైదికకర్మకాండకు చెందినవి. (3) అవతారం, మేరువులు, పరమేష్ఠి, స్వర్గం, యముని మహిషం, నరకం, సప్తహయములు, కనకదుర్గ, ఇంద్రదేవుడు, నందికేశుడు, ఆదిసూకరం, హిరణ్యనేత్రుడు, మఘవధనుస్సు, రుద్రుడు, కాళిక, విశ్వరూపం,

రాక్షసులు, పాతాళం, పిశాచం, శనిదేవత, నటధూర్జటినిటాలాక్షి వంటివి పురాణాంశాలు. (4) మహాప్రస్థానం, ధనంజయుడు, కురుక్షేత్రం, వృకోదరుడు, పద్మవ్యూహం వంటివి భారత కథాంశాలు. (5) అద్వైతం అభ్యుదయం, నిర్వాణం, నాదబ్రహ్మం, బ్రహ్మానుభవం, పరమాత్మ, మాయ, మిథ్య, వేదాంతం వంటివి భారతీయతత్త్వశాస్త్రంలోని పరిభాషలు. (6) సింహాచలం, హిమాచలం, వింధ్యాచలం, సంధ్యాచలం, మేరువు, త్రిలోకాలు, త్రికాలాలు, బ్రహ్మాండగోళాలు, కల్పాంతం, ప్రళయం, జగన్నాథునిరథం వంటివి క్షేత్రాలకూ కాలానికీ సంబంధించినవి. (7) కిరీటం, నగారా, బావుటా, విపంచిక, మృదంగం, నగరి, సంకెళ్ళు, స్వస్తివాక్యాలు, స్వర్ణ వాద్యాలు, రథాలు, కత్తి, పరాజితుడు, తెరచాటు, దుర్గం, రాణి, కవాటం, దండయాత్ర, వంటివి ఫ్యూడల్ రాజకీయజీవితాన్ని గుర్తుచేస్తాయి.

శ్రీశ్రీ కవిత్వం ఉన్నతవర్గాలవారినీ పండితులనూ ఆకర్షించడానికి జాతీయమైన ఈ సాంస్కృతిక పదజాలం ఒక కారణమయింది.

## 'జ్వాలాతోరణం'లో శ్రీశ్రీ విప్లవదర్శనం

శ్రీశ్రీ రచించిన ఖండికల్లో జ్వాలాతోరణం క్లిష్టాన్వయం, దురవగాహన, సంకేతభూయిష్ఠత గల కవిత. దీన్ని విశ్లేషించడానికి ప్రయత్నిస్తాను. జ్వాలాతోరణం అనేది భారతీయుల ఫ్యూడల్ సాంస్కృతికోత్సవం. కార్తిక పౌర్ణమినాడు (నవంబరు) జ్వాలాతోరణం కట్టి దేవుణ్ణి ఊరేగిస్తారు. ఉత్తరాయణపుణ్యకాలం ఆరంభం కావడానికి ముందే జ్వాలాతోరణోత్సవం వస్తుంది. ఉత్తరాయణం ఆరంభంకాగానే నరకద్వారాలు మూసి స్వర్గద్వారాలు తెరుస్తారనీ ఆ కాలంలో చనిపోయినవారికి స్వర్గంలభిస్తుందనీ నమ్మకం. ఈ స్వర్గద్వారానికి సంకేతమే జ్వాలాతోరణం. ఇది మతసంబంధియైన ఒక ఆచారమే కావచ్చు. కానీ శ్రీశ్రీ దీన్ని విప్లవసంకేతంగా గ్రహించాడు; కవిసమయంగా మలుచుకున్నాడు. శ్రీశ్రీ అభిప్రాయంలో స్వర్గనరకాలు పరలోకసంబంధులుకావు. అవి కేవలం ఇహలోకంలోనే ఉన్నాయి. ఇతరవ్యవస్థలలో ఈ లోకం నరకం. సామ్యవాదవ్యవస్థలో ఈ లోకం స్వర్గం. భూలోకం స్వర్గం అయ్యేదెప్పుడు? జ్వాలాతోరణం అనే విప్లవతోరణాన్ని కట్టినప్పుడే! జ్వాలాతోరణోత్సవాన్ని జరపనిదే మరోప్రపంచపు స్వర్గద్వారాలు తెరుచుకోవడం, ఈ ప్రపంచపు నరకద్వారాలు మూసుకోవడం జరగదు ఇదే సరిగ్గా 1917 అక్టోబరులో సోవియట్ రష్యాలో జరిగింది. ఇదే జ్వాలాతోరణంలోని ధ్వని. జ్వాలాతోరణంలోని 5 గేయాలలోనూ "అనాథజీవుల సమాధులన్నీ/అఘోరించి ఘోషించాయి"1 అనేది కవి ప్రతిపాదన. ఆ ఘోషయే ఈ గేయంలోని అంశమంతా. సామ్రాజ్య

---

1 "Lack-lustre graves of the homeless the nameless
unsing and unlive in an orchestral hush."

—SRISRI MISCELLANY.

వాదుల యుద్ధబీభత్సానికి గురిఅయిన అనాథజీవుల సమాధిఘోషలే ఈ గీతంలోని అంశాలు. వాటిని క్రమంగా చూద్దాం.

(1) "స్వర్గనరకముల ఛాయా దేహళి/తెలినలితలుపులు తెరచి మూసికొని" సర్గహేమంత కాంతి వస్తుంది; విలయవసంతధ్వాంతం పోతుంది2. (సర్గవిలయ; హేమంతవసంత; ధ్వాంతకాంతి అని తెలుగులోనూ creation – destruction; spring – winter; darkness and light అని ఆంగ్లం లోనూ రాసి తికమక కలిగించాడు శ్రీశ్రీ. అందువల్ల నాకు తోచిన అన్వయాన్ని నేను ప్రతి పాదించాను. ఇది వ్యతిక్రమాలంకారం.)

హేమంతంలోనే వస్తుంది జ్వాలాతోరణం. ఆ తరువాతనే సూర్యకాంతి హెచ్చుతుంది. అక్కడినుంచే అభ్యుదయదశ. అంతకుముందున్నదంతా బూర్జువాల వసంతధ్వాంతమే! అది విలయవసంతధ్వాంతిమే!

ఒక వ్యవస్థ విలయమే మరోవ్యవస్థ సర్గానికి (జననానికి) మార్గం. చీకటిపోతేనే వెలుతురు. సామ్యవాద విప్లవంవల్ల తాత్కాలికంగా వసంతమే నిష్క్రమించినట్లు కనిపించినా సంధ్యవస్థలో హేమంతం కనిపించినా అదీ తాత్కాలికమే. హేమంతం, శిశిరం పోతే తిరిగి వసంతం, వర్షం, శరత్తు వస్తాయి. ఈ పరిణామం సామ్యవాదవ్యవస్థ అభ్యుదయానికి దారితీస్తుంది. కొందరే సుఖ పడే వసంతం పోయి, అందరూ సుఖపడే ఋతువులు వస్తాయి. ప్రకృతి పరిణామవికాసాల్లో సమాజపరిణామవికాసాలనే చూపించాడు శ్రీశ్రీ.

(2) సమయం సర్గవిలయహేమంతవసంతధ్వాంతకాంతి విక్రాంతివేళ! పరస్పరవిరుద్ధమైన వన్నీ కలిసిపోతున్న సమయం! స్థలం చావు పుట్టుకల పొలిమేర! చావు దోపిడి వ్యవస్థకు! పుట్టుక శ్రామిక వ్యవస్థకు! ఈ రెండు వ్యవస్థల పొలిమేరలలో ఆవులించేదే 'చితాగ్నికుండం'. 'చితాగ్ని కుండం'కూడా హైందవసాంస్కృతిక సంప్రదాయంలోనిదే. మకరసంక్రాంతి పర్వత్రియం (జనవరి) లో భోగిపండుగనాడు పొలిమేరలలో వేసేది భోగిమంట. ఇది దుష్టనాశనసూచకం. "చావుపుట్టు కల పొలిమేరలలో/ఆవులించె నొక చితాగ్నికుండం!?"3

శ్రీశ్రీ భావించిన ఈ "చితాగ్నికుండం' సామ్రాజ్యవాదులు సృష్టిస్తున్న యుద్ధ బీభత్సానికి ప్రతీక. ఇటువంటి యుద్ధాలు సామ్యవాద విప్లవానికి ముందు వస్తూ ఉంటాయని శ్రీశ్రీ అను కుంటాడు. ప్రథమప్రపంచయుద్ధం పూర్తి అవుతూఉండగానే రష్యాలో సామ్యవాదవిప్లవం

---

2Shadowy threshold/of Hades and Elysium/opening and closing/its black and white doors/Creation – destruction's spring – winter cycle/holds darkness and light / in an elemental hug.
— SRiSRI MISCELLANY.

3"At the boundaries of life and death frantic exhausted a funeral pyre smouldering yawns in disgust"
—IBID

వచ్చింది. ఈ గీతం రాసేసరికి రెండవప్రపంచయుద్ధానికి సన్నాహాలు జరుగుతున్నాయి. హిట్లర్ విజృంభిస్తున్నాడు. ఆ యుద్ధాన్ని పసిగట్టిన శ్రీశ్రీ చావుపుట్టుకల పొలిమేరలలో చితాగ్నికుండం ఆవులించిందని ఉత్ప్రేక్షించాడు. జరగనున్నదాన్ని జరిగిపోయిందనే చెబుతాడు శ్రీశ్రీ. అందుకు స్వప్నదర్శనం కారణం.

(3) ఈ యుద్ధంలో సామ్రాజ్యవాదులు పాల్గొంటున్నారని శ్రీశ్రీ అభిప్రాయం. ఇక్కడ వాడుకున్న పురాణ ప్రతీకలు రెండున్నాయి. ఒకటి హిరణ్యాక్షుడి విజృంభణం. రెండు వృకోదరుడి విజృంభణం. హిరణ్యనేత్రుడిది పదాఘాతంకాగా వృకోదరుడిది గదాఘాతం. హిరణ్యనేత్రుడు భూగోళాన్ని తన్నాడు. వృకోదరుడు గదతో కొట్టాడు. ఇది వీరిద్దరికీ ఒక క్రీడ. వీరి కోలాహలం వల్ల అనాథజీవులకు దిక్కుతోచడంలేదు. అందుకే "ఇదేమి లోకం హిరణ్యనేత్రుని/పదాఘాతమున ప్రతిధ్వనించగ/కురుక్షేత్రమున క్రుద్ధవృకోదరు/గదాఘాతమున గజగజలాడగ"4 అంటున్నారు పీడితులు!

లోకాన్ని అల్లకల్లోలపరచడం ఫాసిజం, నాజిజంల లక్షణంకనుక హిరణ్యనేత్రుడు హివర్ణ సామ్యంవల్ల హిట్లర్‌కు ప్రతీక కావచ్చు.5 కురుక్షేత్రంలో వృకోదరుడు గదతో విజృంభించాడని చెప్పడంద్వారా బ్రిటీషువారి యుద్ధసంరంభాన్ని స్ఫురింప జేస్తున్నాడు శ్రీశ్రీ. ఇక్కడ వృకోదరుడ్ని పీడితజననాయకుడికి సంకేతంగా స్వీకరించడానికి వీలులేదు. ప్రపంచయుద్ధాలు సామ్రాజ్యవాదులమధ్యనే బయలుదేరతాయి.

(4) ప్రళయకాలంలో పెద్దతుపాను వస్తుందనీ ఏడుమేఘాలు విజృంభిస్తాయనీ ఒకజాతితో మరొకజాతి పోరాటంలో దిగి అందరూ నాశనమవుతారనీ చెప్పడం పురాణసంప్రదాయం, దీన్ని కవిసమయంగా మార్చుకుని శ్రీశ్రీ సంవర్తపుతుపానుమేఘం గర్జించిందనీ ఆ తూర్యవిరావమే జాతిజాతినిర్ఘాతపాతసంఘాతహేతు వయిందనీ కాలకేతువయిందనీ చెప్పాడు. "జాతిజాతినిర్ఘాతపాతసం/ఘాతహేతువై కాలకేతువై. అదె సంవర్తపు తుపానుమేఘం/తొలి గర్జించిన తూర్యవిరావం"6 ఇందులో సంవర్తపుతుపానుమేఘగర్జన ప్రపంచయుద్ధానికి సంకేతమే. తూర్యవిరావం యుద్ధానికి పిలుపే.

---

4 Oh Cosmic disaster/the thundering foot ball/of HIRANYANETRA/rebounds and resounds / This is Kurukshetra/our farflung battle ground/where angry VRIKODARA's mace doth menace us"
—SRISRI MISCELLANY

5 కె. వి. రమణారెడ్డి - సృజన 14 సం.

6 "Race against race/and nation against nation/
under the banner/of Annihilation/
Obeying the last storm's/first blast of trumpets
rally and reel/in a Cataclysmal Orgy"
—SRISRI MISCELLANY

(5) సంక్రాంతిపర్వసందర్భంలో భోగిమంటలు వేయడం, మావిడాకుల తోరణాలు కట్టడం సంప్రదాయాలు. వీటిని కవిసమయాలుగా స్వీకరించి, పుడమి పుట్టిన రోజును వర్ణించాడు శ్రీశ్రీ. ఇక్కడ "రష్యన్ విప్లవం తేదీ, ఫ్రెంచి విప్లవం తేదీ వంటివి పుట్టినరోజులు. చరిత్ర ప్రవాహంలాంటిది సూర్యోదయం అవుతుంటే భూమిమీదున్న చీకటి తొలగిపోయి చెట్లూ దృశ్యాలూ వెలుతురులోకి వస్తూంటాయే అలాగే మార్పులు జరుగుతుంటాయి."7 అన్న శ్రీశ్రీ మాటలు గుర్తుకు వస్తాయి. యుద్ధానంతరం భారతదేశంలో విప్లవం వస్తుందని ఆశించిన శ్రీశ్రీ ఆ విప్లవాన్నే పుడమికి పుట్టినరోజుగా భావించాడు. ఆ జన్మదినోత్సవం ఎలా జరుగుతుంది? ప్రదీప్తకీలా ప్రవాళమాలా ప్రపంచవేలా ప్రసారాలలో మిహిరవాజితతి రావడం మఖవ ధనుర్ద్యుతి కనిపించడం జరుగుతుంది. మిహిరవాజి తతి (ఉదయసూర్యుని సప్తహయములు) నవ జీవన శుభసమయానికీ అభ్యుదయానికీ సంకేతాలు. మఖవధనుర్ద్యుతి (ఆకసమున హరివిల్లు) నూతనాశలకు సంకేతం. "ప్రదీప్తకీలా ప్రవాళమాలా/ప్రపంచవేలా ప్రసారములలో మిహిర వాజితతి! మఖవధనుర్ద్యుతి/పుడమికి నేడే పుట్టిన రోజట!"8

బూర్జువావ్యవస్థ అంతరిస్తే (అంతరించి) నూతనప్రపంచ శిశువు ఉదయిస్తుందని (ఉదయించిందని) శ్రీశ్రీ స్వప్నం. ఇదే అనాథజీవుల సమాధుల ఘోష. 'కీలాప్రవాళమాల' ద్వారా అరుణరాగం సంకేతంగా గల కమ్యూనిజమే ధ్వనింపబడింది. ఈ కీలామాలే జ్వాలాతోరణం.

శ్రీశ్రీ వాడిన పురాణప్రతీకలు అర్థంకావడానికి సంప్రదాయం తెలిస్తే చాలదు. ఈఖండిక రచించేనాటి ప్రపంచరాజకీయవాతావరణం కూడా తెలియాలి. ఇండియాలో జరుగుతున్న స్వాతంత్ర్యసంగ్రామం, నియంతృత్వాలమీద ప్రజలు లేవదీస్తున్న తిరుగుబాట్లు, ఫాసిస్టువ్యతిరేకో ద్యమాలు ఆనాటి యథార్థాలు. రాజకీయసంఘటనల పునాదిమీద శ్రీశ్రీ తన భావనాసౌధం నిర్మించుకున్నాడు. స్వర్గనరకాలు, సర్గవిలయాలు, హిరణ్యనేత్రుడు, వృకోదరుడు, కురుక్షేత్రం, సంవర్తమేఘం, మిహిరవాజితతి, మఘవధనుస్సు, జ్వాలాతోరణం-ఇవన్నీ భారతీయచక్షువుతో చూడవలసిందే కానీ వీటి అంతరార్థ స్ఫూర్తికి భారతీయ దృక్పథమే సరిపోదు.

---

7 సృజన 14 సం. 118 పే.

8"Dazzling red corals/of sizzling fire flora
encircle the earth's/spindrifting shores
Today the sun's horses/the seven strings of the rainbow
Celebrate the birth date/of a world reborn"

—SRISRI MISCELLANY

## శ్రీశ్రీ అధివాస్తవిక దృక్పథం

"1938 లో నేను ఆంధ్రప్రభ గొడుగు కిందికి చెన్నపట్టణంలో పునః ప్రవేశించాను. నాతోబాటు అధివాస్తవికతకి సంబంధించిన కొన్ని పుకార్లు మోసుకొచ్చాను" అంటూ చెప్పుకున్న శ్రీశ్రీ అధివాస్తవికదృక్పథం రచనలో ఒక అస్పష్టతకీ, గందరగోళానికీ దారితీసింది'. జ్వాలాతోరణం ఖండికలో గందరగోళం ఉంది. అధివాస్తవికుడికి అస్పష్టతయే ఒక శిల్పం. గందరగోళమే ఒక అలంకారం. ప్రపంచంలోని గందరగోళాన్ని శ్రీశ్రీ తన కవిత్వంలోని గందరగోళంలో ప్రతిబింబింపజేశాడు. ''స్వర్గనరకముల ఛాయాదేహాళి తెలినలి తలుపులు తెరచిమూసికొని సర్గ విలయ హేమంత వసంతధ్వాంతకాంతి విక్రాంతివేళలో' అన్న గేయంలో అన్వయక్లిష్టతకు అధివాస్తవిక దృష్టి కారణం. వ్యతిక్రమమే అలంకారమయింది. అనాథజీవుల సమాధులు అఘోరించి ఘోషించడం, చావుపుట్టుకల పొలిమేరలలో చితాగ్నికుండం ఆవులించడం అధివాస్తవిక భావచిత్రాలే. 'ప్రదీప్తకీలా ప్రవాళమాలా ప్రపంచవేలా ప్రసారములు' అనే సమాసానికి అన్వయం చెప్పడం అసాధ్యం. అసాంప్రదాయికమైన ఈ సమాసహేలలో అధివాస్తవిక సాహసం ఉంది.

## శ్రీశ్రీ అక్షరక్రీడలు

జ్వాలాతోరణంలోని 5 గీతాలూ చతుష్పాదులే. పాదానికి 16 మాత్రలను పాటిస్తూనే సరిపాదాలలో కత్తిరింపు (caesura) ప్రయోగించాడు. పెక్కు పాదాలలో వృత్తాల నడకలు కనిపిస్తాయి. బహుపాదాలను లగం తో ఆరంభించి ఛందోవేగాన్ని సాధించడం జరిగింది.

'జ్వాలాతోరణం'లో మనల్ని ఆకర్షించేది శ్రీశ్రీ ఛందస్సు కాదు; అక్షరక్రీడలు. (1) తెలినలితలుపులు తెరచిమూసికొని అనే పాదంలో ఒకటి తప్ప అన్నీ లఘ్వక్షరాలే. (2) హేమంత వసంతధ్వాంతకాంతి విక్రాంతివేళలో అనే పాదంలో బిందుపూర్వకతకారం ఆవృత్తం అవుతుంది. (3) జాతి జాతి నిర్ఘాతపాత సంఘాతహేతువై' అనే పాదంలో తకారావృత్తి ఉంది. (4) అనాథజీవుల సమాధులన్నీ అనే పాదంలో స్వరానుప్రాస ఉంది (5) ఇదేమిలోకం హిరణ్యనేత్రుని పదాఘాతమున ప్రతిధ్వనించగ అనే పాదాలలో లగబాహుళ్యం ఉంది. 'ప్రదీప్తకీలా ప్రవాళమాలా ప్రపంచవేలా' అన్న పాదం అక్షరక్రీడకు పరమావధి. ఇందులో జగణం, గగం ముమ్మారు తిరిగాయి. ప్రతి జగణాదినీ వచ్చే ప్ర అనే అక్షరం, ప్రతి గగం చివరా వచ్చే 'లా' అనే అక్షరం ఉత్సాహ సూచకాలు. ఈ ఖండిక శ్రీశ్రీ భాషాప్రౌఢికీ భావప్రౌఢికీ కూడా నిదర్శనమే! ధ్వాంత, విక్రాంత, చితాగ్ని, క్రుద్ధ, నిర్ఘాత, సంఘాత, సంవర్త, తూర్య, ధనుర్ద్యుతి వంటి పదాల్లో క్లిష్టాక్షర, ద్విత్వాక్షర, సంయుక్తాక్షర విన్యాసం శైలికొక ప్రౌఢిని సమకూర్చింది. శైలిలో పరుషత్వం, వేగం కలిసిపోవడం చిత్రమైన విషయం.

## 82/మానవుడా

### ధర్మస్థాపనకు యుద్ధంచేసేవాడా! అన్యాయం భరించలేనివాడా!

1938

భగవంతుడు సర్వశక్తిమంతుడనీ మానవుడాయనచేతిలో కీలుబొమ్మఅనీ రాజొక్కడే భగవదంశసంభూతుడనీ భావించిన రోజులు ఫ్యూడల్‌వ్యవస్థలోనివి. ఆ వ్యవస్థలోని పురాణేతిహాసకావ్యప్రబంధశతకదండకాది కవిత్వప్రక్రియలన్నీ దేవుడి మహిమను వేనోళ్ళ కీర్తించడానికి వినియోగపడినవే. ప్రపంచాన్ని సృష్టించి, రక్షించి, నాశనంచేసేవాడు భగవంతుడే అనేనమ్మకం ఫ్యూడల్‌కవులను ఆవేశించి ఉన్నదే. బూర్జువావ్యవస్థ మొదలైనతరవాత ఈ నమ్మకం సడలిపోవడం మొదలయింది. భౌతికవాదం వెలుగులోకి వచ్చి వెనుకటి ఆదర్శాలనూ, మూఢవిశ్వాసాలనూ చిందరవందర చేసి పారవేసింది. ఫ్యూడల్‌కావ్యాలలో దివ్యశక్తిరహితంగా మానవగౌరవాన్ని వర్ణించిన ఘట్టాలెక్కడా కనిపించవు. ప్రతికావ్యంలోనూ భగవన్నుతులే కనిపిస్తాయి. ప్రతికావ్యం ఇష్టదేవతాస్తుతితో మొదలవుతుంది. ప్రతికావ్యంలో ఇంచుమించు దేవుడు ప్రత్యక్షం కావడం, వరాలివ్వడం, అతణ్ని ఆ కావ్యనాయకుడు సంస్తుతించడం ఉంటాయి. ఈ శతాబ్ది తొలిదశకంవరకూ తెలుగుకవిత్వం భగవంతుడికే అంకితమయింది. గురజాడ అప్పారావుగారి కవిత్వంలో మానవగౌరవం ప్రవేశించింది తొలిసారిగా. ఇది బూర్జువావ్యవస్థప్రభావమే! 'మనిషి' అనే ఖండికలో "మనిషిచేసిన రాయిరప్పకి/మహిమ కలదని సాగిమొక్కుతు/మనుషులంటే రాయిరప్పల/కన్న కనిష్టం/గాను చూస్తావేల బేలా?/దేవుడెకడో దాగె నంటూ/కొండకోనల వెతుకులాడే వేలా?/కన్ను తెరిచిన కానబడడో?/మనిషిమాత్రుడి యందు లేడో?/యెరిగికోరిన కరిగి యీడో ముక్తి?" అంటూ సూటిగా ప్రశ్నించి మానవతాదృక్పథం అవలంబించాడు గురజాడ. తెలుగు కవిత్వంలో ఆధ్యాత్మికమానవుడికి బదులు భౌతికమానవుడు ప్రవేశించింది గురజాడతోనే!

విజ్ఞానశాస్త్రపరిశోధనలవల్ల విశ్వసృష్టిరహస్యాలు మానవుడికి అవగతం కావడం, పారిశ్రామికవిప్లవంవల్ల మానవుడు కూడా అనేక విచిత్రాలను సృష్టించగలగడం, యంత్రనిర్మాణంవల్ల మానవుడు కూడా విశ్వరక్షణకూ విశ్వనాశనానికీ సమర్థుడుగా రూపొందడం క్రమక్రమంగా దివ్యశక్తుల భావననుంచి మనిషిని భౌతికశక్తులవైపు లాగుతున్నాయి. ఇది బూర్జువావ్యవస్థలోనే ఆరంభమయింది. బూర్జువావ్యవస్థ మానవుడి మహత్తరశక్తిని వెలుగులోకి తీసుకురాగలిగింది.

ఈ వ్యవస్థయే మానవుడి సాంఘికకష్టాలకు కూడా కారణమయింది. ఈ కష్టాలనుంచి మానవుణ్ణి విముక్తంచేయడం ఎంత ముఖ్యమో ఈ వ్యవస్థవల్ల ఎదిగిన మానవుణ్ణి కీర్తించడం కూడా అంతే ప్రధానమైనదిగా గుర్తించిన మొదటి తెలుగుకవి శ్రీశ్రీయే! అందువల్లనే కవిత్వంలో మానవ గౌరవప్రశంసను చేశాడు శ్రీశ్రీ. మహాప్రస్థానంలో భగవద్విశ్వాసం కానీ, భగవద్భక్తిగానం కానీ శ్రీశ్రీ లక్ష్యాలు కావు. శ్రీశ్రీకి మానవుడే దేవుడు. మానవుడే దానవుడు. ఈ భేదం తొలగి పోవడానికి సామ్యవాదవ్యవస్థయే శరణ్యం అనేది శ్రీశ్రీ అవగాహన!

మానవుడా అనే ఖండికలో రకరకాల సంబోధనలు తప్ప ఏమున్నదని స్థూలదృష్టికి అని పించవచ్చు కాని శ్రీశ్రీ మానవతాదృక్పథం అంతా ఈ సంబోధనలలో పేరుకుని ఉంది.

### శ్రీశ్రీ సామ్యవాదమానవతావాదం

శ్రీశ్రీ మానవతావాదానికి మూడు లక్షణాలున్నాయి- పీడితమానవసానుభూతి, శ్రామికమానవసంక్షేమం, సామ్యవాదమానవాభ్యుదయం. (1) శ్రీశ్రీ శుద్ధమానవతావాది కాడు. పీడితమానవసానుభూతి శ్రీశ్రీ లక్షణం. అది సానుభూతిమాత్రమే కాదు; పీడిత మానవోద్ధరణకోసం పీడకమానవవర్గపుదౌర్జన్యాలను ధ్వంసంచేయాలనే ఆగ్రహం కూడా! బూర్జువావ్యవస్థలో బయల్దేరిన మానవకారుణ్యవాదం, సర్వోదయవాదం, అహింసావాదం వంటి వాటికి శ్రీశ్రీ సామ్యవాదమానవాభ్యుదయభావాలు వ్యతిరేకాలే. సామ్యవాదవ్యవస్థలోనే నిజమైన మానవకారుణ్యవాదం, సర్వోదయవాదం, అహింసావాదం చివురిస్తాయి.

(2) శ్రామికమానవుడి సంక్షేమం చూడని, శ్రామికవిప్లవం గుర్తించని బూర్జువామానవతావాదానికి శ్రీశ్రీ వ్యతిరేకి. స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రం (Liberty, equality and fraternity) అనే ఆశయాలు బూర్జువావ్యవస్థలో ఫలించవనేదే శ్రీశ్రీ అవగాహన.

(3) శ్రీశ్రీ మానవతావాదం సామ్యవాదమానవతావాదమే (Socialist Humanism.) దానికి మూలం మార్క్సిస్టులెనినిస్టు సిద్ధాంతాలే. మానవులంతా భౌతికంగా సుఖపడేది కమ్యూనిజం లోనే. మానవుడికి వ్యక్తిస్వాతంత్ర్యం ఇచ్చేదీ అదే. "Communism is the supreme embodiment of Humanism for it eliminates all surviving traces of inequality and establishes the supreme expression of Justice, the principle 'from each according to his ability, to each according to his needs' providing the essential conditions for the harmonious development of all individuals. Communism delivers "all men from social inequality, from every form of oppression and exploitation, from the horrors of war, and proclaims Peace, Labour, Freedom, Equality, Fraternity and Happiness for all peoples of the earth".[1] కనుక శ్రీశ్రీ మానవతాదృక్పథం కమ్యూనిజం చూపే మార్గమే!

---

1 A Dictionary of Philosophy.

శ్రీశ్రీ కవిత్వంలో మానవతాభావాలు ఎలా కనిపిస్తాయో దిఙ్మాత్రంగా పరిశీలిద్దాం: ప్రకృతితాదాత్మ్యం అనుభవించేవ్యక్తితో మొదలయింది శ్రీశ్రీ కవిత్వం. ఆ కవిత్వంలో మనకు కనిపించేది ఊహామానవుడేకానీ వాస్తవమానవుడు కాడు. 'చారిత్రిక మానవుడు' 'సుప్తాస్థికలు' ఖండికలో ప్రవేశించాడు. సాంఘికమానవుడు మహాప్రస్థానంలోనే కనిపించ నారంభించాడు. జయభేరి ఖండికయే అందుకు నిదర్శనం. ఈ సాంఘికమానవుడు స్పష్టమైన రూపందాల్చి శ్రామికమానవుడయ్యాడు. మహాప్రస్థానం అంటే శ్రామికమానవుల పురోగమనమే! ఈ శ్రామికమానవులు విశ్వమానవులయ్యారు శ్రీశ్రీ దృష్టిలో. అందుకే నరజాతికి పరివర్తన, చెలరేగిన జనసమ్మర్దం, నరజాతిచరిత్ర, మానవాళి, మానవపురోగమనమార్గాలు, జనావళి వంటిప్రయోగాలు శ్రీశ్రీ మహాప్రస్థానంలో కనిపిస్తాయి- మానవులలోని మంచిచెడ్డలకు మూలం ఉత్పత్తిసాధనాల యాజమాన్యానికి సంబంధించిన కలిమిలేములే అని శ్రీశ్రీ భౌతికంగా విశ్వసిస్తాడు. మానవుడిలోని అవినీతి అతడి ప్రయివేటుఆస్తిమీది ప్రీతివల్ల వృద్ధిపొందుతోంది. 'దోపిడీ'కి మూలం అదే. ఈ దోపిడిని తొలగించగలశక్తి మానవుడికే ఉంది. ఆ మానవుడినే శ్రీశ్రీ గౌరవిస్తాడు. అతడు సామ్యవాద మానవుడే.

### శ్రీశ్రీ మానవ విశ్వరూప సందర్శనం

భగవంతుడి విశ్వరూపాన్ని ఫ్యూడల్‌కవులు దర్శించడానికి తహతహలాడితే, ప్రకృతి విశ్వరూపాన్ని బూర్జువాకవులు దర్శించడానికి యత్నిస్తే కవిత్వ విశ్వరూపాన్నీ మానవుడి విశ్వరూపాన్నీ దర్శించడానికి శ్రీశ్రీ ప్రయత్నించడం జరిగింది. ఇందుకు రెండు కారణాలున్నాయి. మొదటిది శ్రీశ్రీలోని బూర్జువా అభ్యుదయచైతన్యం. రెండవది శ్రీశ్రీలోని సామ్యవాద అభ్యుదయ చైతన్యం.

మానవవిశ్వరూపసందర్శనం అంటే - (1) భిన్నకాలాల్లో భిన్న సమాజాల్లో ఒకదేశంలోనే మానవుడు పొందిన పరిణామాల స్వరూపం- (2) భిన్న ఖండాల్లో ప్రపంచం మొత్తంమీద మానవుడు సాధించిన అభ్యుదయం యొక్క స్వభావం- ఈ రెండంశాలనూ కూలంకషంగా తెలుసుకోగల్గడమే! చారిత్రిక విభాతసంధ్యల మానవకథ వికాసమెట్టిది? అంటూ చరిత్రకారులను శ్రీశ్రీ ప్రశ్నించాడు. ఆదిమానవుడి అవతారంనుంచి సామాజికంగా వైజ్ఞానికంగా సాంస్కృతికంగా మానవుడెలాంటి మార్పులను సాధించాడు? ఎలా భిన్న సామాజికవ్యవస్థలను నిర్మించాడు? అతడి భవిష్యత్తేమిటి? ఇదే మానవ విశ్వరూపసందర్శనానికి పరమావధి.

ఫ్యూడల్ మానవుడి దైవభీతి, విశ్వాసాలు; బూర్జువామానవుడి దురాశ, అవినీతి, వైజ్ఞానిక సాహసం, హేతువాదం, ప్రయోగాలు; శ్రామికమానవుడి నిజాయితీ, సమానతాదృష్టి ఈ మూడు పరిణామాలూ శ్రీశ్రీని కదిలించే విషయాలే! వీటన్నిటికీ హేతువులను అన్వేషిస్తాడు

భౌతికవాదిగా శ్రీశ్రీ. బూర్జువావ్యవస్థ ఏర్పడినతరువాతనే మానవచరిత్రకు విశ్వవిశాలరూపం లభించింది. ఏఖండానికాఖండం, ఏదేశానికాదేశంగా విడిగా ఉండే పరిస్థితి అదృశ్యమై "ఎల్ల లోకం ఒక్క ఇల్లయి" కనిపించింది బూర్జువావ్యవస్థలోనే. ఈ సామాజిక వ్యవస్థాపరిణామం వల్లనే 'అంతర్జాతీయమానవుడు' అనే భావన (concept) ఏర్పడింది దేశాలూ జాతులూ భాషలూ వేరైనా మానవుడు ఒక్కడే! అతడే విశ్వమానవుడు. ఏ అభ్యుదయం ఏ దేశంలో సాధించబడినా అది విశ్వమానవుడి సంపదయే అవుతుంది. ఏ కళంకం ఏ దేశంలో మానవుడికి సంభవించినా అది మానవజాతికంతటికీ కళంకమే. అంతర్జాతీయమానవుడికి సౌభాగ్యం, కళంకం రెండూ కూడా ఉన్నాయి. కానీ ఆ కళంకాలు పునరావృత్తం కాకుండా చేసి అభ్యుదయాలను అందరూ అనుభవించేటట్లు చేయడమే కమ్యూనిజం యొక్క తత్త్వం. విశ్వశ్రేయస్సే కమ్యూనిజం ఆశయం. ఆ కమ్యూనిస్టుమానవుడే భవిష్యన్మానవుడు. అతడే మానవవిశ్వరూపంలో అత్యున్నతావతారం.

గత మానవచరిత్రను విస్మరించనక్కరలేదనీ ఆ చరిత్రకళంకాలను పూడ్చివేయనక్కరలేదనీ శ్రీశ్రీ ప్రధానంగా మూడు ఖండికల్లో సూచించాడు. అవి (1) దేశచరిత్రలు (2) మానవుడా (3) ఆశాదూతలు. ఈ మూడు ఖండికల్లోనూ మానవుడి సంకుచితస్వభావాలను కూడా బహిర్గతం చేయడంలో శ్రీశ్రీ వెనుకంజ వేయలేదు.

మానవుడా ఖండికలో శ్రీశ్రీ భిన్నసామాజికవ్యవస్థల్లోని మానవుడి పతనాభ్యుదయాలను సూచించాడు. (1) ఫ్యూడల్ బూర్జువావ్యవస్థల్లో పరపీడనపరాయణుడైన మనిషి. (2) ఫ్యూడల్ బూర్జువావ్యవస్థల్లో పరపీడితుడైన మనిషి. (3) ఫ్యూడల్‌వ్యవస్థలో ఆదర్శవాదిగా మనః ప్రపంచంలో అభ్యుదయం సాధించిన మనిషి. (4) బూర్జువావ్యవస్థలో భౌతికవాదిగా వస్తుప్రపంచంలో అభ్యుదయం సాధించిన మనిషి. ఈ నాల్గు దశలనూ శ్రీశ్రీ ఎలా నిరూపించాడో క్రమంగా చూద్దాం.

(1) మానవుడే బూర్జువా అయినపుడు శ్రామికమానవుడిచేత యంత్రభూతాల కోరలు తోమించి ఏడ్పిస్తున్నాడు. మానవుడే సామ్రాజ్యవాదియైనపుడు బలహీనుల్ని బానిసలనుచేసి దగా చేస్తున్నాడు. నెత్తురుక్రక్కుకుంటూ నేలకు రాలిపోయిన సాహసిని నిర్దాక్షిణ్యంగా చూస్తున్నాడు ఆ బూర్జువా మానవుడే. దరిద్రులను కాల్చుకు తిన్నదీ నరహంతకుడైనదీ కాలానికి కత్తులవంతెన కట్టినదీ సామ్రాజ్యాలు స్థాపించినదీ దౌర్జన్యాలు చేసినదీ పన్నాగాలు పన్నినదీ దండయాత్రలు చేసినదీ పల్లకీలెక్కి మోయించుకున్నదీ అన్యాయాలు జరిపించినదీ ఆచారాలు నిర్మించినదీ మాయను ప్రతిపాదించినదీ మంచిచెడ్డల సరిహద్దులను నిర్ణయించినదీ న్యాయస్థానాలు రక్షకభటవర్గాలు చెరసాలలు ఉరికొయ్యలు ఏర్పాటుచేసినదీ దారుణద్వేషాగ్ని పెంచినదీ కుట్రలు పన్నినదీ ఆ ఫ్యూడల్ బూర్జువావ్యవస్థల్లోని మానవుడే!

(2) రోగార్తులు, త్రాగుబోతులు, పడుపుకత్తెలు, నిరపరాధులు, ఉన్మాదులు, కూలీలు, కర్షకులు, కార్మికులు, అభాగ్యులు, అనాథులు, అశాంతులు, దరిద్రులు, నిరుద్యోగులు, బిచ్చగత్తెలు, విద్యార్థులు, సంసారులు, జీతగాళ్ళు, దురదృష్టజీవులు, పరాజితులు, పరాభూతులు, శిశువులు, రిక్షావాలాలు, గనిపనిమనుషులు, ఓడకళాసీలు, పల్లకీబోయీలు, తాడితులు, పీడితులు, పతితులు, భ్రష్టులు, బాధాసర్పదష్టులు, దీనులు, హీనులు, పరిచ్యుతులు, తిరస్కృతులు, గతాసువులు, చ్యుతాశయులు, హృతాశ్రయులు, హతాశులు, వ్యథానివిష్టులు, కథావశిష్టులు, దగాపడిన తమ్ములు- వీరంతా ఫ్యూడల్ బూర్జువావ్యవస్థల్లోని పీడితమానవులు.

ధర్మస్థాపనకు యుద్ధంచేసేవాడు, అన్యాయం భరించలేనివాడు, సంఘపశువు, శ్రమైకజీవి, ఘర్మవర్షపయోదుడు, కష్టజీవి, కూలి, మాలి, రైతు, గుడిసెలలో బ్రతికేవాడు, గంజినీళ్ళుత్రాగి కాలంగడిపేవాడు, కడిపెడు సంతానం కలిగినవాడు, ఆకలికన్ను అయిన మానవులు శ్రీశ్రీకి ఈ పీడితవర్గంలో కనిపించినవారే!

(3) సౌందర్యం ఆరాధించేవాడా! కవితలో శిల్పంలో పురుగులో పుష్పంలో మెరుపులో మేఘంలో సౌందర్యం ఆరాధించేవాడా! ప్రేమించేవాడా! జీవించేవాడా! సుఖించేవాడా! దుఃఖించేవాడా! విహ్వలుడా! వీరుడా! వియోగీ! యోగీ! భోగీ! త్యాగీ! ఆలోచనలు పోయేవాడా! ఊర్ధ్వదృష్టి! మహామహుడా! మహాప్రయాణికుడా! ఆదర్శజీవీ! మహాత్మా! పాడేవాడా! సహృదయా!, రసైకజీవీ!, కవీ!, నటుడా!, శిల్పాచార్యా!, గానకళాకోవిదుడా!, వేదాంతీ!, విజ్ఞానధనీ!, భావధునీ! దుఃఖమయా!, దయాళుడా!, పరదుఃఖాసహనశీలీ!, చీమను చంపడానికి కూడా చేతులు రానివాడా!, బుద్ధమూర్తీ!, జీసస్!, పిపాసీ! తపస్వీ!, మొదలైన సంబోధనలతో చెప్పబడిన మానవుడు ఫ్యూడల్‌వ్యవస్థలో ఆదర్శవాదిగా భావప్రపంచంలో ఎన్నో విజయాలు సాధించిన మానవుడే! ఈ సంబోధనలద్వారా సూచింపబడిన మానవసాంస్కృతిక లక్షణాలు ఫ్యూడల్ వ్యవస్థలో వికసింపనారంభించాయి.

(4) తాను నేర్చిన విద్యలవల్ల, శాస్త్రాలవల్ల, తానుచేసిన పరిశోధనలవల్ల, తన నిర్మాణకౌశలంవల్ల ఈ లోకంలో భౌతికంగా ఎంతో అభ్యుదయాన్ని సాధించిన మానవుడు బూర్జువా వ్యవస్థలోనే అవతరించాడు. ఆలోచనలు పోయేవాడా! అనునిత్యం అన్వేషించేవాడా! చెట్టూ చేరువూ గట్టూపుట్టా ఆకసంలో సముద్రంలో అన్వేషించేవాడా! సముద్రాలు దాటేవాడా! ఎడారులూ పర్వతాలూ గడిచేవాడా! ఆకాశాలను వెదికేవాడా! నక్షత్రాలను శోధించేవాడా! వంతెనలు నిర్మించినవాడా! వైద్యశాలలు, వస్తుప్రదర్శనశాలలు, గ్రంథాగారాలు, పరిశ్రమాలయాలు, ధూమశకటాలు, నౌకలు, విమానాలు నిర్మించినవాడా! దూరదృష్టి దూరశ్రవణ శక్తులు సాధించినవాడా! మొదలైన సంబోధనలలో బూర్జువావ్యవస్థలోజరిగిన బ్రహ్మాండమయిన

మానవశక్తివికాసాన్ని కొనియాడటం జరిగింది. బూర్జువావ్యవస్థలోని మానవుడు పారిశ్రామిక మానవుడు. ఇతడే అనేకభాషలు మాట్లాడేవాడు! అనేకస్థలాలలో తిరిగేవాడు! అనేకకాంతులు వెదజల్లేవారు! మానవుడు ధనసంపాదనకోసం ఎన్నో దేశాలు తిరిగాడు; వాణిజ్యం చేశాడు. ఆ దేశాటనంలో అతడెన్నో నూతనభాషలు నేర్చుకున్నాడు. సముద్రయానాలుచేసి నూతనభూభాగాలెన్నో కనుక్కున్నాడు. ఉదాహరణకు మార్కోపోలో పశ్చిమయూరప్‌నుంచి బయలుదేరి చైనాకు చేరుకున్నాడు. వాస్కోడిగామా పోర్చుగల్లునుంచి బయలుదేరి ఇండియాకు చేరుకున్నాడు. కొలంబస్ స్పెయిన్‌నుంచి బయలుదేరి అమెరికాకు చేరుకున్నాడు. ఈ నౌకాయాత్రలలో భూగోళ స్వరూపం వెల్లడయింది. 20వ శతాబ్దంలో విమానం ద్వారా ఆకాశపరిశోధనలో ఆరంభమైన నూతనశకం చంద్రలోకయాత్రదాకా పురోగమించింది. అణుశక్తి ఆవిష్కృతం కావడంతో ఉపగ్రహాలు ప్రయోగింపబడ్డాయి. ఈ ఉపగ్రహాలతో ఆకాశాన్ని జయించాడు మానవుడు. ఇది మానవుడి వైజ్ఞానికప్రస్థానానికి ఎత్తిన భువనభవనపు బావుటా. రాకపోకలకూ నదులను దాటడానికీ రోగాలను మాన్పడానికీ తన హస్తనైపుణ్యంతో వస్తువులను తయారుచేయడానికీ విద్యను వ్యాపింపజేయడానికీ పరిశ్రమలను అభివృద్ధిచేయడానికీ మానవుడెన్నో నూతన ప్రయత్నాలు చేశాడు. ఆకాశమార్గంలోనే కాక భూమార్గంలో జలమార్గంలో సంచరించడానికి యానసాధనాలను నిర్మించుకున్నాడు. దూరదర్శనం, దూరశ్రవణం వంటి కథలను నిజంచేశాడు. ఇవన్నీ ఎలా సాధ్యమయ్యాయి? భౌతికశాస్త్రం, యంత్రనిర్మాణం, పారిశ్రామికవిప్లవం ఇందుకు హేతువులనే శ్రీశ్రీ విశ్వాసం. వీటికి భగవంతుడిదయ కారణమనేవాడు కాదు శ్రీశ్రీ. అలాంటి అభిప్రాయాన్ని శ్రీశ్రీ ఎక్కడా వ్యక్తం చేయలేదు. వైజ్ఞానికప్రగతి, యాంత్రిక విప్లవం మానవుడి మనుగడనే మార్చివేశాయి. ఈ మార్పు కొత్తదనాన్ని తీసుకువచ్చింది. వైజ్ఞానిక విజయాలలో ముఖ్యమైనవన్నీ 19-20 శతాబ్దాల్లో సాధించబడ్డవే. ప్రథమప్రపంచ యుద్ధం మానవుడి సంస్కృతినంతటినీ మార్చివేసింది. ఏ యుగంలోనూ ఎరుగనన్ని మార్పుల్ని మానవుడు 1914-1938 మధ్యతీసుకు వచ్చాడు (38 నాటి గేయం మానవుడా). ఈ మధ్య కాలంలోనే సైన్సు మానవజీవితంలో ప్రధానపాత్ర వహించింది. దూరం జయింపబడింది. కాలవిలంబనం అతిక్రమింపబడింది. అంతర్జాతీయమానవు డవతరించాడు. ఎల్లలు, గోడలు రద్దయ్యాయి. వీటన్నిటికీ కీలకమైన మానవుడి దూరదృష్టి, దూరశ్రవణశక్తుల్ని శ్రీశ్రీ ప్రశంసించాడు.

భౌతికవాది అయిన శ్రీశ్రీ భౌతికమానవుడి విజయాలనే అభిమానిస్తాడు. టెలిస్కోప్, స్టీమ్‌ఇంజన్, స్టీమ్‌లోకోమోటివ్, స్టీమ్‌బోట్, టెలిగ్రాఫ్, కలరాటీకాలు, ఎక్స్‌రే, విమానం, టెలిఫోన్ మొదలైనవన్నీ భౌతికవిజయాలే. వీటిని ఏ దేశంలో ఏవ్యక్తి కనిపెట్టినా అవి మానవుడి సంపదే!

శ్రీశ్రీ మానవావగాహన

మానవావతరణ పరిణామ వికాసాలను గురించి శ్రీశ్రీ అవగాహన హేతువాదంతో కూడినది. ఇందులో 5 అంశాలున్నాయి (1) మానవుడి పుట్టుక (2) మానవుడి లక్షణాలు (3) మానవులలో వర్గభేదాలు (4) మానవులలో వర్ణ, జాతి భేదాలు (5) మానవులలో వయోభేదాలు, లైంగిక భేదాలు.

(1) మానవుణ్ని ఈ కోసనుంచి చూసిన శ్రీశ్రీ మానవుడిఅవతరణం ఎలా జరిగిందనే ప్రశ్న వేసుకోకమానలేదు. కానీ మానవావతరణాన్ని కూడ భౌతికదృష్టితోనే శ్రీశ్రీ అవగాహన చేసుకున్నాడు. ఆదర్శవాదులకువలె మానవుణ్ని బ్రహ్మదేవుడు సృష్టించాడనే అభిప్రాయం శ్రీశ్రీకి లేదు. "రాశిచక్రగతులలో/రాత్రిందివాల పరిణామాలలో/బ్రహ్మాండగోళాల పరిభ్రమణాలలో/కల్పాంతాలకు పూర్వం కదలికపొందిన/పరమాణువు సంకల్పంలో/ప్రభవం" పొందిన వాడట మానవుడు. మానవుడు స్వయంభువు. అతణ్ని దేవుడనేవాడొకడు సృష్టించాడనేది భ్రమ. ఈ అభిప్రాయం "ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై ఎవ్వనియందు డిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణంబెవ్వ డనాదిమధ్యలయుడెవ్వడు సర్వము తానయైన వాడెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబువేడెదన్" అనే భక్తుడి శరణాగతికి సవాలు.

సృష్టిలో రాశిచక్రాలు, రాత్రిందివాలు, బ్రహ్మాండగోళాలు అన్నీ చలన శీలాలు, పరిణామ శీలాలు. ఇవి వరుసగా రోదసి, కాలం, పదార్థం (Space, Time and Matter) అనే మూడింటికీ ప్రతినిధులు. ఈ మూడూ మానవావతరణానికి ముందే ఉన్నాయి. కల్పాంతాలు కాలానికి కొలతలు. పరమాణువు (Molecule) పదార్థపు కనిష్ఠాంశం (smallest particle of matter). ఈ పరమాణువునుంచి ప్రభవించినవాడే మనిషి. జీవశాస్త్ర దృక్పథంతో మానవజననాన్ని సంగ్రహించాడు శ్రీశ్రీ.

(2) మానవుడి లక్షణాలను భౌతికవాదదృష్టితోనూ హేతువాదదృష్టితోనూ శ్రీశ్రీ క్రోడీకరించుకున్నాడు. అనుభూతి, ఆలోచన, అన్వేషణ, శ్రమ, నిర్మాణం, సంస్కరణం, విప్లవీకరణం అనేవి మానవుడి మౌలికలక్షణాలు. ఇతడే అభ్యుదయమానవుడు. యథాస్థితివాది, తిరోగమనవాది అభ్యుదయాన్ని గుర్తించలేనిమానవులు. "Man was the last to come but the first to use his brain for the purpose of conquering the forces of nature".[2] ప్రకృతి సౌందర్యాలను చూసి ముగ్ధుడై పోయినమానవుడు ప్రకృతిరహస్యాలను తెలుసుకుని ప్రకృతిశక్తులను వశ

2 The Story of Mankind 3 p.

పరుచుకోవడానికి పూనుకున్ననాడే అనుభూతినుంచి ఆలోచనలోకి పరివర్తన చెందాడు. ఆలోచనను అన్వేషణ అనుసరించింది. అక్కడే ఆరంభమయింది శ్రమ. "In short, the animal merely uses its environment, and brings about changes in it simply by his presence, man by his changes makes it serve his ends, masters it. This is the final essential distinction between man and other animals, and once again it is labour that brings about this distinction"[3] అన్నట్లు మానవుణ్ణి గురించి శ్రీశ్రీ అవగాహన మార్క్సిజంలో నుంచి అవతరించిందే. జంతువు కన్నా మానవుడి పశిష్టత శ్రామికత్వమే అని గుర్తించినవాడు కనుకనే శ్రామికమానవుణ్ని శ్రీశ్రీ గౌరవించాడు. కదలిక, మార్పు పురోగమనం మానవుడు చేసే ఏ పనికైనా ముఖ్యంగా భావించాడు.

అనుభూతి,ఆలోచన,(హృదయం, మేధ) ఈరెండింటివల్లనే మానవుడు అశాంతికి గురిఅవుతూ ఉంటాడని శ్రీశ్రీ అభిప్రాయం. ప్రకృతిలో అంతిమవిజయం మానవుడిదే! కానీ అతడు మానసిక దౌర్బల్యాలకు లోనవుతూనూ ఉంటాడు; ఔన్నత్యం సాధించడానికి ప్రయత్నిస్తూనూ ఉంటాడు. మానవుడుచేసే ఈ ప్రయత్నమే మానవచరిత్ర. ఆ చరిత్రలో ఎగుడుదిగుడు లేర్పడటానికీ పీడక పీడితవర్గాలు ఏర్పడటానికీ యుద్ధాలూ తిరుగుబాట్లూ రావడానికీ మానవస్వభావమే కారణం. సామ్రాజ్యవాదుల మధ్య మాత్సర్యమే ప్రపంచయుద్ధాలకూ బూర్జువాల దురాశయే తిరుగుబాట్లకూ హేతువులవుతున్నాయి. ఈ కారణాలను "కాట్లాడుకునేవాడా! ఓర్వలేనివాడా! సంకుచితస్వభావుడా! ధర్మస్థాపనకు యుద్ధం చేసేవాడా! అన్యాయం భరించలేనివాడా! తిరగబడేవాడా! ప్రశ్నించేవాడా! అన్యాయాలకు ఆహుతి కావడానికైనా జంకనివాడా! ఖైదీ! రౌడీ! ఖూనీకోర్!" వంటి సంబోధనలలో వ్యక్తంచేశాడు శ్రీశ్రీ. మానవుడిలోని ద్వంద్వప్రవృత్తి శ్రీశ్రీకి విషాదం కలిగిస్తుంది. ఈ ద్వంద్వప్రవృత్తి పోవడానికి శ్రీశ్రీ సిఫార్సుచేసే ఔషధమే సామ్యవాదం. మానవుణ్ణి వర్గాతీతంగా సామాజికాద్వైతిగా అఖండమానవుడిగా తీర్చి దిద్దే మానవత్వం సామ్యవాదసామాజికవ్యవస్థలోనే లభిస్తుందని శ్రీశ్రీ గాఢవిశ్వాసం.

(3) రెండురకాల మానవుణ్ని సృష్టించింది సామాజికవ్యవస్థయే అనేది శ్రీశ్రీ అవగాహన. "ఓర్వలేనివాడు, సంకుచితస్వభావుడు, బలవంతుడు, ధని, భోగి, సుఖించేవాడు"-అయిన మానవుడు ఆదిమసమష్టికుటుంబవ్యవస్థ అంతరించినతరవాత బయలుదేరినవాడే. యజమాని- బానిసవ్యవస్థలోనే పీడితమానవుడు బయలుదేరాడు. ఆనాటినుంచీ బూర్జువావ్యవస్థవరకూ పీడితుడు రూపాంతరాలతో పెరుగుతూనే ఉన్నాడు. అతడే "ధర్మస్థాపనకు యుద్ధంచేసేవాడు, అన్యాయం భరించలేనివాడు, దరిద్రుడు, బలహీనుడు, సంఘపశువు, శ్రమైకజీవి, ఘర్మవర్షపయోధుడు, కష్టజీవి,

3 The Part played by Labour in the Transition from Ape to Man

కార్మికుడు, కూలి, మాలి, రైతు, గుడిసెలలో బ్రతికేవాడు, గంజినీళ్ళు త్రాగి కాలంగడిపేవాడు, కడిపెడు సంతానం కలిగినవాడు, ఆకలికన్ను, తిరగబడేవాడు, ప్రశ్నించేవాడు, అన్యాయాలకు ఆహుతి కావడానికైనా జంకనివాడు, ఖైదీ" అవుతున్నాడు.

(4) మానవుడిలో వర్గభేదాలే కాదు జాతిభేదాలనూ కూడా గమనించాడు. వీటిని గమనించడానికి శ్రీశ్రీ 20వ శతాబ్ది కవి కావడమే కారణం. ప్రపంచంలో భిన్నఖండాల్లో భిన్న ద్వీపాల్లో ధ్రువప్రాంతాల్లో మానవు లున్నారు. ప్రాంతాలు, రంగులు, జీవన స్థాయులు, బలం మొదలైనవాటిలో తేడా ఉన్నా ప్రతిమానవుడూ జీవితాశ కలిగిఉండటంలో తేడా లేనివాడే. అనాదికాలంలో ఒకేచోట ఉండే మానవ కుటుంబమే భిన్నప్రాంతాలకు కదిలివెళ్ళి నివాసాలేర్పరుచుకుని విడిపోయి ఉండవచ్చు. అందువల్ల మానవులంతా ఏకకుటుంబంవారే! బంధువర్గంవారే! "ఆసియా అమెరికా యూరప్ ఆఫ్రికా ఆస్ట్రేలియాలలో సముద్రద్వీపాలలో ధ్రువప్రాంతాలలో పట్టణాలలో పల్లెలలో ధనివో దరిద్రుడవో వృద్ధుడవో యువకుడవో తెల్లని నల్లని ఎర్రని పచ్చని రంగో బలవంతుడివో బలహీనుడివో బ్రతికేవాడా! పాడేవాడా! మానవుడా! మానవుడా! అవిభక్తకుటుంబీ! ఏకరక్తబంధూ!"

ప్రపంచంలో కొన్ని ఉత్తమజాతులనీ కొన్ని నీచజాతులనీ శ్రీశ్రీ అంగీకరించడు. వారంతా ఏకరక్తబంధువులే! వారిది అవిభక్తకుటుంబమే! వాస భేదాలు, వర్గభేదాలు, వర్ణభేదాలు, జాతిభేదాలు, ఆర్థికభేదాలు, శక్తిభేదాలు - ఇలా ఈభేదాలన్నీ మానవసమాజ చారిత్రిక గమనంలో ఏర్పడినవే కానీ సహజమైనవికావు. ఈ అసహజస్థితినుంచి తిరిగి సహజస్థితికి వెళ్ళడమే ఒకవిధంగా పురోగమనం. అసహజత్వాన్ని వృద్ధిపొందించుకుంటూ భేదాలను అనంతంగా రూపొందించుకోవడం అభ్యుదయంగా శ్రీశ్రీ భావించలేదు. భిన్నజాతులు, భిన్నవర్గాలు, భిన్నవర్ణాలు ఏకమైపోవాలనేది శ్రీశ్రీ కమ్యూనిస్టుసిద్ధాంతం.

(4) మానవుడి శిశుదశనూ యౌవనదశనూ వార్ధకదశనూ శ్రీశ్రీ గుర్తించాడు. "బేబీ యువకుడు, వృద్ధుడు" ఆ మానవుడే. అయితే ఇంత విశాలంగా మానవుణ్ని గురించి సమాలోచించిన శ్రీశ్రీ 'స్త్రీ'ని ప్రత్యేకంగా పేర్కొనలేదు. కానీ 'బేబీ' అనే సంబోధన లైంగికభేదం లేని మానవత్వానికి చిహ్నం. మానవత్వంలోని ఒకభాగమే స్త్రీ. రుధిరస్వప్నాలను కాంచే జవరాలు, భయంకర బాధల పాటలు పాడే పడుపుకత్తె, ఆకటి చీకటి చిచ్చులనుభవిస్తూ హాహాకారంచేసే కూలీ భార్య, ఆరినకుంపటిలాంటి బిచ్చగత్తె, పల్లెటూరిలో పాడుకలలో బాటసారి తల్లి మొదలైనవారంతా దివ్యాంగనలుకారు; వీరంతా మానవసమాజంలోని భాగాలే. పురోగమనం సాధించే పురుషమానవుడి నీడలే.

## శ్రీశ్రీ మానవోద్ధరణమార్గం

ఫ్యూడల్ వ్యవస్థలో మానవోద్ధరణకు అనేకమార్గాలను నిర్దేశించిన ప్రవక్తలు కనిపిస్తారు. భక్తిజ్ఞానవైరాగ్యమార్గాలు మానవుణ్ని సకలకష్టాలనుంచీ సంసారభారాలనుంచీ తప్పించి విముక్తుణ్ని చేస్తాయని చెప్పినవారున్నారు. ఇవేవీ భౌతికదృక్పథానికి చెందినవికావు. మానవుడి భౌతిక సమస్యలకు నివారణమార్గాలు 20వ శతాబ్దిలో రెండేరెండు వెలుగులోకి వచ్చాయి. మొదటిది అహింసావాదం. రెండోది విప్లవవాదం.

(1) గాంధీజీ చెప్పిన అహింసావాదానికి పునాదులు ఆర్షమతంలో బుద్ధమతంలో జైనమతంలో జీసస్‌మతంలో ఉన్నవే. మానవుడి మనస్సును సంస్కరిస్తే భౌతికసమస్యలకు పరిష్కారం దానంతట అదే లభిస్తుందనేది ఈ వాదపు సారాంశం. ఆర్థికరాజకీయపరిస్థితుల ప్రభావం మానవ భౌతికవికాసంమీద ఉంటుందనేది ఈ వాదం అంగీకరించదు. అహింసావాదం ఆదర్శవాదమేకాని వాస్తవవాదం కాదు. ఈ వాదం భగవంతుణ్ని నమ్మమంటుంది. హేతువులకు అతీతమైన సత్యాలున్నాయంటుంది. అందువల్ల ధనస్వామ్యంమీద తిరుగుబాటువద్దనీ దానంతట అదే క్షీణించే రోజువస్తుందనీ సూచిస్తుంది. ధనస్వాములకు నైతికవర్తనం గురించి బోధిస్తుంది. పీడితమానవుడికి అహింసావాదం ఇచ్చే సందేశం సహనమే! "దుఃఖమయా! దయాళూ! పరదుఃఖాసహనశీలీ! చీమను కూడా చంపడానికి చేతులు రానివాడా! బుద్ధమూర్తీ! జీసస్!" అంటూ మానవుడి చారిత్రిక పరిణామంలోని ఒక దశను కీర్తించాడు శ్రీశ్రీ. కానీ దుఃఖం, దయ, అహింస, నిర్వాణం, సహనం మానవుణ్ని సామాజికదురన్యాయాలనుంచి పూర్తిగా గట్టెక్కించలేకపోవడానికి గతంలోని సామాజికచరిత్ర అంతా సాక్ష్యమే.

(2) మార్క్స్ చెప్పిన విప్లవవాదానికి పునాదులు ఏ మతంలోనూ లేవు. విజ్ఞానశాస్త్రం, ప్రకృతిపరిణామాలు, సామాజికచరిత్ర దానికి పునాదులు. మానవుడే భౌతికసమస్యలను స్వయంగా పరిష్కరించుకోవాలంటుంది మార్క్సిజం. మానవుడి ఆలోచనలమీద ఆర్థికరాజకీయ పరిస్థితుల ప్రభావాన్ని గుర్తిస్తుంది. ఇది వాస్తవవాదం. ఈ వాదం దివ్యశక్తుల్ని నమ్మదు. హేతువే దీనికి ప్రమాణం. ధనస్వామ్యంమీద తిరుగుబాటు చేయాలంటుంది. పీడితులకు కర్తవ్యాన్ని బోధిస్తుంది. పీడితమానవుడికి విప్లవవాదం ఇచ్చే సందేశం సమష్టిగా తిరుగుబాటు చేయడమే!

శ్రీశ్రీది విప్లవవాదమే! అహింస అతనిదృష్టిలో ఒక ఆశయంమాత్రమే! దాన్ని సాధించడానికి సామ్యవాదం అవసరం. బూర్జువావ్యవస్థలో అహింస అసాధ్యం; సామ్యవాదవ్యవస్థలో అహింస ఒక వాస్తవం. బూర్జువావ్యవస్థలో అహింస ఒకపలాయనవాదం. "ధర్మస్థాపనకు యుద్ధం చేసేవాడా! అన్యాయంభరించలే..వాడా! తిరగబడేవాడా! ప్రశ్నించేవాడా! అన్యాయాలకుఆహుతి

కావడానికైనా జంకనివాడా!" అంటూ మానవుణ్ని సంబోధించడంలో శ్రీశ్రీ మానవోద్ధరణ మార్గం వ్యక్తం అవుతోంది. తిరుగుబాటుచేసే మానవుణ్నే శ్రీశ్రీ అభిమానించాడు. అలజడి పీడితమానవుడి జీవితం! ఆందోళన పీడితమానవుడి ఊపిరి! తిరుగుబాటు పీడితమానవుడి వేదాంతం! మానవుణ్ని సంఘపశువు (social animal) గా కూడా పేర్కొన్నాడు శ్రీశ్రీ. అందువల్లనే మనిషి సంఘాన్ని విడిచి ఏకాంతంగా బ్రతకలేడు. ఈ సమష్టిజీవితంలోనే అతడు దోపిడికి గురిఅవుతాడు. ఈ దోపిడి శ్రమైకజీవికే జరుగుతోంది. ఈ శ్రామికుడే తిరుగుబాటు ప్రకటిస్తాడు.

శ్రీశ్రీ కావ్యనాయకుడు శ్రమైకజీవియే. శ్రమైకజీవనసౌందర్యమే శ్రీశ్రీదృష్టిలో సౌందర్యం. శ్రమయే ఆ నాయకుడి ప్రియురాలు. ఈ నాయకుడు కూడా అనేకరూపాలలో ఉండవచ్చు:— "కూలి, మాలి, రైతు, గుడిసెలలో బ్రతికేవాడు. కడిపెడు సంతానం కలిగినవాడు, ఆకలికన్ను". మానవోద్ధరణ ఈ శ్రమైకజీవి అయిన మానవుడిమీదనే ఉన్నదని సారాంశం. "మానవజాతిని ఉద్ధరించడానికి కొత్తమతం కనిపెట్టిన ప్రవక్త" లా శ్రీశ్రీ చెలంగారికి కనిపించాడట! ఆ కొత్త మతం మరేదో కాదు; కేవలం విప్లవవాదమే! శ్రీశ్రీకి మహాప్రవక్తలెవరో కాదు; మార్క్సు ఎంగెల్సులే!

## శ్రీశ్రీ కవిత్వంలో పదమైత్రి సంవిధానం

శ్రీశ్రీ కవితాభాషలో కొన్ని నవ్యతాముద్రలకు మానవుడా ఖండిక ఒకనిలువుటద్దం. ఈ నవ్యతాముద్రలవల్ల ఛందస్సు అప్రధానస్థానం పొందింది. శ్రీశ్రీ కవితాభాషకు ముడిసరుకు వాడుకభాషయే. వాడుకభాషలోని జంటపదాలను శ్రీశ్రీ వాడకుంటాడు. ఇవి సహజసిద్ధమైనవీ, కల్పితమైనవీ అని రెండురకాలు. (1) చెట్టూ—చెరువు; గట్టూపుట్టా; స్వర్గం-నరకం; చావు-పుట్టుకలు; కష్టాలు—నష్టాలు; కోపాలు—తాపాలు; తిట్లూ—రాట్లూ; చావు-బ్రతుకులు; అవతల-ఇవతల; పాపం—పుణ్యం; మాటలు—పాటలు; కష్టం—సౌఖ్యం; విన్నవి—కన్నవి; వానా—వరదా; ఇపుడు—అపుడు; నవ్వులు-పువ్వులు; కూడు—గూడు; కుడి—యెడమ-ఇవన్నీ లోకసిద్ధమైనవే.

(2) జంటపదాలను కల్పించడంలో శ్రీశ్రీ అనేక నియమాలు పాటిస్తాడు. (a) యతి విన్యాసంతో జంటపదాలను సృష్టించడం: పురుగు-పుష్పం; మెరుపు-మేఘం; పట్టణాలు—పల్లెలు; ధని—దరిద్రుడు, బలవంతుడు—బలహీనుడు, సహృదయుడు—సదయుడు; కష్టజీవి—కార్మికుడు, అనర్ఘ్యం—అనర్ఘం; నిమిషాలు—నిషాలు; అమోఘం-అగాధం; అచింత్యం-అమేయం; ఏకాంతం—ఏకైకం; ప్రయాణికుడు— పరివ్రాజకుడు; అనుపమిత—అపరిమిత; విలాపం—విషాదం; నిష్ఫలం—నిష్ఠురం; అనాథులు—అశాంతులు; దీర్ఘశ్రుతి—తీవ్రధ్వని; దారిద్ర్యం-దౌర్జన్యం; బాటలు—పాటలు; సమర్పణం—సమర్చనం; త్రిలోకాలు-త్రికాలాలు; కష్టజీవులు-కర్మవీరులు; స్వస్తివాక్యాలు—స్వర్ణవాద్యాలు; భావం—భాగ్యం; ప్రాణం-ప్రణవం; స్వప్నం-స్వర్గం; దుర్ఖ్యాతి—దుర్గతి; దుర్మతి-దుర్మృతి;

ఇరులు–ఇరుకులు; మరపులు–మడతలు; పిట్టలు–పిల్లలు; అడవులు–అగడ్తలు: ఉద్రేకం-ఉల్లాసం; అనురాగం-ఆర్భాటం; సింహం-సివంగి; ఫిరంగి-కురంగి; శంఖం-సర్పం; పండితులు–బాలకులు; కర్మాగారం-కళాయతనం; కార్యాలయం-కారాగృహం; జడి–చలి; అర్ణవం-అంబరం; ఆనందం–అనురాగం; నిక్వాణం–నిర్వాణం; విషవాయువులు-విరితేనియలు; ప్రపంచం-భవిష్యం; ఆకలి–ఆవేశం; మొద్దులు-మొరటులు; మర్యాద-మప్పితం; సమస్యలు-సందేహాలు; వ్యత్యాసాలు–వ్యాఘాతాలు; కుట్రలు-కుహకం; స్వతంత్రత-సమానత; కార్మికులు-కర్షకులు; పతితులు–భ్రష్టులు; సంరంభం-సంక్షోభం; సమ్మర్దన-సంఘర్షణ; సవనం-సమరం; ద్రోహాలు-దోషాలు; స్వాతంత్ర్యం-సమభావం; సౌభ్రాత్రం-సౌహార్దం; చిరునవ్వూ-చేయూత; అనాదరణ-అలక్ష్యం మొదలైనవి.

(b) ప్రాసవిన్యాసంతో జంటపదాలను సృష్టించడం:—వియోగి–యోగి; భోగి–త్యాగి; పిపాసి-తపస్వి; బాటలు-పేటలు; త్రాచులు-రేచులు; గిరులు-సాగరులు; దుర్గం–స్వర్గం; విహారం–సంచారం; గానం–ధ్యానం; హాసం–లాసం; పవి-కవి; కుటి-చీకటి; ఆలాపన-ప్రేలాపన; కేకా–బాకా, నుడి-గుడి, హృద్యం-నైవేద్యం, రసధుని–మణిఖని; హాలాలు-హాలాలు, ఘర్మజలం-ధర్మజలం, నరాలు-కరాలు, పగ్గం–మగ్గం, గీతి-రీతి, ఏళ్ళూ-కీళ్ళూ, వెర్రివాడు-కుర్రవాడు, సందులు–పందులు, ఛాయ-మాయ, అరులు-ఇరులు, దోపిడి-రాపిడి, వేదన–రోదన, చెరసాలలు-తెరచాటులు, ఏళ్ళు-బయళ్ళు, ఊళ్ళు-బీళ్ళు, లేళ్ళు-సెలయేళ్ళు, ఉడుతలు–బుడుతలు, సృగాలం-బిడాలం, డోలలు-జ్వాలలు, తలపు-వలపు, రేకులు–బాకులు, హాసనం–వ్యసనం, ఖేదం-మోదం, సమీరం–తుషారం, విహంగం-మృదంగం, వలయాలు–విలయాలు, కళ్ళెం-గొళ్ళెం, మోవి-కావి, భావి–దేవి, చెరసాల-ఉరికొయ్య, ప్రాకారాలు–ఆకాశాలు, జడలు-నుడులు, తాడితులు-పీడితులు, దీనులు-హీనులు, టార్పిడో–టోర్నాడో, శాంతి–కాంతి, ఊపిరితిత్తులు–కొలిమితిత్తులు.

(c) వస్తుసాన్నిహిత్యం, భావసాదృశ్యం భావవ్యత్యాసం మొదలైనవి ఆధారంగా జంట పదాలను సృష్టించడం.-ఖైది-రౌడి; అడవులు-కొండలు; విప్లవం-యుద్ధం; కల్యాణం-సౌభాగ్యం; జ్వరం–భయం; మబ్బు–గాలి; బతుకు-చదువు; ఉదయం-ప్రదోషం; వెన్నెల-చీకటి; అంచులు-లోతులు; రాణి-బానిస; రక్తం-కన్నీళ్ళు; ఈర్ష్యలు–స్పర్ధలు; తారీఖులు-దస్తావేజులు; మతలబులు–కైఫీయతులు; మరఫిరంగి-విషవాయువు; ప్రశ్నలు-జవాబులు; లోకం–రాజ్యం; కలలు-ఆశలు; ఆకలి-నిద్ర; పొగలు-కాటుకలు.

(d) ద్వంద్వసమాసాలు సృష్టించడం.—సర్గవిలయాలు; హేమంతవసంతాలు; ధ్వాంత కాంతులు;

(e) మూడేసి పదాలను జతగల్పడం:— సతులు-సుతులు-హితులు; కుక్కపిల్ల-అగ్గిపుల్ల-సబ్బుబిళ్ళ; రొట్టెముక్క-అరటితొక్క–బల్లచెక్క; తలుపుగొళ్ళెం-హారతిపళ్ళెం-గుర్రపుకళ్ళెం;

కమ్మరి-కుమ్మరి-జాలరి; గొడ్డలి-కొడవలి-నాగలి; గుడి-బడి-మడి; భుజంగాలు-తురంగాలు-మాతంగాలు; విహంగాలు-తరంగాలు-మృదంగాలు; అలజడి-ఆందోళన-తిరుగుబాటు; లోకాలు-ఘూకాలు-బాకాలు;

(f) నాలుగేసి పదాలను జతగలపడం:- దుర్వ్యాప్తి-దుర్గతి-దుర్మతి-దుర్నృతి; స్వాతంత్ర్యం-సమభావం-సౌభ్రాతం-సౌహార్దం; సంరంభం-సంక్షోభం-సమ్మర్దన-సంఘర్షణ.

## శ్రీశ్రీ కల్పితజాతీయాలు

వాడుక భాషనుంచి జాతీయాలను స్వీకరించి ప్రయోగించడంలో శ్రీశ్రీ నేర్పు అసామాన్యం. కాట్లాడుకునేవాడు, ఓర్వలేనివాడు, చీమను కూడా చంపడానికి చేతులురానివాడు, గంజినీళ్ళు తాగి కాలం గడిపేవాడు, కడిపెడు సంతానం కలిగినవాడు, అన్యాయాలకు ఆహుతి కావడానికైనా జంకనివాడు వంటివి లోకంనుంచి స్వీకరించినట్లే ఉంటాయి. శ్రీశ్రీ జాతీయాలను గురించి 58 వ పరికరణంలో ప్రస్తావించి ఉన్నాను. లోకానికి శ్రీశ్రీ సమర్పించిన కల్పితజాతీయాలెన్నో ఉన్నాయి. ఆకలికన్ను, పరాజయం ఎరుగనివాడు, అన్యాయం భరించలేనివాడు, ఆకాశాలను వెదికేవాడు, సంఘపశువు, మరోప్రపంచం, కంచునగారా, చండ్రగాడ్పులు, బలివితర్ది, పుడమితల్లి, లోహవిహంగాలు, మంత్రనగరి, తీరనిదాహం, శంఖారావం, ఢంకాధ్వానం, రాక్షసరతి, కర్షకవీరులు, నరాలబిగువు, యంత్రభూతం, విప్లవశంఖం, కార్మికలోకం,కష్టజీవులు, కర్మవీరులు, గడుసుదయ్యాలు, ఒంటరి ఒంటె, ఆకాశతార, పొగమేడలు, మంత్రకవాటం, స్వర్గానికి నిచ్చెన, మరణమృదంగం, కాలానికి కళ్ళెం, గంధర్వగానం, చల్లారిన సంసారం, మహాహంతకుడు, కత్తులవంతెన, అజ్ఞానపు టంధయుగం, సాంఘికధర్మం, అణగారిన ఆర్తులు, ప్రేమపురాణం, చీకటి కోణం, దాగని సత్యం, రాళ్లెత్తిన కూలీలు, సామాన్యుల సాహసం, ధనవంతుల పన్నాగం, మరఫిరంగి, విషవాయువు, కంచుగోడలు, సంధ్యాజీవులు, సంధ్యాసమస్యలు, కార్మికస్వర్గం, రక్తపాతం, సుప్తకంకాళం, దగాపడిన తమ్ములు, మొయిల్దారి వంటివి.

## శ్రీశ్రీ వైజ్ఞానిక రాజకీయ పదజాలం

విజ్ఞానశాస్త్రప్రభావం వల్ల, రాజకీయపరిణామాల వల్ల కల్పించబడ్డ నూతన విదేశీయ పదాలకు తెలుగులో తర్జుమాపదాలను తయారుచేసుకుని శ్రీశ్రీ తన కవిత్వంలో వాడుకున్నాడు. వీటివల్ల కవిత్వానికి నాగరికత, సమకాలికత, వైజ్ఞానికత వంటి లక్షణాలు వచ్చాయి భావ కవిత్వంలో కనిపించని భాషాచిహ్నాలివి. వీటిని 5 రకాలుగా విభజింపవచ్చు.

(1) విజ్ఞానశాస్త్రపదజాలం :- పరమాణువు (molecule), దూరదృష్టి (telescope), దూరశ్రవణం (wireless), భూకంపం (earth quake), శస్త్రకారుడు (surgeon) వంటివి.

(2) సాంస్కృతికపదజాలం ;- వస్తుప్రదర్శనశాల (museum), గ్రంథాగారం (library), కళాయతనం (college) వంటివి.

(3) పారిశ్రామికపదజాలం :- పరిశ్రమాలయం, కర్మాగారం (factory), ధూమశకటం (train), విమానం, లోహశ్యేనం, ఇనుపడేగ (aeroplane), యంత్రం (machine), కార్మికుడు, శ్రామికుడు, కూలీ (proletarian), సమ్మె (strike), సమస్య (problem), దోపిడి (exploitation), పనిముట్లు (tools), ఆందోళన (agitation), పెట్టుబడి (capital) వంటివి.

(4) మనస్తత్త్వశాస్త్రపదజాలం:-వైద్యశాల (hospital), వ్యక్తావ్యక్తం (sub-conscious), ఆత్మహత్య (suicide), వ్యక్తి (individual) వంటివి.

(5) రాజకీయపదజాలం :- కార్యాలయం (office), కారాగృహం, చెరసాల (jail), విప్లవం, తిరుగుబాటు (revolution), సంగ్రామం, సమరం, కదనం, యుద్ధం (war), విషవాయువు (poison gas), మరఫిరంగి (machine gun), ధనవంతుడు, దారిద్ర్యం, కార్మికస్వర్గం, (workers' paradise), పురోగమనం, అభ్యుదయం (progress), సాంఘికధర్మం (social justice), పీడన, పీడకుడు, పీడితుడు, ప్రచారం, రాజకీయాలు, సమభావం (equality), స్వాతంత్ర్యం, సంక్షోభం సంఘర్షణ (struggle), బానిసలు, సామ్రాజ్యం, పన్నాగం, కుట్ర, (conspiracy), జాతి, వ్యక్తి, నాగరికత, సామాన్యుడు, న్యాయస్థానం (court), రక్షకభటుడు (police) వగైరా.

# 83/ కొంపెల్ల జనార్దనరావు కోసం!

ఇలా చూడు నీ కోసం ఇదే నా మహాప్రస్థానం!

1938

ఫ్యూడల్ వ్యవస్థలో కవులు సాధారణంగా ప్రభువులనో మంత్రులనో భూస్వాములనో ఆశ్రయించుకుని ఉంటూ వారి యశోవ్యాప్తికై తమ కావ్యాలను అంకితంచేస్తూ ఉండేవారు. భూపాలకులే కవులకు పోషకులు. ఆ పాలకులే కవులను కావ్యరచనకై ప్రార్థించినట్లు ఆధారాలున్నాయి. ఉదాహరణకు: బెండపూడి అన్నమంత్రి శ్రీనాథుడ్ని పిలిపించి సన్మానించి "సప్త సంతానములునాకు సంభవించె/నొక ప్రబంధంబు వెలితిగా సుకృతగరిమ/నా వెలితి మాన నాపేర నంకితముగ/శివపురాణంబు తెనుఁగుగాఁ జేయుమొకటి" అని ప్రార్థిస్తే భీమఖండం అనువదించి అంకితం చేశాడు. అన్నమంత్రి వంశప్రశస్తి అంతా వేనోళ్ళ కొనియాడబడింది శ్రీనాథుడిచేత ఆ కావ్యావతారికలో. ఈ సంప్రదాయాన్ని పెద్దనాదులు కూడా అనుసరించారు.

ఫ్యూడల్ వ్యవస్థలో కావ్యాన్ని రాజు తన సంతానంగా భావించాడు. ఆ రాజు అభిరుచి ననుసరించి అ కావ్యబాలను సృష్టించాడు కవి కావ్యంలో. ప్రతి ఆశ్వాసంయొక్క ఆద్యంతాల్లోనూ కృతిపతిని సంబోధించడంకూడా ఫ్యూడల్ సంప్రదాయమే. కాని, ఆ వ్యవస్థ అంతిమ దశలో వచ్చిన భావకవులు ఈ సంప్రదాయాలలోను తిరస్కరించి తమ ఆనందం కోసమే కావ్యాలు రచించుకున్నా అవి జమీందారులకో మిత్రులకో అడగకుండానే అంకితం చేశారు. ఉదాహరణకు 'కృష్ణపక్షము' మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరు వారికి అంకితం చేయబడింది. కానీ 'ప్రవాసము' ఒక మిత్రుడికి (రామమూర్తికి) అంకితం చేయబడింది. ఒక ఫ్యూడల్ సంప్రదాయం ఇంతటితో పూర్తిగా అస్తమించింది. కృతిభర్త వంశావతార వర్ణనలకు, సంబోధనలకు కూడా స్వస్తి చెప్పబడింది. అచ్చమైన స్నేహాభిమానాలు, ప్రేమ, ఆత్మీయత ప్రతిబింబించే అంకితపద్యాలు అవతరించాయి. కృష్ణశాస్త్రి రామమూర్తికి రాసిన అంకితగేయమే అందుకు నిదర్శనం. (చూ. ప్రవాసము)

బూర్జువావ్యవస్థలో కవిత్వం రాసిన శ్రీశ్రీ బూర్జువావ్యక్తులెవరికీ తన కవిత నంకితంచేయ లేదు. ప్రజలకోసం మహాప్రస్థానం రాసినా దాన్ని తన మిత్రుడైన కొంపెల్ల జనార్దనరావుకు

అంకితంచేశాడు. బూర్జువావ్యవస్థకు బలి అయిపోయిన ఒక సామాన్యవ్యక్తి కనుకనే జనార్దన రావుకు అంకితం చేయడం జరిగింది. ఇక్కడ గమనించవలసిన మరో విశేషం ఉంది. ప్రభువులూ జమీందారులూ తమకు అంకితమైన ఆకావ్యాల వల్ల ఆనందం, యశస్సు అందుకున్నారు. అవి వారికి జీవితకాలంలోనే ప్రత్యక్షంగా లభించాయి. శ్రీశ్రీ తన మహాప్రస్థానాన్ని జనార్దనరావు చనిపోయాకానే అంకితంచేశాడు. శ్రీశ్రీ రాసిన అంకితగీతం స్మృతిగీతం కూడా అయింది.

స్మృతిగీతాలు సాధారణంగా దుఃఖమయాలై ఉంటాయి. చనిపోయినవాడి గొప్పతనం, తనకతడి తోడి వియోగం వల్ల కలిగిన బాధ, నష్టం చెప్పుకోవడం స్మృతిగీతాల్లో కనిపిస్తుంది. 'కృష్ణరాయలతో దివికేగలేక బ్రతికియున్నాడ జీవచ్ఛవంబనగుచు' అని అల్లసాని పెద్దన రాసిన స్మృతిపద్యం దుఃఖంతో ముగుస్తుంది. బసవరాజు అప్పారావుగారి స్మృతిగీతాలలో దుఃఖం కెరటాలుగా పొంగుతుంది. కాని శ్రీశ్రీ స్మృతిగీతం కేవలం దుఃఖమయంకాదు. ఇందులో జనార్దన రావు జీవితవాస్తవికతను వర్ణించాడు శ్రీశ్రీ. అతడు బూర్జువావ్యవస్థకు బలి అయిపోవడం గురించి లోకానికి తెలిపాడు. సమాజవాస్తవికతను పరిహసించాడు. అతడు వదలిన పోరాటాన్ని తాను అందుకుంటాననీ నిరాశామయలోకంలో తాను కదనశంఖం పూరిస్తాననీ వీరోచితంగా పలికాడు.

## జనార్దనరావుతో శ్రీశ్రీ మైత్రి

కొంపెల్ల జనార్దనరావు 1906 లో తూర్పుగోదావరిజిల్లా కోనసీమలో పుట్టినవాడు. 21వ యేట (1927) భారతి ఉపసంపాదకుడుగా మద్రాసు చేరాడు. 1928 ఆగస్టులో 'ప్రభవ' మీద భారతిలో జనార్దనరావు రాసిన సమీక్షయే శ్రీశ్రీ-జనార్దనరావుల మైత్రికి నాందిగా పరిణమించింది. శ్రీశ్రీ జనార్దనరావుల మైత్రిలో కొన్ని ముఖ్యఘట్టాలు కనిపిస్తాయి:-

(1) 1928 లోనే శ్రీశ్రీ చెన్నపట్టణంలో క్రిస్టియన్‌కాలేజీలో బి.ఏ. విద్యార్థిగా చేరాడు. ఆ తొలిరోజుల్లోనే భారతికార్యాలయానికి వెళ్ళి గన్నవరపు సుబ్బరామయ్యగారితో మాట్లాడి బయటికి వెళ్ళిపోతూండగా జనార్దనరావు శ్రీశ్రీని పలకరించడంతో వారిద్దరి మైత్రి ప్రారంభమయింది. తంబుచెట్టివీధిలోని ఫస్టుస్టూడెంట్సుహోమ్‌లో శ్రీశ్రీ, లింగిచెట్టివీధిలో జనార్దనరావు ఉండటంవల్ల ఇద్దరూ సన్నిహితులయ్యారు. ఈ రెండేళ్ళలోని స్మృతులనే శ్రీశ్రీ "చెన్నపట్టణపు సముద్రతీరంలో మనం అన్నీ పిచికగూళ్ళేనా కట్టింది?" అంటూ వ్యక్తంచేసి విలపించాడు. శ్రీశ్రీ జనార్దనరావుల మద్రాసు జీవితంలోని మైత్రికి దర్పణాలైన వాక్యాలివిగో — "నేను మద్రాసులో చదువుతున్న రెండేళ్లూ ఎన్నోసార్లు అతనితో కలిసి సంచరించాను. మద్రాసులోనే తొలిసారి నేను అనేక వాఙ్మయవ్యక్తులను కలుసుకున్నాను ... సోమశేఖరశర్మగారి యింట్లో నేనూ జనార్దనరావూ మొదటిసారి నండూరి ముఖస్థంగా యెంకిపాట విన్నాము. విశ్వనాథ కిన్నెరసాని

పాటలు వింటూ మైమరచిపోయాము. నేనూ, విశ్వేశ్వరరావూ జనార్దనరావూ కలిసి హైకోర్టు బీచీలోనూ రామకృష్ణాలంచి హోమ్‌లోనూ, అడయారు, కన్నెమెరా లైబ్రరీల్లోనూ, పరశువాకం- ఎగ్మూరు వగైరా వీధుల్లోనూ విశ్వసాహిత్యపు సరిగమపదనిసలు సవరించాము. జనార్దనరావు భుజగభూషణా అనే కీర్తన పాడుతూవుంటే నేను తన్మయుణ్ణయ్యాను...ఆ సాయంత్రం మేము భవిష్యత్తులో పొదగదలచిన కొన్ని బంగారపుగుడ్లకి శంకుస్థాపన చేశాము. ఆ పునాది మీద లేచిన సౌగమంచుభవనం జనార్దనరావుపాట. అది అప్పుడే అదృశ్య మయింది కాని ఎప్పటికీ అదృశ్యం కాదు.''1

(2) 1930 లో శ్రీశ్రీ మద్రాసు విడిచిపెట్టాకా కూడా శ్రీశ్రీకీ జనార్దనరావుకీ ఉత్తర ప్రత్యుత్తరా లుండేవి. ఈ ఉత్తరాలు వారి మైత్రీగాఢతను నిరూపిస్తాయి.

(3) 1933 మార్చి 10, 11, 12 తేదీలలో బరంపురంలో శ్రీశ్రీజనార్దనరావులు తిరిగి కలుసుకున్నారు. "బరంపురంలో మనం ఇంకా నిన్నగాక మొన్న మాట్లాడుతున్నట్లే ఉంది" అన్న శ్రీశ్రీ స్మృతి ఎంతో ఆర్ద్రమయింది. ఈ అంశాన్ని శ్రీశ్రీ బాగా వివరించిన వాక్యాలు చూడండి: "బరంపురంలో మొదటిసారి నవ్యసాహిత్యపరిషత్తు సమావేశమయింది (అప్పటి కది అఖిలాంధ్ర కవిపండితసభ). నాలో పాతరాతియుగంపోయి కొత్తయుగం ప్రవేశిస్తున్న రోజులు. జనార్దనరావూ, నేనూ కలసి సాయంకాలం కాగానే ట్రంకురోడ్డుమీద షికారు తిరిగి వచ్చేవాళ్ళం. అప్పటి మా సంభాషణ సారాంశంమాత్రమే నాకు జ్ఞాపకం ఉంది. ఉదయిని ప్రారంభిస్తాను. నువ్వూ చెన్నపట్టణం రా అన్నడి".2

(4) 1936 లో కాకినాడలో జరిగిన నవ్యసాహిత్యపరిషత్ సమావేశానికి శ్రీశ్రీ జనార్దనరావులు హాజరయ్యారు. "కాకినాడ నవ్యసాహిత్య పరిషత్తును కలకలలాడించిన నీ నవ్వు కనబడకుండా కరిగిపోయిందా ఇంతట్లోనే" అనే శ్రీశ్రీ స్మృతి కిదే మూలం.

(5) ఉదయిని ఆరంభమయ్యాకా జనార్దనరావు విశాఖపట్టణం వెళ్ళి శ్రీశ్రీని కలుసుకున్నాడు. శ్రీశ్రీజనార్దనరావులు ఉదయినిసంచికలు పట్టుకుని విశాఖపట్టణం వీధుల్లో తిరుగుతూ చందాలు సేకరించారు. 'విశాఖపట్టణవీధుల్లో మనం ఉదయిని సంచికలుపట్టుకు తిరగడం జ్ఞాపకం ఉందా ?" అనే వాక్యానికి ఈ స్మృతియేకారణం. "ఉదయిని సంచికలతో ఊరేగడం, చందాలు వసూలు చెయ్యడం మొదలైనవి జనార్దనరావుకోసంకాదు; సాహిత్యంకోసం"3

---

1 శ్రీశ్రీసా ఒకటి. కావ్య. 202 పే.

2 శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 202 పే.

3 1935 లో కావచ్చు. కవితాసమితిలో జనార్దనరావు ఉపన్యాసం చేశాడు ఆయేడే.

(6) జనార్దనరావుతో శ్రీశ్రీ మైత్రి కేవలం వ్యక్తిగతానందం కోసం చేయబడింది కాదు. పీడకపీడిత వర్గసమాజంలో జనార్దనరావు చేసిన సాహసం శ్రీశ్రీని బాగా ఆకర్షించింది. అదే మైత్రికి ప్రధానకారణంగా తీసుకున్నాడు శ్రీశ్రీ. "నిరుత్సాహాన్ని జయించడం నీవల్లనే నేర్చుకుంటున్నాము! ప్రతికూలశక్తుల బలం మాకు తెలుసు! భయం లేదులే అయినప్పటికీ! నీ సాహసం ఒక ఉదాహరణ! నీ జీవితమే ఒక ఒరవడి! నిన్న వదలిన పోరాటం నేడుఅందుకొనకతప్పదు! కావున ఈ నిరాశామయలోకంలో కదనశంఖం పూరిస్తున్నాను! ఇక్కడ నిలబడి నిన్ను ఇవాళ ఆవాహనం చేస్తున్నాను" అంటూ అసంఖ్యాకపీడితుల పక్షంనుంచి శ్రీశ్రీ జనార్దనరావుతో పలికాడు. జనార్దనరావుకు వర్గదృక్పథంలేకపోయినా అతడెదుర్కొన్నది పీడకవర్గవంచననే. ఆవంచన వల్లనే అతడు ఉదయినిని నడపలేకపోయాడు. (ఆః ఖండికలో) నిప్పులు చిమ్ముకుంటూ నింగికి ఎగిరిపోయి, నెత్తురు క్రక్కుకుంటూ నేలకు రాలిపోయినవాడు జనార్దనరావే కావచ్చు. ఇటువంటి సాహసికులనే శ్రీశ్రీ గౌరవించాడు. ఆ గౌరవమే మహాప్రస్థానాన్ని జనార్దనాంకితం చేయించింది.

(7) శ్రీశ్రీ జనార్దనరావుల మైత్రిలో కొట్టవచ్చినట్లు కనిపించే మరోవిశేషం పరస్పరగౌరవాభిమానాల వ్యక్తీకరణం. "మీరు చాలా గొప్పవారు అని నా నమ్మిక. నిజముగా భాషాదేవి సేవ చేయడానికి దేవలోకమంతా కదిలిపోయే విసీతదీక్ష ప్రజ్వరిల్లిన మానసమువిూది. మీకు తెలుసునా?" అని రాశాడు శ్రీశ్రీకి జనార్దనరావు (1933). కానీ శ్రీశ్రీ జనార్దనరావును చనిపోయినతరవాతనే ఎక్కువగా స్తుతించాడు. "జనార్దనరావు మరణంవలన తెలుగులో సాహిత్యానికి హేమంతం ప్రాప్తించింది .... మన ప్రసిద్ధవిమర్శకుల సత్తువ నాకు తెలుసు. ఎవ్వరికీ జనార్దనరావు తాహతులు లేవు. ఎప్పటికప్పుడే జ్ఞానసంపదను హెచ్చించుకొంటూ అతడు సారస్వతరంగంలో అనన్యసామాన్యమైన స్థానానికి చేయిచాచాడు.... విమర్శకుడుగా జనార్దనరావుది మహోన్నతస్థానం. ఆధునికవాఙ్మయం సరిగా అర్థంచేసుకున్న కొద్దిమందిలో ముఖ్యుడు. నవీన సాహిత్యరీతులకు రుచివంతమైన అధ్యయనాలు చూపించడానికి సమర్థుడు"4

## ధూర్తలోకంపై శ్రీశ్రీ అసహ్యం

జనార్దనరావు బాధలకు కారణమైన ధూర్తలోకం ఎలాంటిదో మొహమాటం లేకుండా ఈ స్మృతిగీతంలో వ్యాఖ్యానించాడు శ్రీశ్రీ. (1) దొంగలంజకొడుకులసలే మెసలే ధూర్తలోకం' అది. (2) 'అడుగడుగునా పొడచూపే అనేకానేకశత్రువులున్న' లోకం అది. (3) 'అటు చూస్తే ఇటుచూస్తే ఎవరూ చిరునవ్వు చేయూతా' ఇవ్వరు ఈ లోకంలో. (4) 'మురికితనంతో, కరకు

4 శ్రీశ్రీసా. ఒకటి. కావ్య. 201 పే.

తనంతో సుకుమారపు హృదయానికి గాయంచేసే' లోకం ఇది. (5) 'అటుపోతే ఇటుపోతే అంతా అలక్ష్యంతో అనాదరణతో చూసి ఒక్కణ్ణి చేసి బాధించిన" ధూర్తలోకం ఇది. (6) 'పొంచి చీకట్లో కరవజూచే వంచకాల లోకం' ఇది. (7) 'సాహిత్యమే సమస్తమూఅనుకొని ఆకలీ నిద్రా లేక, ఎక్కడ ఉన్నామో, ఎక్కడకు పోతామో తెలియని ఆవేశంతో చుక్కలలో ఆదర్శాలను లెక్కిస్తూ ఎక్కడకో పోతున్నవాళ్ళను రెక్కపట్టి నిలబెట్టి ఎన్నెన్నో దుస్సహదృశ్యాలు చూపించి, ఎన్నెన్నో దుస్తరవిఘ్నాలు కల్పించి, కలలకు పొగలనూ కాటుకలనూ కప్పి, శపించేదీ' ఈ ధూర్తలోకమే. (8) జనార్దనరావును "విషవాగురలలోకి లాగి ఊపిరితిత్తులను కొలిమితిత్తులుగా చేసి కళ్ళల్లో గంధకజ్వాలలు, గుండెలలో గుగ్గిలపుధూమం వేసి, దారిలో ప్రశ్నార్థచిహ్నాల బ్రహ్మచెముడు డొంకలు కప్పి, తలచుకున్నప్పుడల్లా తనువులో అణువణువులో సంవర్త భయంకరఝంఝూపవనం రేగిస్తూ ఎక్కడికో విసిరిందీ ఎంతో మోసగించిందీ" ఆధూర్త లోకమే. ఇలా శ్రీశ్రీ ఎందుకు చెప్పవలసివచ్చింది? ఇందుకు ప్రేరేపించిన వాస్తవాలేమిటి?

(1) 1933 లో బరంపురం సభలలోనే నవ్యసాహిత్యపరిషత్పక్షాన ఒక సాహిత్యపత్రిక వెలువరించడానికీ జనార్దనరావును ఆ పత్రికాసంపాదకుడుగా నియమించడానికీ తీర్మానాలు జరిగాయి. జనార్దనరావు 1934లో భారతినుంచి ఉద్యోగం విరమించుకుని ఉదయిని ఆరంభించాడు. కాని న. సా. ప. దానికి సహాయపడలేదు సరిగదా 1936లో ప్రతిభను ప్రారంభించి ఉదయినికి వెన్నుపోటు పొడిచింది. కానీ జనార్దనరావు నిరుత్సాహాన్ని జయించి ప్రతికూల శక్తుల్ని తెలుసుకుని సాహసంగా పోరాడాడు. ఈ పోరాటంవల్ల క్షయవ్యాధికి గురి అయ్యాడు. (2) ఉదయిని నిర్వహణలో ఆర్థికమైన చిక్కులు, అశాంతి, అవిశ్రాంతి జనార్దనరావుకు ఎదురయ్యాయి. (3) ఉదయిని ఆఖరుసంచికను ప్రెస్సువాళ్ళు విడుదల చేయనేలేదు. (4) దేశ మంతటా తిరిగి చందాలు వసూలు చేయడంలో అవమానాలెదురయ్యాయి. (5) జనార్దనరావు ఎవరినీ లెక్కచెయ్యకుండా నిష్పాక్షికంగా సాహిత్య విమర్శలు చేస్తే వ్యక్తులు బాధపడేవారు. (6) సాహిత్యాభ్యుదయం కోసం జీవితాన్ని అర్పించిన జనార్దనరావుకు రావలసిన ఖ్యాతి రాలేదు సరిగదా కష్టాలూ రోగమూ మృత్యువూ మాత్రం వచ్చాయి. (7) జనార్దనరావు చనిపోయి నప్పుడు కూడా శ్రీశ్రీ, మరో ఆరుగురు స్నేహితులూ (బహుశా పురిపండా, నండూరి, మల్లంపల్లి, ముద్దుకృష్ణ, విశ్వేశ్వరరావు, దీక్షితులు ప్రభృతులై ఉండవచ్చు) తప్ప ఎవరూ దుఃఖించలేదు. (8) జనార్దనరావు చనిపోయాడని "ఆఫీసులకు సెలవీయలేదు. సారాయిదుకాణాలను మూసి వేయలేదు. సానుభూతి సభలలో ఎవరూ సాశ్రునేత్రాలు ప్రదర్శించలేదు. ఎవరిపనులలో వాళ్లు; ఎవరి తొందరలో వాళ్ళు'. (9) "జనార్దనరావంటే ఉదయిని. ఉదయిని అంటే సాహిత్యస్వరూ

పాన్ని తీర్చి దిద్దడానికి ప్రతిజ్ఞ పట్టిన పత్రిక. ఆపత్రిక కోసమే బలైపోయాడు జనార్దనరావు."[5] కాగితంమీద ఒక మాటకు బలి అయి, కనబడని ఒక ఊహ చేత కబళింపబడి, అందని రెక్క చేత మంత్రింపబడి, నిమంత్రింపబడి జనార్దనరావు వెళ్ళిపోయాడు.

## శ్రీశ్రీ తిట్టు కవిత్వం

ధూర్తలోకాన్ని పరిహసించడంలో శ్రీశ్రీ నేర్పు అద్వితీయం. ఎంత త్యాగం చేసినా, లోకంలో కాపట్యాలు యథాతథంగానే సాగిపోతున్నాయని శ్రీశ్రీ విచారించాడు. విచారించడమేకాదు: లోకాన్ని చివాట్లు పెట్టాడు. ఈ కాపట్యం 'బురద'గా కనిపించింది. ఈ మోసగాళ్లు 'బురఖాలు తగిలించుకున్నారు. వీళ్ళ కాళ్ళకు డెక్కలు, నెత్తికి కొమ్ములు ఉన్నాయని పరిహాసించాడు. వీళ్ళను పశువులతో పోల్చడానికి కూడా సందేహించలేదు శ్రీశ్రీ. ఈ ధూర్తులే లోకానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. వీళ్ళను 'పోల్చుకోవడం' కూడా సాధ్యంకాదట. అంటే వీరు ప్రచ్ఛన్న వేషాలతో సంచరిస్తున్నారు. వీళ్లు 'గాలిలో కనరాని గడుసుదయ్యాలు', 'పెద్దమనుషులు' 'బుద్ధిమంతులు!' ఇరవై కోరల అరవై కొమ్ముల క్రూరఘోరకర్కోటకులు! కోరకి కన్నూ కొమ్ముకి కన్నూగల కర్కాటక కర్కోటకులు! ఇలాంటి వాళ్ళతో విసుగెత్తే వెనుకదగా ముందు దగా కుడియెడమల దగాదగా అని చేదుపాట పాడుకున్నాడు శ్రీశ్రీ. తిట్టుకవిత్వం మహాప్రస్థానంలో సమాజనిందారూపంలో ఉంది. అది ఆ తరవాత వ్యక్తినిందారూపంలోకి పరిణమించింది.

## పోరాటంగురించి శ్రీశ్రీ ఆరాటం

ఇది నిరాశామయలోకంగా శ్రీశ్రీకి కనిపించింది. దీన్ని ఆశామయంగా మార్చడమే శ్రీశ్రీ కవితాలక్ష్యం. అందుకు మార్గం కదనశంఖం పూరించడమే కానీ కేవలం ఆశావాదం ప్రచారం చేయడం కాదు. శ్రీశ్రీ నిందలు, హేళనలు, తిట్లు, సమాజశ్రేయస్సును కోరేవి. అవి వర్గ దృక్పథంతో కూడినవి. అవి వర్గసంఘర్షణకు ఆయుధాలు.

జనార్దనరావు ధూర్తలోకం (బూర్జువావ్యవస్థ)తో పోరాడి ఓడిపోయాడు. అతడొక పరాజితుడు. లోకంలోని పరాజితుల సమూహంలోని సాహితీపరులకు జనార్దనరావును ప్రతినిధిగా తీసుకున్నాడు శ్రీశ్రీ. ఇలాంటి పరాజితుల పక్షంలోనే శ్రీశ్రీ వీరుడుగా విజృంభించదలచుకున్నాడు "నిన్న వదలిన పోరాటం నేను అందుకొనక తప్పదు" అనే నిశ్చయానికి వచ్చాడు శ్రీశ్రీ.

పోరాటంలేనిదే సమాజానికీ సాహిత్యానికీ భవిష్యత్తు లేదు. పోరాటం లేకుంటే ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉంటుంది. జనార్దనరావు పోరాటం ప్రాథమికం. అతడిది సాహిత్యం

---

5 శ్రీశ్రీ సా. ఒకటి. కావ్య. 195 పే.

లోని పోరాటం మాత్రమే. అది సాహిత్యరంగంలోని అభివృద్ధినిరోధకులతో ప్రతికూలశక్తులతో నిరుత్సాహవాతావరణంతో. ఈ పోరాటాన్ని సాహిత్యంలోనూ సమాజంలోనూ కూడా సాగింప దలచాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ తాను జనార్దనరావునుంచి ముందుకు సాగిపోయానని తలపోశాడు. "అతను చెయ్యా దలచుకున్నంతా చెయ్యలేకపోయాడు. నేను కొంతలో కొంతైనా చేశాను. ఇంకా చేస్తాననే ధైర్యమూ ఉంది. ఆ ధైర్యమే ఇంకా నేను బ్రతికుండడానికి కారణం" అని శ్రీశ్రీ 1958లో అన్నాడు. 1938 లోనే ఇందుకు నాంది పలికాడు. ఆ నాంది ఈ అంకితగేయంలోనే ఉంది- "కావున ఈ నిరాశామయలోకంలో కదనశంఖం పూరిస్తున్నాను"- ఈ కదనశంఖపూరణం వెనక చెప్పిన బురదమీదా బురఖాలమీదా కాళ్ళకు డెక్కలు నెత్తికి కొమ్ములు మొలిచిన వారిమీద కాక ఇంకెవరిమీద? సాహిత్యరంగంలోనూ ఇలాంటివాళ్ళున్నారు. కదనశంఖం పూరించడానికి జనార్దనరావు ఆత్మశక్తిని శ్రీశ్రీ ఆవాహనం చేసుకున్నాడు. "ఇక్కడ నిలబడి నిన్ను ఇవాళ ఆవాహనం చేస్తున్నాను! అందుకో ఈ చాచిన హస్తం! ఆవేశించు నాలో! ఇలా చూడు నీకోసం ఇదే నా మహాప్రస్థానం!" నిరుత్సాహాన్ని జయించడం, సాహసించడం జనార్దనరావు ముఖ్య లక్షణాలు. జనార్దనరావును ఆవాహనచేయడం అంటే అతని లక్షణాలనే పుణికి పుచ్చుకోవడం. శ్రీశ్రీ తన అనుభవాలలోకి వడబోసుకున్న బీభత్సాలలో జనార్దనరావు మరణం ఒకటి.

## శ్రీశ్రీ జనార్దనరావుల సాదృశ్యవ్యత్యాసాలు

శ్రీశ్రీకీ జనార్దనరావుకీ కొన్ని పోలికలూ కొన్ని తేడాలూ ఉన్నాయి. (1) సాహిత్యమే సమస్తమూ అనుకొని ఆకలీ నిద్రాలేక, ఎక్కడ ఉన్నామో ఎక్కడకు పోతామో తెలియని ఆవేశం" వాళ్ళిద్దరిదీ. అందుకే జనార్దనరావు సాహిత్యతపస్సును వర్ణిస్తూ శ్రీశ్రీ ఇలారాశాడు- "సారస్వతంలో చరితార్థుడు కావడానికి జనార్దనరావు ఆయుధాల కోసం అర్జునుడిలాగు తపస్సు చేశాడు. అతని జీవితమంతా విజ్ఞానసముపార్జనకైన ఎడతెగని యాత్ర"6.

(2) శ్రీశ్రీ జనార్దనరావుల సమానధర్మాలలో మరొకటి-"చుక్కలలో ఆదర్శాలను లెక్కించడం". ఈ ఆదర్శాలవల్లనే జనార్దనరావు సాహిత్యపత్రికను ఉన్నతవీధులలో నడపా లనుకున్నాడు. సాహిత్యస్వరూపాన్ని తీర్చిదిద్దడానికి ప్రతిజ్ఞ పట్టాడు. శ్రీశ్రీ సమాజ స్వరూ పాన్ని తీర్చి దిద్దడానికి సాహిత్యాన్ని అంకితం చేయదలచడం కూడా ఇలాంటి ఉన్నతాదర్శమే.

(3) శ్రీశ్రీ జనార్దనరావు లిద్దరూ చెప్పుకున్న మహాసంకల్పాలు కొన్ని ఉన్నాయి.' ఉద యినిని ఉన్నతవీధులలో నడిపించడం, నవ్యాంధ్ర సాహిత్య (కనీసం, కవిత్వ) చరిత్రరాయడం

---

6 శ్రీశ్రీ సా. ఒకటి. కావ్య. 190 పే.

యువలోకస్వప్నాలకు ప్రాణప్రతిష్ఠ చేయడం' వంటివి. జనార్దనరావు ఉదయినిని నాలుగేళ్ళు నడిపించి తన సంకల్పాన్ని కొంతవరకైనా నెరవేర్చుకున్నాడు. శ్రీశ్రీ ధ్వని, అశాంతి, సుషుమ్న వంటి పత్రికలను నడపాలనుకుని, ఎన్నడూ వాటిని ఆరంభించనైనా లేకపోయాడు. అయినా, శ్రీశ్రీ సంకల్పాలు కవితాపరంగా నెరవేరిన వెన్నో ఉన్నాయి. వాటికి ఆయన కవితావిప్లవోద్యమాలే నిదర్శనాలు. జనార్దనరావు 1937 జూన్‌లో క్షయవ్యాధివల్ల మరణించినతరువాతనే శ్రీశ్రీ మద్రాసు చేరుకొని 1938 లో పాత్రికేయజీవితం మాత్రం ఆరంభించాడు.

(4) శ్రీశ్రీకీ జనార్దనరావుకీ తాత్త్వికదృక్పథంలో తేడా ఉంది. శ్రీశ్రీవలె జనార్దనరావు కమ్యూనిజాన్ని హర్షించలేదు; కానీ అర్థంచేసుకోగలడని శ్రీశ్రీయే అభిప్రాయపడ్డాడు. అందువల్లనే శ్రీశ్రీ గేయాలను ఉదయినిలో వేయగలిగాడు. జనార్దనరావులో అరిస్టోక్రాటిక్‌తత్త్వం కొంతవరకూ ఉందనీ కానీ అతడిలో కన్సర్వేటివ్ దృక్పథంమాత్రం లేదనీ7 అతడు చాదస్తాలను అవహేళన చేస్తూ ఉండేవాడనీ అతడి మనస్సు విశాలంగా విప్పారి ఉండేదనీ శ్రీశ్రీ అంచనా వేశాడు.

(5) తనకూ జనార్దనరావుకూ ఉన్న సామ్యవైషమ్యాలను ఒక వ్యాసంలో శ్రీశ్రీ క్రోడీకరించి ప్రకటించాడు. (a) సమవయస్కత (b) నిరాడంబరత (c) సాహిత్యపిపాస (d) విశ్వనాథ కవిత్వంపట్ల మోజు (e) సాహిత్యానికి సాధికారవేదికగా ఒక పత్రిక ఉండాలని విశ్వసించడం (f) పత్రికానిర్వహణలో పెట్టుబడిదారీవిధానం గురించి అవగాహన (g) డబ్బు ఆర్జించే పద్ధతి తెలియకపోవడం (h) జీవితాలను సాహిత్యానికి అంకితం చేయడం (i) మితవాదతత్త్వం అంటే అసహ్యం. (j) ఏయెండకా గొడుగు పట్టడం అంటే అసహ్యం,

(6) జనార్దనరావు శ్రీశ్రీవలె కాలేజీలలో పూర్తిగా చదువుకోలేదు. సంస్కృతం చదువుకున్నాడు. శ్రీశ్రీకి సంస్కృతంతో సరాసరిగా పరిచయంలేదు. జనార్దనరావు స్వయంకృషితో ఆంగ్లసాహిత్యం అధ్యయనం చేశాడు.

## శ్రీశ్రీ కవిత్వంలో సమకాలీనతా ముద్ర

సమకాలీనతాముద్ర శ్రీశ్రీ కవిత్వంలో కనిపించే ఆధునికాంశం. సమకాలికసమాజవాస్తవాలనూ, సమకాలికసాహిత్యవాతావరణాన్నీ కవిత్వంలో ప్రతిబింబింపజేశాడు శ్రీశ్రీ. ఇందుకు ప్రధాన నిదర్శనాలు.

(1) 1933-37 మధ్య ఆంధ్రప్రదేశపు సాహిత్యవాతావరణచ్ఛాయలు ఈ అంకితగీతంలో కనిపిస్తాయి. 1933 నాటికి ఆంధ్రదేశంలో నవ్యసాహిత్యాన్ని ఆరాధిస్తున్న సంస్థలలో

---

7 కానీ జనార్దనరావు కన్సర్వేటివ్‌గా ఉండేవాడని సృజన ఇంటర్వ్యూలో శ్రీశ్రీ అన్నాడట!

సాహితీసమితి, యువకవిమండలి, కవితాసమితి ముఖ్యమైనవి. ఇవన్నీ కలిసి 1933 (మార్చి 10, 11, 12,) లో బరంపురంలో అభినవాంధ్ర (అఖిలాంధ్ర) కవి పండితసభను పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి అధ్యక్షతను నిర్వహించాయి.8 (2) బరంపురంలో అభినవాంధ్ర కవి పండితసభ, కాకినాడలో నవ్యసాహిత్యపరిషత్సమావేశం శ్రీశ్రీ కవిత్వంలోకి ప్రవేశించాయి. ఆ రోజుల్లో బరంపురం, కాకినాడ, విశాఖపట్టణం, చెన్నపట్టణం ఈ నాలుగునగరాలూ సాహిత్య కేంద్రాలు. ఉదయిని సంచికలగురించి ప్రస్తావనకూడా కవిత్వంలోకెక్కింది. ఇవి గాక సంధ్యా సమస్యలు, గర్జించురష్యా వంటివి సమకాలీన సామాజిక రాజకీయసమస్యలను ప్రతిబింబించిన ఖండికలు.

## శ్రీశ్రీ భావచిత్రలేఖనం

ఒక దృశ్యాన్ని యథాతథంగా గాక భావనామయంగా చిత్రించి వాస్తవరూపానికి రూపాంతరాలు సృష్టించడం శ్రీశ్రీ భావచిత్రలేఖనసంవిధానం. (1) పరివేదన బరువు బరువు కావడం' అనే భావచిత్రం మానసికమైన నైరూప్యమైన పరివేదనకు బరువును కల్పించి రూపవంతం చేస్తోంది. వేదనాభారం అనే పదబంధం వల్ల స్ఫురించని భావరూపం బరువు బరువు కావడం అనే మాటల వల్ల ప్రత్యక్షమవుతోంది. (2) చిరునవ్వా చేయూతా ఇవ్వకపోవడం– ఇస్తే పుచ్చుకునేది చేయూత (సహాయం) మాత్రమే. దానికి చిరునవ్వు కూడా చేరింది. చిరునవ్వు స్నేహసూచకం. స్నేహమూ సహకారము కూడా లభించలేదనే నగ్నభావం శ్రీశ్రీ ఊహలో మూర్తిమంతం అయింది. (3) చిరునవ్వులనే పరిషేచన చేయడం– పరిషేచన (తడపడం) వైదికపరిభాష. భోజనస్వీకారానికి ముందు గాయత్రీమంత్రపూర్వకంగా జలధారను భోజనం చుట్టూ చల్లడం పరిషించడం. చిరునవ్వులను వెదజల్లడం చిరునవ్వుల పరిషేచన అయింది. (4) పొంచి చీకట్లో కరవజూచే వంచకాలు - వంచకాలు నక్కలు! లోకంలో పరోక్షంగా ఉండి హాని చేయుడానికి ప్రయత్నించే వంచకులే శ్రీశ్రీ భావచిత్రలేఖనంలో వంచకాలు అయ్యారు. (5) ఎన్ని ఆశలు నీమీద పెట్టుకుని, ఎన్నికలలు నీచుట్టూ పోగుచేసుకుని...అన్నీ తన్నివేశావా? ఆశలు ఒకరిమీద పెట్టుకోవడం అంటే ఒక వ్యక్తి అభ్యుదయాన్ని కోరుకోవడమే కాదు; ఆవ్యక్తి వల్ల తనకు తిరిగి ఆనందం కలుగుతుందని ఎదురు చూడటం కూడాను. కలలు ఒకరిచుట్టూ ప్రోగు చేసుకోవడం అంటే ఆ వ్యక్తిని అల్లారుముద్దుగా చూసుకోవడం. తన్నివేయడం అంటే వృథా చేయడం. kick off, kick the bucket అనే ఆంగ్ల జాతీయాలకు సన్నిహితార్థంలో తన్నివేయడం వాడబడింది. (6) చెన్నపట్టణపు సముద్రతీరంలో మనం అన్నీ పిచికగూళ్ళేనా కట్టింది? –పిచిక

8 నవ్యాంధ్ర సాహిత్యవీథులు 515 పే.

ల్లాంటి పిల్లలు కాలక్షేపంకోసం కాళ్ళచుట్టూ ఇసుకపోసుకుని కట్టుకునే పిచికగూళ్ళు అశాశ్వత నిర్మాణాలకు ప్రతీకలు. జనార్దనరావు శ్రీశ్రీలు మద్రాసు హైకోర్టుబీచిలో నిజంగా పిచికగూళ్ళు కట్టలేదు కానీ అక్కడి వాళ్ళ ఊహాసౌధాలు పిచికగూళ్ళవంటివే. జనార్దనరావు మరణంతో అవన్నీ 'పొగమంచు భవనాలు'గా మారిపోయాయి. (7) చుక్కలలో ఆదర్శాలు లెక్కించడం. అంతులేనివి చుక్కలు. ఉన్నతోన్నతస్థాయిలో ఉండి చేతికందకుండా ధగధగలాడే ఆ చుక్కల వంటివే ఆదర్శాలూను. (8) కలలకు పొగలనూ కాటుకలనూ కప్పడం – నల్లని పొగలూ కాటుకలూ ఒక దృశ్యం కనబడకుండా చేసే అంతరాయాలకు ప్రతీకలు. (9) ఊపిరితిత్తులను కొలిమితిత్తులుగా చేయడం – కమ్మరి నిప్పులకొలిమి నూదడానికుపయోగించే తోలుతిత్తి కొలిమి తిత్తి. ఊపిరితిత్తి కొలిమితిత్తి కావడం కష్టాలకు రూపకల్పన. జనార్దనరావుకు వచ్చిన క్షయరోగం ఊపిరితిత్తులకు సంబంధించిందే. అంతటి రోగంలో అతడికి ఉదయిని నిర్వాహణం ఒక అగ్నిపరీక్ష. (10) కళ్ళలో గంధకజ్వాలలు, గుండెలలో గుగ్గిలపుధూమం – (కళ్ళు కప్పడం, గుండెలు మండించడం) మోసానికి అతినవ్యకల్పనలు. (11) దారిలో ప్రశ్నార్థచిహ్నాల బ్రహ్మాచెముడు డొంకలు కప్పడం – బ్రహ్మాచెముడు డొంకలు కంటకావృతాలైన అడ్డుగోడలకు ప్రతీకలు. ప్రశ్నార్థచిహ్నాలు (??) బ్రహ్మచెముడు డొంకలవంటివే–ఆకారంలోనూ క్రియలోనూ కూడా. (12) తనువులో అణువణువులో సంవర్త భయంకరఝంఝాపవనం రేగించడం – శారీరకమైన రుగ్మతకూ బాధకూ రూపకల్పన. (13) కాగితంమీద మాటకు బలికావడం (14) కనబడనిఊహ కబళించడం (15) అందని రెక్కమంత్రించి నిమంత్రించడం (16) కాళ్ళకుడెక్కలు మొలవడం వంటివి అధివాస్తవిక భావచిత్రలేఖనానికి ఉదాహరణాలు.

## శ్రీశ్రీ వాక్యబంధాలు

శ్రీశ్రీ శైలికి అతిసహజమైన అలంకారాలుగా భాసించేవి వాక్యబంధాలు; అంటే విశేషణాలతో జతపడిన దీర్ఘవాక్యాంశాలు. దొంగలంజకొడుకులసలే మెసలే ధూర్తలోకం: పొంచి చీకట్లో కరవజూచే వంచకాలు అనేవి రెండూ వాక్యబంధాలే. అతిసుందరసుస్యందన మందున దూరంగా వినువీథుల్లో విహరించే అందని అందం – గాలిలో కనరాని గడుసుదయ్యాలు – సూర్యునిలో సూదులతో క్రీడలాడు నీడలు – ఏళ్ళు బయళ్ళూ ఊళ్ళూ బీళ్ళూ ఏకంచేసే వర్షాకాలం – రెక్కవిప్పిన రివల్యూషన్ – పరస్పరం సంఘర్షించిన శక్తులు – దారుణద్వేషాగ్ని పెంచే దానవత్వం – జడలు విచ్చిన సుడులు రెచ్చిన కడలినృత్యం – మొదలైనవి అనేకం. ఇలాంటి వాక్యబంధాలను సృష్టించి ప్రపంచానికివ్వడం మహాకవుల శైలిలోనే కనిపిస్తుంది.

సుప్తచైతన్యంలో స్వప్నవాస్తవాలు

# 1939 కవితలు

సంధ్యాసమస్యలు దేనికొరకు ?

కేక

ఆధునిక కవిత్వం

అర్థం కాలేదంటే...

ఆధునిక జీవితమే

అర్థంకాలేదన్న మాట!

—శ్రీశ్రీ.

## ఇటు చూస్తే అప్పులవాళ్ళు ! అటుచూస్తే బిడ్డల ఆకలి !

1939

కవి తన వర్ణన ప్రతిభను చూపించాలంటే అందుకు తగినన్ని అవకాశాలుండాలి కనుక కావ్యంలో అష్టాదశవర్ణనలుండాలి అనే శాసనం ఒకటి బయలుదేరింది. ఈ నియమం ఫ్యూడల్ కవులందరిచేతా అనుసరింపబడింది. ఈ అష్టాదశవర్ణనలలోనిదే పురవర్ణన. ఉదాహరణకు - నిర్వచనోత్తరరామాయణంలో తిక్కన అయోధ్యాపురాన్నీ భీమఖండంలో శ్రీనాథుడు దక్షారామపురాన్నీ మనుచరిత్రలో పెద్దన అరుణాస్పదపురాన్నీ వర్ణించారు. ఈ పట్టణాలన్నీ ఫ్యూడల్ వ్యవస్థలోని లక్షణాలుగలవే; ఆలంకారికనియమాలననుసరించి వర్ణింపబడ్డవే. మేడలు, ఏనుగులు, గుర్రాలు, వారవనితలు, బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రజాతులు, దేవాలయాలు, విహారవనాలు సాధారణంగా ఈ పురవర్ణనలలోని వస్తువులు. ప్రబంధాల పురవర్ణనలలో ఉత్ప్రేక్షలకు రూపకాలకు చమత్కారోక్తులకు ఉన్నప్రాధాన్యం వాస్తవజీవితాలకు లేదు. కొంతలో కొంత క్రీడాభిరామంలో మాత్రమే వరంగల్లు నగరపు వాస్తవజీవితం ప్రతిబింబించింది.

అష్టాదశవర్ణనలు కాదుగదా, అసలు వర్ణనలకే విముఖత చూపిస్తూ బయలుదేరిన భావకవిత్వంలో పురవర్ణన ఉండనే ఉండదు. భావకవుల నాటికే ఆధునికనగరాలు రూపొందుతూ ఉన్నాయి. కానీ అవి వారికి కావ్యవస్తువులుగా కనిపించలేదంటే వారి కాల్పనికదృక్పథమే అందుకు కారణం. వారి కావ్యవస్తువు పల్లీయప్రకృతిసౌందర్యమే !

ఆధునికకవికి భౌతికదృక్పథం ఒక విశిష్టలక్షణం. కనుకనే అతడు తన చుట్టూ ఉన్న నగరవాతావరణాన్ని కావ్యంలోకి చొప్పించదలచాడు. ఈ నగరాలు ఫ్యూడల్‌వ్యవస్థలోని పురాలకన్నా చాలా భిన్నమైనవి. బూర్జువా వ్యవస్థలోనే తీగసాగి బూర్జువాపెట్టుబడిమీదే అభివృద్ధిపొంది సరికొత్తనాగరికతకు నిలయమైనదే ఆధునికనగరం. ఈ నగరంలోనే పీడక పీడిత వర్గాలు ప్రత్యక్షంగా కనిపించేది. ఆవాసక్లేశాన్ని సామాన్యుడు అనుభవించేదీ, ఆవాససౌఖ్యాన్ని ధనవంతుడు కొల్లగొనేదీ ప్రధానంగా నగరంలోనే. ఆధునికనగరం మొట్టమొదటగా గురజాడ కవితలలోనే మనల్ని తొంగిచూసింది. "పట్నమున పదినాళ్ళులుంటిని కార్యవశమున పోయి యచ్చట సంఘసంస్కరణ ప్రవీణుల సంగతుల మెలగి" అంటాడు గురజాడ మొట్టమొదటి ఖండిక

లోనే. పట్నంలో నానాజాతిసహపంక్తిభోజనానికి తాను హాజరయ్యానంటాడు ఆ కావ్య నాయకుడు.

నగరవాతావరణం కవిత్వంలో ప్రతిఫలించడానికి కవి నగరవాసాన్ని అనుభవించి ఉండటమే సరిపోదు; బూర్జువావ్యవస్థ సాధించిన అభ్యుదయాన్ని మెచ్చుకుంటూనే అది తెచ్చిపెట్టిన క్లిష్టసమస్యలను అసహ్యించుకునే మనస్తత్త్వం కవికి ఉండితీరాలి. తెలుగుకవిత్వంలో శ్రీశ్రీకి మాత్రమే మొట్టమొదటగా ఈ అనుభవం, మనస్తత్త్వం ఉన్నట్లు కనిపిస్తుంది. విశాఖపట్టణంలో శ్రీశ్రీ బాల్యం, చెన్నపట్టణంలో శ్రీశ్రీ విద్యాభ్యాసం శ్రీశ్రీని నగరకవిగా మార్చివేశాయి.

ఆధునిక నగరజీవితాన్ని కావ్యవస్తువుగా తీసుకున్న ఎజ్రాపౌండు, ఇలియట్‌లూ నగర జీవితాన్ని పారిశ్రామికపరిస్థితుల్లో హృదయవిదారక దృశ్యాలనూ కావ్యవస్తువులుగా తీసుకున్న రష్యన్ ఫ్యూచరిస్టులూ నగరజీవితవాస్తవికతాచిత్రణను చేసి పీడితలోకంపట్ల సానుభూతిని ప్రదర్శించిన మయకోవస్కీ, పాస్టర్నాక్‌లూ శ్రీశ్రీ నగరకవిత్వానికి దారిచూపించారు. సామ్యవాదవిప్లవసూత్రధారులైన కార్మికులు నగర కర్మాగారాల్లోనే ఉన్నారుకనుకనూ ఆ కార్మికుల ప్రతిపక్షాలైన బూర్జువాలకు నిలయాలు నగరాలే కనుకనూ శ్రీశ్రీకి 'నగరం' ప్రధాన కేంద్రంగా కనిపించింది. మహాప్రస్థానాత్పూర్వం శ్రీశ్రీ కవిత్వంలో 'నగరవాసనలు' మచ్చుకైనా కనిపించవు. మహాప్రస్థానగీతాలలో 'నగరపు దోపిడి' పడగవిప్పి బుసగొట్టసాగింది, 74వ ప్రకరణంలో శ్రీశ్రీ ఎలా నగరకవిగా మారిందీ సూచించాను.

## శ్రీశ్రీ కవిత్వంలో మద్రాసునగరం

మహాప్రస్థానపు అంకితగీతంలో శ్రీశ్రీ పరామర్శించిందంతా నగరవాతావరణమే. విస్పష్టంగా మద్రాసునగరవాతావరణాన్నే భూమికగా తీసుకున్న ఖండిక సంధ్యాసమస్యలు. రాక్సీ, బ్రాడ్వే థియేటర్లూ, ఉడిపీ శ్రీకృష్ణవిలాస్ హోటలూ, సముద్రమూ మద్రాసులోనివే. 1938 లోనే రెండవమారు శ్రీశ్రీ మద్రాసువెళ్ళి స్థిరపడటం జరిగింది. ఆ రోజుల్లో రాసిందే ఈకవిత.

సినిమాలు, హోటళ్లు, ఆఫీసులు, కళాశాలలు, బీచి – ఇవి ప్రధానంగా నగరపు టాకర్షణలూ ఆనవాళ్ళూను. ఉద్యోగులూ, విద్యార్థులూ, మధ్యతరగతి నిరుద్యోగులూ అక్కడి ఆకర్షణలకు తట్టుకోలేని ప్రజ. దారిద్ర్యంతో పీడితులయ్యే సామాన్యులలో వీరు మధ్యతరగతివారు. వీరి జీవితసమస్యలనే శ్రీశ్రీ సంధ్యాసమస్యలలో చిత్రించాడు. మద్రాసు మహానగరాన్ని శ్రీశ్రీ ఆశ్చర్యపోతూ చూసి ఆ సౌందర్యాన్ని వర్ణించబూనుకోలేదు. అలా వర్ణించబూనుకుంటే శ్రీశ్రీ బూర్జువాకవిగా మిగిలిపోయేవాడు. బూర్జువావర్గం సృష్టించిన ఆకర్షణలకు లొంగిపోయి, బాధలుపడే వర్గాన్ని చూసి శ్రీశ్రీ దుఃఖించాడు. ఈ దుఃఖంలోనుంచి వ్యంగ్యం పొడుచుకు వచ్చింది.

శ్రీశ్రీ కవిత్వం నగరంలో కాలుపెట్టలేదనీ అలా నగరంలో అడుగిడిన మొదటికవిత్వం నారాయణబాబుదనీ పఠాభిదనీ ఒకరిద్దరు విమర్శకులు అనడం అవిచారమూలకం. పఠాభి, నారాయణబాబుల నగరజీవనచిత్రణలో శ్రీశ్రీ కున్నంతగా మార్క్సిస్టుదృక్పథం కనిపించదు. 1939 లో కానీ పఠాభి ఫిడేలురాగాలడజన్ వెలువడ లేదు. 1938 లోనే శ్రీశ్రీ సంధ్యాసమస్యలు రాశాడు. శ్రీశ్రీని కలచివేసినది మద్రాసునగరంలోని పెట్టుబడిదారీవ్యవస్థయే. పెట్టుబడి ద్వారా అధికలాభాలను గడించడానికి నగరంలో వ్యాపారం సాగుతోంది. డబ్బు పుష్కలంగా ఉన్నవాడే ఈ నగరవ్యవస్థలో జీవించగలడు. ధనంలేనివాడు జీవచ్ఛవంమాత్రమేకాదు; అప్పులు తీర్చలేక, బిడ్డలఆకలి తీర్చలేక ఉరిపోసుకునో సముద్రంలో పడిపోయో మరణించడానికి సిద్ధమవుతాడు. ఇది సామాన్యసంసారి నగరజీవనసమస్య. మద్రాసునగరంలో శ్రీశ్రీ చూసిన వ్యాపారపుదోపిడి హోటళ్ళలోనూ థియేటర్లలోనూ.

## శ్రీశ్రీ చిత్రించిన పీడితవర్గనగరసమస్యలు

పీడితవర్గం నగరంలో అనుభవించే సమస్యలను తులనాత్మకంగా చిత్రించడం కోసం శ్రీశ్రీ ప్రయత్నించాడు. ఇవి మూడు సమస్యలు.

(1) సాయంకాలంకాగానే బ్రహ్మచారి అయిన విద్యార్థి సినిమా చూడడానికి బయలుదేరినా, తనకిష్టమైన తారలు నటించిన చలనచిత్రాలొకటికన్నా హెచ్చుగా ఉన్నప్పుడు అతడికి ఏసినిమాకు వెళ్ళడం అన్నది సమస్య. "ఆసాయంత్రం రాక్సీలో నార్మాషేరర్ బ్రాడ్వేలో కాంచనమాల ఎటకేగుటో సమస్య తగిలిందొక విద్యార్థికి" అంటూ విద్యార్థి సమస్యనే ముందుంచి, తద్వారా పెట్టుబడి సృష్టించిన సమస్యను స్ఫురింపజేశాడు శ్రీశ్రీ.

(2) ఉడిపీ శ్రీకృష్ణవిలాస్‌లో ఉద్యోగి ప్రవేశించిన సాయంకాలం కూడా అదే. ఇది నెలలో మొదటిరోజు కనుకనే ఉద్యోగి జేబులో జీతం ఉండటంవల్ల హోటల్‌లో ప్రవేశిస్తాడు.

సినిమాలు చూడటానికలవాటుపడిన విద్యార్థిది కేవలం సౌందర్యంమీద ఆకలియే. ఇతడు యౌవనంలో ఉన్నాడు. ఈ సౌందర్యతృష్ణ కొంతవరకూ కొడిగట్టినవాడు ఉద్యోగి. ఇతనిది రుచుల ఆకలి. విద్యార్థికన్నా ఉద్యోగి వయసులో పెద్దవాడు. సాయంకాలం కాగానే ఆఫీసు నుంచి హోటల్‌లో కితని ప్రవేశం. ఆ హోటల్‌లోనే అతని సమస్య. ఆ హోటల్‌లో అటు చూస్తే బాదంహల్వా ఇటుచూస్తే సేమ్యాఇడ్లీ. నిజానికతడు ఆరెండింటినీ తినవచ్చు. కానీ రెండింటినీ తినడానికి తగినంత సొమ్మును అతడు ఖర్చుపెట్టలేడు. ఇది అతని ఆర్థికసమస్య. 'ఎంచుకునే సమస్య' అందుకే కలిగిందతనికి. ఇక రెండోవైపు హోటల్‌యజమాని మనస్తత్త్వం ఎలాంటిదంటే ఒకటోతేదీకి తగినట్లు మంచి మంచి పిండివంటలు తయారుచేయించడం. ఇతడికి లాభం కావాలి. అతడికి పొదుపుకావాలి. ఇది వర్గసంఘర్షణలోని ఒక అంశమే.

(3) విద్యార్థి, ఉద్యోగి సమస్యలకు ఏదో ఒక పరిష్కారం అసాధ్యం కాదు. కానీ పరిష్కారమే లేని సమస్య నిరుద్యోగి సంసారిది. ఈ సంసారి ఇదివరకే అప్పులలో ఉన్నాడు. ఇక అప్పులిచ్చేవాళ్లు లేరు. ఇంట్లో ఆహారపదార్థాలు లేవు. ఇతనికి సినిమాలు, హోటళ్ళ అక్కర్లేదు. బిడ్డల ఆకలితీర్చడమే ఇతనికి సంధ్యాసమస్య. ఇప్పుడతనికి అప్పులవాళ్లు ఎదురయ్యారు. పోనీ వాళ్ళను తప్పించుకుని ఇంటికి పోదామంటే పిల్లల ఆకలి చూడలేడు. ఇప్పుడతనికి మరణమొకటే మార్గం. ముందు నుయ్యి, వెనుక గొయ్యి. మరణించడానికి కూడా అతనికి సరిఅయిన మార్గం కనిపించలేదు. కానీ రెండు మార్గాలున్నాయి. ఇంటికి తిరిగి వెళ్ళి గదిలో ఉరిపోసుకు చావడం లేదా ముందుకు పోయి సముద్రంలో పడిపోయి చావడం. కానీ అతనికింకా బ్రతకాలనే ఆశ చావలేదు. అందువల్లనే ఆతని సమస్య ఘనీభవించిందని చెప్పాడు శ్రీశ్రీ.

విద్యార్థికి సమస్య తగిలిందట! ఉద్యోగికి సమస్య కలిగిందట! సంసారికి సమస్య ఘనీభవించిందట! ఈ విధంగా మూడు సమస్యల తారతమ్యాన్ని సూచించాడు శ్రీశ్రీ. ఆ ముగ్గురి వయస్సులలోని తారతమ్యాలను మన ఊహకు వదిలివేశాడు శ్రీశ్రీ. మొదటి యిద్దరితోనూ మూడవ వాడిని పోలిస్తేగానీ నగరవాసపు నికృష్టజీవితం అర్థంకాదు.

శ్రీశ్రీ చిత్రించిన పీడితవర్గపు సమస్యలు ప్రధానంగా భౌతికజీవితానికి సంబంధించినవే. కూడు, గూడు, గుడ్డ అనే మూడూ ప్రాథమికావసరాలకు సంబంధించినవే. అయినా అనారోగ్యం, నిరుద్యోగం, వ్యసనాలు, సాంఘికదురన్యాయాలు, పీడన, దాస్యం, దారిద్ర్యం, వంచన, ఈర్ష్య, స్పర్థ, హత్య, ఆత్మహత్య, దౌర్జన్యం వంటివి పీడితవర్గపుసమస్యలుగానే చిత్రించబడ్డాయి.

## శ్రీశ్రీ కవితా శీర్షికలు

శ్రీశ్రీ కవితల శీర్షికలు వైచిత్రి గలవి. కవితా ఖండికలోని వస్తువునూ దృక్పథాన్నీ ఆ శీర్షిక సూచిస్తూ ఉంటుంది. కొన్ని చాలా నిరాడంబరంగానూ నిర్దిష్టంగానూ ఉంటే,మరికొన్ని ప్రతీకాత్మకాలుగానూ ప్రరోచకాలుగానూ ఉంటాయి. శ్రీశ్రీది మార్క్సిస్టుదృక్పథంతో కూడిన కళాశాలిత్వం కనుక శీర్షికలు డొంకతిరుగుడుగా గానీ అయోమయంగా గానీ ఉండవు.

'సంధ్యాసమస్యలు' అనే శీర్షిక వినూత్నపదచిత్రం. సంధ్య జీవితానికి ప్రతీక. సంధ్యాసమస్యలు సాయంకాలపు జీవిత సమస్యలు. పీడితులను సంధ్యాజీవులు, సందేహభావులు అన్నాడు మరోచోట శ్రీశ్రీయే. సరిహద్దులు దొరకని సంధ్యలలోనే వారి సంచారం! అన్నీ సమస్యలే సందేహాలే వారికి. వెలుగులోని చీకట్లే ఇరులలోని మిణుగురులే చూస్తారు వారు.

రెండుభిన్నమైన పరిస్థితులకు లేదా రెండు భిన్నమైన వాతావరణాలకు మధ్య ఉండేదే సంధ్య. వెలుగుపోయి చీకటివచ్చే సంధ్య. సాయం సంధ్య. అటుచూస్తే వెలుతురు ఇటుచూస్తే

చీకటీ – రెండింటికీ మధ్య ఉండే సంధ్యలవంటి వారే సమాజంలోని విద్యార్థి, ఉద్యోగి, సంసారి. సంధ్య రెండోవైపుకే మొగ్గుతుంది కనుక ఈ ముగ్గురూ తమసమస్యలను ఆ విధంగానే పరిష్కరించుకుంటారు. విద్యార్థి కాంచనమాల నటించే సినిమాకే వెళతాడు. ఉద్యోగి సేమ్యాయిడ్లీ సేవిస్తాడు. సంసారి సముద్రంలోనే పడిపోతాడు. ఈ విషయాలను పాఠకుడే ఊహించుకోవాలి.

శ్రీశ్రీ కవితాశీర్షికలను క్రిందివిధంగా విశ్లేషించవచ్చు. (1) మహాప్రస్థానం, అవతారం, జ్వాలాతోరణం, ఋక్కులు, ఆకాశదీపం, అద్వైతం, మిథ్యావాది, జగన్నాథుని రథచక్రాలు అనే శీర్షికలు హిందూపురాణ వేదాంత సంప్రదాయాల పరిభాషలు తెలిస్తేకానీ అర్థంకానివి. ఆ సంప్రదాయం తెలియడంతోబాటు మార్క్సిస్టు దృక్పథం గలవారికే ఆ శీర్షికలు అవగాహన అవుతాయి. (2) ఐ, అః అనే రెండు శీర్షికలూ ఏకాక్షర శీర్షికలు. ఇవి విచిత్రార్థస్ఫోరకాలు. (3) సాహసి, ప్రతిజ్ఞ, పరాజితులు, దేశచరిత్రలు, వ్యత్యాసం, అభ్యుదయం అనే శీర్షికలు మార్క్సిస్టు అయిన కవియే వాడుకోగలిగినట్లు కనిపిస్తాయి. సామాజికస్పృహ, భౌతికవాద దృష్టి లేని కాల్పనిక కవి ఈ విధంగా శీర్షికలు పెట్టలేడు. (4) నవకవిత, దేశచరిత్రలు వంటి శీర్షికలు ఏ వ్యాసకర్తయో వాడుకోవలసినవి. వీటిని కవితలకు శీర్షికలు చేయడం నవ్యధోరణి. (5) కళారవి, బాటసారి, భిక్షువర్షీయసి, ఉన్మాది, చేదుపాట, దేనికొరకు, కేక, ఒకరాత్రి, అవతలిగట్టు, ఒకక్షణంలో, నీడలు, శైశవగీతి, గంటలు, ఆశాదూతలు, నిజంగానే వంటి శీర్షికలు భావకవితా సంప్రదాయాన్ని సూచిస్తాయి. (6) గర్జించురష్యా వంటి శీర్షిక మహాప్రస్థానంలో మరొకటి లేదు. ఇది రాజకీయకవిత్వానికి తగిన ధోరణి. (7) స్విన్‌బర్న్‌కవికి, కొంపెల్ల జనార్దనరావు కోసం అనే శీర్షికలు రెండూ ప్రశంసా కవిత్వసంప్రదాయాన్ని స్థాపించేవి. (8)మానవుడా, కవితా ఓ కవితా అనే శీర్షికలు సంబోధనాత్మక భావగీతికా (ode) సంప్రదాయానికి చెందుతాయి. ఈ విధంగా శ్రీశ్రీ కవితా శీర్షికారచన వైవిధ్య-వైశిష్ట్య విలసితం.

## శ్రీశ్రీ ప్రత్యామ్నాయాలంకారం

ఆంగ్లంలోని అర్థాలంకారాలను కొన్నింటిని శ్రీశ్రీ తెలుగులో పరిచయం చేశాడు. వాటిలో **metonymy** (ప్రత్యామ్నాయం) ఒకటి. కాళిదాసునుచదివాను అని చెప్పడం కాళిదాస కావ్యాలను చదివానని చెప్పడమే. అలాగే కాంచనమాల నటించిన చలనచిత్రం పేరు చెప్పకుండా కాంచనమాలను చూశానని చెప్పడం కూడా. రాక్సీలో నార్మాషేరర్ అన్నప్పుడు నార్మాషేరర్ హాలీవుడ్ తార పేరేగానీ సినిమాపేరు కాదు.

## శ్రీశ్రీ నిర్మాణ శిల్పం

భావసాదృశ్యాన్నీ రచనాసాదృశ్యాన్నీ జోడిస్తాడు శ్రీశ్రీ. 'సంధ్యాసమస్యలు' ఖండికలోని మూడుగీతాలలోనూ విద్యార్థి, ఉద్యోగి, సంసారి– ఈ ముగ్గురి సమస్యలూ వ్యంగ్యంగా పోల్చబడ్డాయి. ఈ పోలికను మూడేసి సమానమైన వాక్యాల, పాదాల, పదాల సాదృశ్యంలో స్ఫురింపజేశాడు శ్రీశ్రీ.

| విద్యార్థి | ఉద్యోగి | సంసారి |
|---|---|---|
| రాక్సీలో నార్మాషేరర్ | అటుచూస్తే బాదంహల్వా | ఇటుచూస్తే అప్పులవాళ్ళు |
| బ్రాడ్వేలో కాంచనమాల | ఇటుచూస్తే సేమ్యాయిడ్లీ | అటుచూస్తే బిడ్డల ఆకలి |
| ఎటకేగుటొ సమస్య | ఎంచుకునే సమస్య | ఘనీభవించిన సమస్య |

పై ముగ్గురి సమస్యలూ ఉత్తరోత్తరం తీవ్రతరాలయినవని చెప్పడం కోసం 'పాదలయ'ను పాటించాడు శ్రీశ్రీ. 'ఆ సాయంత్రం' అనే పాదాన్ని వేరుచేస్తే మొదటిగీతం 4 పాదాలు, రెండవ గీతం 5 పాదాలు, మూడవగీతం 6 పాదాలు.

విద్యార్థి, ఉద్యోగి, సంసారి – ఈ పదాలను ఎంచుకోవడంలో కూడా లయ ఉంది. ఈ మూడూ తగణాలై ఇకారాంతాలయి ఉన్నాయి.

ఈ ముగ్గురూ ఒక ఎంపికసమస్యలో పడేందుకు హేతుభూతాలైన జంటలను పరస్పరవ్యతిరేకాలుగా కూర్చాడు శ్రీశ్రీ. నార్మాషేరర్ – కాంచనమాల– ఒకరు అంతర్జాతీయ తార; రెండవవారు జాతీయతార. బాదంహల్వా – సేమ్యాఇడ్లీ – ఒకటి స్వీటు; రెండవది హాటు. అప్పులవాళ్లూ – బిడ్డల ఆకలి – ఒకటి రచ్చలో బాధ; రెండవది ఇంటిలో బాధ.

ఆ సాయంత్రం అనే సమయసూచనను రెండుమార్లు చేశాడు. ఏ సాయంత్రం ? అనే ప్రశ్నకు నిర్దిష్టమైన జవాబు లేదు. సంసారికి చావాలని బుద్ధిపుట్టిన సాయంత్రమే ఆ సాయంత్రం. అదే విద్యార్థి సినిమా చూసిన సాయంత్రం. అదే ఉద్యోగి హోటల్‌కువెళ్ళి ఆల్పాహారం సేవించిన సాయంత్రం.

క్రియలను పాదాంతంలో విరవడంలో సమతను పాటించాడు. తగిలిం/దొక, కలిగిం/దొక, ఘనీభవించిం/దొక – ఈ విధంగా నిర్మాణశిల్పం గణితశాస్త్రమర్యాదల నవలంబించింది.

# 85/దేనికొరకు ?

## దేనికొరకు పదేపదే దేవులాడుతావ్ ? శ్రీనివాసరావ్ ?

1939

ఎంతోకొంత సొంతఆస్తి, చదువు, సంస్కారం, అభిరుచులు, ఆశయాలు గల వర్గంలోని వారే భావకవులు. వారికి జీవితంలో ఎదురైన సమస్యలు భౌతికమైనవి కావు; కాల్పనికమైనవి. వారికి లభించనిది డబ్బుకాదు; ప్రేమ, స్నేహం, శృంగారం వంటి హృదయపిపాసలు. వారి కవిత్వం అంతా వాటికోసమే! ఒంటరితనం భరించలేకపోవడం, సౌందర్యాన్ని అన్వేషించడం, కళలను ఆరాధించడం, కీర్తి సంపాదించడం, సన్మానాలను ఆశించడం వంటి వ్యక్తిగతాశయాలు వారివి. భావకవిత్వంలోనుంచి ఈ లక్షణాలకన్నింటికీ ఉదాహరణలు చూపించవచ్చు. (1)"చెట్టునకు మొగ్గ దొడిగెడు చేష్టగలదు/,కోరకమునకు వికసించు గుణము గలదు/, విరికి వలపుల వెదజల్లు విద్యగలదు / దేనికొఱకిది యంతయు దేనికొఱకు?/ప్రేమకొఱకు! ప్రేమకొఱకు! ప్రేమకొఱకు!'' అని ప్రకృతిలోని ప్రతి చర్యకు ప్రేమయే కారణం అన్నారు వేంకటపార్వతీశ్వరకవులు. (2) "ప్రేమకంటే ఎక్కువేముందిరా ? ఎల్ల కామ్యపదవుల కన్న ప్రేమె ఎక్కువరా! ప్రేమించు సుఖముకై ! ప్రేమించు ముక్తికై ! ప్రేమించు ప్రేమకై ! ఏమింక వలెనురా ?" అంటూ ప్రేమ తత్త్వాన్ని గురించి ప్రబోధించారు బసవరాజు అప్పారావు. (3) ప్రేయసీప్రియులమధ్య ప్రేమ తత్త్వాన్ని చిత్రించిన ఖండికలెన్నో భావకవుల్లో కనిపిస్తాయి. ఇంచుమించుగా భావకవులంతా ప్రేమను కావ్యవస్తువుగా గ్రహించినవారే! వీరందరికన్నా ముందే గురజాడ కూడా ప్రేమ తత్త్వాన్ని ప్రతిపాదించి ఉన్నాడు. ప్రేమ పెన్నిధి అనీ సతులసౌరను కమలవనముకు పతుల ప్రేమయె వేవెలుగు అనీ ప్రేమ కలుగక బ్రతుకు చీకటి అనీ గురజాడ ఉద్బోధ.

ప్రేమతత్త్వాన్ని శ్రీశ్రీ కూడా తొలిదశలో కొద్దో గొప్పో అనుకరించకపోలేదు. కాని, జీవితంలో భౌతికసమస్యలు ఎదురుదెబ్బలుగా తగిలినప్పుడే శ్రీశ్రీ కవిత్వంలో పెద్దమలుపు తిరిగాడు. నిరుద్యోగం, దారిద్ర్యం అనేవి విరహం, ఒంటరితనం వంటివాటికన్నా ఎక్కువగా భయపెట్టసాగాయి. సౌందర్యమే తీరనిదాహం అయిన భావకవి కన్నా శ్రీశ్రీ ముందుకు పోయాడు. సామాజికన్యాయం సౌందర్యంస్థానాన్ని ఆక్రమించింది. సామాజికన్యాయాన్ని సాధించే కవిత్వమే శ్రీశ్రీకి తీరనిదాహం అయింది.

భావకవికి 'ఆకలి' ఏనాడూ వాస్తవసమస్యా కాలేదు; కవితావస్తువూ కాలేదు. కానీ భావకవిత్వపురోజుల్లోలాగే సమాజం నిలిచిఉండలేదు. బూర్జువావ్యవస్థ విజృంభణతో సమాజ

స్వరూపస్వభావాలు మారిపోసాగాయి. అటువంటి సమాజంలోనే శ్రీశ్రీ 'ఆకలికవి'గా మారిపో వలసి వచ్చింది.

## శ్రీశ్రీ కవిత్వంలో ఆకలి

తెలుగుకవిత్వంలో 'ప్రేమ' వెనుక బడి 'ఆకలి' ముందుకు రావడానికి శ్రీశ్రీ ద్వార ప్రాయుడయ్యాడు. (1) 'శీతకాలం కోత పెట్టగ ఆకలేసి కేకలేశానే'' అంటూ మహాప్రస్థానపు తొలిగీతంలోనే శ్రీశ్రీ ఆకలిని గురించి ప్రస్తావించడం జరిగింది. (2) రొట్టెముక్క కవితా వస్తువన్నాడు. (3) కడుపు దహించుకుపోవడం వల్లనే పడుపుకత్తెగా స్త్రీ తయారయిందన్నాడు. (4) ఆకలిచీకటిచిచ్చులవల్లనే కూలీలు సమ్మెకడుతున్నారన్నాడు. (5) కాల్చే ఆకలినీ, దారిద్ర్యాన్నీ బహిష్కరించకుండా కవిత్వం దేనికని ప్రశ్నించాడు. (6) కూటి కోసం కూలికోసం బలి అవుతున్న యువకులనూ భిక్షువర్షీయసుల్నీ చూపించాడు. (7) బిడ్డల ఆకలిని తీర్చలేక సంసారులు ఉరిపోసుకు చనిపోతున్నారన్నాడు. (8) Emile Verhaeren వ్రాసిన ఒక గీతాన్ని 'పేదలు'గా అనువదించి నిట్టూర్చాడు.

ఒక వర్గంవారు ఈ నాడు ఆకలితో కుమిలిపోవడానికి కారణం మరోవర్గంవారి ఆకలి తీరడమే అని శ్రీశ్రీ ధ్వనింపించాడు. (1) ఎంగిలాకు ఎగిరివచ్చి భిక్షువుశవంమీద పడిందన్నప్పుడు పీడకవర్గపు ఆకలిని పరిహసించడం ఉంది. (2) ఆ ఖండికలోనే ఎముకముక్క కొరుక్కునే కుక్క, ఈగను పడవేసుకునే తొండ సామాజికులకు చూపించబడ్డాయి. (3) నరజాతి చరిత్ర సమస్తం దరిద్రులను కాల్చుకుతినడంగానే శ్రీశ్రీకి కనిపించింది. (4) అజ్ఞానపు టంధయుగంలో ఆకలిలో ఆవేశంలో తెలియని ఏ తీవ్రశక్తులో నడిపిస్తే నడిచిన మనుష్యులే సామ్రాజ్యాలను స్థాపించారని విమర్శించాడు. (5) పొద్దుపొడిచి పొద్దుగడిచేదాకా ఎద్దులాగు పనిచేసే శ్రామికులను ముద్దకి కూడా దూరంచేసే యజమాని అన్యాయాన్ని వేలెత్తి చూపించాడు. (6) బిచ్చగాని కడుపుకరువును మాయ అనవద్దని వేదాంతిని హెచ్చరించాడు. (7) బూర్జువాల వడ్డించిన విస్తరిజీవితాలనూ ఒక్కొక్కమారు విస్తరే దొరకని కార్మికుల దరిద్రజీవితాలనూ బేరీజువేసి చూపించాడు. (8) గుడిసెలలో బ్రదికే, గంజినీళ్ళుత్రాగి కాలంగడిపే మానవుణ్ని 'ఆకలికన్నా' అని జాలిగా సంబోధించాడు. (9) కూడు లేని గూడు లేని పశువుల్నీ భిక్షుల్నీ చూసి విప్లవ నాయకత్వం వహించాడు.

వ్యక్తిగతంగా కూడా శ్రీశ్రీ ఎదుర్కొన్నది ఆకలినే! ఆకటితో అలసటతో ప్రాకులాడటా వెందుకని శ్రీశ్రీని కడుపునిండినవారు మాత్రమే ప్రశ్నిస్తారు. అలాంటి ప్రశ్నలు శ్రీశ్రీకి విచిత్రంగా కనిపిస్తాయి. దేనికొరకు? అనే ఖండికలోనివి ఇలాంటి ప్రశ్నలే! ఆ ప్రశ్నలనే శ్రీశ్రీ అనుకరించాడు. ఆ అనుకరణలోనే తాను దేనికొరకు దేవులాడుతున్నదీ వినిపించాడు.

## శ్రీశ్రీ కవిత్వంలో అన్వేషణ

సమాజానికి పనికివచ్చే కవిత్వంకోసం శ్రీశ్రీ అన్వేషించాడు. (1) కవిత్వమొక తీరనిదాహం అయి కూచుంది శ్రీశ్రీకి. "కవిత్వం ఒక జబ్బు. అది పడ్డవానికే దానిసంగతి తెలుస్తుంది. అదయినా పూర్తిగా కాదు. ఆ జబ్బుపడి దానితోనే కొందరు మరణిస్తారు"1 అన్నాడొకచోట శ్రీశ్రీ. కవిత్వపు జబ్బు శ్రీశ్రీకి మరణాన్ని తెచ్చిపెట్టలేదు. కవితా విశ్వరూపాన్ని చూడటానికి సహకరించింది. (2) ఈ జబ్బువల్లనే శ్రీశ్రీ వేళకాని వేళలలో లేనిపోని వాంఛలతో దారి కాని దారులలో కానరాని కాంక్షలతో పదే పదే దేవులాడటం, ఆకలితో అలసటతో ప్రాకులాడటం జరిగాయి. జగమంతా నిదురమునిగి సద్దణిగిన నడిరాతిరి తనలోనే తానేదో ఆలకించడం ఈ జబ్బులక్షణం వల్లనే శ్రీశ్రీకి అనుభూతమయింది. 'ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం' అందుకే వినగల్గాడు. (3) "నామట్టుకు కవిత్వం ఒక ఎడతెగని అన్వేషణ. నా జీవితం కూడా అంతే. కవిత్వంలో జీవితాన్నీ జీవితంలో కవిత్వాన్నీ వెదుక్కుంటూ ఉంటాను"2 అన్నాడు మరోచోట శ్రీశ్రీ. ఈ మాటలలో శ్రీశ్రీ కవితారహస్యం ఇమిడి ఉంది. కవిత్వమూ జీవితమూ కూడా శ్రీశ్రీకి వెదుక్కోవలసిన అంశాలే అయ్యాయి. జీవితమూ కవిత్వమూ కూడా శ్రీశ్రీకి నచ్చకపోవడమే అందుకు కారణం. ఉన్న జీవితానికీ ఉండవలసిన జీవితానికీ మధ్య పెద్ద అగాధం ఉంది. అలాగే ఉన్న కవిత్వానికీ ఉండవలసిన కవిత్వానికీ మధ్య ఎంతో అంతరం ఉంది. అందువల్ల ఆ రెండింటినీ వెదుక్కోవలసి వచ్చింది. ఈ అన్వేషణ శ్రీశ్రీ రెండు విధాలుగా చేశాడు. (a) తన చుట్టూ ఉన్న సమాజంలో ఏ పరిస్థితులు జీవితానికి శాపాలుగా పరిణమిస్తున్నాయో వాటిని అన్వేషించడం. వాటినే కవితా ఓకవితా మొదలైన ఖండికలలో ప్రదర్శించాడు. (b) తనకు ముందూ సమకాలంలోనూ ఉన్న కవుల రచనలలో ఏ లోపాలు కవిత్వాన్ని నిరుపయోగం చేస్తున్నవో వాటిని అన్వేషించడం. దీన్నే మరోలా చెప్పవచ్చు - ఏ వ్యవస్థవల్ల జీవితాలు బాగుంటాయో దానిని అన్వేషించడం. ఏప్రయోజనంసాధిస్తే కవిత్వం గొప్పదవుతుందో దానిని అన్వేషించడం. ఈ రెండింటికీ కూడా సంవిధానం అవసరమే. ఆ సంవిధాన గవేషణను శ్రీశ్రీ లక్ష్యంగా పెట్టుకున్నాడు. ఈ అన్వేషణఫలితమే శ్రీశ్రీ మహాప్రస్థానగీతాలు. (4) అన్వేషణకు శ్రీశ్రీ ఎంతో శ్రమపడ్డాడని ఒప్పుకోక తప్పదు. చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణలో సర్గద్వారపుతోరణంగా మస్తిష్కాన్ని వ్రేలాడదీయడం అంటే ఇదే! నిఘంటువుల శ్మశానాలను దాటడం, వ్యాకరణాల సంకెళ్ళను తెంచడం, ఛందస్సుల సర్పపరిష్వంగాలను వదలించుకోవడం దీని ఫలితాలే! (5) కవిత్వంలో జీవితాన్నీ జీవితంలో కవిత్వాన్నీ వెదుక్కుంటూ ఉంటాడట శ్రీశ్రీ. శుద్ధకళావాదానికీ పలాయనవాదానికీ కాల్పనికవాదానికీ దూరం

---

1 శ్రీశ్రీ సా. రెండు. వచన. 510 పే.

2 అదే 511 పే.

కావాలనే సంకల్పమే ఈ అన్వేషణకు పరమార్థం. భౌతికజీవితానికి అతీతంగా కవిత్వాన్ని శ్రీశ్రీ చూడలేదు. శ్రీశ్రీ దృష్టిలో జీవితంలో కాదేదీ కవితకనర్హం! భావకవి దృష్టిలో అయితే కావన్నీ కవితకనర్హం! ఇక కవితాసంవిధానానికి కూడా శ్రీశ్రీకి ప్రేరణ జీవితమే అనడానికి ఆయన స్వీకరించిన వ్యావహారిక సజీవభాష, మాత్రాచ్ఛందస్సులూ అలంకారసామగ్రి నిదర్శనాలు. సంప్రదాయం జీవితానికి దూరం అయినప్పుడు శ్రీశ్రీ దాన్ని ధిక్కరించి జీవితానికి సన్నిహితమైన నవ్యసంప్రదాయాలను స్థాపించగలిగాడు. (6) కవిత్వంలో జీవితాన్ని వెదుక్కోవడం ఆరంభమైన నాటినుంచే శ్రీశ్రీ భావకవిత్వానికి ఎదురుతిరిగాడు. కవిత్వం కోసం బ్రతుకే ఒక తపమై వెదుకాడిన నిమిషాలందు నిషాలందున ఎటుచూచిన చటులాలంకారపు మటుమాయల నటనలలో కవిత్వరూపం కనిపించలేదు. ఇతరుల కవిత్వంలో జీవితవాస్తవికత కనిపించకపోవడం వల్ల దాన్ని ధిక్కరించి తన కవిత్వంలో జీవితవాస్తవికతను ప్రదర్శించాడు శ్రీశ్రీ. ఈ వాస్తవికత శుద్ధవాస్తవికత కాదు; అది వర్గ సంకులమైన జీవితవాస్తవికత. (7) శ్రీశ్రీ కవిత్వం దేశవిదేశాల కవిత్వాల అన్వేషణకు ఫలితం. అది ఆధునికజీవితానికి ప్రతిబింబం. 'ఆధునిక కవిత్వం అర్థంకాలేదంటే ఆధునికజీవితమే అర్థం కాలేదన్నమాట'[3] అంటాడు శ్రీశ్రీ. (8) తాను ఆశించే జీవితం శ్రీశ్రీకి కవితాస్వప్నంలోనే కనిపించింది. కాని వాస్తవంలో కాదు. దానికోసమే అతని అన్వేషణ. నడిరాతిరి కడలివద్ద హోరుగాలి ఉపశ్రుతిగ తనలోనే తానేదో ఆలపించడం, అవ్యక్తపుటూహలతో ఆలసించడం, జగమంతా నిదురమునిగి సద్దణిగిన నడిరాతిరి తనలోనే తానేదో ఆలకించడం' ఈ జీవితాన్వేషణకు ప్రతిఫలాలయిన మానసికవ్యాపారాలు మాత్రమే. "ఈ వివిధవిభ్రమాలకు కళవళపాటు పొందిన పాతకాలపు వ్యక్తి ఇదంతా తనకర్థం కాదంటాడు"[4]. ఆ పాతకాలపువ్యక్తి దృష్టిలో శ్రీశ్రీవి లేనిపోనివాంఛలు, దారికానిదారులు, కానరాని కాంతులూను. (9) శ్రీశ్రీ అన్వేషణ దేనికొరకు? అని ప్రశ్నించేవారికి సమాధానం మహాప్రస్థానపు గీతాల్లోనే ఉంది. ఈ అన్వేషణను వ్యక్తంచేయడానికి శ్రీశ్రీ 'సర్రియలిజం'ను ఆశ్రయించాడు. తనలోనే తానేదో ఆలపించడం, అవ్యక్తపుటూహలతో ఆలసించడం,తనలోనే తానేదో ఆలకించడం అనే మూడు క్రియలూ అధివాస్తవికకవి సహజాతాలు. తన అవ్యక్తచైతన్యాన్ని వినడానికి (to listen his own unconscious) అధివాస్తవికుడు యత్నిస్తాడు. ,'Surrealism is within the compass of every unconscious''[5] అంటాడు Andre Breton. 'Trust in the inexhaustible character of the murmer'[6] అంటాడు Aragon.

---

3 శ్రీశ్రీసా. రెండు. కావ్య. 479

4 అదే పేజీ

5 The History of Surrealism 97 P.

6 IBID 98 P.

## శ్రీశ్రీ కవిత్వంలో వ్యక్తిగతసత్యాలు

ప్రపంచపుబాధ అంతా శ్రీశ్రీబాధగా పరివర్తితంఅయినా శ్రీశ్రీ వ్యక్తిగతజీవితసత్యాలు కొన్ని శ్రీశ్రీ కవిత్వపాఠకులకు తెలియవలసిన అవసరం ఉండనే ఉంది. శ్రీశ్రీ కవిత్వం సంపూర్ణంగా వస్త్వాశ్రయం (objective) కాదు; అది పాక్షికంగా ఆత్మాశ్రయం (subjective) కూడాను. ఉదాహరణకు శ్రీశ్రీ కవిత్వంలో సముద్రప్రస్తావన కనిపించడానికీ అతడి నివాసానికీ సంబంధం ఉండటం! నడిరాతిరి కడలివద్ద హోరుగాలి ఉపశ్రుతిగ తనలోనే తానేదో ఆలపిస్తాడు శ్రీశ్రీ. ఇది వ్యక్తిగతజీవితసత్యమే కానీ కాల్పనికం కాదు. "ఇది నిజం! నా కవిత్వానికి సముద్రమే ఆవేశం. సమీపంలో సముద్రంలేని స్థలం నన్ను చంపేస్తుంది...విశాఖపట్టణానికి హార్బరు వచ్చినపుడు నాకు యౌవనం వచ్చింది. అందరూ ప్రేమగీతాలు రాసే ఆ ఋతువులో నేను పారిశ్రామిక విప్లవాన్ని కౌగిలించాను" అని శ్రీశ్రీ సాక్ష్యమిస్తాడు. విశాఖపట్టణపుసముద్రతీరంలోలాగే శ్రీశ్రీ చెన్నపట్టణపుసముద్రతీరంలో కూడా మిత్రులతో కలసి పిచికగూళ్ళు కట్టుకున్నాడు. మద్రాసూ విశాఖపట్టణమూ రెండూ ఒకలాగే కనిపించాయి. "Madras is the same as Vizag, may be a little magnified. There is the same sea, where we continue to count pebbles ... wind and rain, sun and shadow pose for us the same problems"[7]

1938 లో చెన్నపట్టణంలో శ్రీశ్రీ పునఃప్రవేశించినపుడు జనార్దనరావువంటి మిత్రులక్కడ లేరు. ఏకాంతంగా సాగరతీరంలో అధివాస్తవికభావనతో కూర్చున్న రోజులు 'దేనికొరకు' గీతంలో గోచరిస్తాయి.

## నేనొంటరినై...నిద్రకు వెలియై...చీకటిలోపల నాగదిలో!

1939 జూన్ 20

వ్యక్తివాది అయిన భావకవి కాల్పనికజీవితంలోని వైఫల్యాలనూ పరాజయాలనూ కాల్పనికంగానే కవిత్వంలో వడబోసుకుంటూ కన్నీరు, నిట్టూర్పు, ఏకాంతం, చీకటి, ఏడ్పు, నిరాశ, దైన్యం, విషాదం, విరహం, ప్రవాసం, ఉన్మాదం, భయం, మౌనం, మరణవాంఛ మొదలైన భావాలను మాటిమాటికీ వ్యక్తంచేశాడు. ఇవన్నీ అతడి జీవితవాస్తవికతలోని అంశాలు కాకపోయినా అతడూహించుకునే గంధర్వలోకాలకూ, సౌందర్యప్రపంచాలకూ చాలాదూరంగా ఉండిపోయాననే విచారం వల్ల పొటమరించిన అంశాలే. తొలుత గంధర్వలోక మధుర సుషమాసుధాగాన మంజువాటిలో నివసించి వియోగగీతిక అయి అనంతవిశ్వంలో పడిపోయానని దుఃఖించే భావకవి నిజజీవితంలో భౌతికంగా సుఖాలే అనుభవిస్తూ కూడా దుఃఖాన్నే కవిత్వంలో వ్యక్తంచేయవలసివచ్చింది. అందుకే - ఎవ్వరని యెంతురో నన్ను - ఏననంత/శోకభీకరతిమిర లోకైకపతిని/కంటకకిరీటధారినై కాళరాత్రి/మధ్యవేళల జీమూతమందిరంపు/ కొలువుకూటాల నేకాంతగోష్ఠిదీర్చి/దారుణదివాంధరోదనధ్వనుల శ్రుతుల/పొంగి యుప్పొంగి యుప్పొంగి పొరలిపోవు/నా విలాపనిబిడ గీతికావళీ వి/రావముల నర్ధరాత్రిగర్భమ్ము మరియు/మరియు భీషణకాళి మోన్మత్త గాగ/చేయుతరి, నన్ను మీరు వీక్షింపలేదా!/నన్ను గని యేరు జాలిఁ జెందంగవలదు/-నాకు నిశ్వాసతాళ వృంతాలు గలవు/నాకు కన్నీటిసరుల దొంతరలు గలవు/నా కమూల్య మపూర్వ మానంద మొసగు/నిరుపమనితాంత దుఃఖంపునిధులు కలవు" అంటూ ఆ దుఃఖంకూడా ఆనందదాయకంగానే తనకున్నదనడం విచిత్రంగా కనిపిస్తుంది. ఇది కాల్పనికం కనుకనే సరిపోయింది.

తాను గంధర్వలోకం నుంచి క్రిందికి జారిపడిపోయానని దిగులుపడే భావకవికీ తాను పద్మవ్యూహం వంటి ప్రపంచంనుంచి సామ్యవాద ప్రపంచంలోకి వెళ్ళలేకపోతున్నానని దిగులు పడే అభ్యుదయకవికీ తారతమ్యం ఎంతో ఉంది. వీరిద్దరి దృక్పథాలే విభిన్నమైనవి. అయితే ఇద్దరూ దుఃఖిస్తూనే ఉంటారు. ఒకరికి దుఃఖం ఆనందం కలిగిస్తుంది. మరొకరికి దుఃఖం వాస్తవంగా దుఃఖమే. వెనుక చెప్పుకున్న కన్నీరు, నిట్టూర్పు, ఏకాంతం, ఉన్మాదం, భయం వంటి భావాలు అభ్యుదయకవికి కూడా ఉంటాయి. అయితే ఇవి తన వర్గానికి అంతటికీ కలుగుతున్నవే కానీ తనకొక్కడికే వ్యక్తిగతంగా అనుభూతమవుతున్నవి కావు. అభ్యుదయకవిని భయపెట్టేది చీకటి ఒక్కటేకాదు; ఆకలి కూడాను. 'ఆకలి' అనే బాధ భావకవినిఘంటువులో అరుదు.

తన బాధను (సహృదయ) ప్రపంచానికి బాధగా చేసినవాడు కృష్ణశాస్త్రి అనీ (పీడిత) ప్రపంచం బాధను తనబాధగా వ్యక్తంచేసినవాడు శ్రీశ్రీ అనీ చెలంగారు చెప్పడం మనకు తెలిసిందే. ఒక్కొక్కప్పుడు శ్రీశ్రీ పీడితప్రపంచప్రతినిధిగా ఆత్మాశ్రయధోరణిలో తన బాధను వ్యక్తం చేస్తూంటాడు. అలాంటి ఖండికల్లో 'కేక' పేర్కొనదగినది.

## శ్రీశ్రీ కవిత్వంలో బాధ

'బాధ కవిత్వానికి పర్యాయపదం' అని ఒకచోట శ్రీశ్రీ సూత్రీకరించాడు. పుస్తకాల సారం కాక జీవితానుభవమే కావ్యవస్తువు కావాలని వివరించిన సందర్భం అది.

మహాప్రస్థాన గీతాలలో ప్రతిబింబించే శ్రీశ్రీ బాధ కేవలం సొంత బాధకాదు. (1) లోకంలోని అధర్మాన్ని చూడటం వల్ల కలిగిన (జాలి) బాధ అది. 'జగన్నాథుని రథచక్రాలు'లో అది వ్యక్తీకరింపబడింది. "ఊరవతల నీరింకిన...దగాపడిన తమ్ములార! మీ బాధలు నేనెరుగుదును! వడలో కడుజడిలో ... మీ బాధలు, మీ గాధలు అవగాహన నాకవుతాయి" అన్న పంక్తుల్లో ఆ బాధ వ్యక్తీకరింపబడింది. సామాజికంగా జరుగుతున్న అన్యాయం శ్రీశ్రీ బాధలకు మూల కారణం. (2) ఒక్కొక్కప్పుడు అంతర్జాతీయంగా ఒక పీడకవర్గం చేసే అన్యాయాలు కూడా శ్రీశ్రీ బాధలకు కారణం అవుతూ ఉంటాయి. ఇలాంటి బాధయే 'కేక' అనే ఖండికకు మూలం. 1939 జూన్ 20వ తేదీనాడు శ్రీశ్రీ రాసిన 'కేక' ఆనాటి అంతర్జాతీయ రాజకీయదురవస్థకు ప్రతిబింబమే! ఫాసిస్టులు, నాజీలు, ఇంపీరియలిస్టులు యుద్ధానికి సిద్ధమవుతున్న గడ్డురోజులవి. 1939 మార్చిలో జర్మనీ చెకోస్లవేకియానూ 1939 ఏప్రిల్‌లో ఇటలీ ఆల్బేనియానూ ఆక్రమించాయి. బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీలు కూడబలుక్కొని సామ్యవాద వ్యతిరేక సంధులు జరుపుకుంటున్నాయి. శ్రీశ్రీ తాను కలలు కంటున్న సామ్యవాదమానవత్వాన్ని ముంచివేస్తున్నారు ఈ దానవులు. అదే శ్రీశ్రీ పీడకల అయింది. ప్రపంచమనే గదినిండా చీకటి వ్యాపించగా తానా చీకటిలో నిద్రపట్టక బాధపడుతున్నాడు శ్రీశ్రీ. అతడి గుండెలమీద కుంపటి, కన్నులలో కావిరి వ్యాపించాయి. ఇదంతా ప్రపంచబీభత్సాన్ని గుర్తుచేసే కల! శ్రీశ్రీ బాధ గుండెలకు మాత్రమే కాక కళ్ళకు కూడా కలిగినది. కనుగోనల మెదగోడల నాలుగుదిక్కుల బాకులూ బాకుల తోటల బాటలూ ఆ పీడకలలో కనిపించాయి. బాకులు ఫాసిస్టుల యుద్ధోన్మాదానికీ హింసోన్ముఖత్వానికి చిహ్నాలు. 'కాలానికి కత్తులవంతెన' కట్టేది ఇలాంటివారే. ప్రపంచం అనే గది నాగలోకంగా విషపూరితంగా మారిపోయింది. భగభగ భుగభుగ భగభగ మండే మంటలు ప్రపంచంనిండా అలముకున్నాయి. నాలుక చీలిన నాగులు ఆ మంటలకు కారణం. ఫాసిస్టులూ

నాజీలు శ్రీశ్రీకి ఇరవై కోరల అరవై కొమ్ముల క్రూరఘోర కర్కోటకులుగా కోరకి కన్నూ కొమ్ముకి కన్నూ గల కర్కాటక కర్కోటకులుగా కనిపించి భయపెట్టారు. వీళ్ళను చూసే శ్రీశ్రీ కేక పెట్టాడు. ప్రపంచం అనే గదిలో దారుణ మారణ దానవభాషలనూ ఫేరవభైరవ భీకరఘోషలనూ ఘోషల భాషల ఘంటల మంటల కంటక కంఠపు గణగణలనూ చిటికెల మెటికెల చిటపటలనూ విన్నాడు. ఈ రకరకాల ధ్వనులూ చప్పళ్ళూ కోలాహలాలూ ప్రలాపనలూ రాబోయే ప్రపంచయుద్ధపు మరఫిరంగుల మరణధ్వానాలే. శాంతినీ, సామ్యవాదాన్నీ కోరే శ్రీశ్రీకి ఇవన్నీ బాధను కలిగించే దృశ్యశ్రవ్య బీభత్సాలయ్యాయి. (3) శ్రీశ్రీ బాధకు ప్రధాన కారణాలు మానవులను చుట్టుకుంటున్న చీకటి, ఆకలి. ఇవే మానవుడి ప్రధానసమస్యలు. ఈ రెండింటికీ బూర్జువావ్యవస్థదే బాధ్యత అని శ్రీశ్రీ భావిస్తాడు. ఈ రెండూ తొలగిపోయేది సామ్యవాదసామాజికవ్యవస్థలోనే. శ్రామికుడి కష్టాలను చూసి శ్రీశ్రీ పడినబాధ పెక్కుచోట్ల ధ్వనించింది. జయభేరి, కవితాఓకవితా, ప్రతిజ్ఞ, వాడు, జగన్నాథుని రథచక్రాలు ఖండికలిందుకు నిదర్శనాలు. నిస్సహాయపరిస్థితిలో శ్రామికుడికి ఏడుపే మిగిలింది. ఆ ఏడుపును విని శ్రీశ్రీ బాధపడ్డాడు. ఆ బాధలోనే కవిత్వం మొదలుపెట్టాడు. (4) శ్రీశ్రీ బాధకు మరో కారణం పీడకవర్గంయొక్క ప్రవర్తన. ఈ ప్రవర్తనను ఎక్కువగా వాచ్యం చేయడు శ్రీశ్రీ. ఉన్మాది, ప్రతిజ్ఞ, దేశచరిత్రలు వంటి ఖండికల్లో ఆ ప్రవర్తనను వ్యక్తంచేశాడు. ఒక వర్గం శ్రీశ్రీకి బాధకలిగిస్తే ఒక వర్గాన్ని చూసి శ్రీశ్రీ బాధపడతాడు. ఈ బాధే శ్రీశ్రీ కవిత్వాన్ని ఆర్ద్రీకరించింది పరుషీకరించిందీ కూడా. శ్రీశ్రీ కవిత్వం సిద్ధాంతప్రవచనంగా మిగిలిపోకుండా కాపాడింది ఇదే! భౌతికవాది అయిన శ్రీశ్రీని హృదయవాదిగా కూడా మిగిల్చింది ఈబాధే. భావకవి శృంగారి అయి ఏడిస్తే శ్రీశ్రీ శృంగారి కాంకుండానే ఏడుస్తాడు. కరుణరసం శ్రీశ్రీ బాధకు ఉపాధిగా మిగిలింది.

భావకవి బాధ కాల్పనికం కావడం వల్ల అతడా బాధలో పాడుకుంటాడే కానీ కేకలు వేయడు. శ్రీశ్రీ బాధ వాస్తవికం కావడంవల్ల అతడా బాధలో 'కేకలు' వేస్తాడు. 'కేక' శ్రీశ్రీ అభిమానపదజాలంలో ఆవిధంగానే చేరింది. ఆకలేసి కేకలేశానే – రాకాసికేకలు – ఘూకంకేకా వంటి ప్రయోగాలు చేశాడు శ్రీశ్రీ. ఈ కేక ఆర్తికీ వ్యథకీ బాధకీ ప్రతీక అయింది.

## శ్రీశ్రీ కవిత్వంలో చీకటి

మానవుడి ప్రధానసమస్య 'చీకటి' అని ఉపనిషత్తారులే గుర్తించారు. 'తమసో మా జ్యోతిర్గమయ' అన్నారు. ఆ చీకటిని వారు అవిద్యకు సంకేతంగా గ్రహించారు. మానవుడిలోని తమోగుణమే మానవుడి కష్టాలకు మూలమవుతున్నది. సర్వనాశనాలకు దారితీస్తోంది. ఉపనిషత్తారుల దృష్టిలో 'జ్యోతిస్సు' అంటే పరమాత్మలో లీనం కావడమే. మోక్షమే అన్నికష్టాలకు

ఆధ్యాత్మికవాదులు చెప్పే నివారణోపాయం. కానీ భౌతికవాదులు సామ్యవాదాన్నే కష్టాలన్నింటికీ నివారణోపాయంగా గుర్తించారు. వారి దృష్టిలో చీకటి అంటే దోపిడి. వెలుతురంటే సామ్యవాదం.

శ్రీశ్రీ చెప్పే చీకటి దోపిడికి ప్రతీకయే. ఇలాంటి చీకటిలో మానవుడి మొగం కనబడ దంటాడు శ్రీశ్రీ ఒకచోట. "ఇవాళ నాకు ఏమనిపిస్తోందంటే మానవుని ప్రధానసమస్య మరేదీ కాదు- చీకటి. చీకటి అనే గదికి మనంవేసుకునే తాళం నిద్ర. ఆరోగ్యవంతులు హాయిగా నిద్ర పోతారు. చీకటి వాళ్ళనేమీ చెయ్యలేదు. నిద్రపట్టక నేనెన్నిరాత్రులు గడపలేదు?".8 అటువంటి సమయాలలోనే శ్రీశ్రీ కేక ఖండికను రాసినట్లు చెప్పుకున్నాడు. ఇక్కడ ఆరోగ్యవంతులు పలాయనవాదులే. వారికి సమస్యలు లేవు. అందుకే హాయిగా నిద్రపోతారు. కాని, శ్రీశ్రీ సమస్య సాంఘికసమస్యయే. అందువల్ల అతనికి నిద్రపట్టలేదు. ఆ చీకటిలో అతనికి మానవుడి మొగానికి బదులు రాక్షసుల మొగాలు కనబడ్డాయి. పాములు, పీతలు, నక్కలు, కుక్కలు కనబడ్డాయి. అందుకే అతిడు కేక వేయవలసివచ్చింది.

చీకటిలో అందరూ పెనునిద్దురలో ఉండగా శ్రీశ్రీ మెలకువగా ఉండి భయపడతాడు కనుకనే నవకవనానికి పెనునిద్దుర వదిలించేది కావాలంటాడు. ఆ చీకట్లోనే లక్షనక్షత్రాల మాటలు వింటాడు. సమాజంనిండా శ్రీశ్రీ చీకటిని దర్శించాడు. బాటసారికి దారిలో చిమ్మచీకటి క్రమ్ముకొస్తుంది. భిక్షువర్షీయసి మరణించగానే చిమ్మచీకట్లు క్రమ్ముతాయి. దురదృష్టజీవి మరణించిన గదిలో చినుకులవలె చీకట్లు కురుస్తాయి. వింతభయాలు వ్యాపించిన ఇంట్లో చీకటి అలముకుంటుంది. చెదరిన గుండెలకు అవతలా ఇవతలా అరులై ఇరులే అదుముతాయి. జగమంతా నిదురమునిగి సద్దణగిన నడిరాతిరి తనలోనే తానేదో ఆలకించినవాడు శ్రీశ్రీ ఒక్కడే. నిద్రకు వెలియై ఒంటరియై గదిలోపల చీకటిలో చీకటిలోపల గదిలో కేకలుపెట్టినవాడు శ్రీశ్రీ ఒక్కడే. ఈ సాంకేతికచిత్రణ శ్రీశ్రీ యొక్క క్రాంతదర్శిత్వాన్ని నిరూపిస్తోంది. సామాజిక చైతన్యం కోల్పోయి ప్రజలంతా మూర్ఛిల్లి నిద్రించే యుగంలో కవిగా తాను మేలుకొని ఉండటం శ్రీశ్రీ విశేషం. "ఇంకా రాత్రి చీకట్లో లోకం నిద్రలో భయంకరస్వప్నాలు కంటో దీనంగా పలవరించే సమయాన ఉషోగమనాన్ని గుర్తించి స్వాగతమిచ్చే వైతాళికుడు శ్రీశ్రీ"అని చెలం అన్న మాటలు సార్థకమైనవే.

## కవిత్వారంభావసానాల్లో శ్రీశ్రీ శిల్పం

కవితను ఎలా మొదలుపెట్టాలి అనేదే సమస్యగా తీసుకున్న శ్రీశ్రీ కళాదృష్టి సామాన్యమైనదికాదు. సామ్యవాదప్రచారమే కవిత ఏకైకలక్ష్యం అనుకునిఉంటే సంవిధానానికింత మొగ్గ

---

8 శ్రీశ్రీసా. రెండు. వచన. 316 పే.

చూపేవాడు కాడు. మంచి సంవిధానం లేని కవిత ఎంత గొప్పఆశయం గలదైనా మంచి కవిత కాజాలదు. వస్తువుకు తగిన సంవిధానం కోసం వెదకులాడటం కళాజీవికి సహజం. అటువంటి అన్వేషణతత్పరత్వమే శ్రీశ్రీచేత 'ఆరంభం పెద్ద అవస్థ' అని పలికించింది. శ్రీశ్రీ నిర్దేశించిన 'శ్లోభా లేశం' కవితను మొదలుపెట్టడంలోనే మొదలవుతుంది. అది చివరివరకూ పాకిపోతుంది. అందువల్ల శ్రీశ్రీకి ఎత్తుగడయేకాక ముగింపూ పెద్దఅవస్థే అవుతుంది. ఈ రెండవస్థలనూ దాట గల్గడంలోనే శ్రీశ్రీ కృతార్థత తళుక్కుమంటుంది.

ఫ్యూడల్‌సమాజవ్యవస్థలో కాలంగడవడమే ఒక పెద్దఅవస్థ. బూర్జువాసమాజవ్యవస్థలో కాలం చెల్లాచెదురై జీవితంలో కావ్యపఠనానికే తీరిక లభించదు. ఈ భేదమే ఫ్యూడల్‌వ్యవస్థ లోని దీర్ఘకావ్యాలకూ బూర్జువావ్యవస్థలోని చిన్నికావ్యాలకూ మౌలికకారణం. ఫ్యూడల్ వ్యవస్థలో దీర్ఘకావ్యాలు ఏ శిల్పమర్యాదలను కనుక్కొని పాటించాయో ఆ శిల్పమర్యాదల నన్నింటినీ శ్రీశ్రీ తనఖండకావ్యాలకు మల్చుకున్నాడు. ఫ్యూడల్‌కవులు తమకున్న తీరికతో ఎన్నో శిల్పప్రయోగాలు చేయగలిగారు. బూర్జువావ్యవస్థలోని ప్రొలిటేరియట్‌కవిఅయిన శ్రీశ్రీ ఆ శిల్పాలను తనవారసత్వపుఆస్తిగా సంగ్రహించుకున్నాడు. శ్రీశ్రీ ఖండకావ్యాలలో ఆరంభం, అవసానం అర్థవంతంగా పరస్పరం కూడబలుక్కున్నట్లుగా ఒకదానిఅక్కర మరోదానికున్నట్లుగా వెలిగిపోతాయి. 'కేక' ఖండికలోని ఆరంభావసానాలను పరిశీలిస్తే మనకు కలిగేది ఆశ్చర్యం. శ్రీశ్రీ సంవిధానతత్పరత కిది నిదర్శనం. ఆరంభగీతంలోని పాదాలు అవసానగీతంలో అక్కడి కక్కడే తారుమారయ్యాయి. ఇది తన పీడకలకు ముందువెనుకల పరిస్థితిని వ్యక్తంచేస్తోంది. కల ముగిసేసరికి ఆకటితో మిగిలాడు. ఇలా అర్థవంతమైన ఆరంభావసానాలు జయభేరి, చేదుపాట, ఒకరాత్రి, నీడలు, అద్వైతం, మిథ్యావాది, నిజంగానే వంటి ఖండికల్లో కనిపిస్తాయి.

ఆరంభం కవితకు మస్తిష్కం వంటిది. అవసానం కవితకు పాదంవంటిది. మధ్యభాగం హృదయమే. ఈ భాగంలోనే వస్తువంతా నిక్షిప్తమై ఉండేది. కేకలో మధ్యభాగం కూడా శ్రీశ్రీ నిర్వహణకౌశలానికి నిదర్శనమే. కన్నులునిండిన కావిరి→కావిరినిండిన కన్నులుగా మార్చి వేస్తాడు. ఇక్కడ మనిషిని తలకిందులుగా వేలాడదీస్తే ఎంతఉక్కిరిబిక్కిరి కలుగుతుంతో ఆ అవస్థ ఉంది. గుండెలకప్పిన కుంపటి → కుంపటి కప్పిన గుండెలుగా మారడం కూడా విషమపరిస్థితే!

వర్గరహితస్వర్గానికి కవిత్వపునిచ్చెనలు

---

# 1940, 41 & 47 కవితలు

---

జగన్నాథుని రథచక్రాలు

గర్జించురష్యా!

నిజంగానే ?     నీడలు

---

అనేకవిధాల
క్షణక్షణపరిణామం పొందుతున్న ప్రపంచానికి
కళాశీలురే పురోగాములు!
వీరి దూరదృష్టిలో
ప్రజ్వరిల్లిన ఆదర్శలోకమే
కాలక్రమాన
భౌతికలోకంలో రూపుకడుతూంది!
నిజమైన తిరుగుబాటు
కళాప్రపంచంలోనే వస్తుంది!
రాజకీయవాదులు
తర్వాత వీటినే ప్రచారం చేసి
నూతనరాజ్యం స్థాపించామంటారు!

— శ్రీశ్రీ

## 87/జగన్నాథుని రథచక్రాలు

### ఈ స్వప్నం నిజమవుతుంది! ఈ స్వర్గం ఋజువవుతుంది!

1940

ఆధునికత అనేది అనేక భావాల, అంశాల సమాహారం. అందులో అంతర్జాతీయదృక్పథం ప్రధానమైనది. ఇలాంటి దృక్పథం ఏర్పడటానికి 1914 లో వచ్చిన ప్రథమప్రపంచ మహాయుద్ధం ద్వారాలు తెరిచింది. ఈ యుద్ధాన్ని నిరసిస్తూ గురజాడవారే దించులంగరు అనే గేయాన్ని రాశారు. అందులో 'లోకమంతయు ఏకమై యుద్ధమును మారణము చేయును! వచ్చెనిదె బంగారు కాలము! వాంఛలెల్లను తీరు సుజనులకు!' అన్నారు. ఇలాంటి గేయాలే తెలుగు కవిత్వంలోకి అంతర్జాతీయ భావాలను తీసుకు వచ్చాయి. గురజాడ తరవాత-శ్రీశ్రీకి ముందు-ప్రగతిశీలదృక్పథంగల కవి బహుశా దువ్వూరి రామిరెడ్డి ఒక్కరే! మానవసమానత్వాన్నీ శాంతినీ ధర్మాన్నీ వసుధైవకుటుంబకత్వాన్నీ ఆయన కవిత్వంలో భావించి ఆధునికతకు పునాదులు వేశారు. ఇది 'భవిష్యద్దర్శనం' అనే ఖండికలో భాసించింది. 'స్వాతంత్ర్యరథము' అనే ఖండిక రామిరెడ్డిగారి ప్రగతిశీల భావాల స్వప్నమే! ఆకాశవీధిలో బయలుదేరిన స్వాతంత్ర్యరథాన్ని ఆయన కలగన్నారు. జలధరమాలను చీల్చుకుంటూ నభోంతరాళాన్ని ఉజ్జ్వలితం చేస్తూ అంధతమసాలు వ్యాపించిన మూలల్లో కూడా శోభల్ని నవలెత్తిస్తూ ప్రభాతవిభాకరబింబంలా స్వాతంత్ర్యరథం వచ్చి సమస్తసృష్టిలోనూ నవజీవనాన్ని నింపిందట! ఆ రథంలో ఆయనకొక పవిత్రమూర్తి కనిపించింది. ఆమె ధర్మానికీ శాంతికీ సత్యానికీ సంసారఫలానికీ ప్రజాహ్యదయానికీ ప్రతీక. ఒకచేతిలో ఆమె రుధిరపాత్ర, మరోచేతిలో పీయూషపాత్రి ధరించింది. 'సభ్యతామిషతో దేశాలన్నీ ధర్మాలుగా ఎంచుతున్న అన్యాయాలన్నీ ఈ నాటితో వికలమైపోతాయి' అంటూ నెత్తురూ అమృతమూ కలిపి దివ్యదుగ్ధంగా మార్చివేసిందామె! హాలహలంనుంచే అమృతం వస్తుందనీ విప్లవంనుంచే ధర్మం ఆవిర్భవిస్తుందనీ రామిరెడ్డి అభిప్రాయానికిది సూచన. 'స్వాతంత్ర్యరథం' ధరణీపతి పాలనదండభీతితో నిలిచిపోయేది కాదు. అనాథబాష్పాలు నిలిచిన పల్లపునేలలోనూ నిలిచిపోయేది కాదు. మోసగింపుల మఱపించు క్రించుదనపుంజతురాత్ముల వల్లనూ ఆగిపోయేది కాదు. స్వాతంత్ర్యరథం అనర్గళవేగంతో పురోగమిస్తూ ఉంటే పూర్వ సింహాసనాలూ మణిమయ కిరీటాలూ భోగమందిరాలూ దాని చక్రాలకిందపడి నాశనమైపోతాయి. ఫ్యూడల్ వ్యవస్థ అస్తమిస్తుంది. స్వాతంత్ర్యరథాన్ని గుర్రాలూ ఏనుగులూ కాదు లాగేవి;

ప్రజలే దాన్ని లాగుతారు. అది వాయువేగంతో నక్షత్రమార్గంలో పోతుంది. ఆ రథమార్గంలో నెత్తురు ప్రవహించి బంగారుపంటలు పండాయి. చక్రనేములు తాకిన స్థలాలన్నీ సస్యలక్ష్మికి కళ్యాణశాలలయ్యాయి. ఆ రథంలో ఉన్న దేవి 'శాంతి శాంతి' అంటూ నవ్యనక్షత్రవీణను మీటుతూ గానం చేస్తోంది. ఇదే రామిరెడ్డిగారి స్వాతంత్ర్యరథంలోని సారాంశం. పరతంత్ర భారతదేశంలో సంస్థానాలకాలంలో ఫ్యూడల్‌సమాజంలో ఉంటూ అంతర్జాతీయభావన నల వరుచుకున్న రామిరెడ్డిగారు 1935 కు ముందేరాసిన ఈ ఖండిక ఆయన ప్రగతిశీలదర్శనానికి గొప్ప నిదర్శనం. అప్పటి ఆర్థికసంక్షోభ పరిస్థితులూ దేశదేశాలలోని రాజకీయకల్లోలాలూ తన దేశంలోని స్వాతంత్ర్యసమరమూ రష్యాలో వచ్చిన సామ్యవాదవిప్లవమూ రామిరెడ్డి ఆలోచనా ధారమీద ప్రభావం చూపించడం ఆశ్చర్యకరంకాదు. గురజాడ తీసిన అంతర్జాతీయభావ మార్గంలో ఇది చెప్పుకోదగిన మలుపు. మరో మలుపును తెచ్చినవాడే శ్రీశ్రీ. శ్రీశ్రీ భావ మార్గం నిర్దిష్టంగా సామ్యవాదానికే సంబంధించింది.

శ్రీశ్రీ కలగన్నది స్వాతంత్ర్యరథం కాదు; సామ్యవాదస్వాతంత్ర్యరథం! దాన్నే 'జగన్నాథరథం'గా భావించాడు. ఆ రథం కూడా మొయిల్దారినే బయల్దేరింది. ఆ రథచక్రాలను శ్రీశ్రీ తన కలంతోనే భూమార్గం పట్టించదలచాడు. ఇంతలో నటధూర్జటి నిటాలాక్షి పగిలి ప్రపంచాన్నే భయపెట్టింది. సర్వవిధ్వంసం మొదలయింది. ఆ యుద్ధమే ప్రపంచశాంతిని వెలయిస్తుందని శ్రీశ్రీ ఆశించాడు.

గురజాడ, రామిరెడ్డి, శ్రీశ్రీల అంతర్జాతీయభావన క్రమంగా ఒకదాన్ని మించి మరొకటి నిర్దిష్టధ్యేయాలను సంతరించుకున్నాయి. ప్రథమప్రపంచయుద్ధంనాటి కవి గురజాడ. రెండవ ప్రపంచయుద్ధానికి ముందరికవి రామిరెడ్డి. రెండవ ప్రపంచయుద్ధంనాటికవి శ్రీశ్రీ. ఇంగ్లీషువారి ధర్మరాజ్యమే స్వాతంత్ర్యం ఇస్తుందని గురజాడ భావించాడు. ఫ్యూడల్‌వ్యవస్థపోయి, బూర్జువా వ్యవస్థకు బదులు ప్రజాస్వామ్యస్వాతంత్ర్యం వస్తుందని రామిరెడ్డి భావించాడు. బూర్జువా సామ్రాజ్యవాదం పోయి శ్రామికసామ్యవాదస్వాతంత్ర్యం లభిస్తుందని శ్రీశ్రీ భావించాడు. ఈ ముగ్గురూ తమకాలంనాటి రాజకీయపరిస్థితులనుంచి విముక్తినే ఆశించారు. గురజాడకూ రామిరెడ్డికీ లేని వర్గదృక్పథం శ్రీశ్రీలో ఉంది కనుకనే శ్రీశ్రీ "జగన్నాథుని రథచక్రాలు" శ్రామికులను సంబోధిస్తూ ఓదారుస్తూ రచించాడు. ఈ ముగ్గురి సంవిధానాలూ వేరువేరు. ఒకదానికన్నా ఒకటి విశిష్టతరమైనవికూడా.

## శ్రీశ్రీ కవిత్వంలో స్వాప్నికత్వం

కవి ఏ వాదానికి చెందినా స్వాప్నికుడే! వాస్తవలోకంలో లభించే అవకాశం లేనిదాన్ని భావకవి కలలో పొందగల్గితే వాస్తవలోకంలో లభించే అవకాశంగలదాన్నే ప్రగతిశీలకవి

కలగంటాడు. భావకవి కల కళ(కల్పన)గా, కల్లగా మిగిలిపోతుంది. అభ్యుదయకవి కల వాస్తవం కావడానికి భవిష్యత్తులో అవకాశం ఉంటుంది. కలను నిజంచేసుకోవడమే అభ్యుదయలక్షణం. సర్రియలిస్టుకవి కూడా కలయే తన కళకు మార్గంగా భావించాడు. కలనుంచే కళకు మార్గం వేసుకున్నాడు. అభ్యుదయకవికి జీవితంకోసం కల - కళ. భావకవికి కలకోసం జీవితం. జీవితమే అతనికొక క(ల)ళగా భాసించాలి. ఈ మూడు దశలూ శ్రీశ్రీ కవిత్వంలోనే ఉన్నాయి. అవి భిన్న భిన్న ధర్మాలు గలవి. అభ్యుదయకవి తన భావనను స్వప్నంగా ప్రదర్శిస్తాడు. అది అతడి సంవిధానం మట్టుకే. ఇది ఇంద్రజాలానికి (magic) అతి సన్నిహితంగా ఉంటుంది. అభ్యుదయకవి స్వప్నం ప్రజలను చైతన్యవంతుల్ని చేసి, కార్యాచరణకు పురికొల్పుతుంది. భావకవి స్వప్నం సహృదయులను సౌందర్యపరవశుల్ని చేసి అంతర్ముఖుల్ని చేసి విడుస్తుంది. సర్రియలిస్టుకవి అసహజమైన, తర్కాతీతమైన విషయాలను కళలో చూపించేందుకు స్వప్నవాస్తవికతను అవలంబనంగా గ్రహిస్తాడు.

'జగన్నాథుని రథచక్రాలు' అభ్యుదయకవి స్వప్నమే! 'ఈ స్వప్నం నిజమవుతుంది' అని శ్రీశ్రీ ఆ గేయంలోనే ప్రకటిస్తాడు. ఆ స్వప్నం ఏమిటి? తాను సామ్యవాదవిప్లవనాయకుడయ్యాడు. సమాజంలో బూర్జువావ్యవస్థచే పీడితులవుతున్న వారినందరినీ ఓదారుస్తూ ఉండగా ఆకాశవీధిలో హడావిడిగా పోతున్న జగన్నాథుని రథం కనిపించింది. దాని కదలికకు తట్టుకోలేక మహానగాలెగిరిపోతున్నాయి. తన చేతిలో ఉన్న కలంతో జగన్నాథుని రథచక్రాలను భూమార్గానికి పట్టించి, ఆ రథచక్రాలప్రళయఘోషతో భూకంపం పుట్టిద్దామనుకుంటాడు. ఇంతలో నటధూర్జటి నిటలాక్షి పగిలి ప్రపంచాన్ని భయపెట్టింది. హింస చెలరేగింది. విషవాయువు, మరఫిరంగి, టార్పిడో ప్రయోగింపబడ్డాయి. హాలాహలం పొగచూరింది. కోలాహలం చెలరేగింది. ఇనుపడేగ ఎగురుతోంది. మంటపంట మండుతోంది. ఇదీ ఆ కల! ఈ స్వప్నంయొక్క పరమార్థాన్ని కూడా శ్రీశ్రీ వ్యాఖ్యానించాడు. ఆ ఇనుపడేగ ద్రోహాలను తూలగొడుతుంది! ఆ మంటపంట దోషాలను తుడిచిపెడుతుంది! స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం పునాదులై ఇళ్ళు లేచి జనావళికి శుభంపూచి శాంతి, కాంతి వ్యాపిస్తాయి. జగమంతా జయిస్తుంది!

ఈ స్వప్నంమీద మార్క్సిస్టుతత్త్వదృక్పథప్రభావం ఉంది. రెండవ ప్రపంచయుద్ధం యొక్క పర్యవసానాన్ని గురించి ఊహాగానం ఉంది. వర్తమానమూ, భవిష్యత్తూ ఈ కలలోని రెండు కాలాలు. గతం గురించిన స్వప్నం కాదిది.

## శ్రీశ్రీ శ్రామికనియంతృత్వభావన

వస్తున్నాయొస్తున్నాయి జగన్నాథరథచక్రాలు అనీ జగన్నాథుని రథచక్రాల్ భూమార్గం పట్టిస్తాను అనీ వచ్చేశాయ్ జగన్నాథరథచక్రాల్ అనీ మూడురకాలుగా రథచక్రాల ఆగమనాన్ని సూచించడంద్వారా సామ్యవాదవిప్లవం రావడాన్నే సూచించాడు శ్రీశ్రీ. జగన్నాథరథం మరోప్రపంచానికి సంకేతమే కావచ్చు. ఆ రథచక్రాలు కర్షకకార్మికులే కావచ్చు. ఇంతకీ జగన్నాథరథం అనే సంకేతం శ్రీశ్రీకి ఎలాస్ఫురించింది? శ్రీశ్రీ తాను పుట్టిన విశాఖపట్టణానికి సమీపంలో ఉన్న పూరీక్షేత్రంలోనే ఉంది ఆ జగన్నాథరథం. ఆ రథచక్రాలు కదలడానికి ప్రజల ప్రయత్నం అవసరం అవుతుంది. ఆ రథాన్ని లాగడానికి అంతా సమానంగా ప్రయత్నిస్తారు. అరవిందులు జగన్నాథరథాన్ని ఆదర్శసమాజానికి ప్రతీకగా వాడుకునే ఉన్నారు.1 శ్రీశ్రీ దాన్ని సామ్యవాదసమాజానికి ప్రతీకగా మార్చుకున్నాడు. 'జగన్నాథ్' అనే శబ్దాన్ని జగ్గర్‌నాట్‌గా మార్చి నూతనార్థాన్ని కల్పించడం కూడా అంతర్జాతీయసాహిత్యంలో జరిగింది. జగ్గర్‌నాట్ (Juggernaut) అంటే విధ్వంసకహేతువే! శ్రీశ్రీ దృష్టిలో విప్లవం బూర్జువావ్యవస్థకు విధ్వంసకహేతువవుతుంది. విప్లవమే శ్రీశ్రీకి జగన్నాథుడు. ఆ విప్లవమూర్తి అధిరోహించే రథమే కవిత్వం. దాన్ని లాగే చక్రాలే విప్లవకారులు. సామ్యవాద విప్లవం వచ్చినతరువాత ఏర్పడే శ్రామికరాజ్యానికి శ్రామికనియంత అధిపతి అవుతాడు. ఆ శ్రామికనియంత విప్లవనాయకుడే. ఆ నియంతయే శ్రీశ్రీ భావించే జగన్నాథుడు.

## శ్రీశ్రీ హ్రస్వలిపిసంవిధానం

పరిమాణాన్నిబట్టి కాక, గుణగౌరవాన్నిబట్టి ఏ కావ్యమైనా గొప్పదవుతుంది. శ్రీశ్రీ దృష్టిలో మహాకావ్యం అంటే బృహత్కావ్యం కాదు. (5 వ ప్రకరణంలో శ్రీశ్రీ మహాకావ్య శిల్పం గురించి కొంత చర్చ సాగించాను). ఒక కవిత కలిగించే రసోద్దీపనం మీదా, ఆ కవిత ఇమిడించుకునే బృహద్వస్తువు మీదా, ఆ కవిత అభివ్యంజించే విస్తృతార్థం మీదా మహాకావ్యత్వం ఆధారపడి ఉంటుంది. దానికి కదిలించి, మార్పించి, మునుముందుకు నడిపించి, పెనునిద్దుర వదిలించి, పరిపూర్ణ పునర్బ్రతుకిచ్చే లక్షణం కూడా ఉండాలంటాడు శ్రీశ్రీ. ఈ లక్షణాలన్నీ జగన్నాథుని రథచక్రాలు ఖండికలో ఉన్నాయి.

బృహత్కావ్యంలో అయితే కవికి తన నైపుణ్యంలోని అంచులనన్నింటినీ మెరిపించడానికి వలసినంత అవకాశం ఉంటుంది. కానీ ఖండకావ్యంలో కవి తన నైపుణ్యశతధారలను పరిమిత వలయంలోనే ఇమిడించగలగాలి. అందువల్ల కవినిపుణతకు ఖండకావ్యమే గీటురాయి అవుతూ ఉంటుంది. బూర్జువావ్యవస్థలో అతివేగంగా సాగే ప్రసంగాన్ని రాసేందుకు షార్టుహాండ్

---

1 ఆధునికాంధ్ర కవిత్వము 577 పే.

సంవిధానం వచ్చింది. అతి విస్తృతవిషయాన్ని అందించడానికి టెలిగ్రాఫ్ సంవిధానం వచ్చింది. ఒక పెద్ద దృశ్యాన్ని చూపేందుకు ఫొటోగ్రాఫ్ సంవిధానం వచ్చింది. ఈ సౌలభ్యాలనన్నింటినీ కవిత్వం ద్వారా అందించడం ఆధునికత్వచిహ్న మవుతోంది. ఈ పొదుపు, వేగం, సంక్షిప్తత శ్రీశ్రీ కావ్యశిల్పంలోకి తీసుకున్నాడు. శ్రీశ్రీ ఖండకావ్యం ఈ లక్షణాలు గలదే! 'జగన్నాథుని రథచక్రాలు'లో శ్రీశ్రీ హ్రస్వలిపిసంవిధానం పెక్కు పోకడలు పోయింది. కొన్నింటిని వివరిస్తాను.

(1) కొన్నిచోట్ల పదాలే సంపూర్ణ వాక్యార్థాన్ని ఇమిడించుకుంటాయి! (2) కొన్నిచోట్ల ధ్వనులే భావవ్యంజకత్వాన్ని సాధిస్తాయి. (3) కొన్ని అక్షరాలే ఆవేశాన్ని ప్రతిధ్వనిస్తాయి. (4) 'జగన్నాధునిరథచక్రాలు' 143 హ్రస్వపాదాల పరిమాణం గల ఖండిక. ఇందులోని పాదాలు కొన్ని అనుష్టుప్పుకన్నా చిన్నవి. తక్కినవి అనుష్టుప్పుపరిమాణాన్ని మించినవి కావు. అయినా ఈ గీతంలోనే వస్తుగౌరవం, సంవిధానశిల్పం, సందేశం, రసావేశం అనేనాలుగుఅంశాలూ అల్లిబిల్లిగా అల్లుకుపోయాయి. (5) 'జగన్నాథునిరథచక్రాలు'లో నాలుగు ప్రధానవిషయాలున్నాయి. (a) సామాన్యుల దుఃఖదుర్భరజీవితం (b) సామ్రాజ్యవాదుల యుద్ధోన్మాదం (c) ప్రగతివాదుల తిరుగుబాటు (d) సామ్యవాదప్రపంచావతరణం. స్థూలంగా ఈ నాల్గింటినీ ఈ ఖండికలో ప్రదర్శించిన తీరు అద్వితీయం. ఇందులో శ్రీశ్రీ రసావేశం కరుణానికీ వీరానికీ మధ్య కెరటాలు కెరటాలుగా ఊగిసలాడింది. (6) సామాన్యజనులయెడ సానుభూతితో ఆరంభమైన సంబోధనలే వారి జీవితాన్ని సంపూర్ణంగా చిత్రించాయి. కవి ప్రత్యేకంగా వారి జీవితాన్ని వర్ణించవలసిన అవసరం లేకపోయింది. ఈ గీతం మొదట్లోనే ఏడుసంబోధనలున్నాయి. అవి పీడితుల ఏడ్పును సూచిస్తాయి. ఇది హ్రస్వలిపిలో మెలకువే! (7) 'సఖులవలన పరిచ్యుతులు, జనులవలన తిరస్కృతులు, సంఘానికి బహిష్కృతులు, జితాసువులు, చ్యుతాశయులు, హృతాశ్రయులు, హతాశులు' అంటూ ఏడురకాలవారిని పేర్కొని వెంటనే ఏడవకండేడవకండి అని ఓదార్చడంలో గొప్ప సంక్షిప్తత సాధించబడింది. వీరంతా సమాజంలో ఏడుస్తూంటే కవి వీరిని మాతృమూర్తిలా ఓదారుస్తున్నాడన్నమాట. (8) సామాజికుల దుఃఖాల తీవ్రతను రెండు సంక్షిప్తపద చిత్రాలలో ఘట్టించి చూపించాడు శ్రీశ్రీ. (a) బాధాసర్పదష్టులు అనేది. పాము కరిచినప్పటి జీవన్మరణ సమస్యలో ఉన్నవారు వీరు. చావుబ్రతుకుల సంధ్యాకాలంలో పీడితవర్గీయు లున్నారన్నది వాస్తవం. ఇది ఆర్థికబాధయే కాదు; హార్దికబాధ కూడాను. ఈ బాధాసర్పం బూర్జువా వ్యవస్థయే. (b) శనిదేవతరథచక్రపుటిరుసులలో పడి నలిగిన దీనులు అనే పదచిత్రం. జగన్నాథ రథం సామ్యవాదమైతే శనిదేవతరథం బూర్జువా వాదం. రథచక్రాలక్రింద పడ్డవారూకాదు వీరు; రథచక్రపుటిరుసులలో పడి పిప్పిపిప్పి అయిపోతున్నవారు వీరికింక జీవనమే లేకుండా పోయింది. లోహరాక్షసుల పదఘట్టన వంటిదే ఇది. పరపీడకునికి ప్రతీక శనిదేవత. (9) మీరక్తం కలగికలగి

మీనాడులు కదలి కదలి మీపేగులు కనలి కనలి అన్నప్పటి క్రియల ఆమ్రేడితత్వంలో హాస్య లిపి నిక్షిప్తమై ఉంది. రక్తం, నాడులు, పేగులు శరీరంలోపలి భాగాలకు ప్రతినిధులు. ఏడుపువల్ల దారుణమైనబాధ వారికి కలిగింది. బాధననుభవించేవారు పీడితులుకాగా ఆ బాధను తనదిగా భావించు కుంటున్నాడు శ్రీశ్రీ. క్రియల ద్విరుక్తత పీడితుల దారుణబాధకు వ్యంజకం. (10) 'వ్యధానివిష్టులు కథావశిష్టులు' అనే రెండు పదబంధాలూ అత్యంతసార్థకాలుగా ప్రయోగించడం ద్వారా శ్రీశ్రీ హాస్యలిపిని సాధించాడు. బల / ధనవంతులు బల / ధనహీనుల్ని వ్యథలయందుంచుతున్నారే కానీ వారికి సహజంగా కలుగుతున్న బాధలు కావవి; ఇదీ వ్యథానివిష్టులు లోని అర్థపారమ్యం. ఎవరి కథలకు ముగింపు లేనట్లు కనిపిస్తోందో వారు కథా + అవశిష్టులు పీడితులవి అంతులేని కథలు. (11) శబ్దా లను ద్విరుక్తంగానే కాక అనేకోక్తంగా ప్రయోగించి పొదుపుకు భంగంకలిగిస్తున్నాడా అన్నట్లు భ్రమకలిగించి, అర్థాల పొదుపును సాధించడం శ్రీశ్రీ ప్రహస్వలిపికి ఒక విచిత్రలక్షణం. జగన్నాథ జగన్నాథ జగన్నాథరథచక్రాల్ అని ముమ్మారు జగన్నాథశబ్దాన్ని ఆవృత్తం చేయడంద్వారా నిశ్చితత్వం సూచితమయింది. రథచక్రాల్ రథచక్రాల్ రథచక్రాల్ రథ చక్రాలొస్తునాయొస్తున్నాయి అంటూ పలుమార్లు చక్రాలను ఆవృత్తంచేయడంద్వారా విప్లవ వేగాన్ని గమన సంరంభాన్ని అభివ్యక్తం చేయడం జరిగింది. రథచక్రాల ఆవృత్తిని మరో మారు వచ్చేశాయ్ విచ్చేశాయ్ అనేక్రియలతో కలిపి ప్రయోగించి ఆశ్చర్యాన్ని అద్భుతత్వాన్ని నిరూపించాడు. (12) చెప్పినదానికన్నా ఊహించుకోవలసినదాన్ని అమేయంగా మనకోసం వదిలి వేయడం శ్రీశ్రీ ప్రహస్వలిపి లోని గడుసుపోకడ. మొయిల్దారిని బయల్దేరిన రథచక్రాలు అన్న ప్పుడు మొయిల్దారి బూర్జువామార్గానికి సంకేతం. భూమార్గం సామ్యవాద మార్గంగా ఊహించు కోవచ్చు. (13) మహాప్రస్థానగీతంలో ప్రజలంతా కదులుతారు. అవతారం గీతంలో దేవత లంతా కదులుతారు. జగన్నాథుని రథచక్రాలు గీతంలో రథచక్రాలే కాకుండా కొండలన్నీ కదులుతాయి. 'సింహాచలం కదిలింది! హిమాచలం కరిగింది! వింధ్యాచలం పగిలింది! సింహాచలం హిమాచలం వింధ్యాచలం సంధ్యాచలం మహానగాలెగురుతున్నాయి.' కదలిక ఎగరడంగా మారింది. ఈ విధంగా భిన్నగీతాలలో ఒక భావసమైక్యం సాధించడం శ్రీశ్రీ ప్రహస్వలిపి విశిష్టలక్షణం, ఎనభైలక్షల మేరువులు ఎగిరిపడుతున్నాయి అని మొదటిగీతంలో చెప్పిన శ్రీశ్రీయే మహానగాలెగురుతున్నాయి అని తుదిగీతంలో చెబుతున్నాడు. ఇంకా గిరిశిఖరాలు తిరుగు తున్నాయి అంటాడుకూడా. (14) ఒక్కొక్క మాటతోనే ఒక పెద్దభావాన్ని ఆవిష్కరిస్తాడు శ్రీశ్రీ. ఊరవతల-నీరింకిన చెరువుపక్క--చెట్టునీడ-గోనెలతో కుండలతో ఎటుచూస్తే అటుచీకటి – అటు దుఃఖం పటు నిరాశ – చెరసాలలు – ఉరికొయ్యలు కాలువలో ఆత్మహత్య – ఇవన్నీ మాటలే కానీ వాక్యాలు కావు. పారిశ్రామిక విప్లవచైతన్యం వల్ల లభించిన టెలిగ్రాఫిక్ సౌలభ్యం ఈ

సంక్షిప్తతలో ప్రతిబింబిస్తోంది. పీడితులు పడిన ఇక్కట్లను పరామర్శించే సందర్భం ఇది. (15) "జగన్నాథ రథచక్రాలు'లో పొడిపొడిమాటలే ఎక్కువ. వాటిద్వారా వాతావరణాన్ని స్ఫురింపజేయడం శ్రీశ్రీ కవిలిపికి కిరీటప్రాయమైన శిల్పం. 'అరె ఝూం ఝూం ఝటక్ ఫటక్ హింసన చణధ్వంసరచన! ధ్వంసన చణహింసరచన! విషవాయువు మరఫిరంగి టార్పీడో టోర్నాడో అది విలయం అది సమరం అటో ఇటో తెగిపోతుంది! సంరంభం సంక్షోభం సమ్మర్దన సంఘర్షణ! శాంతి శాంతి కాంతి శాంతి జగమంతా జయిస్తుంది' అంటూ రెండవ ప్రపంచయుద్ధపు వాతావరణాన్నీ అందులో వర్గసంఘర్షణ ఛ్ఛాయల్నీ వినాశానంతరవికాసాన్నీ సూచించాడు శ్రీశ్రీ. ఈ సూచన అనితరసాధ్యమైన మార్గంగా రూపొందింది. (16) రెండవప్రపంచయుద్ధంవల్ల పర్యవసానంలో సామ్యవాదం లభిస్తుందనుకున్నాడు శ్రీశ్రీ. సంరంభం, సంక్షోభం, సమ్మర్దన, సంఘర్షణ అనే నాలుగూ క్రమంగా 'స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం'లను కలిగిస్తాయని నమ్ముతున్నాడు శ్రీశ్రీ. సమరం ఒక సవనం. సమరంలోనిది ఇనుపడేగ. సవనంలోది మంటపంట. సమరసవనంలో విమానాలూ బాంబులూ శ్రీశ్రీకి ఇనుపడేగలుగానూ, మంటపంటలుగానూ గోచరించాయి. ఇనుపడేగ ద్రోహాలను తూలగొడుతుంది; మంటపంట దోషాలను తుడిచిపెడుతుంది. ఇది తన స్వప్నం అని శ్రీశ్రీ సూచిస్తాడు. ఈ సూచన కనీసపుపదాలతో జరిగిపోయింది. (17) "రారండో రండో రండి! ఈ లోకం మీదేనండి! మీరాజ్యం మీరేలండి!"అనే మాటలతో మహాప్రస్థానం ముగింపబడటం గొప్పశిల్పం. ఈ మాటలు కమ్యూనిస్టు మానిఫెస్టోలోని చివరిమాటలకు కవితారూపాలు. "కమ్యూనిస్టు విప్లవమంటే పాలకవర్గాలు గజగజ వణకనీ .... కార్మికులు పోగొట్టుకొనేదేమీ లేదు - తమ శృంఖలాలు తప్ప. వాళ్ళు గెలుచుకోవలసింది ఒక ప్రపంచం ఉంది. సకలదేశకార్మికులారా! ఏకం కండి".2

## శ్రీశ్రీ ప్రతీకాత్మక పదచిత్రాలు

సింబాలిజంనూ ఇమేజిజంనూ పునాదులనుంచి అర్థంచేసుకుని, వాటిని ఏకభవనంగా మార్చుకోవడం శ్రీశ్రీకి చెల్లింది. పదచిత్రాలకూ ప్రతీకలకూ సేతువులు నిర్మించి ఉక్తిచమత్కారం వెలయించడంలో శ్రీశ్రీ కళాకారుడిధర్మాన్ని నిర్వహించాడు. ఇందుకు కొన్ని ఉదాహరణలు (1) 'బాధాసర్పం' అనే రూపకపదచిత్రం బాధయొక్క క్రూరత్వాన్నీ భయంకరత్వాన్నీ గరళత్వాన్నీ వ్యక్తం చేస్తోంది. (2) బ్రదుకు కాలి అంటే కాలినబ్రదుకులు! ఇది సరికొత్త ఊహాచిత్రం. ఇల్లుకాలడం, చెయ్యికాలడం సహజవిషయాలు. అమూర్తమైన బ్రదుకు కాలడం భయంకరం. (3) శనిదేవతకు పురాణాలను బట్టి కాకి వాహనం. కానీ శనిగ్రహంయొక్క రూపం ఎలాంటిది? ఒక గోళం చుట్టూ చక్రాలు తిరుగుతున్నట్లుంటుంది అది. ఖగోళ శాస్త్రం

2 కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక 75 పే.

నుంచి వచ్చిన ఊహ శనిదేవత రథచక్రపుటిరుసులు. శనిదేవత నిరంకుశునికి ప్రతీక. (4) కూడు లేని గూడులేని పక్షులార! భిక్షులార! అనే సంబోధన వ్యతిక్రమాలంకారంగల పదచిత్రం. నిజానికి ఇక్కడ పక్షులు పీడితులకు ప్రతీకలు మాత్రమే. పీడితులూ ఒక పక్షం గల పక్షులే! (5) ఇది సవనం ఇది సమరం అంటూ యజ్ఞానికీ యుద్ధానికీ అభేదం కల్పించి హవిస్సులను యజ్ఞం ఇచ్చినట్లు మనుగడను యుద్ధం ఇస్తుందని భావించాడు శ్రీశ్రీ. ఆయుద్ధం వర్గకలహమే. (6) విమానానికి ప్రతీకగా కల్పించబడిన ఇనుపడేగ విచిత్రమైన ఊహ. డేగవలె ఎగిరేగుణం గల విమానం ఇనుముతో నిర్మితమయింది. డేగకు వేటాడే గుణం ఉంది. యుద్ధవిమానమూ అలాంటిదే. అది ద్రోహాలను తూలగొడుతుంది. (7) విధ్వంసక శస్త్రానికి ప్రతీకగా శ్రీశ్రీ కల్పించినది 'మంటపంట'. మంటకూ పంటకూ పొత్తుకల్పడం అపూర్వం. పరిపక్వమైన విలయానలం మంటపంట. ఇది దోషాలను తుడిచిపెడుతుంది. (8) స్వాతంత్ర్యం, సమభావం మొదలైన అమూర్త భావాలు పునాదులై వాటిమీద ఇళ్ళు లేవడం, వాటిచుట్టూ శుభాలు పూయడం శ్రీశ్రీ విచిత్రమైన ఊహావాస్తవికతకు నిదర్శనం. ఈ ఇళ్ళు జనావళికి అనడం శ్రీశ్రీ అభ్యుదయభావనకు ప్రతీక. (8) అమూర్త భావాలకు మూర్తిమత్త్వం కల్పించడం శ్రీశ్రీ పదచిత్రప్రయోగం. ద్రోహాలు, దోషాలు అమూర్తాలే. వాటిని తూలగొట్టడం, తుడిచిపెట్టడం ద్రోహాలు ద్రోహులకూ దోషాలు దోషులకూ లక్షణాలైనప్పుడే. (9) స్వాతంత్ర్యం కోసం, సమభావం కోసం, సంక్షోభం, సంఘర్షణ ఆరంభమయ్యాయని ప్రతిపాదిస్తూ శ్రీశ్రీ 'హాలాహలం పొగమూరింది' అన్నాడు. అమృతోదయం కోసం సాగరమథనం చేసినప్పుడు పుట్టిన హాలాహలం ఇక్కడ సంక్షోభాన్ని సూచిస్తోంది. హాలాహలం అనే పదాన్ని evocative గా వాడాడు శ్రీశ్రీ. నిటాలాక్షి విప్పిన నటధూర్జటి ఆ హాలాహలాన్ని మ్రింగాలి. (10) 'సింహాచలం కదిలింది' అనే వాక్యం శ్రీశ్రీ evocation కు చక్కని ఉదాహరణ. సింహాచలం తెలుగుదేశంలోని పుణ్యక్షేత్రం. ఇది ఎలా కదులుతుంది? కదలనిది అచలం. ఈ సింహాచలంమీద ఉన్నవాడు హిరణ్యకశిపుని చంపిన నరసింహుడు. ఇతడు కేవలం నరసింహుడే కాడు. వరాహనరసింహుడు. ఆదిసూకర వేదవేద్యుడీతడు. వరాహనరసింహులు ధనస్వామ్యమూర్తులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను రూపుమాపారు. హిరణ్యశబ్దం ధనస్వామ్య సంకేతం. సింహాచలం కదిలిందంటే వరాహనరసింహుడు కదిలాడని లక్ష్యార్థం. ఇప్పుడు విరోధాభాస లేదు. సామ్రాజ్యవాదుల్ని నిర్మూలించడానికే వరాహనరసింహుడు కదిలాడు. 'అవతారం' ఖండికలో ఆదిసూకర వేదవేద్యుడు ఘుర్ఘురిస్తూ కోరసాచగా దిక్పాలకాది దేవతలంతా వచ్చారని చెప్పబడితే, 'జగన్నాథునిరథచక్రాలు' ఖండికలో జగన్నాథుడు శ్రామికోద్ధరణానికై బయులుదేరి, సామ్రాజ్యవాదాన్ని దహించేందుకు మూడోకంటిని తెరువగా సింహాచలాధిపతి వంటి అవతార పురుషులంతా బయలుదేరివస్తున్నట్లు చెప్పబడింది (11) జగన్నాథరథాగమనం వల్ల 'హిమాచలం కరిగింది' అనడంలోనూ evocative technique ఉంది. అనంత రత్నాలతో ఓషధులతో

నిండిన హిమాచలం ధనస్వామ్యానికి సంకేతం. (12) వింధ్యాచలం పగిలింది అనడమూ అలాంటిదే. వింధ్య గర్వాతిశయానికి సంకేతం. సూర్యచంద్రగతులను అడ్డగించిన వింధ్యుడు అగస్త్యాగమనంతో తలవంచాడు. అలాగే జగన్నాథాగమనంతో ఫాసిస్టు పగిలిపోయాడు.

## శ్రీశ్రీ లయవిశేషాలు

శ్రీశ్రీ సృజించిన మరికొన్ని లయవిశేషాలు - (1) ఒక పదబంధంలోని ఏదైనా ఒక అక్షరాన్ని మార్చడం ద్వారా ఒక శాబ్దికవైచిత్రిని ప్రదర్శించడం శ్రీశ్రీకి కూనువిద్య. నిటాలాక్షి నిటాలాగ్నిగా నిటాలార్చిగా మార్చడంలో శ్రీశ్రీ శాబ్దికప్రభుత్వం గోచరిస్తుంది. ఇందులో శబ్దవైచిత్రితోపాటు అర్థవైచిత్రి కూడా ఉంది. నిటాలాక్షిలో అగ్ని ఉన్నది కనుక నిటాలాగ్నిగా మారింది. నిటాలాగ్నిలో అర్చిస్సు ఉంది కనుక నిటాలార్చి అయింది. ఇక్కడ నిటాలా(క్షి)(గ్ని)(ర్చి) ఐదుమార్లు ఉచ్చరితమైంది కనుక ఇది 'మంత్రలయ' అవుతోంది. (2) 'హింసనచణ ధ్వంసరచన ! ధ్వంసనచణ హింసరచన !'- ఈ పదాలకూర్పులో అర్థోచితమైన 'భయంకరలయ' ఉంది. ఇక్కడ భాషకు భావం, భావానికి భాష అలంకారాలు. శబ్దం శ్రీశ్రీకి బానిస. ఫాసిస్టుల ప్రళయోన్మాదానికి వ్యంజకమైన ధ్వని - హడలెత్తించే చప్పుడు ఈ చరణాలలో వినిపిస్తుంది. గారడీవాడు కాగితాన్ని చింపి ప్రోగులు పెట్టి తిరిగి అతికివేసినట్లు పదాలక్రమం మార్చి మరో క్రమంలో పేర్చి అర్థవైచిత్రిని కలిగించాడు. (3) సంరంభం, సంక్షోభం, సమ్మర్దన, సంఘర్షణ- ఈ ఉదాహరణలో పదాదివర్ణక్రమలయ (lexicographic rhythm) కనిపిస్తుంది. 'సం'తోనే పదాలన్నీ ఆరంభమవుతాయి- మొదటి రెండింటి చివర 'భం' వస్తే తరువాతి రెండింటి చివర 'సణ'లు వచ్చాయి.

# 88/ గర్జించు రష్యా!

## పాపపంకం నుండి పద్మాలు పుట్టించి కార్మికస్వర్గాన్ని కలగన్న రష్యా!

1941

లోకవృత్తాన్నే కవి తన కావ్యవస్తువుగా తీసుకున్నప్పుడు ఆ కవి తన యుగంలోని యుద్ధాన్ని కావ్యంలో వర్ణించక మానలేదు. ఆదికావ్యమైన రామాయణంలో మానవదానవయుద్ధం ఉంది. వ్యాసుడు తనకాలంనాటి ధర్మాధర్మరాజకీయ యుద్ధాన్నే తన కావ్యానికి ఇతివృత్తంగా తీసుకున్నాడు. వ్యాసవాల్మీకులు రాజకీయాలకు అతీతంగా కవిత్వాలు రాయనేలేదు. పైగా ధర్మపక్షాన్నే సమర్థించారు. తెలుగు కవిత్వంలో తిక్కన తొలిరాజకీయకవి. అతడు వర్ణించిన యుద్ధం తన కాలంనాటిది కాకపోయినా ఆ యుద్ధ వర్ణనల్లో తిక్కన రాజకీయచైతన్యం మాత్రం స్పష్టమవుతుంది. కానీ ఆ తరువాత తెలుగుకవుల్లో ఈ రాజకీయచైతన్యం లోపించిందనే చెప్ప వచ్చు. ప్రబంధాల అవతారికలలో పరిపాలకుల దిగ్విజయయాత్రలను వర్ణించడం చూస్తే, ప్రబంధ కవులకు కొంత రాజకీయచైతన్యం ఉందనిపిస్తుంది. కృష్ణరాయలు చనిపోయాకా గజపతి దండెత్తి వస్తే పెద్దనగారు ఆ గజపతిని వెక్కిరిస్తూ రాసిపంపిన సీసపద్యం[1] పెద్దనగారి రాజకీయచైతన్యానికి చక్కని నిదర్శనం. ప్రతియుగంలోనూ రాజకీయాలతో జీవితం ముడిపడి ఉంటూనే ఉంటుంది కనుక, ఆ జీవితమే సాహిత్యానికి ముడిసరుకు కనుక రాజకీయాలకూ సాహిత్యానికీ సంబంధం అనివార్యమయిన విషయం. ఈ సత్యాన్ని గుర్తించని కవి జీవితంనుంచే పారిపోయినవాడవు తాడు. అప్పుడు సాహిత్యం జీవితసమస్యలకు దూరమైపోతుంది. ఆ కవి ఈ ప్రపంచంలో భౌతికంగా ఉంటున్నా అతని దృష్టి ఆధ్యాత్మికంగానో కాల్పనికంగానో పనిచేసి దివ్యలోకాలను అన్వేషిస్తూ ఉంటుంది. అతడికి ఈ వాస్తవజీవితం మాయ; పారలౌకిక విషయం సత్యం. ఇటువంటి సాహి త్యాన్ని కొందరు సార్వకాలికం అనీ సార్వజనీనం అనీ అనవచ్చు గానీ అది సమకాలికం కాక పోవడం వల్ల నిర్జీవం అనక తప్పదు. సజీవ నవీన సాహిత్యానికి సమకాలీన జీవితరాజకీయ సంస్కృతుల ప్రతిబింబనం తప్పనిసరి !

పరిపాలకుల సన్మానాలనందుకోవడానికి కొందరు శిష్టకవులు సజీవసమాజాన్ని కావ్య వస్తువుగా తీసుకోకుండా ఏ పురాణగాథలనో రాయడం జరుగుతున్నప్పుడు జానపదకవులూరుకో లేదు. పల్నాటి వీరచరిత్ర, బొబ్బిలియుద్ధం వంటి ప్రాంతీయ రాజకీయగాథలు ప్రజాకావ్యాలుగా

---

1 రాయరావుతుగండ అనే చాటువు - మనుచరిత్ర పీఠిక

అవతరించాయందుకే! 20వ శతాబ్ది ప్రాంతీయకలహాలకు గాక ప్రపంచయుద్ధాలకే అంకురార్పణ చేసింది. ఈ యుద్ధప్రభావం అన్నిదేశాలమీదా, అందరి జీవితాలమీదా అన్నిరంగాలలోనూ కళలమీదా ప్రసరించింది. గురజాడ అప్పారావుగారి కవిత్వం ప్రథమప్రపంచయుద్ధాన్ని గమనించకపోలేదు. అందుకు ఆయన రాసిన 'దించులంగరు' అనే ఖండిక నిదర్శనం. కానీ ఆయన అనంతరం వచ్చిన భావకవులు రాజకీయాలకు బహుదూరమైపోయారు. వారంతా అంతర్ముఖులై వ్యక్తిస్వాతంత్ర్యప్రియులై సౌందర్యరసానుభవంకోసం కవిత్వాన్ని అంకితం చేశారు. భారత దేశంలో స్వాతంత్ర్యంకోసం, ఆంధ్రదేశంలో స్వరాష్ట్రంకోసం జరుగుతున్న పోరాటాలను గమనించిన కొందరు కవులు తమ గళాన్ని జాతీయపునరుజ్జీవనోద్యమానికి మాత్రమే అంకితం చేశారు. వారికవితల్లోకూడా రాజకీయనిబద్ధత (Political Commitment) లేదు. రాజకీయచైతన్యం కూడా వారిలో అంతగా కనిపించదు. బసవరాజు అప్పారావు, దువ్వూరి రామిరెడ్డి వంటివారిలో కొంచెం రాజకీయచైతన్యం తొంగిచూసింది.

## శ్రీశ్రీ రాజకీయకవిత్వం

అభ్యుదయకవిగా అవతరించడంలోనే శ్రీశ్రీరాజకీయచైతన్యం పురివిప్పుకోసాగింది. 1930ల లోని ఆర్థికసంక్షోభమే కవిత్వాన్ని మలుపుతిప్పడానికి శ్రీశ్రీకి ప్రేరకమయింది. 1914 లో మొదలైన మొదటిప్రపంచయుద్ధంనాటికి శ్రీశ్రీ నాలుగేళ్ళ పసివాడు. 1917లో రష్యాలో వచ్చిన సామ్యవాదవిప్లవం నాటికి శ్రీశ్రీకి ఏడేళ్లు నిండాయి. కవిగా కలంపడుతున్న మొదటిరోజుల్లోనే శ్రీశ్రీని మహాభారతగాథ ఆకర్షించడం అతనిలో సుప్తమై ఉన్న రాజకీయచైతన్యానికి ఒక ఆనవాలు. మొట్టమొదట రచించిన 'విశ్వరూపసందర్శనము' గానీ కొంచెం చేయితిరిగాకా రాసిన 'సమరాహ్వానము'గానీ శ్రీశ్రీ వీరరసాభిమానాన్ని కొలిచి చూపిస్తాయి. బి.ఏ. పరీక్షలో కృతార్థుడై కూడా నిరుద్యోగజీవితాన్ని గడపవలసివచ్చిన శ్రీశ్రీ 1933 లో ఆ దారిద్ర్యానికి దేశ రాజకీయాలే కారణం అని గ్రహించాడు. రాజకీయవ్యవస్థ ఆనాటికే బూర్జువాల అధీనంలో ఉంది. ఆ వ్యవస్థలోని పరపీడనపరాయణత్వంమీద తిరుగుబాటు చేయడమే కవిగా తన కర్తవ్యమని గుర్తించడం శ్రీశ్రీ రాజకీయచైతన్యానికి కొండగుర్తు. "The history of all hitherto existing society is the history of class struggles" అనే మార్క్సిస్టువ్యాఖ్యప్రకారం శ్రీశ్రీ ప్రపంచాన్ని చూడటం ప్రారంభించాడు. వర్గకలహాలకు రాజకీయాలే ఆధారరంగం. మానవజాతి చరిత్ర అంతా వర్గకలహాలతో నడిచింది. జరిగిన ప్రతియుద్ధంలోనూ అంతర్లీనంగా వర్గకలహం ఉంది. శ్రీశ్రీ కవిత్వం బూర్జువావర్గరాజకీయవ్యవస్థలో బయల్దేరి పీడితశ్రామికవర్గ రాజకీయాలను సమర్థిస్తోంది. 1939లో రెండవప్రపంచయుద్ధం ఆరంభం కావడానికి ముందు

ఆరేళ్ళుగా శ్రీశ్రీ సాంఘికరాజకీయచైతన్యంతోనే కవిత్వం రాస్తూవచ్చాడు. 1939 లో వచ్చిన యుద్ధంలో వర్గకలహం అంతర్లీనంగా ఉందని భావించాడు శ్రీశ్రీ. పీడితవర్గాన్ని సమర్థించే రష్యామీద 1941 లో నాజీసామ్రాజ్యవాదులు దాడిచేసినప్పుడు ఆ యుద్ధానికి వర్గకలహ స్వరూపమే సిద్ధించింది. శ్రీశ్రీలోని రాజకీయచైతన్యం వేయిపడగలు విప్పుకుని బుసగొట్టింది ఆ సందర్భంలోనే. అంతకు ముందు సిద్ధాంతపరంగానూ ఆశయాల పరంగానూ రాజకీయకవనం రాస్తున్న శ్రీశ్రీ, ఇక ఇప్పుడు ఆచరణాత్మకరాజకీయకవనం రాయక తప్పలేదు.

1941లో శ్రీశ్రీ రచించిన 'గర్జించు రష్యా' గీతం సామ్యవాదరాజకీయకవిత్వానికి ఒక మచ్చుతునక. 1939 సెప్టెంబరు 1వ తేదీన రెండవప్రపంచయుద్ధం మొదలయ్యేనాటికి శ్రీశ్రీ ఆంధ్రప్రభలో ఉద్యోగిగాఉన్నాడు. కనుక యుద్ధవార్తలను బాగా గమనించే అవసరం, అవకాశం కూడా కలిగాయి. 1941 జూన్ 22న, నాజీజర్మనీ సోవియట్‌యూనియన్‌మీద దాడిచేసిన వార్త, సోవియట్ వైమానిక సేనలు యుద్ధరంగంలోకి దిగినవార్త శ్రీశ్రీని రాజకీయకవిత్వావేశంలోకి ఆకర్షించాయి. పత్రికల్లోవచ్చిన యుద్ధపుపతాకశీర్షికయే శ్రీశ్రీకి కవిత్వంలా కనిపించింది. "The Soviet Air Force has gone into action" అనే వార్తయే తన 'గర్జించు రష్యా' గీతానికి ప్రరోచన అని శ్రీశ్రీ స్వయంగానే చెప్పుకున్నాడు. నాజీ-సోవియట్‌యుద్ధం ఒకఅంతర్జాతీయ వర్గకలహంగా శ్రీశ్రీకి కనిపించింది. నాజీలు సామ్యవాదశత్రువులు కనుక వారి నాశనానికి సోవియట్లు విజృంభించడం శ్రీశ్రీకి ఉద్వేగంకలిగించింది. "క్రిందటియుద్ధంలో Battle of Stalingrad అనే వార్తాశీర్షికను వరుసగా ఎన్నోరోజులు పత్రికలో చదివిఉంటాను. అన్నిసార్లూ నాకు ఆ మూడుమాటలు ఎంతో ఉద్వేగాన్నికలిగించాయి" అని చెప్పుకోనేచెప్పుకున్నాడొకచోట శ్రీశ్రీ. ఉద్వేగం కలిగించడం (evocation) కవిత్వలక్షణంగా భావించిన శ్రీశ్రీ ఉద్వేగహేతువైన రాజకీయయుద్ధవార్తనే కవితావస్తువుగా స్వీకరించడంలో ఆశ్చర్యంలేదు.

శ్రీశ్రీ రాజకీయకవిత్వం రెండువిధాలయినది. (1) సామ్యవాదరాజకీయాలను సమర్థించేది. దేశీయమైనా అంతర్దేశీయమైనా వామపక్షరాజకీయాలే శ్రీశ్రీకి స్ఫూర్తినిస్తాయి. ప్రజల తిరుగుబాటుకు శ్రీశ్రీ హృదయం ఉద్విగ్నమై స్పందిస్తుంది. (2) ఫ్యూడల్‌బూర్జువారాజకీయాలను వ్యతిరేకించేది. ఫాసిస్టునియంతృత్వాన్నీ ఫ్యూడల్ నిరంకుశత్వాన్నీ బూర్జువావ్యాపారస్వార్థాలనూ శ్రీశ్రీ హృదయం సహించదు. అటువంటప్పుడు శ్రీశ్రీ కవిగా భండనభీముడిలా గాండీవిలా విజృంభించి మాటల ఈటెలను విసురుతాడు; పదాలపాశుపతాన్ని ప్రయోగిస్తాడు. ఈ రెండింటినీ మనం 'గర్జించు రష్యా' గీతంలోనే చూడవచ్చు. రష్యాను సమర్థించడం వాచ్యంగా జరిగింది; జర్మనీని ద్వేషించడం వ్యంగ్యంగా జరిగింది ఈ గీతంలో. రష్యాను సింహంలా గర్జించమన్నదీ పెద్దపులిలా గాండ్రించమన్నదీ శ్రీకృష్ణునిలా పర్జన్యశంఖం పూరించమన్నదీ జర్మనీమీదనే.

జర్మనీనే 'దౌర్జన్యరాజ్యం' అన్నాడు శ్రీశ్రీ. 'స్వాతంత్ర్యశత్రువు'గా హిట్లర్‌నే పేర్కొన్నాడు. ఆ హిట్లర్ గుండెల్లో బల్లెంగా రష్యాను ప్రసరించమన్నాడు. జర్మన్‌నాజీలను పరపీడనాపరులుగా చిత్రించి, వారి ప్రాణాలను రష్యా భైరవివలె మ్రింగవలసిందే అన్నాడు. ఆ యుద్ధం శ్రీశ్రీకి 'సవనరంగం'లా తోచింది. సమరంచేస్తున్నది జర్మనీ అయితే సవనంచేస్తున్నది రష్యా. అందులో ఎగిరే జీవాలు జర్మన్‌నాజీలవి. అగ్నివర్షాలనూ రక్తపాతాలనూ సృష్టిస్తున్న నాజీలకు రష్యా బుద్ధిచెప్పక తప్పదని శ్రీశ్రీ ఉద్రేకంతో పలికాడు. 'ఈ సమరం తుది చూడక ఇక నిలిచిపో రాదు; తిరుగులేని ప్రతిజ్ఞ తీసుకో రష్యా!' అని సావేశంగా ప్రార్థించాడు శ్రీశ్రీ. హిట్లర్‌తో ఏర్పడిన ఈ యుద్ధంవల్ల సామ్రాజ్యవాదులనూ అభ్యుదయనిరోధకులనూ అంతమొందించడం జరుగుతుందని శ్రీశ్రీ విశ్వసించాడు. ప్రపంచమంతా సామ్యవాదం అవతరిస్తుందని నమ్మాడు.

1940లలోని అంతర్జాతీయరాజకీయవిషమవాతావరణాన్ని శ్రీశ్రీ తన గీతంలో ప్రస్తావించాడు. 'పెట్టుబడికూటాలు' కట్టుకడుతూ బలం పుంజుకుంటున్నారు. కుట్రలు పన్నుతున్నారు. కూహకాలు రేపుతున్నారు. రేడియోలలో పీడకవర్గానికి అనుకూలంగా ప్రచారం (అసత్య ప్రచారం) సాగుతోంది. రాజకీయాలలో నిజాయితీ లోపించింది. ఈ అవినీతిని శ్రీశ్రీ 'రంకు వేషాలు'గా పేర్కొన్నాడు. ఇటువంటి విషమపరిస్థితులలో రష్యావంటి సామ్యవాదోత్సాహ ధురంధరమైన దేశం ఎలాగూ ఊరుకోరాదు. తనమీదికి దండయాత్రచేసినప్పుడు అసలే ఊరుకోరాదు. రష్యా చారిత్రిక బాధ్యత వహించాలని శ్రీశ్రీ ఉద్దేశించాడు. 'మరఫిరంగులు తెచ్చి మందిచ్చి రష్యా! విమానబాహువులు విసురుతూ రష్యా!' అంటూ డందుకే. అంతర్జాతీయంగా అంతటా సామ్యవాదం ఆవిర్భవించడానికి దోహదం చేయడం కమ్యూనిస్టుదేశాల ఆశయాలలో ప్రముఖమైనది. అందుకే 'అనంతప్రపంచం అంతటా నీవై నీ గొడుగునీడల్ని సాగించురష్యా' అన్నాడు. రష్యామీద శ్రీశ్రీకిఉన్న అభిమానాతిశయానికిది పరాకాష్ఠ. 1941నాటి ప్రపంచ పరిస్థితులే ఈ అభిమానానికి కారణం. ప్రపంచమంతటా సామ్రాజ్యవాదులు, ఫాసిస్టులు, పెట్టుబడిదారులు, వలసవాదులు వ్యాపించి పరపీడనపరాయణత్వంతో విజృంభిస్తున్నకాలం అది. అప్పటికి రష్యా ఒక్కటే సామ్యవాదదేశం. ఆ పీడన నుంచి మానవాళిని రక్షించడానికి రష్యా ఒక్కటే సమర్థమనే ఊహ అభ్యుదయవాదులది. అయితే రష్యాకూడా నియంతృత్వదేశమవుతుందా ? కాదని చెప్పడానికే 'స్వతంత్రత, సమానత సాధించు రష్యా!' అంటూ రష్యా ధ్యేయాలను స్పష్టంచేశాడు శ్రీశ్రీ.

1941 నాటి అంతర్జాతీయ రాజకీయ-సాంఘికపరిస్థితులను శ్రీశ్రీ మార్క్సిస్టుదృక్పథంతో అర్థంచేసుకున్నాడు. ఆ పరిస్థితులు విప్లవాభిముఖంగా ఉన్నాయని శ్రీశ్రీ అవగాహన. సుప్త కంకాళాలు మేలుకుంటున్నాయనీ ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచిందనీ కార్మికులు, కర్షకులు,

తాడితులు, పీడితులు కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారనీ ప్రపంచం సామ్యవాదంకోసం పరిపక్వంగా ఉందనీ కోటిగొంతులు రష్యా సహాయాన్ని అర్థిస్తున్నాయనీ కోటిచేతులు రష్యా రాజకీయదృక్పథాన్ని కౌగిలిస్తున్నాయనీ శ్రీశ్రీ రాజకీయపుటంచనా (Political assessment).

సుప్తకంకాళాలు (నిద్రపోతున్న ఎముకల గూళ్ళు)చైతన్యంలేని బానిసజాతులకు ప్రతీకలే ఆ జాతులన్నీ ఇరవయ్యోశతాబ్దంలో మేలుకున్నవే. సామ్రాజ్యవాదుల పదాఘాతానికి ప్రపంచం పడగెత్తి బుసగొట్టడం కూడా జరుగుతూన్నదే. ఈ ప్రపంచసర్పం పీడితప్రపంచ సర్పమే. 1930ల్లో పీడితప్రజల తిరుగుబాట్లు ఇండియాలో, క్యూబాలో, చిలీలో, స్పెయిన్‌లో జరుగనే జరిగాయి. కార్మికుల సమ్మెలూ హక్కులకోసం, స్వేచ్ఛకోసం జరిగిన పోరాటాలూ ప్రపంచ చరిత్రలో 20వ శతాబ్దిలో ముమ్మరంగా కనిపిస్తాయి. అంతకు ముందు ఫ్యూడల్‌వ్యవస్థమీద బూర్జువాల తిరుగుబాటే కనిపిస్తుంది. ఇప్పుడు బూర్జువావ్యవస్థమీద కార్మికుల తిరుగుబాటు వచ్చింది. పీడితులే శ్రీశ్రీకి కెరటాలుగా పొంగి కనిపించారు. వర్గరహితసమాజం సాధ్యమయ్యే స్వప్నమేనని రష్యా నిరూపించింది. అందువల్ల అందరికీ రష్యా ఆదర్శమయింది. సోవియట్ రష్యాకూ నాజీలకూ జరిగిన యుద్ధం ప్రపంచచరిత్రలో ఎంత ప్రముఖంగా పురోగమన శీలం గలదో శ్రీశ్రీ ఆ యుద్ధపు తొలిదశలోనే గుర్తించగల్గడం శ్రీశ్రీ రాజకీయచైతన్యానికి గొప్పనిదర్శనం.2

## రష్యన్ సంస్కృతిపై శ్రీశ్రీ అభిమానం

'గర్జించు రష్యా' గీతంలో శ్రీశ్రీ తనకు రష్యన్ సంస్కృతిమీద ఉన్న అభిమానాన్ని ప్రస్ఫుటం చేశాడు. 1941 నాటికి శ్రీశ్రీ రష్యాను కళ్ళతో చూడలేదు కానీ కలలో చూశాడు. అందుకే రష్యా గతవర్తమానాలనూ భవిష్యత్తునూ మనస్సున రూపొందించుకున్నాడు. శ్రీశ్రీ దృష్టిలో మరోప్రపంచం అప్పటికి రష్యాయే. రష్యన్ సంస్కృతిలో శ్రీశ్రీ మూడు ప్రధానాంశాలను గుర్తించాడు. అందులో మొదటిది రాజకీయసంస్కృతి. వ్యక్తిస్వతస్సిద్ధ స్వాతంత్ర్యదాతా!/పతితనిర్గతిక ప్రపంచ త్రాతా!/ భావికాల స్వర్ణభవన నిర్మాతా! అనే మూడు సంబోధనలూ రష్యా రాజకీయసంస్కృతిని ద్యోతకం చేస్తాయి. (a) రూసో అన్నట్లు 'Man is born free, and everywhere he is in chains' అనే మాట ప్రపంచరాజకీయవ్యవస్థలను చూస్తే నిజమే అనిపిస్తుంది. మానవుడి స్వతస్సిద్ధమైన స్వాతంత్ర్యాన్ని అపహరించే శక్తులెన్నో ప్రపంచంలో బయలుదేరతాయి. ఒకవ్యక్తిని మరొకవ్యక్తీ ఒకజాతిని వేరొకజాతీ పీడించే సాంఘికధర్మం అమలులోకి వస్తూఉంటుంది. వైషమ్యం, స్వార్థపరత్వం, కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు ఒక వర్గంలో ముదిరి, మరో వర్గం యొక్క స్వాతంత్ర్యాన్ని దోచుకుంటాయి. ఈ పర

---

2 Ref.–A Short History of the World II 254 P.
& A Short History of the U. S. S. R. 127–128 PP.

పీడనశక్తులను అణచివేసి సర్వతోముఖంగా వ్యక్తిస్వాతంత్ర్యాన్ని తిరిగి వ్యక్తికి ధారవోయడం ఒక్క సామ్యవాదవ్యవస్థకే సాధ్యమవుతుంది. రష్యా అటువంటి స్వాతంత్ర్యాన్ని తన దేశం లోని వ్యక్తులందరికీ ధారవోసింది. అన్నదాన విద్యాదానాదులకన్నా మిన్నయైనదే స్వాతంత్ర్య దానం. అది ఆధునిక కాలంలో దాతృత్వానికి పరాకాష్ఠ. రష్యాను స్వాతంత్ర్యదాతగా పరిగణించి, శ్రీశ్రీ రష్యన్ రాజకీయసంస్కృతిని ప్రశంసించాడు. (b) పెట్టుబడిదారీవ్యవస్థ ఎవరికి రక్షణ కలిగిస్తుంది? ఆ వ్యవస్థ ఎవరికి చెందుతుందో ఆ వర్గానికే సకలవిధరక్షణలూ లభిస్తాయి. అన్య వర్గం పీడితవర్గమే. అందులోనివారే పతితులూ నిర్గతికులూను. ఇటువంటివారిని రక్షించడానికి సామ్యవాదవ్యవస్థ ఒక్కటే సమర్థమయినది. కష్టాల పాలవుతున్నవారిని రక్షించడం ఉత్తమ సంస్కృతికి లక్షణం. సుఖాలనుభవించేవారికి మరిన్ని సుఖాలందించడం హీనసంస్కృతికి ఆన వాలు. రష్యాలోని సామ్యవాదవ్యవస్థ పతితనిర్గతికప్రపంచాన్ని ఉన్నతీకరిస్తోంది. అదే దాని రాజకీయసంస్కృతి. (c) భవిష్యత్తు సుఖసంపదలతో తులతూగడానికి వర్తమానంలో కృషిచేయడం అవసరం. ఇది సామ్యవాదరాజకీయవ్యవస్థలోనే సాధ్యమవుతుంది. అన్యరాజకీయవ్యవస్థల దృష్టి గతకాలీనాశయాలను పునరుద్ధరించడం మీద లగ్నమవుతూ ఉంటుంది. 'భావికాల స్వర్ణ భవనం' అనేమాటద్వారా శ్రీశ్రీ 'కమ్యూనిజం'ను సూచిస్తున్నాడు. వర్తమానం 'సోషలిజం' అయితే భవిష్యత్తు 'కమ్యూనిజం' అవుతుంది. దోపిడివర్గాలున్నంతకాలం ప్రపంచంలో మాన వతావాదానికి సంపూర్ణత లేదు. దోపిడిని రద్దుచేసి మానవతాసమానతాసిద్ధాంతాలను సమగ్రం చేయడమే కమ్యూనిజం లక్ష్యం. 'శక్తిననుసరించి శ్రమ, అక్కరననుసరించి జీతం' అనే సాంఘికవిధానాన్ని అమలుపరచగలిగే కమ్యూనిజం భావికాలస్వర్ణభవనమే. సర్వజన జీవన వికాసమూ వ్యక్తిగత స్వాతంత్ర్యప్రకాశమూ ఉద్దీప్తమయ్యేది సామ్యవాదవ్యవస్థలోనే. భావి కాల స్వర్ణభవననిర్మాణంలో అంతా శ్రామికులే! అది శ్రామికరాజ్యంలోనే సాధ్యమవుతుంది. సోమరులు స్వర్ణభవనంలో నివసించడానికైనా యోగ్యులుకారు. ఇక రెండవది సాహిత్య సంస్కృతి. పుష్కిన్, గోగోల్, షెకోవ్, టాల్‌స్టాయ్/డోస్టోయేవస్కీ, గోర్కీ, కూప్రిన్/ శిల్పసమ్రాట్టులై/జీవితం మథియించి/పాపపంకంనుండి పద్మాలు పుట్టించి/కార్మికస్వర్గాన్ని కలగన్న రష్యా! అనే సంబోధనలో రష్యన్ సాహిత్యసంస్కృతియొక్క ఉదాత్తతని నిక్షిప్తం చేశాడు శ్రీశ్రీ. పైపంక్తుల్లో రష్యన్ సాహిత్యం కొత్తమలుపులు తిరగడానికి మార్గదర్శకులైన మహారచయితలనందరినీ పేర్కొన్నాడు. రష్యన్ సాహిత్యసంస్కృతికి వారు సమర్పించిందేమిటి? అపూర్వమైన శిల్పం మొదటిది. జీవితమథనం రెండవది. పాపపంకంనుంచి పద్మాలు పుట్టించడం మూడవది కార్మికస్వర్గాన్ని కలగనడం నాల్గవది. ఈ నాలుగూ ఆధునిక రష్యన్ సాహిత్య విశిష్టలక్షణాలుగా శ్రీశ్రీ భావించాడు. ఈ సాహిత్యస్రష్టలంతా శిల్పసమ్రాట్టులే! వీరు పలా యనవాదులో నిరాశావాదులో కారు కనుకనే వాస్తవజీవితదృక్పథంతో సోషలిజంవైపునడిచే

ఆశయాలతో రచనలు చేసి, ఆ రచనలలో సామ్యవాదవ్యవస్థను కలగనగలిగారు. ఆ భవ్య స్వప్నాలే రష్యన్ రాజకీయవిప్లవానికి ప్రేరణ కలిగించాయి. సాహిత్యం రాజకీయాలకన్నా ముందు ఉండగలదని రష్యన్‌సాహిత్యం నిరూపించింది. శ్రీశ్రీ పేర్కొన్న రష్యన్‌రచయిత లంతా ఇంచుమించు 19, 20 శతాబ్దులవారే! వీరి రచనలన్నీ ఆధునిక రష్యన్ సమాజాన్ని రూపొందించడానికి సాంస్కృతికంగా దోహదంచేసినవే3.

ఇక మూడవది రాజకీయ తాత్త్వికసంస్కృతి. మార్క్సు ఎంగిల్సు బుఖారిన్ బకూనిన్/ క్రోపాట్కిన్ భావాల కోలాహలంతో4 లెనిన్ తపస్సు/స్టాలిన్ సేద్యం/జ్వలించిన ఫలించిన సముజ్జ్వల తేజం! యునైటెడ్ సోవియట్ సోషలిస్టురాజ్యం! అనే సంబోధన రష్యన్‌తాత్త్విక సంస్కృతిని ప్రతిబింబిస్తోంది. ఇందులో శ్రీశ్రీ పేర్కొన్న ప్రవక్తలు రష్యాలోని తాత్త్విక విప్లవానికి మార్గదర్శకులు. తాత్త్వికవిప్లవమే రాజకీయవిప్లవానికి నాంది కనుక తాత్త్వికవిప్లవం లేనిదే రాజకీయవిప్లవం రానేరాదని శ్రీశ్రీ సిద్ధాంతించుకున్నాడు. రష్యన్‌తాత్త్వికసంస్కృతి కేవలం రష్యన్‌ప్రవక్తల ఆలోచనలఫలితమే కాదు; మార్క్సు ఎంగెల్సు ఈ తాత్త్విక సంస్కృతికి పితామహులు. వారిద్దరూ రష్యన్‌జాతీయులే కారు. అయినా వారి సిద్ధాంతాలను

---

3 Byron of Russia గా వినుతికెక్కిన అలెగ్జాండర్‌పుష్కిన్ (1799-1837) కవితలూ నాటకాలూ కూడా రాశాడు. Caucasian Prisoner, The Gypsies, The Brother Robbers మొదలైనవాతని రచనలు. కాల్పనికవాతావరణంలో ఊయాలలూగుతున్న రష్యన్‌సాహిత్యాన్ని వాస్తవికప్రపంచంలోకి త్రోసి నిశితహాస్యంతో సమాజక్షాళనకుపక్రమించిన ఎన్. వి. గోగోల్ (1809-52) నవలలూ నాటకాలూ కూడా రాశాడు. తుర్గెనివ్, టాల్‌స్టాయ్, డాస్టోయ్‌వస్కీలకు మార్గదర్శిఅయ్యాడు. The Inspector General, Dead Souls వంటి నాటకాలురాశాడు. దరిద్రులన్నా, పీడితులన్నా అపరిమితమైన జాలినిప్రదర్శిస్తూ సమాజవాస్తవికతను తన కథల్లో నాటకాల్లో అపూర్వంగా చిత్రించినవాడు ఎ. పి. షెకోవ్ (1860–1904). The Sea Gull, The Three Sisters, The Cherry Orchard వంటివాతని ప్రఖ్యాతనాటకాలు. నవలారచయితగా, మేధావిగా, విమర్శకుడుగా ప్రఖ్యాతినార్జించినవాడు కౌంట్‌లియోటాల్‌స్టాయ్ (1828-1910). War and Peace, Anna-Kerinina, What is Art వంటివాయనరచనలు. తనదేశాన్నత్యానికి దారిచూపి, తనప్రజల్ని మూఢవిశ్వాసాలనుంచీ బానిసతనంనుంచీ దరిజేర్చి మానవతాశిఖరాలనెక్కించేందుకు రచనలుచేసిన మహాపురుషుడూ దేశభక్తుడూ మాక్సింగోర్కీ (1868–1936), రష్యాలో సామ్యవాదవ్యవస్థను కళ్లారా చూసి ఆనందించిన భాగ్యశాలి గోర్కీ. The Mother, The Lower Depths వంటివి అతడిరచనలు. నవలారచయితగా పత్రికాసంపాదకుడుగా రాజకీయవిప్లవవాదిగా పేరొంది, జీవితంలో అనేకకష్టనష్టాలకు గురిఅయిన మేధావి ఎఫ్. డోస్టోయ్‌వస్కీ (1821-81). The House of the Dead, Crime and Punishment వంటివి అతడిరచనలు మనస్తత్త్వచిత్రణతో నవలలు రచించినవాడు అలగ్జాండర్‌కూప్రిన్ (1870-1938) The Duel, Moloch, The Cadet వంటివి అతడిరచనలు. పుష్కిన్‌నుంచి కూప్రిన్‌వరకూ ఒకశతాబ్దిలోని రష్యన్‌సాహిత్యపురోగమనాన్నిస్మరించాడు శ్రీశ్రీ.

4 'మార్క్సు ఎంగిల్సు మహాప్రవక్తలై/మానవపురోగమనమార్గాలు తెరువగా' అనేది పాఠాంతరం. చూ శ్రీశ్రీసా. రెండు. కావ్య. 111-12 పే. సంపాదకవ్యాఖ్య.

స్వీకరించడం రష్యన్‌సంస్కృతిని ఉన్నతీకరిస్తుంది. అంతేకాదు; ఆ మానవపురోగమనమార్గదర్శకుల సిద్ధాంతాలను ఆచరణలోచూపించిన ఘనత మొట్టమొదటగా రష్యాకే లభించింది. కార్ల్‌మార్క్స్ (1818-83) శాస్త్రీయ కమ్యూనిజానికి పితామహుడూ అంతర్జాతీయకార్మిక వర్గానికి మహోపదేశికుడూ అయితే ఫ్రెడరిక్‌ఎంగెల్సు (1820-95) అతడికి సైదోడుగాఉన్న మేధావి. ది కమ్యూనిస్టుమేనిఫెస్టో వీరి నవ్యవేదం. ఆర్థికశాస్త్రంమీద మార్క్సుచేసిన సాంఘిక విశ్లేషణ, కుటుంబం, ఆస్తి, కళ, తత్త్వం, మానవపరిణామంవంటి అంశాలమీద ఎంగెల్సుచేసిన నూతనపరిశోధన5 మానవజాతి తత్త్వవివేచనకే నవద్వారాలు తెరిచాయి. వీటినన్నింటినీ మొట్ట మొదటగా అందుకున్నది రష్యా. వ్యక్తిగతమైన ఆస్తిపాస్తులకు స్వస్తి చెప్పడంద్వారా (Abolition of Private Property) వర్గరహితసమాజాన్ని స్థాపించడమే వీరిద్దరూ కన్న కల. ఆ కలను నిజం చేసింది రష్యా. అందుకు ప్రధానపాత్రధారులు వి. ఐ. లెనిన్ (1870-1924) జె. వి. స్టాలిన్ (1879-1953). మార్క్సిజానికి వీరద్దరూ ప్రయోక్తలు. అందుకే శ్రీశ్రీ వీరిని పేర్కొంటూ లెనిన్ తపస్సు జ్వలించిన తేజమూ స్టాలిన్ సేద్యం ఫలించిన తేజమూ రష్యా అన్నాడు. లెనిన్ ఒక విప్లవఋషిగా శ్రీశ్రీకి కనిపించాడు. నిజమే! లెనిన్‌వంటి విప్లవనాయకుడులేని సామ్యవాద విప్లవాన్ని (1917 అక్టోబరు) ఊహించనైనా ఊహించగలమా? లెనిన్ లేకపోతే మార్క్సు సిద్ధాంతాలకు పరిణామవికాసాలుండేవా? లెనిన్ లేకుంటే అంతర్జాతీయకార్మికవర్గ చైతన్యం ఉండేదా? లెనిన్ లేకుంటే సోవియట్‌కమ్యూనిస్టుపార్టీ పుట్టి ఉండేదా?6 లెనిన్ తపస్సు జ్వలించింది రాజకీయాచరణంలోనే కాదు తాత్త్వికరచనల్లో కూడా.7

శ్రీశ్రీ ఈగీతం రాసేనాటికి లెనిన్ లేడు; లెనిన్ మరణానంతరం ఆ స్థానం ఆక్రమించిన స్టాలిన్‌ఉన్నాడు. అతడే రెండవప్రపంచయుద్ధంలో జర్మనీసవాలుకు జవాబుచెప్పిన మహాయోధుడు. నిజానికి 'పరపీడనాపరుల ప్రాణాలభైరవి' అయినవాడితడే. స్టాలిన్ సేద్యంఫలించిన రష్యాఅని శ్రీశ్రీ చెప్పడంలో సార్థక్యం ఉంది. సోషలిస్టుపారిశ్రామికీకరణానికీ సమష్టివ్యవసాయవిధానానికీ రష్యాలో అంకురాలువేసినవాడు ఈ స్టాలిన్‌మహాశయుడే. అక్టోబరువిప్లవంలో లెనిన్‌కు సహచరుడుగా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీకి మొదటికార్యదర్శిగా స్టాలిన్‌సేద్యం ఫలించింది. కాని అతని నియంతృత్వం శ్రీశ్రీ తనగీతంరాసేనాటికి (1941)ఇంకా చరమసీమలకు

---

5 ఎంగెల్సు రచనలు : Ludwig Peurbach and the end of classical German Philosophy; Anti-Duhring; The Origin of the Family; Private Property and the State మొదలైనవి.

6 Ref : A Dictionary of philosophy

7 Imperialism, the highest stage of Capitalism (1916) Materialism and Empirio-Criticism (1908), The State and Revolution (1917) వంటివి లెనిన్ ప్రధానరచనలు.

చేరలేదు. రష్యామీద ఉక్కుతెర దిగలేదు. అందుకే స్టాలిన్‌ను ఈగీతంలో శ్రీశ్రీ స్తుతించాడు. మరోచోట స్టాలిన్ 'ఇటీవలి(మా)ఇన్స్పిరేషన్'గా పేర్కొనడంకూడా జరిగింది

ఎన్. ఐ. బుఖారిన్ (1888-1938), ఎం. ఏ. బకూనిన్ (1814-1876), పి. ఏ. క్రోపాట్కిన్ (1842-1921) అనే ముగ్గురు తత్త్వవేత్తలూ రష్యన్‌జాతీయులే. వీరి విప్లవదృక్పథం మార్క్సీయధోరణికి కొంచెం ఎడమైనది. బుఖారిన్ మార్క్సిజానికి కొన్ని విషయాల్లో విరుద్ధంగా వర్తించడమేగాక లెనినిజంను కూడా వ్యతిరేకించాడు. 1937లోనే ఇతణ్ని పార్టీనుంచి బహిష్కరించడం జరిగింది. బకూనిన్ అరాజకవాది (Anarchist). మార్క్సిలెనినిస్టువిప్లవానికి భిన్నమైన 'నరోదిజం'[8] ఆతని పరిష్కారమార్గం. 'the passion for destruction is also a constructive passion' అన్నది ఆతని ఆశయం. క్రోపాట్కిన్ కూడా అరాజకవాదియే. ఈ ముగ్గురినీ శ్రీశ్రీ అభిమానించడానికి కారణం ఏమిటంటే వీరి భావాల ప్రభావం ఆరోజుల్లో శ్రీశ్రీమీద ప్రసరించడమే! కానీ శ్రీశ్రీ రానురాను మార్క్సిజం-లెనినిజం యొక్క శాస్త్రీయదృక్పథాన్ని గ్రహించి, వీరి భావాలను తిరస్కరించాడు. అందుకే మహాప్రస్థాన గీతాల మలిముద్రణలో ఈ ముగ్గురి పేర్లనూ తొలగించడం జరిగింది. అనలవేదికముందు అస్త్రనైవేద్యం, జగమంతా బలివితర్ది, నటఘూర్జటి నిటలాక్షి పగిలింది, మహాప్రళయం జగంనిండా ప్రగల్భిస్తుంది. సంవర్తపుతుఫాను మేఘం, రుద్రాలికనయనజ్వాలిక వంటి భావాలకు శ్రీశ్రీ లోని అరాజకవాదం[9] కొంతవరకూ కారణమయింది. అయితే 'నరోదిజం' ప్రభావం శ్రీశ్రీ మహాప్రస్థానంలో కనిపించదు. బుఖారిన్, బకూనిన్, క్రోపాట్కిన్‌ల తాత్త్వికదృక్పథం అపరిపక్వమే-అశాస్త్రీయమే అయినా రష్యన్ సంస్కృతిలో వాటికి స్థానం ఉన్నది కనుక, వారిని ముగ్గురినీ పేర్కొనడం సమంజసంగానే ఉంది.

---

8 The social source of the ideology of Narodism in Russia was the struggle of the peasants for the abolition of the feudal estates and a radical redistribution of the land which belonged to the landowners.

—A Dictionary of Philosophy.

9 A petty-bourgeois socio-political trend that is hostile to all authority, including the dictatorship of the proletariat, and counterposes the interests of petty private ownership to the progress of society based on large-scale production...... The anarchists demand the immediate abolition of the state and donot admit the possibility of using the bourgeois state to prepare the proletariat for the revolution.

— A Dictionary of Philosophy.

# 89/నిజంగానే?

## జడలు విచ్చిన సుడులురెచ్చిన కడలినృత్యం శమిస్తుందా?

1941

సర్వేజనాః సుఖినోభవంతు అన్న ఆకాంక్ష భారతీయసాంస్కృతికాదర్శాన్ని నిరూపిస్తున్నా వాస్తవానికి అందరూ సుఖంగా జీవించిన కాలం చరిత్రలో కనిపించదు. ఎందువల్లనంటే చరిత్ర అంతా 'వర్గపోరాటాల' చరిత్రయే కనుక; నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వమే కనుక. కానీ సర్వజనసుఖకరమైనకాలం రావాలనే ఆశయం ఆశయంగానే మిగిలిపోకుండా భూమండలంమీద వాస్తవమై రూపొందాలంటే సామ్యవాదం సిద్ధించవలసిందే! అందుకు మార్గాంతరం లేదు. 'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాస్సమస్తాః సుఖినోభవంతు' అనే ఆకాంక్ష స్పష్టంగా ఫ్యూడల్ వ్యవస్థలో రూపొందిందనడానికి ఆ శ్లోకంలో సాక్ష్యం కనిపిస్తుంది. ఇదీ నిజానికి ఒక ఆశయమే. ఈ ఆశయాన్ని ప్రబంధయుగకవులు శిరసావహించారు కనుకనే వారి ప్రబంధాలలో రాజుల పరిపాలన నిష్కళంకంగా ఉన్నట్లు వర్ణింపబడుతూ వచ్చింది. నిజానికి లోకమంతా సుఖపడింది – అనడానికి ఆధారాలు లేవు. ఉన్న ఆధారాలు కవుల వర్ణనలే. అవి అత్యుక్తిలేకుండా సాగలేదు. ఈ కవులు రాజుల ఉపస్తుతింటూ రచనలు సాగించడంవల్ల ఆ రాజుల పరిపాలనలోని పీడనను గురించి వ్రాయనే వ్రాయజాలరు.

కృష్ణదేవరాయల పరిపాలనలో ప్రజలెంతో సుఖపడ్డారంటూ పెద్దనగారు వర్ణించారు. "తొలగెను ధూమకేతుక్షోభ జనులకు నతివృష్టిదోషభయంబు వాసె/గంటకాగమభీతి గడచె నుద్ధతభూమిభృత్కటకంబెల్ల నెత్తువడియె/మాసె నఘస్ఫూర్తి మరుభూములందును నెలమూడు వానలు నిండఁగురిసెఁ/నాబాల గోపాల మఖిల సద్విజమును నానందమున నున్కి నతిశయిల్లెఁ/బ్రజలకెల్లను గడురామరాజ్యమయ్యెఁ/జారుసత్త్వాఢ్యుఁడీశ్వర నారసింహు/భూవిభుని కృష్ణరాయఁడభ్యుదయమొంది/పెంపుమీఱంగ ధాత్రిఁ బాలింపుచుండ." ఈ వర్ణనలో రాజపరిపాలనవల్ల అతిలోకమహిమలు కూడా సంభవించినట్లు కనిపిస్తుంది. ఇది కవి పలికే అత్యుక్తిలోని అంశమే.

కావ్యాన్ని మంగళాంతం చేయాలనే నియమంతో (నాటకంలో భరతవాక్యంలాగ) పెద్దనగారు మనుచరిత్రను ముగిస్తూ స్వారోచిషుని పరిపాలన ఎంత సుఖంగా సాగిందో వర్ణించారు.

వానలు సరవితో వర్షించాయట! సస్యములు వేళ్ళఁ గొల్చుగ విఱ్ఱవీగి పండాయట! ఆరోగ్యపుత్ర పౌత్రైశ్వర్యవంతులై మానవులు నూరేళ్ళూ బ్రతికారట! పూవుబోడులు పతిదేవతలయ్యారట! అగ్నిభయతస్కర వ్యాధిభయాలడగి పోయాయట! ఫలపయఃకుసుమాది బహుపదార్థాలూ రస గంధసామగ్రి ఎసకమెసగాయట! ఈతిబాధలూ, అకాలమరణాలూ లేవట! ప్రజలు తామర తంపరగా వృద్ధిపొందారట! స్వారోచిషుడింత న్యాయంగా ప్రపంచాన్ని పాలించాడట! మానవ జాతి ఏకాలంలోనైనా కోరుకునే సుఖమయ భౌతికజీవితానికిది ఆదర్శకల్పన మాత్రమే. ఈ ఆద ర్శాన్ని నిజంచేయడం కోసమే మార్క్సిస్టులూ ఆలోచిస్తున్నారు. ఆ ఆదర్శాన్ని నిజంచేయడానికి ముందు సమాజం ఎలా ఉన్నది? అనే మీమాంస అవసరమవుతుంది.

ఆధునికకవి బూర్జువాసమాజంలోపుట్టి తనచుట్టూ ఉన్న సమాజం తాను కలలుకంటున్న సమాజంకన్నా భిన్నంగా ఉన్నందుకు బాధపడుతున్నాడు. ఈ బాధయే అతని కవిత్వానికి పర్యాయపదం అవుతోంది. మనసులో అట్టడుగున ఉన్న ఈ బాధ అనేకకల్లోలాలను రేపుతోంది. అనేకభావాలను కలిగిస్తోంది. సమాజాన్ని ఆదర్శాలమేరకు మార్చడానికి కవి ప్రబోధంచేయడం ఒకమార్గం అవుతుంది. సరిగా గురజాడకవి చేసిన ప్రబోధాలతత్త్వం ఇదే. దేశభక్తిగీతమంతా ఇందుకు ఉదాహరణీయమే. దేశాన్ని ప్రేమించవలసిందిగా ఈ కవి ప్రబోధిస్తే, దేశాన్ని (మానవుల్ని) ప్రేమించడంలేదు కనుకనే ప్రబోధించవలసిన అవసరం ఏర్పడిందన్నమాట. ఇది వాస్తవదృష్టి. ఆదర్శవాదిఅయితే దేశాన్ని అందరూ ప్రేమిస్తున్నారనీ అందరూ పాడిపంటలు పొంగిపొర్లిస్తున్నారనీ వెనుకచూపు మానివేశారనీ కత్తివైరం కాల్చివేయబడిందనీ చెప్పిఉండే వాడు. లోకంలో లేనిదాన్ని కళాప్రపంచంలో ఉన్నదానినిగా సృష్టించడం కొన్నియెడల ఆత్మ వంచన. అది అవాస్తవికం. వర్తమానంలో లేనిది భవిష్యత్తులో ఏర్పడవచ్చుననడం లేదా భవిషత్తును కలగన్నట్లు చెప్పడంకూడా అవాస్తవికమే అయినా అది అభ్యుదయభావనాప్రేరకం. దువ్వూరి రామిరెడ్డిగారి భవిష్యద్దర్శనం, శ్రీశ్రీగారి జగన్నాథునిరథచక్రాలు అలాంటివే.

మానవులంతా సుఖపడాలి అనే ఆకాంక్ష ఒక ఎండమావిగా మారిపోవడానికి ముఖ్య కారణం బూర్జువాసామ్రాజ్యవాదశక్తుల విజృంభణమే కాకపోతే, ఒక్కశతాబ్దంలోనే రెండు ప్రపంచయుద్ధాలు సంభవించిఉండేవికావు. ఈ యుద్ధాలు మానవజాతి భవిష్యత్తును సంశయంలోకి తోశాయి. ఈ యుద్ధాలే మానవజాతి అభ్యుదయానికి వైజ్ఞానికంగా సోపానాలనూ నిర్మించాయి. అందువల్ల మానవుడు ఆశనిరాశలమధ్య ఊగిసలాడుతున్నాడు.

రెండవప్రపంచయుద్ధంలో నాజీలకూ రష్యన్‌సోషలిస్టులకూ మధ్య యుద్ధం ప్రారంభ మైనప్పుడు రష్యన్‌పక్షం నెగ్గితే మానవాళికి మంచికాలమే. కానీ నాజీపక్షం నెగ్గితే మానవాళికి చెడ్డకాలం తప్పదు. రష్యాను గర్జించవలసినదిగా శ్రీశ్రీ హెచ్చరించడం మానవసంక్షేమంమీది

ఆకాంక్షవల్లనే. ఆ యుద్ధం ఆరంభమైనరోజుల్లో నిజంగానే నిఖిలలోకం నిండుహర్షం వహిస్తుందా? మానవాళికి మంచికాలం రహిస్తుందా ? దారుణ ద్వేషాగ్ని పెంచే దానవత్వం నశిస్తుందా? బానిసల సంకెళ్లు బిగిసే పాడుకాలం లయిస్తుందా ? సాధుసత్వపు సోదరత్వపు స్వాదుతత్త్వం జయిస్తుందా? జడలు విచ్చిన సుడులు రెచ్చిన కడలి నృత్యం శమిస్తుందా ? నడుమ తడబడి, సడలి ముడుగక పడవ తీరం క్రమిస్తుందా ? వంటి ప్రశ్నలు వేస్తున్నారు సంశయవాదులు.

## శ్రీశ్రీ సంశయవాదతిరస్కారం

'జగన్నాథునిరథచక్రాలు' ఖండికలో శ్రీశ్రీ మానవాళిభవిష్యత్తునుగురించి గొప్ప ఆశావాదాన్ని ప్రకటించి ఉన్నాడు. 'ఈ స్వప్నం నిజమవుతుంది! ఈ స్వర్గం ఋజువౌతుంది' అన్నాడు. కానీ లోకంలో ఎందరో సంశయాళువు లున్నారు. వారికి చారిత్రకావగాహన లేదు. అటువంటి వారు శ్రీశ్రీ ఆశావాదాన్ని నిరాకరించారు. వారు వేసిన ప్రశ్నలనే శ్రీశ్రీ నిజంగానే ? ఖండికలో నిరూపించి వేళాకోళం చేశాడు. ఈ ఖండికలో అడగబడినప్రశ్నలన్నీ ఆశావాది చెప్పినమాటల మీద బయల్దేరినవే. ఆ మాట లేమిటో కవి మనకు చెప్పలేదు. కానీ ఈ ప్రశ్నలలోనే ఆ మాటలు గర్భితమై ఉన్నాయి. ఆశావాది మాటలు అధ్యాహార్యాలు—

నిఖిలలోకం నిండుహర్షం వహిస్తుంది !
మానవాళికి మంచికాలం రహిస్తుంది !
దారుణ ద్వేషాగ్ని పెంచే దానవత్వం నశిస్తుంది !
సాధుసత్వపు సోదరత్వపు స్వాదుతత్త్వం జయిస్తుంది ?
జడలు విచ్చిన సుడులు రెచ్చిన కడలినృత్యం శమిస్తుంది !
నడుమతడబడి సడలి ముడుగక పడవ తీరం క్రమిస్తుంది !

ఈ మాటలకు మితవాదులు వేసే ప్రశ్నలనే శ్రీశ్రీ కావ్యస్థంచేశాడు. ఆ ప్రశ్నలకు సమాధానాలను మన ఊహకే వదిలివేశాడు.

ద్వితీయప్రపంచయుద్ధం ముగియకముందే దాని పర్యవసానం గురించి శ్రీశ్రీ ఊహిస్తూ వచ్చాడు. సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం పునాదులై యిళ్లులేచి, జనావళికి శుభంపూచి, శాంతి లభిస్తుందనీ జగమంతా జయిస్తుందనీ ప్రకటించాడు. కానీ ఈ మాత్రం ఆశావాదం ఆ రోజుల్లో చాలామంది అంతర్జాతీయకవుల్లోనే లేకపోయింది. ఉదాహరణకు 1939 సెప్టెంబరు 3వ తేదీన అంటే రెండవప్రపంచయుద్ధం మొదలైన మూడవరోజున స్టిఫెన్‌స్పెండర్ రాసిన మాటలు చూడండి—"I feel as if I could not write again. Words seem to break in my mind

like sticks when I put them down on paper".[1] అయితే శ్రీశ్రీది కేవలం నిరాశమాత్రం కాదు. నిజంగానే ? ఖండిక పాఠకులలో నిరాశను కలిగించదు. సంశయవాది వేసే ప్రశ్నలకు పాఠకుడు కూడా సమాధానాలను ఆశావాదంతోనే చెబుతాడు. జడలు విచ్చిన సుడులు రెచ్చిన కడలి నృత్యం శమించకతప్పదు. ఆ మహాసాగరనృత్యంలో చిక్కుకున్న పడవ ఈ ప్రపంచమే. అది తీరం చేరక తప్పదు. దారుణద్వేషాగ్ని పెంచే దానవత్వం నశించడం తప్పదని చరిత్ర చెబుతోంది. బానిసల సంకెళ్లు బిగిసే పాడుకాలం లయించక తప్పదని తిరుగుబాట్లు నిరూపిస్తున్నాయి. సాధు సత్వపు సోదరత్వపు స్వాదుతత్వం జయిస్తుందని రష్యావిప్లవం నిరూపించింది. అయితే ప్రశ్నార్థకా లెందుకు ? భవిష్యత్తును ఆశావహంగానే నిరూపించవచ్చుగదా అని ప్రశ్నిస్తే దానికొక్కటే సమాధానం. శ్రీశ్రీకి కావ్యమర్యాదలమీద ఉండే అపారమైన అభిమానం. ఎగిరించకు లోహ విహంగాలను అనే నిషేధానికి విధి అర్థమైనట్లే మానవాళికి నిజంగానే మంచికాలం రహిస్తుందా? అనే ప్రశ్నకు అనుకూలతే అర్థమై ధ్వనిస్తోంది. పైగా ఈ ప్రశ్నలు ప్రస్తుతకాలంయొక్క దురవస్థను వ్యక్తంచేస్తున్నాయి. మానవాళికిది మంచికాలం కాదు; పాడుకాలమే ! నిఖిలలోకం ఇప్పుడు హసించడం లేదు; రోదిస్తోంది. ప్రపంచంనిండా దారుణద్వేషమే కానీ గాఢస్నేహం లేదు; బానిసలకిప్పుడు సంకెళ్లు బిగుసున్నాయి కానీ స్వేచ్ఛ లేదు; ఈ సర్వారిష్టాలకూ కారణం బూర్జువావ్యవస్థ. ఈ విధంగా కావ్యమననం ద్వారా భావాలను ఉద్దీపితం చేయడం, తద్వారా బావవిప్లవాన్ని సాధించడం శ్రీశ్రీ ధ్యేయం.

## శ్రీశ్రీ వృత్త్యనుప్రాసలు

జడలు విచ్చిన సుడులు రెచ్చిన కడలినృత్యం శమిస్తుందా? నడుమతడబడి సడలి ముడుగక పడవతీరం క్రమిస్తుందా? అనే ముత్యాలసరంలోని డకారావృత్తి కడలి నృత్యాన్నీ పడవ తడ బాటునీ అభివ్యంజిస్తోంది. అనుప్రాసద్వారా అర్థోద్దీపనం సాధించడం ఇందులో విశేషం. 'అడిగెదనని కడువడి జను నడిగిన తను మగుడ నుడువడని నడయుడుగున్' అన్న పోతన పద్యంలో లేని గణవైచిత్రి ఇందులో ఉంది. పోతనగారి పద్యంలో అన్నీ నగాలే. శ్రీశ్రీ గీతంలో నగణం భగణం నగణం భగణం మొదటిపాదంలో జంటలుగా కెరటాలుగా నడుస్తాయి. నగణం, నగం, నగణం, నగం మూడవపాదంలో తడబడుతూ పడవలా నడుస్తాయి. పోతనగారిది చతురస్రగతి. శ్రీశ్రీది మిశ్రగతి. వృత్త్యనుప్రాసలో' నృత్యలయ'ను ప్రదర్శించాడు శ్రీశ్రీ.

ఇటువంటి వృత్త్యనుప్రాసలను సార్థకంగా వాడిన కొన్ని సందర్భాలు మహాప్రస్థానంలో ఉన్నాయి. స్విన్‌బర్న్ కవికి, జ్వాలాతోరణం, కవితా ఓ కవితా వంటివి అందుకు నిలయాలు.

---

1 Poetry and the Modern World.

## చూడు చూడు నీడలు ! నీడలు, పొగమేడలు...పేదవాళ్ళ వాడలు!

1947 జూన్ 19

ఫ్యూడల్ వ్యవస్థమీద విప్లవాన్ని సాధించిన బూర్జువావ్యవస్థ ఆధునిక నగరాలనూ ఆ నగరాలలో పరిశ్రమలనూ ఫ్యాక్టరీలనూ నిర్మించడమే కాక, అంతవరకూ పల్లెటూళ్ళలో వ్యవసాయపు కూలిపనులతో ప్రశాంతంగా బ్రతుకుతున్న జనాలను తన పరిశ్రమలలో పని చేయడానికి నగరాలకు ఆకర్షించి, వారి శ్రమవిలువను సొంతఆస్తిగా మార్చుకుంటూ వారిని నాగరికంగా దోపిడిచేయడంద్వారా వారి జీవితాలను దుర్భరం చేయసాగింది. సమాజజీవితాన్ని సుఖవంతంచేయడానికి ప్రయత్నించిన బూర్జువావ్యవస్థయే సమాజంలో ఒక వర్గాన్ని దుఃఖభాజనం చేయడానికి కూడా హేతువయింది. బూర్జువా వ్యవస్థలో కార్మికుల జీవితాలు ఎంత అంధకార బంధురంగా ఉంటాయో మార్క్సు ఎంగెల్సులు తమ మానిఫెస్టోలో నిరూపించారు. ఆమాటలు చూడండి—"ఆధునికకార్మికుడు పరిశ్రమలు అభివృద్ధి అయ్యేకొద్దీ పైకిరాకుండా యింకా కిందికి పోతున్నాడు...కార్మికుడు బిక్షాపకీరు అవుతున్నాడు...తన బానిసకు బానిస బ్రతుకునైనా నమ్మకంగా చూపించగల సామర్థ్యంలేదు దానికి."1 (బూర్జువావర్గానికి).

భావకవి నగరాలలోకి ప్రవేశించలేదు; ప్రవేశించినా అతనికి పరిశ్రమలూ శ్రామికులూ పారిశ్రామికాధిపతులూ దోపిడీలు కనిపించలేదు. కనిపించినా వాటిలో కవితాదర్శనం కానేలేదు. భావకవిత్వంలో పల్లెటూరి ప్రకృతివాతావరణం, అమాయిక జానపదుల స్నిగ్ధప్రణయజీవనవిధానం (ఉదాహరణకు ఎంకినాయుడుబావలు), మధ్యతరగతి కుటుంబాల జీవనసమస్యలు (కిన్నెరసాని, ఆమె అత్తగారు) మధ్యతరగతి విద్యావంతుల ప్రణయక్లేశాలు (కృశా, శివశంకరులు, నాయని, వేదుల కవితల్లో) కనిపిస్తాయి.

ఫ్యూడల్ బూర్జువావ్యవస్థలకు వ్యతిరేకి అవుతూ ప్రవేశించిన శ్రీశ్రీ కవిత్వంలో నగర వాతావరణం, ఫ్యాక్టరీలలో శ్రామికుల జీవితాలు, వారి దారిద్ర్యం, ఆకసమంటే మేడలు, కూలిపోతున్న గోడలు అనివార్యంగా చోటుచేసుకున్నాయి. మార్క్సు ఎంగెల్సులు చెప్పిన ఆధునిక కార్మికజీవనహీనస్థితి శ్రీశ్రీకి బాగా అర్థమయింది. దాన్ని కవిత్వంలో వస్తువుగా తీసుకోవడం ద్వారా తెలుగు కవిత్వంలో నూతనాధ్యాయం ఆరంభించాడు.

---

1 కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక 49 పే.

రెండవప్రపంచయుద్ధం 1945లో ముగిసిపోయేసరికి భారతదేశంలోని సామ్రాజ్యవాదులు దెబ్బతిన్నారు. వారి పరిశ్రమలూ దెబ్బతిన్నాయి. పరిశ్రమలలో పనిచేసే శ్రామికులూ దెబ్బతిన్నారు. 1947 లో ఈ దేశంనుంచి నిష్క్రమించదలచిన ఆంగ్లేయులు ఏవిధంగానూ కార్మిక జీవితాలను చక్కదిద్దలేకపోయారు సరిగదా వారి జీవితాలను మరింత నికృష్టస్థితిలో పడవేశారు. కార్మికులు నీడలుగా మిగిలిపోయారు.

## శ్రీశ్రీ కవిత్వంలో కార్మికజీవనసంక్షోభం

ఆధునిక కార్మికుడ్ని (ల్ని) కావ్యనాయకుడు (లు) గా స్వీకరించిన శ్రీశ్రీ, తన మహాప్రస్థానంలో కార్మికుడి వర్తమానాన్నీ కార్మికుడి భవిష్యత్తునీ చిత్రించాడు. వర్తమానంలో కార్మికుడొక జీవనసంక్షోభాన్ని అనుభవిస్తున్నాడు. అచిరభవిష్యత్తులో అతడు తిరుగుబాటు చేస్తాడు. భవిష్యత్తులో అతడు సుఖజీవన తీరాన్ని చేరడమే కాక, సమాజాన్ని అంతటినీ దరి జేరుస్తాడు. ఈ విధంగా కార్మికజీవితంలోని మూడుదశలు శ్రీశ్రీకి గోచరించాయి. ప్రపంచమిప్పుడు కార్మికజీవనసంక్షోభదశలోనే ఉంది. అందువల్ల బీభత్సమే ఈ కావ్యజీవితానికి ప్రధానరసమవుతోంది. అచిరభవిష్యత్తులో వీరరసం, సుదూరభవిష్యత్తులో శాంతరసం ప్రధాన రసాలు కాకతప్పదు. ఇదే భవిష్యత్కవితాస్వరూప స్వభావాలను నిర్ణయిస్తోంది. అందుకు శ్రీశ్రీ మార్గదర్శి.

'నీడలు' ఖండికలో కార్మికుడి జీవనసంక్షోభం అధివాస్తవికసంవిధానంలో చిత్రించబడింది. కార్మికులే ఈనాడు నీడలుగా మిగిలిపోయారు. వారికి ఒక స్వరూపం లేదు. ఇల్లూవాడా లేదు. ఈ నీడలు యుగయుగాల దోపిడిలో వగదూరిన శాసనాల జాడలు! దోపిడీమీద తిరుగుబాటు జరగకుండా శాసనాలు చేయబడ్డాయి. ఆ శాసనాల జాడల్లోనే నడుస్తున్న నీడలవి. ఆ జాడలే ఈ నీడలంటాడు శ్రీశ్రీ. నరనరాల రాపిడిలో పొగచూరిన జాలిజార్చుగోడలు ఈ నీడలు! పారిశ్రామికవాతావరణంలో పొగచూరిపోయినవాళ్ళు కార్మికులే. అంతేకాదు వీరిచుట్టూ ఉన్నవి పొగమేడలే. ఫ్యాక్టరీలు, మిల్లులు, రైళ్ళు అన్నీ పొగమేడలే.

కార్మికజీవనసంక్షోభం 'పేదవాళ్ళ వాడలు'లో బాగా కనిపిస్తుంది. అవి నరనరాల వేదనలో బక్కచిక్కి పడిపోయిన బతుకుగోడలే! అవి తరతరాల రోదనలో బిక్కచచ్చి పాడుపడ్డవాడలే! నరనరాలవేదనకు నరనరాలరాపిడియే కారణం. తరతరాల రోదనకు యుగయుగాల దోపిడియే కారణం.

కార్మికులకు అభివృద్ధి, వికాసం లేవు. అందువల్లనే వారు పూలులేని కాడలవుతున్నారు. ఇందుకు కారణం ఆ పూలను దోపిడిచేసుకునిపోవడమే. ఇందువల్ల వారు నిర్భాగ్యపునీడలవు

తున్నారు. ఆర్థికబలహీనతయే నిర్భాగ్యం. ఈ నిర్భాగ్యపునీడలు తరతరాల చెరసాలల పొదిగిటిలో ఒదిగిలిపడిపోయాయి. చెరసాలలు నిర్బంధాలే; ఇంతేకాదు; రకరకాల తెరచాటుల పొదిగిటిలో ఒదిగిలిపడు ఎడారి ఓడలు ఈ కార్మికులు. రకరకాల తెరచాటులు సంప్రదాయాలే. జీవనశూన్యతయే ఎడారి. భారవహనమే ఓడ. ఎడారిలో నడిచే ఓడ ముందుకు ఎలా కదులుతుంది ?

ఈ నీడలు- ఈ కార్మికులు- ఒక దేశసంపదకూ సంస్కృతికీ గర్వకారణాలు ఎలా అవుతారు ? వారు ప్రీడలే అవుతారు. చాలినన్నిబట్టలైనా లేకపోవడంవల్ల వీరు సిగ్గులేకనా! ఇలాంటివారే దేశంలో అధికసంఖ్యాకులు. అందువల్ల దేశమంతా అనాగరికమే నన్నమాట. ఈ ప్రీడల కెవరు కారణం ? దోపిడివారులే! వీరే 'పీడలు'. ఆ పీడలతో క్రీడలాడుతున్న నీడలివి. మండుటెండలలో చెమటలోడుస్తూ పనిచేసే కార్మికులు సూర్యునితో క్రీడలాడుతున్నట్లుగానూ సూర్యునిలో సూదులతో ఆటలాడుతున్నట్లుగానూ కనిపించారు శ్రీశ్రీకి. ఈ నీడలను ఎవరూ చూడరేమని బాధపడుతున్నాడు శ్రీశ్రీ. అందుకే మేడలను కాక నీడలను చూడండని హెచ్చరిస్తున్నాడు. బూర్జువాఅభ్యుదయాన్నిచూసి అదే అభివృద్ధి అనుకోవడం సరిఅయిన చూపు కాదు. ఆ అభ్యుదయం పాక్షికమైనది. దానిచుట్టూ నీడలు మిగిలిపోతాయి. నిజమైన అభ్యుదయం కార్మికాభ్యుదయం మాత్రమే.

కార్మికజీవనసంక్షోభాన్ని శ్రీశ్రీ ప్రతిజ్ఞ, జగన్నాథునిరథచక్రాలు, వాడు, వ్యత్యాసం వంటి ఖండికలలో వాస్తవికంగా చిత్రించిఉన్నాడు. 'నీడలు'లోనిది అధివాస్తవికం.

## శ్రీశ్రీ అధివాస్తవిక పదచిత్రాలు

వాస్తవికతను భూతద్దంలో లాగచూపడమే అధివాస్తవికత లక్ష్యం. అయితే ఇది అవాస్తవికం మాత్రంకాదు. వాస్తవికతయే దీని భూమిక. కానీ ఒక ఉన్మాదావస్థలోనుంచి చూసిన వాస్తవికత అధివాస్తవికత అవుతోంది. మనిషి స్వప్నావస్థలో (వ్యక్తావ్యక్తంలో) ఎన్నోరూపవిచిత్రాలను చూస్తాడు. అవి వాస్తవికతకు ఒక విధమైన ప్రతిచ్ఛాయలే. వాస్తవంలో అసాధ్యమైనవే స్వప్నంలోని వాస్తవాలు. వాటినే అధివాస్తవికుడు కవిత్వంలో ప్రదర్శిస్తాడు. ఇందులో ప్రయోగదృష్టి ప్రధానమైపోతుంది. అందువల్లనే ఈ పదచిత్రాలు అసాంప్రదాయికంగానూ అనిదంపూర్వకంగానూ ఉంటాయి. హేతుబుద్ధిని నిరాకరిస్తూ వైచిత్రిని సృష్టిస్తాయి. ఒక్కొక్కప్పుడిది అప్రియత్నరచనగా ఆవిర్భవిస్తుంది. "ఫ్రాయిడ్ సిద్ధాంతంప్రకారం అర్థంలేనిదంటూ ఏదీ ఉండదు. ప్రతిదానికీ అర్థం ఉంటుంది. ఫ్రాయిడ్ తన సైకోఎనాలిసిస్ (మనస్తత్వశాస్త్రం) ద్వారా దీన్ని ఋజువుచేయప్రయత్నించాడు. సర్రియలిస్టులు ఫ్రాయిడ్ సిద్ధాంతం ఆధారం

చేసుకొని తమ రచనలు కొనసాగించారు. హెర్బర్ట్‌రీడ్ (ఇంగ్లండులో ఈ ఉద్యమానికి నాయకుడు) ఇలా చెప్పాడు:- మానవునికి మానసికంగా ఎన్నో శృంఖలాలు ఉన్నాయి. వాటిని బట్టే ఊహాలుకూడా సంకుచితంగా ఉంటాయి. అందుచే ఆ శృంఖలాలను బద్దలు కొట్టడానికి సాక్ నిచ్చే రచనలు కావాలి. అదే అధివాస్తవికత"2 అంటూ శ్రీశ్రీ 1945 లోనే వివరించాడు.

అధివాస్తవికతను వ్యక్తివాదంగాగాక సామాజికవాదంగా ప్రయోగించాడు శ్రీశ్రీ. 'నీడలు' సంపూర్ణమైన అధివాస్తవిక రచన కాదు. అందులో కొన్ని అధివాస్తవికపదచిత్రాలున్నాయి. పొగమేడలు, జాలిజార్చుగోడలు, బతుకుగోడలు, పూలులేనికాడలు, ఎడారిలో ఓడలు, సూర్యునితో క్రీడలు, సూర్యునిలో సూదులతో క్రీడలు మొదలయినవి అందుకు ఉదాహరణీయాలు.

సూర్యునిలో సూదులుండటం, ఆ సూదులతో నీడలు ఆటలాడటం ఎంత అసంభవమో అధివాస్తవికంగా అంత సంభవం. ఆ సూదులు కిరణాలే. ఆ కిరణాలలో పనిచేసే నీడలు కార్మికులే.

సూర్యునితో క్రీడలాడటం కానీ ఎడారిలో ఓడలు నడవటం కానీ గోడలు నీటిని కాక జాలిని జార్చడం కానీ పొగలతో మేడలను నిర్మించడం కానీ అన్నీ అసాధ్యాలే. వీటి ద్వారా కార్మిక జీవిత వాస్తవాలను అసామాన్యంగా స్ఫురింపించాడు శ్రీశ్రీ.

## శ్రీశ్రీ పదసంగ్రథన శిల్పం

తన ఖండికలోనే గాక ఏ సందర్భంలోనైనా వాడుకోదగినట్లు 'పదాల అల్లిక' (పదసంగ్రథనం) చేయడం శ్రీశ్రీ భాషలోని ఒక కొత్తపుంత. యుగయుగాల దోపిడి, నరనరాలరాపిడి, శాసనాల జాడలు, నరనరాల వేదన, తరతరాల రోదన, పూలులేని కాడలు, తరతరాల చెరసాలలు, రకరకాల తెరచాటులు, నిర్భాగ్యపునీడలు, ఎడారిలో ఓడలు, సూర్యునితో క్రీడలు మొదలైనవి.

ఇలాంటివి మనభాషకు, మన కవిత్వానికి శ్రీశ్రీ సమకూర్చిన నూతనాలంకారాలు!

1 శ్రీశ్రీ సా. రెండు వచన. 489 పే.

# 91/మహాప్రస్థానంలో కవితావస్తువు

## సమకాలిక జీవితమే సత్కవితావస్తువు!

'సామాజికస్పృహ' గల ఏకవి అయినా తనకు తెలిసో తెలియకో 'తానుంటున్న సమాజం' యొక్క ఆర్థికరాజకీయసాంస్కృతికజీవితవాస్తవ లక్షణాలను ప్రతిబింబిస్తూ వాటిమీద తిరుగుబాటుచేసి 'తానుండగోరిన సమాజం' యొక్క ఆర్థికరాజకీయసాంస్కృతికజీవితలక్షణాలను ప్రతిపాదిస్తూ ఉంటాడు. అలాంటికవి తాను దేన్నిగురించి రాయాలి? ఎందుకోసం రాయాలి? ఏ దృక్పథంతో రాయాలి? ఏసామగ్రిని వాడాలి? అనే ప్రశ్నలు వేసుకోకమానడు. అతడి సామాజికస్పృహయే ఈ ప్రశ్నలకు సమాధానాన్ని నిర్ణయిస్తుంది. ఆ నిర్ణయంమీదనే కవితావస్తువు నిర్దేశింపబడుతుంది.

సామాజికవ్యవస్థలను బట్టి స్థూలంగా తెలుగు కవిత్వాన్ని రెండుయుగాలుగా విభజించుకోవచ్చు. 11వ శతాబ్దినుంచి 19వశతాబ్ది మధ్యభాగం వరకూ ఫ్యూడల్‌వ్యవస్థ. ఆతరువాతినుంచీ బూర్జువావ్యవస్థ. ఈ బూర్జువావ్యవస్థలోనే తెలుగుకవులకు సామాజికస్పృహ మొదలయింది.

బూర్జువా సాంస్కృతికవిప్లవం భారతదేశంలో రాజారామమోహనరాయ్(1774–1833) ఉద్యమాలతో ఆరంభమయి, సిపాయిల తిరుగుబాటు (1857) నాటికి అన్నిరాష్ట్రాలకూ వ్యాపించింది. ఈ విప్లవంలో స్థూలంగా నాల్గుదశలు కనిపిస్తాయి. (1) 1830లో బ్రహ్మసమాజ స్థాపన, నవమానవీయోద్యమాల ఫలితంగా దేశీయులలో నూతనభావసంచలనం ఏర్పడింది. (2) 1835 లో ఆంగ్లభాషలోనే విద్యాబోధన ఆరంభం కావడంవల్ల ఆంగ్లసాహిత్యాధ్యయనానికీ అంతర్జాతీయసంబంధాలకూ అవకాశాలేర్పడ్డాయి. (3) 1841లో మద్రాసువిశ్వవిద్యాలయం స్థాపించబడటం వల్ల తెలుగుదేశంలో పాశ్చాత్యసాహిత్య, శాస్త్రాధ్యయనం మొదలయింది. (4) 1857 లో బూర్జువా సంస్కృతి మీద తిరుగుబాటు రావడంవల్ల ఫ్యూడల్ సంస్కృతి క్షీణదశయే వ్యక్తమయింది. ఈనాలుగుదశల తరవాత భావప్రపంచంలో అతివేగంగా అతివేలంగా మార్పులు రాసాగాయి. 1857నే ఆధునిక(బూర్జువా)యుగోదయంగా భావించవచ్చు.

తెలుగుసాహిత్యంలో బూర్జువాసాంస్కృతిక విప్లవానికి జనకులుగా ముగ్గురు మహాశయులు కనిపిస్తారు.

(1) కందుకూరి వీరేశలింగంపంతులు (1848-1919)గారు పొందిన బూర్జువాసామాజికసాంస్కృతిక చైతన్యానికి రాజారామమోహనరాయలే మార్గదర్శి. వీరేశలింగంగారి భావాలు ఫ్యూడల్ సంస్కృతిమీద తిరుగుబాట్లే!

(2) గురజాడ అప్పారావు (1862-1915)గారి కృషి కందుకూరివారి సాహిత్యచైతన్యానికి తరువాతి వికసనదశయే! వీరి 'కొత్త పాతల మేలుకలయిక' సిద్ధాంతంలో ఫ్యూడల్ బూర్జువా సంస్కృతుల సమన్వయమే ఉంది.

(3) గిడుగు వేంకటరామమూర్తి (1863-1940) గారి తిరుగుబాటు ఫ్యూడల్ భాషా సంప్రదాయాలమీదనే! ఈ ముగ్గురూ తెలుగు సాహిత్యంలో బూర్జువాయుగానికి ప్రారంభోత్సవం చేసిన క్రాంతదర్శులే! కావ్యవస్తువు, దృక్పథం, భాష అనే మూడింటిలోనూ బూర్జువా చైతన్యాన్ని ప్రసరింపజేసిన మహోదయులు ఈ ముగ్గురే! తమకు ముందున్న కావ్యవ్యవస్థను మార్చడంద్వారా సమాజవ్యవస్థను మార్చాలనుకోవడమే వీరి మహాసంకల్పం!

తెలుగు సాహిత్యంలో బూర్జువాయుగపు అడుగుజాడలు వీరేశలింగానికి కొంచెం ముందుగానే కనిపించనారంభించాయి. మతుకుమల్లి నృసింహకవి (1816-73) రచించిన చెన్నపురీ విలాసం(1860)అనే కావ్యంలో సమకాలిక నగరజీవితం, ఆంగ్లపదాలప్రయోగం కనిపించడమే ఇందుకు నిదర్శనం.

తెలుగు కవుల కావ్యవస్తువులో బూర్జువాచైతన్యం మార్పునీ వైవిధ్యాన్నీ తెచ్చిపెట్టింది. ఈ ప్రస్థానం సుస్పష్టంగా వీరేశలింగంనుంచే మొదలయింది. వీరేశలింగం, గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి అనే ఈ ఐదుగురూ కవితావస్తువిప్లవానికి దోహదం చేశారు! ఈ వస్తువిప్లవం 1933 లో శ్రీశ్రీవల్ల మరో పెద్దమలుపు తిరిగింది. ఆ మలుపును గురించి చర్చించడానికి ముందు ఈ ఐదు మజిలీలనూ గురించి స్థూలంగా తెలుసుకోవలసిఉంటుంది.

(1) వీరేశలింగం రచనలు బూర్జువాయుగపు లక్షణాలైన సమాజసంస్కరణ, హేతువాదం, మానవతాదృష్టి అనే మూడు ప్రధానాంశాలను తెలుగుకవుల ముందుకు తీసుకు వచ్చాయి. (2) సమాజవాస్తవికతను ప్రతిబింబించి, సమాజలోపాలను చూపి, సంస్కరించుకునే అవకాశం కల్పించడమే కవిత్వప్రయోజనంగా భావించిన గురజాడ కవితావస్తువులో మౌలికమైన మార్పును తీసుకువచ్చారు. 'ముత్యాలసరాల'లో ఆనాటి ఫ్యూడల్సమాజంమీది విమర్శే ఉంది. ఆ సమాజాన్ని బూర్జువాసంస్కృతివైపు మళ్ళించాలన్న తహతహ ఆయనది! స్త్రీని కొనుక్కోవడం, ముసలివాళ్ళ పెళ్ళి, తోకచుక్క అరిష్టం కలిగిస్తుందనుకోవడం, మాలలను స్పృశించరాదనుకోవడం, అందరితో కలిసి భుజించడానికి నిరాకరించడం, విగ్రహాన్ని పూజించి మనిషిని తిరస్కరించడం, స్త్రీని సమాజంలో హీనంగా చూడటం, అలంకారాలమీద స్త్రీలు మోజుపడటం,

పాతను గౌరవించి కొత్తను తిరస్కరించడం, గతకాలమే వర్తమానం కన్నా గొప్పదనుకోవడం, సామాన్యుల భాష కవిత్వానికి పనికిరాదనుకోవడం, జానపదుల ఛందోరీతులు హీనమైనవను కోవడం వంటి లోపాలనెన్నింటినో ఆయన సమకాలీనసమాజంలో చూశారు. ఈ ఫ్యూడల్ మూఢవిశ్వాసాలను వైజ్ఞానిక (బూర్జువా) హేతువాదంతో ఖండించే సంకల్పంలోనే గురజాడ కవితావస్తువు రూపొందింది. మానవత, సమకాలీనత, హేతువాదం. భౌతికదృక్పథం, సమాజ వాస్తవికత మొదలైనవి గురజాడ కావ్యవస్తువు విశిష్టలక్షణాలు. (3) రాయప్రోలు (1892- ) ఫ్యూడల్ వ్యవస్థలోని కొన్ని సామాజికలోపాలను నిరసించినా, బూర్జువావ్యవస్థవల్ల వచ్చే అన్నిగుణాలనూ మెచ్చుకోలేదు. పైగా ఆయనకు ఫ్యూడల్ సంస్కృతిమీదనే గౌరవం ఎక్కువ. అందుకే బూర్జువావ్యవస్థవల్ల అడుగంటుతున్న ప్రాచీనవైభవాన్నీ విలువలనూ సంస్కృతినీ రక్షించాలని ప్రబోధించారు. అందుకే ఆయన యథాస్థితివాది. కానీ కొన్ని విషయాలలో సంస్కరణవాది. అందుకే ఫ్యూడల్ వ్యవస్థ పెంపొందించిన కామశృంగారాన్ని నిరసించి, అమలినశృంగారాన్ని ప్రతిపాదించారు. స్వరాజ్యోద్యమం, స్వరాష్ట్రోద్యమం, జాతీయ పునరుజ్జీవనోద్యమం వంటి ఉద్యమాల ప్రభావం వీరిమీద, వీరిప్రభావం ఆ ఉద్యమాలమీద పడింది. వీటికి అనుగుణంగానే రాయప్రోలు కవితావస్తువు విస్తరించింది. ఫ్యూడల్ వ్యవస్థలోని కన్యాశుల్కపద్ధతిని గురజాడ నిరసిస్తే, బూర్జువావ్యవస్థలోని వరకట్నపద్ధతిని రాయప్రోలు నిరసించారు. అయినా గురజాడకున్న భౌతికదృక్పథం రాయప్రోలువారికి లేదు. రాయప్రోలు ఆదర్శవాది. (4) 1914-18 మధ్య జరిగిన ప్రథమప్రపంచయుద్ధంవల్లా 1917లో రష్యాలో వచ్చిన సామ్యవాదవిప్లవంవల్లా అసలు కవి చైతన్యంలోనే ఒక మార్పువచ్చింది. కవితావస్తువు లోని మార్పుకిది దోహదంచేసింది. ప్రథమప్రపంచయుద్ధం బూర్జువావ్యవస్థకు విజయమే అయినా సామ్యవాదవిప్లవం మాత్రం బూర్జువావ్యవస్థకు ఒక పరాజయమే! ఈ రెండు ప్రపంచసంఘటనల ప్రభావం తెలుగుకవిమీద ఉందా? మొదటిప్రపంచయుద్ధఫలితాల పరోక్షప్రభావం కృష్ణశాస్త్రి (1897-1980) కవితావస్తువుమీద కనిపిస్తుంది. ఎలాగంటే—రొమాంటిసిజం బూర్జువావ్యవస్థ లోనిదే! ఇందులో ఫ్యూడల్ వ్యవస్థమీద వ్యక్తి తిరుగుబాటు ఉంది. వ్యక్తి తానెవరికీ తలవంచననీ తనకు స్వేచ్ఛయే ప్రాణమనీ ఊహాలోకవిహారం తన హక్కనీ ప్రకటించుకోవడమే కృష్ణశాస్త్రి కవిత్వంలోని మూలసూత్రం. అందుకే అది ఆత్మాశ్రయం. వాస్తవికత ఈ వాదానికే విరుద్ధం. సమాజంలోని వర్గాలూ వారి కష్టసుఖాలూ ఈ కవిత్వంలోని వస్తువులు కాజాలవు. 'తానే' (self) ఈ కవిత్వానికి ప్రాతిపదిక. అందువల్ల ఈ కవిత్వంలో సంవిధానానికున్నంతప్రాధాన్యం వస్తువుకు ఉండదు. రామమోహనరాయల బ్రాహ్మమతం, మానవోద్యమం, రవీంద్రుడి కాల్పని కావేశం, రొమాంటిసిజం, గాంధీజీ సత్యాహింసలు ఇవన్నీ ఫ్యూడల్ వ్యవస్థనుంచి బూర్జువావ్యవస్థ వైపు సాగించిన పురోగమనంలోని భాగాలే. ఇవే కృష్ణశాస్త్రి కవితావస్తువును నిర్దేశించాయి.

(5) రష్యాలోని సామ్యవాదవిప్లవంయొక్క ప్రభావం దువ్వూరి రామిరెడ్డి (1895-1947) కవిత్వంలో తొంగి చూస్తుంది. బూర్జువావ్యవస్థ సాధించిన పారిశ్రామికవైజ్ఞానికవిప్లవాలను ఈయన హర్షిస్తూనే వాటివల్ల కర్షకకార్మికులకు కలుగుతున్న కష్టనష్టాలను గుర్తించి వారిపట్ల సానుభూతిని తన కవిత్వంలో ప్రకటించారు. సమసమాజావతరణాన్ని కవితాస్వప్నంగా దర్శించారు. ఈవిధంగా కవితావస్తువు మళ్ళీ ఒకమలుపుతిరిగింది.

ప్రథమప్రపంచ యుద్ధానంతరం 1930 లలో వచ్చిన ఆర్థికసంక్షోభం బూర్జువావ్యవస్థ ప్రపంచవ్యాప్తంగా ఎదుర్కొన్నపరాజయమే! దీని నీడలు ఆంధ్రదేశంలోకూడా వ్యాపించాయి. సమాజవ్యవస్థలో వచ్చిన ఈ పరిణామం వల్ల భావకవిత్వానికి కాలదోషం పట్టింది. ఈపరిస్థితుల్లో నవ్యకవిత్వంకోసం ముద్దుకృష్ణ (1899-73) శిష్ట్లా (1912-46) వంటివారు అన్వేషణలు ప్రారంభించినా నూతనకవితావస్తువును దర్శించలేకపోయారు.

## శ్రీశ్రీ కవితావస్తువు

1930ల ఆర్థికసంక్షోభకాలంలో మొదలైన శ్రీశ్రీ (అభ్యుదయ)కవిత్వం బూర్జువా వ్యవస్థ సాధించిన అభ్యుదయాన్ని అంతటినీ ఆమోదిస్తూనే అది తెచ్చిపెట్టిన ఆర్థికసంక్షోభాన్ని ఎదుర్కొనడంతో పైకి వచ్చింది. బూర్జువావర్గం చేతకానిదనీ శ్రామికవర్గమే సామ్యవాద విప్లవాన్ని తెస్తుందనీ శంఖారావం చేస్తూ ఆ విప్లవాన్నే కవితావస్తువుగా గ్రహించాడు శ్రీశ్రీ. ఇందుకు శ్రీశ్రీకి మార్గదర్శకాలైన అంశాలు ఎన్నో ఉన్నాయి. వాటిని గతప్రకరణాల్లో కూలం కషంగా వివరించడం జరిగింది. శ్రీశ్రీ కవితావస్తువును పరిశీలించి సిద్ధాంతీకరించడానికి కొన్ని ప్రమాణాలను గ్రహించడం మంచిది. అవి (1) ప్రయోజనం (2) సమాజం (3) సామగ్రి (4) దృక్పథం. వీటిని వరసగా పరిశీలిద్దాం.

## శ్రీశ్రీ కవితావస్తువు-ప్రయోజనం

1930 ల ఆర్థికసంక్షోభం 1939 నాటికి రెండవప్రపంచయుద్ధంగా పరిణమించడం, 1945 వరకూ అది కొనసాగి, బూర్జువావ్యవస్థయొక్క అసమర్థతను నిరూపించడం, ప్రపంచ ప్రజలు పడిన కష్టాలు శ్రీశ్రీకి అనేక కావ్యవస్తువులను సరఫరా చేశాయి. యుద్ధం ముగిసిన తరువాత 1947 లో బ్రిటిష్ బూర్జువా సామ్రాజ్యవాదులు 'భారతదేశాన్ని' ఫ్యూడల్, బూర్జువావర్గాలకు అప్పగించిపోవడంవల్ల కర్షకకార్మిక మధ్యతరగతి వర్గాలకు సాంఘికన్యాయం చేకూరలేదు. అందువల్లనే శ్రీశ్రీ కవితావస్తువుకు కాలదోషం పట్టలేదు. 1933-47 ల మధ్య కాలంలో బూర్జువావ్యవస్థకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడిన శ్రీశ్రీకవితాధనుస్సు అభ్యుదయ కవితోద్యమగాండీవంగా పరిణమించింది. ఈ గాండీవంనుంచి వెలువడిన శరపరంపరలే మహా ప్రస్థాన కవితావస్తువులు.

బూర్జువా వ్యవస్థలో 'కొందరు వ్యక్తులు' మాత్రమే సమాజమంతటిమీదా అధికారం చెలాయించడం వల్ల పరిమితవర్గం పీడకవర్గంగానూ అశేషజనానీకం పీడితవర్గంగానూ మిగులుతుంది. ఇది సామాజికంగా అధర్మమని చెబుతూ పీడితవర్గాన్ని చైతన్యవంతం చేసి తిరుగుబాటు జరిపించడమే శ్రీశ్రీ కవిత్వానికి ప్రధానప్రయోజనం. ఈ ప్రయోజనానికి (1) వాస్తవికత (2) పురోగమనం (3) శ్రామికవర్గజీవితం (4) బూర్జువా వర్గజీవితం అనే నాల్గు అంశాలు ఉపాధులు. వీటినుంచే శ్రీశ్రీ కవితావస్తువు విస్తరించింది. కవితాప్రయోజనం విషయంలో నన్నయాదుల నుంచి శ్రీశ్రీ వరకూ ఎన్నో అంతర్దశలున్నాయి.

వస్తు పరిణామ వికాసాలు.

| కవిత్వం | ఫ్యూడల్ వ్యవస్థ | | బూర్జువా వ్యవస్థ | | |
|---|---|---|---|---|---|
| | భారత కవులు | ప్రబంధకవులు | గురజాడ | భావకవులు | శ్రీశ్రీ |
| ప్రయోజనం | మనస్సంస్కారం | మనోరంజనం | మనఃపరివర్తనం | మనఃక్షాళనం | మనశ్చైతన్యం |
| పాఠకులు లేదా శ్రోతలు | పాలకులు, ప్రజలు | పండితులు, పాలకులు | మధ్యతరగతి విద్యావంతులు, ప్రజలు | సహృదయులు, కవులు | పీడితవర్గం, బూర్జువావర్గం |
| వస్తువు లేదా సామగ్రి | మతం, గతం, కథలు | శృంగారం, వర్ణనలు | సందేశం, సమాజం, వర్తమానం | అనుభూతి ప్రకృతి | విప్లవసిద్ధాంతాలు, సమకాలికజీవితం |

### శ్రీశ్రీ కవితావస్తువు - సమకాలిక సమాజం

సమాజ సంస్కరణంనుంచి సమాజ విప్లవీకరణం వరకూ సాగిన పురోగమనమే గురజాడ నుంచి శ్రీశ్రీ వరకూ సాగిన కవితా ప్రస్థానం. ఇందువల్లనే వస్తువులో మార్పువచ్చింది. బూర్జువాయుగపు చైతన్యాన్ని గురజాడ ప్రజల కందించదలచగా సామ్యవాదయుగపు చైతన్యాన్ని శ్రీశ్రీ శ్రామికుల కందించదలచాడు. ఇందువల్లనే కవితావస్తువులో గురజాడకు శ్రీశ్రీ అనుయాయి కాలేదు. ఈ యిద్దరి కవితావస్తువూ సమకాలికమే గాక భావికాలికం కూడా కావడం ఇద్దరికీగల పోలిక. గురజాడకవిత్వంలో ఫ్యూడల్‌సమాజవాస్తవికత, బూర్జువా సమాజపుటూహలు ప్రతిబింబించగా శ్రీశ్రీ కవిత్వంలో బూర్జువాసమాజపువాస్తవికత, సామ్యవాద సమాజపుటూహలు కూడా ప్రతిబింబించాయి. (1) నిరుద్యోగానికి యువకులు బలికావడం, బిచ్చగాళ్లను ఎవరూ పట్టించుకోక పోవడం, సామాజికన్యాయం లేకపోవడం వల్ల

కొందరు ఉన్మాదులుగా మారిపోవడం, ఆకలితీరని యువతులు పడుపువృత్తికి దిగడం, యుద్ధాలలో యువకులు చనిపోవడం, నిరాశవల్ల త్రాగుడుకు అలవాటు పడటం, నేరం చేయనివాళ్లను కూడా ఉరితీయడం, కూలీలు సమ్మెకట్టడం, కర్షకులూ కార్మికులూ జీవనభారం మోయలేక దుఃఖించడం, నిరపరాధుల్ని చెరసాలకు పంపడం, ఆత్మహత్యలకు ప్రయత్నించడం, యంత్రశాలల్లో ప్రమాదాలకు కొందరు లోనుకావడం, అన్నిరంగాల్లోనూ దగా ఎదురవుతూ ఉండటం, నగరాల్లో ఆకర్షణలు పెరిగి అవి డబ్బులేనివారికి అందుబాటులో ఉండకపోవడం, అప్పులిచ్చిన వారు వడ్డీలుపెంచి పీడించడం, కన్నబిడ్డలకు తిండిపెట్టలేక తల్లిదండ్రులేడ్వటం, దిక్కులేక చనిపోయినవారి శవాలను ఎవరూ పట్టించుకోక పోవడం, ప్రమాదాలకు గురి అయిన శ్రామికుల పట్ల సానుభూతి లేకపోవడం, ఒకవ్యక్తిని మరోవ్యక్తీ ఒక జాతిని మరోజాతీ పీడిస్తూ ఉండటం, నిజాలను దాచివేయడం, శ్రమపడి నిర్మించిన వస్తువులమీద శ్రామికుడికి హక్కు లేకపోవడం, శ్రమకు తగిన కూలి చెల్లించకపోవడం, హక్కులనడిగితే దౌర్జన్యం చేయడం, న్యాయస్థానాలు, రక్షకభటవర్గాలు పాలకవర్గాన్నే రక్షించి పాలితవర్గాన్ని శిక్షించడం, సామ్యవాదాన్ని సహించలేక దాడి చేయడం, సంఘంనుంచి కొందరిని వెలివేయడం, ప్రపంచయుద్ధాలను సృష్టించడం, మారణాయుధాలను తయారుచేయడం వంటివి బూర్జువా/వలసవాద/సామ్రాజ్యవాద సమాజంలో చూసినలోపాలు. ఈ లోపాలకు పరిష్కారం సంస్కరణం (reform) కాదు. ఎందువల్లనంటే-ఫ్యూడల్‌వ్యవస్థకన్నా బూర్జువావ్యవస్థ చాలా బలమైనది. హింస దాని ప్రధానాయుధం. తన లోపాలను అది అంగీకరించదు. ఈ వ్యవస్థలోని అరిష్టాలు కేవలం సాంఘికాలుకాదు. ఇవి రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతికాది రంగాలన్నింటికీ సంబంధించినవి. కనుక మొత్తం ఈ వ్యవస్థయే మారిపోవాలి. ఆ పనిని చేయగలది విప్లవమే (revolution). ఈ విప్లవంతేగల శ్రామికవర్గానికి మనశ్చైతన్యం కలిగించదలచాడు శ్రీశ్రీ. అందువల్ల బూర్జువా సమాజవాస్తవికతను నగ్నంగా చూపించడం ఒక లక్ష్యంగా శ్రీశ్రీ తన కవితావస్తువును విస్తరించుకున్నాడు. వర్తమానదురవస్థాసూచకాలైన పీడకలలను శ్రీశ్రీ కవితావస్తువుగా స్వీకరించడంలో ఈబూర్జువా సమాజవాస్తవికతయే కనిపిస్తుంది. బూర్జువా సమాజావతరణానికి ఫ్యూడల్ వ్యవస్థ ఎలా పునాదిగా ఉందోకూడా శ్రీశ్రీ నిరూపించాడు. దేశచరిత్రలులోనివి గతకాలపు పీడకలలే! (2) సామ్యవాద సమాజపుటూహలు శ్రీశ్రీ కవితావస్తువులోని రెండవ పెడ. రష్యాలో సామ్యవాద ప్రపంచం ఏర్పడటం, ప్రపంచమంతటా పరపీడన మీద తిరుగుబాట్లు జరుగుతూ ఉండటం, శ్రామికసంఘటనవల్ల విప్లవం ఫలించడం, మార్పులోనే వికాసం కలగడం, మితవాదులకన్నా అతివాదుల వల్లనే ప్రపంచానికి మేలు జరుగుతూ ఉండటం, బూర్జువావ్యవస్థ సాధించిన సౌకర్యాలూ సంపదలూ సాధనాలూ అందరికీ అందుబాటులోకి రావడం, నిరుద్యోగం, దారిద్ర్యం, దాస్యం, రోగం వంటివి నిర్మూలితం కావడం, ఆనందానురాగాలు ప్రపంచానికి లభించడం, మోసం,

దౌర్జన్యం, స్వార్థం, ఈర్ష్య, హింస, దోపిడి వంటి జాడ్యాలు తొలగిపోవడం, వర్గభేదాలు అంతరించడం, స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం, శాంతి, కాంతి వంటి కలలు నిజంకావడం వంటివన్నీ సామ్యవాది స్వప్నాలు. ఈ స్వప్నాలే శ్రీశ్రీ కవితావస్తువులయ్యాయి. ఈ స్వప్నాలు సామ్యవాద భవిష్యత్ సూచకాలు.

సమకాలికసమాజమూ, ఆ సమాజజీవితమూ స్థూలంగా శ్రీశ్రీ కవితావస్తువులని ఏలింది. బూర్జువాసమాజజీవితం వైవిధ్యంతో కూడింది; నానాభావవస్తుసంకలితమూ సంకీర్ణమూ అయింది. సుఖదుఃఖాలతో జీవనక్లేశాలతో జీవనభోగాలతో నిండిపోయి ఉన్నది. ఇటువంటి జీవితాన్ని వస్తువుగా తీసుకోవడంవల్ల శ్రీశ్రీకి కవితావస్తువైవిధ్యం లభించింది.

(1) సమకాలిక సమాజజీవితాన్ని కవితావస్తువుగా స్వీకరించడమంటే దాన్ని ఫోటోగ్రఫీగా ప్రతిబింబించడం కాదు. సామాజికవాస్తవికత, సామాజికవిమర్శ, సామాజికవిప్లవం అనే మూడంశాలతో ఆ వస్తువును మల్చుకోవడమే శ్రీశ్రీ పద్ధతి. అయితే ఈ మూడంశాలూ విడివిడిగా ఉండక, ఒకదానితో ఒకటి అల్లుకుపోయి ఉంటాయి. మహాప్రస్థానం, సాహసి, బాటసారి, భిక్షువర్షీయసి, ఉన్మాది, చేదుపాట, సంధ్యాసమస్యలు, ఆకాశదీపం, అవతలిగట్టు, పరాజితులు, ఆః, నీడలు, శైశవగీతి, అద్వైతం, వాడు, వ్యత్యాసం, మిథ్యావాది అనే17 ఖండికల్లోనూ సమాజాన్ని వర్గదృక్పథంతోనూ పీడితవర్గాభిమానంతోనూ పీడకవర్గద్వేషంతోనూ విప్లవావేశంతోనూ చిత్రించాడు.

(2) సమకాలికసమాజజీవితమే సమకాలికచరిత్రకు ముడిపదార్థం. ఈ చరిత్రకు గత చరిత్ర పునాది. ఈ రెండుచరిత్రలూ భవిష్యచ్చరిత్రను నిర్ణయిస్తాయి. అందువల్లనే శ్రీశ్రీ కవితావస్తువులో చారిత్రకాంశంకూడా ప్రవేశించింది. చారిత్రకవాస్తవికత, చరిత్రవిమర్శ, చారిత్రకభౌతికవాదం అనే మూడంశాలతో చారిత్రకకవితావస్తువును నిర్వహిస్తాడు శ్రీశ్రీ. ఐ, జ్వాలాతోరణం, అవతారం, దేశచరిత్రలు, జయభేరి, ఆశాదూతలు, మానవుడా, కొంపెల్ల జనార్దనరావుకోసం అనే 8 ఖండికల్లో భూతభవిష్యద్వర్తమానాల చరిత్ర వివిధకోణాల్లో చిత్రింపబడింది.

(3) సమకాలికసమాజజీవితంమీద రాజకీయాల ప్రభావం ఉంటుంది కనుక శ్రీశ్రీ రాజకీయవస్తువును స్వీకరించాడు. రాజకీయవాస్తవికత, రాజకీయవిమర్శ, రాజకీయవిప్లవం అనే మూడంశాలు ఈ వస్తువులోని భాగాలు. గర్జించురష్యా, అభ్యుదయం, నిజంగానే, జగన్నాథుని రథచక్రాలు అనే నాల్గుఖండికలూ ఇందుకు నిదర్శనాలు.

(4) సమకాలికసమాజానికి ఉపయోగించే కవిత్వం ఎలాఉండాలో కవిత్వంలోనే సూత్రప్రాయంగా చెప్పాడు శ్రీశ్రీ. కవితావస్తువు, సామగ్రి, సంవిధానం, ప్రయోజనం, దృక్పథం,

పాఠకవర్గం అనే వాటినిగురించి సూచనలుచేస్తూ ఋక్కులు, కవితా ఓ కవితా, నవకవిత, ప్రతిజ్ఞ, కళారవి, స్విన్‌బర్న్‌కవికి, గంటలు అనే 7 ఖండికలు రాశాడు.

(5) సమకాలికసమాజంలోని పీడితమానవుడి మానసికావేదనను వ్యక్తంచేస్తూ దేనికోరకు, కేక, ఒకరాత్రి, ఒకక్షణంలో అనే ఖండికలు రాశాడు-శ్రీశ్రీ. వీటిలో మనోవాస్తవికత, మనో విశ్లేషణ ప్రధానాంశాలు.

ఫ్యూడల్, బూర్జువావ్యవస్థల్లో కొన్నివస్తువులు కవులచేత హీనంగా చూడబడతాయి. సమకాలికసమాజజీవితాన్ని వాస్తవికంగా ప్రతిబింబించడానికి కొందరుకవు లంగీకరించరు. వారికి సుందరవస్తువులే కావలసివస్తాయి. ఇందువల్ల సమకాలికసమాజంనుంచి దూరమవుతారు. వీరి మీద తిరుగుబాటు శ్రీశ్రీది. సమాజవ్యవస్థలో కొంతభాగాన్ని అందంగా మరికొంతభాగాన్ని వికృతంగా తయారుచేసే బూర్జువామనస్తత్వాన్ని ఎదిరించడం శ్రీశ్రీ మనస్తత్వం. బూర్జువాలు సృష్టించిన నూతనపారిశ్రామికవస్తువులూ వారే సృష్టించిన పీడితవర్గపు వాస్తవజీవితవస్తువులూ కూడా శ్రీశ్రీకి కావ్యవస్తువులే !

## శ్రీశ్రీ కవితావస్తువు - కవితాసామగ్రి

'భావకవిత్వం' మీద తిరుగుబాటుగా వచ్చిన శ్రీశ్రీ కవిత్వం 'వస్తుకవిత్వమే'. అందువల్లనే కవితాసామగ్రికూడా భిన్నమైనది. అది కాల్పనికమూ ఇది వాస్తవికమూను! ఇందులో కథా వస్తువు, సమాజం, పాత్రలు, సంఘటనలు, సమస్యలు స్పష్టంగా కనిపిస్తాయి. అందులో ప్రకృతి, అనుభూతి, స్వీయావేదన, ఊహలు కనిపిస్తాయి. అది ఆత్మాశ్రయం; ఇది పాత్రాశ్రయం. ఇందులో శ్రీశ్రీ కూడా ఒక విప్లవనాయకుడి, ఒక శ్రామికుడి పాత్రనే ధరించి కనిపిస్తాడు. అందులో కవి ఒక 'వ్యక్తి'గా 'తన' అనుభూతులనే వెల్లడిస్తాడు. ఈ భేదాలే ఈ కవుల కవితా సామగ్రిని వేరుపరుస్తున్నాయి. శ్రీశ్రీ కవితాసామగ్రిని కొన్నిరకాలుగా పేర్కొనవచ్చు.

(1) వర్గసమాజం నుంచి వెలువడిన సామగ్రి. బిచ్చగత్తె, నిరుద్యోగి, పిచ్చివాడు, కూలి వాడు, క్షుధార్తుడు, పరాజితుడు, ఫాసిస్టు, నాజీ, బూర్జువా, దోపిడిదారు, మిథ్యావాది, సంశయ వాది, ఆశావాది, నిరాశావాది, విప్లవవాది, సాహసి, శిశువు, యువకుడు, కవి, తాగుబోతు, రోగి, పడుపుకత్తె వంటి పాత్రలూ వారి జీవితసమస్యలూ వారి చుట్టూ ఉన్న సామాజిక వాతా వరణమూ. (2) ప్రతీకాత్మకమైన సామగ్రి. పురాణాలనుంచీ ప్రకృతినుంచీ ఏసామగ్రిని తీసుకున్నా ప్రతీకార్థం కల్పించడం. (3) చారిత్రికరాజకీయసామగ్రి. గతచరిత్రనుంచీ వర్తమానరాజ కీయాలనుంచీ భౌతికదృక్పథంతో సామగ్రిని గ్రహించడం. (4) పారిశ్రామిక సామగ్రి. బూర్జువావ్యవస్థ సాధించిన వైజ్ఞానిక పారిశ్రామిక యాంత్రికవాతావరణంనుంచీ ఆ వ్యవస్థ సృష్టించిన బీభత్సాలనుంచీ అద్భుతాలనుంచీ గ్రహింపబడిన సామగ్రి

ఈ నాలుగురకాల కవితాసామగ్రి శ్రీశ్రీకి ముందు తెలుగుకవిత్వంలో లేనిది. మొత్తం మీద సమకాలిక సమాజజీవితాన్ని పరిదర్శించి, వ్యాఖ్యానించి, విమర్శించి, విప్లవీకరించడానికి శ్రీశ్రీ వాడుకున్న కవితాసామగ్రి విపులమైనది. దానికి చరిత్ర, పురాణాలు, విజ్ఞానశాస్త్రం, సామాజికశాస్త్రం, తత్త్వశాస్త్రం, గతితార్కిక భౌతికశాస్త్రం, ఆర్థికరాజకీయసిద్ధాంతాలు, మానవపరిణామశాస్త్రం, విజాతీయజాతీయసాహిత్యాలు, సంస్కృతి, మనోవిశ్లేషణశాస్త్రం, అంతర్జాతీయసాహిత్యవాదాలు వంటివెన్నో నిలయాలు. శ్రీశ్రీ వ్యుత్పత్తికివి నిదర్శనాలు.

## శ్రీశ్రీ కవితావస్తువు - కవితాదృక్పథం

ఏ దృక్పథంతో రాయాలి? అనేప్రశ్నకు శ్రీశ్రీ నిశ్చితమైన జవాబునే నిర్దేశించుకున్నాడు. అది గతితార్కిక భౌతికవాదదృక్పథమే! యథాస్థితివాదం, మితవాదం, తటస్థవాదం, కర్మవాదం, మిథ్యావాదం, నిరాశావాదం, సంశయవాదం, ఆదర్శవాదం, మతం, అహింసావాదం, కారుణ్యవాదం, సంస్కరణవాదం, బూర్జువాసామ్రాజ్యవాదం వంటి వెన్నో శ్రీశ్రీ దృష్టిలో అభివృద్ధి నిరోధకాలు. అతివాదం, విప్లవవాదం, ఆశావాదం, సామ్యవాదం, అంతర్జాతీయత, భౌతికవాదం, హేతువాదం, మానవతావాదం, సమకాలికత వంటివి శ్రీశ్రీ కవితాదృక్పథానికి తోడునీడలు.

రసదృష్టితో చూస్తే శ్రీశ్రీ భావాలు 'శృంగారానికి' ఎడంగా నిలుస్తాయి. శృంగారం కడుపునిండినవారి సమస్యకావడమే అందుకు కారణం! అయినా శ్రీశ్రీ శృంగారవిరోధి కాదు! ఉత్సాహంతో మొదలై శమంతో పూర్తి అవుతాయి మహాప్రస్థానం మొదలైన గీతాలు. ఈ కూర్పు మహాకావ్యలక్షణం. వీరం (ఉత్సాహం), కరుణం (దుఃఖం), భయానకం (భయం), బీభత్సం (జుగుప్స), అద్భుతం (విస్మయం), హాస్యం (పరిహాసం), శృంగారం (స్నేహ వాత్సల్యాలు), రౌద్రం (కోపం), శాంతం (శమం) అనే రసభావాలు తొమ్మిదీ భౌతికస్పర్శతో మహాప్రస్థానంలో ఉన్నాయి. వీటి ప్రయోజనం కేవల రసానందం కాదు; భౌతిక చైతన్యం! కనుక మహాప్రస్థానం నవరసరుచిరం!

కావ్యవస్తువులో మార్పే నిజమైన కవితావిప్లవం! ఫ్యూడల్‌వ్యవస్థలో ప్రబంధకవితా విప్లవం, బూర్జువావ్యవస్థలో భావకవితావిప్లవం వస్తువిప్లవాలే! అభ్యుదయకవితా విప్లవం వీరేశలింగం, గిడుగు, గురజాడల సంస్కరణోద్యమంలో ''పురుటినొప్పులు'' పడి, శ్రీశ్రీ కవిత్వంలో ''పుట్టినరోజు'' పండుగ చేసుకుంది!

"అపుడే ప్రసవించిన శిశువునెడదనిడుకొని రుచిరస్వప్నాలను కాంచే జవరాలి మనఃప్రపంచపుటావర్తాలే" శ్రీశ్రీగారి మహాప్రస్థానం మొదలైన గీతాలు !!

## అనర్గళం అనితరసాధ్యం నా మార్గం!

కేవలం ముడిపదార్థమైన వస్తువును భాష, ఛందస్సు, రసభావం, భావన, ప్రక్రియ వంటి పరికరాలతో రూపవంతంగా, సజీవంగా మలిచే విధానమే 'సంవిధానం' (technique). వస్తు సంవిధానాలను ఏకంచేసి పాఠకుడి అనుభవానికి అందించడమే కవిత్వం. కవితా పరికరాలకూ కవిత్వాంశాలకూ గల అనుబంధాన్ని కిందివిధంగా సూచించవచ్చు.

| | 1 | 2 | 3 | 4 | 5 | |
|---|---|---|---|---|---|---|
| కవితాపరికరాలు = | భాష | ఛందస్సు | భావం | భావన | ప్రక్రియ | = సంవిధానం. |
| ↓ | ↓ | ↓ | ↓ | ↓ | ↓ | |
| కవిత్వాంశాలు = | శైలి | లయ | ఆవేశం | పదచిత్రాలు | కావ్యం | |

కవిత్వం = వస్తువు + సంవిధానం.

సామాజిక స్పృహ ఉన్నా లేకున్నా ఏకవి అయినా తాను 'కవిత్వం ఎవరికోసం రాయాలి?' అనే ప్రశ్న వేసుకోకమానడు. ఈ మీమాంసలోనే కవితా సంవిధానం మార్పులు పొందుతూ ఉంటుంది. ఫ్యూడల్ వ్యవస్థలోకన్నా బూర్జువా వ్యవస్థలో (19వ శతాబ్ది) తెలుగు కవులు సంవిధాన విప్లవానికి ఉద్యమించారు. ఇందులో ప్రధానమైన మజిలీలు కొన్ని ఉన్నాయి. (1) తిరుపతి వేంకటకవుల (1870) అవధానాలు కవిత్వాన్ని మధ్యతరగతివారికీ సామాన్యులకూ అందుబాటులోనికి తీసుకువచ్చాయి. ఇందువల్ల భాషాసౌలభ్యం ఉద్దేశింపబడింది. (2) గిడుగువారి (1863) వ్యావహారిక భాషోద్యమం సామాన్యుడికే సాహిత్యం అని ఎలుగెత్తి చాటింది. ఇది గ్రాంథిక భాషమీద తిరుగుబాటు తెచ్చింది. (3) గురజాడవారి (1862) ముత్యాలసరం ప్రజలకే సాహిత్యం అని నిర్దేశించింది. ఇది వృత్తాలకు స్వస్తి చెప్పింది. వీరి తేటయిన మాటలు సంస్కృత సమాసప్రీతిని సడలించాయి. వీరి 'ఖండకావ్యం' ప్రబంధరచనను విరమింపజేసింది. (4) వేంకట పార్వతీశ్వర కవులు (1880) మంజరీ ద్విపదలో రచనలు చేశారు. మధురమైన భాష వాడారు. ఇవి ప్రబంధ ప్రౌఢికి ఉద్వాసన చెప్పాయి. (5) బసవరాజు అప్పారావు (1894) గారు వాడుకభాషలో పాటలు వ్రాశారు. ఇవి వ్యక్తికోసం కవిత్వం అని

నిరూపించాయి. (6) రాయప్రోలు (1892) వారి రచనలు ప్రబోధకావ్యాలకు అంకురం వేశాయి. (7) కృష్ణశాస్త్రి (1897) గారి భావగీతికలు పదచిత్రాలనూ గేయాలనూ తేట గీతులనూ రంగు రుచి వాసనగల పదజాలాన్నీ ప్రచారానికి తెచ్చాయి. (8) విశ్వనాథవారి (1893) కిన్నెరసాని పాటలు తెలుగు నుడికారాన్నీ గేయఫణితుల్నీ విస్తరింపజేశాయి. (9) నండూరి (1895) వారి ఎంకిపాటలు జానపద భాషనీ 'యాస'నీ మాత్రాచ్ఛందోరీతుల్నీ వెలుగు లోకి తెచ్చాయి. (10) రాయురెడ్డి (1895), అడవిబాపిరాజు (1895), ముద్దుకృష్ణ (1899), శిష్ట్లా (1912) వంటివారు పోలీఫోనిక్ వచనాన్ని రచించి గేయం మీద తిరుగుబాటు చేశారు. (11) అబ్బూరి (1896) వారు భుజంగప్రయాతం వంటి పాత వృత్తాలను కొత్తరీతుల్లో రాస్తూ సంప్రదాయ నూతనీకరణానికి యత్నించారు. (12) కవికొండల వేంకటరావు (1892) ముత్యాల సరాల్లో నూతన ప్రయోగాలు చేశారు. ఇన్నిరకాలుగా విస్తరిస్తున్న సంవిధానం శ్రీశ్రీ సంవిధాన ప్రయోగాలకు పునాదిగా నిలిచింది.

సంవిధాన పరిణామ వికాసాలు

| సమాజం | భాష | ఛందస్సు | భావం | భావన | ప్రక్రియ |
|---|---|---|---|---|---|
| ఫ్యూడల్ వ్యవస్థ (1020-1870) | సంస్కృత బహు శత్ జానుతెనుగు సమాన భూయిష్ఠత, శబ్ద శిల్పం, అచ్చ తెలుగు, గ్రాంథిక భాష | మార్గ, దేశి, వృత్తాలు, జాతులు, ఉపజాతులు, మాత్రాచ్ఛందస్సులు, రగడలు. | పాత్రాశ్రయం, నవరసభావాలు, ప్రధానంగా మధురమైన రసాలు. | కథాకథనం, నాటకీయత, వర్ణనలు, ధ్వని, అలంకారం, ఔచిత్యం, వక్రోక్తి, చమత్కారం, | చంపువు, నిర్వచనకావ్యం, చాటువు, ఉదాహరణం, శతకం, దండకం, ద్వ్యర్థికావ్యం, ప్రబంధం, యక్షగానం, పదం. |
| బూర్జువావ్యవస్థ (1870-1930) | గ్రాంథికభాష, సరళగ్రాంథికం, తేటతెలుగు, శబ్దశిల్పం, వ్యావహారికభాష, జానపదభాష, మాండలిక భాష. | ముత్యాలసరాలు, తేటగీతి, వృత్తాలు, గేయాలు, వచన కవిత్వం, లయ ప్రధాన రచన. | ఆత్మాశ్రయ భావాలు, లలిత మధుర కోమల రస భావాలు, అనుభూతి ప్రాధాన్యం. | వాస్తవికత, స్వాప్నికత, ఊహాచిత్రాలు. | స్వీయచరిత్ర, హరికథ, అవదానం, ఖండకావ్యం, ప్రబోధ గేయం, భావగీతిక, కాల్పనికతానిక, జానపద గీతం, ఖండిక, గీతం. |

పై పట్టికను జాగ్రత్తగా పరిశీలిస్తే కవితాపరికరాలు సమాజవ్యవస్థనుబట్టి ఎలామారుతూ వస్తున్నాయో తెలుస్తుంది. ఫ్యూడల్ వ్యవస్థలోని కవితాపరికరాలను బూర్జువావ్యవస్థ అవసర

మైనంతవరకే గ్రహించి, నూత్నపరికరాలను రూపొందించుకుంటోంది. బూర్జువావ్యవస్థలో రెండవదశను శ్రీశ్రీ ప్రారంభించాడు. శ్రీశ్రీ కవితాపరికరాలు కొన్ని బూర్జువావర్గంవారివే! కాని కొన్ని శ్రామికవర్గంవారివి. వ్యావహారికభాష, అక్షరగణ, మాత్రాగణ, వచనగేయ చ్ఛందస్సులు, శ్రామిక సామాజికభావాలు, విదేశీయభావనావిధానాలు, విదేశీయకవితాప్రక్రియలు శ్రీశ్రీ పరికరాలు. బూర్జువావర్గాన్ని ఎదిరించడానికీ శ్రామికవర్గాన్ని కదిలించడానికీ నడుంకట్టిన శ్రీశ్రీ ఆ రెండువర్గాలనూ పాఠకవర్గంగా భావించవలసివచ్చింది. అందువల్లనే శ్రీశ్రీ సంవిధానం రెండువర్గాలకూ చెందుతోంది.

శ్రీశ్రీ మహాప్రస్థానగీతాలు రాయడం మొదలుపెట్టేనాటికి (1933) బూర్జువావ్యవస్థ వికసనదశలో ఉంది. తెలుగుదేశంలో ఆధునికవిద్యాసౌకర్యాలు బాగా పెరిగాయి కవిత్వాన్ని ఇంతకు ముందెన్నడూ చదవనంతమంది చదువుతున్నారు. అచ్చుయంత్రాలు, కళాశాలలు, విశ్వ విద్యాలయాలు, రేడియో, సినిమా వంటి భావప్రచారసాధనాలు వచ్చాయి. ఆలోచనలు పెరిగాయి. భావకవిత్వం వెనకపడుతోంది. పాఠకవర్గం పెరిగి, అభిరుచులు మారుతున్నాయి. అందువల్ల సామాజికన్యాయం గురించి ఆలోచించగలవారినందరినీ తన పాఠకవర్గంగా శ్రీశ్రీ గుర్తించాడు. ప్రత్యేకవ్యక్తులకోసం కాక, సామాజికులకందరికీ కవిత్వం రాయదలచాడు శ్రీశ్రీ. ఇందువల్లనే పరికరాలు మార్చుకున్నాడు.

బూర్జువావ్యవస్థలో ఉన్న పీడకపీడితవర్గాలలో ఏ వర్గానికి కవిత్వం అంకితం కావాలి? అనే మీమాంసతో కవితాప్రయోజనం మలుపు తిరిగింది. ఆనందోపదేశాలు → ఉపదేశానం దాలు → ఆనందం → ఉపదేశం అనే స్థాయులలో మారుతూవచ్చిన కవితాప్రయోజనాలు మార్క్సిస్టువాస్తవికదృష్టివల్ల సమాజపరాలుగా మారి, వ్యక్తిఆనందానికి బదులు సమాజ చైతన్యమూ ఉపదేశానికి బదులు ఆచరణాత్మకసందేశమూ ఏర్పడ్డాయి. శ్రీశ్రీ కవిత్వానికి తొలిప్రయోజనం పీడితసమాజాన్ని సంఘటితంచేసి చైతన్యవంతం చేయడం, మలిప్రయోజనం ఆ సమాజంచేత తిరుగుబాటు చేయించడం. కవిత్వరసానుభవం వ్యక్తినుంచి సమాజానికి మారగానే అది రసానుభవంకాక జ్ఞానానుభవమే అవుతోంది. రసానుభవంలోని తన్మయత్వం జ్ఞానాను భవంలో జాగృతిగా మారుతోంది. కవితాప్రయోజనంయొక్క ప్రభావం కవితాపరికరాల మీద కూడా ఉండటం తప్పనిసరి. వీటిని బట్టి కవితాసంవిధానం మారక తప్పదు.

### కవితాసంవిధానంలో శ్రీశ్రీ భాష

బూర్జువావ్యవస్థమీద తిరుగుబాటు చేయదలచిన శ్రీశ్రీ 'కవితాభాష'కు అవసరమైన అన్ని అంచులనూ గుర్తించాడు. తన కవిత్వం అందవలసినది బూర్జువాలకూ బూర్జువాల చేతికింద పనిచేసే కార్మికులకూ మధ్యతరగతివారికీ అయినప్పుడు అటు నాగరికభాష, ఇటు ప్రజావ్యవ

హారమూ తన 'కవితాభాష'లో లీనంకావలసిన అవసరం ఉంది. భాషావిప్లవం లేనిదే భావ విప్లవం రాదని గుర్తించిన శ్రీశ్రీ భాషను ఆధునికంచేసుకోవలసిన బాధ్యతనూ సామాజికవిప్లవానికి ఆయుధంచేసుకోవలసిన ఆవశ్యకతనూ గుర్తించాడు. తన సందేశాన్ని సమాజానికి అందించేవి పత్రికలు, రేడియోలు, అచ్చుయంత్రం, ఉపన్యాసాలు, కరపత్రాలు, మధ్యతరగతి విద్యావంతులు కనుక ఆ వాహికల కనుగుణంగా సౌలభ్యాన్నీ సౌష్ఠవాన్నీ తనభాషకు ప్రాథమికావసరాలుగా ఎన్నుకున్నాడు. పాతబడిన పదాలను వదలడం, దీర్ఘసమాసాలను విసర్జించడం, వ్యర్థపదాలను పరిహరించడం వంటివి సామాన్యభాషాసంస్కరణలే! అంతకన్నా శ్రీశ్రీ కవితాభాషకు చేసిన సంస్కరణలు ఎన్నో ఉన్నాయి. వాటి నన్నిటిని గతప్రకరణాలలో విశ్లేషించి ఉన్నాను. శ్రీశ్రీ కవితాభాషకు 'సమకాలికత' ప్రధానలక్షణం. ఈ లక్షణంవల్ల సామాజికచైతన్యం లభించింది. మాటాడుతున్నంత వేగంగాపరుగులెత్తే ఈ భాషలో ప్రబంధకవుల శబ్దశిల్పం, భావకవుల పదబంధ నిర్మాణచాతుర్యంకూడా కనిపిస్తాయి. ఈభాషకు జ్ఞాపకానికి నిలవడం, ఆవేశపరచడం, ఆలోచింపజేయడం, అర్థవ్యంజన కలిగించడం, పాడబడటం వంటి ఉత్తమగుణాలున్నాయి. ఈభాష సర్వవిధాలా శ్రీశ్రీ కవితావస్తువును ఆకర్షవంతం చేయగలిగింది.

### కవితాసంవిధానంలో శ్రీశ్రీ ఛందస్సు

బూర్జువావ్యవస్థ నవ్యకల్పనలకూ ప్రయోగాలకూ ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుంది. ఛందస్సులలో ఈ బూర్జువాప్రయోగం ముద్దుకృష్ణ, శిష్ట్లాలలో శ్రీశ్రీ కన్నా ముందే గోచరమయింది. సంప్రదాయం సంకెలగా కనిపిస్తే దాన్ని తెంపివేసే సాహసం బూర్జువావ్యవస్థలోనే ఉంటుంది కనుక నే 'ప్రీవర్సు' బయల్దేరింది, ఛందస్సులలో ఇలాంటి సాహసప్రయోగాలుచేసి గొప్ప ఫలితాలు సాధించడానికి ఛందస్సంప్రదాయాలు బాగా తెలిసిఉండాలి. ఆ విధమైన పాండిత్యం శ్రీశ్రీకే ఉంది. శ్రీశ్రీ ప్రయోగాలు సాహసంతో కూడినవే! ఈ ప్రయోగాల్లో సామాజికచైతన్యం ప్రస్ఫుటం అయింది. వీటి ప్రధానలక్షణం 'లయాత్మకత్వం'. శ్రీశ్రీ లయల భేదాలను గత ప్రకరణాల్లో విపులంగా చర్చించాను.

అనాదిలో గ్రామికులనోటినుంచి వెలువడిన ఛందస్సులను పండితులు విశ్లేషించి లక్షణబద్ధంచేస్తే, ఆ లక్షణాలనే కవులంతా అనుసరిస్తూ వచ్చారు. కానీ శ్రీశ్రీ అలా చేయలేదు. మాత్రాగణాలను అక్షరగణబద్ధం చేయడం ఒకనాటి ఛందఃపరిష్కారం. అక్షరగణాలను తిరిగి మాత్రాబద్ధంగా మార్చడం శ్రీశ్రీ ఛందస్సంస్కరణల్లో ప్రధానమైనది. వీటిని గురించి, ముత్యాలసరానికి చేసిన సంస్కరణలను గురించి గతప్రకరణాల్లో వివరించాను. అనుష్టుప్పు, కందం, శ్లోకం, గేయం, పదవిరతి, ప్రాస మొదలైనవి శ్రీశ్రీ వచనపద్యానికి ఎలా దోహదం చేశాయో వివరించాను.

ఛందఃపరంగా తెలుగుకవిత్వంలో శ్రీశ్రీ నూతనశకానికి ఆచార్యుడు. శ్రీశ్రీ కవితావస్తువంటే గిట్టని మితవాదులకూ సంప్రదాయవాదులకూ కూడా శ్రీశ్రీ ఛందఃప్రయోగాలు ఆశ్చర్యం కలిగిస్తాయి. శ్రీశ్రీ ఛందస్సుల బాహ్యాంతర్గుణాలను గురించి గతప్రకరణాల్లో విపులంగా వివరించాను. అవన్నీ ఛందఃపురోగమనాన్ని ప్రతిబింబిస్తాయి. శ్రీశ్రీ కవితావస్తువు ఈ ఛందస్సంవిధానాన్ని విడిచి రావడానికి నిరాకరిస్తుంది. అంటే మహాప్రస్థానగీతాలకు తాత్పర్యం రాసుకుని తృప్తిపడలేము. ఆ కవిత్వానికి ఆ సంవిధానం చర్మకవచంవలె సజీవచిహ్నంగా భాసిస్తుంది.

## కవితా సంవిధానంలో శ్రీశ్రీ ప్రక్రియలు

జీవితంలో ధనార్జనకు ప్రాధాన్యం పెంచే బూర్జువావ్యవస్థలో కవితాపఠనానికి తీరిక తక్కువవుతుంది కనుక కవులు లఘుప్రక్రియలనే ఎన్నుకుంటారు. పద్దెనిమిది పర్వాలకు బదులు పద్దెనిమిది గీతాలూ ఆరాశ్వాసాలకు బదులు ఆరుపాదాలూ కావ్యంగా పరిగణింపబడటానికి కారణాల్లో కాలం పొదుపు, స్థలం పొదుపు ప్రధాన మైనవి. కావ్యం చిన్నదైనకొద్దీ కవి పనితనం పెరగవలసి వస్తుంది. ఈ లక్షణానికి నిదర్శనాలే శ్రీశ్రీ ఖండికలు. మహాప్రస్థానఖండికలన్నీ సమకాలిక సమాజాభిరుచులనూ సమాజావసరాలనూ గుర్తించినవే! శ్రీశ్రీ ఖండికల్లో మిక్కిలి పెద్దది 161 పాదాల పరిమితి గలది; మిక్కిలి చిన్నది 6 పాదాలు గలది. ఈ ఖండికలన్నీ పరిమాణంలో చిన్నవే అయినా బూర్జువావ్యవస్థలో వర్ధిల్లిన హ్రస్వలిపి సంవిధానాన్ని పుణికిపుచ్చుకున్నవే.

నవ్యకల్పనలనూ ఆధునికప్రక్రియలనూ ప్రోత్సహించి అన్యభాషాసారస్వతాధ్యయనావకాశాలను పెంచిన బూర్జువావ్యవస్థ శ్రీశ్రీ కవిత్వవికాసానికి దోహదం చేసిందంటే అత్యుక్తిలేదు. బూర్జువావ్యవస్థ కల్పించిన సదుపాయాలనన్నింటినీ శ్రీశ్రీ వాడుకున్నాడు. ఆ సదుపాయాల్లో ఇంగ్లీషు ఫ్రెంచి జర్మన్ ఇటాలియన్ రష్యన్ భాషలలోని కవితాప్రక్రియలను (ఆంగ్లంద్వారా) పరిశీలించే అవకాశాలు ముఖ్యమైనవి. ఈ అవకాశం శ్రీశ్రీకి ముందు ఏ యితరకవికీ కల్గలేదు. విదేశీయ కవితాప్రక్రియలను తెలుగులో అనుసృజించాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ కవితాప్రక్రియలను స్థూలంగా పాత్రాశ్రయాలు, వస్త్వాశ్రయాలు అని రెండు తెగలుగా విభజింపవచ్చు. పాత్రలు బూర్జువావ్యవస్థలోని పీడితవర్గానికి ప్రతినిధులు. కవి కూడా ఈ పాత్రలకే ప్రతినిధి. భావకవిత్వంలో కవి మాటాడుతున్నట్లు శ్రీశ్రీ కవిత్వంలో పాత్రలు మాటాడతాయి. వస్త్వాశ్రయాలలో కవి పరోక్షంగా ఉండి, కథను చెబుతాడు. జగన్నాథుని రథచక్రాలు పాత్రాశ్రయం. భిక్షువర్షీయసి, బాటసారి వస్త్వాశ్రయాలు.

భావగీతిక పరిణామంపొంది శ్రీశ్రీ ప్రయోగంలో రెండు భేదాలు పొందింది. వాస్తవభావగీతిక, సామాజికభావగీతిక. 'జయభేరి' వాస్తవభావగీతిక. 'మహాప్రస్థానం' సామాజిక భావగీతిక.

సంవిధానాన్నిబట్టి శ్రీశ్రీ గీతాలను కొన్ని ప్రక్రియలుగా విభజించుకోవచ్చు. (1) సంబోధ నాత్మకాలు-కళారవి, కవితా ఓ కవితా, ఉన్మాది, దేశకోరకు, శైశవగీతి, స్విన్‌బర్న్‌కవికి, మిథ్యావాది, మానవుడా, గర్జించు రష్యా, జగన్నాథుని రథచక్రాలు వంటివి- ఇంగ్లీషులోని ODE వంటివి. (2) సంవాదాత్మకాలు - 'వాడు' ఖండిక. (3) ప్రబోధాత్మకాలు - మహాప్రస్థానం, సాహసి, కళారవి, నవకవిత, బుక్కులు వంటివి. (4) ప్రతిజ్ఞాత్మకాలు - ప్రతిజ్ఞ, జగన్నాథునిరథచక్రాలు, జయభేరి, అద్వైతం, కొంపెల్ల జనార్దనరావుకోసం వంటివి. (5) ప్రశ్నోత్తరాత్మకాలు - అవతలిగట్టు, పరాజితులు వంటివి. (6) ప్రశ్నాత్మకాలు - మిథ్యావాది, నిజంగానే? వంటివి. (7) ఆశ్చర్యాత్మకాలు - అభ్యుదయం, ఐ, జ్వాలాతోరణం, ఆః, ఒకక్షణంలో, నీడలు, గంటలు, ఆశాదూతలు వంటివి. (8) సమష్టి భావగీతాలు - మహాప్రస్థానం, చేదుపాట, అద్వైతం, వ్యత్యాసం వంటివి. (9) కథావ్యాజగీతాలు (అలెగోరీలు) - అవతారం, ఆకాశదీపం వంటివి. (10) వస్తాశ్రయాలు - భిక్షువర్షీయసి, బాటసారి, సంధ్యాసమస్యలు, దేశచరిత్రలు, మానవుడా! వంటివి. ఆయా ఖండికల ప్రత్యేక సంవిధానాన్ని గురించి గతప్రకరణాల్లో చర్చించి ఉన్నాను.

## కవితాసంవిధానంలో శ్రీశ్రీ భావనాశక్తి

శ్రీశ్రీ భావనాశక్తి అంతర్జాతీయస్థాయికెదిగింది. భౌతిక ప్రపంచవాస్తవికతనూ సామ్యవాద ప్రపంచవాస్తవికతనూ దర్శించి తిరిగి పాఠకుడికి ప్రదర్శించడమే శ్రీశ్రీ లక్ష్యం. పురాణకవులవలె యుగాలవెనుకకు చూడడు. ప్రబంధకవులవలె ఊహాలలోకి పరుగులుతీయడు. భావకవులవలె ఆత్మీయస్వప్నాలలో కాల్పనికలోకాలలో సంచరించడు. గురజాడ వలె వర్తమాన ప్రపంచంలో శ్రీశ్రీ తన వస్తువును దర్శిస్తాడు. పైగా భవిష్యత్తునుకూడా చూడగలడు.

సామాజిక చైతన్యంగల శ్రీశ్రీ భావన పదచిత్రాలలో ప్రతీకలలో వ్యంజనాలతోనూ సముద్దీపనాశక్తులలో వ్యక్తం చేయబడుతుంది. వీటిలోని వైవిధ్యాన్ని గత ప్రకరణాల్లో సోదాహరణంగా వివరించాను.

శ్రీశ్రీ భావనాశక్తిపై మూడు విషయాల ప్రభావం ఉంది. మొదటిది దేశీయ విదేశీయ సాహిత్యోద్యమాల ప్రభావం. రెండవది ఆధునిక తాత్త్వికవాదాల ప్రభావం. మూడవది తన చుట్టూ ఉన్న బూర్జువాసమాజవాస్తవికత ప్రభావం. వీటిపై గత ప్రకరణాల్లో విపులంగా చర్చజరిగింది.

శ్రీశ్రీ భావనాశక్తికి సమాజపు త్రికాలాలను దర్శించేలక్షణం ఉంది. గతాన్ని చరిత్రలో గతితార్కికంగానూ వర్తమానాన్ని వాస్తవికంగానూ భవిష్యత్తును స్వప్నంలోనూ దర్శిస్తాడు. ఈ స్వప్నదర్శనంలో పలాయనతత్త్వంలేదు. భవిష్యత్తులో సాధ్యమయ్యే శాస్త్రీయసామ్యవాద

విప్లవాన్నే భావిస్తూ దాన్నే స్వప్నంలో దర్శించి, ఆ స్వప్నాలను కవితాభావనకుపయోగించుకున్నాడు.

## కవితాసంవిధానంలో శ్రీశ్రీ రసభావాలు

భావన, రసభావం అనే రెండూ శ్రీశ్రీ ప్రజ్ఞాపరికరాలు. తన కవిత్వంద్వారా పాఠకుడిలో నిద్రాణంగా ఉన్న చైతన్యాన్ని జాగృతంచేయడానికి శ్రీశ్రీ వాడుకునే పరికరాలే ఇవి! తన కవితావస్తువునే ఈ పరికరాలతో 'కవిత్వం'గా మల్చుకునే సంవిధానం శ్రీశ్రీని ఏప్రమాణాలతో చూసినా కవిగానే నిరూపిస్తుంది.

శ్రీశ్రీ రసభావాలు సమకాలీన బూర్జువాసమాజవాస్తవికతవల్ల ప్రభావితమై కల్లోలితమైనవి. ఈ రసభావాలు సమాజంలోని పీడితవర్గంవారివి. ఇవి వాస్తవికమైనవి; భౌతికమైనవి. అన్యాయంగా మరోవర్గంవారు ప్రవర్తిస్తూంటే పీడితవర్గంవారు పొందేవి మధురరసభావాలెలా అవుతాయి? ఇవి ఉద్ధతరసభావాలే! ఈ సమాజంవల్ల పరాజితులే అయినా వీరంతా సమష్టిగా తిరుగుబాటుచేసి, తిరిగి మధురజీవితానికి ఉపక్రమిస్తారు. కనుక వర్తమానంలో ఉద్ధతరసభావాలూ భవిష్యత్తులో మధురరసభావాలూ వీరికుంటాయి. వాటినే శ్రీశ్రీ తన కవిత్వంలో వ్యక్తంచేశాడు. అందువల్ల ప్రేమ-ద్వేషం; జాలి-పరిహాసం; ఉత్సాహం-కోపం: భయం-జుగుప్సవంటి పరస్పర విరుద్ధరసభావాలు విరుద్ధవర్గాలపట్ల శ్రీశ్రీ ప్రదర్శిస్తాడు. ఇందుకు మూలకారణం సామాజికధర్మావేశం. అనేకచారిత్రికసాంస్కృతికకారణాలవల్ల ఈ సామాజికధర్మావేశం ప్రబంధకవుల్లోనూ భావకవుల్లోనూ కనిపించలేదు. అందువల్లనే వారి రసభావాలు ప్రజల జీవనసమస్యలకు దూరమయ్యాయి.

శ్రీశ్రీ రసభావాలు పాఠకులకు అలౌకికానందాన్ని కల్పించేవి కావనీ అవి వాస్తవిక, భౌతికరసభావాలను జాగృతంచేసి కర్తవ్యనిర్వహణకు పురికొల్పుతాయనీ గతప్రకరణాల్లోనే స్పష్టంచేశాను. శ్రీశ్రీ సందేశం కాంతాసమ్మితోపదేశం కాదు; ప్రభుసమ్మితోపదేశమే! ఈ ఫ్యూడల్ పరిభాషలను వదిలి చెప్పాలంటే విప్లవనాయకసమ్మితోపదేశం అనాలి! ఈ మనస్తత్త్వానికి మార్క్సిస్టు కళాదృక్పథమే కారణం!

'శృంగారం' శ్రీశ్రీలో ఎలా రూపాంతరితం అయిందో గతప్రకరణాల్లో సూచించాను. శ్రీశ్రీ దృష్టిలో 'సామాజికవీరం' (కొత్తదే ఈ పరిభాష) రసరాజం! సామ్యవాదవ్యవస్థను పొందడంలో పీడితజనుల ప్రయత్నోత్సాహాలే సామాజికవీరానికి స్థాయిభావాలు. పీడితజనుల సామాజికన్యాయాన్ని పీడకులు ఎత్తుకుపోయారు. దాని వియోగంవల్ల బాధపడుతున్న పీడితజనుల దుఃఖమే మొదటిదశ. ఆ సామాజికన్యాయాన్ని తిరిగి సంపాదించుకోవడానికి పీడితజనులు ప్రయత్నిస్తారు. ఇది రెండవదశ. ఈ పీడితజనులు సమష్టిగా పీడకజనుల్ని అణచివేసి సామాజికన్యాయాలను

సంపాదిస్తారు. ఇది మూడవదశ. సామాజికవీరం ఇలా పరిపుష్టం అవుతుంది. ఇలాంటి రసరాజానికి తక్కినవన్నీ అంగరసాలే!

## శ్రీశ్రీ వస్తుసంవిధానాల సమ్మేళనం

కావ్యంలో వస్తువూ సంవిధానమూ ఏది ఏ స్థాయిలో ఉండాలి? అనే సమస్యకూ సామాజిక వ్యవస్థలోని అభిరుచులకూ అవసరాలకూ కొంత సంబంధం ఉన్నట్లు కనిపిస్తుంది. కవితాప్రయోజనాన్ని బట్టి వస్తుసంవిధానాల సమ్మేళనంలో కవులు విచక్షణచూపుతారు.

| సమాజం | కవుల క్రమం | | వస్తుసంవిధానాల నిష్పత్తి | కవితా ప్రయోజనాలు |
|---|---|---|---|---|
| ఫ్యూడల్ | కవిత్రయం | = | వస్తుసంవిధానాల సమప్రాధాన్యం | ఉపదేశం+రసానుభూతి |
| | ప్రబంధకవులు | = | సంవిధాన ప్రాధాన్యం | రసానుభూతి |
| బూర్జువా | గురజాడ | = | వస్తుప్రాధాన్యం | ఉపదేశం |
| | భావకవులు | = | సంవిధాన ప్రాధాన్యం | అనుభూతి |

వస్తువుద్వారా తేదలచిన సామాజిక చైతన్యానికి ఆ వస్తువుయొక్క బాహ్యస్వరూపం కూడా దోహదం చేయాలని శ్రీశ్రీ భావించాడు. అంతరంగ బహిరంగాల స్వభావ స్వరూపాలు సాపేక్షాలుగా ఉండటమే కదా సామ్యవాది లక్షణం. అందుకే శ్రీశ్రీ కవితావస్తువు అభ్యుదయ దృక్పథంతోనూ సామాజికప్రయోజనం తోనూ ముడిపడి ఉండగా శ్రీశ్రీ కవితాసంవిధానం పీడితవర్గంతోనూ సామ్యవాదప్రయోజనంతోనూ జతపడే ఉంటున్నది. వస్తుసంవిధానాలను పరస్పరాపేక్షకాలుగా చేయులేకపోతే కళలవల్ల సామాజికోపయోగం ఉండదు. సంవిధానం వస్తువును మరుగుపరిస్తే ఉపయోగం కన్నా అందం ఎక్కువ అవుతుంది. వస్తువు సంవిధానాన్ని వదిలివేస్తే ఉపయోగమూ లేదు; అందమూ లేదు. వస్తువును సంవిధానం మీరకూడదు. సంవిధానాన్ని వస్తువు మించకూడదు. రెండింటి దాంపత్యం కావ్యాద్వైతం అవుతుంది. దానికే శ్రీశ్రీ ప్రయత్నం. ఈ ప్రయత్నంలో శ్రీశ్రీ ఎంతవరకూ కృతకృత్యుడయ్యాడు? వస్తుసంవిధానాల నిష్పత్తినిబట్టి శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు మూడు రకాలు. (1) సంవిధాన ప్రాబల్యంగల ఖండికలు:- అభ్యుదయం, జ్వాలాతోరణం, కళారవి, ఆకాశదీపం, ఒకక్షణంలో, నీడలు, గంటలు, ఆశాదూతలు. (2) వస్తుప్రాబల్యంగల ఖండికలు:- వాడు, వ్యత్యాసం, మానవుడా (3) వస్తు సంవిధాన సమైక్యం గల ఖండికలు - తక్కిన 28 ఖండికలూను. ఈ మూడు తరగతుల్లోనూ మూడవవర్గం ఉత్తమోత్తమ కావ్యాలకు ఉదాహరణం. ఈమూడు వర్గాల తారతమ్యం ఇది.

(1) వస్తువును మరుగుపరిచి సంవిధానం రాజ్యంచేస్తోంది. పాశ్చాత్య సాహిత్య సంవిధానాలను ప్రయోగించి చూడాలనే ఆసక్తివల్ల ఇవి వ్యాసఘట్టాలుగా మారిపోయాయి. (2) సంవిధానానికి ద్వితీయస్థానం ఇవ్వడం వల్ల వచనరూపం వచ్చిందివీటికి. అయినా మొదటితరగతిలోకన్నా స్పష్టత ఉంది వీటిలో. (3) వస్తుసంవిధానాలు ఒకదానితో ఒకటి సప్రయోజనంగా పెనవేసుకున్నాయి. ఆ వస్తువుకు ఆ సంవిధానమే శరణ్యం.

వస్తువుకీ సంవిధానానికి జరిగే సంఘర్షణ శ్రీశ్రీ కవితాప్రపంచంలో వస్తుసంవిధానాల పరస్పరాశ్రయంగా మారిపోవడంలో గతితర్కం కనిపిస్తుంది. సామ్యవాదప్రయోజనం కోరే కవిత్వంలో వస్తుసంవిధానాల వైరుధ్యం ఉండటం సహింపరానిది. అలాంటి వైరుధ్యం బూర్జువా కవిత్వలక్షణం. వస్తువుకి ప్రథమస్థానమివ్వాలనే దురాశ కవిత్వాన్ని మాయం చేస్తుంది. సంవిధానానికి కిరీటంపెట్టాలనే మమకారం కవిత్వాన్ని నిష్ప్రయోజనం చేస్తుంది. ఈ రెండురకాల రచనలూకూడా 'మహాప్రస్థానం'లో లేవు. సంవిధానప్రాబల్యంగల ఖండికల్లో వస్తువు తక్కువ స్థాయిలో ఉంది. వస్తుప్రాబల్యంగల ఖండికల్లో సంవిధానం కనిష్ఠస్థాయిలో ఉంది. మార్క్సిస్టు కవిత్వానికి వస్తువువల్ల ఎంతప్రయోజనం ఉంటుందో సంవిధానం వల్లా అంతే ప్రయోజనం ఉంటుంది. సంవిధానాన్ని వదిలివేస్తే అకవిత్వం. వస్తువును విడిచివేస్తే శుద్ధకవిత్వం. ఈ రెండూ శ్రీశ్రీ లక్ష్యాలుకావు. "The form must correspond to the content as closely as possible, giving it maximum expressiveness and assuming the strongest possible impact on the readers for whom the work is intended" అని Lunacharsky చెప్పిన లక్షణానికి శ్రీశ్రీ కవితలు లక్ష్యాలు!!

నగ్నభావాలు, ఆశయాలప్రచారం, కేకలు, నినాదాలు కవిత్వాన్ని బ్రతకనివ్వవుకనుక శ్రీశ్రీ వాటికికూడా కవితారూపాన్నే ఇస్తాడు. శుద్ధనినాదంకూడా శ్రీశ్రీ కవితాసంవిధానంలో జీవనాదమే అయింది. నగ్నభావంకూడా నవ్యపదచిత్రమే అయింది. నగ్నంగా బాధాసముద్విగ్నంగా ఉన్న సమాజాన్ని కూడా సుందరంగా సుఖతరంగా మార్చాలనే శ్రీశ్రీ కవితావేదన. అందుకే వస్తువునూ సంవిధానాన్నీ కవిత్వపుపకసంపదగా మార్చివేశాడు. అదుకే ఇలా ప్రతిజ్ఞచేశాడు ;—

శ్రమైకజీవనసౌందర్యానికి సమానమైనది లేనేలేదని కష్టజీవులకు కర్మవీరులకు నిత్యమంగళం నిర్దేశిస్తూ స్వస్తివాక్యములు సంధానిస్తూ స్వర్ణవాద్యములు సంరావిస్తూ వ్యథార్త జీవితయథార్థదృశ్యం పునాదిగా ఇకజనించబోయే భావివేదముల జీవనాదములు జగత్తుకంతా చవులిస్తానోయ్ !!

**